# కొడుకులు కూతుళ్ళు





ఆదర్శ గ్రంథమండలి

A PSO1C882

# కొడుకులు - కూతుళ్ళు

( చైనా నవల )

మూలం :

యువాన్ చింగ్ : కుంగ్ చూయే

అనువాదం :

చిట్టా మహానందేశ్వరశాస్త్రి

(మహేశ్)




ఆదర్శగ్రంథమండలి
విజయవాడ-2

ప్రథమ ముద్రణ :
1955, నవంబరు.

ద్వితీయ ముద్రణ :
1958

తృతీయ ముద్రణ :
ఆగష్టు, 1974.

ప్రతులు : 1500

వెల : రు. 10-00

ముద్రణ :
శ్రీ వరలక్ష్మి ప్రెస్, విజయవాడ-2.

# పరిచయం

చియాంగ్-కై-షేక్ ప్రభుత్వం పట్టి అసమర్థతతోనూ, లంచ గొండితనంతోనూ పుచ్చిపోయింది. 1937 లో ఉత్తర చైనాపై జపాను సామ్రాజ్యవాదులు ముట్టడించగానే, ప్రజలను వారి కర్మానికి వారిని వదలివేసి, చియాంగ్-కై-షేక్ సైన్యాలు గందరగోళంగా పారి పోయాయ్.

కొమిటాంగ్ సేనలు విద్రోహకరంగా తమ్ము విడిచి పారిపోయి నంత మాత్రానగానీ, లేదా జపానువాళ్ళ పెద్దయెత్తు దండయాత్రను చూచిగానీ చైనా ప్రజలు భయపడలేదు, లొంగేరకమూ గాదు. తమ యిళ్ళూ వాకిళ్ళనూ, తమ మాతృదేశాన్నీ రక్షించుకొనుటకై చైనా ప్రజలు చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన ఆయుధాలు చేపట్టారు. 1945 నాటికి వారు శత్రువులను హతమార్చగలిగే బలాన్ని సంపా దించారు. తద్వారా జపాను సామ్రాజ్యవాదుల సైన్యాన్ని త్వరితంగా కూలద్రోయగలిగిన స్థితికి జేరుకొన్నారు.

అతి విశాలప్రదేశమైన ఉతర చైనాదేశంలో తిష్ఠవేసి కూర్చున్న ఒక పెద్ద సామ్రాజ్యవాద శక్తియైన జపాను, దాని తొత్తులకు వ్యతిరే కంగా, చైనాప్రజల ఉత్తమ పుత్రులూ, పుత్రికలూ కొనసాగించిన పోరాటాలను గురించి యీ నవలలో వర్ణింపబడింది. ఈ నవలాకారు లైన యువాన్‌చింగ్, కుంగ్‌చూయేలు భార్యాభర్తలు. వారి వయసు ముప్ఫయి సంవత్సరాలు. వీరిద్దరూ యీ నవలలో వచ్చే నాయకులు, నాయకురాండ్ర నాయకత్వంక్రింద కార్యకర్తలుగా పనిజేశారు. కొంత కాలం వీరు, పెకింగ్ నగరంలోనున్న మోషన్‌పిక్చర్ బ్యూరోలో సినే రియో రచయితలు.

....•....

# కొడుకులు - కూతుళ్లు

## అధ్యాయం - 1

బాయాంగ్ సరస్సు ఒడ్డున షెన్‌జ్యా అనే గ్రామముంది. ఆ గ్రామంలో ఒక వృద్ధరైతున్నాడు. అతనికి యిద్దరు కొడుకులున్నారు. అందులో పెద్దకొడుకు దాస్వే, రెండవ కొడుకు రియూ. పెద్దవానికి ఇరవై ఒక్క సంవత్సరాల వయసు. రెండవవాడు పన్నెండేళ్ళవాడు. వీరికి గోధుమలు పండే పొలం ఒక్క అరయకరం మాత్రం వుంది. ఈ గ్రామానికి మేయరైన షెన్‌కు ఎంతో బాకీపడివున్నారు. షెన్ యీ గ్రామంలోనికల్లా పెద్ద భూస్వామి. అంతేగాక, యితడు గ్రామంలోని వడ్డీ వ్యాపారస్తులలోకల్లా చురుకైనవాడు. షెన్ వంశం కొన్నితరాల నుండి యీ గ్రామానికి స్థానిక జమీందారీ భూస్వాములు. ఈ విషయాన్ని యీ గ్రామం పేరే వ్యక్తంజేస్తూవుంది. ఎందువల్లనంటే "షెన్‌జ్యా" అనే శబ్దానికి "షెన్ కుటుంబం" అని అర్థం.

పెళ్ళి చేసుకోవలసినదిగా దాస్వేని తండ్రి కోరుతున్నాడు. ఈ పెళ్ళికి అయ్యే ఖర్చులనిమిత్తం పెట్టుబడి పెట్టటానికని షెన్‌వద్ద అప్పు తీసుకోటానికి తండ్రి సిద్ధంగావున్నాడు. ఆరోజుల్లో కడు బీదరైతుకూడా హుందాగా పెళ్లి జరిపించటం సామాజికంగా తప్పనిసరియని భావించేవాడు. ఆ కుటుంబంయొక్క ఆర్థికపరిస్థితి మరీ అధ్వాన్నంగావుంది. అందువలన, ఆ గ్రామానికి రెండువందలమైళ్లు వుత్తరంగావున్న పెకింగ్ నగరంపై జపానువాళ్లు దాడిచేస్తున్నారన్న వార్తకంటె, దాస్వేను తన పెళ్లి సమస్యే ఎక్కువగా పట్టిపీడించింది.

"పరిస్థితులు మరీ అధ్వాన్నంగావున్నాయ్. మనమిలా అప్పులు జేస్తూపోతూంటే, మనకున్న ఆ కాస్త భూమికూడా వూడిపోతుంది" అన్నాడు దాస్వే.

వంశాన్ని పొడిగించాలనే సాంప్రదాయేచ్ఛ తండ్రిలో మిప్పెర గొన్నది. అందువలన దాస్వేయొక్క తండ్రి, పెళ్లికి కావలసిన డబ్బు అప్పుజేయాల్సివచ్చినా, అదనపు అప్పు భారాన్ని మోయగలంలే అన్నాడు. దాస్వే ఏకీభవించలేదు. దాస్వే బలిష్టుడు! విశాలమైన భుజాలు! కండలు తిరిగిన చేతులు. కష్టపడి పనిజేసేరకం తాను వళ్లొంచి పనిచేస్తే, రాత్రి పగలనకుండా కష్టిస్తే, వున్న అప్పునుకాస్తా తీర్చేయొచ్చు ననుకున్నాడు. అటుతర్వాత పెళ్ళిజేసుకోటానికి స్వేచ్ఛ ఏర్పడుతుందనుకున్నాడు.

ఈవిధంగా దాస్వే పెళ్లివిషయమై ఆ కుటుంబంలో వాదోపవాదాలు జరుగుతూవున్నాయ్. ఇలాంటి సమయంలో 1937, జులై 7వ తారీఖున పెకింగ్ నగరానికి వెలుపలనున్న మార్కోపోలో బ్రిడ్జిపై జపానువాళ్లు దాడిచేశారు. చైనా, జపానుదేశాలు రెండింటి మధ్యనూ యుద్ధం జరుగుతూ వున్నట్లు అధికారరీత్యా ప్రకటించబడినది,

కొమింటాంగ్ సేనల ఆజ్ఞలననుసరించి షెన్‌జ్యా గ్రామంలోని పోలీసులు కందకాలు త్రవ్వించుటకై గ్రామంలోని రైతులందరినీ చుట్టచుట్టి తీసుకొచ్చారు. ఆ విధంగా, బలాత్కారంగా గొనిరాబడినవారిలో దాస్వే ఒకడు. పోలీసులు వారి మామూలుధోరణిలో, ప్రజలపట్ల పశువుల్లాగున ప్రవర్తించారు. గ్రామప్రజలు పోలీసుల ఆజ్ఞ ననుసరించి, కందకాలు త్రవ్వుతున్న ఆ మాసంరోజుల్లోనూ, దాస్వే నెత్తిమీద అనేకసార్లు పోలీసుల దుడ్డుకర్ర నాట్యమాడింది.

కందకాలు త్రవ్వటం వృధాపనై పోయింది. ఎందువల్లనంటే, వేగంగా కాలికిబుద్దిచెప్తూవున్న కొమింటాంగ్ సైన్యం, ఆ గ్రామానికి యిట్టేవచ్చి అట్టేపోయింది. ఆ వచ్చినకాలంలోనైనా శత్రువులతో పోరాడిందాలంటే లేదు. అంతేగాక, కొమింటాంగ్ సైన్యం గ్రామంలో వున్న కొద్దిరోజులూ, గ్రామాన్ని దోచుకోటానికి, కొల్లగొట్టటానికీ తన

కాలాన్ని సన్నివియోగం జేసింది. అటుతర్వాత, ఒక పట్నం తర్వాక మరియొక పట్నం, శత్రువుల చేతుల్లోకి పోతూన్నదన్న వార్తలు చేర గానే, పోలీసులుకూడా ఆ గ్రామాన్ని విడిచి పారిపోయారు. ప్రతిరోజూ జపానువాళ్ల విమానాలు ఎగురుతున్నాయ్. నగరాలపై బాంబులవర్షాన్ని కురిపిస్తున్నాయ్. పెద్ద అధికారులు, తమ బంగారాన్ని, వెండినీ తమ వెంటతీసుకొని, ఆరోగ్యప్రదమైన ప్రదేశాలకు పోతున్నారు. ఆటంక పరచబడని దాన్నంతనూ వెంటబెట్టుకొని, చిన్న వుద్యోగస్థులు, పైవారి అనుసరిస్తున్నారు.

గ్రామీణుల్లో వ్యాకులపాటు ప్రారంభమయ్యింది. ఒక ఉదయం, తాజావార్తలేమైనా తెలుస్తాయేమోనని, దాస్వే, గ్రామపరిపాలకసంఘం ఆఫీసుకు పోయారు, ఆఫీసు ఆవరణల్లో రైతులు గుమిగూడారు. గ్రామ మేయరుకు, స్థానిక కులీనులకు మధ్య యేదో సంభాషణ జరుగుతూవుంది. అక్కడ గుమిగూడిన జనం, చెవులు నిక్కబొడుచుకొని వింటున్నారు. స్థానిక కులీనులెంత జడిసిపోయున్నారంటే, వాళ్లు మామూలుగా తమ సంభాషణలలో ఉపయోగించే శబ్ద చాతుర్యాన్ని విడనాడి సాధారణ మానవుల్లాగున వాదోపవాదాలు సాగిస్తున్నారు.

"తస్సా చెక్కా , యిదంతా ఎందుకోయ్? మెడను బైటకు పెట్టటమెందుకూ, గొడ్డలికోసం చూడటమెందుకు?"

"ఈ ఆస్తినంతా విడిచి పోవాలా? గాలి యేవైపుగా పోతూవుందో కూర్చొని జూస్తాం...."

కులీనుల్లో చాలామంది, ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకొని జీవించ సాగారు. పోరాటం జరుగుతూవున్న ప్రాంతాలనుండి కాందిశీకులు వచ్చి పడుతూవుంటే, గ్రామంలోని కులీనులభయం మరింతగా హెచ్చసాగింది. ఏడ్పులూ, పెడబొబ్బలూ, వారందరికీ మతిపోయినంత పనయ్యింది.

కౌలుకు తీసుకొన్న కాస్తపొలంలోనూ, దాస్వే, అతని తండ్రి, తమ్ముడు రియూ గోధుమవిత్తనాలు చల్లుతున్నారు, నాగలి కట్టటానికి

వుపయోగించే పశువులు వారికి లేవు. అన్నదమ్ములు, * సీడరును లాగుతూవుంటే, తండ్రి వెనుకనుండి నడుపుతూ వుండేవాడు. సీడర్ బరువుగా వుండేది. కాబట్టి రియూ పసివాడైనందువల్లా నాగలి బరువునంతా దాస్వేయే మోపి, లాగేవాడు. ఆంబోతులాంటిమనిషి దాస్వే. సీడరును సులువుగా లాగేసేవాడు.

"ఇలాంటి పరిసితుల్లోనా మీరు గోధుమ నాటేది!" అని కొంది శీకుల్లో ఒకడు ఆశ్చర్యపోయాడు. "మీరీపంటను తింటానికి యిక్కడుంటామనుకున్నారా?"

దాస్వే నాగలిఆపి, వీపును సవరించుకొన్నాడు. "అతడు చెప్పింది నిజం, వృథాగా నాటేస్తున్నామేమో? వదిలేస్తే బాగుంటుంది" వేసటగా తండ్రితో అన్నాడు.

రెప్పార్పకుండా తండ్రి అతనివంక మిర్రిమిర్రిజూశాడు, "మన మెక్కడికి పారిపోతామోయ్? బిడ్డా, పనిగానియ్. మనం చచ్చామంటే సమస్యే మాసుంది, బ్రతికున్నామా తింటానికి కావాలిగా?"

దాస్వేకి అన్నయ్యవరుసైన దాయాదొకడున్నాడు, అతని పేరు బ్లాకీత్సే. బ్లాకీత్సే తన భార్య, బిడ్డతో షెన్‌జ్యా గ్రామంలోనే నివసిస్తూ వుండేవాడు. కొన్ని మాసాలనుండి బ్లాకి యింటికి రావటంలేదు, అతడు రహస్యంగా కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు. నక్క నెత్తురులాంటి నల్లనివర్ణమతనిది, అందువల్లనే అతణ్ని "బ్లాకీ" అనేవారు. వృత్తిరీత్యా అతడు మొదట్లో కమ్మరి, ఒక రంగంగా వుపయోగపడటానికని అతడు చిన్న హోటలుకూడా తెరచాడు. ఒక ప్రాంతంలోని ఒక తావునుండి మరియొక తావునకు తరలిపోవుటలో విప్లవకారులకు సహాయపడుతూ వుండేవాడు. అటుతర్వాత పోలీసులు, "కమ్యూనిసు నిర్మూలనోద్యమాన్ని" ప్రారంభించారు. బ్లాకీకి కూడా ఆ వేడి కొట్టింది, ఇల్లు వదిలిపెట్టాల్సి వచ్చింది,

---

* సీడర్ అంటే, నాగలికే విత్తనాలు జల్లుటకు వుపయోగించే తట్ట అమర్చి వుంటుంది. నాగలి దున్నుతూవుంటే విత్తనాలు తట్టలోనుండి పడుతూవుంటాయ్, - అనువాదకుడు,

చాపలు, చదరలూ, తట్టలూ, బుట్టలూ అల్లి, అతనిభార్య తన్నూ తన బిడ్డలనూ పోషించుకొంటూ వుండేది.

కాందిశీకులు అసంఖ్యాకంగా వచ్చిపడుతున్నారు. ఈ ప్రవాహానికి అంతూపొంతూ లేకుండావుంది. ఎక్కడస్థవుండటానికి తావు దొరికితే అక్కడల్లా యిరుక్కొంటున్నారు. జపాను వుపద్రవంనుండి తప్పించుకొని, పారిపోయి వస్తున్న బంధువులకు, స్నేహితులకూ తల దాచుకోటానికి తావు చూపించవలసిన బాధ్యత షెన్‌జ్యా గ్రామవాసులలో చాలా మందిపై పడింది. అందులో మిసెస్ బ్లాకీత్సే ఒకతె. ఆమెతల్లి మిసెస్ యాంగు, చెల్లెలు 'మేయీ'లు ఒకనాటిసాయంత్రం, ఆమె యింటికి వచ్చారు. తమ స్వంత స్థలమైన పట్నాన్ని జపానువాళ్ళు ఆక్రమించి వేయుటచే అక్కడనుండి పారిపోయి వచ్చారు. ఈ పట్నం షెన్‌జ్యా గ్రామానికి పశ్చిమంగా యాభై మైళ్ళ దూరంలోనే వుంది.

నిరాశాపీడితయైన మిసెస్ వాంగ్, "ఏంజేయాలి? ఎక్కడికి పోవాలి? ... ఎక్కడ చూచినా బందిపోటు దొంగలు, యుద్ధాన్నుండి పారిపోయిన సైనికులు ... యీ పీడ తప్పించుకోటానికి యీ పిల్లతో నేనెక్కడికి పారిపోగలను చెప్పమ్మా? అదా యీదేరిందాయె. యీ పాటికి పెళ్ళి వ్వాల్సింది. ఒకటే ఆలోచన.... ఎంత ఆలోచించినా మార్గం కన పడ్లేదు .. "

కొన్ని రోజులు తర్వాత మిసెస్ త్సే దాస్వేకు, తన చెల్లెలికి మనువు కుదురుదామన్న వుద్దేశంతో దాస్వే తండ్రిని సమీపించింది. తండ్రికి సంతోషమేసింది.

"అద్భుతంగా వుంటుంది" అని వృద్ధుడు చిరునవ్వు చిలకరించాడు. "అమ్మాయ్! మా దగ్గిర డబ్బంతగా లే దిప్పుడు. కాని, మీ అమ్మ వప్పుకొంటే . "

"ఈ గందరగోళ పరిస్థితుల్లో పెళ్ళెవడు చేసుకుంటాడు" అని దాస్వే, పగతనాన్ని వెళ్ళబోస్తూ గొణిగాడు; కాని, అతని హృదయం మాత్రం విచిత్రంగా కొట్టుకోసాగింది.

గతంలో, మేయీకన్య తన అక్కను చూడటానికని షెన్‌జ్యా గ్రామానికి తరచుగా వస్తూండేది. దాస్వే అక్కడే ఆమెను అనేకసార్లు కలిశాడు. అనేకసార్లు మాట్లాడాడు. ఆమె ఒక చక్కని చుక్క, సాత్విక స్వభావంగలిగిన వ్యక్తి, సమర్థవంతమైన యిల్లాలు. ఏదో కుట్టిపెట్టమని అడగటానికని దాస్వే, మిసెస్ త్సే వద్దకు పోయాడు. మిసెస్ త్సే యింట్లో లేదు. అక్కను చూడటానికని వచ్చిన మేయీకన్య, దాస్వే చెప్పిన పని శుభ్రంగానూ, త్వరగానూ, ఒక్కమాటైనా బదులు చెప్ప కుండా చేసిపెట్టింది. మేయీ చాలా మంచిపిల్లని ఆ రోజల్లా దాస్వే అనుకోసాగాడు. ఆమెను పెళ్ళిచేసుకో గలిగితే చాలా సుఖపడతానను కొన్నాడు.........

అతని దాయాది భార్యయైన మిసెస్ త్సే కు దాస్వే యే విధంగా భావిస్తున్నదీ తెలుసు. ఇప్పుడంటావా, ఆమె అతని తండ్రి అంగీకారాన్ని కూడా తీసుకొంది. ఈ విషయాన్ని తనతల్లితో చర్చించటానికని, యింటికి వచ్చివేసింది.

మేయీ * కాంగ్‌మీద కూర్చుని, దారం, సూదితో యేదో కుట్టు కొంటూంది. మేయీ వయస్సు పదిహేడు, బక్కపల్చగావున్నా, బలంగల మనిషే. ఎంత దూరంనుండైనా ఒక పెద్ద బొక్కెనుడు నీళ్ళను అవలీలగా మోసుకొని రాగలదు. ఆమె తల్లి పాతకాలం మనిషి, అందువలన, ఆమెకు

---

* కాంగ్ : 4 అడుగుల వెడల్పు, ఎనిమిది అడుగుల పొడవు, మూడు అడుగుల ఎత్తుగల ఒక అరుగు. దీనిని అడుసుతోనూ, యిటికల తోనూ కట్టారు. లోపలి భాగమంతా డొల్లగా వుంటుంది. పై భాగాన్ని కప్పేస్తారు, దానికి ప్రక్కగా ఒక పొయ్యి వుంటుంది. దానికీ దీనికి మధ్య ఒక కంత వుంటుంది. ఆ పొయ్యిలో మంట మండుతూవుంటే యీ అరుగుమీద కూర్చున్నవారికి క్రిందినుండి వేడి తగులుతూ వుంటుంది. చలికాలంలో వెచ్చదనంకోసం, చైనాదేశంలో యిలాంటివి వాడుతూ వుంటారు.

—అనువాదకుడు,

క్రొత్త ఫాషన్లు నచ్చవు. అందువలన, తన కూతురికి పొడుగాటి జడ వేసుకొనే అలవాటుచేసింది. చేతులకు గాజు లుండాల్సిందే. వాళ్ళ అమ్మ, అక్కయ్య మాట్లాడుకొంటూవుంటే, మేయీకన్య చక్రాల్లాంటి తనకళ్ళను, ఒక్క క్షణంపాటు పైకెత్తి చూచింది. తనవంక తిరిగి తన అక్క చిరునవ్వు చిందించటాన్ని గమనించింది. అది జూచి, వాళ్ళు తన పెళ్ళి వ్యవహారమే మాట్లాడుకొంటున్నారని అర్థంచేసుకొంది. విపరీతంగా సిగుపడసాగింది. తనతలను మరింత క్రిందికి వంచుకొని, పనిలో మునిగిపోయినట్లు నటిస్తూ, వాళ్ళేమి చెప్పుకొంటున్నారో అదంతా శ్రద్ధగా విన్నది.

"దాస్వే చాలా చక్కనివాడే; మంచి మర్యాదస్తుడు, తియ్యని మనసుగల మనిషే. అలాంటి మంచి హృదయంగల రైతును పెళ్ళిచేసుకోగలిగితే, జీవితమంతా సుఖపడతాను........" అనుకోసాగింది మేయీ కన్య.

కాని, ఆశ్చర్యమేమంటే, ఆమెతల్లి యిదమిత్థమని ఒక గాటికి రాలేకపోయింది. "దాస్వే కుటుంబం చాలా పేదది.........అయినా పెళ్ళికిప్పు డేమి తొందరొచ్చిందిలే. మనం యీ విషయం మళ్ళా చర్చించుకోవచ్చునులే," అని, మిసెస్ యాంగ్ చిట్టచివరకు తేల్చేసింది. మేయీ కన్యకు ఆశ్చర్యమూ కలిగింది; నిరాశా కలిగింది.

ఆ యిద్దరు అతిథులనుగురించీ, పోషణభారంపు జాగ్రత్తను మిసెస్ త్సే తీసుకోజాలదన్న విషయం త్వరలో తేలిపోయింది. సమీపగ్రామంలోనున్న బంధువుల యింటికి, మేయీకన్య ఆమెతల్లి, తమ బసను మార్చారు. ఆ విధంగా పెళ్ళి సమస్య వాయిదా పడింది.

ఆకురాలు కాలంలో, బందిపోటు దొంగలు, చురుకుగా తమపని ప్రారంభించారు. ప్రతి గ్రామానికీ వీళ్ళపీడ మరీ జాస్తీ అయ్యింది. తమ్ము అధికార్లుగా గుర్తించవలసిందిగా యీ బందిపోటు దొంగలు గ్రామీణ ప్రజలను వేధించేవారు. ప్రజా "రక్షకులు"గా పోజుపెట్టేవారు. తమ "పోషణ నిమిత్తం" నిరంతరం, గ్రామీణులనుండి లెవీలు వసూలుజేస్తూ వుండేవారు.

షెన్‌జ్యా గ్రామంలో ఒక చిన్న ఆపరేటరున్నాడు. అతని పేరు లై వే. వానికొక తుపాకీవుంది. చేతిక్రింద అయిదుగురు మనుష్యులున్నారు. ఒకరోజున, అతడు గ్రామానికి మేయరైన షెన్ వద్దకుపోయి, "దాని సంగతేమిటి? అన్ని గ్రామాలు సంఘటితమవుతున్నాయ్. మనంకూడా ఆ విధంగా చేయకపోతే, నేను వీళ్ళందర్నీ రక్షిస్తానని వాగ్దానం చేయలేను" అన్నాడు.

స్థానిక రౌడీగా లై వేకి పేరుంది. మేయరు స్వంతమిలా చూద్దామా, అది పారిపోయింది. మేయరుకు మార్గాంతరం లేక, లై వే చెప్పినదానికి తలవూచాల్సి వచ్చింది. ఆ సాయంత్రం, దేవాలయ ఆవరణలోనికి గ్రామంలోని వారంతా రావలసిందిగా డప్పేయబడింది. దాస్వే, అతని తండ్రీ కూడా మీటింగుకు హాజరయ్యారు. లై వే, బెల్టులో పిస్తోలు దూర్చుకొని, ఠీవిగా సోపానాలెక్కాడు. సభికులకు ఉపన్యాస మివ్వసాగాడు. అతడు, తన వుపన్యాసంలో క్రొత్త క్రొత్త పదాలు వాడాడు. అయితే, వాటి అర్థం బాగా తెలియదు.

"ఆ విషయమిది - ప్రతి గ్రామానికి ఒక రక్షకదళముంది, మనకు కూడా ఒకటుండాలి— దీన్ని గ్రామమే పోషించాలి, ఈ రోజుల్లో మనమంతా కల్సి పనిచేయాలి. దొరికినదాన్నల్లా అందరం సమానంగా పంచుకోవాలి. దీన్నే "కమ్యూనిజం" అంటారు" అని తన ఉపన్యాసాన్ని ముగించాడు లై వే.

లై వే సోపానాలు దిగి, సిగిరెట్లకట్టను బయటకులాగాడు, ఒక్కొక్కటే, అందరికీ పంచసాగాడు. "కమ్యూనైజ్ చేద్దాం పట్టండి," అని ఠీవిగా చెప్పాడు.

ఈ గ్యాంగు — నిద్రపోవటానికీ, వంట చేసుకోటానికీ దేవాలయంలో సౌకర్యాలు వెంటనే కల్పించబడినాయ్.

తండ్రి కోపంగా, దాస్వే చేతిని గుంజాడు, "పద జేసుకుందాం పద— వీళ్ళంతా గ్రుడ్డి వెధవలు!"

అటు తర్వాత ఆ సాయంత్రం, దాస్వే యింటికి పొరుగునవున్న, యువకరైతు శిహ్ ముఠాలో జేరవలసిందిగా దాస్వేను అడిగాడు. దాస్వే తల పంకించాడు.

"అలాంటి మురికి విషయాల్లో మా కుటుంబంలోని వాళ్ళెవరూ అడుగేసెరుగరు" అన్నాడు.

ఈ గ్రామానికి దగ్గరలోనే, హోజ్వాంగ్ అనే గ్రామముంది. అక్కడ మరియొక బందిపోటు దొంగలముఠా రూపొందింది. హో అనే వాడి నాయకత్వాన అది వెలసింది. ఈ "హో" అనేవాడొక పెద్ద భూస్వామి. వాడికి యేడువందలయాభై ఎకరాల పొలముంది. వీడు, కొమింటాంగ్ పార్టీలో సభ్యుడు. కొమింటాంగ్ సైన్యంలో స్టాఫ్ ఆఫీసరుగా వుంటూవుండేవాడు. జిస్లంగ్ అనే మనిషొకడున్నాడు. వాడికి మంచి తెలివితేటలున్నాయ్; యువకుడు. తెలివితేటలు, యవ్వనంతోపాటు వీడికి క్రూరత్వంకూడ జాస్తి. హో క్రింద వీడు ఓవర్సీయరుగా పనిచేస్తూ వుండేవాడు; "హో జ్వాంగ్ కంపెనీ"లో హోదాగల ఆఫీసరు జిస్లంగ్. ఈ గ్యాంగు చాలా పెద్దది; చెప్పుకోదగినన్ని తుపాకులున్నాయ్. ఈ గ్యాంగు నిండా, యుద్ధంనుండి పారిపోయివచ్చిన సిపాయీలు. యింతకుపూర్వం పోలీసుఉద్యోగాలు చేసినవాళ్ళూ వున్నారు. హోజ్వాంగ్ముఠా దెబ్బకు, తనముఠా తట్టుకోజాలదని తెలిసే, లైవే తన ముఠాను తీసుకొని హోజ్వాంగ్ ముఠాలో జేరిపోయాడు.

ఆహారాన్ని కమాండీరుజేస్తూ, అంటే, బలవంతంగా గుంజుకొంటూ, బలపడిన హో గ్యాంగు ఒక గ్రామాన్ని వదలి మరియొక గ్రామంలో దండు విడియసాగింది. ఈ బందిపోటుదొంగల ముఠా డిమాండ్లు వేయిపౌన్ల మానంలో వుండేవి. అంతకు తగ్గేవికావు. అంటే, గ్రామీణ ప్రజలు, మాంసాన్నిగానీ, గోధుమలనుగానీ, నూనెగానీ, ద్రాక్షరసాన్నిగానీ, యేది సమర్పించుకొన్నా, వేయి పౌన్లకు తక్కువలేకుండా యీ బందిపోట్లకు సమర్పించుకోవాలి. రైతాంగ ప్రజలపై వత్తిడి జాస్తి

య్యింది. తట్టుకోలేని పరిస్థితుల్లో పడ్డారు. ఇంతేగాక, యీ ముఠా గ్రామం మొత్తంమీద ధనరూపంలో వేలు వసూలుజేస్తూవుండేది. గ్రామ ప్రజలపై యిదో అదనపు తద్దినం.

ఇదే సమయంలో జపానువాళ్ళు దక్షిణంగా రైలురోడ్డువెంట పశ్చిమదిశకు పురోగమిస్తున్నారు. ఈ పురోగమనం బాయాంగ్ సరస్సుకు సంబంధించిన గ్రామాలకు దూరంగా జరుగుతూవుంది కాబట్టి యీ గ్రామాలలోనివాళ్ళు కాస్త వూపిరి పీల్చుకోగలుగుతున్నారు.

ఒకనాటి సాయంత్రం దాస్వే. తన తండ్రితో ఒక చిన్న బోటులో ప్రయాణం సాగిస్తున్నాడు. అతని సోదరుడు రియూ తెడ్లేస్తున్నాడు. ఒక అరమైలు ఆ విధంగా ప్రయాణంజేసిన తర్వాత, వారు బాయాంగ్ సరస్సులోనికి పోయే మార్గాలలో ఒకదానినుండి బయటకి వచ్చారు. వడ్డున నీటిలోతు తక్కువ. నీళ్ళు శుభ్రంగా వున్నాయి. రెల్లు దట్టంగా పెరిగివుంది. వాళ్ళు తమ బోటునుండి బయటపడ్డారు. మిలమిల మెరిసే కొడవళ్లు పుచ్చుకొని, రెల్లు కోయసాగారు.

వీళ్ళను చూడగానే నీటికాకులు గోలచేయసాగాయి. వాటిగోలనేమీ లక్ష్యంచేయకుండా, తమ పనిని సాగించుకొంటూ పోయారు. వీళ్ళనెత్తిమీద ఒక డేగ నిదానంగా చక్రాలు కొట్టూంది. తనకూ, మేయీకన్యకు పెళ్ళి జరుగ గలదాయని, దాస్వే విస్మయపందసాగాడు. ఆ విషయాన్ని తెలుసుకోటానికి మార్గమేమీ అతనికి తోచలేదు. ఆమె అభీష్టానికి వ్యతిరేకంగా ఆమె తల్లి, ఎవరికో ప్రదానం చేసిందట. పెళ్ళిముహూర్తంకూడా నిర్ణయించివేసిందట! ఆ అదృష్టజాతకుడు ఓవర్‌సీరైన జిస్లంగే! మరెవ్వడో కాదు. వా డీనాడు బందిపోటుదొంగగా మారాడు.

సూర్యుడ స్తమించాడనే చెప్పవచ్చు. ఆ సరస్సు నీటిలో సూర్యుని సింధూరవర్ణ ప్రతిబింబంవలన కళ్ళు జిగేల్‌మంటున్నాయ్. బోటునిండా బరువుగా రెల్లుకట్టలను వేశారు. అందువలన బోటు నెమ్మదిగా కదులుతూవుంది. ఆనకట్ట దిక్కుగా వెనక్కితిరిగిపోతూవుంది వారిబోటు. ఆ సోదరులిద్దరూ చచ్చేటట్లు తెడ్లేస్తున్నారు. బోటులోని సరుకునంతా వొడ్డుకు చేరవేసేసరికి చీకటిపడింది. చంద్రుడు మెల్లపైకొచ్చాడు.

ఆ మరునాటి ఉదయం, దాస్వే, అతని తండ్రి తాము తెచ్చుకొన్న రెల్లులో అధికభాగం, వడ్డీక్రింద జమకట్టించుకొందామని షెన్ యింటికి మోసుకొనిపోయారు. కొన్ని గంటల తర్వాత, హో ముఠాకు జెందిన బందిపోటుదొంగలు వచ్చిపడ్డారు. క్రొత్త రెవివేశారు. దానితో దాస్వే కుటుంబంవద్ద మిగిలిన అదనపు రెల్లుకట్టలు కాసినీ ఊడ్చిపెట్టుకొని పోయాయి.

ఆ మరుసటిరోజున, జిన్లంగ్, నడుమునకు పిస్తోలు ధరించి, ఒక పెద్ద కంచరగాడిదనెక్కి సవారిజేస్తూ, షెన్‌జ్యా గ్రామానికి అభిముఖంగా వేంచేశాడు. ఒక కొయ్యబొక్కెనతోనూ, పారతోనూ, పెంటను పోగుజేస్తున్న దాస్వేని జూచాడు జిన్లంగ్. తన వాహనాన్ని ఆపి, తలను ఒక ప్రక్కకు వొరగబెట్టి కుశలప్రశ్నా పూర్వకంగా, తన రెండు బంగారు పళ్ళను యికిలించి మెరపించాడు జిన్లంగ్.

"ఏయ్, మొద్దూ - దేనికొర కదంతా? మాతో రా! తెల్లని రొట్టెలు, కమ్మని పందిమాంసం తిందువుగాని రా," అన్నాడు జిన్లంగ్.

జిన్లంగ్ ఎలాంటివాడని షెందీ దాస్వేకు తెల్సు. దాస్వే శరీరం కంపించింది! ముచ్చెమటలు పోసింది. తత్తరబిత్తరపుతూ, "నే నలాంటిపనికి, పనికిరానండి!" అన్నాడు దాస్వే.

"ఏమిటీ, తెల్లరొట్టెలు, కమ్మని మాంసం తినటం చేతగాదనేనా నీ వంటున్నది?" అని, కుచ్చితంగా నవ్వాడు జిన్లంగ్.

అంతకన్న యే రకంగా జవాబివ్వాలో దాస్వేకు తోచలేదు. తల వంచుకొని, ఎరువును ప్రోగుజేసి, బొక్కెనలో వేసుకొంటూ, నెమ్మదిగా రోడ్డువెంట పోసాగాడు దాస్వే.

జిన్లంగ్ నిరసనగా, అతనివంక రెప్పార్చకుండా చూస్తున్నాడు. "నిన్ను పుట్టించినవాడిది తప్పు. నీకు కళ్లు ముడిలోవున్నాయ్!" అని ఎగతాళిజేశాడు, తన కంచరగాడిదను వాడించాడు. తిన్న ప్రాపు పక్కకు తోసుకున్నాడు. కంచరగాడిదమీద దౌడుతీశాడు.

వా డదృశ్యమైపోయేటంతవరకూ, దాస్వే రెప్పార్పకుండా అవైపే చూడసాగాడు.

* * * *

అది అక్టోబరుమాసం. జనరల్ "లూ" నాయకత్వాన కమ్యూనిస్టు సైన్యాలు, షెన్‌జ్యా గ్రామానికి కొద్దిమైళ్ళ దూరంలో బసచేశాయ్. దాస్వే యింటికి యిరుగు పొరుగునవున్న పెద్దమనుష్యులలో ఒకడు, బట్టలు కొనుక్కొందామని పట్నానికి పోయాడు. పట్నంనుండి తిరిగొస్తూవుండగా, అతనికి దారిలో కమ్యూనిస్టు సైన్యాలు కనబడ్డాయ్. వాళ్ళను పొగడటానికి తనకు మాటలు చాలవన్నాడు;— యీ "తాగుబోతు వెధవలకీ" వాళ్లకూ ఎంత భేదముందీ! అన్నాడు. బందిపోటుదొంగలను తాగుబోతు వెధవలని వర్ణించా డతడు. కమ్యూనిస్టు సైనికులు, ముతక దుస్తులు ధరించివున్నారనీ; జొన్నలు తింటున్నారనీ; జపానువాళ్ళతో యుద్ధంజేశారనీ; రైతులను ప్రేమగా చూస్తున్నారనీ; బందిపోటు దొంగలను తుడిచిపెట్టేస్తున్నారనీ, చెప్పసాగా డతడు.

"నిజంగా సైన్యమంటే అదే!" అని, బిగించిన పిడికిలి నుండి బొటనవ్రేలు పైకి చూపుతూ అన్నాడు. "జపానువాళ్లతో యుద్ధం చేయ దలచుకొంటే, సైన్యంలో జేరండి! యీ తాగుబోతు వెధవల ముఠాలో ఎవడైనా చేరితే, వాడొక్తి వెర్రి వెధవన్నమాట!"

అన్ని దిశలనుండీ అదేవిధమైన వార్తలొచ్చాయ్. డజన్లకొలది యువకులు, "బాలూ"లో వెంటనే జేరిపోదామని ఉబలాటపడుతున్నారు. "బాలూ" అంటే కమ్యూనిస్టు "అష్టమసైన్యం" అన్నమాట. (కమ్యూనిస్టులను కూడా "బాలూ" అని పిలిచేవారు). తన్ను బాలూ పూర్తిగా తుడిచిపెట్టేస్తుందేమోనన్న భయం "హోజ్వాంగ్ కంపెనీ"ని పట్టి పీడించింది. అందువలన, యీ దొంగలముఠా, "ఆత్మరక్షణ సైన్యం" అనే పేరుతో తన్ను పిలుచుకోటానికి త్వరితంగా నిశ్చయించుకొంది. ఈ బందిపోట్ల ముఠాలో, కొమింటాంగ్ పార్టీ సభ్యుడొకడు వచ్చిచేరాడు. ఈ ప్రబుద్ధునిపేరు జీహో. ఇంతకుపూర్వ మితడు, కొమింటాంగ్ సైన్యంలో

కెప్టెన్‌గా వుంటూవుండేవాడు. చియాంగ్ మనుష్యులు స్వస్థానాలను వదలి పారిపోయినప్పుడు, యీ పెద్దమనిషికూడా వారి పంక్తిలో జేరాడు. హో, యీ వ్యక్తిని తన జాతికి చెందినవాడుగా గుర్తించాడు. అతనికి, "వైస్ రెజిమెంటల్ కమాండర్" అన్న బిరుదాన్ని ప్రసాదించాడు. వీరిద్దరూ చక్కగా కలసి మెలసి పనిచేసుకొంటూ వుండేవాళ్లు. ఆ ప్రాంతమంతా తమ స్వంతరాజ్యంగా భావించి, పరిపాలిస్తూ వుండేవారు.

ఈనాటికి, తన పెళ్ళివార్త విందామని పడిగాపులు గాచిన దాస్వేకి విసుగెత్తింది. నిజాన్ని బయటపెట్టటానికి మిసెస్ త్సేసు ధైర్యం చాలక పోయింది. చాలాకాలం గడిచిపోయింది. అందువలన ఆశ లేమాత్రం పెట్టుకోవడం అనవసరమని, దాస్వే గ్రహించాడు. ఇక యింటి విషయం చూద్దామా అంటే, ఆర్థిక పరిస్థితులు నానాటికీ అధ్వాన్న మవుతున్నాయ్. తట్టలోనికాపురం, బుట్టలోనికి వచ్చింది. రోజులో ఒకపూటైనా కడుపునిండా తిండి దొరకటం దుర్లభమయింది. దాస్వే హృదయం విచారమగ్న మయింది. అతనికి సులభంగా కోపం రాసాగింది.

"ఇక భరించలేం! యథార్థానికి పిడెడు మెతుకులు లేక, ఆకలితో మలమల మాడుతున్నాం. నేను బాలూలో జేరిపోతే, మన పరిస్థితులు బాగు పడతాయి!" అని తండ్రితో అన్నాడు.

"నీకు మతిపోయింది! నీకు సంబంధించని విషయాల్లో యిరుక్కో బోకు. ప్రొద్దున్నేపోయి, నీ పెళ్ళియేర్పాట్లు సరిచూచుకొస్తాను."

"నాకు పెళ్లీవొద్దు, పెటాకులూ వద్దు! జులపాలు పెంచుకొని సన్యాసులలో జేర్తాను. సైన్యంలో జేరదలచుకొన్నా"

"నువ్వెళ్ళటానికి వల్లగాదని జెప్పా! విన్నావా? వద్దన్న విషయాన్నే మాటాడుతున్నావ్!— మొండిపట్టు" అని, తండ్రి కోపంగా పెదబొబ్బ లెడ్తూ, తన పొడుగాటి పైపుతో దాస్వే నెత్తిమీద ఒక్కటేశాడు.

కోపంతో ముఖం చిట్లించుకొంటూ, దాస్వే, కాంగ్ మీద దొర్లసా గాడు. దిండుతో తలను కప్పుకొని, నిద్రపోయాడు.

మరునాటి ఉదయం, దాస్వేకి దాయాదియైన బ్లాక్‌త్సే, తలపని తలంపుగా, షెన్‌జ్యా గ్రామానికి వచ్చాడు. అతని గుడ్డలు అతుకులబొంతగా

వున్నా, మనిషిమాత్రం చాలా ఆరోగ్యంగానూ, ఉల్లాసంగానూ వున్నాడు. మరల దాస్వేని చూడగానే, బిరుసైన అతని పొట్టిమీసం, యికిలింతగా ముడివడింది. వాళ్ళిద్దరూ, ఎంతో ఉల్లాసంగానూ, ఆప్యాయంగానూ మాట్లాడుకొన్నారు. బ్లాకీత్సే మళ్లా వచ్చాడని తెలియగానే, యిరుగుపొరుగు వాళ్లు, స్నేహితులూ ఒక్కొక్కరే వూడిపడ్డారు.

సజావైన మనిషిగా, మర్యాదస్తుడుగా, బ్లాకీత్సే పేరుపడ్డాడు. అతనితో కూర్చోవటమంటే ఆ గ్రామంలోనివారికి సరదా. అతనితో కూర్చొని అచ్చట్లూ ముచ్చట్లాడమంటే వాళ్ళకి మహాయిష్టం. అతని కొంపకు రెండే గదులున్నాయ్. కాస్సేపటిలో ఆ రెండుగదులూ, అతిధులతో నిండిపోయాయి.

"కొమింటాంగ్ - కమ్యూనిస్టులు సహకరిస్తున్న" కాలమది. అందువల్లనే బ్లాకీత్సే రహస్య జీవితాన్ని గడపాల్సిన అవసరమిక లేకపోయింది. అజ్ఞాతవాసంనుండి బయటికి వచ్చాడు. అతడు స్నేహితులకు యుద్ధవార్తలను గురించి చెప్పాడు. దేశంలో మారుమ్రోగుతున్న నూతన ఆదర్శాలను గురించి - "జపాను సామ్రాజ్యవాదులను వోడించండి!" "యావత్ జాతినీ సమీకరించండి!" "ప్రజల జీవితాన్ని బాగుపరచండి!" అన్న నినాదాలనుగురించి - వారికి విశదీకరించి చెప్పాడు.... ఈ నూతన పదజాలన్ని రైతులెంతో రుచ్యంగా ఆరగించసాగారు.

అందరూ వెళ్ళిపోయేవరకూ, దాస్వే అక్కడే వుండిపోయాడు. సాలోచనగా అతని దాయాది ఆతనివంక జూచాడు.

"వోడిపోయిన దేశంలో బానిసగా వుండదలచావా?" అని, బ్లాకీ అకస్మాత్తుగా, దాస్వేని ప్రశ్నించాడు.

"అలా జీవించాలని ఎవరూ కోరరు; అదెంతఘోరంగా వుంటుందో నీవిప్పుడే చెప్పావుగాదూ?" అన్నాడు దాస్వే.

"మంచిది! నాతో పనిచెయ్. మనమొక ప్రజాసైన్యాన్ని సృష్టిద్దాం. జపానువాళ్లు రాగానే, వాళ్ళతో యుద్ధంచేద్దాం!" అన్నాడు మృదువుగా బ్లాకీ.

తన దాయాది గంటనుండి చెప్పుతున్నదంతా దాస్వే విన్నాడు; కాని, అతడు కొన్ని విషయాలను నమ్మలేకపోయాడు.

"వొట్టిచేతులతో వాళ్ళనెలా వోడించగలుగుతాం?" అని ప్రశ్నించాడు.

బ్లాకీత్సే నవ్వాడు. "వేలాదిమంది జపానువాళ్ళను జూచి మనం భయపడనక్కరలేదు. మనం భయపడవలసిందల్లా, ప్రజలు సకాలంలో తిరుగుబాటుచేస్తారో చెయ్యరో అన్న విషయానికే. ప్రజ లొకసారి మేల్కొన్నారా, మనం ఓడిపోం! మనకూ ఆయుధాలున్నాయ్. వాటిలో కొన్నింటిని యిక్కడకు చేరవేయటానికి నాకు కాస్త సహాయం చెయ్ - ఏమంటావ్?"

దాస్వే చకితుడయ్యాడు. "సరేలే........ రేపు కాస్త పనుంది...." అని నతురుటోయాడు.

చిరునవ్వు నవ్వుతూ, బ్లాకీ, "భయపడాల్సిన అవసరంలేదు. మన మిద్దరం కలసిపోదాం. దాయాదులిద్దరు కలసి షెరుకు పోతూవుంటే ఎవ్వరూ అనుమానించరు. ప్రమాదమేమీ జరుగదని హామీ యిస్తున్నా" అన్నాడు.

దాస్వే కొంచెం తటపటాయించాడు. తప్పించుకోటానికని, "నేను మా నాన్నను అడగాలి," అన్నాడు.

అతని దాయాది తల అడ్డంగా ఆడించి, దాస్వే భుజంపై తట్టాడు. "తమ్ముడూ! యీ విషయాన్ని ఆయనకు తెలియనివ్వకు. ఈ విషయం బయటికిపొక్కటం నాకిష్టంలేదు" అని, అతడు వంగి, తన ప్లానంతా దాస్వే చెవిలో వూదాడు.

దాస్వే ఒక్కక్షణ మాలోచించాడు. "బాగుంది. ఆ విధంగానే చేద్దాం," అని నవ్వాడు. చిట్టచివరకు తీసుకోవలసిన సూచనలన్నింటినీ విని, దాస్వే యింటికి చేరుకొన్నాడు.

ఆ మరునాడు, పెద్ద కావిళ్ళేసుకొని, వాళ్ళిద్దరూ బయలుదేరారు. కావిళ్ళకు పెద్ద చేపలతట్టను తగిలించుకొన్నారు, దానిలో ఏవరైనా అడి

గితే, యదాలాపంగా ఝాకీ, చేపలుకొంటానికి పోతున్నామనీ, వాటిని మళ్ళీ చిల్లరగా అమ్మదలచుకొన్నామనీ చెప్పాడు.

గ్రామం బయటకు చేరుకోగానే, కొంతదూరం ఆనకట్టవెంట పోయారు; అటునుంచి పశ్చిమదిశకు మళ్ళారు. సంధ్యా సమయానికల్లా పూనదిమీదనున్న గ్రామమైన, పూ హిసీకి జేరుకొన్నారు. ఆ గ్రామం లోని ఒక కొంపకు జేరుకోగానే, వాళ్ళు తలుపుతట్టారు. ఒక ముసలామె ఆ ధ్వని విని తలుపు తెరచింది. ఆమె తను తెచ్చిన దీపపుబుడ్డి సహాయంతో వాళ్ళను తేరిపార జూచింది.

"నేను వస్తువుంకోస మొచ్చా." అని ఝాకీ మెల్లగా ఆమెతో అన్నాడు.

తలనెరసిన ఆ వృద్ధవనిత, వాళ్ళను లోపలి ఆవరణలోనికి తీసుకొనిపోయింది. గడ్డివామిలో దాచిపెట్టిన ముతకసంచిని బయటికి లాగింది. దానిని తెరచింది. దానినిండా చేతిబాంబు లున్నాయి. రమారమి మూడువంద లకు పైగా వుంటాయి. అనేకరకాలవి ఉన్నాయి. మనవాళ్ళిద్దరూ, తమ నాలుగుబుట్టలనిండా వాటిని నింపుకొన్నారు. వాటిపై దిట్టంగా తామరాకులు కప్పారు. ఆ ముసలామె మనవాళ్ళకు మంచినీళ్ళిచ్చింది. కొన్ని బియ్యపు రొట్టెలు పెట్టింది. రొట్టెలుతింటూ, ఝాకీ, ఆ ముసలమ్మతో నిదానంగా కొన్ని నిమిషాలపాటు మాట్లాడాడు. అటుతర్వాత, మనవాళ్ళు కావిళ్ళను భుజాలపై వేసుకొన్నారు. చీకటిలో యింటికి బయలుదేరారు.

ఆ చిమ్మచీకటిలో రోడ్డువెంట వేగంగా పోతూవుంటే, దాస్వే మెల్లగా, "యిన్ని బాంబులు మన కెవరిచ్చారు?" అని అడిగాడు.

ఝాకీత్సే నవ్వుతూ "అవి చేతిబాంబులు. మన కెవ్వరూ వాటిని దానం చేయలేదు. వాటిని మనమే పోగుజేసుకొన్నాం. కొమింటాంగ్ సైన్యాలు పారిపోయినప్పుడు, అమితంగా మందుగుండుసామగ్రి విడిచిపోయాయి. మేం ప్రోగుజేసిన రైఫిళ్లు, పిస్తోళ్ళలో అధికభాగం, జనరల్ లూకు యిచ్చివేశాం. ఈ చేతిబాంబులతో భలేపని చెయ్యొచ్చు— చూస్తావుగా!"

వాళ్ళు గ్రామం చేరుకొనేసరికి తెల్లవారిందనే చెప్పవచ్చు. వాళ్ళు సూటిగా బడికి పోయారు. జపానువాళ్లు మార్కోపోలో బ్రిడ్జిమీద దాడి చేసిననాటినుండి యీ బడి మూతపడింది. అప్పటినుండి యీ బడిని ఉపయోగించుటయే మానివేశారు. సాలిమనిషైన ష్వాంగ్ వీళ్ళకోసం బడి ఆవరణలో ఎదురుచూస్తున్నాడు. తీరికకాలంలో ఒక చిన్న పొలాన్ని దున్నుకొంటూ వుంటాడు ష్వాంగ్. ష్వాంగ్ బక్కపల్చని మనిషి. చాల జాగర్తగల మనిషి. బడి గదులలో నొకదానిలో లోతుగా రెండుగోతులు అప్పటికే త్రవ్వి అట్టిపెట్టాడు. నిదానంగా ఆ ముగ్గురు మనుష్యులూ పనిచేస్తూ, చేతిబాంబులను పూడ్చిపెట్టసాగారు. కోళ్లు కూయటం ప్రారంభించేసరికల్లా వాళ్ళు తమ పనిని పూర్తిజేశారు.

* * * *

అటుతర్వాత కొద్ది దినాలపాటు జాకీత్సే ఒక డజనుమందిని ఆర్గనైజు చేయటంలో నిమగ్నమయ్యాడు. వాళ్ళు పనిచేయకుండా వున్న ప్రతిరాత్రీ ఆ పాఠశాలలో సమావేశమయ్యేవారు. చిట్టచివరకు తమ గ్రామదళానికి "జపాను వ్యతరేక సైన్యం" అని పేరు పెట్టాలని నిర్ణయించుకొన్నారు. అంతేగాక జనరల్ లూ అలాంటి దళాలను యేర్పాటు చేయవలసినదిగా ఆజ్ఞాపించాడనీ, అలాంటి దళాలన్నింటికీ దిట్టమైన పిస్తోళ్ళు యిస్తున్నాడనీ తెలియజెప్పారు. జపానువాళ్ళకు వ్యతిరేకంగా పోరాటాన్ని ఎవరు వ్యతిరేకించినాసరే, వాళ్ళ పని పడుతామన్న వార్తను ఆ గ్రామంలో వ్యాపింపజేశారు.

దాస్వే పగలల్లా యింటిపని చూసుకొనేవాడు. రాత్రిపూట తన దాయాదితో గ్రామంలో తిరిగేవాడు. జాకీ తనకు తెరచుచున్న క్రొత్త ప్రపంచాన్ని జూసి దాస్వే మురిసిపోయాడు! ముగ్ధుడయ్యాడు.

"ఏమిటోయ్! యీ క్రొత్తవెర్రి!" అని ఒకనాడు తండ్రి అడిగాడు.

"జపానువాళ్ళను ప్రతిఘటిస్తాం!"

"వాళ్ళను ప్రతిఘటించటానికి యత్నించిన లక్షలాది కొమింటాంగ్ సేనలగతేమయ్యింది? యీనాడు పేరుకైనా ఒక్క సిపాయైనా కినపడుతున్నాడా? గుప్పెడుమంది వున్నారో లేదో! మీరా వాళ్ళనెదిరించేది?" అన్నాడు తండ్రి.

"ప్రయత్నించకుండానే భయపడిపోవటం మంచిదా?" అన్నాడు దాస్వే.

జవాబివ్వటానికి తండ్రికేమి తోచకపోయింది. తండ్రి గమ్మున వూరుకోవటం జూచి, దాస్వే కొంచెం విజృంభించాడు. "నీవు నన్ను యీ పని చేయనీయకపోతే, సైన్యంలో జేరిపోతాను" అన్నాడు.

"ప్రజలు నిన్ను ముక్కుపట్టి లాగుతారు! ఏమైనాగానీ నిన్ను అదిమిపెట్టలేను: నీ యిష్టమొచ్చినట్లు చెయ్!" అసంతృప్తిగా తండ్రి లొంగిపోయాడు.

బ్లాకీత్సే కమ్యూనిస్టేమోనని మేయరు షెన్ అనుమానించాడు. ఇదతణ్ణి వేధించసాగింది. ఈ సమయానికి, పూర్వం తన స్వంత గ్యాంగుకు జెందిన మనుష్యులలో కొంతమంది తమ గూళ్ళకు మళ్ళా చేరుకొన్నారు. తత్ఫలితంగా మేయరు షెన్‌గారి వంగివుంటూ వచ్చిన నడుము నిక్కబొడుచుకొంది. వారి హృదయంలో రేకెత్తిన ప్రథమభావమేమంటే, బ్లాకీత్సే గ్రూపును వెంటనే అణచివేయాలని. అయితే ఒక చిక్కొచ్చిపడింది. బ్లాకీత్సే దళానికి తుపాకులున్నాయని మేయర్ షెన్ గారికి తెలిసింది. అందువలన అసలు విషయమేమిటో కూపీ తీద్దామనే వుద్దేశంతో, తన పాతముఠాకు జెందిన గూలూ అనేవాణ్ణి గూఢచారత్వానికి వినియోగిద్దామనుకొన్నాడు మేయరు.

ఆ రాత్రి, విసర్జించబడిన ఆ పాఠశాలలోనికి గూలూ దూడుతూ వుండగా, సెంట్రీడ్యూటీ చేస్తున్న మనిషి అతణ్ణి కనిపెట్టాడు. కాపలా కాస్తున్న మనిషి పేరు తేవార్. యువకుడు; దిట్టమైన మనిషి. తేవార్ నీడల్లో దాక్కొని వున్నాడు. అందువలన, గూలూ అతణ్ణి కనిపెట్టలేకపోయాడు.

"ఎవరక్కడ?—వెంటనే జవాబుచెప్పు; లేకపోతే పేల్చేస్తా!" అని తేవార్ గర్జించాడు.

తేవార్‌వద్ద నిజంగానే తుపాకి వుందనుకున్నాడు. గూలూ భయపడిపోయాడు. నోటివెంట మాట పెగల్లేదు. పరుగెత్తి పోదామా అంటే కాళ్ళాడలేదు. ధైర్యం చాలకపోయింది. తేవార్, అమాంతంగా గూలూను లంకించుకొన్నాడు. బ్లాకీతేస్ ఎదుటకు అతణ్ని లాక్కెళ్లాడు. గూలూకు గుండె గుండెలో లేదు. గజగజా వణకసాగాడు.

"మిస్టర్ తేస్....మాస్టర్ తేస్—నన్ను కాల్చకండి!" అని గూలూ ప్రాధేయపడ్డాడు. "న న్నిది చేయాల్సిందిగా ఆజ్ఞాపించారు....నాకు వేరే మార్గంలేదు....నేను తప్పక చేయాల్సివచ్చింది!" అని గూలూ వాపోవసాగాడు.

కాని, బ్లాకీ సరసంగా, అతణ్ని కొన్ని ప్రశ్నలు వేయగానే, అతడు జవాబు చెప్పాడు. అతడు పలికినవన్నీ అబద్ధాలేనని అందరికీ తెల్సు. బ్లాకీకి కోపమొచ్చింది. గూలూను బెదరించాడు. గూలూ మరల వణకసాగాడు. కళ్ళు త్రిప్పుకొంటూ, మేయరు షెన్‌గారు యిచ్చిన సూచనలకు సంబంధించిన గాథనంతటినీ వొలకబోశాడు.

బ్లాకీ పొట్ట పగిలేటట్టు నవ్వసాగాడు.

కూర్చోటానికి అమర్చిన రెండు పెట్టె సీట్లను చూపుతూ, బ్లాకీ "మాకు కావలసినన్ని పిస్తోళ్ళూ, చేతి బాంబులూ వున్నాయ్; మీ మిస్టర్ షెన్‌తో యీ విషయాన్ని చెప్పు. సజావుగా వున్నాడా, జపానువాళ్ళకు వ్యతిరేకముగా జరుపబడే పోరాటానికై మాతో జేరవలసిందిగా ఆహ్వానిస్తామని చెప్పు—అలా కాకుండా మా వెన కేదైనా కుట్రలు పన్నాడా, దొక్క చించుతామని చెప్పు!" అన్నాడు.

తూ. చ. తప్పకుండా చెపుతానని గూలూ వాగ్దానం చేశాడు. హడావిడిగా ఆ ప్రదేశాన్ని విడిచివెళ్ళాడు.

ఆ మరునాటి సాయంత్రం, "జపాను వ్యతిరేక ప్రజా సైన్యం" మార్చ్ చేసింది. ప్రతి సైనికుడూ, తన నడుముచుట్టూ చేతి బాంబులను బిగించుకొన్నాడు. అంతేగాక, దీనికితోడుగా కుంచెలాంటి చీపురుకట్టలను

సంపాదించారు. ప్రతి చీపురుకట్టచుట్టూ గట్టిగా చుట్టికట్టారు. వాటిని తుంటి మీద ఆనేటట్లుగా వ్రేళ్ళాడేసుకున్నారు. జాకెట్లక్రింద యివి ఉబ్బి నిజమైన పిస్తోళ్ళలాగానే కనపడసాగాయ్! కొందరు, తమ వీపులమీద, తేలికయైన వేట తుపాకులను మాత్రమే వ్రేళ్ళాడవేసుకొన్నారు. వాలురు వీధుల్లో నడవసాగారు. "వాలంటీర్స్ మార్చ్" అన్న పాట పాడుతూ సాగిపోయారు.

"మేలుకో, మేలుకో!
బానిస బ్రతుకూ, బ్రతుక
నిరాకరించే, మానవుడా!
మేలుకో! మేలుకో!
నెత్తురు మాంసం తర్పించి,
నిర్మించుము, నూతన లోకాన్ని!
ఘన లోకాన్ని!
మేలుకో! మేలుకో....

ఉక్తి పిస్తోళ్ళని కనిపెట్టేస్తారేమోనని, దాస్వే భయపడ్డాడు. అతడు, తన తలను వెనక్కుతిప్పి, మోసంగా తన చీపురుకట్టను తట్ట సాగాడు. తన తుంటి నంటిపెట్టుకొని, తన చీపురుకట్ట వుందో వూడిపోయిందో తెలుసుకోటానికవి అతడు అలా చేశాడు. ఈ విధంగా ఆ సైన్యం గ్రామ వీధులగుండా అనేక మలుపులు అనేకసార్లు తిరిగింది. చిట్టచివరకు ఆ సైన్యం గ్రామ పరిపాలక సంఘం ఆఫీసుకు జేరుకొంది. ద్వారం ద్వారా లోపలికి తోసుకొనిపోయారు. ఆ చిన్న గదిలో కిక్కిరిసిపోయారు.

మేయరు షెన్, విలువైన నీలి అంగీ ధరించివున్నాడు. గుండీ సందుగుండా బంగారు గడియారం గొలుసు జేబులోనికి వేసివుంది. ఈ గుంపు లోపలికి త్రోసుకొని రాగానే, అతనిలోవుండే సహజ గర్వం ఎగిరిపోయింది. హడలిపోయాడు. ముఖం తెల్లపడింది. త్వరితంగా అతడు తన నెత్తిమీదనున్న అధికార చిహ్నమైన పట్టుటోపీని చేతుల్లోకి తీసుకొని వంగి సలాంచేశాడు. ట్లాకీత్సేను కూర్చోవలసినదని కుర్చీ చూపించాడు.

టీ యివ్వవలసిందిగానూ, సిగరెట్లు అందివ్వవలసిందిగానూ గూలూను ఆజ్ఞాపించాడు.

అసలు సమస్యకు సూటిగావస్తూ బ్లాకీ "గొడవపడకండి. జపాను వాళ్ళకు వ్యతిరేకంగా యీనాడు కొమింటాంగు, కమ్యూనిస్టులు సహకరిస్తున్నారు. మీ రెటువైపు?" అని ప్రశ్నించాడు.

మేయర్ షెన్, తన మీసాన్ని మెల్లగా నిమురుతూ, "అన్నిటికంటే, దేశం విషయం ప్రధానం. జపానువాళ్ళను ప్రతిఘటించాలని నే నెప్పుడూ చెపుతూనేవున్నా" అన్నాడు మృదువుగా.

"బాగావుంది. మనమంతా జపానువాళ్ళకు వ్యతిరేకం కాబట్టి— మనమంతా ఒకే కుటుంబమన్నమాట—అందువలన, సామర్థ్యాన్ని పెంపొందించుకోటానికై మీరు మీ 'రక్షణ సైన్యాన్ని' మా సైన్యంలో కలిపివేయాలని నా సలహా. మీ రేమంటారు?" అన్నాడు బ్లాకీ.

మేయర్ షెన్‌గారికి రుచించని విషయ మిదే. ఈ విషయా న్నెలా నవరించి, ప్రదర్శించాలో మేయర్ షెన్‌గారికి బోధపడలేదు. తీవ్రంగా దగ్గుతెర వచ్చినట్లుగా నటించసాగాడు.

"ఏమంటారు?" బ్లాకీ నొక్కి అడుగసాగాడు.

"మంచిది....చాలా మంచి భావమే...." మేయర్ షెన్ విపరీత మైన యిరుకులో పడ్డాడు. "అయితే, తుది నిర్ణయాన్ని చేయటానికి నా కధికారం లేదు.......యీ విషయాన్ని మరోమాటు చర్చిద్దాం...."

షెన్ తప్పించుకో యత్నిస్తున్నా డన్న విషయాన్ని బ్లాకీ పసిగటాడు. కరకుగా యేదో చెబుదామని బ్లాకీ యత్నిస్తూవుంటే యింతలోనే, ఒక రైతు అకస్మాత్తుగా అక్కడికి పరుగెత్తుకొని వచ్చాడు. ప్రక్క గ్రామాన్ని సాయుధులైన బందిపోటు దొంగలు దోపిడీ చేస్తున్నారని చెప్పాడు. తన 'రక్షణ సైన్యం'తో మేయర్ షెన్ కళ్ళతో మాట్లాడాడు. అంతేగాని, వులకలేదు పలకలేదు.

బ్లాకీత్సే నిలబడ్డాడు. "పోదాం పదండి! వ్యవహార మేమిటో చూసొద్దాం!" అన్నాడు.

"అది వాళ్ళ వ్యవహారం. మన కెందుకొచ్చింది. మనం ఆరాట

పడాల్సిన అవసరంలేదు" అని విషయాన్ని తప్పించివేయజూశాడు షెన్.

"ఆరాటపడనవసరంలేదూ ? ప్రజలను రక్షించటానికి కాకపోతే, మనవల్ల ప్రయోజన మేమిటి ? మనకు తుపాకు లెందుకు ? మీకు భయ మేస్తూవుంటే, యింట్లోనే వుండిపోండి. మేం పోతున్నాం !" అని అన్నాడు బ్లాకీ అవిశ్వాసపూర్వకంగా.

"అంతా కలిసే పోదాం పదండి" అన్నాడు షెన్ తత్తరపాటుతో అతని ముఖం కందగడ్డలాగయింది.

ప్రజాసైన్యానికి నాయకత్వము వహిస్తూ బ్లాకీత్సే ముందుకు సాగుతున్నాడు. 'రక్షణ సైన్యాన్ని' నడుపుకుపోతూ మేయర్ అతన్ని వెంబడించాడు. సకట్టవెంట, ముట్టడించబడిన గ్రామం దిక్కుగా సాగి పోయిం దా గుంపు.

వాళ్ళావిధంగా క్రమానుబద్ధంగా సాగిపోతూవుంటే దాస్వే మనస్సులో కలవరపాటు ప్రకోపించింది. తన తుంటిమీద అటూ యిటూ కొట్టుకొంటూవున్న చీపురుకట్టయొక్క స్పర్శ అతన్ని హెచ్చరిస్తూ వుంది. మన పనైనట్లే ! అనుకోసాగాడు. జనాన్ని భయపెట్టడానికి ఇవి మంచి ఎత్తుగా వుపయోగించాయిగాని, నిజంగా యుద్ధం చేయాల్సివస్తే బండారం కాస్తా బయటపడుతుంది !

తన నడుముచుట్టూ బిగించుకొన్న చేతి బాంబులవంక చూచాడు దాస్వే. తనవెనుక వస్తూవున్న తేవార్ చెయ్యి గిల్లాడు.

"చేతి బాంబులను వుపయోగించే దెలా ?" అని రహస్యంగా అడిగాడు.

"ఏమో ! నాకూ తెలియదు. నే నెప్పుడూ ఉపయోగించి చూడ లేదు" అని జవాబు చెప్పాడు తేవార్.

"మహా గొప్పగా వుంది !" వ్యంగ్యంగా తనలో తాను గొణుక్కున్నాడు దాస్వే. పశ్చిమ దిశనుండి రక్తాన్ని కరుడుగట్టించే చలిగాలి వీస్తున్నా దాస్వే శరీరం చెమటతో నిండిపోయింది. కాని, దాస్వేకి ఒక విషయం కానవచ్చింది. ఎప్పటిలాగున ప్రశాంతంగా విశాలమైన భుజాలు

కలిగిన బ్లాకీత్సే, పెద్ద పెద్ద అంగలేసుకొంటూ ముందుకు సాగిపోతూ వున్నాడు.

వారు తమ గమ్యస్థానాన్ని జేరుకోగానే, బందిపోటు దొంగలజాడ ఎక్కడా కనిపించలేదు.

ఆనకట్ట పైభాగంలోనున్న ఒక దిబ్బపై మేయర్ షెన్‌గారు నిలబడ్డారు. అలక్ష్యంగా తమ మీసాన్ని నిమురుకొంటూ, ఆయన తమ సంభాషణను ఉపక్రమించారు. "బందిపోటు దొంగలను మనం కల్సుకోలేదు. అంతవరకు అదృష్టవంతులమే! బహుశా మీ చేతిబాంబులు ప్రేలేవిగావేమో."

బ్లాకీత్సే కళ్ళు ఎర్రబడ్డాయ్. "పేలవూ? అయితే చూడు!" అన్నాడు.

చేతి బాంబుయొక్క పిన్నును లాగేసి, ఖాళీ పొలంలోనికి దానిని బలంకొద్దీ విసిరేశాడు. చెవులు చిల్లులుపడే ధ్వనిజేస్తూ అది బ్రద్దలయింది అది పడిన తావునుండి మట్టి ఆకాశానికెగిరింది. పక్షులు పిచ్చిగా, ఖంగారుగా అటూ యిటూ పరుగెత్తసాగాయ్. మేయర్ షెన్‌గారికి భయం పట్టుకొంది. గజగజ వణకిపోయారు. తన మోకాళ్ళమీదకు జారిపోయారు. తాను నిలబడిన దిబ్బ వెనుక భాగానికి పాకాడసాగారు. వారలా చేస్తూ వున్నప్పుడు, అందమైన తమ దుస్తులు యీ పాడు పనిమూలంగా ఎంత మురికవుతున్నాయో అన్న విషయాన్ని గమనించటంలేదు. ఆ విషయం మీద శ్రద్ధేలేదు వారికి.

బ్లాకీత్సే చేసిన యీ పనిని ప్రజాసైన్యం చప్పట్లు కొట్టూవుంటే, మేయర్ షెన్‌గారు మందలింపుగా "అలాంటివాటితో ఆడుకోకూడదు!" అని సెలవిచ్చారు.

తేవార్ తన చొక్కా చేతులను పైకెగమడుస్తూ "ఇది నా వంతు!" అని కేకేసి, ఒక చేతి బాంబును బలంకొద్దీ విసిరాడు.

అది పిడుగులాగున ధ్వనిజేస్తూ ప్రేలింది. అప్పుడే లేద్దామని యత్నిస్తూవున్న మేయర్ షెన్‌గారు మళ్ళీ పొట్టమీద గట్టిగా బోర్లపడాల్సి వచ్చింది. బోర్లపడ్డారుకూడాను.

"ఆపండి! ఆపండి! నాకు నమ్మకం కుదిరింది. మీరెవడి కొంపో తీస్తారు. ఆపండి!" అని మేయర్ పెన్ బొబ్బరించారు.

విదూషకునిలాగున, ష్వాంగ్ దృష్టిని సారించాడు. తన తలపై ఒక చేతి బొంబును పూపసాగాడు.

"లేదు, లేదు! నావంతుకాలేదు. అందరూ చూడండి!" అని ష్వాంగ్ వ్యతిరేకించాడు.

ఎలాగో. మేయర్ పెన్ తడబడుతూ తన పాదాలమీద నిలబడి, ష్వాంగ్‌చేతిని గటిగా పట్టుకొని "చార్లోయ్! బాబూ! మూర్ఖుల్లా ప్రవర్తించకండి!" అని బ్రతిమాలసాగాడు.

నిరాశ నటిస్తూ ష్వాంగ్ బుద్ధమూతి పెట్టాడు. అక్కడున్న వాళ్ళంతా నవ్వారు.

"మీ రేంజేసినాసరే పిస్తోళ్ళుమాత్రం పేల్చకండి!" అని దాస్వే భుజాలను హెచ్చరికగా తట్టుతూ తేవార్ అన్నాడు.

దాస్వే తన కుంచె చీపురుకట్టను తడిమి జూసుకొన్నాడు. పళ్ళికిలించకుండా వుండలేకపోయాడు.

వారు తమ గ్రామానికి చేరుకొనేసరికి, సంధ్యాసమయమయింది.

ఆ సాయంత్రం ప్లాక్లీత్సె ఒక మనిషిద్వారా మేయరుకు కబురంపాడు. సైన్యాలను కలిపివేసే విషయమై చర్చించటానికి రావలసిందిగా ఆహ్వానించాడు. మేయరు తన్ను క్షమించవలసిందని వేడుతూ, తనకు బదులుగా తన సెక్రటరీని పంపాడు. ఆ సెక్రటరీద్వారా మేయరు సైన్యాలను కలిపివేయటానికి తాను అంగీకరిస్తున్నానన్న విషయాన్ని తెలియపరచాడు. ప్లాకీ, యీ క్రింది షరతులు పెట్టాడు: గ్రామానికి మేయరుగా పెన్నే వ్యవహరిస్తా వుండాలి. కాని, అతని యోధులు మాత్రం ప్లాకీత్సే నాయకత్వంక్రింద పనిచేయాలి. ఈ రెండుదళాలు జపాను వ్యతిరేక ఐక్యసంఘటనగా కలిసిపోవాలి. గ్రామాన్నంతనూ సమీకరించాలి. ఊరిలోని ధనవంతులు చందాగా ధనమిచ్చుకోవాలి. బలంగల వాళ్ళు తమ శ్రమను విరాళంగా యివ్వాలి. ఎవరివద్దనైనా ఆయుధా

లుంటే (ఉదాహరణకు మేయరువద్ద వున్నాయి) వాటిని జపాను వ్యతిరేక పోరాటానికి విరాళంగా యివ్వాలి.

సెక్రటరీ. యీ షరతులన్నింటినీ తూచ తప్పకుండా మేయరు షెన్‌గారికి నివేదించాడు. షెన్‌గారికి ఆ రాత్రల్లా నిద్రపట్ట లేదు.

ఆ మరునాటి ఉదయం బ్లాకీత్సే, అతని మనుష్యులు. మేయరు యింటికి పోయారు. అతడు, వారు చెప్పినదంతా వప్పుకొన్నాడు. ఆ రెండు ముఠాలు ఒకటిగా అయిపోయాయి. షెన్‌గారి మనుష్యులలో కొంతమంది తమ ఉద్యోగాలకు రాజీనామా పెట్టారు. కాని, వాళ్ళ తుపాకులు తీసుకోబడ్డాయి. అవి మరల పంచిపెట్టబడ్డాయి. ఇంతకుపూర్వం మేయర్ షెన్ స్వంతముఠాకు నాయకుడుగా వుంటూవచ్చినవాని పిస్తోలు యీనాడు బ్లాకీత్సే నడుంకట్టును అలంకరించింది. షెన్‌జ్యా గ్రామంలోనూ, తదితర పరిసర గ్రామాలలోను ధనిక భూస్వాములు దాచిపెట్టుకొన్న తుపాకులన్నింటినీ బయటకు లాగటం జరిగింది. వాటినన్నింటినీ ప్రజా సైన్యానికి వప్పజెప్పటం జరిగింది. అదనపు ఆయుధాలు కొనుక్కోటానికై చందాలు వసూలు చేయబడినాయి. ప్రజాసైన్యంయొక్క ఆయుధబలం, సభ్యుల సంఖ్యా పెరిగింది.

* * * *

ప్రజాసైన్యంయొక్క కార్యకలాపాల వార్తలు, హోజ్యాంగ్ గ్రామానికి జేరాయి. హో చెవినిబడ్డాయి. తానేదో దీనికి విరుగుడు కల్పించాలని నిశ్చయించుకొన్నాడు. హో, అందుకని జీవో, జిన్లింగ్, లెవేల నాయకత్వాన కొంతమంది మనుష్యులను, షెన్‌జ్యా గ్రామంపై మెరుపు దాడి చేయవలసిందిగా పంపాడు. ఈ దోపిడిముఠా, షెన్‌జ్యా గ్రామ పరిపాలకసంఘ ఆఫీసులోనికి జొరబడింది. పిండి, కోడిగ్రుడ్లు కలిపి వండిన వెయ్యి పౌనుల బరువుగల రొట్టెను సమర్పించుకోవలసిందిగా

డిమాండు జేసింది. ఈ విషయాన్ని వినగానే. కలహానికిదొక తప్ప మరేమీ గాదన్న విషయం మేయరుకు తెలుసును. ఇప్పుడే వస్తానని వాళ్ళతో సర్దిచెప్పి. మేయరు సూటిగా బ్లాకీత్సే యింటికి పోయాడు.

నీరసంగా నవ్వుతూ. బ్లాకీత్సే దాస్వే. తేవారులను కేకవేశారు. వారు ముగ్గురూ కలిసి. మేయరుతో సహా ఆఫీసకు వచ్చారు. దున్నపోతు లాంటి జీవో. మేయరుకుర్చీలో కూర్చున్నాడు. అతని శరీరంపై పూర్తి అలంకారాలు కలిగిన కొమింటాంగ్ యూనిఫారం ఉంది. సామ్‌బ్రౌ బెల్టొకటి మెళ్ళో వ్రేల్లాడుతూ వుంది. వానిప్రక్కన జిన్లంగ్ నిలబడ్డాడు. నల్లని సివిలియన్ సూటు ధరించివున్నాడు. వాడి దొరటోపీ నున్నగా దువ్వబడిన క్రాపుకు వెనుకగా అమర్చబడి వుంది. వాడి బెల్టులో రెండు పిస్తోళ్ళు వ్రేళ్ళాడుతూ వున్నాయ్. ఆ ముఠాకు సంబంధించిన యితర వ్యక్తులు. వివిధరకాల దుస్తుల్లో ఉన్నారు. వాళ్ళందరికీ ఆయుధాలున్నాయ్. దొంగచూపుల వెధవలు వాళ్ళంతా. ఆ దేశవాళీ గుమ్మడికాయలు రెండింటినీ అనుసరిస్తూ వస్తున్న ఆ నల్లమనిషి, పొడుగాటి గడ్డంగల ఆ మనిషి త్సే అయివుంటాడని ఊహించాడు.

"కమ్మరి త్సేవి నీవేనా?" అని జీవో ప్రశ్నించాడు. అలా ప్రశ్నించినపుడు జీవోకంఠంలో పరమ ద్వేషం ఉట్టిపడింది.

బ్లాకీ తన కుడిపాదాన్ని ఒక చిన్న బెంచీమీద పెట్టాడు. మోకాలిపై మోచేతినుంచాడు.

"కమ్మరి త్సేను నేనే; అయితే నీకేం?" అని అకస్మాత్తుగా జవాబిచ్చాడు బ్లాకీ.

"హో! నాకేమా? వెయ్యిపౌనుల రొట్టెను వెంటనే సమర్పించుకోవలసిందిగా నిన్నూ. యీ గ్రామాన్నీ ఆజ్ఞాపిస్తున్నా!" అన్నాడు స్థూలకాయుడు. జీవో.

"చెత్తరొట్టెలన్నా మాకులేవు; నీకు రొట్టెలు కావాలా?" అని బ్లాకీ వికటంగా నవ్వాడు. అతని నవ్వులో వ్యంగ్యం ధ్వనించింది.

బందిపోటుదొంగ లైవే తన ప్రాధాన్యతను ప్రదర్శించుకోటాని

కని "మాకు కొద్దిగా టెంపరేచరు తగులుతూ వుంది. అందుకని మేము రొట్టెలు తినాలి!" అన్నాడు.

ధైర్యాన్ని చిక్కబరచుకొంటూ దాస్వే "యీ బీదగ్రామంలో మీకు రొట్టె ఎక్కడ దొరుకుతుంది? మావూళ్లో రొట్టెలషాపైనా లేదే!" అన్నాడు.

జీవో ముఖం నల్లబడింది. "కాలాన్ని వృధాజేస్తున్నారు. రొట్టె సమర్పించుకొంటారా, లేదా?"

ఈ సమయానికల్లా, ష్వాంగ్ పిలుచుకొని వచ్చిన ప్రజాసైన్యం రంగంలోనికి వచ్చేసింది. వాళ్ళంతా, కొంతమంది రైతులతోపాటు ఆఫీసు ఆవరణలో నిలబడి, సంభాషణలు వింటున్నారు. ష్వాంగుది సీమ టపాకాయ స్వభావం. ఠప్ మని ప్రేలింది.

"ఏమంటున్నావ్ - వీళ్ళకు రొట్టెలు కావాలా?"

"లేవు, లేవు!" అని జనం కేకవేశారు.

కిక్కులు కొట్టినట్లున్న జీవో ముఖం భయంకరంగా ఎర్రబడింది. "ఎవరా గోలజేసేది?" అన్నాడు తీవిగా. "మా బ్రిగేడ్ కమాండరుగారి ఆజ్ఞ యిది. మీరు సమర్పించుకో నిరాకరిస్తే, మీరు నావెంట వచ్చి, ఆ విషయాన్ని వారికి మీరే చెప్పుకోవాల్సి వుంటుంది!"

జీవో సైగ చేయగానే వాడి మనుష్యులు, తమ పిస్తోళ్ళ మరలను వెనక్కు లాగారు. పిస్తోళ్ళపైనుండే సేఫ్టీలను వూడదీశారు.

తేవార్ త్వరగా తన రైఫిల్ యొక్క మేకును కదలించాడు. తమ తుపాకులమీద వుండే సేఫ్టీలను తొలగిస్తూ, ప్రజాసైనికులు ఆవరణలో గుమిగూడారు. దాస్వేగుండె వేగంగా కొట్టుకోసాగింది. ద్వారంలో నుండి మేయర్ షెన్‌గారు మెల్లిగా జారి, పరుగుచ్చుకొన్నాడు.

అకస్మాత్తుగా క్లార్కి నిటారుగా నిలబడ్డాడు. తన చేయి పైకెత్తాడు; తనవాళ్ళకు కన్నుగీటాడు.

"సరే! రొట్టెలు తినదలచుకొన్నవాళ్ళు నావెంట రండి!" అన్నాడు.

"ఏమ్! త్సే! గూఢచర్యానీ చేయబోకు!" అని, అనుమానింగా ఛ్లింగ్ అరచాడు.

జ్లాకీ తన తల పైకెత్తాడు. "మీకూ ఒక కమాండరున్నాడు. మాకూ ఒక కమాండరున్నాడు. మీరు రొట్టె కావాలనుకుంటే, మావెంట జనరల్ లూ వద్దకు రండి. అక్కడ మీ యిష్టమొచ్చినంత తినండి!"

"అది సవ్యం. ఆయనవద్ద కావలసినంత రొట్టె వుంది!" అని తేవారు కల్పించుకొన్నాడు.

ఆవరణలో నున్న రైతాంగప్రజలు యీ నినాదాన్ని అందుకున్నారు.

"జనరల్ లూ వద్దకు పొండి! జనరల్ లూ వద్దకు పొండి!" అని కేకలుపెట్టారా రైతాంగజనం.

గిత్త వృషణాల్లాగున్న జీవో కళ్లు వుబ్బాయి. జ్లాకీత్సేకి ఎదురుగానున్న బల్లమీద గట్టిగా గుద్దాడు జీవో.

"చెత్తకబుర్లు కట్టిపెట్టండి! జనరల్ లూ యెవరో నాకవసరం లేదు. వాణ్ణి మేం గుర్తించం! ఈ తాగుబోతును కట్టేయండి!" అని అరచాడు జీవో

జ్లాకీకి అభిముఖంగా అనేకమంది బందిపోటు దొంగలు కాళ్లు సాగించారు. జ్లాకీ తన పిస్తోలు పైకెత్తాడు. వారి కభిముఖంగా ఒక్క అడుగు ముందుకు వేశాడు.

"ముందెవరొస్తారు?" అని సవాలుజేశాడు జ్లాకీ.

ష్వాంగ్, యితర ప్రజాసైనికులు తమ తుపాకులను బారుజేసి, సిద్ధంగా వున్నారు. కొంతమంది తమ చేతిబాంబులను బయటికి తీసి చేతిలో సిద్ధంగా పుచ్చుకున్నారు.

గుర్రపు డెక్కల ధ్వని వినవచ్చింది. ఆ దిక్కుగా అందరూ తమ చెవులు రిక్కించి వినసాగారు.

ముతక గుడ్డతో తయారుచేసిన బూడిదరంగు యూనిఫారం ధరించిన ముగ్గురు మనుషులు ఆ దిక్కుగా స్వారీచేస్తూ వచ్చారు. గుర్రాలను దిగి, ఆఫీసు ఆవరణలో ప్రవేశించారు.

"నాయకుడు త్సే ఎక్కడున్నాడు ?" అని అందులో మొదటివాడు అడిగాడు.

"అదిగో, లోపలున్నాడు !" మేయరు గదివైపుకు చూపుతూ ఒక రైతు జవాబిచ్చాడు.

ఆ మనిషి గదిలోకి దూరాడు. త్సేను సమీపించి, అతని చేతిని గుంజసాగాడు

జాకీత్సే ముఖంలో తేజస్సు తొలకరించింది. "మీ రిక్కడికి ఎప్పుడొచ్చారు ?" అని ప్రశ్నించాడు.

"ప్రధానసైన్యం ఇక్కడికి కొంతదూరంలో వుంది. మొట్టమొదటగా మిమ్మల్ని చూద్దామని వచ్చాం" అన్నా డతడు.

"భేష్ ! భేష్ ! ప్రక్క గదిలోకి పోయి మాట్లాడుకుందాం పద !" ఆ సైనికులచుట్టూ ప్రజాసైనికులు గుమిగూడుతూ వుండగా వాళ్లు పడమటి వరండాలోకి పోయారు.

మొద్దులాగున నోరు తెరచుకొని, జీవో అక్కడే నిలబడి పోయాడు. జిన్లంగ్ అతణ్ని మోచేతితో పొడిచి, "పోదాం పద !" అన్నాడు.

"ఆఁ అవును ఆలస్యమవుతూ వుంది. మళ్ళీ రేపు వద్దాంలే" అని అన్నాడు జీవో. అయితే, యీ మాట లనటానికి అతడు ఎంతో కష్టపడాల్సి వచ్చింది. బలవంతాన నోరు పెకలించుకుని ఎలాగైతేనేం యీ మాట లనేశాడు.

"రొట్టెకోసం రేపు వస్తాం" అని లైవే ప్రతిధ్వనించాడు. ఆ బందిపోటు దొంగలు త్వరగా కాలికి బుద్ధిచెప్పారు.

ఇంతకుపూర్వం మంచి సమయంలో అక్కడికి వచ్చారే ఆ ముగ్గుర సైనికులూ జనరల్ లూ సైన్యంయొక్క కంపెనీలో సభ్యులు. ఆ కంపెనీ బాయాంగ్ సరస్సు ప్రాంతానికి తరలివచ్చింది.

బాయాంగ్ సరస్సు ప్రాంతంలో ఆ కంపెనీ స్థావర మేర్పరిచుకోగానే, స్థానిక రక్షణ సంఘాలను ఏర్పాటుచేసింది. బందిపోటు దొంగలను పూర్తిగా తుడిచిపెట్టేయట మొక ప్రత్యేక విషయంగా చేసుకొంది.

"జపాను ప్రతిఘటనోద్యమంలో జేరి, మేము చెప్పినట్లు వింటావా విను. లేదా, నీ ఆయుధా లన్నింటిని మాకు వప్పగించివేసేయి" అని, ప్రజా సైన్యం హోకు తాఖీదు పంపింది. వాడికి మార్గాంతర మేమీ దొరకలేదు. తాను ఆజ్ఞలకు బద్ధుడైవుంటానని హో చెప్పాడు.

* * * *

అది డిసెంబరు మాసం. తుపాకి మందు కొనుక్కురమ్మని బ్లాకీ త్సే దాస్వేని, హోజ్యాంగ్ గ్రామానికి పంపాడు. దాస్వే పెద్ద వీధిగుండా నడుస్తున్నాడు. మేళతాళ ధ్వనితో కలిసిపోయిన టపాసుల మోత విన వచ్చింది. వీధి కిరుప్రక్కలా జనం కిక్కిరిసిపోయి వున్నారు. జనం దాస్వేని వెనక్కి నెట్టారు. అతడు, ఎవరి యింటి మెట్ల పైకో నెట్టివేయ బడాడు. రెండు గొట్టాల తుపాకిని భుజాన ధరించి, రోడ్డువెంట లైవే తీరిగా వస్తున్నాడు. వాడివెంట బాకాలూ, సన్నాయిలూ వూదుతూ, ఆరుగురు మేళగాళ్లు వస్తున్నారు. జనాన్ని యిటూ అటూ మొరటుగా తోస్తూ లైవే వాళ్ళకు మార్గం చేస్తున్నాడు. వాళ్ళ వెనుక నీలిరంగు సెడాన్ కుర్చీ (మేనాలాంటిది) వస్తూవుంది. దాని వెనుక, పెళ్ళికూతురు ఎక్కిన ఎర్రని సెడాన్ కుర్చీ వస్తూవుంది. దానికి ఎర్రపట్టు ముసుగు వేశారు. దానికి బంగారు అంచు కుట్టబడి వుంది. ఈ మేనా వెనకాల పిస్తోళ్లు ధరించిన గుంపొకటి వస్తూవుంది. ఇదీ ఆ వూరేగింపుకు వెనకభాగం. ఆ వూరేగింపు నిదానంగా సాగిపోతూ వుంది.

ఈ హడావిడంతా ఎవరిదో ? అని, దాస్వే ఆశ్చర్యపోయాడు. వాకబుచేయగా, జిన్లంగుకు పెళ్ళవుతూవుందనీ, పెళ్ళికూతురు యాంగ్ వంశీకురాలు. దాస్వే హృదయం ముకుళించుకుపోయింది.

"ఆమె పేరు మెయీ యా ?"

"అవును. నీ వామెను ఎఱుగున్నావా ?"

"తన కళ్ళఎదుటనుండి కదలిపోతూవున్న ఆ పెళ్ళికూతు రెక్కిన మేనాను, కొయ్యబారినట్లుగా వున్న దాస్వే చూస్తూ నిలబడ్డాడు.—

ఆదే సమయంలో, మేయీ కన్నీటి ప్రవాహంలో తడిసిముద్దవుతూ మేనా కదలికకు అటు యిటు వూగుతూ వుంది. జిన్లంగ్ యొక్క దుశ్చరిత్రాన్ని గురించి ఆమె కేనాడో తెలిసింది. గత రెండు రోజులనుండి జబ్బుచేసినట్లు నటిస్తూ, మేయీ కాంగ్ మీద పడుకొని కాలం గడిపింది. ఆమె తన తలను పదుపుతో కప్పుకొని ఎడతెగకుండా ఏడ్చింది. ఆమె తల్లి ప్రక్కనే కూచ్చుని, ప్రతిమాలసాగింది. వారించసాగింది. అలసిపోయిన మేయీ కన్యకు పెళ్ళిమేనా వచ్చిన సంగతి తెలియదు. దానిలో తన్ను కూర్చోబెట్టిన సంగతి తెలియదు.



# 2 అధ్యాయం

పెళ్ళి అయిన తర్వాత మొదటి మూడు రోజుల్లోనూ మేయీని పువ్వుల్లోపెట్టి పూజించారు. ఆచారాన్ని అనుసరించి, మేయీ తన భర్త కుటుంబంతోనే కాపురముంది. అంటే వేరింటి కాపురం పెటలేదన్నమాట. నాలవరోజున అత్తగారు కొత్తకోడల్ని పిలిచి, కుట్టు పనితనాన్ని చూపించవలసిందిగా కోరింది. ఆ ప్రాంతంలో కుట్టుపనితనాన్ని ప్రదర్శించటంలో ఒక టేమంటే కొత్తకోడలు అత్తగారికి బొంత — లాగూల జతను కుట్టియిచ్చి, ఆవిధంగా తన చాకచక్యాన్ని ప్రదర్శించుకోవాలి. మేయీ, తన అత్తగారికి బొంత లాగూలను కుట్టి యిచ్చింది. అత్తగారికి కొత్తకోడలి పనితనం నచ్చలేదు. తల అడ్డంగా అసంతృప్తిసూచకంగా త్రిప్పింది ఇక్కడ కుట్లు పొడుగ్గా వున్నాయ్. అక్కడ దూదిని సరిసమానంగా జేర్చలేదే అని దీర్ఘాలుతీస్తూ అత్తగారు కఠినంగా తన అసంతృప్తిని వెల్లడించింది.

ఒక సంవత్సరం పూర్తి అయ్యిందో లేదో అత్తగారు మేయీ యింటిపనుల భారాన్నంతటినీ మోపింది. ప్రతిరోజూ మేయీ గోధుమలు విసిరి వంటచేసేది; తుంగను చీల్చేది; పది అడుగుల చాప అల్లేది.

ఒకానొక కాలంలో అత్తవారిది సంపన్నకుటుంబమే. కాని, జీసాంగ్ యొక్క తండ్రి ఆస్తినంతా పందారంజేశాడు. ఇప్పుడు చేతిలో చిల్లిగవ్వయినా మిగల్లేదు. వాళ్ళకు మిగిలినదల్లా ఒక శిథిలగృహం,

తోట మాత్రమే. ఇవి బ్రతికున్న రోజుల్లో ఉన్నతస్థితిలో వుండేవి. ఇక కుటుంబపోషణ యెలా జరుగుతూవున్నదంటే, అదపాతదపా ఎవడి నెత్తినో చేతులెట్టి కొన్ని డాలర్లు కొట్టుకొచ్చే జిన్సెంగ్ యొక్క సామర్ధ్యంపై ఆధారపడి వుండా కుటుంబం. ఈవిధంగా జిన్సెంగ్ సంపాదించిన డబ్బుతో కాలం గడిపేవారు. ఇక్కడొక విశేషముంది. జిన్సెంగ్ డబ్బు కొట్టుకొచ్చిననాడు దాన్ని మంచినీళ్ళప్రాయంగా వెచ్చించేవారు. అంతే కొద్దికాలంపాటు దిట్టంగా తినేవారు. డాబుసరిగా దుస్తులు వేసుకునేవారు. చేతిలో పిచ్చికలున్న ఆ రెండురోజులూ హుందాతనాన్ని వెళ్ళబోసేవారు. కాని మరొక చిన్న విషయమేమంటే యీ చిరింత ఐశ్వర్యంలో మేయీకి భాగముండేదికాదు. మేయీని "పల్లెటూరి గబ్బిలాయ్"గా జూచేవారు. ఒకనాడు మేయీ మామగారు నల్లమందుపొగను అపారంగా సేవించారు. తత్ఫలితంగా వారిలో యేదో యింతవరకూ లేని "కరుణ" ఉద్భవించింది. తన్మూలంగా ఆ మామగారు, కోడలికి ఒక చిన్న బియ్యపురొట్టె దానంచేశారు. అప్పుడే యెక్కడనుండి వూడిపడిందో అత్తగారొచ్చిపడింది.

"అమ్మాయీ! నీకు రెండురొట్టెలున్నాయటే?" అని మృదువుగా అత్తగారు ప్రశ్నించింది.

"ఇదుగో! ఒక్కసారైనా కడుపునిండా తిండి పెడదాం. దానికి తగ్గట్టుగా అది కష్టపడి పని చేయగలుగుతుంది" అని మామగారు వివరించబోయాడు.

అత్తగారు మూతి ముడుచుకొనిపోయింది. మరి మాటాడలేదు. మేయీకి ఆకలికాస్తా చచ్చిపోయినట్లయ్యింది. ఆమె మరల ఆ బియ్యపు రొట్టెను బుట్టలో పెట్టేసింది. పిండిమరవద్దకు వెళ్ళిపోయింది. బక్కపల్చని ఈ పసిపిల్ల ఈనాడు నడివయస్సులో నున్న స్త్రీలాగున తన జుట్టును వ్రేలాడేసుకుని తిరుగుతూవుంది. తనకుమించిన బొంతదుస్తుల్ని ధరిస్తూవుంది. ఆమె కన్నీళ్ళు బుగ్గలమీద అదేపనిగా పడుతూవుంటే అతి భారమైన పిండిమరచక్రాన్ని త్రిప్పుతూవుంది.

వంటకోసం దేగమాదిరిగా అత్తగారు ఆమెను కనిపెడ్తూ వుండేది. కొంపలోనున్న సామగ్రినంతటినీ పెట్టెల్లోపెట్టి తాళం వేసుకొనేది. వంట సమయంలోనే అత్తగారు జొన్నలు, పిండీ వున్న డబ్బాల తాళం తీసేది. స్వంతంగా ప్రతి వస్తువునూ ఆ పూటకు సరిపోయేటట్లుగా తూచి యిచ్చేది. ఈవిధంగా మేయీ కోడంటికాన్ని అనుభవిస్తూ వుండేది. సహింప రాని ఈ బాధలతో ఆమె హృదయం కృంగిపోయేది. ఎక్కడికయినా పోదామంటే దిక్కేది? ఎవళ్ళు రానిస్తారు. ఎవరు ఆశ్రమమిస్తారు. ఇక భర్తవిషయం చూద్దామంటే వాడొక పశువు. వాడి మొగ మెప్పుడూ తుమ్మల్లో పొద్దుగూకినట్లుంటుంది. మాటా మంతీ లేదు. విరసప్ర పెడ కట్టె. హృదయాలు విప్పి ఒకళ్ళకొకళ్ళు వెళ్ళబోసుకోవాల్సిందేమీ వాళ్ళ మధ్య వుండేదిగాదు. ఏనాడైనా వాడు మేయీతో ఆప్యాయంగా మాట్లాడిన పాపానపోతేగా! మేయీతల్లి తమ స్వంతస్థలమైన పట్నానికి వెళ్ళి పోయింది. ఆ పట్నం చూద్దామా, అబ్బో! చాలాదూరం! ఇక మేయీకి వున్న సుఖమల్లా యేమంటే షెన్ జ్యా గ్రామంలోనున్న తన అక్కగారింటికి అప్పుడప్పుడు వెళ్ళివస్తూవుండటం. ఇక్కడమాత్రమే ఆమె తన హృదయభారాన్ని దింపివేసుకోటానికని తనివిదీరా ఏడ్చుటకు అవకాశం వుండేది. ఆమె దుర్భరజీవితాన్నిగురించి దాస్వే తెలుసుకున్నాడు. అతని హృదయం కృంగిపోయింది. ఆమె యిప్పుడు పెళ్ళయినస్త్రీ గదా! అందువలన అతడు యేవిధంగానూ ఆమెకు సాయపడజాలడు.

* * * *

1937 డిసెంబరులో జపాను సామ్రాజ్యవాదులు ముట్టడించారు. ఫూ నదీతీరంలో మూడు అహోరాత్రాలు నూతనంగా ఏర్పడిన కమ్యూనిస్టు సైన్యాలు జపాను సైన్యాలతో పోరాడి తరిమికొట్టినాయి. 1938 వసంతరుతువులో శత్రువులు మరల ముట్టడించారు. ఈతూరి పోరాటంలో శత్రుసైనికులు 1000 మంది పాల్గొన్నారు. గుర్రాలతో లాగబడిన ఫిరంగులను ఉపయోగించారు. విమానాలుకూడా యుద్ధంలో పాల్గొ

న్నాయ్. కమ్యూనిస్టులకు ఒక వందమాత్రం సైనికులున్నారు. అయితే నేం. శత్రువులను సరిహద్దునే నిలబెట్టి, ఒక రోజల్లా యుద్ధంచేశారు। అటుతర్వాత జపానువాళ్ళు ముందుకు చొచ్చుకొని వచ్చారు. ఆ కౌంటీకి ప్రధానపట్టణమైన, చుట్టూరా గోడలుగల పట్నాన్ని జపానువాళ్ళు పట్టుకున్నారు. బాలూ సైన్యం గ్రామీణప్రాంతాలకు తరలిపోయింది. స్థానిక కమ్యూనిస్టు సెల్లులలో సహకరించింది. ప్రజలను సంఘటితపరచ సాగింది. ఆయుధసంపత్తిని పెంపొందించసాగింది.

ప్రచారకదళ సభ్యులు తరచుగా షెన్ జ్యా గ్రామం వస్తూవుండేవారు. నీలిదుస్తులను ధరించిన ఎర్రసైన్య స్త్రీ సహాయదళంవారు కూడా ఆ ప్రచారదళంలో వుండేవారు. వాళ్ళు గోడలకు పోస్టర్లు అంటిస్తుండేవారు. వీధుల్లో ఉపన్యాసా లిస్తూండేవారు. అక్కగారింటికి వచ్చిన సమయంలో అప్పుడప్పుడు అక్కగారితో ఈ సభలకు పోతూవుండేది. అక్కడ స్త్రీ సహాయకదళ సభ్యులను జూచి అసూయపడుతూ వుండేది. ఇంతమంది ప్రజలముందు వాళ్ళ మాట్లాడ నేర్చారంటే చూడు! వ్రాయ గలరటకూడా! వాళ్ళను ఎవరూ అణచిపెట్టరుగదా?

ఒకనాడు వీధిలో పోతూవున్న దాస్సేని జూచింది. పెద్ద పెద్ద అంగలేసుకుంటూ పోతున్నాడు. ఒక తెల్లని తుండుతో తలపాగా చుట్టాడు. వీపుమీద తుపాకి వ్రేళ్ళాడుతూవుంది. పసి వెధవ రియూహుడా ప్రజా ఉద్యమంలో జేరాడు। అతడు యువజన సహాయక సమితిలో జేరాడు. ఈ సమితి సభ్యులు పాటలు పాడుతూవుంటారు. డ్రిల్లుచేస్తూ వుంటారు. సాధారణంగా అందరికి తోడ్పడుతూ వుంటారు.

మేయీ యిలాంటి సభలు, సమావేశాలలో పాల్గొనటానికి అవకాశం లేకపోయేది. ఎందువల్లనంటే, చుట్టపు చూపుగా తన అక్కగారింటికి వచ్చినపుడు మూడు రోజులకన్న ఎక్కువకాలంపాటు షెన్ జ్యా గ్రామంలో ఉండటానికి వీలుండేది కాదు. ఆమె అత్తగారు, ఆమె అంత కన్న ఎక్కువకాలం అక్కడ వుండనిచ్చేదికాదు.

ఆకురాలు కాలంలో, రైతు యూనియన్లు ఏర్పరచబడినాయి. ఇలా స్థాపించబడిన అనేక గ్రామ సంఘాల పనిమీద బ్లాకీత్సే వూరూర తిరుగు

తూండేవాడు. అందువలన, అతడు షెన్‌జ్యా గ్రామంలో ఎక్కువగా వుండేవాడుగాదు. దాస్వే ఒక 'కార్యకర్త' అయ్యాడు. ప్రభుత్వశాఖల లోనూ, ప్రజాసంఘాలలోనూ పనిచేసే వర్కర్లను 'కార్యకర్త'లని పిల వటం ఒక ఆచారం. ఆ విధంగానే షెన్‌జ్యా గ్రామంయొక్క రైతు సంఘంలో 'కార్యకర్త'గా దాస్వే ప్రవేశించాడు. అతను వీపు తిప్పగానే మేయర్ షెన్ అతనినిగురించి నిరసనగా మాట్లాడేవాడు.

"ఉష్! ఇలాంటి చదువురాని మట్టిబుర్రల కేమి చేతనవుతుం దోయ్!" అని వెక్కిరించేవాడు షెన్‌గారు.

కౌలు, వడ్డీరేట్ల తగ్గింపు ఉద్యమ కార్యక్రమం ప్రారంభంకాగానే షెన్‌గారిలో అసంతృప్తి మరింతగా ముమ్మరించింది. మేయర్‌గారు, ఈ ఉద్యమాన్ని అరికట్టడానికని తన చేతుల్లోవున్న శక్తినంతా రహస్యంగా వినియోగించారు. కాని, వేలాది రైతు సంఘ సభ్యులు షెన్‌గారి ప్రవ ర్తనను గురించి కౌంటీ ప్రభుత్వానికి తెలియపరచగానే బుద్ధికలిగినవాడి లాగున ప్రవర్తించటానికి నిశ్చయించుకున్నాడు.

మరొక విశేష మేమంటే, దాస్వే కనపడినప్పుడల్లా అతనికి సంతృప్తికరంగా, మేయర్ షెన్ ఆప్యాయతను వొలకబోస్తూ అభినంది స్తున్నాడు.

షెన్‌కు యిచ్చుకోవలసిన కాంపౌండు వడ్డీ ధనం అప్పు తీసు కొన్న మొత్తానికి సమానంగా పెరిగినదని దాస్వే తండ్రి లెక్కవేసి చూచుకోగా తేలింది. కౌలు, వడ్డీరేట్లు నిర్ణయించబడినాయ్. ఆ విధంగా శాసనం ప్రకారం నిర్ణయించబడిన గరిష్ఠ మొత్తాలకుమించి, అంతవరకు వసూలుకాని కౌలుధనాన్నిగానీ, వడ్డీధనాన్నిగానీ యీనాడు వసూలు జేయటం శాసన విరుద్ధంగా ప్రభుత్వం ప్రకటించింది. ఈ శాసనాలే లేక పోతే తనకున్న కాస్తపొలాన్నీ అప్పు ఎగరేసుకొనిపోయేదని దాస్వే తండ్రి అనుకున్నాడు. తండ్రీ కొడుకులు యిప్పుడు కాస్త శుభ్రంగా తిండి తినటానికి అవకాశ మేర్పడింది.

"రైతుసంఘాల మూలంగా, మన పీకెలు భూస్వాములచేతుల్లోంచి

బయటపడ్డాయ్ బిడ్డా! బాగా పనిచెయ్!" అని తండ్రి. దాస్వేతో ఒకనాడన్నాడు.

తండ్రినుంచి యిలాంటి ప్రోద్బలం రాగానే, దాస్వే మునుపటి కన్నమరింత ఉత్సాహంగా రైతుసంఘాల్లో పనిచేయసాగాడు.

* * * *

దాస్వేలాంటి కష్టపడి పనిచేసే వర్కర్ని కమ్యూనిస్టు పార్టీలో జేరవలసిందిగా ఆహ్వానించటం మంచిదని ష్వాంగ్ భావించాడు. ఏమంటాడో తట్టిచూద్దామని దాస్వేని, ఒకనాటి మధ్యాహ్నం ష్వాంగ్ పిలిచాడు.

"పనిమీదున్నావా? పుల్లలేరుకొనివద్దాం పద!" అన్నాడు ష్వాంగ్. పొలాల్లో ఎండిన కంప, కంచెకోసిన తర్వాత ఎత్తుగా పెరిగిన రెల్లు తుప్పలవద్దకు వచ్చారు. తాము ఒంటరిగా వున్నాముగదాయని, రెల్లు కోస్తూ దాస్వేని ష్వాంగ్ యిలా ప్రశ్నించాడు.

"జపానువాళ్ళను ఓడించగలమని ధైర్యముందా?"

"తప్పకుండా."

"జపానువాళ్ళను చూస్తే నీకు భయమా?"

"భయం దేనికి?"

"దాస్వే! మనల్ని జపానువాళ్ళకు వ్యతిరేకంగా ఎవరు నడుపుతున్నారనుకుంటున్నావ్?"

'వీడొక వింతవ్యక్తి' అనుకున్నాడు దాస్వే. 'ఈ ప్రశ్నలన్నీ ఎందుకు వేస్తున్నాడు?' అయినా, జవాబిచ్చాడు. "ఎవరేమిటి? క్లీత్సే నడుపుతున్నాడు."

ష్వాంగ్ నవ్వాడు. "క్లీత్సే అంటే ఎవరో నీకు తెలుసా?"

ష్వాంగ్‌వంక చూస్తూ దాస్వే "ఎవరేమిటి?"

"మా దాయాదేగా!" అన్నాడు.

'ఉష్! యీ మనిషితో లాభంలేదు!' అని విసుగ్గా ష్వాంగ్ తనలో

అనుకున్నాడు. వారు నిశ్శబ్దంగా రెల్లు కోత సాగించారు. కొన్ని నిమిషాలైనతర్వాత షాంగ్ మళ్ళా ప్రయత్నించాడు.

"దాస్వే! భవిష్యత్తులో కమ్యూనిజం ఆచరణలోకి వస్తుందనుకో అది మనకు లాభసాటిగా వుంటుందంటావా?"

"నాకు తెలియదు.... వాళ్ళు నా పొలాన్ని కమ్యూనైజ్ చేస్తే మాత్రమేం? నా కున్నదల్లా ఒక్క యెకరమేగా...."

షాంగ్ నడుము సరిచేసుకొని, తన కొడవల్ని కోపంగా వూపాడు.

"మొద్దూ! నీ బెత్తెడు నేలను ఎవడు పంచుకొంటాడోయ్!" అన్నాడు. యాంత్రికంగా తన కొడవలి నాడిస్తూవున్న దాస్వేవంక రెప్పార్పకుండా ఉగ్రంగా చూశాడు. "చాల్లే, ఆపింక. పోదాం పద!" అన్నాడు.

ఎండుపుల్లల మోపులను భుజాల కెక్కించుకున్నారు. దారిలో ఒక్కమారైనా కబుర్లు చెప్పుకోకుండా గ్రామానికి తిరిగి వచ్చేశారు.

దాస్వేకి యీ వ్యవహారం మంతుపట్టలేదు. షాంగ్ బుర్రలో ఏమున్నదోనని ఆశ్చర్యపోయాడు.

ఒకనాటి సాయంత్రమది. కాపలా కాయవలసిన వంతు తేవారుది. తనకు తోడుగా వుండవలసినదిగా తేవారు దాస్వేని కోరాడు. తన తుపాకీని వెంటబెట్టుకొనిపోయి, గ్రామానికి వచ్చే రోడ్డుమీద తేవారుతోపాటు దాస్వే నిలబడ్డాడు.

అక్కడవున్న ఒక గడ్డిమోపుపై వాళ్ళిద్దరూ కూర్చొని కొంతసేపు పిచ్చాపాటీ చెప్పుకోసాగారు. అదైనతర్వాత "నీవు భలేవాడివోయ్ కాని, నీవు కొంచెం మందకొడివి. నిన్ను జేరమని ఎవరైనా చెప్పారా?" అని తేవారు ప్రశ్నించాడు.

దాస్వేకి యింకా అర్థంకాలేదు. "దేంట్లో చేరమని? హృదయం విప్పి మాటాడవు నువ్!"

"షాంగ్ నీతో మాటాడలా?" కోపాన్ని కుమ్మరిస్తూ అన్నాడు తేవార్.

"నాతో ప్రత్యేకంగా ఏమీ చెప్పలేదే" అని జవాబు చెప్పాడు దాస్వే.

తేవారు ఉద్రిక్తుడయ్యాడు. 'ఈ మొద్దువెధవతో ఎలా వ్యవహరించాలి చెప్మా! వీడు, ష్వాంగ్ కాండిడేట్ గదా! వీడితో మాటాడమని నాతో ఎవరూ చెప్పలేదనుకోండి!....కాని, ఏదో చెయ్యటం నా విధి'అనుకొన్నాడు.

అకస్మాత్తుగా దాస్వే బుర్రలో వెలుగు జూపింది. "కమ్యూనిస్టు పార్టీలో చేరటం, అది నీ వుద్దేశమా?" అని పెద్దగా అరచాడు.

తేవారు అతణ్ని గద్దిగా అదిమిపట్టాడు. "ఏమిటోయ్ యీ పెద్ద బొబ్బలు? అందరూ వినాలని కేకలేస్తున్నావా?" అన్నాడు.

"తేవార్! నేను పార్టీలో జేరితే, నా పొలాన్ని దున్నుకొని బ్రతుకవచ్చా?" అని, మెల్లగా అడిగాడు దాస్వే.

"ఓ! తప్పకుండా! రైతులు సేద్యం చెయ్యకపోతే భోజనమెలా?"

"అయితే, తప్పకుండా జేర్తాను. నీవు పార్టీ మెంబరువా? యెలా జేరాలి?"

"నేనా...." తేవారుకు చెప్పాలని వుంది. కాని చెప్పకూడదని తెలుసు. అందుకని తేవారు విషయాన్ని పెడత్రోవకు్కుతూ "ఎలా జేరాలో ప్రయత్నించేచూద్దాం. నాకు తెలుస్తే నీకు చెప్తా. నీకు తెలిస్తే నాకు చెప్పు. సరేనా?"

"అచ్ఛా" అన్నాడు దాస్వే.

తేవారు కాపలాడ్యూటీ అయిపోగానే, అతనితోపాటు దాస్వే గ్రామానికి మరలివచ్చాడు. "పార్టీలో జేరటమెలాగో తెలిస్తే నాకు చెప్పటం మరచిపోకుసుమీ!" అని మెల్లగా మరల దాస్వే జ్ఞాపకం చేశాడు.

అంగీకారసూచకంగా తేవార్ చిరునవ్వు చిలకరించాడు. వాళ్ళు అటుతర్వాత ఎవళ్ళకొంపలకు వాళ్ళు పోయారు.

అటుతర్వాత జరిగిన పదిహేనురోజులపాటు దాస్వే వార్తల

కోసం పడిగాపులు గాచాడు. కాని, తేవారె మాత్రం ఈ ప్రసక్తిని మళ్ళా ఎత్తలేదు. ఈ సమస్య అతని హృదయంలో జ్వలిస్తున్నా. దీన్ని తేవారుముందర పెట్టలేకపోయాడు దాస్వే. షాంగ్, కొంతమంది రైతులతో యేవో కొన్ని ప్రధానవిషయాలను గురించి మాట్లాడుతూ వున్నప్పుడు తా నక్కడకు వస్తే, యేదో పనిమీద తన్ను అక్కడనుంచి పంపివేసేవాడు. ఈ విషయాన్ని దాస్వే గమనించాడు. తన్ను వెనకాల విడిచి పోతున్నారని వూహించుకునేవాడు. మనస్సు గాయపడేది.

అటుతర్వాత ఒకనాడు షాంగ్ ప్రజాసైన్యాన్ని సమావేశపరిచాడు. చేయవలసిన కార్యక్రమమేమంటే, రవాణామార్గాలను ఛేదించాలి. రాచబాటలో గోతులు త్రవ్వాలి. ఇదంతా జరుగవలసింది జపానువాళ్ల ఆక్రమించుకున్న ప్రాంతంలోని పశ్చిమదిశలో జరగాల్సివుంది. వాళ్ల రాచబాటను చేరుకోగానే, షాంగ్ సెంట్రీలను కాపలా పెట్టాడు. అటు తర్వాత మిగిలినవాళ్ళనందరినీ వర్క్ టీములుగా విభజించాడు. "ఎవళ్ళెన్ని గోతులు వేగంగా త్రవ్వుతారో!" అని పోటీలుపడ్డారు. పీక్కుతినే చలిగాలి వీస్తూవుంది. అయినా దాన్ని లెక్కచేయకుండా దాస్వే ఓవరుకోటు విప్పేశాడు. చొక్కా చేతులు పైకెగమడిచాడు. తన పికాక్సును యావత్ బలంతో గాఠ్ఠంగా ఉపయోగించాడు. అతనికి సాటిగా ఎవరూ పనిచేయలేకపోయారు. చిటికలో అతనిభాగపు రోడ్డులో పది అడుగుల వెడల్పుగల కందకం తయారయ్యింది.

వాళ్ల గ్రామానికి తిరిగొచ్చేటప్పుడు దాస్వే ఒక టెలిఫోను స్తంభాన్ని తన భుజంమీద వేసుకుని మోసుకొస్తున్నాడు. దాని చివర కావలసినంత వైరు చుట్టబడి వుంది. అతని వెనకాల ఒక పికాక్సును షవెల్‌ను భుజాన వుంచుకుని, నడుముకు ఒక వైరుచుట్టను తగిలించుకుని షాంగ్ ప్రయాసపడుతూ వస్తున్నాడు. మిగతావారందరికన్న వెనుకబడి మెల్లగా నడుస్తున్నాడు. వారిద్దరూ ఇంటికి సగందూరంలోకి రాగానే తమ బహుమతులను క్రిందపెట్టి కాస్త అలసట తీర్చుకోటానికి కూర్చున్నారు.

వెండివెన్నెలరాత్రి అది. కూర్చున్న మనుష్యులకు వింతనీడలు

కల్పించిందా పండువెన్నెల. దాస్వే తన పైపు ముట్టించాడు. ష్వాంగ్ చెమటలో పూరిపోతున్నాడు.

"అయ్యో! నా పిచ్చిపీపా!" అని ష్వాంగ్ హాస్యకరంగా మూలిగాడు, "ఆ బరువు నన్ను పిండేస్తోందోయ్!" అన్నాడు.

"ఓ! ఈ సంభాన్ని చీలిస్తే కావలసినన్ని కట్టెలవుతాయ్!" అంటూ ఆప్యాయంగా టెలిఫోన్ స్తంభాన్ని దాస్వే తట్టాడు. "దీన్ని బద్దలేయగానే నీవు తాగగలిగినన్ని నీళ్ళు కాచిఇస్తాం!"

"దాస్వే! నీవేదైనా పని తీసుకొంటే, దాని అంతు కనుక్కొంటావోయ్! భలే మనిషివి."

"చాలినంత మంచివాణ్ణికాదని మీరు భావిస్తున్నారుగా" అని విచారంగా దాస్వే జవాబుచెప్పాడు. "నేను మంచివాణ్ని అని మీరనుకుంటే కమ్యూనిస్టుపార్టీలో చేరనిచ్చేవారుగా!"

"పార్టీపనంటే ఏమిటో నీకు తెలుసా?" అని చిరునవ్వు నవ్వాడు ష్వాంగ్.

"ఓ! తప్పకుండా తెలుసు– జపానువాళ్ళతో పార్టీ పోట్లాడుతుంది!"

"ఇంకా ఏమిటి?"

"మన కౌలుధనం తగ్గింపు కార్యక్రమాన్ని నడుపుతుంది. మనలాంటి బీదవాళ్ళంతా ఆకలితో మాడిపోకుండా చూస్తుంది."

"రైట్!" ష్వాంగు నవ్వాడు. "కట్టుకోటానికి అందరికీ బట్టలుండాలనేదే, తింటానికందరికీ తిండి వుండాలనేదే, చదువుకోటానికి అందరికీ పుస్తకా లుండాలనేదే, అందరూ సుఖంగా జీవించాలనేదే కమ్యూనిస్టుపార్టీ కోర్కె."

"కమ్యూనిస్టుపార్టీదే రైటని, అదే మంచిదని నేను హృదయపూర్వకంగా నమ్ముతున్నా" అన్నాడు దాస్వే నిష్కపటంగా. దాస్వే తన పైపును ష్వాంగుకు అందిచ్చాడు.

ష్వాంగు రెండు దమ్ములులాగాడు. అటుతర్వాత, "మన గ్రామములో కమ్యూనిస్టు లెవరంటావ్?" అని ప్రశ్నించాడు.

"భలేబాగుంది నీ ప్రశ్న! మీ తమ్ముణ్ణి ఎరుగున్నావా అని ప్రశ్నించినట్లుంది! అదంతా ఎందుకూ, నీవు తప్పకుండా కమ్యూనిస్టువని నాకు తెలుసు!" అన్నాడు దాస్వే.

ష్వాంగ్ నవ్వాడుగాని జవాబు చెప్పలేదు. దాస్వే అతని చేతిని అంకించుకున్నాడు.

ఉద్రిక్తంగా, "నన్నీ విధంగా తడిపిపెట్టబోకండి. మీ నుండి నేర్చుకోవాలనివుంది! మీతోపాటు పనిచేయాలనివుంది. మీరంతా అమృతమైన పనులు చేస్తున్నారన్న సంగతి నాకు తెల్సు!"

"మనలాంటి కార్మికులు, కర్షకులతోకూడిందే ప్రపంచమనికమ్యూనిస్టుపార్టీ భావిస్తోంది. అందువలన నిన్ను ఆహ్వానించకపోవటమనే సమస్యేలేదు. యధార్థానికి ఒక సమావేశం జరిగిందికూడా. ఆ సమావేశంలో నీ సభ్యత్వాన్ని ఆమోదించారు."

"నేను నిజంగా మెంబరునా?" అని ఆశ్చర్యంతో ఒక్కగంతేస్తూ ధాస్వే అరచాడు.

"ఉష్! అంత బిగ్గరగా అరవబోకు! సభ్యత్వాన్ని రహస్యంగా వుంచుకోవాలి. తల్లిదండ్రులకైనా తెలియనీయరాదు. ఆఖరికి పెళ్ళానికి కూడా చెప్పకూడదు."

వివేకవంతంగా వ్యవహరిస్తానని దాస్వే వాగ్దానము చేశాడు. ఇంటికి జేరుకోగానే, పెన్నిధినిగొన్న పేదవానిలాగున ఉప్పొంగిపోయాడు. అతని హృదయం నూతనోల్లాసంతో నాట్యమాడింది.

ఆ మరునాడు గ్రామ కమ్యూనిస్టుల సమావేశం జరిగింది. దాస్వేని అతిఆప్యాయంగా కమ్యూనిస్టుపార్టీ అనుచరవర్గంలోనికి ఆహ్వానించారు.

* * * *

సమావేశం పూర్తి అయినతర్వాత దాస్వే పొలానికి పోయాడు. అక్కడ అతని తండ్రి మేయాని అత్తవారు చావబాదారనీ, అందువలన ఆమె తన అక్కగారి యింట్లోవుంటూ వున్నదని దాస్వేతో చెప్పాడు తలాడిస్తూ.

"అలాంటి చక్కనిపిల్ల, అలాంటివాళ్ళ చేతుల్లోపడుతూవుంటే చూస్తూ వూరుకున్నారంటే, దేవుళ్ళు నిద్రపోతూవుండాలి" అని నిట్టూర్చాడు.

"వాళ్ళకు డబ్బుంది!" అన్నాడు దాస్వే కోపంగా.

"మనమంటే ఆమె ఎప్పుడూ ఆప్యాయంగా వుండేది. ఆమెను చూడటానికి ఎందుకుపోవు?" అని సలహాయిచ్చాడు దాస్వే తమ్ముడు రియూ.

"వద్దు! విషయాలను అలాగే వుండనీ!" అని ఎదురు జవాబు చెప్పాడు దాస్వే. కానీ ఒక్కదమ్ము పీల్చినతర్వాత తన కాళ్ళు బ్లాకీత్సే యింటికి పోతున్నాయని కనుక్కొన్నాడు దాస్వే.

అతడు యింట్లో ప్రవేశించగానే, కంచాలు శుభ్రం చేయుటలో అక్కగారికి తోడ్పడుతూవున్న మేయీ అతనికి కనిపించింది. ఆమె వీపు యితనివైపుగా వుంది. ఆయిల్‌లాంపు వెలుగులో అతనికి దెబ్బలగుర్తులేమీ కనిపించలేదు.

"అలాంటి కుటుంబంలో పిల్లను పడేసిందంటే, మా అమ్మ వట్టి గుడ్డిదన్నమాట!" అంది మిసెస్‌త్సే కటువుగా. "దిక్కుమాలిన తిట్లు తిట్టిపోస్తారు; చచ్చేటట్టు బాదుతారు. ఈసారి వాళ్ళకు దొరికిన సాకేమంటే అత్తగారు అగ్గిపెట్టె ఎక్కడదాంచిందో మరిచిపోయిందట! మేయీ తన దబ్బెట్టి యింకో పెట్టె కొనియిచ్చింది. నువ్వే దొంగిలించావని అత్తగారు తిట్టిపోసింది. మేయీచేత కొన్ని అగ్గిపుల్లలు నమిలించింది! తర్వాత కర్ర తీసుకొని చావమోదింది! చూడు! మొగం మీద, నెత్తిమీద ఎలా కొట్టిందో చూడూ." ఆమె మేయీ చెయ్యి పట్టుకొని యిటుత్రిప్పింది "దాస్వేని చూడనీ!" అంది.

పట్టు విడిపించుకొని మేయీ పారిపోయింది. చేతులతో ముఖం కప్పుకొని వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

"దాని తలనిండా గాయాలే" అని నిట్టూర్చింది మిసెస్ త్సే. "నుదుటిమీద ఎలా వాచిందో చూడు. కంటిమీద కొట్టారు. కన్ను పోయినంత పనైంది!"

"పీళ్ళమ్మ—! వాళ్ళొట్టి విషపుముండాకొడుకులు!" అంటూ ఉగ్రుడైపోయాడు దాస్వే; అతని కంఠంలో ఏదో అడ్డుపడినట్టయింది.

"పెళ్ళయిన యేడాదిలోనే వాళ్ళీవిధంగా దాన్ని బాధపెడ్తే, యిక ముందుముందు దాని కర్మెట్లా కాలుతుందో!" అన్నది మిసెస్ త్సే.

"చస్తే నే నక్కడికి పోను!" అన్నది మేయీ తిరస్కారంగా.

"అయ్యో! మళ్ళీ అక్కడకు పోకపోతే ఏంజేస్తావే?"

"ఎర్రసైన్యపు స్త్రీ సహాయకదళంలో జేర్తా!"

"పిచ్చివాగుడు వాగబోక! నీకు చదువూసంధ్యాలేదు. నీతో లాభమేమిటి?"

"సరేలే" అని దాస్వే వెంటనే వాళ్ళమాటలకు అడ్డుతగులుతూ "ఆ సంఘంలో చదువురాని ఆడవాళ్ళుకూడా కొంతమంది వున్నారు" అన్నాడు.

మిసెస్ త్సేయొక్క పసిబిడ్డకు నిద్రవేళయిందికాబోలు. గుక్కపట్టి ఏడ్వసాగింది. దాస్వే వెళ్ళిపోయాడు.

ఆ మరునాడు మరియొక మనిషితో జిన్లంగ్ వచ్చాడు. బలాత్కారంగా మేయీని ఈడ్చుకుపోయాడు. ఆమెనుగురించి దాస్వే ఎడతెగకుండా మధనపడ్డాడు. కాని తనలో ఈవిధంగా అనుకోసాగాడు. "ఆమెనుగురించి ఎవళ్ళనైనా విచారిస్తాననుకో. అప్పుడు వాళ్ళేమనుకుంటారు? మా యిద్దరికి ఏదో సంబంధం వుందనుకుంటారు. దానితో పరిస్థితులు మరీ అధ్వాన్నంగా తయారవుతాయ్."

అందుకని విషయాన్ని యథాతథంగా విడిచేశాడు.

చాలారోజుల తర్వాత కార్యకర్తల కౌంటీ ట్రెయినింగు స్కూలుకి తర్ఫీదు పొందడానికై పోవలసిందిగా పార్టీ దాస్వేని ఆజ్ఞాపించింది.

పాతరోజులలోనైతే రైతుబిడ్డకు మిలిటరీ ట్రైనింగుతప్ప మరేరకపు తర్ఫీదునూ ప్రభుత్వం యిచ్చేదిగాదు.

ఇప్పుడు దాస్వేని ట్రైనింగుస్కూలుకు పొమ్మన్నారంటే అతని తండ్రికి కొంచెం అనుమానమేసింది. అందుకని కొడుకుని యిలా ప్రశ్నించాడు. "ఈ ట్రైనింగు వ్యవహారమంటే నిన్ను సైనికుడుగా తయారుచేయటానికికాదూ? నీ బదులు ఎవరినైనా పంపమని మీ అన్నయ్య బ్లాకీత్సేని ఎందుకు అడుగకూడదు?"

"అది తప్పనిసరిగా మిలిటరీ ట్రైనింగై వుండదు. నన్ను వేధించేదల్లా ఏమంటే ఈ ట్రైనింగు పూర్తి అయిన తర్వాత దూరపు గ్రామములో పనిచేయటానికి పంపుతారేమో!" అని దీర్ఘాలోచనలో పడ్డాడు దాస్వే.

"నీవు లేకపోతే సాగుచేయటం కష్టం!" అని తండ్రి వ్యధపడ్డారు.

ఏమాలోచించాలో దాస్వేకి తెలియలేదు. తండ్రిని చూద్దామా, వయోవృద్ధుడవుతున్నాడు. తమ్ముణ్ణిచూద్దామా వ్యవసాయంలోని బరువు పనులు చేయటానికింకా వయస్సు చాలని పసివాడు. దాస్వేకి తన పొలమంటే అమితప్రేమ. తన పాతగుడిసెనుజూస్తే పిచ్చిప్రేమ. అందువలన వాటిని విడిచిపెట్టి వెళ్ళటం అతనికి సుతరాము యిష్టంలేదు. బ్లాకీత్సేతో ఆలోచిద్దామంటే అతడు గ్రామంలో లేడు. అందుకని దాస్వే తన సమస్యను ష్వాంగ్‌తో చెప్పుకుందామని పోయాడు. దాస్వే నోరు మెదిపేలోపలే యితణ్ణి చూడగానే కార్యకర్తల స్కూలుకు పోవటానికి అవకాశం లభించినందుకు ష్వాంగ్ అభినందించాడు.

"వైజ్ఞానికంగా అభివృద్ధి చెందుతావు. రాజకీయ పరిజ్ఞానం అభివృద్ధి చెందుతుంది. తిరిగొచ్చిన తర్వాత మాలాంటి మట్టిపిసతలను జూసి అసహ్యపడవనుకుంటాను! తిరిగొచ్చిన తర్వాత పెద్ద కార్యకర్తవైపోతావోయ్!" అని ష్వాంగొ వుబ్బేశాడు.

"వాణ్ణి పంపుతున్నారేం? నన్ను పంపటంలేదేం?" అని తేవార్ గొణగసాగాడు.

"తొందరేం? నీవంతూ వస్తుంది. మనవాడు తిరిగి రాగానే నువ్వు పోదువుగాని! తడవకు ఒక్క మనిషి చొప్పున పంపుతున్నాం" అని షాంగు బదులుచెప్పాడు.

ఈ అవకాశంకోస ప్రతి మనిషీ గ్రుద్దులాడుతున్నాడని తెలియగానే దాస్వే మనసు మార్చుకున్నాడు. త్వరగా యింటికి వెళ్ళిపోయాడు. ఈ ట్రైనింగు పొందటం మంచి లాభమని తండ్రికి నచ్చజెప్పాడు. షాంగు యింట్లో జరిగిన సంభాషణలన్నింటినీ పూసగుచ్చినట్లు తండ్రికి చెప్పాడు. తండ్రి కొడుకును యింకేమాత్రం నిరుత్సాహపరచలేక పోయాడు. నిరుత్సాహపరచటానికి యత్నించలేదని చెప్పాలి. నిరుత్సాహపరచటానికి బదులుగా తన పాత ట్రంకుపెట్టె ఖానాలనుండి మడతలు పడ్డ ఒక నోటు తీసి, జేబుఖర్చుకుగాను కొడుకుకు యిచ్చాడు. మరునాటి ఉదయం పక్కచుట్టను చంకనెట్టుకొని దాస్వే స్కూలుకు బయలుదేరాడు.

ఆనాడు కౌంటీ ప్రభుత్వపట్నంగా పనిచేస్తూవున్న పట్నంలోనే ట్రైనింగుస్కూలు వుంది. ఆ పట్నానికి పోతూ పోతూ దారిలోవున్న మరియొక గ్రామంలో బ్లాకీత్సేని కలుసుకున్నాడు దాస్వే. వాళ్ళిద్దరూ కుశలప్రశ్నలు వేసుకున్నారో లేదో, యింతలోనే ఒక యువతి పరుగెత్తుకుంటూ లోపలికి వచ్చింది. ఆమె చారలగౌనునిండా మట్టిమరకలు, జుత్తు చీకిరిగావుంది. ఆమె మేయీ!

"నన్ను రక్షించు బావా!" అని బ్లాకీని బ్రతిమాలింది. "వాళ్ళు నన్ను బ్రతకనివ్వరు!" అంది.

పద్మాలులాంటి ఆమెకళ్ళు నీళ్ళతో నిండివున్నాయ్. దాస్వే ఆమె విషాదవదనాన్ని చూశాడు. ఆమె వెనువెంటనే బ్లాకీకి అభిముఖంగా తిరిగింది. ఒక్క క్షణకాలంపాటు ఆమె నోటివెంట మాట పెగల్లేదు. బ్లాకీ ఓపికగా ప్రశ్నించగా ఆమె క్రమేణా తన్ను జిన్లంగ్ యింటికి లాక్కుపోయిన తర్వాత జరిగిన విషయాలన్నింటినీ పూసగుచ్చినట్లు చెప్ప సాగింది.

"ఎందుకని మీ అక్కగారింటికి పోతావన్నమాట!" అన్నాడట

జిన్లంగా: "మీ బావవద్దకు పరుగెత్తిపోతావన్నమాట!" అని జిన్లంగు ఆమెను మొగంవాచేటట్లు అనేకసార్లు కొట్టి గదిలో బంధించాడట. అటు తర్వాత ఆకలిచే మలమల మాడిపోతున్నా గుప్పెడు మెతుకులైనా పెట్టకుండా మేయీచేత బండచాకిరీ చేయించాడట.

"నువ్వు మళ్ళీ షెన్‌జ్యా గ్రామం పోయావా, నీ కాళ్ళు విరగ్గొడతా జాగ్రత్త!" అని అత్తగా రన్నదట.

మేయీ భరించలేకపోయింది. ఆమె సమయంకొరకు ఎదురు చూస్తూ వుంది. ఒకనాటి రాత్రి జిన్లంగ్ ఇంటికి రాలేదు. తెల్లవారే ముందు మేయీ కిటికీ యెక్కి బయటకు దూకింది. దొడ్డి గోడ దూకి పారిపోయి వచ్చింది.

"ఈవిధంగా నేనక్కడ జీవించలేను" అని పూర్వంకన్న నిదానంగా బ్లాకీకి చెప్పింది. "ఆబాలగోపాలం, ముసలి ముతక, చిన్న, పెద్ద, మొగ–ఆడ అన్న భేదం లేకుండా అందరూ జపానువాళ్ళకు వ్యతిరేకంగా పోరాడాలని చెప్పావుకదూ! ఎర్రసైన్యపు స్త్రీ సహాయకదళంలో జేరిపోదలచుకున్నా. నాకు రాయటం, చదవటం రాదు. కాని, నీళ్ళు మొయ్యగలను; పనులు చెయ్యగలను....ఆ దయ్యంముండా వాళ్ళతో వుండేకన్న ఏపనిచ్చినాసరే, చెయ్యటానికి సిద్ధంగావున్నాను!"

బ్లాకీ కనుబొమలు ముడిపడ్డాయ్. దీర్ఘంగా ఆలోచించసాగాడు. "నిన్ను ట్రయినింగుకు పంపుతామనుకో! ఎలాగుంటుంది?"

"ట్రయినింగు మహా మంచిది!" అని వేగంగా దాస్వే వారి సంభాషణలో జోక్యం కలుగజేసుకున్నాడు. "నీ జ్ఞానాన్ని అభివృద్ధి జేస్తుంది. అది....అది....నీకు రాజకీయ పరిజ్ఞానాన్ని యిస్తుంది.... స్కూలుకు పోయినట్టే.... అంతకన్న మరేంగాదు!" అన్నాడు దాస్వే.

"మంచిది. అయితే నేను ట్రయినింగుకుపోతా. ఏమైనాగానీ, నే నింటికిపోను!" అన్నది మేయీ.

ఆమెను పరిచయంజేస్తూ ఒక జాబు వ్రాసిచ్చాడు బ్లాకీ. ఆమె దాస్వే, తదితర విద్యార్థులతోబాటు ట్రయినింగుస్కూలుకు పోయింది....

ఆమె అక్కవారు ఆమెకోసం ప్రతిచోటా గాలించారు. ఆమె ఎక్కడ వుందో పసిగట్టలేకపోయారు.

* * * *

అనేక పెద్ద భవనాలున్న ఆవరణలో కౌంటీ ట్రయినింగు స్కూలు వుంది. బడిపెద్దకు తమ పరిచయ - లేఖలను దాస్వే, తదితరులు సమర్పించుకున్నారు. బడిపెద్దకు ముప్పయి సంవత్సరాల వయస్సు వుంటుంది. అతనిపేరు చెంగ్. బూడిదవర్ణంగల ముతకగుడతో కుట్టిన యూనిఫారాన్ని ధరించాడు. విద్యార్థుల పేర్లను రిజిష్టరులో ఎక్కించుకున్న తర్వాత అతడు మేయీని స్నేహపూర్వకంగా "బడికెందుకొచ్చావమ్మా!" అని అడిగాడు.

మేయీ మొగం కందగడ్డయింది. తత్తర బిత్తర పడింది. ఎలాగయితేనేం. చిట్టచివరకు "ట్రయినింగు పొందటానికి!" అని కక్కేసింది.

ఆమెకు అర్థమయ్యేటంతవరకూ స్కూలు వుద్దేశాన్ని గురించి జాగ్రత్తగా చెన్ వివరించాడు.

"ఓస్! ట్రయినింగైన తర్వాత మే మింటివద్ద ఉండ నవసరం లేదన్నమాట! బయట పని చేయవచ్చునన్నమాట!" అని ఆమె చిరునవ్వు చిలకరించింది.

ఆ హెడ్మాస్టరు నవ్వాడు. ఏదో వ్రాసుకున్నాడు. అటుతర్వాత అతడు దాస్వేను అదే ప్రశ్న వేశాడు.

దాస్వే ముందుకు వచ్చాడు. వంగి సలాంజేశాడు.

"జపానువాళ్ళను తుదముట్టించటాని కని!" పెద్దగా జవాబు చెప్పాడు.

చెన్ నురల సలాంచేశాడు? "నీకు పదిమందిమీద ఆధిపత్యమిస్తారనుకో! వాళ్ళను నడిపే ధైర్యముందా?"

"ఓ! తప్పకుండా!" అని జవాబుచెప్పాడు దాస్వే.

చెన్ తడాడిస్తూ, యితరులను ప్రశ్నించటానికని వాళ్ళవైపు తిరిగాడు.

విద్యార్థులతో ఆ విధంగా భేటీ పూర్తయినతర్వాత వారినందరినీ, హెడ్‌మాష్టరు వివిధ తరగతులుగా విభజించాడు. స్త్రీలకు, పురుషులకు వేర్వేరుగా వుండటానికి స్థలాలు చూపించబడినప్పటికీ, వాళ్ళందరినీ ఒకే తరగతులలో కూర్చోబెట్టి పాఠాలు చెప్పసాగారు. దాస్వే, మేయీ లిద్దరూ ఒకే అధ్యయనగ్రూపులో జేర్చబడ్డారు.

తాను కమ్యూనిష్టునని పరిచయంజేస్తూ తనకు పార్టీ యిచ్చిన జాబు దాస్వేకి అకస్మాత్తుగా గుర్తుకొచ్చింది. అతడా జాబును తన జేబునుండి హడావిడిగా బయటకులాగాడు.

గందరగోళంగా దాన్ని చెన్‌వంక చూపాడు.

"నా సభ్యత్వ' జాబును నే నెవ్వరికివ్వాలి?" అని పెద్దగా అరిచాడు.

చెంగ్ వేగిరంగా, ఆ గదిలో దూరంగా ఒకమూలను కుర్చీలో కూర్చున్న మిస్ చెన్‌వంక జూపాడు. మిస్ చెన్‌కు సలభై సంవత్సరా లుంటాయ్. ఆ అర్హతాపత్రాలను తీసుకోటానికని తన చేతిని జాపుతూ మిస్ చెన్ చిరునవ్వు నవ్వింది.

"అంత పెద్దగా అరవబోక. ఇక్కడ పార్టీ సభ్యులు కానివారు చాలామంది వున్నారు" అన్నదామె చాలా ప్రశాంతంగా.

జరుగవలసిన ప్రాథమిక విధులన్నీ పూర్తిఅయ్యాయ్. ట్రైనింగ్ కాలం ప్రారంభమయ్యింది. ఆ శిక్షణకు అలవాటుపడటానికి దాస్వే, మేయీలు కొంత శ్రమపడాల్సివచ్చింది. పగటిపూట అధ్యయన తరగతు లుండేవి. చర్చలు, సమావేశాలను రాత్రిళ్ళు జరిపేవారు. ప్రతి పనీ యీల వూదటంతో ప్రారంభమయ్యేది. ఉదయాన నిద్రనుండి మేలుకొనటం, రాత్రిపూట నిద్రపోవటం, వ్యాయామం చేయటం, పాటలు

పాడటం.... అలసిపోయేంతవరకు జరుగుతూవుండేవి. పూర్తి కార్యక్రమమిది. ఎక్కడా ఒక్కనిమిషం ఓరుపోవడానికి వీలుండేదికాదు.

ఒకేఒక భోజనశాలహాలులో, రమారమి మూడు వందలమంది విద్యార్థులందరూ కలసి భోజనం చేసేవారు. ఆహారం చాలా స్వల్పంగా వుండేవి. జొన్నకూడు, దుంపపులుసూ వుండేవి. వారికి భోజనసమయం చాలాకొద్ది. ఏ బాధాలేకుండా దాన్నే చకచకా భుజించేవారు. మూతులు కాలే పులుసు త్రాగటంమూలంగా మేయీకి పెదవులమీద బొబ్బలెక్కినాయి.

రాత్రిపూట మగవిద్యార్థులు, ఒక పెద్ద గదిలో నిద్రపోయేవారు. పక్కవేసుకోవటానికి గడ్డితో నేసిన చాపలుండేవి. ఇటుకరాళ్ళను తలగడ దిండ్లగా వుపయోగించేవారు. విద్యార్థినులకు యింత కఠినంగావుండేది కాదు. వాళ్ళు, ఒక కాంగ్‌మీద నిద్రించేవారు. వాళ్లు నేలమీద నిద్రించాల్సిన అవసరంలేదన్న విషయం యదార్థమైనా, వాళ్ళు నిద్రించే కాంగ్‌లు వేడిచేయబడి వుండేవిగావు. పీక్కుతినే చలిగాలి వస్తూవుండేవి. మేయీ పక్కచుట్టమీ తెచ్చుకోలేదు. ఆమె యింకొక విద్యార్థినితో కలసి నిద్రపోయేది. ఆ విద్యార్థినిపేరు తియాన్. వాళ్ళిద్దరిలో ఎవరోఒకరు నగం కప్పుకోకుండా వుండేవారు. అంతే, వాళ్ళకు చాలీచాలని దుప్పటి ఒకటే వుండేవి. మేయీ పిక్కలలోనికి చలిదూరి, వాటిని కొయ్యబారించేది. తన మూలంగా మేయీ అర్ధరాత్రి సమయంలో మేల్కొనేది. బాధతో ఏడవాల్సివచ్చేది. మా అక్కయ్య దగ్గరే వుండిపోతే బాగుండిపోయేదని అనుకొనేది. ఈ బడికి రాకుండావుంటే బాగుండిపోయేవి.

తియానుకు హైస్కూలుచదువు పూర్తిఅయింది. ఆమె పార్టీసభ్యురాలు. ఆమె మేయీ అవస్థను జూచి, ఆమెపిక్కలను రుద్దేది. సొంత అక్కగారిలాగున ఓదార్చేది. కొన్ని సమయాలలో తియాన్ వేడివేడి చిన్నచిన్న రొట్టెలను కొనేది. "నువ్వొకటి తిను; నేనొకటి తింటా. ఏం? మనమిద్దరం కలసి కష్టపడి చదువుకొందాం. ఇంటివిషయాన్ని గురించి ఆలోచించవద్దు" అని అంటూ ఆ వేడివేడి రొట్టెలను మేయీతో పంచుకొని తినేది.

అత్తవారింటికి పోవాలనే అభిలాష మేయూకి లేనేలేదు. ఆమె తాను అక్కగారింట్లో వున్నా, ఎప్పుడో ఒకప్పుడు జిన్లంగ్ వచ్చి తన్ను పట్టుకుపోతాడన్న విషయం ఆమెకు తెలుసు. ఆమె కనీసం బడిలోనైనా స్వేచ్ఛగా వుండగలుగుతూవుంది. ఆమె తన జుట్టును పొట్టిగా కత్తిరింపు వేయించుకుంది. దాన్ని బయటికి కనిపించేలాగున చెయ్యాలని నిశ్చయించుకుంది.

రాత్రిపూట దాస్వే కూడా చలితో బాధపడుతున్నాడు. నిద్రపట్టక యాతనపడుతున్నాడు. వీటన్నిటికన్నా అతణ్ని వేధిస్తున్న విషయా లేమంటే, అధ్యయన తరగతులు. అక్కడకు వచ్చిన విద్యార్థులలో అన్నిరకాల జీవితపథాలనుండీ వచ్చినవారున్నారు. అందులో కొంత మందికి కొద్దిగా చదువు ఉంది. మరికొంతమందికి చదువూ సంధ్యా లేదు. వాళ్ళు అనేక రకాల దుస్తులు వేసుకొనేవారు. అనేకతీర్లుగా దుస్తులు ధరించేవారు. దాస్వే శుద్ధ రైతుబిడ్డలాగున దుస్తులు ధరించేవాడు. చిరిగి పోయిన బొంతజాకెట్టూ, పడిపట్టు, నడికట్టులో చురకత్తిలాగున పొడు గాటి పైపును దోపేవాడు. దుమ్ము ధూళినుండి, ఎండనుండి రక్షించుకో టానికని తలకు తెల్లని ముతకగుడ్డ చుట్టేవాడు.

ఆవరణలో ఎండలో కూర్చుని, అధ్యయన తరగతులను నడుపు కొనేవారు విద్యార్థులు. దాస్వే అందరికన్నా ముందుభాగంలో కూర్చునే వాడు. చెప్పిన ప్రతి విషయాన్నీ బుర్రకు పట్టించుకోటానికిగాను చెవులు నిక్కించి వినేవాడు. "ప్రస్తుత పరిస్థితులు" అన్నా, "సంయుక్త సంఘ టన" అన్నా, "గెరిల్లా ఎత్తుగడలు" అన్నా అతనికి అర్థమయ్యేవిగావు. ఈ శబ్దాలన్నీ అతనికి అయోమయంగా వుండేవి. ఒక్కటీ బోధపడేవి గాదు.

పాఠాలు పూర్తికాగానే ఎక్కడివాళ్లు అక్కడ విడిపోయేవారు. వారివారి గ్రూపులుగా ఏర్పడేవారు. చర్చలు సాగించేవారు. దాస్వే, మేయీలు మాత్రం నిశ్శబ్దంగా కూర్చునేవారు. ఎవరైనా వారిని మీరు మాట్లాడరేమంటే దాస్వే "నేను రైతుబిడ్డను; పంటలనుగురించి నన్ను

మాట్లాడమంటే మాట్లాడగలను. ఉపన్యాసమిమ్మంటే నాచేత నేమవుతుంది?" అనేవాడు.

ఉపాధ్యాయులలో ఒకరు దీర్ఘ యాత్రలో (లాంగ్ మార్చ్) పాల్గొన్నాడు. అతడు చక్కని హూనాన్-వుచ్చారణతో మాట్లాడేవాడు. అతడు దాస్వేని ఒకప్రశ్నవేస్తే దాస్వే కళ్ళప్పజెప్పేవాడు అంతే. ఇంతేగాక ఈ కష్టాలతోపాటు దాస్వేకి మరియొక కష్టంకూడా వుంది. దాస్వేకి రాయటం చేతగాదు. ఉపన్యాసాలమీద చకచకా నోట్సు వ్రాసుకొంటూ వున్న కొంతమంది విద్యార్థులను జూసి "నేనావిధంగా రాయగలిగితే ఎంత హాయిగా వుంటుంది!" అనుకునేవాడు.

మేయీకి వల్లమాలిన సిగ్గు. ఒకనాడు కొంతమంది విద్యార్థులు ఆమెను వప్పజెప్పవలసిందిగా బ్రతిమాలారు. మేయూ నిజంగా ఏడ్చింది. అయినప్పటికీ, ఆ గ్రూపువాళ్ళను అంటిపెట్టుకొనే వుంది—"కొన్ని పాయింటను గుర్తుంచుకోండి. వాటిని వప్పజెప్పండి. ఆ విధంగా మీరు క్రమేణా నేర్చుకోగల్గుతారు" అని వారికి అధ్యయనగ్రూపు సభ్యులు సహాయిచ్చారు.

నిద్రపట్టక, దాస్వే అనేక రాత్రుళ్ళు అటూ యిటూ పక్కమీద పొర్లాడేవాడు.

"మన మిద్దరం ఒక మొద్దులజంట" అని ఒకనాడు మేయూతో అతివిచారంగా అన్నాడు దాస్వే.

ఆమె మనస్సుకూడా బాధపడసాగింది. "మనం రోజూ బడివాళ్ళు యిస్తున్న తిండి మేస్తున్నాం. మనం మన యిళ్ళకు తిరిగి వెళ్ళినతర్వాత మ. వాళ్ళకు మన మొగా లెలా చూపించగలుగుతాం? ఇతరులతో కలుసుకోలేమని తోస్తూవుంది" అన్నదొకనాడు మేయూ, దాస్వేతో.

"నువ్వన్నదాంతో నే నేకీభవించను; ఇతరులు నేర్చుకోగలిగినప్పుడు, మనమూ నేర్చుకోగలం!" అన్నాడు దాస్వే నిశ్చయాత్మకంగా.

ప్రతిరోజూ, విరామకాలంలో వాళ్ళకు హెడ్ మాష్టరు, క్రొత్త అక్షరాలు కొన్ని నేర్పేవాడు. తన పడకమీద రాత్రిపూట ఆ అక్షరాలను

తన వ్రేలితో గుండెపై వ్రాసుకొనేవాడు దాస్వే. ఆ విధంగా అక్షరాలు దిద్దసాగాడు. అతడు తన చెవులను మరింత శ్రద్ధగా నిక్కించి ఉపన్యాసాలు వినసాగాడు. వినగా వినగా, అతనికి ఉపన్యాసాలలో కొంతకొంత బోధపడసాగింది. పబ్లిక్‌లో మాట్లాడటానికి నిశ్చయించుకున్నాడు. ఒకనాడు ఎలాగైతేనేం చర్చల గ్రూపులో నిలబడ్డాడు. లేచి నుంచునసరికి ముచ్చెమటలు పోసినాయి నాలుకతో పెద్ద యుద్ధంచేశాడు. ఒక బొచ్చెడు సందర్భశుద్ధిలేని పదజాలాన్ని కుమ్మరించాడు. మేయీకూడా తన నాలుకతో యుద్ధం జేసింది. ముఖం కందగడ్డలాగున ఎర్రబడింది. అతిప్రయాస మీద కొన్ని వాక్యాలను బయటకుగుంజి, కుమ్మరించింది. మేయీ, దాస్వేలుచేసిన యీ ప్రయత్నాన్ని జూచి గ్రూపుసభ్యులు హర్షించారు. వారికి ప్రోత్సాహమిచ్చారు.

బడిలోకల్లా కష్టపడి పనిజేసేవాడు దాస్వే. నిద్రశాలలో అందరికన్న పెందలకడనే మేల్కొనేవాడు. తమ నీళ్ళతొట్టెలను శుభ్రంచేసేవాడు. అటుతర్వాత ఆవరణనూ, ఆఫీసులనూ ఊడ్చేవాడు. నిత్యజీవితములో నమూనా విద్యార్థిగా అతణ్ణి, హెడ్‌మాష్టర్ చెంగ్ బహిరంగముగా పొగడాడు. ఈ పొగడ్త, దాస్వేను గాబరాపెట్టింది. ఇలాంటి పొగడ్తలను పొందటం అతనికి అలవాటులేదు.

"రైతుబిడ్డలం ఏదో ఒకమారు కండబలాన్ని చూపించగలంతప్ప అంతకన్న మాకేమి చేతగాదు" అన్నాడు దాస్వే సిగ్గుపడుతూ.

తాను కొంత అభ్యుదయాన్ని సాధించగలుగుతున్నానని దాస్వే గ్రహించుకోగలిగాడు. కానీ మేయీ వెనకపడుతూ వున్నదేమోనని భయపడసాగాడు. ఒకనాడు ఆమెను అడిగాడు— "ఇప్పు డెలాగుంది? యీ రకపు జీవితానికి యిప్పు డలవాటుపడ్డావా?"

కురచగా కత్తిరించుకున్న జుట్టుకలిగిన తలనాడించింది. సూర్యాతపానికి నల్లబడిన ఆ ముఖంలో చిరునవ్వు తొలకరించింది. ఆ తొలకరింపులో బుగ్గలు సొట్టలుపడ్డాయ్. విస్ఫారితనయనాలు మహదానందంతో విలసితమయ్యాయి. నవనవోల్లాసం ఆమెలో తొణికిసలాడింది.

"పరిపూర్ణంగా!" అని జవాబిచ్చింది.

జపానువాళ్ళకు వ్యతిరేకంగా తాము జరుపవలసిన పోరాటంలో రానున్న కష్టాల నెదుర్కొనుటలో తమకు ఈ బడిలోని శిక్షణ శ్రమ మయ కఠినజీవిత మెవిధంగా తోడ్పడగలదో, మిస్ చెన్ తనకు వివరించిందని ఆమె దాస్వేతో చెప్పింది. అన్నికాలాల కష్టాల నెదుర్కొన గలిగి యుండాలని ఆమె బోధించిందని చెప్పింది.

దాస్వే సంతోషంతో ఉప్పొంగిపోయాడు. మేయీ నిశ్చయంగా అభివృద్ధిజెందింది? అనుకోసాగాడు. ఆమె పొట్టిజుత్తు గాలిలో మర్మర ధ్వని చేస్తూవుంది. ఒయ్యారమొలకబోస్తూ ఆమె నడుస్తూ పోతూవుంటే దాస్వే తదేకధ్యానంగా చూడసాగాడు.

* * * *

ఆరోజున దాస్వేకు పొగాకు అయిపోయింది. రెండుగంటలు పాటుబడ్డాడు. మెల్లగా దగ్గరలోనున్న షాపుకు జారుకున్నాడు రెండు సిగరెట్లు కొన్నాడు. స్కూలు క్రమశిక్షణ ననుసరించి ఎవ్వరూ సిగరెట్లు కొనకూడదు. మగవాళ్ళ స్నానాలగదిలో దాక్కున్నాడు. సిగరెట్టు ముట్టించేడు. ఉల్లాసంగా ఒక్కదమ్ముపీకి పొగ వదలుతున్నాడు. ఇంతలోనే అక్కడకు మరియొక విద్యార్థి వచ్చాడు. సమయం మించిపోయింది. ఆదుర్దాగా దాస్వే సిగరెట్టును కాలిక్రిందవేసి నలిపాడు. విద్యార్థి దాస్వేవంక జూచాడు. అతనిమీద రిపోర్టుచేయటానికి ఆ విద్యార్థి బయటకు పోయాడు.

ఆ సాయంత్రం దాస్వేకి సంబంధించిన అధ్యయన గ్రూపు సమావేశం జరిగింది. అందరూ పట్టుదలగా అతన్ని దుయ్యబట్టారు.

"సూచనల ప్రకారం ఎందుకు నడచుకోవు?....క్రమశిక్షణంటే నీకు అర్థం తెలియదా?"

దాస్వేముఖం ఎర్రబడింది. నత్తురుబోతూ దాస్వే "నేనా....నే....నా....యిది మొదటిసారి....నాదగ్గర పొగాకు లేదు....నన్ను వదిలెయ్యండి....మీరు నన్ను ఈతడవ క్షమించాలి....క్షమిస్తే...."

అతడు తనమాటలు పూర్తిచేయకమునుపే ఒక్కొక్క విద్యార్థి లంకించుకున్నాడు. "మిస్టర్ చైర్మన్, నేనొక విషయం చెప్పాలి ...." నాలుగుచెరగులనుంచీ విమర్శలు బయలుదేరాయి. మేయీకూడా ఆ విమర్శలో ఒక సమిధ తగిలించింది. "మిస్టర్ చైర్మన్, నేనొక విషయం రిపోర్టు చేయవలచాను...." వాళ్ళంతా అతడు విమర్శనను అంగీకరించడనీ, అతడిలో కృత్రిమముందనీ విమర్శలు కుమ్మరించారు.

"వెధవ సిగరెట్టొకటి తగలేస్తే ఏం? ఏం కొంపలు మునుకొనిపోయాయ్!" అని కోపంగా తనలో అనుకోసాగాడు దాస్వే.

"దీనమ్మ—జీవితాంతంవరకు పొగాకే తాగను!" అని శపథం చేస్తూ మోకాలిమిద తనపెపును విరగ్గొట్టాడు. "నేను మారగలనో లేదో చూదుదుగాని! నేనలా చేయకపోతే నా పేరు దాస్వేగాదు!" కోపం ముప్పేట పెనవేసుకోగా పైపు ముక్కలను నేలమీదకు విసిరికొట్టి, దాస్వే అక్కడనుండి వెడలిపోయాడు.

ఆ మరునాడుకూడా దాస్వే కోపంగానే వున్నాడు. మేయీతోసహా ఎవరితోనూ మాటాడలేదు. ఎవరైనా పలకరించినా జవాబుచెప్పలేదు. మధ్యాహ్నం హెడ్‌మాష్టర్ చెంగ్, తన ఆఫీసుకు దాస్వేని పిలిపించాడు. షూహోజనిత గాయాలన్నింటినీ అతను దక్కేయటానికి అవకాశమిచ్చాడు. అటుతర్వాత చిరునవ్వు నవ్వుతూ ప్రశాంతంగా వోపిగ్గా చెంగ్ వివరించసాగాడు.

"ఆ విమర్శలన్నీ — సులువు, బరువు విమర్శనలన్నీ — నీమంచికొరకే. నీవు విమర్శనను స్వీకరించలేకపోతే నీవు అభ్యుదయాన్ని సాధించజాలవు. నీవు పార్టీసభ్యుడివి. ఇతర విద్యార్థులకన్న క్రమశిక్షణను అమలుజరుపుటలో నీవు ఆదర్శమూర్తివి గావాలి. ఇతరులకు ఆదర్శవంతంగా వుండాలి నీవు.

క్రమశిక్షణకు సంబంధించిన అనేక విషయాలను చెంగ్ దాస్వేకి వివరించాడు. దానిని ప్రతిభావంతంగా, ఫలసాధనంగా ఎలా అమలుజరపాలో, అమలు జరపాల్సిన అవసరమేందుకు గలదో వివరించాడు. చెంగ్ చెపుతున్న విషయాలను వింటున్న కొలదీ దాస్వేలో శాంతం

ప్రవేశించసాగింది. ఓట్టచివరకు అతడు "నన్ను సరిచేసినందుకు ధన్య వాదాలు. నాకిప్పుడు అర్ధమయింది" అన్నాడు.

ఆనాటి సాయంత్రం పార్టీ సభ్యుల సమావేశం జరిగింది. ఆ సమావేశంలో తాను తప్పుచేసినట్లుగా దాస్వే వప్పుకున్నాడు. అంతేగాక పెద్దగా నవ్వుతూ 'నేను మొరటుగా వ్యవహరించాను. నా మనస్సు యిప్పుడు కడిగేసినట్టున్నది. విషయాలు స్పష్టంగా బోధపడ్డాయ్. మీ రంతా నాలో పొరబాట్లమైనా వుంటే యికముందు ఎత్తిచూపుతారని ఆశి స్తున్నాను. నాలోని ప్రోతుస్వభావం మళ్ళా వీధిలోబడి పరుగెత్తకుండా అరికట్టగలనని మీకందరకీ వాగ్దానం జేస్తున్నాను" అన్నాడు.

సభికులంతా నవ్వారు. ఒకమారు అతనిలోని తప్పులను సరిచేస్తే మళ్ళీ తప్పులేమి చేయడన్నారు. అభివృద్ధి జెందుతూ వుంటాడని అన్నారు.

దాస్వే అభివృద్ధిజెందసాగాడు. అదేవిధంగా మేయాకూడా అభి వృద్ధి జెందింది. ఆమె ఎంతవరకు అభివృద్ధి జెందిందంటే మిస్ తియాన్ ఆమెను కమ్యూనిస్టుపార్టీలో చేరవలసిందిగా ప్రోత్సహించాలని ఆలో చిస్తూ వుంది.

"ఎవరు మంచివాళ్ళనుకుంటున్నావ్? కొమింటాంగా? లేక కమ్యూ నిస్టులా?" అని తియాన్ ఆమెను అడిగింది.

"కమ్యూనిస్టులే!" అన్నది మేయా.

"ఏ పార్టీలో చేరుదామనివుంది?" అని మరల తియాన్ ఆమెను ప్రశ్నించింది.

"నేను ఏ పార్టీలోను జేరదలచుకోలేదు. నేను జపానువాళ్ళతో పోట్లాడదలచుకొన్నా. ఎర్రసైన్యం స్త్రీ సహాయకదళంలో జేరాలనేదే నా కోర్కె" అని మేయా జవాబు చెప్పింది.

తన బావయైన ప్లాకీత్సే కమ్యూనిస్టుకాబట్టి అతణ్ణి ఏవిధంగా వేటాడిందీ మేయాకి గుర్తుంది. అందువలన పార్టీలో జేరటానికి ఆమెకు భయమేసింది. అంతేగాక స్త్రీ సహాయకదళంలో స్వేచ్ఛ. స్వాతంత్ర్య

మయ జీవితం గలదని ఆమె గాఢంగా విశ్వసిస్తూవుంది. అందువలన ఆ జీవిత మామెకు నచ్చింది.

తియాన్ మేయిాని భుజాలు పట్టుకుని చూపింది. "తెలివితక్కువ పెద్దమ్మా! 'కమ్యూనిస్టుపార్టీ'యే లేకపోతే, ఎర్రసైన్యమే వుండేదికాదు. దాన్ని ఈనాము ఎర్రసైన్యమని పిలవటంలేదుకూడా—బాలూ అని పిలుస్తున్నారు. లేకపోతే అష్టమమార్గ సైన్యమని పిలుస్తున్నారు. పార్టీ సభ్యురాలివైతే, నీవు పార్టీ మీటింగులకు హాజరుకావచ్చు. దేశంలో ఏమిజరుగుతున్నదీ తెలుసుకోవచ్చు. అభివృద్ధి చెందవచ్చు. ఈ సమస్యనుగురించి నీవు తీవ్రంగా ఆలోచించుకోవాల్సిన అవసరముంది.

మేయీ ఆలోచించింది; దీర్ఘంగా ఆలోచించింది. కాని ఒక నిశ్చయానికి రాలేకపోయింది. ఆమె దాస్వేను సలహా అడిగింది.

"అంత మూగదానిలాగున ఎలా ప్రవర్తించావ్?" అని దాస్వే కోపగించాడు. "సభ్యత్వమనేది పార్టీలో అతి రహస్యమైన విషయం. అలాంటి విషయాన్నిగురించి నన్నెలా అడుగగలిగావ్?" అన్నాడు. తాను రహస్యంగా వుంచాల్సిన విషయాలను కక్కేస్తున్నానన్న విషయాన్ని గమనించకుండా దాస్వే తన ఉపన్యాసాన్ని సాగించాడు: "నేను పార్టీ సభ్యుణ్ని కాబట్టి సరిపోయింది, లేకపోతే పార్టీ వ్యవహారాలను యితరులకు చెప్పినట్లయ్యేది!"

మేయీ భయభ్రాంత అయింది, నేనేంజేయాలి? నేను నీతో అప్పుడే చెప్పేస్తినాయే!" అన్నది.

దాస్వే అతిరహస్యంగా "నువ్వు పార్టీలో జేరిపో! ఇలాంటి వ్యవహారాలలో యుక్తాయుక్త జ్ఞానాన్ని నేర్చుకోగలుగుతావ్!" అన్నాడు.

తాను కమ్యూనిస్టు కావలచుకున్నానని మేయీ మిస్ తియాన్‌తో చెప్పింది. పార్టీ సభ్యత్వానికి సంబంధించిన కాగితాలన్నింటినీ పూర్తి జేయుటలో మేయీకి తియాన్ తోడ్పడింది. కమ్యూనిస్టుపార్టీలో నూతన సభ్యులను జేర్చుకొనేటప్పుడు జరుపబడే కార్యకలాపాలు మేయీని.

మరి పదిమంది యువతులను జేర్చుకొనేటప్పుడు జరుపబడ్డాయి. పార్టీ జెండా ఎదుట, చైర్మన్ మాసేయూంగ్ చిత్రపటం ఎదుట వారు పార్టీకి శాశ్వతంగా విశ్వాసపాత్రులుగా వుండి పని చేయగలమన్న శపథాన్ని తీసుకున్నారు.... అటుతర్వాత మేయీ, దాస్వేలిద్దరూ పార్టీసభ్యులకు జరుపబడుతున్న అధ్యయన తరగతులకు హాజరయ్యారు.

* * * *

ఒకనాటి మధ్యాహ్నం మధ్యరకం ఎత్తుగల మనిషి యూనిఫారం ధరించినవాడొకడు బడికి వచ్చాడు. హెడ్‌మాష్టరుగారిని చూడాలన్నాడు. వాడి వయస్సు రమారమి యిరవై యేడు, యిరవై యెనిమిది సంవత్సరాలుంటుంది. వాడి నోటినిండా బంగారుపళ్ళున్నాయి. చంకక్రింద ఒక పాకేజి వుంది. హెడ్‌మాష్టరు చెంగ్ అతణ్ణి ఆహ్వానించాడు. వాడు గౌరవపురస్కారంగా సలాంజేసి మీ పాఠశాలలో మేయీ అనే విద్యార్థిని వున్నదా యని అడిగాడు. ఉన్నదని చెంగ్ జవాబిచ్చాడు. ఆ క్రొత్తవాడు తాను హోజ్యాంగ్-జపాను వ్యతిరేకసైన్యంలో పనిజేస్తున్నాననీ, ఆ సైన్యం జనరల్ లూ సర్వసేనాధిపత్యంక్రింద పనిజేస్తూ వున్నదని చెప్పాడు. మేయీ తన భార్యయని జెప్పాడు. పాఠశాలలో ఆమెతర్ఫీదు పొందటం తనకు పూర్తిగా యిష్టమని చెప్పాడు. ఆమెను చూడటానికి వచ్చాననీ, ఆమెకొక పాకేజి యివ్వదలచాననీ చెప్పాడు. చెంగ్ అదంతా బాగున్నదని చెప్పి, ఒక్క నిమిషం మీరిక్కడే వుండండని చెప్పి ఒక్క నిమిషం మీరిక్కడే వుండ డని చెప్పి మేయీని పిలవటానికి వెళ్ళాడు.

జిన్లంగ్ రెండు సిగరెట్లు పీకేసరికి హెడ్‌మాష్టరు ఒంటరిగా తిరిగివచ్చాడు. జిన్లంగ్‌ను జాగ్రతగా పరీక్షించాడు. "మేయీ నిన్ను చూడటానికి యిష్టపడటంలేదు. ఆమెను కొడుతూవుంటావని అంటూ వుంది."

నిరసనగా జిన్లంగ్ నవ్వాడు. "మొగుడూ, పెళ్ళాలమధ్య గృహ

ప్పీఁద్రాలుండవా? ఇంతాచేస్తే నేనామెకు శత్రువును కాదుగదా! శాశ్వతంగా నా ముఖం చూడనని ఆమె నిరాకరించగలదా? నేను సైనంలో సైనికుణ్ణి హెడ్ మాష్టరు చెంగ్‌గారూ! ఆమె యిలాచేయటం సబబేనని భావిస్తున్నారా?"

"భార్యాభర్తలమధ్య సామరస్యాన్ని కోరుతాం" అని చెంగ్ నిదానంగా జవాబు చెప్పాడు. "ఆమెను చూడలని కోర్కెవుంటే చూడవచ్చును. కాని ఆమెను కొట్టనని వాగ్దానం చేయాలి మీరు."

జగత్తులో పవిత్రమైనవాటన్నింటిమీద ఒట్టుపెట్టుకున్నాడు జిన్లంగ్. మేయీని తీసుకువచ్చాడు హెడ్‌మాష్టరు చెంగ్.

అతి ఆప్యాయంగా ప్రేమంతా ఒలకబోస్తూ జిన్లంగ్ ఆమెను పలుకరించాడు. ఆప్యాయంగా అనేక ప్రశ్నలువేశాడు. అటుతర్వాత పాకేజి విప్పాడు. దానిలోనుండి స్త్రీలు ధరించే పొడిగాటి సెంత - గౌను ఒకటి బయటకు తీశాడు.

"వేసుకో! చలిగాలి వేస్తోంది. నువ్వు జబ్బుపడటం నాకిష్టంలేదు. నీకేమైనా కావాల్సివస్తే నాకు చెపుతూవుండు. గౌను తొడుక్కో. మనమొక హోటలుకు పోయి, కడుపునిండా తినివద్దాం!" అని జిన్లంగ్ ప్రేమ పుట్టిపడేటట్లు అన్నాడు.

అత వావిధంగా చక్కగా తనతో వ్యవహరించట మెన్నడూ మేయీ ఎరుగదు. మెహృదయం మెత్తపడింది. బుట్టలోపడింది. హెడ్ మాష్టరునుండి అనుమతి తీసుకొని ఆమె జిన్లంగ్‌తో బయటికి పోయింది.

ఆ రోజు అసహ్యంగా మబ్బుగా వుంది. గాలిమాత్రం లేదుగాని, చలి ఎముకలను పీక్కుతింటూవుంది. హోటల్‌లో వీళ్ళకోసం యెదురు జూస్తూవున్న లైవే, సివోలు సౌఖ్యప్రదమైన వెచ్చనిగదిని మాట్లాడివుంచారు. అమిత ఖరీదుగల భోజనాన్ని, ద్రాక్షాసవాన్ని జిన్లంగ్ తెప్పించాడు.

"మేయీ! నువ్వు యిల్లు వదలి పోయేటప్పుడు మాతో ఒక్క మాటయినా చెప్పకపోయావ్! బంధువులు, స్నేహితులు, యిరుగుపొరుగు

వాళ్ళువాళ్ళేమిటి ప్రతిపెధవా నన్నుజూసి నవ్వాడు. నన్ను అసహ్యకరమైన పరిస్థితిలోకి తోసిపోయావ్!" అన్నాడు జిన్లంగ్ భోజనంమధ్యలో.

"నేను కష్టపడి చదువుతున్నా. చదువు పూర్తికాగానే జపాను—వ్యతిరేకమైన ప్రతిఘటనోద్యమంలో పనిజేస్తా. అప్పుడు నన్ను చూచి సిగ్గుపడాల్సిన అవసరముండదు. గర్వపడతావ్!" అని జవాబు చెప్పింది మేయీ.

"ఆడాళ్ళకి జుట్టు పొడుగ్గావుంటుంది; కాని బుద్ధి పొట్టిగావుంటుంది ఏమైనాగానీ ఆడదేం పని జేయగలుగుతుంది. నీవు నాతో యింటికి వచ్చేయటం ఉత్తమం. మా యింట్లో నీకింకా స్థానముంది" అన్నాడు జిన్లంగు.

అతని వన్నాగ మేమిటో మేయీ కిప్పు డర్థమయింది.

ఆమె ముఖం నల్లబడింది. "నన్ను చావమోదిన కొంపలో అడుగు పెట్టటం నా కిష్టంలేదు."

"నిన్నుకొట్టింది మా అమ్మ. నేనుగాదుగా! నేనామెతో మాట్లాడేశా! కొన్నిసమయాలలో నా వళ్ళు నా వశంలో ఉండదని వప్పుకుంటా. అయితే నన్నొదిలిపెట్టి శాశ్వతంగా దూరంగా వుండిపోజాలవు."

రుచికరమైన ఆ పదార్థాలన్నీ మేయీకి వెగటుగా తోచినాయ్. ఆమెలేచి నిలబడింది. "నేను మళ్ళీ బడికిపోవాలి. వాళ్ళు నాకోసం ఎదురు చూస్తూవుంటారు. నే నొచ్చి యిప్పటికే చాలా సేపైంది" అన్నది మేయీ.

జిన్లంగు ఆమెను మరల కుర్చీలో కూలేశాడు. "అంత తొందరేమిటి?" అన్నాడు.

వాళ్ళు విసుగ్గా భోజనాన్ని పూర్తిచేయటం, మేయీ గమనించినది. లైవే, సివోలు బయటికి పోయారు. జిన్లంగు హోటలు వాళ్ళకు బిల్లు చెల్లించాడు.

"నీవు ఈ రోజున నాతో వస్తున్నావ్" అని, "పోదాం పద!" అన్నాడు జిన్లంగు.

"మొట్టమొదట హెడ్‌మాష్టరుతో చెప్పాలి!" అన్నది మేయీ ఉద్వేగంగా. ఆమె కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

"నేనా బాధ్యత తీసుకుంటాలే" అంటూ జిన్లంగు ఆమెచేతిని మోటుగా లంకించుకున్నాడు. తలుపువైపువెళ్ళోస్తూ "నువ్వేమీ దాని విషయం పట్టించుకో నవసరంలేదు" అన్నాడు.

తెరచివున్న ద్వారంద్వారా ఆమె బయటకు చూచింది. జిన్లంగు యొక్క తొత్తులిదరూ, ఒక గుర్రాన్ని తీసుకొనివచ్చి తమకోసం వేచి యుండటాన్ని ఆమె గమనించింది. అతి విపరీతంగా ఏడుస్తూ, మేయీ తన కాళ్ళతో గుమ్మాన్ని తన్నిపట్టింది. ద్వారబంధాన్ని యిరుప్రక్కలన్నీ చేతులతో గట్టిగా పట్టుకొంది. అక్కడనుండి ఒక్కఅడుగైనా కదలటానికి నిరాకరించింది. జినంగు ఆమెను గుంజసాగాడు.

"నిన్ను బలవంతాన లాక్కుపోతా!" అని బొబ్బరించాడు జిన్లంగు.

హోటలులోనూ. వీధిలోనూ జనం ప్రోగయ్యారు. జిన్లంగు పిస్తోలు బయటికితీసి వూపసాగాడు. "ఏమిటోయ్! మీరంతా! ఏముంది వింత! ఇది నా పెళ్ళాం! యింటికి లాక్కుపోతున్నా! ఇక్కడ చూడటాని కేమిలేదు. ఫోండి! ఫోండి!" అని అరచాడు.

జనం దారియిచ్చింది.

పెనగులాడుతున్న మేయీని లైవే. సిపోలు తమ చేతులతో పైకెత్తి గుర్రంమీద కూర్చోబెట్టారు. గుర్రాన్ని రోడ్డుమీద నడిపించుకొనిపోసాగారు. చేతిలో పిస్తోలు వూపుకుంటూ జిన్లంగు గుర్రం వెనుకగా నడుస్తున్నాడు.

సీసంలాగున్న ఆకాశంనుండి మంచు ముమ్మరంగా కురియసాగింది. దసుతెరలలాగున, కరడుగట్టించే మంచుగాలి వేయసాగింది. చలితోనూ, భయాందోళనలతోను, మేయీ గజగజ వణకసాగింది. ఆ పట్నపు పరిసరప్రాంతాలకు జేరుకోగానే, ఆమె గుర్రంమీదనుండి అకస్మాత్తుగా క్రిందకు దుమికింది. కొన్నిగజాలు దొర్లింది. తడబడుతూ లేచింది. గొంతు పగిలేటట్లు బొబ్బలేయసాగింది.

జిన్లంగ్ తనతుపాకితో, చురుకుగా ఆమెను పొడవసాగాడు. "పూం వదు ! లేకపోతే చంపేస్తా !" అని తిట్టసాగాడు.

"అయితే చంపు ! నే కదలను !" అని మెయీ ఎదురుతిరిగింది.

తన నడుముకు కట్టుకొన్న బండబెల్టును జిన్లంగ్ వూడదీశాడు. కొట్టడానికి సిద్ధమయ్యాడు. ఇంతలోనే, గుట్టశిఖరంమీద రొప్పుతూ పరుగెత్తుకొస్తూవున్న కొంతమంది మనుష్యులు కనిపించారు. వాళ్ళు బడిలోని విద్యార్థులే ! వాళ్ళకు నాయకత్వం వహిస్తున్నాడు డాస్నే.

అమాంతంగా జిన్లంగ్ గుర్రంమీదకు దూకాడు. మెయీవంక ప్రేలూపుతూ, "సరేలే ! నువ్ మొండిముండవ్!" అని మొరిగాడు. "మళ్ళీ నీ పనిపడ్తా !"

గుర్రం డొక్కల్లో తన కాళ్ళనుగుచ్చి, గుర్రాన్ని వేగంగా పరుగెత్తించుకుపోయాడు జిన్లంగ్. వాడివెంట పరుగుచ్చుకున్నారు వాడి తొత్తులిద్దరూ. సుళ్ళుతిరుగుతూవున్న మంచులో వెంటనే వారు అదృశ్యమయ్యారు.



# 3 అధ్యాయం

హోజ్వాంగ్ గ్రామానికి తిరిగివచ్చాడు జిన్లంగ్. సైన్యంలో పిచ్చిగా తిరుగిసాగాడు. జపాను ప్రతిఘటనోద్యమంలో ఒక భాగంగా ఆ హోజ్వాంగ్ సైన్యం భావించబడినప్పటికీ అది తన కాలాన్నంతనీ రైతాంగప్రజలను పీల్చి పిప్పిజేయటంలో వినియోగించేది. దాని సైనికు లందరూ ఈనాటికీ హో ను తమ వ్యక్తిగత యుద్ధస్వామిగా భావిస్తున్నారు. వాళ్ళకు తిండిలోనూ, వ్యభిచారం చేయటంలోనూ, జూదమాడుటలో మాత్రమే ఆసక్తి హెచ్చు. అవంటేనే వాళ్ళకు రుచిస్తాయ్. ఒక లంజ వ్యవహారంలో జిన్లంగుకు, జీవోకు మధ్య తీవ్రంగా పోట్లాట పడింది. ఒకళ్ళను చూస్తే యింకొకళ్ళకు అసూయ ఏర్పడింది. కక్షలు, కావేషాలు పెచ్చుపెరిగాయి. కొన్నిదినాలు గడచిన తర్వాత ఒకనాడు "అకస్మాత్తుగా" జీవో తుపాకి దానంతటదే ప్రేలిపోయింది. దానిగుళ్లు జిన్లంగ్‌పొట్టలో దూరినాయి. ప్రమాదకరమైన గాయాన్ని గలుగజేశాయ్. జిన్లంగ్‌కు చచ్చినంత పని అయింది....

హోజ్వాంగ్ సైన్యం చేస్తున్న దుశ్చేష్టలతో చుట్టుపల్ల గ్రామాల రైతాంగప్రజల ప్రాణాలు విసుగెత్తిపోయాయి. ఈ విషయం జనరల్ లూ చెవినిపడగానే, హోజ్వాంగు సైన్యాన్ని పునర్నిర్మించుటకుగాను అతడు వెంటనే తనసైనికులను పంపాడు. రంధ్రాన్వేషణకు తాను, తన చర్యలు తట్టుకోలేవన్న విషయం హోకు బాగా తెలుసు. అందువలన

అతడు జీవోను. మరికొంతమందిని వెంటబెట్టుకొని వుడాయించాడు. ఆ ప్రాంతంలోనే వున్న కమ్యూనిస్టు వ్యతిరేక కొమింటాంగా వుద్యమంలో చేరిపోయారు. జిన్లంగ్ జబ్బుతో యింకా మంచంమీంనే వున్నాడు. అందువలన అతడు హోజ్వాంగ్ గ్రామంలోనే వుండిపోయాడు.

కార్యకర్తల పాఠశాలలో మేయీ తన ట్రయినింగు పూర్తిజేసుకున్నది. ఆ జిల్లాలోని జపాను వ్యతిరేక మహిళాసంఘంలో జేరింది. అత్తవారు యింటికి తిరిగిరావలసిందిగా ఆమెను అనేకసార్లు ప్రతిమాలారు. కాని ఆమె నిరాకరించింది. ఆమెను బలాత్కారంగా ఈడ్చుకుపోవటానికి వాళ్ళకు యిప్పుడు మార్గమేమీ దొరకలేదు.

తన ట్రయినింగు కాలం పూర్తికాగానే దాస్వే షెన్‌జ్యా గ్రామానికి మరలిపోయాడు. అక్కడ రైతుసంఘానికి అధ్యక్షుడయ్యాడు. నూతన శాసనాన్ని అనుసరించి వున్న భూమినిబట్టి పన్నులు కట్టాల్సి వుంది. ప్రతి వ్యక్తి తనకెంత భూమి గలదో రిజిస్టరు చేయించుకోవాలి. విచారణ జరుపగా మేయరు షెన్ తన స్థిరాస్థి వివరాలను దాచిపెట్టాడని తేలింది. ఉన్న భూమిని సరిగా లెక్కలలో చూపించలేదని బట్టబయలు అయింది. ఈ విషయం నలుగురికీ తెలియగానే షెన్ తన గౌరవాన్ని కోల్పోయాడు. మేయరుపదవికి రాజీనామా యిచ్చాడు. మరల ప్రత్యేకంగా ఎన్నికలు జరుపబడ్డాయ్. దాస్వేని మేయరుగా ఎన్నుకున్నారు.

దాస్వేకి దాపురించిన ఈ క్రొత్తవిధుల మూలంగా వ్యవసాయం దెబ్బతింటుందేమోనని అతనితండ్రి భయపడ్డాడు. అంతకన్న మరియొక విషయమేమంటే, ఒక మామూలు బీద రైతుబిడ్డను మేయరుగా ఎన్నుకున్నందుకు గ్రామంలోని ధనికులైన కులీనులకు కోపం రాగలదేమోనని భయపడ్డాడు దాస్వేతండ్రి. అయితే తనకొడుకు మేయరు కావటంవలన తన కుటుంబానికి ఒక పెద్ద గౌరవంగా భావించకపోలేదు. తన కొడుకు "అధికారి" అయ్యాడుగదా అన్న సంతోషం అతనికి లేకపోలేదు.

అంగీకారసూచకంగా పొరుగునున్న వృద్ధుడు తలవూపాడు. "కుర్రాడిలో గొప్పతనం వుందోయ్! యదార్థానికి నిన్న మొన్నటివరకు రోడ్డుమీద పెంట పోగుచేస్తూ వుండేవాడు. ఈనాడు వున్నత పదవిలోకి పోయాడు!"

ఇలాంటి సంభాషణలను వినటం, తండ్రికి మహా సంతోషం. "వాడికి వాణ్ణి గురించి బాగా తెలుసు." అని సంభాషణను పొడిగించేవాడు.

"మా కార్యకర్తలకూ, పాతరకపు అధికార్లకూ మధ్య ఎంతో భేదముంది" అని దాస్వే నవ్వాడు. "మా కోర్కె ప్రజలకు సేవజేయటము మాత్రమే.

సంతృప్తి సూచకంగా, తండ్రి తనగడ్డం నిమురుకొనేవాడు. "కుర్రాడికి కొద్ది తర్ఫీదుకూడా యిచ్చారు. వంద* అక్షరాలకుపైగా చదవటం, వ్రాయటం నేర్చుకొన్నాడుకూడా!"

"రెండువందల అక్షరాలకుపైగా," అని, దాస్వే సరిదిద్దాడు.

"బిడ్డా! మన పేదరైతాంగంలో ఒకడు అధికారిగా తయారుగావటం నేను బ్రతికుండగా చూడగలుగుతానని నేనెప్పుడూ అనుకోలేదు. చక్కగా పనిజేయి నాయనా!" అన్నాడు పొరుగు వృద్ధుడు.

దాస్వే, ఒక ఆటోమాటిక్ పెన్సిలు కొన్నాడు. దానిని తనచేతి-సంచికి తగిలించాడు. చేతిసంచి బెల్టును ఒక భుజానికి అడ్డంగా వేసుకొని, తన ఆఫీసుకుపోయాడు. వీధిలో అతనికి మేయీ కల్సింది. ఆమెకూడా తన భుజానికి సంచి తగిలించుకొనివుంది "నీ సంచీ, మంచి పనివాడిగా కనపడుతున్నావే" అన్నదామె. ఇతణ్ణి చూడగానే కమ్మని నవ్వు నవ్వింది. "నీ సంగతో" అని నవ్వాడు.

---

*చైనాభాషలో రమారమి ఎనిమిదివేల పైబడిన సంఖ్యలో అక్షరాలున్నాయి. ఒక్కొక్క అక్షరం ఒక వాక్యార్థాన్ని స్ఫురింపజేస్తుంది. వంద అక్షరాలు నేర్చుకొన్నవాడు చదువుకున్నవానిక్రింద లెక్క.

"గ్రామంలో ఏంజేస్తున్నావ"ని అడిగాడు. "నిన్ను కల్సుకో టానికే వచ్చా"నన్నది. "నాతో ఏంపని?" అని అడిగాడు.

వాళ్ళిద్దరూ నవ్వుకున్నారు. ఆఫీసుకు పోయారు.

"జిన్లింగ్ ఆరోగ్యం బాగుపడిందా?" అని, దాస్వే ప్రశ్నించాడు.

"ఎవరికి తెల్సు? నే నా కొంపకి పోలేదు."

"వాళ్ళు మళ్ళీ నిన్ను అవస్థపెట్టారా?"

"వాడి నాయన, వాడి తల్లి, వాడి మేనమామ అందరు కట్టకట్టుకొని అనేకసార్లు వచ్చారు. జిల్లా ఆఫీసులో ఆ ముసలిగి పెద్ద గొడవ జేసింది. అదృష్టవశాత్తు జాకీత్సే అక్కడే వున్నాడు. "పెద్దమ్మా! యింకా గొడవ యేమాత్రమయినా చేశావంటే, నిన్ను అరెస్టు చేయిస్తా" అన్నాడు. దాంతో ముసలిదానికి భయమేసింది. పారిపోయింది."

"వాళ్ళొక పెద్దపీడ!" అని దాస్వే అన్నాడు.

"నే నిప్పుడు ప్రతిఘటనోద్యమంలో వున్నా. వాళ్ళేమి చేస్తే చేస్తారులే! ఆ విషయం మరిచిపోదాం పట్టు. మన వ్యవహారం మాటాడు కొందాం. ఈ గ్రామంలోని మహిళలను యే విధంగా సంఘటపరిస్తే బాగుంటుందనుకొంటావ్?" అని ప్రశ్నించింది మేయీ.

"మీ అక్కగారికి యీ గ్రామ పరిస్థితులన్నీ బాగా ఆకళింపు. ఆమెతో కలసి పనిచెయ్. నీవు తప్పులేకుండా పనిచేయగలుగుతావ్! ఆమె తీర్చలేని సమస్యలేవైనా వుంటే నా దగ్గరకు రా!" అన్నాడు దాస్వే.

వారావిధంగా కొంతసేపు మాటాడుకొన్నారు. మేయీ తన అక్కగారింటికి పోయింది.

* * * *

వసంత ఋతువుల్లో గ్రామానికి దగ్గరగా జపానువాళ్ళు వచ్చేశారు. వాళ్ళు నగరాలను, పెద్ద పట్నాలను పట్టుకున్న తర్వాత గ్రామీణ ప్రాంతాలపై పడ్డారు. గ్రామీణ ప్రాంతాలపై తరచుగా దాడులుచేస్తూ

వుండేవారు. గ్రామసైన్యంయొక్క సైనికులలో చాలామంది బాలూ సైన్యానికి సహాయకులుగా చేరిపోయారు. వివిధ రాష్ట్రాలు లేక రాష్ట్రాల భాగాల ప్రాంతాలకు సంబంధించిన వివిధ ప్రదేశాలలో పనిచేసేవారిని "ప్రాంతీయ సైన్యాల"ని పిలుస్తారు. ఈ ప్రాంతీయ సైన్యాలను దేశం లోని యితర ప్రదేశాలకు పంపరు.

ఏమయినప్పటికి ప్రాంతీయ సైన్యానికి సంబంధించిన సైనికులంతరూ, తమ కాలాన్నంతటినీ సైనికవృత్తికే వినియోగిస్తున్నారు. వాళ్ళ వుద్యోగాలుకూడా తమ గ్రామాలనుండి చాలా దూరంలోనే వుంటు న్నాయి. సైన్యం పనిని తమ చేతుల్లోకి తీసుకోవటానికిగాను, ప్రతి గ్రామంలోనూ ఒక గెరిల్లాదళం ఏర్పాటు చేయబడింది. గ్రామాల గుంపులు కొన్నింటిని ఒక కేంద్రగ్రామం పరిపాలిస్తూ వుండేది. ఒక కేంద్ర గ్రామానికి షావాంగు మేయరు అయ్యాడు. అంతేగాక, కమ్యూ నిస్టుపార్టీ బ్రాంచి కార్యదర్శిగా పనిచేయసాగాడు. అదే కేంద్రగ్రామము ఆధిపత్యంలోనున్న గ్రామాల సంఘటిత గెరిల్లా దళాలకు, దాస్వే నాయకు డయ్యాడు.

పోరాటం లేనికాలంలో గెరిల్లాలు తమ పొలాలు సాగుజేసు కొంటూ వుండేవాళ్ళు. కాని, దాస్వే నాయకుడు కాబట్టి తన కాలాన్నంత టినీ తన విధుల నిర్వహణకే వినియోగించాల్సి వచ్చింది. అతనికి తిండి, బట్టలు ఇచ్చేవారు. నెలకు రెండు డాలర్లు యిచ్చేవారు. వ్యవసాయ పను లలో అతని తండ్రికి తోడ్పడటానికి అతని గ్రామస్థులు బాధ్యత తీసు కున్నారు. ఈ ఆర్థిక ఏర్పాట్లను మెచ్చుకొన్నాడు దాస్వే తండ్రి. కాని, తన కొడుకు యుద్ధానికి పోవాల్సివస్తుందేమోనని భయపడ్డాడు.

"మనం జపానువాళ్ళ నెదిరించి పోట్లాడకపోతే, వాళ్ళిక్కడకు వచ్చేస్తారు. అప్పుడు మన పనేమవుతుంది?" అని ప్రశ్నించాడు తండ్రిని దాస్వే. ఈ విషయంపై వారిద్దరికీ, బాగా వాదోపవాదాలు జరిగాయి. కాని, చివరకు దాస్వే పట్టుదల నెగ్గింది.

కేంద్రగ్రామానికి పోతూపోతూ దారిలో, తనకు ఎక్కువ మిత్రు

టరీ అనుభవం లేకపోయిందేయని దాస్వే బాధపడసాగాడు. ఆ కేంద్ర గ్రామాన్ని జేరుకోగానే, దాస్వే కనుబొమలు చికాకుతో ముడిపడ్డయ్. "నే నీపని చేయగలనని నీకు నమ్మకముందా?" అని షాంగ్‌ను ప్రశ్నించాడు.

"క్రమంగా నువ్వే నేర్చుకుంటావ్" అని జవాబు చెప్పాడు షాంగ్. ఒక పాత సైనికుని, దాస్వేకి పరిచయపరిచాడు షాంగ్. "ఇతడు కెప్టెన్ పింగ్. ఇంతకుపూర్వము ఈశాన్య సైన్యంలో పని జేశారు. వీరికి బాగా అనుభవముంది. నీకు సహాయంచేస్తూ వుంటారు."

దాస్వేకి బరువు దింపేసినంత హాయి కలిగింది. సంతోషంతో వుప్పొంగిపోయాడు. జిల్లా ప్రభుత్వం పంపిన పెద్ద పిస్తోలు నొకదాన్ని షాంగు, దాస్వేకి యిచ్చారు. అది ప్రేలిపోతుందేమోనన్నంత జాగ్రత్తగా దాన్ని కవచంనుండి దాస్వే బయటికి లాగాడు.

"దీన్నెలా వుపయోగిస్తారు?" అని ప్రశ్నించాడు వ్యాకుల పాటుగా.

వృద్ధ కెప్టెన్ అదెలా వుపయోగిస్తారో వివరించాడు దాస్వేకి. దాస్వే ఆ పిస్తోలును నడుముకు తగిలించుకొన్నాడు. అది చాలా అందముగా వుందనుకున్నాడు.

కొన్ని దినాలు గడచిన తర్వాత, సూర్యాస్తమయమైన తర్వాత ఒకనాడు దాస్వే, సంఘటిత గెరిల్లా దళానికి వృద్ధ కెప్టెన్ పింగ్ నాయకత్వాన తర్ఫీదు యివ్వటం ప్రారంభించాడు. ఒక చిన్నపిల్లవాడు పరుగెత్తుకుంటూ అక్కడికి వచ్చాడు.

"సాదా దుస్తులు వేసుకున్న కొంతమంది ద్రోహులు, తుపాకులతో, దంక్యూ గ్రామంపై పడ్డారు" అని వూపిరి సలుపకుండా ఆ పిల్లవాడు రిపోర్టు చేశాడు. "త్వరపడండి!"

"మీ కిప్పుడు తుపాకులను ఎలా వుపయోగించాలో తెల్సుగా!" అని ఆ గెరిల్లాలను ఉద్వేగరిపూరితకంఠంతో దాస్వే ప్రశ్నించాడు.

"తప్పకుండా!" అని జవాబిచ్చారా సమూహం ఒక్కుమ్మడిగా.

"సమయాన్ని జూచి, గురిచూచికొట్టండి ! పదండి !" దాస్వే, తన పిస్తోలును బయటికి లాగాడు. చేతపుచ్చుకుని పరుగెత్తసాగాడు. అతని వెంట క్రమబద్ధంగా ఆ గెరిల్లాదళ సభ్యులందరూ పరుగెత్తారు. వాళ్ళు, తమవెంట అన్నిరకాల పాతబడిన వేటతుపాకులు, షాట్‌గన్‌లు, నాటు తుపాకులు తీసికొనిపోయారు.

వారు దంగ్యూ గ్రామాన్ని చేరుకోగానే, ద్రోహులు ఆ గ్రామాన్ని అప్పుడే వదలిపెట్టిపోయారనీ, ఊరికి ఉత్తర దిశగా పోతున్నారనీ, గ్రామస్థులు చెప్పారు.

దాస్వే వారిని తరుముటకు వుద్యుక్తుడవుతూవుండగా, రొప్పుతూ పరుగెత్తుకొస్తూవున్న వృద్ధకెప్టెన్ అతణ్ని కలుసుకొన్నాడు. "ఈ విధంగా లాభంలేదు" అని రొప్పుతూ అన్నాడు. "చిందరవందరగా పరుగెత్తితే-వాళ్ళు, మనవాళ్ళందర్నీ స్వాహాచేస్తారు !"

దాస్వే ఉపనాయకుడుగా పనిచేస్తున్న తేవార్, "నాన్సెన్స్ !" అన్నాడు. "వాళ్ళకీ తుపాకులున్నాయ్; మనకీ తుపాకులున్నాయ్. మన ల్నెలా పడగొట్టారేంటి ?" అన్నాడు.

"వాళ్ళు దాక్కుంటే ఏమిచేస్తావ్ ? మన ముఠా పెద్దది. మన మొస్తున్నట్లు వాళ్ళు ఒక మైలుదూరంనుండే కనిపెట్టేస్తారు. మనకు ఛాన్సే వుండదు."

"అచ్ఛా, యిప్పుడు మన మేం చేయాలి ?" అని ప్రశ్నించాడు దాస్వే.

"ముప్ఫరేసి చొప్పున విడిపోదాం. తేవార్ మొదటిగ్రూపుకు నాయకత్వం వహించాలి. వాళ్ళను చుట్టుముట్టాలి. వాళ్ళు పారిపోకుండా అరికట్టాలి. నేను రెండవముఠాకు నాయకత్వం వహిస్తా. కుడివైపునుంచి వాళ్ళను ముట్టడిస్తా. నీవు మూడవముఠాకు నాయకత్వం వహించు. రొప్పు వెంట సూటిగావచ్చి, వాళ్ళమీద దాడిచెయ్యి. కాని, నువ్వు జాగ్రత్తగా కదలాలి! వాళ్ళని మూడు దిక్కులనుండి మూసుకొద్దాం. నాలుగోవైపున నీళ్లున్నాయ్. ఎక్కడికి తప్పించుకుపోతారో చూద్దాం" అని వృద్ధకెప్టెన్ పింగ్ వ్యూహాన్ని వివరించాడు.

ఈ వ్యూహానికి అందరూ అంగీకరించారు. తేవార్, అతని గెరిల్లా యోధులు, మొట్టమొదట ఆ ప్రదేశాన్ని విడిచివెళ్ళారు. పరుగెత్తుచున్నప్పుడు ముందుకువంగి పరుగెత్తుతూ, వృద్ధకెప్టెన్ పింగ్, అతని ముఠా ముందుకు సాగారు. కుడివైపునుండి శత్రువులను చుట్టుముట్టసాగారు దాస్వే అతని అనుచరులు, సూటిగా ముందుకుసాగారు.

అప్పటికి చీకటిపడింది. చంద్రోదయం కాలేదు. నక్షత్రాలు మాత్రం అక్కడక్కడా మిలమిలా మెరుస్తున్నాయ్. ఆ బహిరంగ ప్రదేశంలో తన అనుచరులతో దాస్వే ముందుకు సాగిపోతూవుంటే, అతని బుర్రలో అనేక ఆలోచనలు గందరగోళంగా బయలుదేరాయ్. "యదార్థంగా యిది మన ప్రథమ పోరాటం. నాలో వుద్రేకం వురక లేస్తూవుంది. కొంచెం బెదురుగావుంది. గురిచూసికొట్టడానికి అవకాశం లేకుండానే యీ చీకటిలో వాళ్ళమీదకే వెళ్ళిపడితే ఏం కాగలదు?" అనుకొన్నాడు దాస్వే.

అతని అనుచరులలో ఒకడు, చొక్కాచేతిని గుంజాడు."అదిగో! అక్కడ చూడు! వాళ్ళేకదూ? ఆ గుంపేగా?" అన్నాడతను.

ఇప్పుడు మాట్లాడినవాడు 'బెదురుగొడ్డు'. ఇతనికి 'బెదురుగొడ్డు' అని పే రెందుకువచ్చిందంటే, దాయర్దానికి యితడు తోటివాళ్ళకన్న వయసులో పెద్దవాడు. అతని నరాలు వట్టి చచ్చునరాలు. వట్టి పిరికికండమనిషి. తన నీడనుచూచే త్రుళ్ళిపడుతూ వుంటాడు. బెదురుగొడ్డు యొక్క మూర్ఖత దాస్వేకి బాగా తెలుసు అందువలన అతడు బెదురుగొడ్డు చూపిన దిక్కుగా కళ్ళు చిల్లు దేటట్లు పరిశీలించసాగాడు.నిజంగానే, ఆ దిక్కులో అనేకమంది ఛాయలు కానవస్తున్నాయి. అతని గుండె కొట్టుకోసాగింది. అటుతర్వాత, యింతకుపూర్వం మేయర్ షెన్‌గారి దళంలో సుప్రసిద్ధ యోధులుగా పేరుబడసిన 'బెదురుగొడ్డు' గూలాలు, గ్రామానికి మెల్లగా జారుకొంటున్న విషయాన్ని దాస్వే గమనించాడు.

"పిచ్చివెధవల్లారా! ఎక్కడికోయ్, పారిపోతున్నారు? దాక్కోండి" అని దాస్వే నివ్వెరపడి అరిచాడు.

భయంతో గజగజా వణికిపోతున్నాయి, బెదురుగొడ్డు గూలాల

మోకాళ్ళ. "అయ్యో! దేవుడా!.... దాక్కోవటానికి తావేదీ?" అని బెదురుగొంతుతో వణుకుతూ జవాబుచెప్పాడు.

"కళ్ళకు కనపడకుండా ఎక్కడో ఒకచోట వళ్ళు దాసుకో! వెధవ అల్లరి చేయబోకు!" అని బుసకొట్టాడు దాస్వే.

ఆ సుప్రసిద్ధ పిరికిపంద లిద్దరూ పొలంలో పొట్టలమీద బోర్ల పడ్డారు. గడ్డితుంపులతో పిచ్చిగా వళ్ళంతా కప్పేసుకోగారు. "కావాలంటే మేం మిక్కడే వుండిపోతాం!" అన్నాడు. గూలూ కంపితకంఠంతో.

దాస్వే. అతని అనుచరులూ రక్షణ తీసుకున్నారో లేదో. ఇంతలోనే అటువైపునుండి కాల్పులు ప్రారంభమయ్యాయి.

"షూట్! షూట్!" ఆజ్ఞాంచాడు దాస్వే. అతని అనుచరులు శత్రువులకు మహాగ్నిగోళాన్ని ప్రసాదించారు.

"కుక్కలకొడకా!" అని మూల్గాడు గెరిల్లాయోధులలో ఒకడైన హోషాంగ్.

దాస్వే హృదయం క్రుంగి ది. హోషాంగ్‌వద్దకు ప్రాకిపోయాడు. హోషాంగ్ జాగ్రత్తగా గురిచూస్తూ తుపాకి బోల్టును లాగుతున్నాడు.

"దీనమ్మ! యీ దయ్యాన్ని కాల్చలేకుండావున్నా!" అన్నాడు హోషాంగు.

"దానమ్మ! ట్రిగ్గర్‌ను లాగందే ఎలా కాలుస్తావోయ్!" అని దాస్వే దుయ్యబట్టాడు.

దాస్వే హోషాంగుయొక్క వ్రేలును తీసుకొని, ట్రిగర్‌మీదపెట్టి లాగాడు. పెద్ద ధ్వనిచేస్తూ తుపాకి ప్రేలింది. ఆ ధ్వనికి హోషాంగు ఎగిరి గంతేశాడు.

కాల్పులు ఉచ్ఛదశకు పోయాయి. అదే సమయంలో ఎదుటివైపు నుండి, వృద్ధ గొంతొకటి వినిపించింది. "ఆపండి దాస్వే! కాల్పులు ఆపండి!" అది వృద్ధకెప్టెన్‌పింగ్ కంఠధ్వని.

కాల్పులాపవలసిందిగా దాస్వే ఆజ్ఞాపించాడు. పీళ్ళ నెదురుగా నున్న మనుష్యులుకూడా కాల్చటం మానివేశారు. వాళ్ళలోనుండి కొంత

మంది గెరిల్లాలపైపుగా నడచివచ్చారు. దాస్వే మెదడు గిర్రున తిరుగ సాగింది.

వృద్ధకెప్టెన్ ఆకారం కనుపడసాగింది. "అలా గుడ్డిగా ఎవరిమీద కాలుస్తున్నారోయ్ ?" అన్నాడు.

'శత్రువుల' దిక్కునుండి తిట్ల ధుమారాన్ని సాగిస్తూవున్న తేవార్ కంఠధ్వని వినవచ్చింది. "మొద్దుతొత్తుకొడుకుల్లారా ! మామీద కాలుస్తున్నారా !" అని తేవార్ అరిచాడు.

హోషాంగ్ చెంగున గంతేవాడు "నీ యవ్వ!....మామీద ముందు కాల్చింది మీరా ? లేక మీమీద మేము ముందు కాల్చామా ?"

"-పండోయ్ ! ఆపండి ! ఇంతకీ శత్రువు లేమైనారు ?"అన్నాడు దాస్వే.

వృద్ధకెప్టెన్ పింగ్ పెద్దగా పంచాంగంవిప్పాడు. "ఎప్పుడో పారిపోయారు దొంగతొత్తుకొడుకులు !"

ఒకళ్ళ నొకళ్ల వెక్కిరించుకుంటూ చీవాకుగా, గెరిల్లాలు తమ యిళ్ళకు జేరారు.

* * * *

కొన్నిరోజులు గడచినతర్వాత, హిసియూ గ్రామంలోని మేయరు ఆఫీసుపై దేశద్రోహులు దాడిచేయనున్నారని, మన గెరిల్లాలకు తెలియ వచ్చింది. ఆ ప్రదేశానికి ఒక్కదూకులో గెంతాలనే అభిలాష గెరిల్లాలో రేకెత్తింది.

"గాడిదకొడుకుల్ని ఆహ్వానిద్దాం పదండోయ్ !" అన్నారు గెరిల్లా లంతా.

"సులభంగా ఈసారి వాళ్ళపనిపడదాం !" అన్నాడు దాస్వే.

"ఇప్పుడు పట్టపగలుకదా, మనం త్వరగా కదలిపోవచ్చు. వాళ్ళను చుట్టేద్దాం, అన్నివేపులనుండి కమ్మేద్దాం. మనకు యిబ్బందేమీ వుండదు" అన్నాడు వృద్ధకెప్టెన్ పింగ్.

"ఎట్టిపగలు వేళ పోట్లాడుతాం కాబట్టి, మనలో మనమే ఒకళ్ళ మీద ఒకళ్ళము కాల్చుకోం!" అన్నాడు తేవార్ ఉత్సాహంగా.

"రైట్! పోదాం పదండి!" అన్నాడు దావ్వే. గెరిల్లాలు బయలు దేరి పోయారు.

హిసియూ గ్రామం ఒక పావుమైలు దూరముందనేగానే, గెరిల్లాలు నెమ్మదిగా నడువసాగారు. కెప్టెన్ పింగ్ వయోవృద్ధుడని చెప్పాముకదూ? అందువలన అతడు ఈ కుర్రాళ్ళతోపాటు నడవలేక రొప్పసాగాడు. క్రమేణా వెనుకపడ్డాడు. మిగిలిన గెరిల్లాలందరూ, గ్రామానికి చేరగానే, అతడు "యిక్కడ కాపలాకోసం యిద్దర్ని వదలిపొండి!" అని కేకేసి చెప్పాడు. అతని మాటను ఎవరూ చెవినిపట్టించుకోలేదు. శత్రువును" చుట్టు ముట్టటానికి" వాళ్ళందరూ ముందుకు పరుగెత్తిపోయారు.

చతురస్రము ప్రదేశంలో ఎత్తులేని యిళ్ళ వరుసలో మేయరు ఆఫీసు కట్టబడివుంది. మూడువరండాల పైకప్పులమీదకెక్కి కూర్చున్నారు గెరిల్లాలంతా. నాలుగో వరండాలో మేయరు ఆఫీసు వుంది దేశ ద్రోహులు బయటికివస్తే కాల్చేయటానికి అనువుగావుంది గెరిల్లాల వెనుకగా వృద్ధుడయిన కెప్టెన్ పింగ్ పైకప్పుపైకెక్కాడు.

"శత్రువు లెక్కడ?" అని మృదువుగా కెప్టెన్ అడిగాడు. దావ్వే "పారిపొయ్యారేమో!" అన్నాడు.

"ఏదన్నా విసిరెయ్యండి!" అని ఆజ్ఞాపించాడు వృద్ధుడయిన కెప్టెన్ పింగ్.

పైకప్పుమీద విడివిడిగా పడివున్న పెంకులను లంకించుకొని, మేయరు ఆఫీసులోనికి కురిపించారు. జవాబేమీ రాలేదు.

తేవారులో విసుగు ముప్పిరగొన్నది. ఏమిటీ గొడవ? క్రిందికి దిగి చూసొస్తానుండండి."

పై కప్పునుండి క్రిందికి దిగాడు తేవార్. చేతుల్లో తుపాకి పట్టుకుని నిశ్శబ్దంగావున్న ఆవరణలో నడిచాడు. మేయరు గది తలుపును

లాగి తన్ని తెరచాడు. లోపలనుండి ఒక తుపాకీ ప్రేలింది? ఆ ధ్వనికి బిత్తరోయి. తేవార్. ఆవరణలో ఒక మూలనున్న మిల్లు షెడ్‌లో దాక్కోవటానికి పరుగెత్తాడు. పైకప్పులమీద గెరిల్లాలపై దేశద్రోహులు ఒక అగ్నిగోళాన్ని విసిరారు. బయటికి పారిపోవటానికై. ఆవరణలోనికి గుంపుగా వచ్చిపడ్డారు దేశద్రోహులు. తలుపువైపుగా పరుగెత్తాడు.

దాస్వే. పైకప్పుమీదవున్న పిట్టగోడ వెనుక తల దాచాడు. "బయటికొచ్చేస్తున్నారోయ్. కాల్చండి! కాల్చండి!" అని అరిచాడు. తానుమాత్రం కాల్చలేకపోయాడు. అతని పిస్తోలు మరలు నొక్కుకుపోయాయి.

గెరిల్లాలను అకస్మాత్తుగా లంకించుకొన్నారు దేశద్రోహులు. తెప్పరిల్లే లోపలే. రోడ్డుమీదపడి పాంపోసాగారు దేశద్రోహులు.

"వెంటపడండి!" అని వృద్ధ కెప్టెన్ గర్జించాడు.

గెరిల్లాలందరూ. పై కప్పులనుండి క్రిందకు దుమికారు. చిందరవందరగా శత్రువులను వెన్నాడారు. గ్రామ పరిసరాలలోనికి చేరుకోగానే లక్ష్యశూన్యంగా ఇష్టమొచ్చినట్లు గెరిలాలు తుపాకులు కాల్చసాగారు. ఈ గందరగోళంలో. ఎలా సంభవించిందో యేమోగాని. తేవార్ తుపాకి గుండు గూలూ చేతికి తూటువేసింది. ప్రథమ చికిత్స చేయటానికని గెరిల్లాలంతా ఆగిపోయారు. శత్రువులు జారిపోయారు.

* * * *

గెరిల్లాలంతా స్వగ్రామం ఛేరుకొన్నారు. జేరుకోగానే వృద్ధకెప్టెన్ కోపంతో మండిపోయాడు. అతనికి నోటివెంట మాటరానంతగా కోపంతో ఉద్రిక్తుడయ్యాడు. ష్వాంగును జూచి. "నే పోతా! వీళ్ళు పోరాటంగాదు చేస్తున్నది. యేదో ఆటాడుతున్నారల్లే వుంది. పది సంవత్సరాలనుండి సైన్యంలోవున్న....కాని....యిలాంటి చెత్తను చూళ్ళేదు....నేనా... ఛీ.. వెళ్ళిపోతా!" వృద్ధుడు పొగలు గ్రక్కాడు.

"నిదానించు తాతా!" అని ష్వాంగు వోదార్చాడు. "నిన్నమొన్నటి

దాకా వీళ్ళకు పొరపట్టటం చేతవును. పొరతప్ప ఏ ఆయుధాన్నీ ఎరుగరుకదా! ఒక్కనాటితో తుపాకిపట్టటం చేతవుతుందా? పోట్లాడటం చేతవుతుందా? కుంటివాడు నీళ్ళు మోసుకెళుతున్నట్లు!— వీళ్ళతోపాటు నీవూ మెల్లిగా నడవాలి మరి!.... రేపు ప్రొద్దున్నే సమావేశం జరుపుదాం. మొట్టమొదట ఈ విషయాన్నే తీసుకొందాం, వాళ్ళకి వెలుగు య్యివుగాని" అని వోదార్చాడు ష్వాంగు.

ష్వాంగు వుచ్చరించిన యీ చివరిపదం, వృద్ధుని ముఖంలోకి వుత్సాహాన్ని తెచ్చింది. "సరేలే! సరేలే!" అన్నాడు ఇక రాజీనామా వూసెత్తలేదు.

ఇక దాస్వే పరిస్థితి చూద్దాం. దాస్వేకి, యావత్ ప్రపంచంమీద రోత పుట్టింది. అంతేగాదు, అందరిమాట అలావుంచి, తనంటేనే, తనకు రోత కలిగింది. "మహా దొడ్డ నాయకుణ్ణి!" అనుకోసాగాడు విచారంతో, కృంగిన హృదయంతో. "నేనో గంపెడుమందిని పోరాటానికై తీసుకుపోవటం, శత్రువుకు జారిపోవటం, మాలో ఒకణ్ణి మేమే కాల్చటం— మహా బాగుంది!" అని విచారపడ్డాడు. యింతలోనే అతనికి, గూలూతల్లి గోల వినపడింది.

దాస్వే ఏడీ? నా కొడుక్కి గాయమెందుకయింది? చూస్తూ వూరుకున్నాడా? ఏం నాయకుడోయ్ వీడు?" అని గూలూ తల్లి పెడబొబ్బలు పెట్టసాగింది.

ఆమెకు తన మొగం చూపించటానికి సిగ్గుపడ్డాడు దాస్వే.

దాస్వే తప్పిదాలను గోరంతలు కొండంతలుచేస్తూ, వాటి నొక్కటొక్కటీ వివరిస్తూ, ఆ వృద్ధమాత, ఆఫీసులో ప్రవేశించింది.

"ఆయనిక్కడ లేడు" అని ఎవరో జవాబు చెప్పారు.

వృద్ధమాత ష్వాంగును పసికట్టింది. "మేయరుగారూ! నేనే విధంగా కాలం గడపాలి? నా కొడుకు కుంటివాడయితే, నా గతేంకావాలి?" అని ఏకధారగా కన్నీళ్ళు కార్చింది.

ఆమెను ఓదార్చటానికి ష్వాంగు విశ్వప్రయత్నం చేశాడు. ప్రయోజనం లేకపోయింది.

కట్టలో మునిగిపోయిన చేతితో గూలూకూడా ష్వాంగును పట్టించాడు. "తేవారుకు, నాకూ విరోధమేమీ లేదే! నన్నెందుకు కాల్చాడు?" అని జాలిగా అడిగాడు గూలూ. "దాన్స్వే కిదేమీ పట్టలా! నేనిక పని చేయలేను. నా కుటుంబం మాడిపోవాల్సిందే! యిష్టమొచ్చినట్లు కాల్చి. తప్పించుకొని పోజాలడు తేవార్! వాడిమీద దావా వేస్తా!"

ఈ గోడు వినివిని విసుగెత్తిన హోషాంగ్ "ఇక చాల్లే!" అన్నాడు. "తేవార్ కావాలని కాల్చలేదు. అలా జరిగినందుకెంతో బాధ పడుతున్నాడు. అదీగాక, కొద్దిగా కండకు దెబ్బ తగిలింది. నయమవుతుంది. పనిజేసుకోలేకపోతాడని ఎవరన్నారు?"

"చిన్న గాయమంటున్నాడు! చిన్నగాయమట! గురిజూసి నీమీదొకటి వేస్తా! నీ కెలా వుంటుందో తెలుస్తుంది!" అని కోపంగా గూలూ వురిమాడు.

అతను, అతని తల్లి, హోషాంగు ఒకళ్ళమీద ఒకళ్ళు దుమ్మెత్తి పోసుకోసాగారు. ష్వాంగు వాళ్ళందరినీ శాంతపరచిన తర్వాత నష్టపరిహారంగా గూలూకు సంఘం రెండువందల పౌన్ల జొన్నలిస్తుందని చెప్పాడు. అది సరిపోదని వృద్ధురాలు తడుముకోకుండా జవాబుచెప్పింది. చాలాసేపు బేరాలాడిన తర్వాత గూలూ, అతని తల్లి రెండువందల యాభై పౌన్ల జొన్నలు తీసుకొని తృప్తిపడటానికి వప్పుకొని వెళ్ళిపోయారు. పెద్ద బరువు తీరిపోయినట్లుగా అందరూ నిట్టూర్చారు.

వాళ్ళు అలా వెళ్ళారోలేదో "బెదురుగొడ్డు" గూ, తన తుపాకిని వప్పజెప్పటానికి వచ్చాడు. తన భార్యతో విషయమంతా చర్చించాడట! వాళ్ళకు కొద్దిగా భూమివుంది. తింటానికి చాలినంతవుంది. పోరాటమంటే విసుగెత్తిందట! యుద్ధమంటే చాలా ప్రమాదకరమైన విషయం. మనిషి గాయపడవచ్చు!

"నీ జీవితమంతా పిరికితనమేనా?" అని చిరునవ్వు నవ్వుతూ ష్వాంగ్, అతణ్ణి ప్రశ్నించాడు. భూమిని రక్షించుకోటానికైతే జపాను వాళ్ళ నెదిరించి ఎందుకు పోరాడాలో ష్వాంగ్, అతనికి వివరించాడు.

బెదురుగొడ్డు విషయాన్ని అర్ధంచేసుకున్నాడు; అతడు తన తుపాకిని మళ్ళీ తీసుకున్నాడు. సిగ్గుతో తలవంచుకుని యింటికిపోయాడు.

దాస్వే దాక్కొన్న గదిలోనికి, ఉల్లాసంగా వచ్చాడు ష్వాంగు. వచ్చి దాస్వే భుజాలు తట్టాడు. "గాబరా పడబోక! మన గాయపడ్డ యోధుకివిషయం పరిష్కారంజేశాంలే!" అన్నాడు.

దాస్వే తలవొంచుకున్నాడు. జవాబు చెప్పలేదు.

"ఏమిటోయ్, రభస?" అడిగాడు ష్వాంగు.

"రాజీనామాపెడుతున్నా" అని గొణిగాడు దాస్వే.

"భలే! బాగుంది!" అని నవ్వుతూ అతని చేతిని గుంజాడు ష్వాంగు. "నేను రాజీనామాపెడుతున్నా! మనమంతా యింటికి పోదాం పద!"

అకస్మాత్తుగా పట్టువిడిపించుకుని దాస్వే. "ష్వాంగ్! నాకు అమిత సిగ్గేస్తూవుంది! నన్ను బలవంతంచేయబోక!" అన్నాడు.

"బలవంతం చేయటంలేదు. నీతో మాట్లాడాలనుకొంటున్నా. రావోయ్ పోదాం- మా యింట్లో భోజనం చేద్దాం పద" అని దాస్వేకి అయిష్టంగావున్నా అతణ్ణి తన యింటికి లాక్కుపోయాడు ష్వాంగు.

భోజనమైనతర్వాత, దీపాలు వెలిగించారు. ష్వాంగు అసలు విషయాన్ని ప్రస్తావించాడు. "రాజీనామాపెట్టాలని ఎందుకనుకుంటున్నావ్?"

"నేనా మనుషుల్ని నడుపలేను. యుద్ధంచేయటమెట్లాగో నాకు తెలియదు. ఇంక ప్రయోజనమేమిటి?"

"పుట్టగానే సేనాధిపతిగా ఎవడూ పుట్టడు. నేర్చుకోటానికి ప్రతివాడూ, కొంత కాలం తీసుకుంటాడు."

"నేను నేర్చుకోలేను. నే నింకో పనేదైనా జేస్తా."

"దాని ముండామోసిరి! దానివల్ల ప్రయోజనమేమిటి? యుద్ధం చేయటం మనం నేర్చుకోవాలి. అలా చేయకపోతే, జపానువాళ్ళిక్కడకు వస్తే మనందరిపని గల్లంతవుతుంది. అందరం మునుగుతాం!" అని ష్వాంగు అన్నాడు. దాస్వే, యదార్థంగా హృదయభారంతో కృంగిపోయాడు: ఆ విషయాన్ని గమనించాడు. అతణ్ణి ఉత్సాహపరచుటకై పూరడింపు

ప్రారంభించాడు. "మనవాళ్ళలో ఒకడికి గుండుదెబ్బ తగిలినందుకు బాధ పడుతున్నావుకదూ! గాయపడకుండా యుద్ధం సాగుతుందా! ఏదీ ఒక్క యుద్ధాన్ని గురించి చెప్పు! రేపు యీ విషయాన్నిగురించి మాట్లాడు కుందాం. ఏమి తప్పులుజేశామో చర్చించుకుందాం.

భవిష్యత్తుకో, అలాంటి తప్పులు జరగకుండా వుండాలంటే ఏమి చేయాలో తెలుసుకుందాం" అని ష్వాంగు పలికాడు. అంతేగాక, నిదానంగా యిదికూడా అన్నాడు. "పొరపాట్లు, పరాజయాలనుచూచి కమ్యూనిస్టులు భయపడరాదన్నాడు. బ్లాకీత్సే. పరిస్థితులు క్లిష్టమైనకొలదీ మన మంతకన్న గట్టిపడతాం. ఉక్కులాగున తయారవుతాం. దేన్నిచూచినా, ఏది సంభవించినా భయపడం."

ఆ రాత్రి దాన్వే. ష్వాంగు యింట్లోనే వుండిపోయాడు. సమావేశంలో పాల్గొనటానికని. బ్లాకీత్సేకూడా గ్రామానికి మరలివచ్చాడు. నవ్వుతూ, సమావేశాన్ని ప్రారంభించాడు.

"మన గెరిల్లాలు రెండు యుద్ధాలు చేశారు. మనం సరిగా జయించకపోయినా, శత్రువులనుమాత్రం బెదరగొట్టాం!" దీంలో నవ్వారంభమైంది. బ్లాకీ తన వుపన్యాసం సాగించాడు. "తీవ్రంగానే చూద్దాం; మనమంతా రైతులం. మన కీ పని అంత సులభమైనదిగాదు. మనకు లోటుపాట్లుంటాయి. ఉన్నాయి. అయితే వాటిని దాటగలం. పాత సామెతొకటుంది. 'సాన రాతిమీద కత్తి. అనుభవంద్వారా మనిషి పదునెక్కగలవు' అన మీ విషయాన్నిబట్టి చూద్దాం. బండమొనలకు పదును పెడదాము."

వృద్ధుడయిన కెప్టెన్‌పంగ్ లేచి నిలబడ్డాడు. తన ఉపన్యాసాన్ని ప్రారంభించాడు. "మనమంతా అసంఘటితంగా వున్నాం! కండిరీగల మందలాగున మనవాళ్ళు యుద్ధంలోకి దుముకుతున్నారు. అలా చేస్తే ప్రయోజనంలేదు. సైన్యంలో అధికారి ఆజ్ఞలిస్తే అందరూ లోబడాలి. అతడు తూర్పు దిశకు పొమ్మంటే, తూర్పుగానే పోవాలి. పడమటిదిక్కునకు పొమ్మంటే, పడమటిదిక్కుగానే పోవాలి. అలాచేస్తే యెవళ్ళు

తప్పులుచేయరు. మీరు ఆజ్ఞలు పాటించకపోతే, మన మెలా యుద్ధంచేయ గలుగుతాం ?"

జరిగిన పొరపాట్లను గురించి చర్చలు ప్రారంభమయ్యాయి.

"నే నొక పొరపాటుజేశా" అని దాష్వే చెప్పాడు. అతని ముఖం సలసలాడుతూవుంది. "నిన్నటిరోజున పోరాటంలో నా తుపాకిని పేల్చ లేకపోయాను. మన మింటికొచ్చినతర్వాత చూస్తినిగదా. సేఫ్టీని పూత దీయటం మరచిపోయ్యానని తెలుసుకున్నా!"

అందరూ పొట్టచెక్కలయ్యేట్లు నవ్వసాగారు కాని కొంతమంది "నవ్వకండి! నవ్వకండి!" అ కేకలేశారు.

తేనారు ఉపక్రమించాడు. "ఆ విషయం సరే! నవ్వటానికిమనలో ఎవరికీ అర్హతలేదు. నేను ఖలేవాణ్ణి. మనవాళ్ళ కాల్చాను. ఇకనుంచి జాగ్రత్తగా గురిపెట్టలేకపోతే, తుపాకి ప్రేల్చనే ప్రేల్చను. తుపాకి పేల్చానా, అది శత్రువుమీద మాత్రమే పేలుస్తా!"

వృద్ధకెప్టెన్ లేచి నిలబడ్డాడు. అతనిలో సంతృప్తి, సంతోషాలు ముప్పిరిగొన్నాయి. "మళ్ళీ మనం యుద్ధం చేయాల్సివస్తే దానిలో మన మొక ప్లాను వేసుకోవాలి. ఆ ప్లానుప్రకారం నడుచుకోవాలి. మనకు సెక్షట్లు వుండాలి. యుద్ధ సంచాలక నాయకుడొకడుండాలి. తీవ్ర క్రమశిక్షణ వుండాలి!"

"రైట్!" అని షావ్యాంగు అన్నాడు. "మన మిప్పుడే నియమాలు, నిబంధనలు రాద్దాం పట్టండి!"

వెంటనే నియమాలు, నిబంధనలను వ్రాసేశారు. వాటి నందరూ ఒప్పుకున్నారు. వాటి కందరూ కట్టుబడివుంటామని చెప్పారు. కట్టు తప్పిన వారికి జరిమానా విధించాలన్నారు.

దాష్వేకి కొంత వుత్సాహం వచ్చింది. మామూలు మనిషి కాసా గాడు. "ఆఁ అదే! మన కిప్పు డొక మార్గం దొరికింది!" అనిఉల్లాసంగా అన్నాడు. "ఇది చాలా ప్రధానమయిన విషయం. ఈ నియమాలను మన మంతా ఒక్కటొక్కటే అమలుజరపాలి. వీటన్నింటినీ మనమంతా కంఠోపాఠం పట్టాలి. గత పోరాటంలో మనం బాగా సంచరించలేదు.

వచ్చేసారి ఎలా వ్యవహరిస్తామో చూసుకొందాం!" అన్నాడు దాస్వే.

గెరిల్లాలందరూ ఉత్సాహంతో ఉత్తేజితులు కావటాన్ని చూచి, జ్లాకీత్సే సంతోషంతో పొంగిపోయాడు. "చాలా బాగుంది!" అని పొగిడాడు. "మీకు ఆత్మవిశ్వాసం, ధైర్యం వున్నాయ్. రెండు యుద్ధాలకు రుచిచూడగానే, మీరు అనుభవాన్నికూడా సంపాదించుకుంటారు" అన్నాడు జ్లాకీత్సే.

"పరిస్థితులతో సరితూగటం నేర్చుకోవాలి"అని జ్లాకీత్సే ద్వాసేలో అన్నాడు. అలా అంటున్న సమయంలో జ్లాకీత్సే కళ్ళల్లో మెరపు కానవచ్చింది. "చుక్కాని పట్టేవాడు ప్రశాంతంగానూ, క్రమబద్ధంగానూ వున్నప్పుడే పడవ సురక్షితంగా వుంటుంది. నీ సహాయకులను నీవు అదుపులో వుంచుకో. వాళ్ళు వాళ్ళ క్రిందివాళ్ళను అదుపులో పెడతారు. ఇక సమస్యలే వుండవు."

సమావేశం ముగిసినతర్వాత, జిల్లా ప్రభుత్వస్థానమైన హిసియూ గ్రామానికి జ్లాకీత్సే వెళ్ళాడు. వివిధగ్రామ గెరిల్లా సంఘాల నాయకుల సమావేశంలో పాల్గొనటానికని, దాస్వే జ్లాకీత్సేవెంట వెళ్ళాడు. మేయీ హిసియూగ్రామంలోనే పనిజేస్తూవుంది. ఆమెను చూడటంకూడా పడుతుందిగదా అనుకున్నాడు.

* * * *

ఆ సాయంత్రం మేయీ నివసిస్తున్న వీధిలో దాస్వే నడుస్తూవున్నాడు. ఆ సమయంలో అతనికి మేయీ యిల్లెక్కడని అడుగుతూవున్న ఒక స్త్రీ కంఠం వినిపించింది. ఆ స్త్రీని గుర్తించాడు. ఆమె 'బంగారు పిచ్చిక'గా హిసియూగ్రామములో ప్రసిద్ధిపొందిన వ్యక్తి. ఆమె వొంటరిగా నిద్రపోవటమంటే అసహ్యించుకొంటుందన్న విషయం జగద్విఖ్యాతం. (యిలాంటి కులీనస్త్రీలను "కట్టుతెగిన చెప్పు" అంటారు స్థానికంగా) ఆమె ముఖంనిండా పౌడరు పులుముకుంది. తల నూనెతో మిలమిలా మెరుస్తూవుంది. ఎర్రటి జాకెట్టు తొడుగుకుని వుంది. గుత్తంగా

వుండే లాగుబు ధరించింది. వొయ్యారమొలకబోస్తూ, హృదయాలను ప్రకోపింపజేస్తూ నడుస్తూ వుందామె.

"మేయీతో పనేమిటి?" అని ప్రశ్నించాడు దాస్వే.

"పనేమిటా? హుం....కోర్టుకెక్కించదలచాను" అని, బంగారు పిచ్చిక తుఫానులాగున విరుచుకుపడింది.

దాస్వే దురవస్థలో పడ్డాడు. ఆమెకన్నా త్వరగా ముందుకు సాగాడు. మేయీ నివసిస్తున్న యింటి ఆవరణలో ప్రవేశించాడు. కొన్ని సార్లు పిలిచాడు. ఎవరూ పలుకలేదు. ఇంట్లోకి పోయాడు. నిర్వికారంగా నిరామయంగా, కళ్ళప్పజెప్పి చూస్తూ, కాంగ్‌మీద పడుకున్న మేయీని చూచాడు.

"ఏమిటీ కథ?" అని, ఆదుర్దాగా ప్రశ్నించాడు. సమాధిగ్రస్తలాగున్న మేయీ శరీరంలోనికి చైతన్యం మెల్లగా స్వస్థానం చేరుకొంది. "నేను నా వుద్యోగాన్ని వదలివేస్తున్నా!" అన్నదామె కటువుగా.

దాస్వే పొట్ట పగిలేటట్లు బిగ్గరగా నవ్వసాగాడు. ఏం జరిగిందని అడిగాడు.

"ఇలాంటిపని చెయ్యలేను.... మహా బాధగా వుంది." మేయీకి కోపం వస్తూ వుంది. అ[illegible]వలన సందర్భ శుద్ధి లేకుండా మాట్లాడుతూ వుంది. "అందరూ ఆమె మంచిదన్నారు....కష్టపడి పనిజేస్తుందన్నారు... ఆమెను మహిళా సంఘానికి అధ్యక్షురాలిగా ఎన్నుకున్నాం.... ఆమె అలాంటి మనిషని నాకెలా తెలుస్తుంది.... గయ్యాళిగంప!.... మరేం.... మరేం....అందరముందరా, నన్ను కట్టుతెగిన చెప్పుమని పిలిచే ఏడ్పులొచ్చాయి!" మేయీ మాట్లాడుతూవుంటే, ఆమె రుద్ధస్వరస్థాయి క్రమేణ హెచ్చసాగింది.

"కట్టుతెగిన చెప్పు" అన్న కటకటగొట్టుతిట్టును తన నోటినుండి బయటికి క్రక్కటం పూర్తి అయ్యేసరికి, ఆమె హృదయం పూర్తిగా భగ్నమయ్యింది. నిష్కళంకమైన ఉత్తమ స్త్రీపై అపవాదు పడినప్పుడు

యేవిధంగా హృదయం వ్రక్కలయి ఘోరున యేడుస్తుందో, అంత బిల వత్తరంగా మేయీ ఏడ్వసాగింది.

సంభవించిన ప్రమాదమేమిటో దాస్వేకి యింకా స్పష్టంగా అర్థం కాలేదు. ఇంకా వివరాలు అడుగుదామనుకున్నాడు. ఇంతలోనే బంగారు పిచ్చిక బొంగురు గొంతుక బయటినుండి వినవచ్చింది. "మేయీ, ఎక్కడున్నావ్? కోర్టుకుపోదాం పద!" అని బంగారుపిచ్చిక బ్రహ్మాండము బ్రద్దలయేటట్లు అరచింది.

దాస్వే వేగంగా ఆవరణలోనికి పోయాడు. "దేనికోసం యీ గందరగోళమంతా?" అని అడిగాడు.

ఇరుగుపొరుగువారి లాభంకోసం— అంటే, చెవులు నిక్కించి పొంచివింటున్న యిరుగుపొరుగువారి లాభంకోసం— తల ఎగరేస్తూ, చేతులు వొయ్యారంగా త్రిప్పుతూ, సాధ్యమయినంత నాటకపక్కంగా, నాటకంలోని పాత్రలాగున బంగారుపిచ్చిక విషయాన్నంతనూ అధిక యిస్తూ, విస్తరీకరించసాగింది. "నన్నామె మహిళాసంఘ అధ్యక్షపదవి నుండి త్రోసేసింది. అయినా నాకేం ఫర్వాలేదు. ఏమయినాగానీ, ఆ వుద్యోగము వలన నా వొళ్ళో వొరిగేదేమిలేదు. నాకు కావలసినదల్లా యేమంటే నేను రంకుమొగుళ్ళ నుంచుకున్నానట్లు! కట్టుతెగిన చెప్పునట. దేశదిమ్మరిదాన్నట! దీని కెక్కడినుండొచ్చినాయి దమ్ములు. నన్నటాని కంట! నేనిక సహించేదిలేదు!"

దాస్వే వ్యంగ్యంగా నవ్వాడు! "నువ్వు రంకుమొగుళ్ళను పెట్టుకున్నావని నిన్ను అన్నందుకు ఆమెను కోర్టుకెక్కించదలచావుగాదూ? అచ్ఛా! నువ్వుంచుకోవటంలేదూ?"

బంగారుపిచ్చిక గుర్రుగ్గురిమి జూచింది. "ఇది నాకూ, మేయీకి సంబంధించిన విషయము. నువ్వవతలికి పో!" అన్నది. యింటివైపు రాసాగింది.

దాస్వే, ఆమె దారికి అడ్డంగా నిలబడ్డాడు. యిరుగుపొరుగు వాళ్ళు వినేటట్లుగా అసలు కథలోని రెండవభాగాన్ని వివరించసాగాడు. "నీ కొంపలో, అర్ధరాత్రివేళ; జాంగు, మోటాభాయి, శాన్‌లు గ్రుప్పులాడు

కోవటము ఎలా సంభవించింది? న్యాయాధికార్లు, కత్తెర్లు పుచ్చుకొని, నిన్ను పీడిలో వేటాడా రెందుచేత?....ఎంపికని?"

దాస్వే ఆ విధంగా గుట్టుకాస్తా బయటపెట్టేసరికి బంగారుపిచ్చిక యొక్క బోటు తల్లక్రిందులైంది. ఆమె నోరు తక్కున మూతపడింది. కాని, యుద్ధరంగాన్ని తన గుప్పెటలో వుంచుకోవాలని బంగారుపిచ్చిక పెనుగులాడింది. "ఇది మహిళా సంఘానికి సంబంధించిన సమస్య. మేయాకి, నీకూ సంబంధమేమిటి? ఆమెను వెనక వేసుకొని రావటానికి తాపత్రయ పడుతున్నావ్?"

దాస్వే, బంగారుపిచ్చికను ఆవరణ ద్వారంవైపునకు నెట్టాడు. "బింకాలు పోబోక! జడ్జీ ఎదుట నిలబడితే నీ బ్రతుకు బండలవుతుంది. పూఁ పరుగుచ్చుకో!" తలుపుదగర బంగారు పిచ్చిక తన కడగొట్టు గుండును ప్రేల్చింది. "ఇతరుల వ్యవహారంలో నీ కంపుముక్కు దూర్చకుండా వుండటం నేర్చుకో!" అని కోపంతో మండిపోతూ, కాళ్ళెగరేసుకొంటూ, బుసలుకొడుతూ కాలికి బుద్ధిచెప్పింది బంగారుపిచ్చిక.

మేయా ఆనందభాష్పనయనాలతో దాస్వేని యింట్లోకి ఆహ్వానించింది. "ఆమె గుట్టు బట్టబయలు చేసివేశావ్! ఈ ముండ నా జీవితాన్ని నరకం చేసివేసిందంటే నమ్ము!" అన్నది.

"ఇప్పుడుకూడా రాజీనామా పెట్టదలచుకొన్నావా?" అని, నవ్వసాగాడు దాస్వే.

"ఎందుకు? అది నా పని! నే నెందుకొదుల్తాను?" అన్నది మేయా.

అంగీకార సూచకంగా తలను ఆడిస్తూ, యిటీవల తాను నేర్చుకొన్న గుణపాఠాన్ని దాస్వే, మేయాకి వివరించాడు. "ప్రతివాడికి, ఏదో ఒకరకమైన కష్టం, తన పనిలో కలుగుతూ వుంటుంది. కమ్యూనిస్టులమైన మనం, ఈ కష్టాలనుజూచి భయపడరాదు. పరిస్థితులు క్లిష్టమైనకొలదీ, మనం మరింత పట్టుదలగా వుండాలి. ఉక్కులాగున తయారు కావాలి. దేనిని జూచినా భయపడరాదు."

ఒక గంటసేపు పిచ్చాపాటీ చెప్పుకొన్న తర్వాత, కేంద్ర గ్రామముకో తనకోసం ఎంతపని ఎదురు చూస్తున్నదీ దాస్వేకి అకస్మాత్తుగా జ్ఞాపకానికొచ్చింది. భోజనానికి వుండవలసిందిగా మేయీ ఆహ్వానించింది. ఆహ్వానాన్ని నిరాకరించటం యిష్టంలేకపోయినా, దాస్వే త్రోసిపుచ్చక తప్పిందిగాదు. అతడు వెంటనే పరుగెత్తుకొనిపోయాడు.

* * * *

మే నెలలో, వసంతకాలపు గోధుమపంట పండి సిద్ధంగావుంది. పంటను రక్షించటానికై గెరిల్లాదళాలన్నీ, పొలాలచుట్టూ కాపలాకాస్తున్నాయ్. దాస్వే అనుచరులు, ఆనకట్టకు దగ్గరగా కాపలా కాస్తున్నారు. మూడురోజుల వరకూ, శత్రువుల జాడ ఎక్కడా కనిపించలేదు. "సికడా" పురుగులు, ఎండలో, గల్లంతుగా మోతజేస్తున్నాయ్. ఆనకట్ట పైనున్న "విల్లో" చెట్లనీడల్లో కొంతమంది కునికిపాట్లు పడుతున్నారు. కొంతమంది సోమరితనంగా నదిలో ఈదులాడుతున్నారు. కొంతమంది కోతలు కొయ్యటంలో రైతులకు సహాయపడుతున్నారు.

నదిలో, లోతులేని ప్రదేశంలో నీళ్ళను చిందగొట్టుకుంటూ, వేగంగా ఒకస్కౌటు వచ్చాడు. నదికి ఆవలి ఒడ్డున అరమైలు దూరంలో వున్న గ్రామమైన షాంటస్‌లో శత్రువులిప్పటికే ప్రవేశించివేశారని, చెప్పాడు. నదిలో ఈదుతున్నవారు, ఒకచేతితో గుడ్డలు పట్టుకొని, మొండి మొలలతో హడావుడిగా ఒడ్డుపైకెక్కారు. వాళ్ళ రెండవ చేతిలో తుపాకులున్నాయ్.

దాస్వే, చెమటలో పూరిపోయాడు. "షాంటస్ గ్రామంలోకి జపానువాళ్ళు వచ్చేశారుట! సిద్ధపడండి! నేను చెప్పిందే ఎవ్వరూ కాల్చవద్దు! నియమాలందరికీ గుర్తున్నాయా?"

"అవును!" అని ఒక్కుమ్మడిగా అందరూ అరచారు.

"అబ్బా! నియమాలు తప్పిన వాళ్ళను కఠినంగా శిక్షిస్తాం!" అన్నాడు దాస్వే. చెయ్యూపాడు "తయారుకండి!"

ఆనకట్టమీద అంతకుపూర్వమే ఏర్పాటుచేయబడిన స్థావరాలను ఆక్రమించుకోటానికని గెరిల్లాలంతా పరుగెత్తిపోయారు. లోపలిదిక్కున బోర్లపడుకున్నారు.

వృద్ధకెప్టెన్ సలహాప్రకారం జల్లాప్రభుత్వ ఆఫీసులోనున్న క్లార్కికి ఈ వార్తనందజేయుటకై ఒక మనిషిని పంపారు.

పిస్తోలు చేతిలో పుచ్చుకొని అవిరామంగా దాస్వే ఒక స్థావరము నుండి మరియొక స్థావరానికి పోయాడు. "జ్ఞాపకముంచుకోండి_ మొట్టమొదట జాగ్రత్తగా చూడాలి. జాగ్రత్తగా గురిచూడాలి. ప్రశాంతంగా వుండాలి! గందరగోళపడకూడదు!" అని హెచ్చరించాడు.

ఆనకట్టస్లోపులో గెరిల్లాలు నిశ్శబ్దంగా పడుకొన్నారు. ఎదుటి జాగ్రత్తగా చూడసాగారు.

వాళ్ళావిధంగా చాలాసేపు వేచియున్నారు. కాని, శత్రువుల జాడ యేమీ కానరాలేదు. యేదో పొరపాటు జరిగిపోయిందని దాస్వే అనుకోసాగాడు.

వృద్ధకెప్టెన్ తలపైకెత్తి జాగ్రతగా చూసాడు. దాస్వే చేతిని గట్టిగా లంకించుకుని "అదిగో! అక్కడ చూడు!" అన్నాడు.

అక్కడవున్న గెరిల్లాలందరు సూటిగా చూస్తున్నారు. అందువలన ఎదుటి గట్టునవున్న చెట్లగుంపులోనుండి వస్తూవున్న రమారమి పదిమంది జపానువాళ్ళను, దేశద్రోహులను చూడలేదు.

"ఏంజేద్దాం?" దాస్వే నురుగులుగ్రక్కుతూ అన్నాడు

"సరేలే అక్కడ నది బాగా లోతుంది. మన కెదురుగా నున్న ప్రదేశమే కొంత లోతుతక్కువ. ఇక్కడనుండే వాళ్ళు దాటిరావాలి. నీళ్ళలో శత్రువు ప్రవేశించేటంతవరకూ తుపాకులు కాల్చవద్దని, మన వాళ్ళకు చెప్పు" అన్నాడు వృద్ధకెప్టెన్ భరోసాయిస్తూ.

"ఒకటి.... రెండు" అని కేకేస్తాను. అదే మీరు తుపాకులు పేల్చటానికి సైగయని గెరిల్లాలకు దాస్వే చెప్పాడు.

గెరిల్లాలందరూ వూపిరిబిగబట్టి పైకిచూస్తున్నారు. ఉక్కు- శిర

స్త్రాణాలు ధరించిన జపానువాళ్లు తుపాకులను మోస్తూ, ఒకరి వెనకాల మరియొకళ్లు నడుస్తున్నారు.

వీరికి దేశద్రోహి యొకడు ముందువుండి ఎదుటిగట్టునకు మార్గం చూపుతున్నాడు. జపానువాళ్లు నీళ్ళలోదిగి నడవసాగారు.

"ఒకటి!" అని అరచాడు దాస్వే.

ఒక రైఫిల్ ప్రేలింది. అది హోషాంగుది. అతడు వోపికపట్ట లేకపోయాడు. సూచనలు మరచాడు. మిగిలిన గెరిల్లాలందరూ అతణ్ణి అనుసరించారు.

జపానువాళ్ళు బెదరిపోయారు. తోకముడిచి పారిపోయారు. తమకు దారి చూపుతున్న దేశద్రోహిని అక్కడే వదిలి పారిపోయారు. అంతే గాక చచ్చిపోయిన ఒక జపానువాణ్ణికూడా నీళ్ళలో వదలి పారిపోయారు.

"మీ బుల్లెట్లను వృథాగా ఖర్చుచేయకండి! వాళ్ళను చూడగలిగితే గాని షూట్ చేయకండి!" అని వృద్ధకెప్టెన్ అరచాడు.

తేనార్ పెకిదూకాడు. "నీళ్ళల్లోనుండి ఆ తుపాకులు తెచ్చుకుందాం పదండి!" అని కేకేశాడు.

అతనితోపాటు అనేక గెరిల్లాలు ఆనకట్టమీదకు ఎక్కారు. లోతులేని నీటిలోనికి పరుగెత్తారు.

"మిగినవాళ్ళందరూ వెనక వుండిపొండి. వాళ్లు మళ్ళీ మట్టడిస్తారు!" అని అరిచాడు దాస్వే.

జపాను తుపాకి నొకదానిని తేనారు పట్టుకొచ్చాడు. మరియొకడు ఉక్కు-శిరస్త్రాణాన్ని తీసుకొనివచ్చాడు. మూడవవాడు తుపాకి గుళ్లగల బెల్టును తెచ్చాడు.

వాళ్ళు వొడ్డుమీద కెక్కుతూవున్నప్పుడు వుల్లాసంగా యికిలించసాగారు. బెదురుగొడ్డు హూ, యింకనూ నీళ్ళలోనేవున్నాడు. ఒక పెద్ద జపాను బూట్లజతలోని నీళ్ళను కుమ్మరిస్తున్నాడు. అతడు వయసులో అందరికన్నా పెద్ద. కదలికలో చిన్న.

"ఇంత ధైర్యవంతుడుగా ఎప్పుడు తయారయ్యావోయ్ బెదురు

గాడ్దూ?" అని ఆనకట్టమీదనుంచి దాస్వే కేకేశాడు. "త్వరగా కానియ్! పద! పైకి!"

"ఇప్పుడేవస్తున్నా"నని చెమురుగాడ్దు జవాబుచెప్పాడు. అతడు బూట్ల జతను మెడచుట్టూ వేసుకొన్నాడు.

అనేక తుపాకిగుళ్ళు. దేశద్రోహి తలను పచ్చడిచేసి వదిలాయి. వాడి తలలోని మెదడుపదార్థం నీళ్ళమీద తేలియాడుతూవుంది.

ఆనాటి మధ్యాహ్నం, ప్రవాహానికి దిగువభాగంనుండి యెదుటి గట్టుమీదనున్న చెట్లతోపులోనుంచి. యీమారు శత్రువులు అధిక సంఖ్యలో వచ్చారు.

వాళ్ళకు నాయకత్వం వహిస్తున్న ఒక జపాను— అధికారికూడా మనవాళ్ళకు కనబడ్డాడు. వాడు, ఒక పెద్దసామురాయి ఖడ్గాన్ని ధరించి వున్నాడు. వాడిప్రక్కన జండానుమోసేవాడొకడు. వాడు ఉదయిస్తున్న సూర్యునిగుర్తుగల జండాను మోసుకొస్తున్నాడు. మిలమిలా మెరుస్తున్న బాకాలు కానవస్తున్నాయి.

చెట్లకు ఎదురుగానున్న ఒక పెద్ద దిబ్బమీద జపానువాళ్ళు తమ జండాను పాతారు. ఆఫీసరు తన ఖడ్గాన్ని వొరనుండి బయటికిలాగాడు. బాకాలు మ్రోగినాయి. లోతులేని నీటిపైపుగా ఆ శత్రుసైనికులు పరుగెత్త సాగారు.

ఆనకట్టమీదనున్న మనుష్యులు, యీ భయంకర ప్రదర్శనాన్ని జూచి బిత్తరపోయారు. దాస్వే హృదయం గజగజలాడింది. ఇంతమంది తొత్తుకొడుకుల్ని ఆపటమెలాగా? అనుకున్నాడు. ఇంతలోనే కొంటి సైన్యం జాకీత్సే నాయకత్వాన పరుగెత్తుకుంటూవచ్చి చేరింది ఆసైనికులు రొప్పుతూ గెరిల్లాల ప్రక్కన స్థావరమేర్పరచుకున్నారు. వారి తుపాకుల క్లిక్‌మన్నాయి.

"సిద్ధంకండి! నేను సైగచేసేటంతవరకూ ఎవరూ తుపాకులు ప్రేల్చకండి!" అని, జాకీ చెప్పాడు.

శత్రువులు తుపాకులను, మెషిన్‌గన్‌ను ప్రేల్చుటతో యుద్ధాన్ని ప్రారంభించారు. బులెట్లు నెత్తిమీదుగా ధ్వనిచేస్తూ ఎగిరిపోసాగాయి.

ఆజ్ఞలకోసం ఎదురుజూస్తూ, విసుగ్గా నేలకు కరుచుకొని వేచియున్నారు గెరిల్లాలు, ప్రజాసైనికులు.

శత్రువులు ప్రాకుతూ, లోతులేని నీటిప్రదేశంలో ప్రవేశించారు. సూర్యరశ్మి వాళ్ళ తుపాకులమీద పడి తళుక్కుమంటూవుంది. ప్లాకీత్సే యొక్క బొంగురుగొంతు కేక వినగానే, మహాప్రళయంగా మన సైనికులు తమ తుపాకులు ప్రేల్చారు. ముందుభాగంలో సాగుతున్న జపాను వాళ్లు ఎక్కడివాళ్ళక్కడే కూలిపోయారు. మిగిలినవాళ్ళు తోకముడిచి పారిపోయారు. వాళ్ళను వాళ్ళ మెషిన్‌గన్ ప్రమోత కప్పేసింది.

జపానువాళ్లు మరల మూడుసార్లు ముట్టడించారు. ప్రతి తడవా వాళ్ళను గెరిల్లాలు, ప్రజాసైనికులు కలసి, వీపు చిట్లగొట్టి పంపారు.

* * *

చీకటి పడింది. శత్రువులు షాంటన్‌గ్రామానికి తిరోగమించారు వాళ్ళ తుపాకిప్రమోతలు, వారి రాక్షసకంఠాల గావుకేకలూ, చాలాదూరం నుండి లీలామాత్రంగా వినవస్తున్నాయి. గ్రామపరిసరాలను మహాగ్ని జ్వాలను నాలుకలు చాచుకొని పేరాశగా మింగివేస్తున్నాయి.

ఆనకట్టమీద అలసటజెందిన ఆ గెరిల్లాలు, సైనికులు విశ్రాంతి తీసుకుంటున్నారు. వెల్లకిలాపడుకొని నక్షత్రాలతో నిండిపోయి మిలమిలా మెరుస్తూవున్న ఆ వేసంగి ఆనుశాన్ని తదేకంగా పారజూస్తున్నారు. విసుగుపుట్టించేలాగున బావురుకప్పలు రాగాలాపనజేస్తున్నాయి. మనవాళ్ళ గొంతులు ఎండిపోయి, పచ్చిపుండులాగున తయారయాయి.

తమ గ్రామంవైపునుండి వచ్చే రోడ్డును చూపుతూ "యెవరో వస్తున్నారు!" అని చెమరుగొంటూ, మెల్లగా చెప్పాడు. తమ భుజాల మీద మూటవేసుకొని, వరుసగా తమకేసే వస్తూన్న ఆకారాలను మన సైనికులు చూశారు.

"వాళ్ళు మనదగ్గరతులే, మనకు భోజనం తెస్తున్నారు!" అని ప్లాకీ జవాబుచెప్పాడు దాస్వేకి. "ముందు, నీ ముఠావాళ్ళను కొంతమందిని తీసు

కొనిపోయి భోజనం చేసిరండి. కాస్త విశ్రాంతితీసుకొన్న తర్వాత, మీ రిక్కడకు రండి. మేము పోతాం" అన్నాడు గ్లాకీ.

"విల్లో" చెట్లవద్ద దాస్వే అనుచరులు రైతులులను కలిశారు. ఆనకట్టకు వెనుకభాగంలో వందగజాలదూరంలో యీ "విల్లో" చెట్లు వున్నాయి. గెరిల్లాలు ఆత్రంగా భుజించారు. అమితంగా నీళ్ళుతాగారు.

రైతులు తెచ్చిన సిగరెట్లను ష్వాంగ్ పంచిపెట్టాడు. "అబ్బాయిలూ, మీరు నిజంగా కడుపుబ్బతిన్నారు. ఇంటివద్ద ఆడవాళ్ళు గోధుమ రొట్టెలు తయారుచేస్తున్నారు. ఇప్పుడే యిక్కడకు తీసుకొస్తారు. కడుపులో ఖాళీలేదుగదా. వాటి నెక్కడ పెడతారోయ్!" అని వేళాకోళమాడాడు.

తేవార్, తన లాగూబెల్టును వదులుచేసుకున్నాడు. "ఏం ఫరవాలేదులే! ఎక్కడో అక్కడ కాస్త చోటు పొట్టలో కనపడకపోతుందనే!" అని నవ్వాడు.

దాస్వే తమ్ముడు రియూ, యువదళానికి నాయకుడు. మందుగుండు సామాగ్రినీ, చేతి-బాంబులను ఆనకట్టపైకి చేరవేయటంలో తోడ్పడ్డాడు. గెరిల్లాలలో రియూ ఒకడు. అతనికి సిగరెట్ కావాల్సివచ్చింది. రియూ వెనక్కు పరుగెత్తివెళ్ళి సిగరెట్ తెచ్చిపెట్టాడు.

"అలసిపోయావా?" అని రియూ, లియూని అడిగాడు.

"అలుపా? జపానువాళ్ళతో పోరాడటమంటే ఒక పెద్ద పండుగ" అన్నాడు లియూ.

పొగ త్రాగా, రియూ అతనివంక చూశాడు, ఆ చూపులో కొద్దిగా అసూయలేకపోలేదు. యదార్థానికి రియూకన్న లియూ అయిదారేళ్ళు పెద్ద.

"లియూ! నీ తుపాకితో ఒక్కసారి కాల్చనీయ్!" అని రియూ అతణ్ని బ్రతిమాలాడాడు.

తుపాకిలో మందు ఎక్కించటంలో రియూకి సాయపడాడు లియూ "భుజానికి తుపాకిమడమ గట్టిగా ఆన్చి, గట్టిగా పట్టుకో. లేకపోతే, దాని

దెబ్బకు నీవు గిరిగింతాలు కొట్టావ్!" అవి లియూ. రియూకి తుపాకి పేల్చేపై నాన్ని వివరించాడు.

రియూ, తుపాకిని పైకెత్తాడు. రియూ రెండు కళ్ళనూ, గట్టిగా చిన్నవిజేసి మూతిబిగించి తుపాకిని ప్రేల్చాడు.

"అబ్బే! అలాగాదు!" అని నవ్వుతూ "నన్ను చూడు" అన్నాడు లియూ, తుపాకిని తన చేతుల్లోకి తీసుకొని.

కాలుతూవున్న సిగరెట్ తన పెదిమలమీద వ్రేళ్ళాడుతూవుంటే లియూ, ఒక్కమారు అటువేపు చూచాడు. లక్ష్యంకోసం వెతుకసాగాడు.

నదికి అవలినొడ్డున ఒక జపానుసైనికుడు కాపలాకాస్తున్నాడు. వాడు లియూ పెదిమలమీద కాలుతూవున్న సిగరెట్‌ను జూశాడు. దాని వెలుగే వాడికి దారిచూపింది. వాడు వెంటనే ఒక్క గుండుదెబ్బతో, లియూను నేలగూల్చాడు. నేలమీద పడకపూర్వమే లియూ ప్రాణాలు పోయాయి.

తుపాకి కాల్పులధ్వని వినగానే, దాన్వే పరుగెత్తుకొచ్చాడు. అత నికి విషయమంతా అర్థమయ్యింది. కోపంతో మండిపోయాడు. రియూని ముక్కచివాట్లు పెట్టాడు. రియూకి తల దిమ్మెత్తిపోయింది. అన్నగా రేమి తిట్టున్నదీ అర్థంగాలేదు. బిత్తరపోయి చూడసాగాడు.

శవాన్ని అవతలకు లాగేయవలసిందిగా బ్లాకీకేస్ ఆజ్ఞాపించాడు. "ఇదంతా ఆ వెధవ సిగరెట్‌మూలంగా సంభవించింది. ఎవ్వరూ సిగ రెట్లు తాగరాదు. ఎవ్వరూ!.... మీరందరూ క్రిందుగాపడుకొని శత్రువులను కనిపెట్టూవుండాలి!" అన్నాడు ఉగ్రంగా.

పశ్చిమఆకాశంలో వేగుచుక్క మెరుస్తూవుంది. మేయీ గ్రామం లోని తదితర స్త్రీలు మరింత ఆహారాన్ని తీసుకొనివస్తున్నారు. ఆనకట్టకు మూడు ఫర్లాంగుల దూరంలో ఒక చిన్న కుగ్రామంవద్ద షావ్వాంగ్ వారిని కలిశాడు.

"ఎవరూ దగ్గరకు రాకూడదని బ్లాకీ అంటున్నాడు. అందుకని మీ రిక్కడే వుండిపొండి" అని ఒక ఆవరణలోనికి వాళ్ళకు గొనిపోయాడు. అక్కడ కొంతమంది ఆడవాళ్లు, రెండు పెద్ద పొయ్యిలమీద గంజికాస్తు

న్నారు. వాళ్ళను అక్కడే కూర్చోపెట్టినతర్వాత. షాంగ్ సైనికులను పిలుచుకునిరావటానికి ఆనకట్టవద్దకు పోయాడు.

దీర్ఘకాలంనుండి యుద్ధంచేస్తున్నారు. కాబట్టి దాస్వే మనుష్యులను బ్లాకీ అందరికన్నముందుగా భోజనానికి వదలిపెట్టాడు. వాళ్ళు, ఆ యింటి ఆవరణలో ప్రవేశించగానే, పొగలుగ్రక్కుతూవున్న తెడ్లను చేతుల్లో పుచ్చుకొన్న, గలగల్లాడే ఆడవాళ్లు చుట్టుముట్టారు.

"పాపం, పిల్లాళ్ళకు విపరీతంగా ఆకలేస్తూవుండాలి!....ముందుకు పొండి. తినండి!....బలాన్ని చేకూర్చుకోవాలిగా! ...."

ఆ యువతులలో ఒకతె, జపాను ఉక్కుటోపీని లాక్కొని, తన తలపై పెట్టుకుంది. "దీనికంటే, వెధవలు మట్టికుండను తగిలించుకోరాదూ?"

ఆమెకన్న చిన్నవాళ్లు గలగల నవ్వారు.

"మూర్ఖుల్లాగున ప్రవర్తించబోకం డిప్పుడు! భోజనంపెట్టండి"అని వారిని మేయీ ఆజ్ఞాపించింది. పురుషులవైపు తిరిగి, క్షమాపురస్కారంగా "క్షమించాలి! భోజనం ఆలస్యంగా తెచ్చినందుకు విచారపడుతున్నాం. ఇదంతా తొందరగా పోగుచేసుకొచ్చేసరికి అతికష్టమయింది" అన్నది.

ఉడకబెట్టిన గ్రుడ్లనూ, కాల్చిన గోధుమరొట్టెలనూ, వేడి వేడి రొట్టెల చుట్టలనూ, వూరవేసిన బాతుగ్రుడ్లనూ, గంజి గిన్నెలను ఆ స్త్రీలు వడ్డించారు. "కడుపునిండా తినండి! కడుపునిండా తింటే, జపాను వాళ్ళతో బాగా పొట్లాడగల్గుతారు!" అన్నా రా స్త్రీలు.

కార్యకర్తల పాఠశాలకు పోకముందే, మేయీ కడుపుతోంది. ఇప్పుడామె పొట్ట మరీ ముందుకుపొడుచుకొని వచ్చింది. అలాంటిస్థితిలో యిటూ అటూ పరుగెత్తగలదని దాస్వే అనుకోలేదు.

"మేం చూసుకొంటాంలే! మీ కెందుకుశ్రమ!" అని అన్నాడు దాస్వే. "పాపం! మీరు రాత్రల్లా కష్టపడి వండారు. ఇంతదూరం మోసుకొచ్చారు. అదే పదివేలు....కాస్త విశ్రాంతి తీసుకోండి" అన్నాడు.

"వినండి! వినండి! ఏమంటున్నాడో వినండి!" అని మేయీ నవ్వింది. "మగవాళ్ళు మీరే రోజల్లా, రాత్రల్లా పోట్లాడి అలవసిప్పుడు మే మలవవలసిన అవసరమేముంది?" అన్నది.

భోజనాలు పూర్తిఅయ్యాయి. తామరరేకుల్లాంటి విశాలనేత్రాలు గల ఆ స్త్రీలకు యుద్ధ వివరాలు తెల్పి, ఆ సైనికులు ఉల్లాసపరచారు. ఇంతలోనే కోడి కూసింది. చల్లని పిల్లవాయువు వీయసాగింది.

హఠాత్తుగా, తుపాకిపేలిన ధ్వని వినవచ్చింది. వృద్ధకెప్టెన్‌పింగ్ అమాంతంగా లేచాడు. "అది జపానువాళ్ళ ప్రాతఃకాలపు ముట్టడి!" అన్నాడు.

దాస్వే తన గిన్నె క్రిందపెట్టాడు. "పోదాం పదండి!" గెరిల్లాలు హడావిడిగా తుపాకులు అందుకున్నారు. తుపాకిగుళ్ళ పటకాలను తొందరగా నడుములకు బిగించుకున్నారు. దాస్వే తన తలను వెనక్కుతిప్పి "మీ ఆడాళ్ళంతా గ్రామంవైపుకు మళ్ళిపొండి!" అని కేకేశాడు.

"మమ్మల్నిగురించి బాధపడకు! మా సంగతి మేం చూసుకొంటాంలే!" అని మేయీ జవాబుచెప్పింది.

ఆనకట్టపుగా గెరిల్లాలు వేగంగా పరుగెత్తిపోతూ వుంటే, ఆ స్త్రీలు అదుర్దాగా పొగమంచులో జూడసాగారు.

* * * *

కౌంటీ ప్రజాసైనికులపై శత్రువులు అగ్నివర్షం కురిపిస్తున్నారు. గెరిల్లాలిది చూచారు. శత్రువులు ముందుకు చొచ్చుకుపోవటానికి సిద్ధమవుతున్నారనీ, అందువలన గట్టిగా నిలబడవలసిందనీ బ్లాకీత్సే చెప్పాడు. అతడు తన మాటలను పూర్తిచేసే చెయ్యకముందే శత్రువులు నీటిని చిందగొడుతూ ముందుకు చొచ్చుకొనిరాసాగారు. వాళ్ళ తుపాకులు భయంకరం, పైశాచికంగా మెరుస్తున్నాయి. శత్రువులు లోతులేని నీటి

ప్రదేశంలో ప్రవేశించగానే గెరిల్లాలు తుపాకిగుళ్ళవర్షాన్ని విపరీతంగా కురిపించారు. అనేకమంది జపానువాళ్ళు నేలకూలారు. కాని వాళ్ళంతటితో పూడుకోక మిగిలినవాళ్ళు ముందుకు త్రోసుకొనివచ్చి ఒడ్డునుసమీపించారు.

బెదురుగొడ్డు మా, హోషాంగులకు భయ మావహించింది. వాళ్ళ ముఖాలు తెల్లపడ్డాయ్. నెమ్మదిగా గట్టునుండి జారారు.

"ఎవడు పారిపోయినాసరే వాణ్ని చంపేస్తా!" అని గర్జించాడు ల్లాకీ. "ఓహోయ్! చేతిబాంబులు విసరండి!"

పెద్ద పంజాలాంటి తన చేతిలోకి నాలుగు చేతిబాంబులు లంకించు కొన్నాడు. పెద్ద త్రిప్పుత్రిప్పి విసరివేశాడు. అన్నివైపులనుండి మన సైనికులందరూ చేతిబాంబులు వెదజల్లారు. చెవులు ప్రట్టించే ధ్వని అయింది. కాళ్ళు, చేతులు ముక్కలు ముక్కలై, ఆకాశానికెగిరాయి. రక్తం కారుతూవున్న మాంసపు ముక్కలు గాలిలో చిందరపందరగా ఎగురసాగాయ్.

జపానువాళ్ళగుంపు మరియొకటి మురల తీరాన్ని సమీపించింది. వాళ్ళమీద చేతి-బాంబుల వర్షం కురిసింది. చేతిబాంబులు నేలమీదపడి భూమిచిరిగాయ్ పొగమేఘాలు లేచాయ్. శరీరాలు ముక్కలు, వ్రక్క లయామ్. అయినప్పటికీ ఇంకా జపాను సెనికాధికారి ముందుకు పోవల సిందిగా తన మనుష్యులకు సైగచేస్తూనేవున్నాడు. చెయ్యి వూపుతూనే వున్నాడు. నదికి ఆవలగట్టున జపానువాళ్ళ వెనుకభాగంలోనూ, వాళ్ళకు ఇరుప్రక్కలా తుపాకులు ప్రేలసాగాయ్. వాళ్ళెవరనుకున్నారు? దాన్వే. అతని అనుచరులు భోజనానికి పోయినప్పుడు! ల్లాకీత్నే కొంతమంది గెరి ల్లాలను అక్కడకు పంపాడు. వాళ్ళే! ఈ దెబ్బతో జపానువాళ్ళ గుండెలు జారాయ్. వాళ్ళు చిందరవందరగా పరుగెత్తసాగారు. ఆ విధంగా ఒకళ్ళ మీద మరొకరు పడుతూలేస్తూ పరుగెత్తిపోతూ వున్నప్పుడు, తమ ఆయుధాలను పారేసిపోయారు.

ల్లాకీ అర్ధ-దిగంబరావతారంలో వున్నాడు. నేరేడుపండులాంటి

అతని శరీరం చెమటతో మెరుస్తూవుంది. పిస్తోలు పైకెత్తి "వెంట పడండి!" అని ఆజ్ఞాపించాడు. గట్టునుండి క్రిందకు దుమికాడు. ఒక్క గంతులో నీళ్ళలో పడ్డాడు.

"వెంటపడండి! చంపండి!" అని వాళ్ళంతా అరచారు. పారి పోతూన్న జపానువాళ్ళ వెంటపడి, వాళ్ళను వేటాడారు.



# 4 అధ్యాయం

జపానువాళ్ళను ముదముట్టించిన మరునాడే, యిరుగుపొరుగున వున్న గ్రామాదులనుండి, గెరిల్లాలకు బహుమతులు, కేంద్రగ్రామం ఆఫీసుకు, కుప్పలు కుప్పలుగా వచ్చిపడ్డాయి. కోడిపిల్లలను, బాతుగ్రుడ్లను, వూరగాయలను, తీపిపదార్థాలను, గొర్రెలను, పందులను, సంచులనిండా మేజోళ్ళను, రైతాంగ ప్రజలు కానుకలుగా గొనివచ్చారు. మేయీ ఆఫీసులో వుంది. ఈ కానుకలను చూసి ఆమె కళ్ళు నాట్యమాడుతున్నాయి. బ్లాకీత్సే అక్కడకు వచ్చాడు. ఆమెను ఒక ప్రక్కకు తీసుకొని పోయాడు.

"మీ అత్తగారికి చాలా జబ్బుగావుంది. నిన్ను తనతో యింటికి పిలుచుకొనిపోవుటకు మీ మామగారు వచ్చాడు. నీవు త్వరగా వెళ్ళకపోతే, ఆమెకు ప్రాణాలుండగా చూడటం తటస్థపడదంటున్నాడు." అని మేయీకి చెప్పాడు. జిన్లంగ్‌కు గాయం నయమైందనీ, బందిపోటు దొంగల నాయకుడైన హో, గ్రామాన్ని వదిలిపెట్టిపోయిన నాటినుండి జినంగ్ బుద్ధిగలిగి వుంటున్నాడనీ, తెలియపరుస్తూ, హో జ్వాంగ్ గ్రామానికి మేయరైన వ్యక్తి తనకొక జాబు వ్రాశాడనీ బ్లాకీత్సే చెప్పసాగాడు. చావుబ్రతుకులమీదనున్న తన తల్లిని, మేయీ చూడటానికి వచ్చినట్లయితే తాను ఆమెను కొట్టననీ, తిట్టనని చాలా కృతజ్ఞతగా వ్యవహరిస్తానని, జిన్లంగ్ తనతో చెప్పాడని మేయరు వ్రాశాడు.

"జిస్లింగ్ గుండెదెబ్బ తగిలినప్పుడు, అతన్ని నువ్వు చూడలేదు. ఇప్పుడు, మీ అత్తగారు చావు బ్రతుకులమీద వుంది. మీ మామ చాలా జాలిగా ప్రార్థించాడు.... ఈసారైన నీవు ఇంటికిపోకపోతే, అసహ్యంగా వుంటుందేమో!.... అంతేగాక, నీవు ప్రసవించేదినాలు. బహుశః ఇంటిదగ్గనే ప్రసవించటం వీలుగా వుంటుందేమో...." అని ప్లాక్ అన్నాడు.

మేయీకి కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయ్. ఇంటికిపోవటం తన కిష్టంలేదది. ప్లాక్ బ్రతిమాలి చెప్పాడు. ఆమె చిట్టచివరకు వప్పుకుంది. తన మామగారివెంట వెళ్ళింది.

మేయీ ఇంటికి చేరిన రాత్రే, ఆమె అత్తగారు మరణించింది. కొన్నిదినాలవరకూ కర్మకాండలలో మునిగిపోయిందా కుటుంబం. దినవారాలు పూర్తి అయ్యాయో లేదో. మేయీకి నొప్పులారంభమయ్యాయి. నెలలు పూర్తిగాక పూర్వమే ప్రసవించింది. పుట్టిన బిడ్డ వట్టి బొమికల గూడు. అయితేనేం, మగపిల్లాడు. తాత సంతోషంతో గంతులేశాడు. అప్పటినుండి, ముసలాడు, తన మామూలు ఫోరణి మానేసి, మేయీకి సుష్టుగా భోజనం పెటసాగాడు. ఆమెను తనపైపునకు త్రిప్పుకొని, ఇంటి పదనే వుండేటట్లుగా చేసి, పని మానిపించి, పిల్లవాణ్ణి ఇంటివద్దనే ఆమె పోషించేటట్లు చేయాలని ముసలాడి ఎత్తు.

రాక్షసిలాంటి అత్తగారు కాస్తా నక్కలనోట పడింది గదా! అందువలన మేయీ పని బాగానేవుంది. రోజులు బాగానే గడుస్తున్నాయి. నూతన ప్రభుత్వ పరిపాలన క్రింద జిస్లింగ్‌కు యిష్టమొచ్చినట్లు తాగి తందనాలాడటానికి, చావమోదటానికి అవకాశం లేకపోయింది. మేయీ ఇప్పుడు జిల్లాప్రభుత్వ కార్యకర్త. బిడ్డపుట్టిన తర్వాత ఒక నెలరోజుల పాటు, ఆరోగ్యాన్ని బాగుపరిచుకొంటూ, మేయీ ఇంటివద్దనే విశ్రాంతి తీసుకున్నది. ఆకాలంలో, ఎడతెరపిలేకుండా రైతులు, కార్యకర్తలు, ఆమెను చూచిపోవటానికి వచ్చేవారు. స్త్రీలు తమ సమస్యలను పరిష్కరించవలసిందిగా కోరుతూ ఆమెవద్దకు వచ్చిపోతూ వుండేవారు. ఇవంతా

జిన్లింగ్ గమనిస్తూనే వున్నాడు. అందువలన ఆమెను రోడ్డుపెట్టడానికి అతనికి దమ్ములు చాలకపోయాయి.

చాలాకాలంనుండి విడాకులు పుచ్చుకుందామని, మేయీ ఆలోచిస్తూ వుంది. కాని, ఇప్పుడు కొడుకుపుట్టాడు కదా. వాడికి తండ్రీని కుటుంబ జీవితాన్ని కలుగజేయాల్సిన అవసరంగలదని భావించింది. బిడ్డ సౌభాగ్యంకోసమని, జిన్లింగ్ భార్యగా, తన స్థానాన్ని మరల ఆక్రమించి, జీవితాన్ని కొనసాగించ నిశ్చయించదలచింది మేయీ.

* * * *

అది ఆకురాలుకాలం. ఆకాశాన్ని మేఘాలు ఆవరించాయ్. వర్షం కురుస్తూవుంది. నదులు, సరస్సులు, నీళ్ళతో నిండిపోయాయ్. కట్టలు తెగేటట్లున్నాయ్. ఆ సంవత్సరం పంటలు బాగా పండినయ్. కోతలు పూర్తిగాకపూర్వమే వరదలొచ్చిపడితే ఏమౌతుందోనని రైతాంగప్రజలు భయపడసాగారు. కౌంటీ ప్రభుత్వ సమావేశం పూర్తి అయిన తర్వాత, జిల్లాలోని అన్ని కేంద్రగ్రామాలకు జెందిన కార్యకర్తల అత్యవసర సమావేశానికి పిలుపిచ్చాడు బ్లాకీత్సే. ఆనకట్టలను బలపరచటానికి. ఒక ప్లాను వేశాడు.

"ఇదొక యుద్ధవిధి. ఈ యుద్ధంలో వరదలతో మనం పోరాడవలసివుంది. ఇది మన కార్యకర్తలకొక అగ్నిపరీక్షకూడా. ప్రజల ప్రయోజనాలను నిజంగా రక్షించటానికి ఎవరికి కోర్కెగలదో, దీన్నిబట్టి బయటపడుతుంది!" అన్నాడు బ్లాకీత్సే.

తమ కేంద్రగ్రామంచే పరిపాలింపబడుతున్న గ్రామాలకు రైతాంగ ప్రజలందరినీ, ఆనాటిరాత్రే: ఆనకట్టలమీద పనిచేయుటకై షావ్యాంగ్, దాస్వేలు సమీకరించారు. ఆనకట్టమీది భాగానికి ఒక్క అడుగు క్రింది ఎత్తులో నీళ్ళు ప్రవహిస్తున్నాయ్. అంటే, ఆ ఒక్క అడుగు నీరుకూడా వస్తే, కట్ట తెగి గ్రామాలు మునిగిపోయే ప్రమాదం గలదు. వర్షం ఏకధారగా కురుస్తూవుంది. చిమ్మచీకటి అంతటా ఆవరించింది. కన్ను

పోల్చుకున్నా ఎదుటిమనిషి కానరావటంలేదు. రెల్లుకట్టల దివిటీలను వెలిగించారు. దూరాన్నుండి చూస్తే ఆనకట్ట భయంకర సర్పంలాగున కనపడుతూవుంది. జనం యిటూ, అటూ పరుగెత్తుతూ వున్నారు! పుక్క-గోతులను మట్టితో పూడుస్తున్నారు. ఉరకలేస్తూ పొంగుతూవున్న నీటి ప్రవాహాన్ని ఆపుటకై, మట్టిముద్దలు తీసుకొనివచ్చి, ఆనకట్ట ఎత్తును పెంచుతున్నారు. ఆ రాత్రంతా వాళ్ళు కష్టపడి పనిచేస్తూనే వున్నారు. ఉదయమయింది. కాని వర్షం తగ్గలేదు తాడిపోతపోస్తూవుంది. నీళ్ళ మట్టం పెరుగుతూనేవుంది. రైతులంతా తడిసి ముద్దయిపోయారు. అయినా పట్టువీడలేదు. "ఇంతా తాడిపోతపోయ్యనియ్! కుమ్మరించనీ! ఏం ఫరవాలేదు. పనిచేస్తూనేవుంటాం!" అని శపథంపట్టారా రైతులు. తిండి తింటానికయినా ఆగకుండా పని చేయసాగారా రైతులు. ఆ రోజంతా, ఆ రాత్రంతా, పొంగుతున్న నదితో కుస్తీపట్టారా రైతులు.

మూడవరోజు ఉదయమయింది. మహమ్మారిలాగున వర్షం వాళ్ళను వదలలేదు. మరింత ఘోరంగా వర్షం కురియసాగింది. ప్రవాహస్థాయి త్వరత్వరగా పెరుగసాగింది. ఆనకట్టకు మూడంగుళాల దూరం లోనికి నీరు వచ్చేసింది.

"ఏం లాభంలేదు!" అని వృద్ధులు నిట్టూర్చారు. "మన మెంత తిప్పలుపడ్డా ప్రయోజనంలేదు. చెయి దాటిపోయింది!"

ఆనకట్ట పైభాగాన్నంతటినీ ఎత్తుచేయాలంటే, యిప్పుడు టైమ్ చాలదు. అందుకని, మధ్యగా ఒక సన్నని కట్ట పోయాలని నిశ్చయించుకున్నారు.

జారుతూ, పడుతూ, లేస్తూ ష్వాంగ్ ఒక భాగంనుండి మరియొక భాగానికి పోయాడు. మధ్యలో దిబ్బపోయండి!.... ఇంకా రక్షించటానికి అవకాశముంది.... మనకిది చావుబతుకుల సమస్య!.... మేకులు కొట్టండి! ఏదయినా సరిపోతుంది! ఏం జరిగినాసరే, దానంతు చూద్దాం! అని హెచ్చరించాడు.

రైతులు కార్యకర్తలలో చాలామంది కొయ్యగొట్టాం రాళ్ళూ,

రవ్వలూ, పీటా, చేటా ఏది దొరికితే అది లంకించుకొని రావటానికని, గ్రామంలోకి పరుగెత్తారు. కార్యకర్తలు, డప్పులు సిబ్బెలు. తప్పెట్లూ మ్రోగిస్తూ, కేకలేసుకొంటూ వీధుల్లో పరుగెత్తారు. "ఆనకట ప్రమాదంలో పడిందోహోయ్! అందరు కట్టకు పరుగెత్తండహోయ్! దిబ్బ పోవటానికి ఏదివుంటే అది పట్టుకురండోహోయ్!"

గ్రామాలన్నీ మేల్కొన్నాయ్! జబ్బుతో మంచంలో పడివున్న వృద్ధకెప్టెన్ పింగ్, చంగున లేచాడు. ఒక పెద్ద గడకర్ర పుచ్చుకొని బయల్దేరాడు. బాలలు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు ఆబాలగోపాలం కొయ్యగొర్రం, తట్టలు, బుట్టలు, వరిగడ్డి కట్టలు, మోపులు, మోకులు, మేకులు, దూలాలు, దుంగలు, కడీలు, వాసాలు యిదీ అదీ యేమిటి ఇళ్ళల్లో చేతికిదొరికిందల్లా తీసుకొని ఆనకట్టవైపుగా పరుగెత్తారు! గెరిల్లాల హెడ్‌క్వార్టర్సుగావున్న కొండప తలుపులను పూడపెరికి, దాన్నే భుజానవేసుకొని నదివైపుకు సాగిపోయారు.

జేగంటలు మ్రోగినప్పుడు మేయీ తన ఇంట్లోనే వుంది గ్రామములో వినవచ్చిన కేకలకు ఆమె గుండె అదిరిపడింది పిల్లవాణ్ణి క్రిందకుదించి ఆవరణలోనికి పరుగెత్తింది. చాపలచుట్టను లంకించుకొంది. మామగారెంత గోలచేస్తూ వున్నా లక్ష్యపెట్టకుండా ఆనకట్టవైపుకు పరుగెత్తింది.

ఆనకట్టమీద మహా గందరగోళంగా వుంది. కొయ్యమేకులను దిగగొడుతూవున్న సుత్తెల దెబ్బల ధ్వని, ఒక్కుమ్మడిగా అరుచుచున్న మానవక ఠాల ధ్వనితో మేళవిస్తూవుంది. మట్టిని, చెక్కలనూ మోసుకొనిపోతూవున్న జనం ఆనకట్ట ఎక్కుతూ, దిగుతూ గందరగోళంగా పనిజేస్తున్నారు. తూర్పు భాగపు గట్టులో గండిపడింది. గబగబా అందరు అటువైపే తిరిగి కొని పోయారు గండి పూడ్చారు. ఇంతలోనే పడమటిభాగపు గటులో అయిదు అడుగుల వెడల్పు గండిపడింది. అమిత వేగంగా బురదనీరు బయటకు తోసుకొచ్చింది. దాన్నే, తేవారు మరి డజనుమంది యువకులు అమాంతంగా ప్రవాహంలో దుమికారు. ఒక తలుపును నిలువుగా గండిమీదకు నెట్టారు. వానికి బలంగా మట్టిసుద్దలు

గబగబా విసిరారు. అబ్బే! ఆలస్యమైపోయింది. లాభంలేదు! ఉత్తుంగతురంగంలాగున ఎగిరిపడుతూ వున్న ఆ ప్రవాహం ఆ తలుపునూ, పట్టిని, మనుషులనూ ఒక్కతోపు తోసింది. ఆ మనుషులూ, పట్టి, తలుపు చేలల్లో పడ్డారు. గడి పదియడుగుల వెడల్పయింది. కట్టిన అడ్డుకట్టకాస్తా తుడిచిపెట్టుకొని పోయింది. నీళ్ళోడుతున్న ఆ మనుషులు, మరల ఆనకట్ట ఎక్కారు. పగులు ప్రక్కలను కోసేస్తున్న ఆ మహా ప్రవాహాన్ని నిరాశా పీడిత నయనాలతో చూడసాగారు. రెల్లుకట్టలతో నిండియున్న పెద్ద పడవొకదాన్ని వృద్ధకెప్టెన్ వింగ్, షాంగ్‌లు చూచారు. దాని లంగరు తెగి వుంది. వేగంగా అది ప్రవాహంలోపడి కొట్టుకుపోతూ వుంది. సుడిగుండాలు తిరుగుతున్న నదీ ప్రవాహంలోనికి వారిద్దరూ దుమికారు. పడవను ఆపారు. దాన్ని గండివద్దకు జేర్చారు.

"దానడుగున బొక్కపెట్టండి! దానినిండా మట్టిసుద్దలు కొట్టండి!" అని అరిచారు.

యిరవై సెకండ్లలో ఆ బోటును, గండికి అడ్డంగా ముంచేశారు. రెల్లుకట్టలు, మట్టితోసహా గట్టిగా ముంచేశారు. బరువుగల వస్తువులన్నింటినీ ఆ పడవపై కుప్పేశారు.

"లైనుగా నుంచోండి! మట్టిసుద్ద లందియ్యండి!" అని అరచాడు దాస్వే.'

ఒకచేతినుండి మరియొక చేతిద్వారా, పెద్దపెద్ద మట్టిసుద్దలు ఆనకట్టమీదకు ఎగిరాయి. వీళ్ళకు అండగా క్రొత్తవాళ్ళను వెంటబెట్టుకొని వస్తూవున్న కార్యకర్తలు యితర గ్రామాలనుండి పరుగెత్తుకొచ్చారు. మట్టిసుద్దలను పడవచుట్టూ విసరికొట్టారు. పడవలోకి విసరికొట్టారు. పడవ ఒక్క రవ్వంతైనా కనపడకుండా మట్టిసుద్దలతో నింపేశారు.

ఆ విధంగా, గండిని ఆపారు.

చీకటిపడే సమయానికి వర్షం ఆగిపోయింది. నీటిని, భూమినిపొగమంచు దట్టంగా కప్పేసింది. నిశాదేవి తన ఆఫీసు తెరిచింది. మనవాళ్ళు లాంతర్లు, దివిటీలు వెలిగించారు. నాలుగోరోజు తెల్లవారింది. నది పెరుగ

లేదని వ్యక్తమయింది. అయినప్పటికీ. మనవాళ్ళు ఆనకట్ట కావలా పని మీద నేవున్నారు.

ఆనాటి సాయంత్రం. వరదలు తగసాగాయి. యిది చూచిన తరువాతనే జబ్బుతో బాధపడుతూవున్న వృద్ధకెప్టెన్ పింగ్. గ్రామానికి తడబడుతూ వెళ్ళాడు.

గ్రామస్థులు కొంత విశ్రాంతి తీసుకోసాగారు. వంగి వొరుగుతూ వున్న తమ పొలాలలోని పైరులవంక రెప్పార్చక చూడసాగారు. 'కోయిలాంగ్' పదడుగుల పొడవు పెరిగింది. కంకులు గాలికి వూగుతున్నాయి. ప్రతి త్తికాయలు ఎండి. బ్రద్దలై సిద్ధంగావున్నాయి. గోధుమకంకులు అలలు అలలుగా వూగుతున్నాయి. నూటికి ఎనభై పాళ్ళ పంట పడుతుందీ యేడు. కొంతమంది వృద్ధులు. కృతజ్ఞతా పురస్కారంగా ప్రార్థనలు సలిపారు. పిల్లలు మరల ఆడుకోసాగారు. ఇంతకుపెండింతలు కష్టపడినప్పటికి. నష్టంలేదని యువక రైతు లన్నారు.

అవిరామంగా పనిచేసినందుకు కార్యకర్తలను అందరూ పొగడారు మూడు రాత్రిళ్ళు పగళ్ళు నిద్రాహారాలులేకుండా. వరదలలో యుద్ధం చేసినవైనాన్ని వివరంగా చెప్పుకోసాగారు. ఇంటికిపోయి కొంతవిశ్రాంతి తీసుకోవలసిందిగా కార్యకర్తలను. రైతులు బ్రతిమాలారు. దాస్వే. షావ్వాంగులు. ఒకళ్ళ నొకళ్ళు చూసుకొన్నారు.

"ఒహోయ్: నీవు సరిగ్గా మట్టిబుద్ధుడులాగున్నావోయ్!" అన్నాడు దాస్వే.

"నీ స్వంత సోదరుణ్ణే గుర్తించటంలేదా?" అని షావ్వాంగు ప్రత్యుత్తరమిచ్చాడు.

"మన మిద్దరం ఒకే రికం!"

నవ్వుతూ త్రేలుతూ. కార్యకర్తలు గ్రామింపైపుగా నడచిపోయారు.

గ్రామపాలక సంఘం ఆఫీసులో ప్రతి గదిలోనూ వర్షపుధారలు పడుతున్నాయనే చెప్పాలి. కొంచెం పొడిగావున్న గది నొకదానిని చిట్టచివరకు ఎలాగయితేనేం దాస్వే. షావ్వాంగులు వెతకిపట్టుకున్నారు. తమ

ముఖాలకు అంటుకున్న బురదలో కొంతభాగాన్ని తుడిచేసుకున్నారు. షాంగ్‌కు నిల్చునే ఓపికలేకపోయింది. పూర్వంకన్న అతని పల్చని ముఖం మరింతగా తెల్లబడిపోయింది. ఎరుపెక్కిన కళ్ళు సగంమూసుకు పోయాయి.

షాంగ్ చేనేత కార్మికుడు. అయిదురాత్రిళ్ళు. పగళ్ళలో పన్నెండు బోల్టుల పువ్వుల నేతగల గుడ్డను నేసేవాడు. ఈ పనే అతని ఆరోగ్యాన్ని బలిగొన్నది. అమితంగా అలసిపోతే నోటివెంట యీనాటికీ నెత్తురుపడు తూనేవుంది అయితే అతడు పార్టీసభ్యుడు.

ఒక బాధ్యతను తీసుకొంటే, ఆ పని పూర్తిఅయ్యేవరకూ నిద్ర పోయేవాడుగాదు. గత మూడు రోజులనుండి ఆనకట్టమీద పనిచేయటం వలన అతను అలసిపోయాడు. అతడు తన కళ్ళను తెరవలేకపోయాడు. కాని, తన తుపాకిని బాగుచేస్తూనే వున్నాడు. దాస్వే హృదయం కరగి పోయింది.

షాంగ్‌యొక్క తుపాకిని దాస్వే లాక్కున్నాడు. కాంగ్‌మీదకు షాంగ్‌ను దొర్లించాడు. "నీ అవతార మెట్లావుందో చూసుకో ! దాన్ని నేను శుభ్రంచేసిపెటాలే ! కొంత విశ్రాంతి తీసుకో !"

"ఊహుం అదేం కుదరదు" అని షాంగ్ మరల తన తుపాకిని లాక్కున్నాడు. "నాకుమల్లే నువ్వూ అలసిపోయావ్!"

వాళ్ళిదరూ ఆ విధంగా గుంజుకోటం, లాక్కోటం వేశారు. ఫలిత మేమంటే, దాస్వే తుపాకిని షాంగ్ శుభ్రపరిచాడు. షాంగ్ తుపాకిని దాస్వే శుభ్రపరచాడు. నిశ్శబ్దంగా వాళ్ళిద్దరూ ఎదురుబొదురుగా పనిపూర్తి అయ్యేవరకూ కాంగ్‌మీద కూర్చున్నారు. ఇద్దరినీ అలసట ముంచెత్తి వేసింది. మన్ను దున్ని అలసిపోయిన పశువుల్లాగున, భోజనంచేయకుండానే కాళ్ళుచాపుకొని వళ్ళుతెలియని నిద్రపోయారు.

రైతాంగప్రజల హృదయాలు తేలికపడ్డాయ్. ఆ రాత్రి వారు భోజనంచేశారు. పెందలకడనే నిద్రపోయారు.

వయసులోనున్న గెరిల్లాలు వంతులవారీగా ఆనకట్టను కాపలా కాస్తామన్నారు. తాను పర్యవేక్షిస్తానని ముందుకువచ్చాడు తేవార్.

అర్ధరాత్రిసమయమది. ఆ చీకటిలో జపానువాళ్ళు ఒక బోటు వేసుకొని బయలుదేరారు. సరస్సునకు కొన్ని మైళ్ళ ఎగువభాగంలో బోటు దిగారు. రమారమి మూడువందలమంది రైతులను చుట్టుముట్టారు. వాళ్ళం దరినీ ఆనకట్టవద్దకు తోలుకునివచ్చారు.

పారిపోటానికి యత్నించినవాళ్ళను కాల్చిచంపారు. పనిచేయటానికి నిరాకరించినవాళ్ళను నీళ్ళలో పడత్రోశారు. మిగిలినవాళ్ల చేత బలాత్కారంగా ఆనకట్టకు ఇటువైపున, పాతికమైలు పొడవున లోతుగా కందకాలు త్రవ్వటానికి వినియోగించారు. బలహీనంగావున్న యేటికట్ట పై భాగం మధ్యలో పెద్ద గొయ్యి త్రవ్వించారు. యిరుప్రక్కలకూ పిక్కల బలంకొలది అక్కడున్నవాళ్లంతా పరుగెత్తిపోయారు. గండినుండి నీళ్ళు జోరుగా ప్రవహించసాగింది. ఉన్న అడ్డంకాస్తా కూలిపోయింది. గర్జిస్తూ నదీప్రవాహం పంటపొలాలను ముంచెత్తివేసింది. దాని ధ్వని అయిదు మైళ్ళ దూరంలో వినిపించసాగింది.

దాస్కే, ష్వాంగ్ లు నిద్రతో తుమ్మమొద్దుల్లాగున పడియున్నారు. తేవార్ అక్కడికి పరుగెత్తుకుంటూ వచ్చాడు. వాళ్లను కుదిపాడు. మేల్కొల్పాడు.

"లేవండి! లేవండి! శత్రువులు యేటికట్టను బద్దలగొట్టారు. నీళ్ళొచ్చేస్తున్నాయ్!"

వాళ్లు ఛంగున లేచారు. ఇంటిపైకెక్కి చూశారు. వీధుల్లో గెరిల్లాలు హెచ్చరికగా కేకలేస్తున్నారు. "అందరూ లేవండి! వరద వచ్చేస్తోంది!"

అంతకంతకు, నదీప్రవాహం నురుగులు గ్రక్కుతూ దగ్గరగా వచ్చేస్తోంది. భయంతో పారిపోతూవున్న నక్కలను, కుందేళ్ళనూ వేటాడుతూ వస్తూవున్నట్లు ఉరకలువేస్తూ, నురుగులుగ్రక్కుతూ, ప్రవాహం యొక్క అలలు త్రోసుకు వస్తున్నాయ్. పంటలు-మునిగిపోతూవున్నాయి- బంగారంలాంటి పంటలు-అందమైన పంటలు, మహా మేరుపర్వతంలాగా వున్న ఆ నదీప్రవాహం క్రింద సమాధి చేయబడుతున్నాయి. తనకేమీ పట్టు

నట్లుగా అష్టమిచంద్రుడు సుష్టుగా తన శీతల చంద్రికలను వెదజల్లుతున్నాడు.

పొలాలకు అడ్డంపడి. నదీప్రవాహం గ్రామంపైపుగా వురకలేస్తూ వస్తోంది. దానిని ఆపటానికి టైమ్ లేదు. తినుబండారాలను ప్రోగుజేసుకుని తమతమ యిళ్ళెక్కారు గ్రామంలోని జనం. కొంతమంది పాకలకు పరుగెత్తారు. కొంతమంది తమ పశువులకోసం పరుగెత్తారు. బురదనీరు ధన్‌మంటూ గ్రామంలోనికి దూరింది.

రైతులకేకలు, పెడబొబ్బలు కలిసిపోయాయి. వరద రణగొణ ధ్వనిలో మునిగిపోయాయి.

“ఆరి దేవుడా! మేమంతా చస్తున్నాం!” అని ముసలమ్మ పెట్టపెట్టున ఏడ్వసాగింది.

గుండెలో కత్తిదూసుకుపోయినట్లనిపించింది దాస్వేక్. నిదేపక్షికముగా పొంగి పొరలివస్తున్న ఏడ్పును ఆపుకోలేకపోయాడు. భోరున ఏడ్చాడు.

కళ్ళఎదుట కోట్లాది నిప్పురవ్వలు ఎగిరి, మండుతూవున్నట్లనిపించింది షాంగుకు. అతని హృదయం మండిపోసాగింది. విషతిక్తం అతని గొంతులో వూరి. వుబికింది. పచ్చినెత్తురు గ్రక్కసాగాడు. పిట్టగోడ కానుకొని యింటి పైకప్పుమీద నిల్చున్నవాడల్లా కూలబడ్డాడు. అతనికి ఆయాసం ప్రారంభమయింది. రొప్పసాగాడు. ఊపిరి కోసం యుద్ధం జేశాడు.

*   *   *   *

ఆ సంవత్సరం జపానువాళ్ళు అనేక కౌంటీలలో వేలాది ఎకరాల పంటభూములను, వరదలతో ముంచెత్తివేశారు. ప్రతిఘటనోద్యమంలో నానాటికీ హెచ్చుగావచ్చి చేరుతున్న రైతాంగప్రజల ప్రతిఘటనాశక్తిని భగ్నంకావించుటకుగాను, జపానువాళ్ళు వేసుకొన్న కార్యక్రమంలో

పెకుదికిపోయాయి. ద్రాక్షాసవపు గ్లాసును క్రిందపెట్టాడు. గంభీరంగా "కమాండర్ హో! నా సంగతి మీకు తెలును....దాచకుండా చెప్తున్నా సూటిగా చెప్తున్నా.... జీవో లోపలుంటే.... నేను బయటకు పోతా....!"

జిన్లంగును జీవో తుపాకితో కాల్చిన విషయాన్ని హో, అతని కుమారుడూ తేలికగా చూసేశారు. కావాలని జీవో కాల్చలేదన్నాడు అమి తంకా లాలించి, బెల్లించి వొప్పించినతర్వాత చిట్టచివరకు ఎలాగై తేనేం జిన్లంగు ముక్కుకు తాడేసి లొంగదీశాడు.

జిన్లంగు వెళ్ళిపోతూవుంటే హో అతణ్ణిపిలిచి, రెండు బొస్సుల నల్లమందు యిచ్చాడు. "ఈ విషయాన్ని ఒక్కరవ్వంతయినా ఎవ్వరికి పొక్కనీయబోకు!" అని హెచ్చరించాడు. "మన మెస్సుడు వెళ్ళేది నీకు తెలియవద్దు!" అని చెప్పాడు హో.

తడబడుతూ జిన్లంగు యింటికిపోయాడు.

* * * *

మేయీ పిల్లవాడిని నిద్రబుచ్చింది. లాంపు వెలుతురులో కూర్చుని కుట్టుకొంటూవుంది. బాగా ప్రొద్దుపోయింది. యిలాంటి వేళలో బయటికి పోయిన జిన్లంగు తిరిగిరాలేదంటే ఏదో కథ వుండివుంటుందని ఆమె భావించింది.

అతను లోపలికి వచ్చేసరికి లాంపులోని చమురంతా అయిపో యింది. త్రాగటంవలన అతనిముఖం మండిపోతూవుంది.

"యింత ఆలస్యంగా రావటంలో అర్థమేమిటి?" అని మేయీ గద్దించింది. "ఎక్కడికిపోయావ్?"

"ప్రత్యేకంగా ఎక్కడికీ పోలేను!" అని జిన్లంగు గొణిగాడు. "ఏదో ఒక స్నేహితుడు కనబడ్డాడు; వాడూ నేనూ రెండు దోసు లేసు కున్నాం!"

"ఎవడు వాడు?"

"నువ్వేరుగున్నవాడుకాదు!" జిన్లంగ్ రాంగ్‌మీద కూర్చున్నాడు·
"గొంతు ఎండిపోయింది. కాసిని మంచినీళ్లు పట్టుకురా."

మేయీ గదినివిడిచి వెళ్ళగానే తొందరగా, అతడు నల్లమందు ప్యాకేట్‌ను బయటకు తీశాడు. ఒక పటం చట్రంవెనుక దాచాడు. కాని తృప్తికలుగలేదు.

దానిని మళ్ళీ బయటికి తీశాడు. దానిని దాచటానికి, గదిలో సురక్షితమైన ప్రదేశ మెచ్చట దొరుకుతుందాయని గాలిస్తూ, గదంతా తచ్చాడాడు. చిట్టచివరకు, ఒల్లక్రిందవున్న పాతచెప్పులో దాన్నికుక్కాడు. హడావిడిగా బట్టలు విస్పతిసేసుకుని మంచంమీదకు దుమికాడు. నిద్రపోయాడు.

బయట నిలబడి మేయీ కిటికీద్వారా యీ కథంతా కనిపెడ్తానే వుంది. ఆమె లోపలికివచ్చింది, నీళ్ళను బల్లమీద పెట్టింది. నెమ్మదిగా ఆ పాకెట్‌ను చెప్పునుండి బయటకు లాగింది. దానిని తెరచింది. నల్లమందు అని గ్రహించింది. దానిని మరల మూసివేసింది. ప్యాకెట్‌ను తన రెవికలో దాచింది. అటుతర్వాత భర్తను లేపింది.

జిన్లంగు లేచికూర్చున్నాడు, మంచినీళ్లు త్రాగాడు. మేయీవంక, ఎర్రబారిన కళ్ళతో చూచాడు. చాలా ప్రొద్దుపోయింది. నిద్రపోదాం పట్టు" అన్నాడు.

"ఈ రాత్రి నువ్వేంచేసినదీ చెప్పేవరకు నేను నిద్రపోను!" అన్నది మేయీ కోపంగా.

"రెండు డోసులేశాను. అంతే. జూద మాడలేదు. ముండలతో పోలేదు. ఎందుకంత కంగారుపడతావ్?" అన్నాడు.

"సరేలే! నిజం చెప్పవులే—నా కెందు కొచ్చింది. ఇకనుంచి నా దారి నాది: నీ దారినీది. కథ ముగిసింది!" అన్నది.

"పిచ్చిగా మాట్లాడబోకు! నే నెక్కడికీ పోవటంలేదు. నిన్ను గురించి జాగ్రత్త తీసుకోవటంలేదూ? నిద్రపోదాంపట్టు...." అన్నాడు జిన్లంగు.

"ఏమిటా మొండిపట్టు? ఇంకా నిజం చెప్పటంలేదు. ఇదిగో, అడుగుతున్నా—యీ నల్లమందెక్కడిది నీకు?"

జిన్నంగుకు ఆశ్చర్యమేసింది. కాని, నెరాలు బిగబట్టాడు బయటపడకుండా. మేయీవంక తేరిపారజూచాడు. "నల్లమందేమిటి?" అని ఎదురు ప్రశ్నించాడు.

"నటించబోకు" అన్నది మేయీ. "నేను నిన్ను చూశాను. యీ చెత్త నాకొద్దు. ఎవరిచ్చారో చెప్పు. చెప్పావా గొడవేమివుండదు. లేకపోతే విచారపడతావ్!" అన్నది.

జిన్నంగు మూలకు నెట్టబడ్డాడు. తప్పించుకోటానికి మార్గం లేకపోయింది. చెప్పకపోతే ఆమె గల్లంతుచేస్తుందేమోనన్న భయంతో "గొపీ నాకిచ్చాడు" అన్నాడు

"ఎందుకిచ్చాడు?" అన్నది.

"దానిని అమ్ముకొని, డబ్బు వాడుకోమన్నాడు. మనం యిబ్బందుల్లో వున్నామని వాడికి తెలుసుగా" అన్నాడు.

"పాపం మా. వరదలొచ్చి పోయినతర్వాత మనం డబ్బుకు కటకటలాడుతూవుంటే, వాడికి నెట్టను అమ్మవుకదూ—అప్పుడు సహాయపడలేదేం? ఇప్పుడేమైంది ఆపాయత?" జిన్నంగు నిరుత్తరుడయ్యాడు. మేయీ సాగించింది. "మనిద్దరం భార్యాభర్తలం. నీకేది సంబంధించినా—ఏవొచ్చినా— మంచిగాని, చెడుగాని దానిలో నేను పాలుపంచుకోవాలి. నా దగ్గరెందుకు దాచావ్? నాతో చెప్పు— నీకేమీ చెరుపు చెయ్యను. ఈ విషయమంతా ఏమిటో వివరంగా చెప్పెయ్" అన్నది.

ఆమె మాట్లాడటం ప్రారంభించింది కాబట్టి, పెద్దగా వత్తిడిచేస్తూ వుందికాబట్టి, జిన్నంగు మరికొంత సమాచారాన్ని జారవిడిచాడు. యదార్థానికి యీ నల్లమందును గొపి తండ్రియిచ్చాడు. ఒక్కరవ్వయినా ఎవరికీ పొక్కనీకుసుమా!" అన్నాడు.

నిమిష నిమిషానికి విషయమంతా విశదం కాజొచ్చింది. తనకు నమ్మకం కుదరనట్లు నటించింది.

"ఓహో! అంతేనా? అయితే దాన్ని నీ కెందుకు కిచ్చాడు?" అని మరల ప్రశ్నించింది.

"చిన్న విషయాన్నిగురించి యిన్ని ప్రశ్నలా? యింత రభసా? అయ్యో! ప్రాణాలు కొరికేస్తున్నావ్! ప్రాణాంతకురాలివి!" అన్నాడు.

ఆ నల్లమందు ప్యాకెట్ తాను దాచినజోళ్ళలో వుందోలేదో చూడటానికని కాంగ్‌నుంచి క్రిందకు దూకాడు మేయీ నవ్వింది. ఆయిల్ పేపరుచుట్టివున్న ఆ ప్యాకెట్‌ను అతని చేతికి అందించింది. "దీనికోసమే కదూ వెతుకుతున్నది. భలే ఖరీదు గలది! అలాంటి అమూల్య వస్తువును పాతచెప్పులో దాచరాదు. పాడైపోతుంది. జాగ్రత్తగా దాచిపెట్టుకో!" అన్నది.

ప్రొద్దున్నే దీన్ని అమ్ముతా. నీ భాగం నీకిస్తా" అని జిన్లంగు చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"మధ్య పంజిలేమిటి?" అని ప్రశ్నించింది. "ఏమిచేయమన్నావేమిటి? అది మన లాభానికయితే. నేనూ సహాయపడతా!" అన్నది.

జిన్లంగ్ తప్పత్రాగి వున్నాడు. మేయీ తనపట్ల చూపుతున్న ఆప్యాయతను ప్రతిఘటించలేకపోయాడు. "తనతో నగరానికి రమ్మన్నాడు. "తనతో నగరానికి రమ్మన్నాడు" అని మెల్లగా మేయీ చెవిలో వూదాడు. భయపడకు! నేను వాడితో పోనులే—అబద్ధం చెప్పటంలేదు. నిజంగానే. అబద్ధంచెపితే నా ముత్తవతో.... నల్లే!"

"పోతావో పోవో అది నీయిష్టం" అని మేయీ మెరపులాంటి చిరునవ్వు వొలకబోసింది. "అలాంటి వొట్లు పెట్టుకోకూడదు!" అన్నది. లాంపు వూదేసింది. డ్రెస్సు విప్పదీసింది. పడక చేరింది.

ఒక్క చిటికలోనే జిన్లంగు సుఖంగా నిద్రపోసాగాడు. గుర్రు పెడుతున్నాడో లేదోయని మేయీ కొన్నిక్షణాలపాటు అతని ఉచ్ఛ్వాస నిశ్వాలను పరీక్షించింది.

అటుతర్వాత మెల్లగా కాంగ్‌నుండి క్రిందికి దిగింది. దుస్తులు వేసుకొంది. తన తలకు నీలిరంగు ముసుగు తగిలించుకొంది. మెల్లగా తలుపు తెరచింది. బయటకు జారింది. జోరుగావున్న చలిగాలి. ఆమె

యిదొకభాగం. వరదలచే పీడించబడిన ప్రాంతాలలోని రైతాంగప్రజలను, కమ్యూనిస్టులు, ప్రభుత్వమూ సమీకరించారు. ధనాన్ని ప్రోగుజేశారు. తినుబండారాలను ప్రోగుజేశారు. వరదబాధితులకు పంపారు. కార్యకర్తలు తమ అహారాన్ని. బట్టలను పొదుపుగా వాడుకొని, మిగిలినదంతా వరదబాధితుల సహాయార్థం పంపారు. ధాన్యాన్ని, వంటచెరకును మోసుకొనివచ్చిన పడవలు ఒకదానితర్వాత మరియొకటి వెంటవెంటనే వచ్చాయి.

వరదలు తగ్గిపోగానే, నాట్లువేయటానికి ప్రభుత్వం గోధుమ విత్తనాలు తెచ్చింది. మహిళలను సమీకరించారు. చాపలు, బుట్టలు, అల్లటానికి వాళ్ళకు తుంగగడ్డిని సప్లయిచేశారు. అన్నిరకాల చేతిపనులను, వరదలచే పీడించబడిన గ్రామాలలో ప్రోత్సహించారు.

క్రమంగా వరదలచే పీడించబడిన గ్రామాలు కోలుకోసాగాయి.

నివారణ కార్యక్రమంలో నిమగ్నులైవున్న కాలంలో దాస్వే, షాంగులు, హోజ్యాంగ్ గ్రామానికి పోయివస్తూ వుండేవారు. అక్కడ మేయీని అనేకసార్లు చూశారు. ఆమె కొంపలో చేపలు పట్టుకుని రాగలిగినవాళ్ళు కానీ, లేక ఏ ఇతరమైన పనినైనా చేయగలిగినవారుగానీ, లేరు. ప్రభుత్వం సహాయపడకపోయినట్లయితే, ఆ కొంపలోని వాళ్ళంతా ఆకలితో మాడిపోవాల్సివచ్చేది. పైకేమీ చెప్పకపోయినా జిన్లంగ్ ప్రభుత్వ సహాయాన్ని మెచ్చుకుంటూనేవున్నాడు. పనిలో మరల వచ్చి చేరవలసిందిగా కోరుతూ జ్లాకీత్సే తనకు వ్రాసిన జాబును మేయీ, జిన్లంగ్‌కు చూపింది. అతడు హర్షించాడు. సాధ్యమైనప్పుడల్లా ఇంటికి వచ్చిపోతూ వుండటానికి పిల్లవాణ్ని తనతో మేయీ తీసుకొనిపోవటానికి ఏర్పాట్లు చేయబడినాయి. జిన్లంగ్ అందుకు వప్పుకున్నాడు. ఆమె తన సామానులు సర్దుకుంటూవుంటే సహాయపడ్డాడు. తండ్రి ఆశ్చర్యంతో అతణ్ని ఒక ప్రక్కకు తీసుకునిపోయి "ఆమె వెళ్ళిపోతూవుంటే ఎలా వూరుకుంటున్నావ్?" అని అడిగాడు.

"తప్పకుండా వెళ్ళనివ్వాల్సిందే!" అని జిన్లంగ్ అన్నాడు "ఏమైనప్పటికీ, పూర్వంమాదిరిగా అధికార్లు పిచ్చివేషాలను సహించరు. కనుక వెళ్ళనివ్వటం మంచిది." పిల్లవాణ్ని ఎత్తుకుని, తీసుకువెళుతూ, మేయీ వెంట, జిల్లా ప్రభుత్వానికి జిన్లంగ్ వెంటడించాడు.

కొన్ని వారాలు గడిచినాయి. మామగారు వెళ్ళి మేయీని, పిల్లవాణ్ని పిలుచుకుని వచ్చాడు. ఎందుకంటే సంవత్సరాది సెలవలు వాళ్ళ ఇంటివద్దనే గడిపితే బాగుంటుందన్న వుద్దేశంతో మేయీని, పిల్లవాణ్ని తీసుకొచ్చాడు మామగారు. జన్లంగ్ పిల్లవాణ్ని ఎత్తుకున్నాడు. ఎంత బాగా పెరిగాడని ఆశ్చర్యపోయాడు, చాలా స్నేహంగా, ఆప్యాయంగా, భార్యాభర్తలిద్దరూ పిచ్చాపాటీ చెప్పుకొన్నారు. నవ్వుకున్నారు. పిల్లాడితో ఆడుకొన్నారు.

ఏదో పనిమీద, ఆ మరునాటి రాత్రి, జిన్లంగ్ వీధిలోకి పోయాడు. వీధిలో జిన్లంగ్‌కు గోపి కలిశాడు. దేశద్రోహిగా తయారయిన బందిపోటుదొంగ, హో యొక్క కొడుకు గోపీ.

"ఇంటికి పోదాం పద! రెండు బుల్డ్డాం పద!" అన్నాడు గోపి, జిన్లంగుతో.

త్రాగుడంటే వదిలిపెట్టే రకం గాదు జిన్లంగ్, అందువలన, ఇచ్ఛాపూర్వకంగానే గోపిని అనుసరించాడు. వీళ్ళిద్దరూ హఠాత్తుగా కలిశారనుకుంటారేమో! అదేమికాదు. బందిపోటుదొంగ హో తన యింట్లో దాక్కొని వున్నాడు. జిన్లంగ్‌ను తీసుకుని రావలసిందిగా తన కొడుకైన గోపిని పంపాడు.

బాలూ సైన్యానికి సేనాధిపతియైన జనరల్ లూ, ఇంతకుపూర్వం బందిపోటుతనాలు చేస్తూ జీవితాలను సాగిస్తున్న ముఠాలన్నింటినీ చిన్నాభిన్నం గావించాడు. క్రొత్త ప్రజారక్షణదళాలను నిర్మించాడు. ఆ దుమారంలో బందిపోటు దొంగలైన హో, వాడి అనుచరులంతాకూడా కొట్టుకుపోవాల్సి వచ్చింది. కొట్టుకుపోయారు. పోయిపోయి హో, కొమిటాంగ్ ప్రాంతంలో చేరాడు. తన కార్యకలాపాలను అక్కడే సాగిస్తూ వచ్చాడు. అటుతర్వాత దేశద్రోహిగా తయారయ్యాడు. జపానువాళ్ళ

వశంలోవున్న నగరానికి పోతూ, పోతూ కుటుంబాన్ని చూచిపోదామని స్వగ్రామానికి వచ్చాడు. జిస్లంగ్ మంచి ధైర్యవంతుడని, మంచి గురికాడన్న విషయం హోకు బాగా తెలుసు. అందుకనే జిస్లంగును వెంట బెట్టుకుపోదామని భావించి పిలిపించాడు.

గాపే, జిస్లంగ్‌లు హోయొక్క రాజభవనంలో ప్రవేశించారు. వారు కుటుంబ దేవాలయంగుండా నడిచారు. ఒక ఆవరణ దాటారు. ఉత్తరభాగంలోని తలుపు తెరచాడు. వెచ్చగానూ, బాగా ప్రకాశంగానూ వున్న గదిలో ప్రవేశించారు. చిరునవ్వు ఒలకబోస్తూ గుండ్రని కుర్చీలో నుండి లేచాడు హో. జిస్లంగ్‌కు ఆశ్చర్యమేసింది. ఎందువల్లనంటే తన తండ్రి తిరిగి వచ్చాడని, గాపే దారిలో మాటమాత్రమైనా తనతో చెప్పలేదు. హో మెత్తని గొర్రెబొచ్చుతో నేసిన టోపీని ధరించి వున్నాడు. నక్కబొచ్చుతో అంచులు కుట్టిన మంచి ఖరీదుగల కోటు ధరించాడు. అతని ముఖంలో వుల్లాసం వుట్టిపడుతూవుంది. ఎర్రగా వుంది. పూర్వం కన్న బలిసివున్నాడు. ద్రాక్షాసవాన్ని గ్లాసులలో పోయవలసిందిగా హో గాపేని ఆజ్ఞాపించాడు. ఆ ముగ్గురూ త్రాగసాగారు

త్రాగుతున్నకొలదీ హో వేడెక్కాడు. ఉల్లాసంగా తయారయ్యాడు. మెరుస్తూవున్న తన బట్టతలను ప్రదర్శించటానికి కాబోలు, గొర్రెబొచ్చు టోపీ తీసేశాడు. గింజలులాంటి తన కళ్ళను జిస్లంగ్‌మీద కేంద్రీకరించి. హో అతన్ని అనేక ప్రశ్నలు వేశాడు.

"ఏం? ఇంటిదగ్గర యిబ్బందిగా వుందా?" అని హో జిస్లంగును లాలించాడు. "నాతో రా! నిన్ను పది సంవత్సరాలనుండి ఎరుగున్నా! సమర్థవంతుడివి నమ్మకస్తుడివి. నాతో వుండిపో. జగత్‌లో నువ్వు పైకి వచ్చే భారం నాది. పక్కనుచేరే వంద ఎలుగుగొడ్లకంటే. నీలాంటి పులి ఒకటి వుంటేచాలు! నిన్ను నా కుటుంబంలోని వాడిగా భావించకపోతే, నీతో ఈవిధంగా మాట్లాడేవాడినే కాదు!" అంటూ జిస్లంగును తట్టాడు. "బాగా ఆలోచించుకో! బాగా ఆలోచించుకో!" అన్నాడు.

"మీతో ఎక్కడికి రమ్మంటారు?" అని అడిగాడు జిస్లంగు.

హో పెద్ద గుటకవేశాడు. "నువ్వు ప్రస్తుత పరిస్థితులను అర్థం జేసుకోవాలి" అని నెమ్మదిగా సాగించాడు. "జపాను వాళ్ళతో మనకు యిబ్బందేలేదు. వాళ్ళనుజూచి భయపడాల్సిన అవసరమే లేదు. ఆ దిక్కు మాలిన ముండాకొడుకులు కమ్యూనిస్టులతోనే నచ్చిపడింది పీడ. వాళ్ళు అందర్నీ పెళ్ళాల్ని సమిష్టి ఆస్తిగా చేయబోతున్నారు; మహా భయం కరం. వాళ్ళ శక్తి నానాటికీ పెరిగిపోతూ వుంది. మహా ప్రమాదం రానున్నది. ఇప్పటికి చాలాకాలముక్రిందటనే మన పై అధికార్లు ఒక ప్లాను వేసి అట్టిపెట్టారు. కమ్యూనిస్టులను తుడిచిపెట్టేయటంలో మనం జపాను వాళ్ళకు సహాయపడదాం. తర్వాత జపాను వాళ్ళను ప్రతిఘటిస్తాం. ఇదే మన ప్లాను. మన డిప్యూటీ-ప్రధాని మిష్టర్ వాంగ్‌చింగ్-వై అప్పుడే నాన్‌కింగులో ఒక ప్రభుత్వాన్ని స్థాపించాడు. పేరుకుమాత్రం అది, జపాను వాళ్ళకు లోబడివుంది. యదార్థానికి చూస్తే, మనము మన అధికారాన్నీ, బలాన్ని నిల్వచేసుకొంటున్నాము. అటు తర్వాత, మనము కోరినట్లు వ్యవహరించగలిగే స్థితిలో వుంటాము. నీకు కమ్యూనిస్టులంటే నమ్మకము లేదుగా; వాళ్ళు సిమెంటుదేలు లోపలాంటివాళ్ళు. లోప ఎప్పటికీ పెరగదు. అందుకని, నిన్ను నాతో నగరానికి రమ్మంటున్నా. కమ్యూనిస్టులను తుడిచిపెట్టేయగానే, వందలాది మైళ్ల వైశాల్యంగల ఈ ప్రాంతమంతా మన గుప్పెట్లో వుంటుంది;" అని హో, తన ఉపన్యాసాన్ని ముగించాడు.

ఇదంతా వినగానే జిన్లంగ్‌లో ఆశాపిశాచము ప్రవేశించింది. లొంగజేసింది. కాని అతడింకా కొంత తటపటాయింపులో పడ్డాడు. "జీవో ఎక్కడున్నాడు?" అని ప్రశ్నించాడు.

"మునలాళ్లు జీవో, లై వే మినవాళ్ళంతా నగరములోనే వున్నారు. నాకోసం ఎదురు చూస్తున్నారు" అని హో జవాబిచ్చాడు. నవ్వుతూ "కావలసిన ఏర్పాట్లన్నీ జపాను వాళ్ళతో చేసివేశాను. మనలో అందరూ చిన్నా పెద్ద, అందరూ అధికారులయిపోతారు. అలాంటి ఏర్పాట్లు చేశా."

జిన్లంగ్ అమితంగా త్రాగాడు. అతని నుదుటిమీది రక్తనాళాలు

దుస్తులలో దూరింది. ఆమె శరీరాన్ని చలితో మొద్దుబారసాగింది. ఒక మారు పరుగెత్తుతూ, మరియొకమారు నడుస్తూ, ఆమె కేంద్రగ్రామము యొక్క పరిపాలకసంఘం ఆఫీసు జేరింది. తలుపులు గ్రుద్దింది. ఆ ధ్వనికి, ప్రక్కమీదనుండి ష్వాంగ్ నిద్రమత్తుగా తడబడుతూ లేచి వచ్చాడు. తలుపు తెరిచాడు. తొందరగా విషయాన్నంతనూ అతనికి చెప్పివేసింది. తాను యింట్లోలేని సంగతి బయటపడుతుందేమోననే భయంతో దారిపొడుగునా పరుగెత్తుతూ ఇంటికి పోయింది.

ష్వాంగ్, దాస్వేని మేల్కొల్పాడు. తొందరగా సమాలోచనలు జరిపిన తర్వాత హోయొక్క భవనాన్ని చేరుకోగానే, దాన్ని ముట్టడించుటకై గెరిల్లాదళం బయలుదేరింది. భవనాన్ని చేరుకోగానే, దాన్ని చుట్టుముట్టారు. పై కప్పుమీద కొంతమందిని కాపలాపెట్టారు. లోపలి ఆవరణలోనికి పోవుటకు, గోడ ఎక్కారు కొంతమంది. చేతులలో తుపాకులు పుచ్చుకుని ప్రతిగదిసీ వెతికారు. ప్రతి ఆవరణనూ వెతికారు. కాని హో గానీ అతను కొడుకుగానీ ఎక్కడా కనపడలేదు!



# 5 అధ్యాయం

హో కుటుంబానికి తోడేలులాంటి ఒక పెద్ద కుక్కవుంది. గెరిల్లాలజాడలను పసికట్టగలవేమోనన్న ఉద్దేశంతో, ఇలాంటి కుక్కలన్నింటినీ చంపివేయవలసిందిగా గ్రామాలలో చాటింపువేసి ఒక మాసం మాత్రమే అయింది. మా కుక్క మొరగదూ, కరవదూ అంటూ ఎంతో దబ్బపోసి కొన్నామంటూ హో కుటుంబము ఎదురు జవాబు చెప్పింది. గ్రామములోని కార్యకర్తలు హో అంటే యింకా భయపడుతూనే వున్నారు. అందువలన హో కుక్క బ్రతికిపోయింది.

దాస్వే, తదితర గెరిల్లాలు, హో ఇంటిని చుట్టుముట్టగానే, హో గారి కుక్క విపరీతంగా మొరిగింది. హో వెంటనే లేచాడు. త్వరగా దుస్తులు వేసుకొన్నాడు. వాడి కొడుకు గోపీ పరుగెత్తుకుంటూ వచ్చాడు. "ఛండాలం! వాళ్ళొ కమ్మేశారు." అన్నాడు.

హో తొందరగా తోలుసంచి తీసుకొన్నాడు. ఒక పిస్తోలు తీసుకున్నాడు. "నేను పోవాలి!" అని తన ఉంపుడుకత్తెతో చెప్పాడు. "ఏం భయపడబోకు! కొద్దిరోజుల్లో నిన్ను తీసుకుపోవటానికి మనిషినిపంపుతా" అని చెప్పి ఉంపుడుకత్తె వద్ద సెలవు తీసుకుని బయలుదేరాడు హో.

హో, అతని కొడుకు, ఒక చిన్న గదిలోనికి పోయారు. ఒక పెట్టెను ప్రక్కకు తొలగించారు. రెండు బండరాళ్ళను పైకెత్తారు. దాని క్రిందొక సొరంగముంది. సొరంగములో మెట్లు వున్నాయి. గోపీ తన

బ్యాటరీలైటు చూపుతూవుంటే. దాని వెలుగులో హో మెట్లుదిగసాగాడు. ఉంపుడుకత్తె బండరాళ్ళను యథాస్థానములో వుంచేసినది. వాటి మీదకు పెట్టెను త్రోసివేసినది. గదికి తాళం వేసింది. పడకమీదచేరి, పడుకుంది. చివరి మెట్టువద్దనున్న తిరుగుడు తలుపును గిర్రున త్రిప్పి తండ్రీ, కొడుకూ ఒక సొరంగములో ప్రవేశించారు. సరస్సుకు దగ్గిరిగా గ్రామం వుందిగనుక, సరస్సులోని నీళ్ళు తగులుతాయేమోనన్న భయంతో సొరంగాన్ని లోతుగా త్రవ్వించలేదు. సొరంగానికి యిరుప్రక్కలా యిటిక కట్టుకట్టారు. వారావిధముగా సొరంగంలోపడి పోయారు. గ్రామానికి వెలుపల హో కుటుంబముయొక్క సమాధి స్థలముంది. దానిలో ఒక దైవపీఠముంది. ఆ పీఠంక్రిందనే ఈ సొరంగమార్గము అంతమయింది. అక్కడికి జేరుకున్నారు. ఆ తండ్రీ, కొడుకు లిద్దరూ బయటపడ్డారు. బ్యాటరీలైటును ఆర్పివేశారు. జపాను వాళ్ళచే ఆక్రమించబడిన నగరానికి పయనమైపోయారు.

ఉదయమయేవరకూ హో భవనాన్ని గాలించారు గెరిల్లాలు. ఎంత వెదకినా హో, అతని కొడుకూ కనపడలేదు. త్రుప్పుపట్టిన ఏడు తుపాకులుమాత్రం కనిపించాయి. ఆ తుపాకులను ఇచ్చి గెరిల్లాలను పరిపాలక సంఘం ఆఫీసుకు పంపివేశారు దాన్, షాంగ్‌లు.

జిస్లంగ్‌ను క్షమించవలసినదిగా, తాము ద్రోహులను జల్లించే సంఘాన్ని కోరుతున్నామని చెప్పవలసినదిగా కోరారు. నాయకులిద్దరూ ఈ విషయాన్ని బ్లాకీత్సోతో చెప్పటానికని జిల్లాప్రభుత్వము ఆఫీసుకు పోయారు.

ఒక వారంరోజులు గడచిన తర్వాత, సంవత్సరాది పండుగ సెలవు దినాలలో బ్లాకీ తన గడ్డాన్ని గొరిగించుకున్నాడు. మంచిదుస్తులు వేసుకొన్నాడు. తన బంధువైన జిస్లంగతో ఒకరోజు గడుపుదామని హో జ్వాంగు గ్రామానికి భార్యాపిల్లలతో వచ్చాడు. జిల్లా నాయకుడు వంటి వ్యక్తి తన యింటికి వచ్చాడనగానే మేయీ మామగారికి సంతోషంతో ఒళ్ళు పొంగిపోయినది. తనకు పెద్ద గౌరవం జరిగినట్లుగా భావించాడు. బ్లాకీని అమితంగా గౌరవించాడు.

భోజనాలు పూర్తి అయిన తర్వాత, బ్లాకీ, జిన్లంగులు, ప్రక్కగది లోనికిపోయారు. పిచ్చాపాటి చెప్పుకోసాగారు. జిన్లంగు గాయమెలావుం దని బ్లాకీ అడిగాడు.

"గాయం పూర్తిగా నయమయింది. కాని బలహీనత యింకా పట్టుకుని ఏడుస్తూ వుంది. ఇంకా పనిచేసే వోపిక రాలేదు. మా పరిస్థితులు క్లిష్టంగా వున్నాయి." అని జిన్లంగు జవాబు చెప్పాడు.

"భయంలేదు. మన జపాను - వ్యతిరేక - ప్రభుత్వము మీ కుటుంబము ఆదరించి మాడుతూ వుంటే, చూస్తూ వూరుకోదు" అన్నాడు బ్లాకీ.

"మేము పూర్తిగా మీ మీద ఆధారపడి వున్నాం" అన్నాడు జిన్లంగు నమ్రతగా.

"మీ కెలాంటి కష్టాలున్నా చెప్పుకోటానికి వెనుదీయకండి. ఇంటి వద్ద కూర్చోవటము మీకు విసుగెత్తితే ఏదయినా పని కావాలనుకుంటే, యేర్పాటు చేయగలం. మన బలం నానాటికి పెరుగుతూవుంది. కొమింటాంగును జూస్తే జపానువాళ్ళు భయపడటంలేదు. కమ్యూనిస్టులను జూసేనే వాళ్ళకు బెదురుగా వుంది. వాళ్ళను వోడిస్తామనుటలో సందేహములేదు. నీలాంటి సమర్థుడు, ఉన్న తెలివితేటలను దేశంకోసం వినియోగించితే మన పోరాటానికి ఎంతో పెద్ద సహాయమవుతుంది" అన్నాడు బ్లాకీ.

ఈ మెచ్చుకోలుతో జిన్లంగుయొక్క హృదయము విప్పారింది. "నాకేం తెలివితేటలున్నాయి?" అన్నాడు చిన్నగా తాను పులకరించిపోతూ కుంటూ జిన్లంగు. "రోజురోజుకూ దిగజారిపోతున్నా."

"మన దేశంలో బోలెడంత మంది సమర్థులున్నారు. అసలు సమస్య యేమంటే, వాళ్ళు వెలుగుదారిని పోతారా? చీకటిదారినిపోతారా? అన్నదే. వీళ్ళలో కొంతమంది జపానువాళ్ళ తరపున పనిచేస్తున్నారు. 'దేశద్రోహి' అనే కంపు పేరు తెచ్చుకొంటున్నారు. ఆ పేరు పోగొట్టుకోవటం బహు కష్టం. కొంతమంది వెలుగువైపుపోవాలని పెనుగులాడుతున్నారు జాతీయ

వీరులుగా తయారవుతున్నారు. వాళ్ళు ఎక్కడికివెళ్తే అక్కడ ప్రజలు వారిని ప్రజలు ఆహ్వానిస్తున్నారు" అని బ్లాకీ చెప్పసాగాడు.

ఈ చివరిమాట వినగానే జిన్లంగ్ హృదయం దడదడాకొట్టుకుంది తనకూ హోకు సంబంధం కలదన్న విషయం బ్లాకీకి బాగా తెల్సిపోయిందని జిన్లంగ్ పసిగట్టాడు. ఏదో మామూలుగా మాట్లాడుతూవున్నట్లు నటిస్తూ జిన్లంగ్ బ్లాకీని దొంగతనంగా చూడసాగాడు. కాని బ్లాకీప్రవర్తన చూస్తే పూర్తిగా అమాయకంగావుంది. సంభాషణ యితర విషయాలపైకి పోయింది.

ఆ సాయంత్రం బ్లాకీ గ్రామపరిపాలక సంఘం ఆఫీసుకు వెళ్ళగానే జిన్లంగ్ కాంగ్‌మీద పడుకొన్నాడు. దీర్ఘాలోచనలోపడ్డాడు.

"మీకూ హోకు మధ్య జరిగిన విషయాలన్నీ మా నాన్నతో చెప్పేయండి" అన్నది మేయీ "మీరు నిష్కపటంగా అన్నీ చెప్పేస్తే మీపైన వాళ్ళ కేమీ అనుమానం వుండదు. అలాచేయకపోతే వాళ్ళు విషయాలను మరొకరకంగా చూస్తారు" అన్నది.

"చెప్పాల్సిందేమీ లేదు" అన్నాడు జిన్లంగు.

"వాళ్ళకు తెలియదనుకుంటున్నారా? యీ విషయంనుండి యెలా బయటపడదామనుకుంటున్నారు?" అని మేయీ ప్రశ్నించింది.

బ్లాకీకి యీ విషయాన్నంతా చెప్పింది మేయీయని జిన్లంగు రూఢీ చేసుకొన్నాడు. కోపంతో మండిపోయాడు. కాంగ్‌మీదనుండి క్రిందకు దుమికాడు. పెద్దగా అరుస్తూ "నీ కంపునోరు వాళ్ళకు చెప్పిందికాబట్టి వాళ్ళకు తెలిసింది– "నీ యమ్మ.... యివ్వాళ నీ పని పట్టిస్తానుండు!" అని ఒక చీపురుకట్ట లంకించుకొన్నాడు. బాదటానికి పైకెత్తాడు.

మేయీ అతనివంక ప్రేలెత్తిజూపుతూ నవ్వసాగింది. "వూం ముందుకు సాగండి! కొట్టండి!– నేను నీ నోటిలో తేనె పోస్తూవుంటే, నా వేలు కొరుకుతున్నావా! ఇంత మూర్ఖంగా ఎలా వుండగలుగుతున్నారు! యదార్థానికి వాళ్ళకు తెలుసు. హోను అరెస్టుచేయడానికి వాళ్ళు పోలేదా? పగులులేని గోడంటూ యీ ప్రపంచంలోలేదు. ఈ పట్నంలో విషయాలను దాచ యత్నించి ప్రయోజనంలేదు. దాచటం దుర్లభం! నీ నల్లమం

దుమ గురించి కూడా బ్లాకీ, నాతో ప్రసంగించాడు. కావాలని రహస్యంగా దేశద్రోహితో వ్యవహరించినందుకుగాను, వాళ్లు నిన్ను కనీసంగా చేయ గలిగినది అరెస్టుచేయటం మాత్రమే. అరెస్టుచేయటానికి బదులుగా, నీ పట్ల వుదారత్వాన్ని ప్రదర్శించారు. సంజాయిషీ చెప్పుకోవలసిందిగానిన్ను కోరనైనాలేదు. నేనంటే నీకు విరోధమెందుకు?" అన్నది మేయీ.

మేయీమీద జిన్లంగు యింకా మండిపోసాగాడు. కాని, చీపురు కట్టను క్రింద పారేశాడు. ఒక్క "నీ యమ్మ...." అనే తిట్టును విసిరేసి కాంగ్‌మీద కూలబడ్డాడు.

మేయీ అతనిప్రక్కను కూర్చుంది. ఆప్యాయంగా లాలించింది. "జిన్లంగ్! బ్లాకీ పట్నంలో వుండగానే కలిగిన అవకాశాన్ని వినియోగించుకో. అతనికి నీ కథంతా చెప్పేయ్. సమూలంగా చెప్పేయ్. నేనంత ప్రాధాన్యమైనదాన్ని గాకపోయినప్పటికీ, నేనూ ఒక కార్యకర్తనుగదా! నీకేమి యిక్కట్లు రాకుండా చేయగల పూచీ నాది" అన్నది.

జిన్లంగు చాలాసేపు ఆలోచించాడు. చిట్టచివరకు గుణుస్తూ: "ఆయనతో మాట్లాడుతా! కాని, నల్లమందు యిచ్చేయను!" అన్నాడు.

"నీ యిష్టమొచ్చినట్లు చెయ్యి. అదే నేనైతే ఆకలితో మాడి చస్తున్నాసరే, ఒక ద్రోహినుండి ఒక్క రవ్వంతైనా తీసుకోను. చైనా దేశంలో పుట్టిన ప్రతిమనిషీ కాస్త వెన్నెముక కలిగియుండాలి!" అంటూ కోపంగా ఆమె గదిని విడిచిపోయింది.

అటుతర్వాత కొంతసేపటికి బ్లాకీత్సే గ్రామపరిపాలక సంఘం ఆఫీసునుండి తిరిగివచ్చాడు. ఒక గంటసేపు జిన్లంగు అతని చెవిలో విషయాన్నంతటినీ వూదాడు.

బ్లాకీ సంతోషపడ్డాడు. జిన్లంగుకు హోతోగల సంబంధాన్ని చూసీ చూడనట్లు వూరకుండేటట్లు చేయగలనని హామీయిచ్చాడు. ఈ మాట వినగానే జిన్లంగుకు ధైర్యం కలిగింది. ఉత్సాహం వచ్చింది. ఒక చిన్న నల్లమందు ప్యాకెట్‌ను బయటకుతీశాడు. బ్లాకీ చేతుల్లో పెట్టాడు.

"నిజంగా నీ కెప్పుడిద్దామాయని ఎదురుచూస్తున్నా. యీ వ్యవ

హాసం మొదటినుంచీ శుద్ధ తప్పులతడకని నాకు తెలుసు!" అన్నాడు జిన్లంగు.

మేయీ అప్పుడే అక్కడికి వచ్చింది. బ్లాకీవంక జూచి నవ్వింది. "యింతాజేస్తే, జిన్లంగ్ విషయాలను స్పష్టంగా అర్థంచేసుకుంటున్నాడు. హోతో పోవటానికి పూర్తిగా నిరాకరించాడంటే నమ్మండి" అన్నది.

"గౌరవం లేని బ్రతుకు బ్రతికేం ప్రయోజనం చెప్పు!" అని, అన్నాడు జిన్లంగు సుగుణాత్వాన్ని వెళ్ళబోస్తూ "నేను దేశద్రోహినికాదు. వాడు తన డబ్బంతా పోసినా, నన్ను కొనలేడు! జపానువాళ్ళకు అనుకూలంగా పనిచేసేవా వెవ్వడూ మంచితల్లికొడుకుకాదు!" అన్నాడు.

బ్లాకీ వెళ్ళబోయేముందు, మేయీతో రహస్యంగా ఇలా చెప్పాడు. "మనవాడు సందిగ్ధావస్థలో వున్నాడు. మంచి మార్గానికి తీసుకురావాలి. ఇది నీ బాధ్యత. మనవాడు మంచి "గురికాడు." అంతేగాక, యింకా కొన్ని మంచిలక్షణాలుకూడా వున్నాయి. మన పనిలో జేరేటట్లు ప్రోత్సహించు. దేశద్రోహుల వలలో పడనీయబోకు!"

శాయశక్తులా ప్రయత్నం జేస్తానని మేయీ వాగ్దానం జేసింది. బ్లాకీ అతని కుటుంబం సెలవు తీసుకున్నారు.

* * * *

సంవత్సరాది పండుగ సెలవుల్లో మిగిలిన దినాలలో మేయీ, జిన్లంగు చెప్పినట్లా నడిచింది. అదే సమయంలో, పనిలో ప్రవేశించవలసినదిగా జిన్లంగును కోరుతూవచ్చింది. ఇక రేపు పనిలోకి వెళుతుందనగా ఆ రాత్రి, పడుకోబోయే సమయానికి కొద్దిముందుగా, అతణ్ణి యిలా అడిగింది—"దాని సంగతేమిటి? నీ కిష్టమైతే రేపు నాతో రావచ్చును!"

జిన్లంగు తన కడగొట్టు సిగరెట్‌ను తగలేస్తున్నాడు. అప్పుడే కాంగ్‌మీదకెక్కి దుప్పటి కప్పుకున్నాడు. జవాబు చెప్పలేదు.

"మనిద్దరం కలసి పనిచేయవచ్చు. అభివృద్ధి జెందవచ్చు!" అన్నదామె.

"నీవూ పోయి. నేనూ పోతే. మా నాన్న సంగతెవడుచూస్తాడు?" అన్నాడు.

"ఉష్ ! ఆ విషయం మరచిపొండి: ఇంటిపదవుండి మీ రాయనకు వొంగబెట్టున్న దేమిటి? అంతేగాక, మనిద్దరం పనిజేస్తూవుంటే. గ్రామ పరిపాలకసంఘమే ఆయన విషయములో శ్రద్ధ తీసుకొంటుంది !" అన్నదామె.

జిన్లాంగు సిగరెట్ తుంపును పెలిపేశాడు. దుస్తులు విప్పేశాడు. పరుపులో దూరాడు. "అర్ధరాత్రి దాటింది. కళ్ళు మూతలుపడుతున్నాయ్. నే నింక మేలుకోలేను. నిద్రపోదాంపట! ఒకే విషయాన్ని పట్టుకొని తోమటోక- తర్వాత మాట్లాడుదాంలే!" అని తప్పించుకొన్నాడు.

"భలేవాడివి! యిన్నాళ్ళనుండీ దిమ్మరిలాగున తెగ తిరుగుతున్నావ్ వళ్ళొంగమంటే ఎలాపంగుతుంది? పూర్తిగా వాడైపొయ్యావ్! కార్మికుడవా? కర్షకుడవా? విద్యార్థివా? సైనికుడివా? వ్యాపారివా? ఏది నువ్వు? నువ్వు ప్రతిఘటనోద్యమంలో జేరితే నాకు గౌరవం కలుగుతుంది. నీవు యీ విధంగానే కొంపలో కూలిపోతే, నేను సిగ్గుపడాల్సివస్తుంది. నువ్వు యీ సోమరితనాన్ని విడువకపోతే, నిన్ను నేను వదిలివేయబోతున్నా!" అన్నదామె.

"ఏయ్! నీ సోదంతా ముదనష్టపు వుద్యోగంకోసమేనా! న న్నేం పని చేయమంటావ్?" అన్నాడతడు.

"ఇన్ని సంవత్సరాలనుండి తుపాకులతో వెలగబెట్టున్నావ్! దానిలో ఆరితేరావ్! 'మంచి గురిగాడు' అని పేరు పొందావ్! సూటిగా మన సైన్యంలో జేరిపోయ జపానువాళ్ళమీద యుద్ధంజేసే అవకాశము నీకుందే, అని అసూయపడుతున్నా!" అన్నదామె.

'సైన్యంలోజేరటం' అన్నమాట వినపడగానే జిన్లాంగుకు సంబంధించినంతవరకు ఆ సంభాషణ ముగిసిపోయిందనే చెప్పాలి. అతడు, ప్రక్కలోదొర్లాడు. గట్టిగా అన్నాడు "అలాంటిదేమీచేయను! బాలూ సైన్యంలో జీవితాంతం చాలా కఠినంగా వుంటుంది- ఎవళ్ళు పడతా రా కష్టాలు ?"

మేయీ తన గొంతుక బొంగురుపోయేటట్లు వాగింది. కాని అతడు మొండి: టుపట్టి కూర్చున్నాడు. "సరే! ఏమైనాగాని! ప్రవాహంలో చేప లాగున ప్రతివాడూ వుండాలి. ప్రవాహానికి అనుకూలంగా ఈదాలిగదా! నా విషయంలో నీకేమి భయంవద్దు" అన్నాడు.

వట్టి పనికిమాలిన ముండావాడని మేయీ అనుకుంది. ఆమెకు విపరీతమయిన కోపమొచ్చినది. లేచి నిలబడింది. "సరేలే! వూం కానీయి! దేశద్రోహివిగా తయారుకా!— నీ విలువంతే! నీవల్ల ప్రయోజనమంతే! తింటం, తాగటము, ముండలు, జూదము! వీటికే అంటిపెట్టుకుని వుండు! నీ బ్రతుకంతా ఇంతే! మానమర్యాదలమీద ఖాతరులేదు." అని అరిచింది.

"యేమిటే నీ వాగుడంతా!" అని కోపంగా అరచాడు జిసంగ్. "ఎవడే దేశద్రోహి? ఇతరుల ముఖాలమీద పెంటచల్లుతూ పోబోక!" అన్నాడు.

అతడన్నదేమి మేయీ పట్టించుకోలేదు! జవాబు చెప్పలేదు. ఆమె కోపంతో మాట్లాడలేకపోయింది. తన తలగడదిండును అతనికెదురుగా కాంగ్ చివరి భాగానికి లాక్కొంది. లాంపు ఊదేసింది. దుస్తులు విప్పేసింది. తన స్వంత పడకమీద వేరే పడుకుంది. కోపంగా జిసంగ్ తన దుప్పటిలో దూరాడు.

ఒకప్రక్కనుండి మరియొకప్రక్కకు వత్తిగిలి పడుకున్నారు ఇద్దరికీ నిద్రపట్టటంలేదు. చాలాసేపు నిశ్శబ్దం ఆవరించింది. జిసంగ్ యింకేమాత్రము వుండబట్టలేకపోయాడు. తన దిండును తీసుకుని మేయీ దిక్కుగా మార్చాడు. ఆమె ప్రక్కనే దిండు వేసుకుని పడుకున్నాడు.

"అంత క్రూరంగా వుండబోకు. ఈ విషయాన్ని మళ్ళామాట్లాడుకుందాం. ఆదుర్దాపడితే ఏంలాభం!" అన్నాడు.

"నేను మీతో చక్కగా మాట్లాడుదామనుకున్నా. మీకు దూరదృష్టివుండటం అవసరం. జాలూ సైన్యంలో జీవితము కష్టంగా

వుంటుందన్నమాట వాస్తవము. కాని మీరు అనేక విషయాలు నేర్చుకోటానికి అవకాశముందక్కడ. నన్ను చూడండి! నేను జేరి చాలా కొద్ది కాలమైనా అనేక విషయాలు నేర్చుకోగలిగాను. జాబులు వ్రాయగలను చదవగలను. ఇంత పెద్దవాడివి మీకొక్క అక్షరమన్నా రాదు! మీరు సైన్యంలో జేరి, కష్టపడి చదివితే అభివృద్ధి అవుతారు. మెచ్చుకోతగిన పని చేసినట్లవుతుంది!" అన్నదామె.

"నన్ను దూరంగా పంపేస్తారేమోననే నా భయం!" అని అన్నాడు జిన్లింగ్. వేళాకోళంగా "నిన్ను వదిలిపెట్టి వుండలేనే!" అన్నాడు.

"నువ్వు వేళాకోళమాడుతున్నావ్. నేనేమో తీవ్రంగా మాట్లాడుతున్నా! దూరంగా పంపబడటానికి మీకు నిజంగా ఇష్టము లేకపోతే, కౌంటీ సైన్యంలో ఏదయినా స్థానము చూపించవలసినదిగా మనము బ్లాకీత్సేని అడగవచ్చు!" అన్నదామె.

జిన్లింగ్ పరిహాసంగా నవ్వాడు. "భలేబాగుంది! ఈ విషయాన్ని నీవు మొట్టమొదటే చెపితే, నే నెప్పుడో వప్పుకొనేవాణ్ని!" అన్నాడు.

ఆ మరునాడు తన తండ్రితో రవ్వంతయినా చెప్పకుండా బ్లాకీత్సేని చూడటానికని, జిల్లా ప్రభుత్వము ఆఫీసుకు, మేయీతో కలిసి వెళ్ళాడు జిన్లింగ్.

* * * *

జిల్లా ఆఫీసులో, బ్లాకీత్సే హో విషయాన్ని గురించి డాస్వేతో చర్చిస్తున్నాడు. హో తప్పించుకునిపోయిన మరునాడే షెన్‌జ్యా గ్రామానికి మాజీ మేయరైన షెన్‌కూడా పారిపోయాడని వారికి తెలిసింది. అంతకు కొద్దిరోజులకు పూర్వము, వాళ్ళిదరూ కలిసి దొంగతనంగా మాట్లాడుకుంటూ వుండగా చూసినట్లు ఎవరో చెప్పారు.

"గుంటనక్కా, నీటికుక్కా రెండూ కలిశాయి. ఈ రెండూ కలిసి

నాయంటే, వాటి పని బాగానే వుంటుంది. పారిపోదాము రమ్మని హోచే షెన్‌ను వప్పించాడనుకుంటాను" అన్నాడు దాస్వే.

ఛాకీ అంగీకారసూచకంగా, తల వూపాయి. "బహుశః హో అతనికి అబద్ధాలుచెప్పి పారిపోయేటట్లు భయపెట్టాడనుకుంటాను. షెన్ తన కుటుంబాన్ని యిక్కడే విడచివెళ్ళాడు కదా! చక్కనవాళ్ళ కుటుంబాలను చూచినట్లే, వాళ్ళ కుటుంబాన్ని చూద్దాము. కొంతకాలమైన తర్వాత, అతణ్ణి వప్పించి తీసుకొద్దాము" అన్నాడు ఛాకీత్సే.

కౌంటీ కమ్యూనిస్టు, కమ్యూనిస్టుపార్టీ సెక్రటరీగాకూడా పని చేస్తూవున్న హెడ్‌మాష్టర్ చెంగ్ అక్కడకు వచ్చాడు. ఛాకీత్సేతో కొంచెంసేపు మాట్లాడాడు. ఆ సంభాషణ ముగియగానే ఛాకీత్సే, దాస్వేకి కొన్ని సూచనలు యిచ్చాడు.

"కార్యకర్తలకు యివ్వబడిన బాధ్యతలతో కొన్ని మార్పులు కలిగాయి. వెనక్కితిరిగి వెళ్ళు. ష్వాంగును ఇక్కడకు వెంటనే రమ్మన్నామని చెప్పు. అతడు జిల్లాలో పని చేయాల్సివుంది. కేంద్రగ్రామ మేయరుగా అతని స్థానాన్ని నీవు తీసుకో...." అన్నాడు.

అతని మాటలకు అడ్డమొచ్చి దాస్వే "ఓయ్! సైన్యానికి నాయకుడుగా నా డ్యూటీ మాటేమిటి?" అని ప్రశ్నించాడు.

ఛాకీ చిరునవ్వునవ్వుతూ, "తేవాంసు నాయకుణ్ణి చెయ్. అతనికి సహాయకుడుగా నీవుండు" అన్నాడు.

"అయితే ఇప్పుడే పోతా" అని దాస్వే వెళ్ళిపోయాడు. రైలు టిక్కెట్టు తెచ్చుకోటానికి పోయాడు.

దాస్వే ఆవరణను దాటుతూండగా చేతుల్లో పిల్లవాణ్ణి పెట్టుకుని వస్తూవున్న మేయి, ఆమె వెంట పక్కచుట్టను మోసుకుని వస్తూవున్న జిన్లగూ కనపడ్డారు వాళ్ళు ఒక ద్వారంద్వారా అదృశ్యమయ్యారు. అందువలన వాళ్ళను పలుకరించటానికి దాస్వేకి అవకాశం లేకపోయింది. దాస్వే రైలు ఆఫీసుకు పోయాడు. అక్కడ ఒక మనిషి పూసల చట్రంపై రైలు లెక్కవేస్తున్నాడు. దాస్వే ఆ మనిషి తన లెక్కలు

పూర్తిచేసుకునేవరకూ, వోపికగా నిలబడ్డాడు. అప్పుడతనికి, బ్లాకీ ఆఫీసు నుంచి అతి ఆప్యాయమైన సంభాషణలు వినవచ్చాయ్. అయితే ఏమి సంభాషణలు జరుగుతున్నది అతనికి సరిగా వినపడటంలేదు.

"జిన్లంగుగాడిని ఇంకా అరెస్టు చేయలేదెందుచేత చెప్పుమా?" అని ఆశ్చర్యపోయాడు. ఓటచివరకు దాస్వే తన రేషను టిక్కెట్లను తీసుకున్నాడు. మరల ఆవరణలో అడుగుపెట్టాడు. మేయీ, ఆమె కుటుంబం అతనికి ఎదురయింది. వాళ్ళప్పుడే బ్లాకీతో తమపనిని ముగించుకొని బయటకు వచ్చారన్నమాట.

దాస్వేని పలకరిస్తూ జిన్లంగు ఆప్యాయంగా చిరునవ్వు నవ్వాడు. "జోరుగా పనిచేస్తున్నావా దాస్వే?" అని దాస్వేని పలుకరించాడు.

"ఉఫ్!.... ఎక్కడికి వెళుతున్నారు?" అన్నాడు గందరగోళపడుతూ దాస్వే.

"అన్ని ఏర్పాట్లూ జరిగిపోయాయ్. కౌంటీ సైన్యంలో పనిచేయమన్నారు!" అని జిన్లంగు చెప్పాడు; జిన్లంగు, అతనిభార్య మేయీ, అతని కొడుకు ప్రశాంతముగా గేటుదాటి వెళ్ళారు.

దాస్వే కోపంగా, బ్లాకీత్సే వద్దకు పరుగెత్తుకెళ్ళాడు. "ఏమైనాగానీ, ఈ పనేమిటి దేశద్రోహిగా అనుమానించబడిన జిన్లంగులాంటి వ్యక్తికి మనమేవిధంగా వుద్యోగం యివ్వగలం?" అని ప్రశ్నించాడు.

జిన్లంగు ఏ విధంగా సంస్కరింపబడింది, బ్లాకీ వివరించాడు. దాస్వేకి ఈ విషయం నచ్చకపోయినప్పటికీ, కొద్దిగా ఉపశమించాడు. ఇంకా అతని హృదయంలో వ్యాకులపాటు వుండనేవుంది ఎలాగైతేనేం తన కేంద్రగ్రామానికి తిరిగి వచ్చాడు.

* * * *

దాస్వే, తన క్రొత్త బాధ్యతలను స్వీకరించగానే పూర్వంకన్నా అమితంగా పనిలో మునిగిపోయాడు. రోజువారీ డ్యూటీలతోపాటు అధ్యయన తరగతులనుకూడా అధికం చేయవలసిందిగా, అంటే పని పరిమా

జాన్ని అభివృద్ధిచేయుటకుగాను అధ్యయనాన్ని అధికంచేయవలసినదిగా పై అధికార్లు ఆజ్ఞాపించారు. తమ తీరికసమయాలలో తమకు విద్య గరప వలసిందిగా కార్యకర్తలు స్థానిక ప్రాథమిక పాఠశాలలోని ఒక ఉపాధ్యాయుని ఆహ్వానించారు. వారు త్వరగా అభివృద్ధిజెందారు.

ఒకరోజున దాస్వే తన ఆఫీసులో కూర్చొని ఒక వార్తాపత్రికను నెమ్మదిగా ఒక్కొక్కమాటే అందరికీ వినపడేటట్లు చదువుతున్నాడు. అచ్చుపంక్తులను తనవ్రేలుతో అనుసరిస్తూ చదువుతున్నాడు. నవ్వుతూ అతనితండ్రి ప్రవేశించాడు.

"అబ్బాయీ! నీ కో పెళ్ళాన్ని చూశానోయ్! ఆమె హిస్యేలియా గ్రామంలో వుంటూవుంది.... ఆమె పేరు హెవార్. పద్దెనిమిదేళ్ళమాత్ర ముంటాయి. చాలా చక్కనిపిల్ల. సరిగ్గా నీకు తగినది! నువ్వు చూస్తే తప్పకుండా యిష్టపడతావ్." అన్నాడు తండ్రి.

దాస్వే తన తండ్రిని కూర్చోపెట్టాడు. "మనకు కడుపునిండా తిండి దొరకటంలేదుకదా! అలాంటి యీ కాలంలో పెళ్ళిగురించి ఎలా మాట్లాడగలుగుతున్నావు ?" అన్నాడు.

"నీకుతెలియదు" అన్నాడు తండ్రి విజయసూచకముగా. "ఎన్నాళ్ళ నుండి కడుపూ కాలూ కట్టుకొని, యీ తరుణం కోసం కూడబెట్టానో, నీకు తెలియదు. ప్రతి దమ్మిడీ పోగుజేశాననుకో. ఇప్పటికి కొన్ని డాలర్లు కూడబెట్టాను. ఇప్పటికీ సందర్భపడింది. ఆమెదికూడా బీదకుటుంబమే. కాని వాళ్ళు దబ్బేమీ అడగలేదు. వాళ్ళకుపట్టిందల్లా ఒక్కటే. నీవు బాలూ సైన్యంలో కార్యకర్తవనీ, మంచిస్వభావం గలవాడవనీ విన్నారు.దానితో సంతృప్తిపడ్డారు. ఏమైనాగానీ, మన కంత ఖర్చుగాదు. దేన్నిగురించీ నీవు బెంగపడనక్కరలేదు. నేను అన్ని ఏర్పాట్లూ చేశాను" అన్నాడు తండ్రి.

"ఆమె చదువగలదా ?"

తండ్రికి ఆశ్చర్యమేసింది. "ఓయ్! ఆ సంగతి అడగలేదోయ్— బహుశా రాదేమో! అయినా పల్లెటూరిపిల్లకు చదువెందుకోయ్!" అన్నాడు తండ్రి.

"ఆమెకు చదువు రాకపోతే, ఆమె నా కక్కరలేదు!" అన్నాడు దాస్వే.

కొడుకువంక వ్రేలెత్తి చూపుతూవుంటే, ముసలాడి గడ్డం నిక్కపొడుచుకుంది. "కుక్కగోళ్ళ గీతలాంటి నాలక్షరాలను ఎలాగైతేనేం మహా గుర్తుపెట్టటం నేర్చుకున్నావ్ లేవోయ్! అప్పుడే కళ్ళు నెత్తికెక్కాయా అందరూ హీనంగా చూడటానికి! నేను చచ్చిచెడి, యమయాతనలుపడి పిల్లనుచూసి, మాట్లాడుకొస్తే హిరణ్యాక్షవరాలు కోరుతున్నావా! నువ్వు యిప్పుడొచ్చిన అవకాశాన్ని వినియోగించుకోకపోతే; నీకు యీ జన్మలో పెళ్ళవుతుందో కాదో ఎవడు చూడొచ్చాడు!"

"రాయటం రాకపోతే, మా పనిలో చేరజాలదు" అని గొణిగాడు దాస్వే. "నా కామె తగను...."

"పిచ్చిగల్లంతు చేయబోకోయ్, బిడ్డ" అని తండ్రి వాదించాడు. "ఆదర్శమూర్తియైన పిల్ల ఎవడికైనా ఎక్కడైనా దొరుకుతుందా? నాకు తలనెరసింది. నీకా యిరవై ఏళ్ళొచ్చాయి. నాకు కాలూ చెయ్యీ బాగుండగానే, నీ పెళ్ళి ఏర్పాటుచెయ్యనియ్యి. నీ వాట్టే ఆలస్యంజేశావా, నీ పెళ్ళి యీ కళ్ళతో చూడను...." అని ముసలాడు వాదించాడు.

దాస్వే గుండె కరిగింది. ఇక తండ్రిని ఎదిరించలేదు.

ఏదో పనిమీద ఎవరో ప్రక్కగదిలోకి పిలిచారు. అతడక్కడకు వెళ్ళాడు. చాలా సేపటివరకూ రాలేదు. తిరిగివచ్చేసరికి, తండ్రి అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

* * * *

1940, మార్చి, 18 వ తారీఖు అది. వెంటనే యింటికి తిరిగిరావలసిందిగా ఆజ్ఞాపిస్తూ స్లీక్త్సే వ్రాసిన జాబుకు, తమ్ముడయిన రియూ, దాస్వేకి తీసుకొనివచ్చాడు. అక్కడే నిన్ను కలుసుకుంటానని స్లీక్త్సే ఆ జాబులో వ్రాశాడు. ఆఫీసులో తమ పనులన్నింటినీ సరిదిద్దుకున్నాడు దాస్వే. పిస్తోలును నడుముకు బిగించాడు. నిండా కాగితాలున్న తన చేతి

సంచిని తీసుకొన్నాడు. తన తమ్మునితోకలసి బయలుదేరాడు. దారిలో రోడ్డుమీద, రియూ దాస్వేవంక చూపుతూ నాట్యంచేయసాగాడు. పాడసాగాడు.

"చిన్నారిపొన్నారి వయసుకాడంట!
గుమ్మమూ మెట్లపై కూలబడ్డాడంట!
కొమ్మకై కన్నీళ్ళు పెట్టినాడంట.
ఎందుకోయ్! నీకు పెళ్ళి మెందుకోయ్?
దీప మెలిగించుటకు, నాతో మాటాడుటకు
దీప మార్పుటకు, నాలో నిద్రించుటకు."

అని రియూ, గంతులేస్తూ పాడసాగాడు.

"ఎందుకోయ్ యీ సంతోషం?" అని దాస్వే అరచాడు.

రియూ కోతిలాగున మొగం పెట్టి వెక్కిరించాడు.

వాళ్ళు యింటికి చేరుకోగానే, తలుపుకు యిరువైపులా వ్రేలాడుతూవున్న ఎర్రదీపాలు అగుపించాయి. ద్వారానికి యిరుప్రక్కలా ఎర్రకాగితాలు, వాటిమీద శుభాకాంక్షలు వ్రాయబడి వున్నాయి. ఆవరణలో స్నేహితులు గలగల్లాడుతూ వున్నారు. 'టీ' కాస్తున్నారు. రొట్టెలు కాలుస్తున్నారు.

సంతోషంతో నవ్వుతూ తండ్రి బయటకువచ్చాడు. "మేం నీ కోసం ఎదురుచూస్తున్నాం. నీ క్రొత్తగదిని వచ్చి చూడు" అతడు తన కొడుకును యింట్లోకి లాక్కెళ్ళాడు.

ఆ యింటి ఆవరణలో పశ్చిమదిశగా వ్యవసాయ పనిముట్లు వేసుకొనే గది ఒకటి వుంది.

దానిలోనున్న పంగటికర్రలను, గలుగులను, పారలను, నాగలిని, అన్నింటినీ తీసివేశారు. శుభ్రంగా కడిగి వేశారు. అలికి ముగ్గులెట్టారు. క్రొత్తగా కట్టబడిన కా[illegible] ఎరుపుగా తీసుకొనిరాబడినపరుపును పరచారు. చక్కగా మడతలు పెట్టిన రెండు దుప్పట్లను రెండు దిండ్లను సమీపంలో వుంచారు. ఎర్రకాగితంతో పెద్ద అక్షరాన్ని తయారుజేశారు. దాని అర్థం 'సౌఖ్యం' ప్రాచీనకాలపు సుందరిబొమ్మ నొకదానిని గోడపై

అలంకరించారు. గది మధ్యభాగంలో ఒక టేబిలు, రెండుకుర్చీలు వేశారు. రెండు ఎర్రని కొవ్వొత్తులు, సుగంధాన్ని వెదజల్లే ధూపకడ్డీలను బల్ల మధ్యభాగంలో అమర్చారు.

"చూశావా? యిందులో కొంత, అందులో కొంత అన్నీకొన్నాను. అన్నింటినీ యధావిధిగా చక్కగా అమర్చాను" అన్నాడు ముసలాడు సగర్వంగా.

"బాకీ అన్నయ్య యేడీ?" అని అడిగాడు దాస్వే ఆదుర్దాగా. "పెళ్ళిచేసుకోబోయేముందు పై అధికార్లతో మాట్లాడాల్సి వుంది."

"గాబరాపడబోకు!" అని సంతోషాన్ని పెళ్ళబోస్తూ ముసలాడు జవాబుచెప్పాడు. "మీ అన్నయ్య యీ పెళ్ళికి ఏనాడో అనుమతించాడు!"

స్నేహితులు, బంధువుల గుంపొకటి ఆడుతూ పాడుతూ లోపలికి వచ్చింది. "కొత్తపెళ్ళికొడుకు కొత్త గదినిచూస్తున్నాడు. కొత్త పెళ్ళికొడుకు కొత్త గదిని చూస్తున్నాడు!"

ముసలాడు దాస్వేని లంకించుకున్నాడు. కాంగ్‌మిదకు లాక్కెళ్ళాడు. వారా విధంగా ఆడుతూ పాడుతూవున్న ఆ జనం దారిలోనుండి అడ్డం తొలిగారు. గాయకులు గదంతా తిరిగి గుంపుగా బయటకు పోయారు.

ఒక పెట్టెలోనుండి క్రొత్త బట్టలను పైకితీస్తూ, తండ్రి "దాస్వే, యివి వేసుకో! నీ పెళ్ళిమేనా యిప్పుడే వచ్చేస్తుంది. నువ్వు దానితోపోయి నీ పెళ్ళాన్ని వెంటబెట్టుకొని రావాల్సివుంటుంది" అన్నాడు

ఆ దుస్తులలో నల్లని పొడుగాటి షెర్వాని వుంది! నీలిరంగు బొంత లాగూలు వున్నాయి. అన్నీ మిల్లుగుడ్డలే!.... చీలమండ దాటిపోయే లాగూలు! ఓహో!....

"ఇవేసుకుంటే నా అవతార మెలావుంటుంది? నాకొద్దు!" అని ఎదిరించాడు దాస్వే.

"మంచిపిల్లాడిలాగున వేసిచూసుకో! మా నాయనగా!" అని బుజ్జగించాడు అతని తండ్రి.

దాస్వే ఎంత గొణుగుతున్నా సరకుసేయక, పెళ్ళికి వచ్చిన స్నేహితులలో కొంతమంది అతణ్ణి పట్టుకుని ఆ దుస్తులు ధరింపజేశారు. లాగూలు, షెర్వానీ బాగా పొడుగ్గా వున్నాయి. చీలమండలకు తాకుతుందనుకున్న షెర్వానీ మోకాళ్ళవరకు వచ్చింది. రియూ తన సోదరుని నెత్తిపై మిలమిలలాడే టోపీని పెట్టాడు. దానికి నడిమిని ఎర్రని బుడిపె వుంది. ఆ టోపీకూడా చిన్నదే. అతని నెత్తిమీద అతికించినట్లుంది.

పరిపూర్ణ తృప్తితో ముసలాడు "చాలా బాగుంది! అద్భుతంగా వుంది. ఇప్పుడు నువ్వు నిజంగా పెళ్ళికొడుకులాగున్నావ్!" అన్నాడు.

తండ్రి తన కొడుకుచేతులను గట్టిగా పట్టుకున్నాడు. "విప్పేయబోకు!" అని బ్రతిమాలాడు. వీటిని ఎరువుతెచ్చేసరికి నా పనయింది! వీటిని వేసుకోకపోతే వేటిని వేసుకుంటావ్?"

"నేను బాలూలో కార్యకర్తను; ఇలాంటి దుస్తులెలా ధరించను?" అన్నాడు దాస్వే.

అక్కడవున్న వాళ్ళంతా నవ్వారు. ఈ పరిస్థితులతో సరిపోతాయిలే అన్నారు. రియూ తన సోదరుని నెత్తిమీద మరల టోపీని అదిమాడు. అలసిపోయి, రొప్పుతూ కూర్చున్న తనతండ్రిని దాస్వే చూచాడు. తండ్రికి నుదుటిమీద చెమటలుపోశాయి. ఇష్టంలేపోయినా ఆ దుస్తులు ధరించాడు. కాని పిస్తోలును మాత్రం విడువనన్నాడు.

"తుపాకి మనిషిని విడువరాదని. మనిషి తుపాకిని విడువరాదనీ, మా ఆర్డర్సు!" అన్నాడు దాస్వే. అతను తన పట్టువీడలేదు.

ఇలా వాదోపవాదాలు జరుగుతూ వుండగా, బ్లాక్‌త్సే అక్కడకు వచ్చాడు. అతడు అతిఆప్యాయంగా వృద్ధుణ్ణి అభినందించాడు.

దాస్వే తనబాహువులను చాచాడు. "బ్లాక్! వీళ్ళు సన్నెరకంగా తయారుజేస్తున్నారో చూడు!" అన్నాడు జాలిగా.

జ్లాకీ కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వాడు. "ఏముందోయి ?— పెళ్ళికొడకా!"

"ఉత్తముడు వచ్చాడు. ఇక ప్రారంభిద్దాం!" అన్నాడు దాస్వే తండ్రి సంతోషంతో.

జ్లాకీ త్వే తండ్రిని ఒకప్రక్కకు తీసుకెళ్ళాడు. "ఇక్కడకు పడమటగా శత్రువులు చురుగ్గా వున్నారని నాకిప్పుడే తెలిసింది" అని అతనికి రహస్యంగా చెప్పాడు. "నే నక్కడికి పోవాలి; గెరిల్లాలను తీసుకుపోయి, రక్షణచర్యలు తీసుకోవాలి. మీరు పని పూర్తి చేసు కుంటూ వుండండి. నేను త్వరలో తిరిగివస్తా" అన్నాడు.

వారి సంభాషణను చూచాయగా విన్నాడు దాస్వే. "నేనుకూడా రావచ్చా?" అని ఆదుర్దాగా అడిగాడు.

జ్లాకీ నవ్వుతూ "అవసరంలేదులే. నీ పని తేవారు చూస్తారు. నీ మనసు పెళ్ళిమీద కేంద్రీకరించుకో!" అన్నాడు.

తేవారుయొక్క ముసలితల్లి పెళ్ళికూతురును తీసుకొచ్చే సందర్భంలో పెళ్ళికొడుకుకు తోడుగా వెళ్ళాలని నిశ్చయించారు. ఆమె తల కట్టు పచ్చబడిపోయిన వృద్ధవనిత. ఆమె తన తలలో ఎర్రని పువ్వును దోపుకొంది. ఆమె దాస్వేని సమీపించింది.

"టైమైంది. పల్లకీలోకి పోదాం పద" అన్నది.

దాస్వేకి గాబరావేసింది. "నేనుకూడా పల్లకీలో కూర్చోవాలా?" అన్నాడు.

"నడుద్దామనుకున్నావా?" అని ఆ వృద్ధ వనిత నవ్వింది.

"నాకు గుర్రముంది" అన్నాడు జ్లాకీ వెంటనే "దానిమీద వెళ్ళు, తర్వాత దానిని నాకు పంపుదువుగానిలే. నేను సైకిలు ఎరువు తీసుకొని పోతాలే" అన్నాడు.

"బాగుంది. బాలూ నమ్యానికి గుర్రపు స్వారి బాగుంటుంది" అన్నాడు పొరుగువాడొకడు.

ఆ విధంగా ఏర్పాటు చేయబడింది. దాస్వేకి కొన్ని సూచనలు యిచ్చి, ఆ వృద్ధ వనిత, రంగుల మేనాలో కూర్చుంది. దాస్వే, ఆ పెద్ద గుర్రాన్ని ఎక్కాడు. మేళగాళ్ళు ముందు నడుస్తూవుంటే. వారి వెనుక ఈ చిన్న వూరేగింపుజనం, పెళ్ళికూతురు గ్రామమైన హిస్వేలియూ గ్రామానికి తరలిపోయారు.

* * * *

నడచిపోతూవున్న గుర్రంమీద యిటూ అటూ వూగుతూ దాస్వే నలో ఈ విధంగా అనుకోసాగాడు. "ఇదంతా నిజంగా చిత్రంగావుంది! క్రితంరోజు పెళ్ళిమాట వూసేలేదు నా బుర్రలో. యివ్వాళ చూడు. పెళ్ళాన్ని తెచ్చుకోవటానికి పోతున్నా! హోవార్!....ఎలాంటి పిల్లో!— ఆమె మేరియా అంత చక్కనిదా? సరేలే! ఇంతదూరమొచ్చాంగదా! ఇక ఏదయితే అది! గొడవ దేనికి?— ఏమైతే ఏంగానీ— ఆమెకు చదువు నేర్పుతాను. ప్రతిఘటనోద్యమములో జేర్పిస్తాను."

వాళ్ళు ఆనకట్ట ఎక్కారు. సరస్సువెంట ఉత్తరదిశగా పోయారు. మేళగాళ్ళు, పూలమేనా, గుర్రంమీద దాస్వే, వారివెంట కొంతమంది చుట్టాలు అంతా కలిసి. ఆనకట్టను ఆచ్ఛాదించుతూవున్న పచ్చని మొక్కలను చూస్తూవున్న, రొదచేస్తూవున్న విల్లోచెట్లపంక్తి క్రిందుగా సాగిపోయారు. సరస్సులో అలలు గాలికి తాండవిస్తూ వున్నాయి. ఒక చిన్న బోటులో కూర్చుని ఒక యువకుడు. "పీచ్" పువ్వులనుగూర్చి పాడుతున్న పాట కొద్దిగా వినవస్తూవుంది.

వాళ్ళు త్వరగా హిస్వేలియూ గ్రామాన్ని చేరుకున్నారు. వసంత ఋతువిలసితమైన ప్రకృతినిజూచి, దాస్వే ముగ్ధుడయ్యాడు. జరుగబోయే తన పెళ్ళి విషయమై వూహించుకొని మురిసిపోతున్నాడు అర్థంలేకుండా. ఒక్కమారు లవలో తాను నవ్వుకున్నాడు

వారు గ్రామంలోని పెద్దవీధిలో ప్రవేశించారో లేదో అనేక తుపాకీగుళ్ళ మ్రోత వినవచ్చింది. వారు ఆగిపోయారు. ఆ గ్రామస్థులు యిటూ అటూ చెల్లాచెదరుగా పరుగెత్తుతూవుంటే చూసి కొయ్యబారిపోయారు. వీధికి ఆ చివర పసుపుపచ్చ సైనిక దుస్తులు ధరించిన జపానువాళ్ళు తుపాకులు పేల్చుకుంటూ వస్తూన్న సంగతిని చూచారు. దాస్వే తన గుర్రాన్ని వెనక్కు త్రిప్పాడు. దాని డొక్కల్లో కాళ్ళతో నొక్కాడు. గ్రామ ముఖద్వారానికి తన గుర్రాన్ని పరుగెత్తించాడు. కాని అక్కడ కూడా జపానువాళ్ళ ముఠా ఒకటివుంది. వాళ్ళల్లో చొరబడ్డాడు. అర్థంలేని భాషలో జపానువాళ్ళు మొరుగుతున్నారు. వాళ్లు పరుగెత్తుతూవున్న గుర్రంపై తుపాకిగుళ్ళ వర్షాన్ని కురిపించారు. అవన్నీ గురితప్పి చిందరవందరగా అటూ యిటూ పోయాయి. నురుగులు గ్రక్కుతూవున్న గుర్రం మెడపై వాలి ఒక పిస్తోలును బయటికి తీశాడు. దాస్వే జపానువాళ్ళు రక్షణస్థానంకోసం పరుగెత్తిపోయారు. వాళ్లు తెప్పరిల్లేలోగానే దాస్వే కొన్నివందల గజాల దూరానికి గుర్రాన్ని పరుగెత్తించాడు. జపానువాళ్లు అతని వెంటపడ్డారు. కాని అతను గుర్రంమీద పరుగెత్తుతూవున్నాడాయెను. వీళ్లు కాలినడకతో అందుకోవాలాయెను. అందువలన అతన్ని కలుసుకోలేకపోయారు. జపానువాళ్ళ వేట నిష్ఫలమయింది. దాస్వే తప్పించుకునిపోయాడు. గుర్రపుడెక్కలు ఆనకట్టమీద రేపిన ధూళిని మాత్రమే చూడగలిగారు జపానువాళ్లు.

ఆ రోజున జపానువాళ్లు తమ జిత్తులద్వారా గెరిల్లాలను పడమటిదిశగా లాగి, అటు తర్వాత హిస్యేలియూ గ్రామంలో సూటిగా చొరబడ్డారు. ఆ గ్రామంలో లూటీలు, హత్యలను సాగించారు. ఏదో ఒక పెళ్ళి జరుగబోతూవుందని కనిపెట్టి, పెళ్ళికూతుర్ని ఎత్తుకుపోయారు. మొట్టమొదట ఆమెను, జపానుసైన్య ప్లాటూన్ లీడరైన ఇయానో చెరచాడు. అటు తర్వాత ఆమెను ఇతర జపాను రాక్షసులు....

మరుసటిరోజున తెల్లవారుఝామున జుట్టంతా చెదరిపోయి చీకి

పాకిరిగావున్న గుడ్డలన్నీ చిరిగిపోయి రక్తపుధారలుకట్టి ఒళ్ళంతా గాయాలతో నిండిపోయిన ఒక యువతి, ఒక బావిని సమీపించింది. కొన్ని నిమిషాలపాటు గుండె పగిలేటట్లు ఏడ్చింది. తలక్రిందులుగా నూతిలో దుమికింది. ఆమె హేవార్! ప్రతిఘటన యుద్ధంలో బలియైపోయిన మరొక యువతి!



137

# 6 అధ్యాయం

తాను తలపెట్టిన పెళ్ళి ఆ విధంగా ఘోరంగా అంతమవటంచే దాస్వే తండ్రికి దుఃఖంలో పిచ్చిపట్టినంత పనయింది. మంచంపట్టాడు. కొన్ని మాసాలవరకూ మంచంలోనుండి లేవలేని స్థితికి వచ్చాడు. తేవారు తల్లి ఎక్కిపోతూవున్న పూల మేనాను కొంతమంది జపానువాళ్లు ఆపారు. దానిలో పెళ్ళికూతురు వుందనుకున్నారు. తీరా చూస్తే ముఖం ముడతలు పడిన వృద్ధురాలు మేనాలోనుండి క్రిందకు దిగింది. జపానువాళ్లు వికటంగా నవ్వారు. తుపాకి మడమలతో క్రూరాతిక్రూరంగా ఆ ముసలిదాని బొమికలు విరగగొడిచారు.

ఒరోజున జపానువాళ్ళు, హిప్యేలియూ గ్రామాన్ని ఆక్రమించుకున్నారు. ఆ గ్రామంయొక్క పాతకోటను బాగుచేశారు. శాశ్వత సైనికులుగా తమ సైనికులను అక్కడ వుంచారు. తరచుగా పరిసర గ్రామాల మీద దాడులు చేయసాగారు. దాస్వే, తేవారుల నాయకత్వాన నడుపబడే గెరిల్లాలతో అనేకసార్లు సంఘర్షించారు. చిట్టచివరకు తీవ్రమైన ఒక సంఘర్షణలో జపానువాళ్లు చావుదెబ్బలు తిన్నారు. కోటను తమగుప్పెట్లో పట్టిపెట్టుకోటానికై జీవో నాయకత్వాన కొంతమంది దేశద్రోహ సైనికులను అక్కడ వుంచి, తాము నగరానికి తప్పుకున్నారు. జీవో, అతని అనుచరులకు గ్రామందాటి బయటికిపోవటానికి అమితభయంగా వుంది. యిదే వాళ్ళ పరిస్థితి. ఇక గెరిల్లాల విషయం తీసుకొంటే, వాళ్ళు దేశ

ద్రోహ సైనికులకు పట్టుకొమ్మగావున్న ఆ కోటను స్వాధీనం చేసుకోలేక పోయారు.

1940 అక్టోబరు 10వ తారీఖున ఒక రాజకీయ కార్యక్రమాన్ని చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రకటించింది. షెన్‌జ్యా గ్రామానికి పూర్వం మేయరుగా వుంటూ వచ్చిన షెన్‌కు, హ్సికీత్సే యీ కార్యక్రమంయొక్క నకలును పంపాడు. షెన్ జపాన్‌వాళ్ళు ఆక్రమించుకున్న నగరములో కాపురముంటున్నాడు. కార్యక్రమంయొక్క నకలేగాక, షెన్‌జ్యాగ్రామానికి తిరిగిరావలసిందిగా ఆహ్వానిస్తూకూడా హ్సికీత్సే ఒక జాబు వ్రాశాడు. నగరంలో షెన్ అమితంగా డబ్బు ఖర్చుచేయాల్సివస్తూవుంది. నగరవాస జీవితమంటే షెన్‌కి విసుగెత్తిపోయింది. స్వగ్రామంపై గాలిమళ్ళింది. అనేకరోజులపాటున షెన్ ఆ రాజకీయ కార్యక్రమాన్ని బాగా చదివి దాని బాగోగులపై దీర్ఘంగా ఆలోచించసాగాడు. భూస్వాములతోసహా అన్ని వర్గాలమధ్యనూ సమైక్యతను సాధించుటకై ఒక ఆధారాన్ని ఆ కార్యక్రమం కల్పిస్తూవుందని గ్రహించాడు. జపానువాళ్ళకూ దేశద్రోహులకూ వ్యతిరేకంగా ప్రజాతంత్ర ఐక్యసంఘటన ఏర్పాటుగావాలని ఆ కార్యక్రమం సూచిస్తూవున్నది. తానీ విధంగా స్వగ్రామాన్ని విడిచిపెట్టటంలోనూ పరాయి నగరంలో పనికిమాలిన జీవితాన్ని జీవించుటలోను అర్థంలేదని గ్రహించాడు. తమతమ గ్రామాలకు తిరిగివెళ్ళిన భూస్వాములకు ఏవిధంగానూ హాని కలుగలేదని విన్నాడు. తెలివిమాలిన పని జేశానని నిశ్చయించుకున్నాడు. తన సామానులన్నీ సర్దుకున్నాడు. షెన్‌జ్యాగ్రామానికి తిరిగి వచ్చాడు.

దాస్వే పార్టీ పాలసీని చదువుతున్నాడు. షెన్ గ్రామానికి తిరిగి వచ్చాడని తెలియగానే అతణ్ణి చూసిరావటానికి దాస్వే వెళ్ళాడు. చైర్మన్ మావోయొక్క ముఖ్యసూత్రాలను షెన్‌కి వివరించాడు.

అదేరోజున మేయూ, వెచ్చని బట్టలు తెచ్చుకోవటానికి తన పిల్లవాణ్ణి అత్తవారి ఇంటివద్ద వదలి వెళ్ళటానికి బయలుదేరింది. పిల్లవానికి అప్పుడే తల్లిపాల అలవాటు తప్పింది. అందువలన తల్లి పెంపకం అవసరం లేకపోయింది. కేంద్రగ్రామంద్వారా పోతూపోతూ ఆమె దాస్వే

ఆఫీసువద్ద ఆగింది. దాస్వే షెన్‌ను చూడటానికి వెళ్ళాడని చెప్పారు. విశ్రాంతి గదిలో కూర్చొని, అతనికొరకు ఎదురు చూడసాగింది. ఇంతలోనే ముఖం చిట్లించుకుంటూ వచ్చాడు.

"ఏమిటి సంగతి?" అని నవ్వుతూ మేయీ ప్రశ్నించింది— "పనిలో ఏదైనా గందరగోళం జరిగిందా?" దాస్వే నిట్టూర్చాడు. చేతి సంచిని గోడకు తగిలించాడు. కాని జవాబు చెప్పలేదు. "షెన్‌ను చూడటానికి వెళ్ళావుటగా" అన్నది మేయీ "నీకు కోపము తెప్పించే మాటలేమైనా వాడు అన్నాడా?"

"షెన్ తిరిగివచ్చాడు. తన కుటుంబంలో ఎవరికీ చెరుపు జరుగలేదన్న సంగతి చూచాడు. చాలా సంతోషించాడు. పితూరీ చేయటానికి అవకాశమేలేదు. చాలా సంతోషంగా వున్నాడు" అని దాస్వే జవాబు చెప్పాడు.

"అయితే నిన్ను బాధిస్తున్న విషయమేమిటి?" అని మేయీ మరల ప్రశ్నించింది.

విచార సముద్రములో మునిగిపోయాడు దాస్వే. జవాబు చెప్పలేదు.

అతని కే విధమైన కష్టం కలిగిందో, ఏ విషయం అతణ్ని బాధిస్తూవుందో, మేయీ గ్రహించలేకపోయింది. వూహించలేకపోయింది. "అనేక సంవత్సరాలనుండి మనిద్దరం కలిసి పనిజేస్తున్నాం. నేను నీకు క్రొత్తదాన్ని కాదుగదా — నాతో చెప్పరాదూ?" అన్నదామె. బ్రతిమాలసాగింది.

దాస్వే ఆమెవంక జూచాడు. "నా పెళ్ళి విషయం" అని వెలిగ్రక్కాడు.

మేయీ మృదువుగా, "నీవింకా యువకుడివి. నీకు "అర్ధాంగి" దొరకదని భయపడుతున్నావా? ఇందులో బాధపడాల్సిందేమీ లేదు" అన్నది.

"అదిగాదు నన్ను బాధించేది. నా కెన్నటికీ పెళ్ళికాకపోయినా ఫరవాలేదు.... మా నాయన విషయం చెపుతున్నా. ఆయనకి ఈ విష

యమేగాని మరేదీ పట్టలేము. పాపం! ఆ పిల్ల చనిపోగానే మా నాయన మంచంపట్టాడు. సగం పిచ్చెక్కిపోయింది. ఇప్పుడు కొంచెము కోలు కుంటున్నాడు. కాని నన్ను జూడగానే పెద్దపెట్టున ఏడుస్తున్నాడు.... అంటాడు గదా.... అంటాడుగదా...." దాస్వే తన మాటలను పూర్తి చేయలేకపోయాడు.

"ఏమంటాడు? సగంచెప్పి, మిగతాది మింగబోక!" అన్నదామె.

"అయ్యో! జీవితం క్షణికమైనదంటాడు. మొట్టమొదట నిన్నిచ్చి పెళ్ళిచేయాలనుకున్నాడు. దానికి కావలసినవన్నీ పూర్తిజేశాననుకున్నాడు. విల్లో చెట్లమాదిరి అవుతుందని ఎవరికి తెల్సు. పువ్వులు పూయుటయే గాని, కాయలు కాయవన్నసంగతి ఎవరికి తెల్సు? అటు తరువాత, హెవార్ విషయం. ఆమె మా యింటికిని పైపోయిందనే చెప్పొచ్చు! కాని, ఆ దుర్ఘటన.... భయంకర దుర్ఘటన సంభవించింది. ఆ సంఘట ననుగురించి ఎప్పుడూ కలవరిస్తూ వుంటాడు. ఆ విషయం ఆయన గుండెని తినేస్తూవుంది. కొన్ని సమయాలలో గావుకేకలు వేస్తాడు... ఎక్కువకాలం బ్రతుకుతాడని అనుకోను!" అన్నాడు దాస్వే.

మేయీ కొయ్యబారిపోయి చూస్తూవుంది. తన చేతులలో వున్న పిల్లాడు తన జుట్టును పీకుతున్నా ఆమెకు స్పృహలేదు. దాస్వేపట్ల మేయీ హృదయంలో అనిర్వచనీయమైన ఆప్యాయతవుంది. ఆ ఆప్యాయత హృదయంలో తరంగితమవుతూ వున్నది. హృదయంలో రేగిన ఆ తరంగాల ప్రభావానికి ఆమె, తన నోరువిప్పి మాటాడలేకపోయింది. దాస్వే, తన్ను ప్రశ్నించాడన్నది ఆమెకు తెల్సు. కాని, ఆమెకు వినపడ లేదనే చెప్పాలి.

ఆమె సిగ్గిలింది. తత్తరపాటుతో బిత్తరపోతూ, "ఏమన్నావు?... కౌంటీ ప్రభుత్వము త్వరలో ఎన్నికల ఏర్పాటు చేస్తుంది. నేను నీకు చెపుదామని వచ్చా...."

గతసారి కలిసిననాటినుండీ, వారేమేమి చేస్తున్నదీ, ఒకరికొకరు చెప్పుకోసాగారు. అటుతరువాత మేయీ తన గుడ్డలమూట విప్పింది. గుడ్డతో కుట్టిన చెప్పులను బయటకు తీసింది.

"నీవలాగే పరుగెత్తుతున్నావన్నమాట. నీ చెప్పులవంక చూడు. వేళ్ళవద్ద గంగానమ్మ నోరంత కంత!—చాలా అసహ్యకరం!" అన్నది తీవ్రంగా, "నీ సైజేమిటో నాకు తెలియదు." వేసుకొని చూడు, సరిపోతాయోలేదో" అన్నదామె.

దాస్వే, ఆ కొత్త చెప్పులను వేసుకొన్నాడు. ఆమెవంక ఆప్యాయంగా చూశాడు. "చాలా అందంగా వున్నాయ్!.... సరిగ్గా సరిపోయాయి. నామీద నీ కెంత...."

మేయీ కళ్ళు చెమర్చాయి. ఆమె హృదయం వ్యథ చెందింది. "అలా అనబోకు. అవంత గొప్పవికావు" అన్నది చులకనగా. "ఇప్పటినుంచి నీకేదైకావల్సినా—కుట్టుపనిగానీ, బాగుచేసిపెట్టటంగాని, ఏది కావాల్సివచ్చినా, నాతో చెప్పు. చేసిపెట్టటానికి తీరిక చేసుకుంటాను" అన్నది.

మేయీ తన పిల్లాడిని తీసుకొని, ఆ ప్రదేశాన్ని వీడిపోయేసరికి సంధ్యాసమయమయింది.

* * * *

"సరిహద్దుప్రాంత"మంతటా ఎన్నికలు జరుపబడ్డాయి! ఈ "సరిహద్దుప్రాంతంలో" అనేక రాష్ట్రాలున్నాయి. అనేక లక్షలమంది ప్రజలు యీ ప్రాంతంలో నివసిస్తున్నారు. జపానువాళ్లు నగరాలను, వ్యాపార కేంద్రాలైన కొన్ని పట్నాలను ఆక్రమించుకొన్నారు. వాళ్ళు పగటిపూట ప్రధాన రవాణా మార్గాలను కంట్రోలుచేస్తూ వుండేవారు. రాత్రిపూట బయటికి రావటానికి భయపడేవారు. జపానువాళ్ళ చేతులక్రింద పనిచేసే తుచ్ఛుల సైన్యాల చేతులలో కొన్ని గ్రామాలున్నాయి. దేశంలోని అత్యధిక సంఖ్యాక ప్రజలు, జపానువాళ్ళ దాడులకు, వేటలకు నిరంతరం గురియవుతున్నప్పటికినీ, క్రమేణా బలవత్తర ప్రతిఘటనోద్యమాన్ని

నిర్మించుకోసాగారు. కమ్యూనిస్టుల నాయకత్వంక్రింద, ప్రజాతంత్ర ప్రభుత్వానికి పునాదులు వేసుకోసాగారు.

ప్రతి వ్యక్తీ, ప్రతి వర్గంవారు ఎన్నికలలో పాల్గొన్నారు. షెన్ లాంటి భూస్వాములనుకూడా వోటుచేయ తమకు యిష్టమైనవాళ్ళను ఎన్ను కొన్నారు. అన్ని స్థాయిలకు సంబంధించిన ప్రభుత్వశాఖలోనూ ప్రభుత్వ సంచాలక అధికారులు ఎన్నుకోబడ్డారు. అంటే గ్రామం లగాయతు జిల్లా వరకూగల, కౌంటీవరకుగల, సరిహద్దు ప్రాంతంలోని ఉన్నతాధికారుల వరకూ అందరినీ ప్రజలే ఎన్నుకొన్నారు. ఎట్టి ఆటంకాలూ లేవు. ఉన్న ఆటంకమల్లా, ప్రభుత్వ పాలకవర్గంలో కమ్యూనిస్టులు మూడవవంతు కన్న మించరాదన్నదే.

బ్లాకీత్సే కౌంటీ ప్రభుత్వ సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. మేయీ జిల్లామహిళాసంఘానికి అధ్యక్షురాలుగా ఎన్నుకోబడింది. యింతవరకూ గెరిల్లా సంఘంగా వుంటూ వచ్చిన సంఘం పూర్తిగా సైన్యంలో పని చేయాలని నిర్ణయించబడింది. ఆ జిల్లా ప్రజాసైన్యానికి నాయకుడుగా దాస్వే ఎన్నుకోబడ్డాడు. జిల్లాలోని వందలాది రైతులతో ఈ జిల్లా ప్రజా సైన్యం ఏర్పరచబడింది. దీని సభ్యులు మామూలుగా భూములు దున్ను కొంటూ వుంటారు. అంటే, వ్యవసాయపు పనులను మామూలుగా చేసు కొంటూనేవుంటూ, తుపాకులను మాత్రం తమ దగ్గరలో వుంచుకొంటూ వుంటారు. సమయం వచ్చినప్పుడు సైనికులుగా తయారవుతారు.

దాస్వే యిప్పుడు జిల్లాప్రజాసైన్యానికి నాయకుడు. కాబట్టి, అత నికి బాధ్యతలు పూర్వంకన్నా విస్తారమయ్యాయి. అందువలన అతనికి యింతకముందుకన్నా తీరికలేకుండా వుంది. 1941 వసంత ఋతువులో అతనికొక సమస్య ఎదురయింది. గెరిల్లాగా తాను గడిపిన జీవితంలో అతనికి యిలాంటి సమస్య ఎప్పుడూ ఎదురుకాలేదు. అతని జిల్లాలో, బాయాంగ్ సరస్సుకూడా యిమిడివుంది. దానికి అవతలివొడ్డున "లేక్ హార్బర్" అనే రేవువుంది. జపానువాళ్లు ఈ మధ్యప్రాంతములో తిరుగు టకు స్టీమ్-బోటను వుపయోగిస్తున్నారు. వాళ్ళ ఆధీనంలో యీ రేవుకు దగ్గరలోవున్న ఒడ్లలు వున్నాయి. వాళ్ళ కంటపడిన ప్రతి బెస్తవాని

బోటునూ గుంజుకొనేవారు. రైతులు తమ బోటులలో రెల్లు వగైరాలను. లేక తినుబండారాలను తీసుకొనివస్తూవుంటే వాటిని జపానువాళ్ళు పట్టుకునేవారు. వ్యక్తుల స్వంత బాతులను లూటీచేసేవారు. అందువలన సరస్సుమీద వ్యాపారమంతా ఆగిపోయింది.

ఈ స్టీమ్-బోట్లపని యెలా పట్టాలాయని, చర్చించుటకై ప్రజా సైనికులు, గ్రామీణుల సమావేశానికి పిలుపిచ్చాడు దాస్వే. దాస్వే సోదరుడయిన రియూకి పదహారేళ్ళు వచ్చాయి. అతడు ప్రజాసైన్యంలో ఇప్పుడు సభ్యుడు. పొగబోట్లను ఎదిరించటానికి ఎప్పుడు సమయం దొరుకుతుందాయని తహతహలాడుతున్నాడు.

అతడుకూడా సమావేశానికి హాజరయ్యాడు. అతడీ సమస్యను వినగానే అతనికొక ఆలోచన తటాలున తట్టింది. "అన్నాయి! నా కో మంచి ప్లాను తట్టింది!" అని అరిచాడు.

"మనం యిప్పుడిక్కడ మీటింగు జరుపుకుంటున్నాం-" "నీ అన్నాయి వ్యాపారమేమిటి ?" అన్నాడు దాస్వే కఠినంగా. అందరూ నవ్వారు.

రియూ దిగ్భ్రమింగాడు. కాని పట్టువల వీడలేదు. "సరేలే! నిన్ను అన్నాయని పిలువకూడదంటే పిలవనే పిలవను ఏమంటానంటే— మిష్టర్ చైర్మన్! నాదొక సలహా—"

"మంచిది. అదేమిటో చెప్పు వింటాము. కాని ఇది తీవ్రమైన వ్యవహారమని గుర్తుంచుకో. మూర్ఖుడులాగున వ్యవహరించకూడదు" అన్నాడు దాస్వే.

"నిజంగానే మూర్ఖంగాదిది!" అని కోపంగా రియూ చెప్పాడు. "నా అభిప్రాయమేమంటే—మన తుపాకులు జోడుగుళ్ళ బారులుగాదు. ఒక్కగుండు బాయతుపాకులు మనవి. అందువలన మనం పొగబోట్లమీద మన్ను జపానువాళ్ళను ఒక్కదెబ్బతో చంపలేకపోతే చిక్కుల్లో పడిపోతాం. అందువలన మనం వాళ్ళకు దగ్గరగాపోయి, షాట్‌గన్లతో వాళ్ళను పేల్చేద్దాం. దానితో తొత్తుకొడుకుల పనవుతుంది. అదే నా అభిప్రాయం" అన్నాడు రియూ.

"ఈ అభిప్రాయం చాలా బాగున్నట్టే వుంది" అని ప్రజాసైనికు డొకడు బలపరచాడు.

జోవ్ అనే బెస్తమనిషి "మనం కొన్ని డజన్ల షాట్‌గన్‌లను తీసుకుపోయి అందరం ఒక్కసారిగా కాల్చితే జపానువాళ్ళ నందరినీ తుదముట్టించవచ్చు" అని బలపరచాడు.

"నా కర్థంగావటంలేదు" వంచనగా అన్నాడు బెదురుగొడ్డు; "మన వన్నీ తుప్పుపట్టిన పాత షాట్‌గన్‌లు. తరచుగా గురితప్పుతూ వుంటాయి——"

దాస్వే ఒక్కనిమిషం ఆలోచించాడు. "ఆ అభిప్రాయం అంత చెడ్డదిగాదు! ఒక్కమారు ఆ విధంగా చేసిచూద్దాం. అయితే షాట్‌గన్‌లకు తోడుగా తుపాకులను పిస్తోళ్ళనుకూడా వుపయోగిద్దాం" అన్నాడు.

ముట్టడి ఏ విధంగా జరుపవలసింది వివరాలను చర్చించారు. ప్లాను పూర్తిజేసిన తర్వాత సమావేశాన్ని వాయిదా వేశారు.

లేక్ హార్బరునకు పోగబోటు తిరిగిపోతూవున్న సమయంలో ఆ సాయంత్రమే ముట్టడిని సాగించాలని నిర్ణయించుకొన్నారు. సైనికులు యిరవై చిన్న పడవలలో బయలుదేరారు. సాధారణంగా ఆ చిన్న పడవలు అడవి బాతులను వేటాడటానికి వుపయోగిస్తూవుంటారు. ఆ చిన్న పడవలు. ఒక్కొక్కటి వరుసగా బయలుదేరాయి. నీళ్ళను చీల్చుకుంటూ పోసాగాయి; తెడ్లన్నీ ఏకంగా పనిచేయసాగాయి. ఆ చిన్న పడవలు ఆ విధంగా నీళ్ళమీద పోతూవుంటే ఎగురుతూవున్న డేగ రెక్కలు కొట్టు కొంటూవున్నట్లు అనిపించింది. తీరానికి దగ్గరలో లోతు తక్కువప్రదేశ ముంది. ఆ ప్రదేశంలో మనిషి ఎత్తున రెల్లుదుబ్బులు పెరిగాయి. ఆ దుబ్బుల్లోకి నెట్టించారు యీ పడవలన్నింటినీ. అయితే ఆ రెల్లుదుబ్బులు వాటంతటవి పడి పెరిగినవి కావు. ఆ వెదురుజాతి రెల్లుతో చాపలూ, బుట్టలూ అల్లుకోటానిక, రైతులే వాటిని అక్కడ నాటి పెంచారు. సరస్సు లోని లోతు తక్కువ ప్రదేశాలలో చాలావరకు ఆక్రమించుకున్నాయి. వీటి మధ్య మధ్య కాలువలాగున నీటిపాయలు వున్నాయి. అంటే ఒక రెల్లుదుబ్బులు వరుసకి, మరియొకదానికీ మధ్య బోటు పోవుటకు వీలుగా

నీళ్ళుగల ఖాళీ ప్రదేశం వుందన్నమాట! ఈ కాలువలలో బోట్లను దాస్తే- సరస్సులో వున్నవాళ్ళకు, యీ బోట్లు కనపడవు. ఎందువల్లనంటే, లోతు తక్కువ ప్రదేశం లేక సరస్సులోని మెరకప్రదేశాలు ఒకే వరుసలో లేవు. అడ్డదిడ్డంగా వున్నాయి. వాటిమీద రెల్లు పెంచబడుతూ వుంది. ఒక మెరకకు మరియొక మెరకకు మధ్య నీటికాల్వ వున్నదని చెప్పాముకదూ ప్రతి బోటులోనూ రెండు షాట్ గన్‌లను వుంచారు మందుతో దిట్టంగా దట్టించి సిద్ధంగావుంచారు. ఈ ఆయుధాలు ప్రాచీనకాలపు వేటతుపాకీ లన్నమాట! వీటికి 'ట్రిగర్' అంటూ ఒకటివుండదు. పేల్చాలంటే మందు త్రాటికి నిప్పంటించి, దాని సహాయంతో పేల్చాల్సిందేతప్ప మరియొక మార్గంలేదు. ఆదేవిధంగా చేయుటకై, సైనికులు సిద్ధంగావున్నారు.

నిశ్శబ్దం అంతటా ఆవరించింది. చడీ చప్పుడూలేదు!

సూర్యాస్తమయ మవుతూండగా, పడమటి దిక్కునుండి వస్తూ వున్న పొగబోటు యీలలు వినవచ్చాయి.

“వస్తోంది సిద్ధకండి” అన్నాడు దాస్వే.

వొయ్యారంగా జపానువాళ్ళ పొగబోటు కనుచూపుమేరలోనికి వచ్చింది. ఇంకా దగ్గరకు వచ్చింది. ప్రజాసైనికులు పొగబోటు పైభాగముపై తమ షాట్‌గన్‌లను బారుచేశారు. పొగబోటు నడకను అనుసరించి తమ షాట్‌గన్‌లను నడిపారు. ఒక వందగజాలు....యాభై గజాలు.... యిరవై గజాలు....ఆఁ! ఇప్పుడు సరిగ్గా సూటిగా యెదురుగా వచ్చేసింది.

“కాల్చండి!” అని అరిచాడు డాస్వే.

ఉరుములాగున ఒక్కుమ్మడిగా నలభై షాట్‌గన్స్ గర్జించాయి. నల్లనిపొగ మేఘం ఆ ప్రదేశాన్నంతటినీ కప్పేసింది. కాని యింజను మోత యింకా వినపడుతూవుంది.

“చాలా వింతగావుంది! నా కర్థంకావటంలేదు. జపానువాళ్ళు చావకపోయినట్లయితే, తుపాకులు పేల్చరేం? లేకపోతే, పారిపోరే!” అన్నాడు రియూ.

“అరవబోకు! చూస్తూవుండు!” అని బుసకొట్టాడు దాస్వే.

పొగ తగ్గుతూవుంది. ఆ పొగబోటు గిరిగింతాలు కొట్టూ వుండటాన్ని గమనించాడు. అదింకా వాళ్ళకెదురుగానేవుంది. కాని ఒక్క జపానువాడైనా వాళ్ళకు అగుపించలేదు.

"ఏం జరుగుతూవుందో చూసివస్తాను!" పల్లెకారియైన జోవ్ అన్నాడు.

బెల్టులో చాకును దోపుకున్నాడు. సరస్సులోనికి తలక్రిందులుగా దుమికాడు. నీటిలో మునిగి బోటువైపుగా యీదుకొంటూ పోయాడు. అప్పుడే, ఆ బోటు గిరిగింతాలు కొట్టటం మానింది. లేక హార్బరు రేవు వైపుగా ప్రయాణం సాగింది. మన పడవల దండు దాని వెంటపడ్డారు! ప్రజాసైనికులు కాల్చటానికై తుపాకులు బారుచేశారు; కాని అదే సమయంలో బెస్తమనిషైన జోవ్ పొగబోటుప్రక్కగా నీళ్ళలోనుండి తల పైకి పెటాడు. అందువలన తుపాకులు కాల్చకుండా వూరుకోవాల్సి వచ్చింది. జోవ్ పడవ అంచులను పట్టుకొని నలుమూలలా కలయజూశాడు. అతనికి పడవ వెనుకభాగంలో ఒక జపానువాడు అగుపడ్డాడు. వాడు పొగబోటును సమీపిస్తూవున్న ప్రజాసైనికులపై కాల్చటానికి గురిచూస్తున్నాడు.

జోవ్ నీళ్ళలోనుండి పైకెక్కి పిల్లిలాగున జపానువాడిమీద దూకి వాడి వెన్నులో తన చాకును దిగేశాడు. మళ్ళీ ఒక్కపోటు—ఆ దెబ్బతో జపానువాడు నిర్జీవుడై జోవ్ కాళ్ళముందు దొర్లాడు.

జోవ్ డజనుమందికిపైగా చచ్చిపడివున్న జపానువాళ్ళ శవాల మీదుగా దాటివెళ్ళాడు. షాట్‌గన్స్ దెబ్బలకు జపానువాళ్ళ శరీరాలతో పెద్ద పెద్ద ముక్కలు ఎగిరి అవతలపడివున్నాయి. జోవ్ యింజన్‌వద్దకు పోయాడు. ఇంజను మరలను తెగకోశాడు. లాగాడు. కాని ఏమీ లాభం లేకపోయింది. చిన్నబోట్లలో విసుగూ విశ్రమంలేకుండా, శక్తినంతా వినియోగించి తెడ్లేస్తూవస్తున్న ప్రజాసైనికులవంక తిరిగి జోవ్ అరచాడు.

"వేగంగా రండి! ఇది నాకు స్వాధీనంకావటంలేదు. చెయిజారిపోనీయబోకండి!"

శక్తినంతా వినియోగించి పడవలను పరుగెత్తించసాగారు ప్రజా

సైనికులు. కాని వారికీ పొగబోటుకూ మధ్యదూరం క్రమేణ పెరుగ సాగింది! మరలతో పిచ్చిగా పెనగులాడసాగాడు జోప్. లాభంలేక పోయింది. బోటు పైభాగంలో నిలబడ్డాడు. ఆ పల్చని గాలిద్వారా బోట్లను తన సమీపానికి లాగుతాన్నట్లుగా తన చేతులు వూపసాగాడు.

"వేగంగా! వేగంగా రండి! దీనెమ్మ!....పరిగెత్తించండోయ్"అని మొరిగాడు.

వూగుతూ పోయిపోయి, ఆ పొగబోటు రెల్లుదుబ్బుల్లోకిపోయింది ప్రజాసైనికులు అక్కడకు చేరుకొనేసరికి అది యింకా నడుస్తూనేవుంది. ప్రజాసైనికులు బోటుపైకెక్కారు. ఇంజనును ఆపివేశారు.

బోటు పైభాగం రక్తంతో తడిసిపోయింది. జారుతూవుంది! చని పోయిన జపానువాళ్ళ గాయాలనుండి రక్తం తెగ కారుతూవుంది. ప్రజా సైనికులు తుపాకులను ప్రోగుచేసుకున్నారు!

మందుగుండు సామాగ్రినంతా పోగుజేసుకున్నారు. శవాలను సరస్సులోనికి తోసిపారేశారు. రియూ అమిత ఆశ్చర్యంలో పొగబోటు వంక చూడసాగాడు.

"దీన్ని కొంపకు తీసుకొనిపోయే దెలా?" అనడిగాడు.

తెరచాప కాన్వాస్‌గుడ్డను యినుపచట్రంపై బిగించారు. పడవ పై భాగంమాత్రం కొయ్యతో చేయబడింది!

ఇలాంటి పడవలను తయారుచేసేటప్పుడు ముందుగా విడిభాగాలు తయారుచేస్తారనీ, వాటి నన్నింటినీ తర్వాత ఒకచోటజేర్చి కూర్చుతారని దాస్వే ఎక్కడో విన్నాడు. అది జ్ఞాపకం వచ్చింది. ఇటూ అటూ చూశాడు. రెండు శ్రావణాలు కనపడ్డాయి! చట్రంమేకులు విప్పదీయ సాగారు. ఒక్కొక్కముక్కనే వూడదీశారు. పడవల్లో వేసుకొన్నారు. పడవను విప్పదీయటం పూర్తిఅయింది. ప్రజాసైనికులు యింటికి బయలు దేరిపోయారు!

"వొడ్డుకు దగ్గిరగా పడవలను నడపండి! మనవాళ్ళందరినీ చూడ నియ్యండి" అని అన్నాడు దాస్వే.

దాస్వే బోటు ముందు నడుస్తూవుంది. దానివెనుక "వి" ఆకారంలో

తతిమ్మా పడవలు నడుస్తున్నాయి. తాము పొందిన విజయంతో ప్రజా సైనికులలో ఉత్సాహం పొంగిపొరలింది. నీటిమీద పడవలను పరుగెత్తించ సాగారు. సరస్సు ఒడ్డునవున్న గ్రామాలలోనికి రైతాంగప్రజలు, పల్లె కారులు వొడ్డున గుమిగూడారు. తెల్లటి పొడుగాటిగడ్డంగల పెద్దమని షొకడు విజయోత్సాహంతో వస్తూన్న పడవలవంక సగర్వంగా చూపించాడు. (ఈ పెద్దమనిషి యిటీవలనే వెలుగుపొందిన కులీనులలో ఒకడు. ఇక్కడ వెలుగుపొందటానికి అర్థమేమంటే ఈ కులీనవర్గానికి జెందిన పెద్దలు తమ గ్రామాలలోని బీదలను పీడిస్తూ వుండేవారు. సమయం వచ్చినప్పుడు దేశానికి శత్రువులైన వారితో జేరిపోయేవారు. చైనా కమ్యూనిస్టుపార్టీ యిలాంటి వారందరికీ దేశభక్తిని నూరిపోసింది. జ్ఞానోదయం కలిగించింది. బుద్ధికలిగినవారు దేశానికి ద్రోహంచేయటం మానివేశారు. ఐక్య ప్రజాతంత్ర సంఘటనలోజేరి పనిచేయసాగారు. ఇంతవరకూ తమ రైతులపట్ల కఠినంగా ప్రవర్తించుతూ వచ్చిన పీరు కారుణ్యాన్ని చూపించసాగారు. ఇలాంటివారందరినీ "వెలుగుపొందిన కులీనులని" చైనాలో పిలుస్తారు.)

"ఆహా!— యెంత అందమయిన దృశ్యం!— దేగయీకలాగున్నది!"

రైతాంగ ప్రజలను ఈమాట ఆకర్షించింది. వారు చిరునవ్వును తొలకరించారు. తలలువూపారు. "అవునది దేగయీకపటాలం!"

ఆనాటినుండీ జిల్లా ప్రజాసైన్యానికి దేగయీకపటాలమని పేరు వచ్చింది.

జిల్లా మహిళాసంఘంలో మేయీతోపాటు పనిచేస్తూవున్న యువతి పేరు "నియూర్". వీరిద్దరికీ మంచి స్నేహమేర్పడింది. దేగయీక-పటాలం మరల శత్రువుల పొగబోటులలో మరియొకదానిని ముట్టడించటానికి ఆయత్తమవుతూవుందన్న విషయం ఈ యువతులిద్దరికీ తెలి

సింది. అందువలన తాముకూడా పటాలంవెంట పోవాలని ఉబలాటపడ సాగారు.

ఈ విషయాన్ని వారు దాస్వేతో ముచ్చటించారు. దాస్వే నవ్వాడు. "ఇది దేవుని ఊరేగింపులో పాల్గొనటంగాదు. ఇది యుద్ధం. మీరింటి వద్దనే వుండటం మంచిది అన్నాడు.

దాస్వే ఈవిధంగా మాట్లాడుటవలన వారికి నిరుత్సాహం కలిగింది. కాని, వారు తమ పట్టుదలను వీడలేదు. రహస్యంగా పోవుటకు నిశ్చయించుకొన్నారు. "నీటి బాధంకాయలు పోగుచేయటానికి పోతున్నామని చెప్పి, మన బోటులో వాళ్ళను అనుసరిద్దాం" అన్నది మేయీ. "అప్పుడు మనం విషయాన్నంతా చూడవచ్చు."

ఆ మధ్యాహ్నం దేగయీకపటాలం బయలుదేరింది. జపానువాళ్ళు రెండు పొగబోట్లలో వస్తారని తెలిసింది; ఒక్కొక్క పొగబోటుమీద పదిమందికి తక్కువ వుండరని తెలిసింది. సరస్సులోని ఒక భాగంలో రెండు వొడ్డులలోనూ రెల్లుదుబ్బులు పెరిగివున్నాయి. ఆ దుబ్బులలో దాక్కొని జపానువాళ్ళ పొగబోటు అక్కడికిరాగానే దానిపైబడి హతమార్చాలని ప్లాను వేసుకొన్నారు. అందుకని రెండు ముఠాలుగా ప్రజాసైనికులు చీలిపోయారు. దాస్వే నాయకత్వాన ఒక ముఠా దక్షిణపు వొడ్డునున్న రెల్లుదుబ్బులో దాక్కొంది. జోవ్ నాయకత్వాన రెండవ ముఠా వీరికి అయిమూలగా సూటిగావున్న రెల్లుదుబ్బుల్లో దాక్కొంది. మొదటి పొగబోటుమీద గుళ్ళవర్షాన్ని దాస్వే కురిపించాలనీ, రెండవ దానిమీద జోవ్‌ముఠా కురిపించాలనీ నిశ్చయించుకొన్నారు. ఈ మారు ప్రజాసైనికులందరూ మంచి మంచి షాట్ గన్నులను తీసకొన్నారు. వాటిలో మందు దట్టించి, సిద్ధంగా వున్నారు. ఆ తుపాకులు చాలా అడుగుల పొడవున్నాయి. అందువలన వాటిని కాల్చేటప్పుడు వాటికి సపోర్టు వుండాలి. కాని, అవి ప్రేలితేమాత్రం వాటిదెబ్బకు శత్రువులు తట్టుకోవటం చాలా కష్టం.

మృదువైన వేసంగివాయువు అతిసున్నితంగావున్న ఆ రెల్లుపోచలను కదలిస్తూవుంది. ఆ గాలికి రెల్లుమొక్కలు వాసనలు వెదజల్లుతూ

వున్నాయి. తూర్పుదిక్కుగా తామరపువ్వులు అడవిలాగున పెరిగి వున్నాయి. సూర్యరశ్మిని ఆహ్వానిస్తూవున్నాయి. వూగుతూ, నాట్యమాడుతూవున్నాయి. ఆ తామరపువ్వులకు దగ్గరగా, ఉత్తరపు ఒడ్డువెంట ఒక చిన్న పడవలో యిద్దరు యువతులు మెల్లగా వస్తున్నారు. వారు మేయీ నియూపలు లాగున్నారే!

"ఆ మూగపిల్లల్ని రావద్దన్నా భలేబాగుంది?" అని పొగలు గ్రక్కాడు దాస్వే. దాస్వే తన పడవను వారిదిక్కుగా చురుకుగా పోనిచ్చాడు. కాని వాళ్ళు తామరవనంలో మునిగిపోయారు. గుట్టుచప్పుడు కాకుండా దాక్కొన్నారు. దాస్వే ఎంతవెతకినా వాళ్ళను కనిపెట్టలేక పోయాడు.

"ఆడాళ్ళు ఇక్కడకు రావటంలో అర్థమేమిటి? ప్రతి విషయాన్ని తలకిందులు జేసేస్తారు! మీరు వెంటనే ఈ ప్రదేశాన్ని విడిచి వెళ్ళక పోతే, తుపాకులు పేల్చుతాం! జాగర్త!" అని బెదిరింపుగా గర్జించాడు.

నియూర్ తన తలను పైకిపెట్టింది. "నీటి వాదంకాయలు పోగు జేస్తున్నాం! దీనితో మీకు సంబంధమేమిటి? మీకు నష్టమేమివచ్చింది? కష్టమేమి కలిగింది?" అన్నది నియూర్.

దాస్వే ఆమెను బెదరింపుగా తనవ్రేలిని ఆమెపంక జూపాడు. "గందరగోళదయ్యమా? ఏమిటీ ఆట? మీరిద్దరూ యిప్పుడే యిక్కడి నుండి పోంపోతే, యింటికి వెళ్ళిన తర్వాత మీ యిద్దరికీ వేడివేడివి తగిలిస్తాం! జాగర్త!"

"సరేలే! పేం పోతున్నాం, మేము పోతాం! సరేనా?" అని నియూర్ త్వరగా అదృశ్యమయింది.

ఏమి జరుగుతూవుందో చూడటానికని మరికొంతమంది పడవలలో పరుగెత్తుకొచ్చారు.

"ఏంకావాలిక్కడ?" అని వాళ్ళనుజూచి దాస్వే మొగం వాచేటట్లు అన్నాడు. "పోండి! మీ మీ స్థానాలలో దాక్కోండి!" అని ఆజ్ఞాపించాడు.

రియూ అల్లరిగా యికిలించాడు. "కమాండరుగారికి మనవిచేసు

కొంటున్నాం—సూర్యుడింకా నడినెత్తిమీద వున్నాడు. యింకా సమయముంది. కాస్త యీదులాడుతాము? ఏమంటారు? అని మనవిచేశాడు.

"ఇక్కడ యుద్ధం చేయటానికొచ్చావా? ఆడుకోటానికొచ్చావా?" అన్నాడు ముఖం చిట్లిస్తూ దాస్వే.

"ఒకగంటక్రితమే జపానువాళ్ళ పడవలు యిలా పోయాయట! వాళ్ళు తిరిగి వచ్చేటప్పటికి కొంతకాలం పడుతుంది. గాలి బాగా వేడిగా వుంది. ఒక్కమారు అలా యీదివస్తారు. పోయి రానివ్వరాదూ?" అని నవ్వుతూ అన్నాడు జోవ్.

దాస్వే ఏమీ జవాబు చెప్పలేదు. కిమ్మనకుండా వూరుకొన్నాడు. మౌనం అర్థాంగీకారంగా భావించి, రియూ నీళ్ళలోనికి ఒక్కదూకు దూకాడు. తతిమ్మావాళ్లు కూడా నడుమువరకూ గుడ్డలు విప్పేసి అతణ్ణి అనుసరించారు. తనకుకూడా అలాచేయటం చాలా యిష్టమే అయినప్పటికీ దాస్వే వాళ్ళతో కలియలేదు. పడవమీదే వుండిపోయాడు. ఒకపెద్ద తామరాకును త్రుంచాడు. పడమటిదిక్కుగా తిరిగి జపానువాళ్ళ పడవలు వస్తున్నాయేమో కనిపెడుతూ, తామరాకుతో విసురుకోసాగాడు.

రియూ నీళ్ళలో ఈదుతూ ముఖంమీద పడిన నీళ్ళను చేతితో తుడుచుకున్నాడు. "పోటీలుపడదాం పట్టండి! ఎవరు వేగంగా ఈదుతారో చూద్దాం." అని సవాలుజేశాడు. నీళ్ళను చేతులతోనూ కాళ్ళతోనూ తపతపా కొడుతూ వేగంగా నీళ్ళలో ఈదసాగాడు.

కొంతమంది బారీతసాగించారు. కొంతమంది ప్రక్కయీత సాగించారు. బక్కపల్చని పల్లెకారి జోవ్ అందరికన్నా వెనుక ప్రారంభించాడు. కాని రొమ్ముతో యీదుతూ కపలాగున దాట్లేస్తూ అందరినీ దాటిపోయాడు. రియూనికూడా దాటపోసాగాడు. ప్రేక్షకులంతా కేరింతలు కొట్టసాగారు. చప్పట్లు కొట్టారు. దాస్వే తామరవనంలోకి చూడటం తటస్థపడింది. రెండు తలలు పైకి కనిపించాయ్—మళ్ళీ వాళ్ల మేయీ నియూర్ లే! యీత పోటీని చూస్తున్నారు.

"మీరింకా పోలేదా!" అని అరచాడు. త్వరలో జపానువాళ్ళిక్కడకు వచ్చేస్తారు. ఇక్కడుండటం చాలా ప్రమాదం పోండి! వెనక్కు

తిరిగిపోండి!" అని గర్జించాడు. మేయీ నవ్వుతూ వప్పుకొంది. వాళ్ళిద్దరూ పడవను నడుపుకొంటూ పోయారు.

పొగమంచు మించిపోతూవుందని దాస్వే భావించాడు. ఈదుతున్నవాళ్ళందరినీ వెనక్కి పిలిచాడు.

మరల పడవలన్నీ రెల్లుతుప్పలవెనుక అదృశ్యమయ్యాయి. నీటిపై భాగం మరల మృదువుగా, నిశ్శబ్దంగా తయారయింది. పచ్చని తల గలిగిన రెండు బాతులు సరస్సులో మృదువుగా తేలియాడుతున్నాయి. అవి తమ మెడలను ముందుకు వంచినాయి. రెక్కలు టపటపలాడిస్తూ ఒక చుట్టుచుట్టి ముక్కులు పైకెత్తినాయి. కుచ్చులుగల వాటి తలలు సూర్య రశ్మిలో బంగారంలాగున మెరుస్తున్నాయి. దాక్కొన్న మనుష్యులను తినుతున్నాయాయన్నట్లు ధ్వనిచేస్తూ చక్రాలుకొట్టి పడమటిదిక్కుగా ఎగిరిపోయాయ్.

* * * *

కాలం గడవటం కష్టంగావుంది. ఎంతసేపుజూసినా, జపానువాళ్ళ పొగబోట్లజాడేలేదు! గాలి మారింది. ఆకాశాన్ని సగం కప్పేస్తూ, మేఘాలు ఆవరించాయి. తమ మందుగుండుసామాగ్రి తడిసిపోతుందేమోనని ప్రజాసైనికులు భయపడసాగారు. వర్షంపడితే మందుసామాగ్రి తడిసిపోతుంది.

షాట్‌గన్లను ప్రేల్చడం సాధ్యంగాదు. పొగబోట్లు యికరావేమోనని కొంతమంది అనుకున్నారు. యింటికిపోతే బాగుంటుందనుకున్నారు. కాని దాస్వే వేచియుందామని పట్టుబట్టాడు.

చిట్టచివరకు పొగబోటు యింజన్లమ్రోత వినవచ్చింది. "త్వర పడండి! సిద్ధంకండి!" అని అరచాడు దాస్వే. తనకు అయిమూలగా సూటిగావున్నవాళ్ళకు సైగచేశాడు.

షాట్‌గన్ల ఫ్యూజులను వెలిగించుటకు వుపయోగించే పుల్లలను వెలిగించ యత్నించారుగాని, గాలి జోరుగావీస్తూవుంది. పుల్లలను ఆర్పే

సింది. హడావిడిలో సైనికులంతా ఒకచోటజేరి గాలి రాకుండా అడ్డంగా నిలబడ్డారు. ఎలాగైతేనేం పుల్లలను వెలగించారు.

పొగబోట్ల ధ్వని ఎక్కువయింది. పొగబోట్లు కనిపించాయ్. క్రమ ముగా అవి ప్రజాసైనికులు దాక్కున్న ప్రదేశానికి చాలా దగ్గరగా వచ్చాయి!

గాలి జోరుగా వీస్తూవుంది! వర్షపుచినుకులు పడసాగాయి. ప్రజా సైనికులు చొక్కాలు విప్పేశారు. పుల్లలమంటపై కప్పారు! ప్యూజులను, తుపాకుల కంతలను కప్పారు! పులులులాంటి పసుపుపచ్చ పొగబోట్లు కంటికి బాగా కనిపించసాగాయ్!

తెరచాపలచాటున వర్షంనుండి తలదాచుకుంటూవున్నజపానువాళ్ళు కనబడుతున్నారు! మొదటి పొగబోటునిండా సామానులువున్న పడవ వస్తూవుంది! పొగబోటు తెరచాపతాళ్ళపై కూర్చొని టెలిస్కోపుద్వారా చూస్తూవున్న జపానువాడొకడు అగుపించాడు!

ఇప్పుడు మొదటి పొగబోటు దాస్వే అనుచరులకుసూటిగా ఎదురుగా వచ్చింది. రెండవది జోవ్ గ్రూపుకు ఎదురుగావచ్చింది. తెరచాపత్రాళ్ళపై కూర్చున్న జపానువాడు క్రిందికి ఒడ్డువైపుగా చూశాడు. దాస్వే తుపాకి ముక్కులోకి చూశాడు.

వాడికి గుండెలు జారినాయి. కర్రమీది కోతిలాగున తెరచాప తాళ్ళను కరచుకున్నాడు. అరవటానికి అవకాశంలేకుండానే వాడి గుండె ల్లోకి గురిచూసి కొట్టాడు దాస్వే. ఆ దెబ్బతో ఆ జపానువాడు తల క్రిందుగా కాళ్ళు ఆకాశంవంకజూపుతూ వెనక్కు విరుచుకుపడ్డాడు. పొగ బోటుపై భాగాన గుభీలునపడ్డాడు,

ఆ రెండు తీరాలనుండి, అ షాట్ గన్ల దళాలు రెండూ చెవులు చిల్లులుపడేటట్లు ధ్వనిచేస్తూ తుపాకులను ప్రేల్చాయి. నీళ్ళపైనావరించిన దట్టమైన ఆ పొగ మేఘాలలో ఒక్కవస్తువైనా కానరావటంలేదు. దక్షి ణపువొడ్డుకు కొట్టుకొని రెండవ పొగబోటు బ్రద్దలైన ధ్వని మాత్రం వినవచ్చింది.

దాని యింజను నిశ్శబ్దాన్ని చేపట్టింది! మొదటిబోటు యింకా పరు

గెత్తుతూవుంది: దాస్వే. అతని అనుచరులూ దాక్కొనియున్న దక్షిణ తీరానికి దగ్గరలోనున్న రెల్లుదుబ్బుల్లోనుండి తుపాకిగుళ్ళవర్షాన్ని మొదటి పొగబోటు ఎదుర్కోవాల్సివచ్చింది:

కొన్ని చిన్నపడవలకు దెబ్బలుతగిలి మునిగిపోసాగాయి. వాటిలోనున్న ప్రజాసైనికులు షాట్ గన్లను అక్కడే వదలిపేసి లోతు తక్కువ నీళ్ళలోనికి దుమికారు: తమ తలలకు పైయెత్తుగా తుపాకులను పట్టుకొని రెల్లుదుబ్బుల్లోనికి నడిచివచ్చారు. ఉత్తరతీరానికి దగ్గరలోనున్న జోప్. అతని సహచరులు దూరంగా కాలువలలోనికి తమ పడవలను పట్టించారు.

గాలి పొగ మేఘాలను ఎగురగొట్టింది. రణగొణధ్వని చేస్తూవున్న ఉరుమే మేఘాలను చెదరగొట్టింది. ఆకాశాన్ని నిర్మలంగావించింది. దాస్వే మనుష్యులు వదలిపెట్టిన పడవలపై చావగా మిగిలిన జపానువాళ్లు మెషిన్ గన్ల గుళ్ళవర్షాన్ని కురిపిస్తూ పురోగమించసాగారు: జపానువాళ్లెన్నడూ అలాంటి పొడుగాటి షాట్ గన్లను చూసి ఎరుగరు. హడావిడిగా సాగుతూ వాటిని తమ పొగబోటులోనికి జేర్చుకొన్నారు.

ఉత్తరతీరంలో తామరాకులలో దాక్కొని చూస్తూవున్న ఆ యిద్దరు యువతులు మేయీ.నియూరీలకు ఏమిజరుగుతున్నదీ కనబడటం లేదు. చాలాసేపు నిశ్శబ్దంగా వూరుకొన్నారు. నియూరికి విసుగెత్తింది.

"జపానువాళ్ళందరూ చనిపోయివుండాలి" అన్నదామె.

"బయటికిపోయి ఏమి జరుగుతూవున్నదో చూద్దాం పద!" అన్నది.

"వద్దు!" అన్నది మేయీ. "అలా చేయకుండా వుండటంమంచిది. ఎందుకంటే, అక్కడనుండి యింతకుపూర్వం మెషిన్ గన్ మోత వచ్చినది. ఏం జరిగినదో మనకు తెలియదుగా!"

"కొంచెందూరంగా వుండిచూద్దాం: కళ్ళారా చూడనిదే ఏమి జరుగుతూవున్నదో మనకి తెలియదు. శాశ్వతంగా యిక్కడ వుండిపోలేం" అన్నది నియూరి.

ఆ యువతులిద్దరూ తమ బోటును అక్కడినుండి బయటి సరస్సు

లోనికి పట్టి చారో లేదో యింతలోనే జపానువాళ్ళు పసిగట్టేశారు. తమ పొగబోటును వారిపైకి పట్టించారు.

ఆ యువతుల ముఖాలు భయంతో పాలిపోయాయి. తమ పడవను తామరాకులలోనికి పట్టించి, శాయశక్తులా రెల్లుదుబ్బుల్లోనికి నెట్టసాగారు. ఇప్పుడు పొగబోటు రమారమి ఆ యువతుల నెత్తిమీదకు వచ్చేసింది. అకస్మాత్తుగా తుపాకులు పేలినాయి. మెషిన్‌గన్ పెద్దనుండి దానిని పేల్చే జపానువాడు మంచినీళ్ళడక్కుండా చచ్చాడు. పొగబోటు మీదున్న జపానువాళ్ళందరూ తుపాకీగుళ్ళకు యెరయై చచ్చారు. గాయపడిన జపాను సైనికులిద్దరూ పిచ్చిగా కేకలేస్తూ నీళ్ళలోనికి దుమికి మునిగిపోయారు.

దక్షిణతీరంలోవున్న తమ డింగీలపై జపానువాళ్ళ పొగబోటు గుళ్ళవర్షాన్ని కురిపించేసరికి దాస్వే అతని అనుచరులూ రెల్లుదుబ్బులను వదలి తామరాకులలో ప్రవేశించారు.

తామరాకులలో పెద్ద పెద్ద ఆకులను త్రుంచి తమ తలపైకప్పుకొని తామరపువ్వులతోపాటువంగి, కొంచెందూరం నీళ్ళలో నడిచారు. ఆ యువతులిద్దరి వెంటపడుతూవచ్చిన జపానుపొగబోటు అక్కడే అయిదు గజాలదూరంలో దాక్కొనివున్న ప్రజాసైనికులకు దగ్గరగా వచ్చింది. వెంటనే ఆ గెరిల్లాలు తుపాకులు పేల్చారు! అదే సమయంలో జోవ్ మురాకూడా జపానువాళ్ళ పొగబోటు వెనుకభాగంలోని రెల్లుదుబ్బుల్లో పడవలను నడుపుకొంటూవచ్చి, తుపాకులను కాల్చారు. ఐమూలగా అడ్డదిడ్డంగా తుపాకులను కాల్చటంవలన జపానువాళ్లు ఉక్కిరిబిక్కిరయ్యారు తుపాకిగుళ్ళకి ఎరఅయ్యారు! ఒక్కడయినాగూడా మిగలకుండా అంతా చచ్చారు.

గాలి మారింది. వర్షం జోరుగా కురియసాగింది. రాళ్లపెట్టి కొడుతున్నంత జోరుగా వర్షం కురుస్తూవుంది. ఉరుములూ, మెరుపులూ. ఆ తుపానుగాలి రెల్లుపోచలను నీటిమట్టానికి వంచివేసింది. పట్టెడంత చినుకులు తామరాకులపైపడి దొర్లసాగాయి. సరస్సులో కత్తులులాంటి అలలు బయలుదేరాయి. ఆ కుంభవృష్టికి సరస్సంతా పొగమంచు సముద్రంలాగున

కనుపించసాగింది. వళ్ళంతా వర్షంతో తడిసి ముద్దయినప్పటికి ఉత్సాహవంతముగా ఆ యువతులిద్దరూ జపానువాళ్ళ పొగబోటును నాశనము చేయటంలో, యుద్ధంలో గెల్చుకున్న సామాగ్రిని ప్రోగుచేయుటలో ప్రజాసైనికులకు తోడ్పడ్డారు.

పెనుగాలి వీస్తావున్నా పెనుగులాడుతూ ప్రజాసైనికులు తమ పడవలను యింటివైపు పట్టించేశారికి, రాత్రి చాలా పొద్దుపోయింది. వారు తమ చిన్న పడవలను నడుపుకోపటమేగాక, జపానువాళ్ళ పొగబోటుల లోని రెండవదానినికూడా లాక్కెళ్ళుతున్నారు. చిమ్మచీకటి. కన్ను పొడుచుకున్నా కానరాపటంలేదు. తెడ్ల చప్పుడు సైనికులువేసే కేకలు కూడా గాలి మోతలోనూ, వర్షంమోతలోనూ మునిగిపోతున్నాయి. పెద్ద మెరుపు మెరిసింది. దగ్గరలో ఒక పిడుగుపడింది. సైనికులకు తెలియకుండానే వణుకు పుట్టుకొచ్చింది. మెరుపులు మెరిసిన వెంటనే గాఢాంధకార మావరించింది.

"దగ్గరగావుండు మేయీ!" అని అరచాడు దాస్వే. "ఒక్కమారు తప్పిపోయావా ఇంటికి చేరలేవు!"

"మేం సరిగ్గా మీ వెనకాలే వున్నాం!" అని అరచింది మేయీ. "మేము మిమ్మ వదలము!" ఆమె మాటలలో సగాన్ని గాలి మింగేసింది. మేఘాలగర్జన ఆకాశాన్ని వణికించింది.



# 6 అధ్యాయం

ఆ విధంగా తుపానుగాలిలో తిరగటంవలన మేయీకి విపరీతంగా జలుబుపట్టింది. మంచంనుండి క్రిందికి దిగటానికి వీలులేకపోయింది. ఆ మరునాటి సాయంత్రం ప్రజాసైనికులందరూ ఆమెను చూడటానికి వచ్చారు. జపానువాళ్ళ పొగడ్లోపై వారికి దొరికిన రెండుడబ్బాల వంటకాలను తీసుకొనివచ్చి ఇచ్చారు. గ్రామీణ ప్రాంతాలలో పనిచేయుటకై నియూరీ వెళ్ళిపోయింది. అందువలన మేయీ ఒక్కతే వుంది.

వేళాకోళంగా పలుకుతూ దావ్వే కులకసాగాడు. "మహిళా సంఘాధ్యక్షురాలా! కరకుకొయ్య బియ్యపురొట్టెలను తినేబాధను మీకు తప్పించుటకై మీ కీ వస్తువులను సమర్పించుకొంటున్నాం!" అన్నాడు. అని ఆ ఎర్రని డబ్బాలను ఆమె తలగడదిండుదగ్గర పెట్టాడు.

"అయ్యో! ఇవి మీరు గెల్చుకున్నవి! వీటిని నే నెలా తింటాను" అని మేయీ నవ్వింది.

"ఆఁ! అలాంటిమాట అనబోక! ఆడపిల్లలు మీరిద్దరూ మాకెంతో సాయంజేశారు. అందుకని మీరిద్దరూ తినాలని మేమనుకున్నాం" అని కోప్పడ్డాడు పల్లెకారియైన జోప్.

"మీరు మివెంట శత్రువులను లాక్కొనిపోకపోయినట్లయితే మేం గెలిచేవాళ్ళమేగాదు. అంతేగాక షాట్ గన్నులనుకూడా పోగొట్టుకోవాల్సి వచ్చేది" అని స్వరం కలిపాడు బెదురుగొడ్డు మా.

మేయీ ఆ డబ్బాలలో నొకదానిని నియూరీకొరకు వేరుగా

పెట్టింది. రెండవదానిమూత తీసింది. తలాకాస్త పుచ్చుకోవలసిందిగా ప్రజాసైనికులను కోరింది. తలాకాస్త పంచిపెట్టింది.

రియూ తన పెదిమలను నాలుకతో నాకినాడు. ఉత్ప్రేక్షితోల్లాసంతో ముఖాన్ని కుంచించాడు.

"ఆహా! బాగుంది! చాలా బాగుంది! చాలా తియ్యగావుంది. నా తల తిరుగుతున్నదంటే నమ్మండి!" అన్నాడు.

అందరూ నవ్వారు. తమ తమ క్వార్టర్సుకు పోయేసమయం వరకూ అక్కడే కూర్చొని, ప్రజాసైనికులు ఆప్యాయంగా మాట్లాడుకోసాగారు.

"మీరింక వెళ్ళండి! నేను. మేయీకి కషాయంకాచి ఇచ్చివస్తాను" అన్నాడు దాస్వే.

ప్రజాసైనికులందరూ వెళ్ళిపోయిన తర్వాత, ఒక ముంతకు సరిపోయేటంత కషాయాన్ని కాచాడు. "వేడిగా వుండగానే తాగెయ్యి. నీ జలుబంతా వదలిపోతుంది" అని మేయీకి మందు అందిస్తూ అన్నాడు.

ఆ సమయంలోనే తలుపును తటాలున లోనికి త్రోసుకొంటూ, జిన్లంగ్ ప్రవేశించాడు. దాస్వే ఖంగారులోపడ్డాడు. గాబరాగా మందు ముంతను కాంగ్‌చివర వుంచి, అపూర్ణ హృదయంతో జిన్లంగ్‌ను కుశల ప్రశ్నలు వేశాడు. జిన్లంగ్‌నుండి అమిత శీతల ఉపేక్షాప్రపూరిత ప్రత్యుత్తరం వచ్చింది.

కందళిహృదయంతో దాస్వే "బాగా అలసిపోయివుంటావ్. నేను వెళ్ళాలి" అన్నాడు.

"మందు తయారుజేసి యిచ్చినందుకు ధన్యవాదాలు. కష్టపెట్టినందుకు క్షమించాలి" అని జవాబుచెప్పింది మేయీ.

"మనమంతా కామ్రేడ్స్‌ము. యిందులో కష్టమేముంది" అని జవాబుచెప్పి దాస్వే అక్కడనుండి సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

జిన్లంగ్, కాంగ్‌నకు మరియొక చివరగా పడుకొన్నాడు. దుప్పటి కప్పుకొన్నాడు. తాను యింటినుంచి తెచ్చుకొన్న పక్కచుట్టను తన తల

క్రింద దిండుగా వుంచుకున్నాడు. అతడు సిగరెట్ ముట్టిస్తూవుంటే మందు త్రాగుటకై మేయీ లేచికూర్చుంది.

"మళ్ళీ పరుపు తెచ్చేసుకున్నావేం ?" అని మేయీ ప్రశ్నించింది.

"ఎందుకు కూడదు? నాకు జబ్బుగావుంది" అని జవాబు చెప్పాడు జిన్లంగ్.

అతడు ఎవ్వంతయినా జబ్బుగావున్నట్లు మేయీ కంటికి అనిపించలేదు. కాని మేయీ మామూలుగా "అనుమతి పొందావా ?" అన్నది....

జిన్లంగ్ సిగరెట్ దమ్మును బాగా పీకాడు. "వాళ్ళతో చెప్పాను" అన్నాడు స్పష్టంగా.

"ఎన్నిరోజులని?" ప్రశ్నించింది మేయీ.

"చెప్పటం కష్టం. నయమైన తర్వాత ఎలాగుంటుందో చూద్దాం. దుమికిన తర్వాత ప్రతిసారి కప్ప కొంత విశ్రాంతి తీసుకుంటుంది. కనీసము రెండురోజులన్నా నేను విశ్రాంతి తీసుకోవాలి" అని అలక్ష్యంగా జవాబు చెప్పాడు జిన్లంగ్.

"పనికిమాలిన మంగలి మళ్ళీ పిల్లి తలగొరుగుతున్నాడన్నమాట"

"అందరి తలలపనీ పట్టిస్తున్నాడన్నమాట!" అనుకొంది మేయీ. ఆమె కోపంగా మందుముంతను కిటికీ అంచుపై వుంచినది. దుప్పటితో తలను కప్పుకొంది. నిద్రపోయింది.

ఆ మరునాడు కౌంటీ ప్రభుత్వం ఆఫీసునుండి ష్వాంగ్ వచ్చాడు. ప్రజాసైన్యంలో జిన్లంగ్ చాలా అసహ్యంగా ప్రవర్తించాడని మేయీతో రహస్యంగా చెప్పాడు. తనకు ఇష్టమొచ్చినప్పుడే పనిజేస్తూవుండేవాడట. అతనికి ఏ విషయమైనా సరిపడకపోతే చాడీలు చెప్పేవాడట. గొణిగేవాడట. ప్రపంచమంతా తనచుట్టూనే తిరుగుతోందని జిన్లంగ్ యొక్క నమ్మకం. అందువలన ఆ అల్ప అసౌఖ్యజీవితానికి జిన్లంగ్ అలవాటు పడలేకపోయాడు. అసౌకర్యాలను స్వీకరించలేకపోయాడు; ఆ గతరాత్రి తమకు యిచ్చిన భోజనాన్నిజూచి జిన్లంగు ఏవగించుకొన్నాడు. అది అసహ్యంగా వుందట. అందరిఎదుటా, వంటవాణ్ని తిట్టిపోశాడు, దుమ్మెత్తి

పోశాడు. ఉగ్రనరసింహుడయ్యాడు. తాను యింటికి పోతున్నానని ల్లాక్‌కి చెప్పి జిన్లంగ్ పక్కచుట్టచుట్టాడు. సైన్యాన్నివదలి యింటికి వచ్చేశాడు. ఇదే జిన్లంగ్ అక్కడ జరిపిన తంతు.

"సంఘంలో వుండవలసిందిగా మరల ప్రోత్సహించవలసిందిగా ల్లాక్ చెప్పాడు" అని మేయీకి చెప్పాడు ష్వాంగ్.

"మళ్ళీ అతన్ని దారిలోకి తెచ్చావంటే చాలా బాగుంటుంది. జిన్లంగ్ మంచి దిట్టమైన సైనికుడు. కొంటిప్రభుత్వ సైన్యంలో మరల చేరటానికి అతను నిరాకరిస్తే కొంతకాలంపాటు అతడ్ని నీ దగ్గరే వుంచుకో! జిల్లాప్రజాసైన్యంలో ఏదయినా ఉద్యోగం యిప్పించు" అని చెప్పాడు ష్వాంగ్.

మేయీ దీర్ఘంగా ఆలోచించింది. కోపంతో ఆమె కనుబొమలు ముడిపడ్డాయ్. "అయ్యో! వాడా!" అని నిట్టూర్చింది. "వాడితో యెలా వేగాలో నాకర్థంగాకుండా వుంది!"

ఆమెను ఉత్సాహపరుస్తూ ఒక్క చిరునవ్వు నవ్వి ష్వాంగు ఆమె భుజాలు తట్టాడు. "చక్కని పిండిని వుపయోగిస్తే చీము దానంతటదే బయటపడుతుంది" అన్నాడు.

మేయీ తల అడ్డంగా వూపింది. "కుక్కపుండుమీద పిండి అతుక్కుంటుందా! సరే! ఏమైనాగానీ యత్నించిచూస్తాను. వాడితో మాటాడుతాలే!" అని జవాబు చెప్పింది.

అనేకరోజులపాటు ఆమె జిన్లంగుతో వాదించింది. మృదువుగా మాటాడింది. కఠినంగా మాటాడింది. బెదరించింది. బుజ్జగించింది. చిట్టచివరకు ఎలాగయితేనేం యిచ్చారహిత హృదయంతోనే జిన్లంగు లొంగాడు.

"సరేలే! నేనిక్కడే జిల్లా సైన్యంలో పనిజేస్తా....కాని, ఇదంతా నీకోసమే సుమా!" అన్నాడు జిన్లంగ్.

జిల్లా సైన్యంలో అతడ్ని లెఫ్టినెంట్‌గా నియోగించారు.

తనకన్న పై అధికారిగావున్న దాస్వేనిజూస్తే జిన్లంగునకు అమిత

కడుపుమంట. దాస్వేనుండి సూగనలు తీసుకొని పని చేయటమంటే జిన్లంగుకు అమితఅసహ్యం.

అందుకని జిన్లంగు ఎల్లప్పుడూ అంతా తానే ఆడటానికి ప్రయత్నించేవాడు. హిస్యేలియా గ్రామంలోవున్న కోటను ముట్టడించి, నాశనం చెయ్యవలసినదిగా పైఅధికారులు జిల్లా సైన్యానికి ఆజ్ఞలు జారీచేశారనీ, అందువలన యీ విషయాన్ని చర్చించుటకై ఒక సమావేశాన్ని జరుప నున్నాననీ దాస్వే ఒకరోజున జిన్లంగుతో చెప్పాడు.

"చర్చించటానికి యిందులో ఏముంది? నన్నూ, నా దళాన్ని యీ పని చెయ్యనియ్యి! మేం పూర్తిజేసివస్తాం" అన్నాడు జిన్లంగు.

దాస్వే హృదయంలో సందేహం తొణికిసలాడింది. కాని, నమ్రతగా "మనమంతా కలిసిచేస్తే బలం అధికంగా ఉంటుందిగదా !" అన్నాడు.

"అయితే నేను లేకుండానే మీరు చేసుకోండి. మీ భావన అదన్నమాట! ఒక్కమనిషి తక్కువైనంతమాత్రాన మీకేం పరవాలేదు. నే నేం లేకపోతేమాత్రమేం!" కోపంగా మొరిగాడు జిన్లంగు.

జిన్లంగు తమతో సహకరించ నిరాకరించినందుకుగాను అతని మొండితనానికి దాస్వే హృదయంలో అమితంగా కోపం రేకెత్తింది. కాని పొంగిపొంగి వస్తూవున్న కోపాన్ని వెనక్కు లాగిపట్టాడు. గొణుక్కుంటూ, యితర కార్యకర్తలను సమావేశానికి పిలుచుటకై దాస్వే వెళ్ళిపోయాడు.

జిన్లంగు కాంగ్‌మీద పడుకొన్నాడు. చురుకైన అతని బుర్ర చురుకుగా పనిచేయసాగింది. సంధ్యాసమయంలో కాంగ్‌మీదనుండి లేచాడు. చక్కని దుస్తులు వేసుకొన్నాడు. ఒక కంటిమీదికి వొరిగేటట్లుగా ఒకదొర టోపీ పెట్టుకున్నాడు. నడుము పటకాలో పిస్తోలు పెట్టుకున్నాడు. రమారమి తన దళంలోని పదిమంది సైనికులను పిలిచాడు.

వాళ్ళను వెంటబెట్టుకొని, సరస్సువైపుకి పోయాడు. ఒక పడవలో ఎక్కాడు. హిస్సేలియా గ్రామానికి దగ్గరలోనున్న ఒడ్డువెంటనున్న రెల్లు

దుబ్బులోకి దొంగతనంగా డింగీని నడిపించాడు. ఆ రెల్లుదుబ్బులలోనే డింగీనికట్టేసి క్రిందకుదిగాడు.

తనతోవచ్చినవాళ్ళను అక్కడే దాక్కోవలసిందిగా ఆజ్ఞాంచాడు. ఆ పట్నంలోవున్న మంచి హోటలుకి ధైర్యంగా నడిచివెళ్ళాడు.అక్కడ తన కో గదిని ప్రత్యేకంగా మాటాడుకున్నాడు. చక్కని భోజనానికి ఆర్డర్ యిచ్చాడు.

జిన్లంగు ఒక పెద్దదొరలాగున వెయిటర్ను యీ విధంగా ఆజ్ఞాపించాడు. "ముందు భోజనం బాగా తయారుచెయ్! వడ్డించేముందు కోటకు పోయి నా స్నేహితుడు లైవేని ఆహ్వానించి తీసుకురా! నీకోసం ఒక పెద్దమనిషి ఎదురుచూస్తున్నాడని చెప్పు! వాడిక్కడకు వచ్చేటట్లు చూడు. బాగా ముట్టచెపుతా" అన్నాడు.

వెయిటర్ యిచ్చకాలమారితనంగా ఆ 'పెద్దమనిషి'తో ముచ్చటించాడు. మీరు కోరినట్లే చేస్తానన్నాడు. వంగి సలాంచేసిపోయాడు.

చిటికెలో లైవేని వెంటబెట్టకొని వచ్చాడు వెయిటర్. జిన్లంగును చూడగానే లైవే ఆశ్చర్యపోయాడు.

ఆప్యాయంగా జిన్లంగు "మనమిద్దరం కలిసి రెండు దోసు లేసుకొంటే బాగుంటుందని భావించా. పాతస్నేహితులం! ఇంతకాలం ఒకళ్ళనొకళ్ళు చూసుకోకుండావుండటం బాగాలేదు...." అన్నాడు.

వెయిటర్ వాళ్ళకు భోజనాన్ని ద్రాక్షసారాయిన్ని వడ్డించాడు. వాడు వెళ్ళిపోగానే లైవే జిన్లంగువైపుకు వంగి రహస్యంగా "నేను విన్నది నిజమేనా?- వాళ్ళలో చేరిపోయ్యావటగా?" అన్నాడు. రెండు వ్రేళ్ళను పైకెత్తి "ఎనిమిది" సంఖ్యను సూచించాడు. అంటే "అష్టమ సైన్యం" లేక "బాలూసైన్యం" అని అర్థం దానికి.

"ఛీ!" అని నవ్వాడు జిన్లంగు. "నే నొక చిన్నవ్యాపారము చేసుకొంటున్నా! ఇక్కడ నీ పరిస్థితులెలాగున్నాయ్?" అని ప్రశ్నించాడు అతను.

"అయ్యో! అడగబోకోయి!" అని నిట్టూర్చాడు లైవే. "జీవో ఎలాంటి మనిషో నీకు తెల్సు! బాగా కరకుచేతులూ, రాక్షసహృదయం

వాడిది. మేమేదన్నా దోచుకొస్తే, పరుపుక్రింద అపానవాయులాగున హరించిపోతుంది. దిగమ్రింగుతుగాడు! వీడెమ్మ....! ఒక్కపిసరంతయినా కనపడనీయడుగదా! అంతా తానే మింగేస్తాడు! మొన్న ఒకనాడు, వాడు కొంతగుంజాడు. బాలూసైన్యంతో వ్యాపారం జేస్తున్నావని ఒక వ్యాపార స్థుడ్ని దబాయించాడు. వాడిదగ్గరనుండి రెండు తాన్లగుడ్డ కాజేశాడు. ఏదీ! యిస్తే చూద్దుముగదా, మాయమయింది. వెధవ! వాడి తంత్రాలు మాకు తెలియవనుకొంటాడు" అని లైవే తన సొద వెళ్ళబోసుకున్నాడు.

"ఆ వెధవ గాడిద కొడు కెవ్వరికీ చేరడు. అంతా తానే మ్రింగుతాడు" అన్నాడు జిస్లంగు తన మాత్సర్యాన్ని వెళ్ళబోస్తూ.

"ఒకసారి నేను లైసెన్సులేకుండా సైకిలుత్రొక్కుతున్నమనిషిని పట్టుకున్నా.... జీవో అది చూశాడు. ఒక్కసారి త్రొక్కిచూస్తానని తీసుకొన్నాడు. వాడెమ్మ—సైకిలుమీద అదేపోతపోయాడు. వొట్టి చేతులు దులుపుకొంటూ వచ్చాడు. అది భలే సైకిలుసుమా.... చక్కనిదంటేనమ్మ! సరిక్రొత్తది" అని విచారాన్ని వెళ్ళబోసుకొన్నాడు లైవే. అతడు మాటాడినకొలదీ అతనికి కోపం మితిమీరిపోసాగింది. త్రాగుడుమత్తు తలకెక్కింది. ద్రాక్షసారాయపు గ్లాసును తన్నాడు.

జిస్లంగు ముఖవర్చస్సు మారింది. విషంగా ఒక కనుబొమను పైకెత్తాడు.

"ఆ కుక్కలకొడుకు నువ్వు చెప్పినట్లు వినేటట్టు చేయగలను—వాడు మ్రింగినదాన్నంతనూ కక్కించగలను" అని బుసకొట్టాడు జిస్లంగు. "నీ సైకిలు నీ కొచ్చేటట్టు చేస్తా.... ఏమంటావ్?" అన్నాడు.

"మంచి అభిమానమే;" లైవే ముఖం వికసించింది. "అయితే నీ ప్లానేమిటి?" అన్నాడు.

"యథార్థానికి నీతో నిజం చెపుతున్నా! నేనక్కడ కెప్టెన్ హోదాలో వున్నా మనం జోవోగాడి పనిపట్టిస్తే మన యిష్టమొచ్చినట్లు మెలగటానికి వీలవుతుంది. మనిద్దరం, సోదరుల్లాగున మెలిగాం.... సోదరుల్లాగనే పంచుకొందాం. నిన్ను బాగా చూశానన్న విషయం నీకు బానా తెల్సుగదా!" అని మెల్లగా వూదాడు జిస్లంగు.

జిన్లంగ్ మాట్లాడుతూవుంటే లైవేయొక్క పేరాశ కళ్ళు పెద్దవి కాసాగాయి. ఉత్సాహంతో పొంగిపోయి అరచాడు లైవే "వాడవ్వా!—ఓ! భలే! బాగుంది. కొద్దిగా "కమ్యూనైజు" చేయటం నాకూ ఇష్టమే! ఎలా ప్రారంభిద్దాము?"

ఇంతలోనే వెయిటర్ యేవో కూరలను తీసుకొనిరావటాన్ని జూచి జిన్లంగ్ వూరుకోవలసినదిగా లైవేకి సైగజేశాడు. వెయిటర్ వెళ్ళిపోగానే వాళ్ళు మరల తమ సంభాషణను సాగించారు. ప్లాను వివరాలు చర్చించి ఒక నిర్ణయానికివచ్చారు! వాళ్ళిద్దరూ ఒకేరకపు మనుషులు. సమానాంతర రేఖలలో ఒకేవెక్కుగా దొర్లిపోతూవున్న చక్రాలు. వారిద్దరూ ప్రతి విషయాన్నీ చర్చించి ఒక నిర్ణయానికిరాగానే వారిద్దరూ హోటలును విడిచి వేర్వేరేగా వెళ్ళిపోయారు.

లైవే నాలుగు అంతస్థులకోటకు వెళ్ళిపోయాడు. అర్ధరాత్రివేళ ఇంటి పైకప్పుమీద సెంట్రీగా లైవే తన డ్యూటీలో ప్రవేశించాడు. ప్రతి వంతులోనూ యిద్దరేసి చొప్పున కాపలాకాస్తు వుంటారు. లైవేకి తోడుగా సివౌ కాపలాకాస్తున్నాడు. సివౌనుకూడా పంపించాడు లైవే! తమ పన్నాగములో సహాయకుడుగా సివౌనుకూడా కలుపుకొన్నాడు. చంద్రుడు అస్తమిస్తూవున్న సమయములో లైవే ఒకదానివెంట మరియొకటిగా మూడు అగ్గిపుల్లలు వెలిగించాడు. ఆ సైగకు జవాబుగా మూడు చిరుమంటలు కందకానికి ఆవలివొడ్డునుండి అగుపించాయి. ఆ కీలుబొమ్మ సైనికులిద్దరూ కందకం బ్రిడ్జిని వ్రాల్చారు. జిన్లంగూ అతని అనుచరులూ ముందుకు సాగారు. కీలుబొమ్మ సైనికులు సుఖముగా నిద్రపోతూవున్న రెండవ అంతస్థుకు జేరుకున్నారు. ఆ సైనికులు దీపాలను ఆర్పకుండానే అలాగే వుంచుకొని నిద్రపోతున్నారు. నిశ్శబ్దంగా జినంగూ, అతని అనుచరులూ తుపాకులన్నింటినీ ప్రోగుజేశారు. లైవేను వెంటబెట్టుకొని జిన్లంగు మూడవ అంతస్థులోవున్న జీవో గదికి పోయాడు.

అస్తమయచంద్రుని కిరణాలు ఏటవాలుగా కిటికీగుండా గదిలో

పడుతున్నాయి. పరుపుమీద దుప్పట్లు కప్పుకొని ఏదో ఆకారంవుంది. ద్వేషంతో పళ్ళునూరుతూ జిన్లంగు దాని తలవైపు గురిచూచాడు. మూడు మాట్లు కాల్చాడు. దుప్పట్లను తొలగించిచూశాడు. జీవో అక్కడలేడు ; రెండుబోల్డుల గుడ్డ చుట్టలున్నాయి; జిన్లంగుకు పళ్లు మండిపోయింది. అయితేనేం మహాచక్కని గుడతానవి. అవకాశాన్ని జారవిడవటం ఇష్టం లేకపోయింది. వారిద్దరూ చెరియొక తానుగుడ్డనూ నడుములకు చుట్టు కున్నాడు. వెంటనే దళంలోని మిగతావారు అక్కడికి వచ్చిపడ్డారు.

"వాడెమ్మ!— తేలిగ్గా బయటపడ్డాడు." అని జిన్లంగు తిట్లు కుమ్మ రించసాగాడు,

ఖైదీలను కాపలాకాయవలసిందిగా తన అనుచరులను పంపాడు జిన్లంగు. తిరుగు ప్రయాణానికి పడవలను ఏర్పాటు చేయవలసిందిగా సిహొను పంపాడు. ఈలోపల అతడు, లైవే యిద్దరూకలిసి జీవోగదిని గాలించారు. విలువగల ప్రతివస్తువునూ దాచుకోటానికి వీలున్నంత వరకూ తమతమ దుస్తులలో దాచుకున్నారు.

జీవో అదృష్టవంతుడనే చెప్పాలి. ఎందుకంటే వాడా రాత్రి నల్లమందు దమ్ముకొట్టటానికని గ్రామంలోని ఒక ధనిక భూస్వామి ఇంటికిపోయాడు. వాడికి కోటలో తుపాకులు పేలినధ్వని వినిపించినది. ఆ ధ్వని వినగానే వాడికి గుండెలు దడదడ కొట్టుకున్నాయి. శరీరము విపరీతముగా ముడతలుపడింది. ఏమి జరుగుతోందో కనుక్కురమ్మని ఒక మనిషిని పంపాడు. వాడు తిరిగొచ్చి కోటను బాలూసైన్యము ఆక్ర మించుకొన్నదని చెప్పాడు. ఆ మాట వినగానే జీవో కాలికి బుద్ధిచెప్పాడు. జపానువాళ్ళ స్వాధీనములోవున్న పట్నానికి పారిపోయాడు.

మరునాటి ఉదయం పెందలకడనే జిల్లాప్రభుత్వమున్న పట్నాన్ని రెండుబోట్లు సమీపించాయి. ఒకదానినిండా ఖైదీలు, ఒక సైకిలు, తదితర వస్తువులు వున్నాయ్. రెండవ బోటులో లైవే, సిహొ. దళసభ్యులు, తుపాకులూ వున్నాయ్. జిన్లంగు సగర్వముగా పడవ తోకలో కూర్చు న్నాడు. వారు గమ్యస్థానాన్ని సమీపిస్తున్న సమయంలో వారికి చేపలుపట్టే

దోనెలో పట్టేదోనెలు మూడు ఎదురయ్యాయి. ఒకదానిమీద దాస్వే నిల బడివున్నాడు.

"ఓయి భాయీ. జిన్లంగు! ఎక్కడికిపోయావ్? మేము నీకోసం తెగవెతుకుతున్నాము!" అని పలుకరించాడు దాస్వే.

"నే నిక్కడే కోటను పట్టుకున్నా"అని నీటుగా అరచాడు జినంగ్. రెండవ పడవవంక చూశాడు. "దానినిండా ఖయిదీలున్నారు. 'ఏంజేస్తు న్నారోయ్? చేపలు పడుతున్నారా? ఎహ్హా' అని వెక్కిరింతగా నవ్వాడు.

ఆ బోట్లు ప్రక్కగావచ్చిజేరాయి! జిన్లంగును కలుసుకోటానికని, బోటులోనికి దూకాడు దాస్వే. అతి ఆప్యాయంగా జిన్లంగుకు అభివంద నాలు పలికాడు. "ఈరాత్రి కోటను ముట్టడించాలని ప్లాను వేస్తున్నాము. దారివెతుక్కుంటూ బయలుదేరాము. కాని మమ్మల్ని కొట్టేశావోయ్! నీవు దిట్టమైన వాడివి జిన్లంగు! ఎలా చేశావోయ్?" అని దాస్వే ప్రశ్నిం చాడు.

జిన్లంగు సగర్వముగా తన కథనంతా చెప్పసాగాడు. అటు తర్వాత లైవే, సివౌలవంకజూపుతూ "వాళ్ళిద్దరూ బాగా సాయపడ్డారు" అని చెప్పాడు.

వారిద్దరూ ఖయిదీలు కారన్న సమాచారము దాస్వేకి అప్పుడే జారవిడువబడినది. అయితే దాస్వే వెంటనే వారివంకజూచి చిరునవ్వును చిలకరించి సగౌరవముగా తన పెపును, పొగాకు సంచిని అందిచ్చి "బాగుంది — మాతో ంలసి పనిచేయటము యింకా గౌరవప్రదం...." అని అన్నాడు.

లైవే తన సిగరెట్లను అందరికీ అందించాడు. సివౌ వినయంగా "ఇప్పుడు మనమంతా ఒకటే!" అన్నాడు.

"కోటును ధ్వంసం జేశావా?" అని దాస్వే జిన్లంగును అడి గాడు.

"మనమెందుకు తగలబెట్టాలి? దానిలో వున్నవాళ్ళనందరినీ పట్టు పట్టుకొచ్చాము. దాన్ని తగలబెట్టినా లేకపోయినా ఒకటే" అని జవాబు చెప్పాడు జిన్లంగు.

"దాన్ని తగలబెడితేనే మంచిదనుకుంటాను. శత్రువులు మళ్ళా వస్తే దాన్ని వుపయోగించుకోగలరు. పాపం! మీరు రాత్రల్లా కష్ట పడ్డారు. యింటికిపోయి విశ్రాంతి తీసుకోండి. దానిసంగతి మేము చూస్తా ములే" అన్నాడు దాస్వే.

దాస్వే మరల చేపలుపట్టు దోనెలోనికి వెళ్ళిపోయాడు. అతను, అతని అనుచరులూ హిస్యేలియూ గ్రామముపైపుగా దోనెను నడుపు కొంటూ పోయారు. జిన్లంగు, అతని అనుచరులూ జిల్లాప్రభుత్వగ్రామం పైపుగా వెళ్ళారు.

"దాస్వే హోదా యేమిటి?" అని రహస్యముగా అడిగాడు లైవే. జిన్లంగు తిరస్కారముగా చీదరించుకున్నాడు. "అతణ్ని కెప్టెన్ అని పిలుస్తారు. అయితే వాడు మనమీద పెత్తనము చలాయించలేడులే!" అన్నాడు.

కోటను నేలమట్టం చేసిన తర్వాత స్థానిక ప్రజా ప్రభుత్వపాలనను పునరుద్ధరిసూ ఒక సైనికసంఘాన్ని స్థాపిస్తూ దాస్వే తదితర ప్రజాసైని కులూ హిస్యేలియూ గ్రామంలోనే అనేకరోజులపాటు వుండిపోయారు. ఈ లోపల జిన్లంగు తన హృదయంలో తన్నుగురించి అమిత ప్రతిష్టను పెంచుకొన్నాడు. తనకు సాటియైనవారెవ్వరూ లేరనేభావం అతని హృద యంలో దట్టముగా పెనవేసుకొనిపోయి పెరిగిపోయింది. హిస్యేలియూ గ్రామమునుండి దాస్వే. తదితర ప్రజాసైనికులు తిరిగి రాగానే, వారె క్కడ తన స్వాతంత్ర్యాన్ని నలిపి నుసిజేస్తారోయని జిన్లంగు భయ పడ్డాడు. గెరిల్లా దండయాత్ర సాగిస్తానన్న సాకుతో తన దళంలో కొంతభాగాన్ని హిస్యేలియూ గ్రామానికి తరలించుకొనిపోయాడు. రమా రమి తనసైకానికిజెందినవారినే జాగర్తగా ఎన్నుకొన్నాడు. వారిలో ఒక్క డైనా పార్టీసభ్యుడులేడు.

విషయా లీ విధంగా జరగటం దాస్వేకి యిష్టంలేదు. ఈ విష యాన్ని అనేకసార్లు ష్వాంగుతో చర్చించి, జిన్లంగు వర్గైరాలను వెనక్కు రావలసిందిగా అనేకసార్లు కబురుచేశాడు. మొదటి కొన్ని కబు ర్లకు జవాబేలేదు. కాని చిట్టచివరకు జిన్లంగు గ్రామపరిసరాలలో శత్రు

వులు కదులుతూవున్నట్లు అనుమానంగావుందనీ, అందువలన తా మా గ్రామం విడిచి రాలేమనీ ఒక తప్పుడు రిపోర్టును పంపాడు, అతడ్ని తీసుకురావటానికి తానే స్వయంగా పోవుటకు దాస్వేనిశ్చయించుకున్నాడు.

సంధ్యాసమయానికి దాస్వే ఆ గ్రామాన్ని చేరుకొన్నాడు. విషయాలను సేకరించాడు. దళం నివసిస్తున్న కొంపకుపోయాడు. నిద్రపోవుటకు వుపయోగించే గదిని చేరుకొన్నాడు. పక్కచుట్టలన్నీ చిందరవందరగా పడేసివున్నాయి। గోడమీద రుపాకులు వ్రేలాడుతూవున్నై. గదితలుపులు మాత్రం బాహాటంగా తెరచివున్నాయి. దాని కెదురుగానున్న గదిలోనికి పోయాడు. అదీ గందరగోళంగా వుంది. దానిలోకూడా ఎవరూ లేరు. ఒక్క గూలూమాత్రం వున్నాడు.

"భూమి, స్వర్గం, పులితల రావాలి....మూడు కోతులొద్దూ....ఏయ్ నాకు కొన్నియ్——ఈసారి తప్పకుండా గెలుస్తా।" జూదపుబుద్ర గూలూ నిద్రలో కలవరిస్తున్నాడు।

"లే। లే।" అని దాస్వే అతడ్ని అదిరేటట్లు వూపాడు.

గూలూ మరియొకరకపు కలవరింతలోకి దొర్లాడు. "ఏయ్। నన్ను వురితీయకండి. బాగా అలసిపోయానోయ్।" అని కలవరించసాగాడు అతను.

దాస్వే కేకలు, పెడబొబ్బలూ అతడ్ని మేల్కొల్పలేకపోయాయి దాస్వేకి అమితంగా కోపమొచ్చింది ఈ కొంప యజమాని యెవ్వరు? అని అడగసాగాడు. ఈ దళ మెక్కడికి పోయిందని ఆ కొంప యజమానురాలిని అడిగాడు।

ఆమె అతడ్ని జాగ్రతగా క్రిందనుం పైదాకా చూచింది. "వాన్ గారి యింట్లో వుంటారు" అని జవాబుచెప్పింది.

"ఎవరతను? ఎక్కడుంటాడు?"

"వాన్ అంటేకూడా తెలియదా? వాడిలాంటివాళ్లు ఎక్కడచూచినా కనబడతారు. ద్వారం దాటగానే తూర్పుకు తిరుగు. ఉత్తంపైపువున్న మొదటి సందులోపడిపో। ఆ వీధిచివరకల్లా వెళ్ళు. ఒక చిన్న తలుపు

వుంటుంది. అదే వాడి కొంప. నీ వేం జేసుకొన్నా సరే! అయితే నేను చెప్పాననిమాత్రం ఎవరితోను చెప్పబోకు" అన్నదామె.

దళం నివసిస్తున్న గదులపై ఒక కన్నేసివుంచవలసిందిగా ఆమెతో చెప్పి, అతడు వాన్ యింటిని వెతుకుతూపోయాడు. ఆవరణలో ప్రవేశించగానే, అతనికి యింటిలోనుండి నవ్వుల ధ్వని వినవచ్చింది. అల్లిక తెరలతో ఆ యింటి కిటికీలన్నీ కప్పివున్నాయి.

ఒక తెరలోని కంతద్వారా లోనికి చూశాడు. మిణుకుమిణుకు మంటూవున్న ఆయిల్‌లాంపు వెలుగులో అతనికి యిద్దరు యువతులు, అనేకమంది పురుషులూ కనిపించారు! వాళ్ళు కాంగ్‌మీద కూర్చొని దిలాసాగా ఆ యిద్దరు యువతులను తమవైపుకు గుంజుకొంటున్నారు.

ఆ యువతులలో ఒకతెను తనవైపుకులాగుతూ, ఒక చేతిని ఆమె మెడ వెనుకకు పోనిచ్చి, లైవే "నా నోటిమీద ముద్దుపెట్టవే పిల్లా !" అంటున్నాడు.

ఆమె నవ్వుతూ, పెనుగులాడుతూవుంది. మొరటుగా ప్రవర్తించబోకు అంటూవుంది.

లైవే తన చేతులతో ఆమెనుచుట్టేసి, కాంగుమీదకులాక్కున్నాడు. ఆమె పెదవులను గట్టిగా చుంబించాడు.

దాస్వేకి సిగ్గుతో మొఖం ఎర్రబడింది. కిటికీదగ్గరనుండియీవలకి వచ్చేశాడు. ఈ ప్రదర్శనాన్ని తమ ప్రహరీగోడల సమీపంలోనుంచుని తొంగిచూస్తూవున్న యిరుగుపొరుగు వాళ్ళనేకమంది అతనికి కనపడ్డారు. దాస్వేకి అసహ్యమనిపించింది. ఇంటిలో ప్రవేశించాడు. తమ నాయకుడ్ని చూడగానే, సైనికులను నిశ్శబ్దమావరించింది.

"జిన్లంగు ఏడీ?" అని వాళ్ళను అడిగాడు.

"ఓ! ఆయనా! ఎక్కడికో పనిమీదపోయాడు. ఎక్కడున్నాడో మాకు తెలియదు" అని యాదాలాపంగా జవాబు చెప్పాడు లైవే.

జిన్లంగు ఎక్కడున్నదీ తమకు తెలియదని, మిగతా సైనికులు కూడా చెప్పారు. వాళ్ళనుండి ఏ విధమైన సమాచారమూ లభ్యంగాదని

దాస్వే గ్రహించాడు. అతడా యింటిని విడిచి వెళ్లుతూవుంటే, ఆ యింటి నుండి నవ్వులసవ్వడి వినవచ్చింది.

కోపం, అసహ్యం ముప్పిరగొనగా దాస్వే ఆ గ్రామంయొక్క మేయరు యింటిని వెతుక్కొంటూపోయాడు. ఆ యింటిని చేరగానే మేయరు అతి ప్యాయంగా దాస్వేని పలుకరించాడు. దాస్వేని మేయరు బాగా ఎరుగును. జిన్లంగు ఎక్కడున్నాడని, మేయరును దాస్వే ప్రశ్నించగానే మేయరు తన షర్టు విప్పాడు. అతని రొమ్ముమీద యెర్రనిగాయాలు రెండు కనపడ్డాయి.

"చూడండి! అతడు ముప్పైకాటీల జొన్నల రేషను టిక్కెట్లు యిచ్చి అరవై కాటీల గోధుమలు తీసుకోవాలనిజూశాడు. అలాకూడదని చెప్పేలోపలే తుపాకీమడమతో నన్ను చావమోదాడు! యిలాంటి బాలూని యింతకుపూర్వ మెప్పుడూ నేను చూడలేదు, మన విధానాన్ని చెత్తకింద మార్చేశాడు!"

మేయరు తండ్రి వృద్ధుడు. తన కొడుకువంక హెచ్చరికగా రెప్పార్చకుండా జూశాడు. "నీవు అతిగా మాట్లాడుతున్నావ్!" ఆ వృద్ధుడు దాస్వేవైపు తిరిగి సగౌరవంగా "కెప్టెన్! మీరు మాతోభోజనం చేయాలి" అన్నాడు.

లోపల కోపం కళపెళ్లాడుతూవున్నా మేయరు ప్రశాంతంగా వూరుకున్నాడు.

దాస్వేకి భోజనం విషయమేమి పట్టలేదు. సాధారణంగా జిన్లంగు తనకాలాన్ని ఎక్కడ గడుపుతూవుంటాడని దాస్వే మేయరునుఅడిగాడు. మరల ఆ వృద్ధుడు జోక్యం కలుగజేసుకొన్నాడు.

"ఆయనకు ఒకచోటంటూలేదు. మావాడి కా విషయం తెలియదు" అని జవాబుచెప్పా డా వృద్ధుడు.

కాని దాస్వే ఆ ప్రదేశాన్ని విడిచివెళ్లతూవుంటే మేయరుఅతడ్ని ద్వారంవరకు సాగనంపటానికి వచ్చాడు. "ప్రతి రాత్రీ, ధనికభూస్వామి గోవ్ యింటికిపోతూవుంటాడు" అని మెల్లగా చెవిలో వూదసాగాడు మేయరు. అంతేగాక "భూస్వామి కూతుర్ని వుంచుకొన్నాడన్న విషయం

ఎవరికి తెలియదంటారు? మీరే పోయి కళ్లారాచూడండి! యింతకుపూర్వ మెన్నడూ యిలాంటి బాలూను జూడలేదు నేను! తులసివనంలో గంజాయి మొక్క. వాడ్ని యిట్టే పట్టేయవచ్చు" అన్నాడు.

జోవ్ యింటికి ఎలా వెళ్ళాలో దాస్వేకి చూపించాడు మేయరు. దాస్వే బయలుదేరాడు.

ఆవరణలో ప్రవేశించటానికి కాపలావానిని వప్పించేసరికి తాతలు దిగివచ్చారు. చిట్టచివరకు దాస్వే ఆవరణలో ప్రవేశించాడు. అద్భుతంగా వెలుగులను వెదజల్లుతూవున్న ద్వారం చెంతకుపోయి నిలబడ్డాడు దాస్వే.

వృద్ధజంబుకమొకడు మహజాథిగ్ టేబిల్ముందు కూర్చువాన్నాడు. కళ్ళద్దాలపైనుంచి దాస్వేని తదేకంగా పరీక్షించసాగాడు. "ఏం కావాలి నీకు?" అని ప్రశ్నించా డా వృద్ధజంబుకం.

"నే నొక మనిషికోసం వెతుకుతున్నా" అని జవాబు చెప్పాడు దాస్వే.

దాస్వే కంఠంధ్వనిని వినగానే దాస్వేవైపుగా వీపుపెట్టివున్న ఒక మనిషియొక్క నున్నని తల వెనక్కుతిరిగి జూసింది. "ఓహో! మీరా; లోపలికి రండి!" అంటాడు జిన్లంగు. పట్టుసంభంలాగున దుస్తులు ధరించి వున్నాడతను.

"నీతో కొంచెం మాట్లాడాలి" అని క్లుప్తంగా జవాబు చెప్పాడు దాస్వే.

అతిఆప్యాయంగా దాస్వేని లోపలికిగుంజాడు జిన్లంగు. ఒక కుర్చీలో కూర్చోపెట్టాడు. ఒక సిగరెట్ యిచ్చాడు. "ఓ! తప్పకుండా! తప్పకుండా! యీ రెండు పూర్తికాగానే మీతో వచ్చేస్తా!" అన్నాడు అతను.

ఒక యువతి జిన్లంగుప్రక్కగా కూర్చొనివుంది. ఆమె చేయి జిన్లంగు భుజాన్ని అలకరించింది. "తూర్పుగాలి! తూర్పుగాలి! అది మా ట్రిక్కు" అని దంతపు పాచికనుచేతోపుచ్చుకొంటూ అరచింది. "జిన్లంగ్" అని ఆప్యాయంగా నవ్వుతూ "యిది నీ అభిమానపు ఎత్తు. ప్రతి ఎత్తుకూ

నువ్వు రెండింతలు సంపాదిస్తావ్! ఆటమీద మనసు మళ్ళించు" అని ప్రతిమాలసాగింది.

విసుగు ఉవ్వెత్తుగా పొంగిపొరలుతూవున్నా దాస్వే అక్కడే కూర్చొని ఎదురుజూడసాగాడు. నౌకర్లు ప్రవేశించారు. ఘుమఘుమలాడే తామరగింజల పులుసు వడ్డించిపోయారు. భోజనం చేయుటకు అందరూ సిద్ధమయ్యారు. కోపాన్ని అణచుకోవటంవలన తన వూపిరితిత్తులు పగిలి పోతాయేమో ననిపించింది దాస్వేకి. చివాలున లేచాడు. "నాకేమి వద్దు! నేను పోతున్నా" అన్నాడు.

జిన్లంగ్ అతడ్ని ప్రశాంతంగా పరిశీలించాడు. "సరేలే! వెళ్ళండి. తర్వాత మాట్లాడుకుందాం" అన్నాడు.

దాస్వే కోపంగా బయటకినడిచి వెళ్ళిపోయాడు. తిండీ తిప్పలూ. నిద్రాపద్రాలేకుండా, ఆ రాత్రికే జిల్లాప్రభుత్వ కేంద్రానికి దాస్వే చేరుకున్నాడు. షావ్యాంగుకు రిపోర్టుచేశాడు.

* * * *

రెండురోజులతర్వాత వెంటనే దళాన్నితీసుకొని, వెనక్కి తిరిగి రావలసిందిగా ఆజ్ఞాపిస్తూ, క్లార్కీత్సేపద్దనుండి, జిన్లంగ్‌కొక జాబువచ్చింది. "వాడెమ్మ—ఆ దాస్వేగాడే యిదంతా చేస్తున్నాడు. నా ముడ్డివెనకాల వెక్కిరించాలని యత్నిస్తున్నాడు" అని తనలోతాను దుమ్మెత్తిపోశాడు. అయితే, జాబుధోరణిచూస్తే మహాకఠినంగా వుంది. దాన్ని చూచేసరికి జిన్లంగుకి సరాసపటుత్వం జారింది. తన దళాన్ని తీసుకొని జిల్లాప్రభుత్వ కేంద్రానికి వచ్చేశాడు.

మేయిాని జూడటానికని మొట్టమొదట జిన్లంగు యింటికి వెళ్లాడు. గాలివాలు ఎటుందో కనుక్కోవాలనుకున్నాడు. "క్లార్కీత్సే వూళ్ళోనేవున్నాడటగా?" అన్నాడు.

తన కెందుకొచ్చిందన్నట్లుగా నటిస్తూ "హుఁ" అన్నది మేయీ.

"వెనక్కురమ్మని యెందుకు ఆజ్ఞాపించాడు ?" అని అడిగాడు జీన్లంగు.

"నీకు తెలియదూ?" అని జవాబుచెప్పింది మేయీ.

"అవును నాకు తెలుసు" అని మండిపోయాడు జీన్లంగు. "ఆ దాస్వే పనే యిది. నేను వాడికంటే గొప్పవాడ్నని వాడికి అసూయ. నన్ను నాశనం చేయదలచుకొన్నాడు...."

"చెత్తగా వాగబోకు!"అని మేయీ అడుపడింది."దరిద్రమొగమా నీ మొగం అద్దంలో చూసుకో. నీ సంగతి నీకే తెలుస్తుంది, దాస్వే అలాంటివాడుకాదు. నీలాంటి తుచ్ఛుడుకాదు. నా గుండెలు పగిలేవిధంగా నీతో అరచాను. అభివృద్ధిచెందవయ్యా అని బ్రతిమాలాను. కాని ఒక్క టివ్వంతైనా నేర్చుకొన్నావుగాదు.... కేవలం నువ్వు వొట్టిపనికిమాలిన వాడివి."

"ధూ!" అని ఉమ్మిలుమీద బలంగా గుద్దాడు. "ఆ వెధవ దాస్వే! వాడి కేం తెల్సు? నేను కోటను పట్టుకొంటూవుంటే, యిక్కడ సరస్సులో తాబేళ్ళుపడుతున్నాడు, ఎందుకు పనికొస్తాడా వెధవ. పెంటపోగు చేయ టానికి పనికొస్తాడు. నీకు వాడు రత్నంలాగున కనిపిస్తున్నాడు. నా పెంట ఎత్తటానికన్నా పనికిరాడు తెల్సా? ఉఫ్! మీ యిద్దరిదీ ఒకటేముఠా అని నాకు చాలాకాలంనుండి తెల్సు! ఆ రాత్రి నేను యింటికొచ్చినప్పుడు నువ్వు పరుపుమీద పడుకొన్నావ్; వాడు నీమీద వొంగాడు....ఆ పెద్ద రహస్య మేమిటో నాకు కాస్త చెప్పు!"

కోపంతో మేయీ వళ్ళంతా గజగజవణికింది. ఆమెకు దుఃఖం పొంగిపొరలివచ్చినది. కట్టలుతెగిన ప్రవాహంలాగున కన్నీళ్ళు కార సాగాయి.

అంతులేకుండా ఏడుస్తూ జీన్లంగ్....నువ్....నువ్ నా మొహంపై వుమ్మేస్తున్నావ్. నన్ను అవమానపరచుతున్నావ్! నీ యిష్టమొచ్చినట్లు ముండలతో పోతున్నావ్. పైగా నామీద నిందలుమోపుతున్నావ్!"

జీన్లంగు ముందుకుదూకాడు. ఆమె జుట్టును లంకించుకొన్నాడు.

"ఎవరిరితో పోతున్నావే?" అని మొరిగాడు. "చెప్పు. నాతో చెప్పు!" అన్నాడు.

మేయీ పెనుగులాడింది. అరవసాగింది. "నువ్వు తాగుతున్నావ్ తందనాలాడుతున్నావ్; ముండలతో పోతున్నావ్; జూదమాడుతున్నావ్— బాలూకి అప్రతిష్టతెచ్చావ్! అందరికీ తెలుసు యీ విషయం."

జిన్లింగు ఆమెను మొగంబ్రద్దలయ్యేటట్లు కొట్టాడు. ఆమె దొర్లి గోడమీద పడింది. ఆమె ముక్కువెంట అమితంగా రక్తం కారసాగింది. ఆమెను మరల బాదటానికికని జిన్లింగ్ కదలుతూవుండగా, ఒక మనిషి లోనికి తుసుకొనివచ్చాడు.

జిన్లింగ్‌ను వెనుకనుండి లంకించుకున్నాడు.బలంగా ఒక్కవూపుతో జిన్లింగును నేలమీద గిరిగింతాలు కొట్టేటట్లు త్రోశాడు. తన్నీవిధంగా చేసం దెవరో చూద్దామని జిన్లింగ్ మొగంపైకెత్తాడు. దాస్వే! జిన్లింగ్‌కి లోపల ద్వేషం మండిపోతూవుంది. తన శత్రువుమీద విరుచుకుపడ్డాడు. కాని ఇంతలోనే ష్వాంగు, బ్లాకీత్సేలు అక్కడికి పరుగెత్తుకుంటూవచ్చారు వాళ్ళిద్దర్నీ విడదీశారు.

రొప్పుతూ తన చేతులను నడుముమీదపెట్టి దాస్వే అరవసాగాడు. "భలేబాగుంది వరస- యుద్ధంచేయటానికని బయటికిపోయావా? యింటి కొచ్చావా!- ఆడాళ్ళమీద యుద్ధంచేస్తున్నావా?"

"నీము తబ్బని—" కోపముతో ఎగురుటూ జిన్లింగ్ అరచాడు. "నా పెళ్ళాన్ని నేను కొట్టుకుంటా. నీకేం? జోక్యం కలజేసుకోవటానికి ను వ్వెవడివి?- నా వెన్నులో పొడిచావ్ అర్థమేమిటి?" అని మొరగ సాగాడు.

ఇంకా మొరుగుతూవున్న ఆ జిన్లింగ్‌ని బ్లాకీ, ష్వాంగులు బయటికి యీడ్చికెళ్ళారు.

దాస్వే మేయీకి సాయపడ్డాడు. ఆమె దుస్తులన్నీ నెత్తురు మరకలతో నిండిపోయాయి.

* * * *

బ్లాకీ, షార్వాంగ్‌లు గంటలకొలది జిన్లంగుతో మాట్లాడారు.

అతను చేసినది తప్పని ఒప్పించబూశారు. కాని లాభంలేక పోయింది. తనవలన తప్పులేదని వాదించాడు. ఒక్కరప్పయినా లొంగని వాళ్లు అతనికి బోధించాలనియత్నిస్తూవుంటే, అతడు కోపాన్నినములుతూ విశ్శబ్దంగా కూర్చున్నాడు.

యధార్థానికి వాళ్లు చెప్పుతూవున్న మాటలేమీ అతను వినిపించు కోవటంలేదు. అతదేదో ఒకపన్నాగాన్ని తన మనసులో పన్నుకొంటు న్నాడు. చిట్టచివరకు లేచి నిలబడ్డాడు.

"నాలో యీ తప్పుంది, ఆ తప్పుంది అని దాస్వే అంటున్నాడు కదూ? యీ జిన్లంగంటే ఎలాంటివాడో రుచిచూపిస్తా!" అని రొమ్ముల బాదుకోసాగాడు.

"జపాను వ్యతిరేక పీరు డెవ్వడో మీరు జూస్తారు. వారీసర్కారు ఎలుగొడెవడైందీ మీకే తెలుస్తుంది" అని అరిచాడు. యింట్లోనుండి బయ టికి పోయాడు.

ఆవరణలో అతనికి తన స్వగ్రామంనుండి వచ్చిన మనిషి యెదు రయ్యాడు. ఆ మనిషి జబ్బుగావున్న జిన్లంగ్ కొడుకుని తీసుకునివచ్చాడు ఇంటిదగ్గరవాళ్లు తల్లిదండ్రులపద్దకు జబ్బుగావున్న ఆ పిల్లవాడిని పంపితే బాగుంటుందని అనుకున్నారు. ఎందుకంటే జబ్బుగావున్న పిల్లవాడికి తామే మందుమాకు లిప్పించుకొని బాగుచేసుకోవాలని ప్రతి తల్లీ తండ్రీ కోరుతారుగదా!"

"వాడు నాకక్కరలేదు. వాడు నాకొడుకుగాదు!" ద్వేషపూరితంగా మొరిగాడు జిన్లంగ్. "వాడు చస్తూవుంటే వాణ్ని వాళ్ళమ్మవద్దకు తీసుకు పొండి! అక్కడే చావనీయండి" అని అరిచాడు.

అక్కడనుండి బయలుదేరిపోయి జిన్లంగ్ లైవేనికలుసుకుని "వీళ్లు మనకన్న మొగాళ్ళమని భావిస్తున్నారోయ్! మనల్ని యిష్టమొచ్చినట్లు తొయొచ్చు ననుకుంటున్నారోయ్" అని చెప్పాడు "ఒకటి రెండేసిచూపిస్తే గాని మన విషయం వీళ్ళకు తెలిసిరాదు!"

వాళ్ళిద్దరూ చాలాసేపు మంతనాలు జరిపారు. తమ ప్లానులో

జేరుటకు ఆ రాత్రి సిపాయీనుకూడా వప్పించారు. తుపాకులు తీసుకున్నారు. కళ్ళెమెరుగని అడవిగుర్రాలలాగా వేగంగా గ్రామాన్ని విడచివెళ్ళారు.

మొట్టమొదట వారు హిస్వేలియూ గ్రామానికి పోయారు. తెగ త్రాగారు. ఒక పెద్ద మోకును, చాకునూ కొన్నారు. గ్రామాన్ని వదలి పోయారు. ఆనకట్టవెంటపోయి, కీలుబొమ్మ సైనికుల స్వాధీనంలోవున్న వ్యాపారపట్టణాన్ని జేరుకొన్నారు. ఆ పట్నంచుట్టూ పెద్ద ప్రహరీగోడ వుంది. ఈ పరిసరాల్లోనే లైవే బందిపోటుదొంగగా జీవిస్తూవుండేవాడు. కాదు బందిపోటుదొంగగా వుద్యోగంచేస్తూ వుండేవాడు. అందువలన అతనికి ఈ పట్నం, దాని పరిసరాసంగతి బాగా ఎరుక. ఎరుకేమిటి, కొట్టిన పిండతనికి. కాపలా బురుజులకు దూరంగా పడమటిగోడకు సూటిగా ఎదురుగానున్న ప్రదేశానికి వాళ్ళను లైవే తీసుకొనిపోయాడు. కందకాన్ని ఈదారు. అక్కడ గోడకు ఒకకంతవుంది. ఆ కంతలో ముళ్ళమొక్కలు పెరిగాయి. ఆ ముళ్ళమొక్కలను ప్రక్కకు వొత్తిగిలించి దానిలోదూరి పట్నంలో దొంగతనంగా ప్రవేశించారు.

వాళ్ళు నిశ్శబ్దంగా చడీచప్పుడు లేకుండావున్న యిరుకుసందులో నడవసాగారు. ఆ విధంగా పోయిపోయి ఆ పట్టణ వ్యాపారస్థుల సంఘానికి అధ్యక్షుడయినవాడి యింటికి జేరారు. ఆ యింటికి పెద్ద ప్రహరీవుంది. దానికొక గేటువుంది. అది గట్టిగా తాళంవేసివుంది. తన తోడుదొంగ భుజాలపైకెక్కి నిల్చుని జిన్లంగ్ ప్రహరీగోడ తలను అందుకొనగలిగాడు. ఒక ఊపుతో పైకెక్కాడు. మోకు సహాయముతో అతని అనుచరులుకూడా పైకెక్కి అతన్ని కలుసుకున్నారు. వారొక్కరొక్కరే ఆవరణలోనికి దిగారు. ఆవరణ దాటిన తర్వాత వారికి మరొక గోడ ఎదురయ్యింది. దాని గేటుకూడా గట్టిగా తాళం బిగించబడివున్నది. బయటి గోడవలెనే ఈ గోడను దూకటము కష్టం. ఎందుకంటే, ఈ గోడ బాగా ఎత్తుగావుంది. దీనికి దగ్గరలో ఒక పెద్దచెట్టు వుంది. దానికొమ్మలు పొడగుగా లేవు. కాని, జిన్లంగ్ జిత్తులమారిగదా! అతడు చెట్టెక్కాడు. గోడకంటే ఎత్తుగావున్న గట్టి కొమ్మనుచూసి, దానికి మోకు బిగించాడు. మోకుయొక్క రెండవ చివరను లైవే నడుముకు బిగించాడు. లైవే

భూమినుండి పైకెత్తబడ్డాడు. కొద్ది వూపులతో గోడపైకెక్కాడు. చెట్టు కొమ్మకు కట్టిన మోకు చివరను విప్పివేశారు. మోకు సహాయంతో మిగతా యిద్దరూ గోడపైకెక్కారు. గోడ పైభాగంలో ప్రతి ఆవరణలో నున్న భవనాల్లోని ఒకదానిపైకప్పుతో కలసివుంది. వారు ఆ యింటి పైకప్పు దాటారు. వేసవికాలములో ఆవరణలో పందిరిగుంజగా ఉపయోగపడుతూవున్న ఒక స్థంభాన్ని లంకించుకొన్నారు. దాన్ని పట్టుకొని క్రిందికి జారారు.

నలుచదరంగా వ్యాపించియున్న ఆ భవనాలలో తూర్పు ఉత్తర భాగపు వాటిల్లోనే వెలుతురు అగుపిస్తూంది. తూర్పుభాగపు భవనపు కిటికీ గుండాచూస్తే లోపల పేకాట జరుగుతూవున్నదని కనబడుతూవుంది. పేకాడుతున్నవారిలో చావచచ్చిన యువకుడొకడు తప్ప మిగతావాళ్ళంతా ఆడవాళ్ళే. తూర్పుదిక్కున లైవేని కాపలాపెట్టి జిన్లంగూ, సివౌలు నిశ్శబ్దంగావున్న ఉత్తరపుగదిలో ప్రవేశించారు.

వ్యాపారస్థుల సంఘాధ్యక్షుడు కాంగ్‌మిద పడుకొని పొగ త్రాగుతున్నాడు. వీళ్ళను చూడగానే బెదిరిపడిలేచాడు.

"భయపడబోకు" అని జిన్లంగ్ వెంటనే అన్నాడు. "నీకు హాని చేస్థామని మే మిక్కడకు రాలేము."

"ఎవరు మీరు?" అని అరిచాడా మోటావ్యాపారి.

"నేను బాలూసైన్యంలో ఒక కెప్టెన్ని. హిస్యేలియూ కోటను పట్టుకొన్నది నేనే. మాలో కొంతమందిమి చేతులు కడుక్కొని, దొబ్బేయదలచాం. మేము మా తుపాకులను మీకిస్తాం. ప్రయాణానికి మాకు కొంతడబ్బు అప్పుగా తీసుకోదలచాము."

జిన్లంగ్ తన పిస్తోలును బల్లపైపెట్టి కూర్చున్నాడు. సివౌ అతణ్ని అనుసరించాడు.

మోటావ్యాపార నాయకునికి ధైర్యం చిక్కింది. చిరునవ్వు నవ్వుతూ, "బాగుంది బాగుంది; నావద్ద కొంతడబ్బు యిక్కడే వుంది. మీకివ్వగలను" అన్నాడు.

ఆ వ్యాపారి నోట్లకట్టను జేబులోనుండి బయటకుతీసి, జిన్లంగు చేతికి అందించాడు. జిన్లంగ్ వాటిని లెక్కపెట్టుకొన్నాడు.

"మేము చాలామంది వున్నాము, యివి మాకెంతోకాలము సరిపోవు. ఇంకా కొద్దిగా యివ్వలేరా?" అన్నాడు జిన్లంగ్.

ఆ మోటామనిషి మొగం భయంతో వణికింది. ఒక్కక్షణమాలోచించాడు. అటు తర్వాత ఒక తాళంచెవుల గుత్తిని బయటికి లాగాడు. కాంగ్‌మీదకు మోకరించి గోడలోకట్టిన ఒక చిన్న తలుపును తెరచాడు. అరలోనుంచి ఒక నగలపెట్టెను బయటికి లాగాడు. దానిలోని నగలను యిటూ అటూ సర్దుతూ చిట్టచివరకు ఆ వ్యాపారి రెండురాళ్ళ వుంగరాలను బయటికి తీశాడు. అందులో ఒకదానికి ఎర్రరాయి వుంది. రెండవదానికి పచ్చరాయి వుంది.

"ఇదిగో కెప్టెన్‌గారూ! ఇవి తీసుకోండి! ఇవి తీసుకొనిపోతే, ఇవి మీకు ఎక్కడబడితే అక్కడ స్నేహితులను తెచ్చిపెడతాయ్. ఈ ఈ రెంటినీ తీసుకోండి" అన్నాడు మోటావ్యాపారి.

అతడు గోడవైపుకు తిరిగిగాడోలేదో వెంటనే జిన్లంగ్ అతని మెడను తన రెండుచేతులతోనూ లంకించుకున్నాడు. సివౌ వ్యాపారిమెడకు వుచ్చువేశాడు. గట్టిగాబిగించి లాగాడు. దుక్కలాంటి ఆ వ్యాపారి కనుగ్రుడ్లు బయటికి పొడుచుకొచ్చినాయి. అతని గొంతులోనుండి విపరీతమైన ధ్వనులు బయలుదేరాయ్. సివౌ భయముతో గజగజ వణికాడు. వణుకుతూవున్న వాని చేతులనుండి మోకు క్రిందకు జారిపడినది. ఘోరముగా పెనుగులాడుతూ ఆ మోటావ్యాపారి కాంగ్‌మీదనుండి క్రిందికి దొర్లాడు. మోకు యింకా వానిమెడకు వ్రేలాడుతూనేవుంది. జిన్లంగ్ ఒక పావాన్ని వాని రొమ్ముమీదపెట్టి నొక్కాడు. వాణ్ణి అణచిపెట్టాడు. మోకు చివరకు లంకించుకున్నాడు. రెండవకొసను సివౌకు అందించాడు. వాళ్ళిద్దరూ బలాన్నంతా వుపయోగించి గుంజారు. ఆ దెబ్బతో మోటావానికళ్ళు గిరగిరా తిరిగాయి. వానినాలుక బండగా బయటపడినది. వాడి వళ్ళు కొయ్యబారిపోయినది. అప్పుడుమాత్రమే జిన్లంగ్ మోకును వదిలిపెట్టాడు. నగలపెట్టెను లంకించుకొన్నాడు. విసురుగా

తెరచాడు. పొడుగాటి ఒక బంగారు గొలుసును చూడగనే పేరాశతో అతనికళ్ళు మిలమిలా మెరిశాయి. పెట్టె మూసేశాడు. షర్టుజేబులో పెట్టుకున్నాడు.

"నాకు!" అని సిహొవంకజూచి అరచాడు.

మిలమిలా మెరుస్తూవున్న పందులనుకోసే చాకును సిహొ బయట పెట్టాడు. కాని సిహొ కొయ్యబారిన తనచేతిని పైకెత్తలేకపోయాడు. తిరస్కారముగా అతనివంక జూస్తూ, జిన్లంగు చాకును లాక్కున్నాడు. కొయ్యబారిన వ్యాపారి శరీరంపై వంగాడు. దుక్కలాగున్న అతని మెడలోనికి చాకును లోతుగా దూర్చాడు. చాకును బయటకు లాగగానే రక్తం చిమ్మురుగొట్టములాగా బుస్సున పైకికొట్టింది. జిన్లంగు బటలన్నీ నెత్తురు మరకలయ్యాయి. పైశాచికంగా రెండుమారులు ఆ చాకుతో మోటావాని మెడమీద కొట్టిన తర్వాతనే వానితల శరీరంనుండి వేరుపడినది. జిన్లంగ్ పడకమీదనుండి ఒక పలుచనిగుడ్డను లాగాడు. దాని మధ్యభాగంలో ఆ తలుపు వుంచాడు. నాలుగుమూలలనుండి గుడ్డనులాగి, ముడివేశాడు. ఆ విజయచిహ్నాన్ని తన నడుము పటకాకు ముడివేసుకొన్నాడు. లాంపును వూదేశాను. తనవెంట లైవే, సిహొలు సాగిరాగా జిన్లంగ్ వేగంగా ఆవరణ దొడ్డితలుపుద్వారా బయటపడ్డారు.

వాళ్ళు ఆనకట్టను చేరుకోగానే కూలబడ్డారు. కొంత విశ్రాంతి తీసుకొన్నారు. జిన్లంగ్ నోట్లకట్టలు, ముగ్గురికి సమంగా పంచాడు.

"నాకూ, లైవేకి చెరివొకవుంగరం ఇయ్యవేం?" అని గొణిగాడు సిహొ. "కావాలంటే బంగారుగొలుసును నువ్వట్టిపెట్టుకో!" అన్నాడు.

జిన్లంగ్ తన అరచేతితో సిహొ ముఖంమీద చరిచాడు. "ఛీ! వెధవా! పో యిక్కణ్ణుంచి! నామీదకే కొరెత్తి వుచ్చోస్తున్నావుగా! వాణ్ని చంపరా అంటే, భయంతో గజగజ వణికి చచ్చావ్! పిరికివెధవా! కాలు కదపలేకపోయావ్! ఇప్పుడిది కావాలి, అది కావాలంటూ ఎక్కణ్ణుంచి వచ్చావ్!"

సిహొ భయంతో నోరుమూసుకొని కూర్చొన్నాడు. కాని లైవే

మంచి తెలివితేటలు గలవాడు. జిన్లంగును ఎలా పట్టి నడిపించాలో అత నికి బాగా తెలుసు.

"కోప్పడబోకోయ్ తాతా! కోప్పడబోకు మరి!" అని దువ్వాడు జిన్లంగ్‌ని. "ఏం చెప్పావో చూద్దాంపద"అన్నాడు ఉజ్జగిస్తూ.

"ఆ వెధవ వాగుడు వినవుకదూ" అని జిన్లంగు, "నావద్ద రెండు ఉంగరాలు మాత్రమున్నాయి. ఇదిగో నీ కొకటి యిస్తా తీసుకో" లైవే దాన్ని తీసుకొని తృప్తిపడ్డాడు. జిన్లంగు లేచినిలబడ్డాడు.

"పోదాం పద! నీ పుంపు బయటపడకుండా చేతిరుమాలుతో కప్పేయి! దీన్ని రహస్యంగా వుంచాలి. మన లూటీని గురించి ఎవరితో చెప్పబోకండి. ఎవరికీ తెలియరాదు!" అన్నాడు.

సూర్యోదయమయ్యేసరికల్లా, వాళ్ళు జిల్లా హెడ్‌క్వార్టర్సు జేరు కొన్నారు. ప్రజాసైనికులు అప్పుడే నిద్రనుండి లేస్తున్నారు. "బ్లాకీ ఎక్కడ?" అని అడిగాడు జిన్లంగు.

రక్తంచారలుకట్టిన అతని గుడ్డలవంక రెప్పవాల్చకుండా చూడ సాగాడు ష్వాంగ్.

"గత రాత్రి అత డిక్కడ నిద్రపోలేదు" అని జవాబు చెప్పాడు. "నువ్వెక్కడికి పోయావ్?" అడిగాడు.

జిన్లంగు మారుమాట చెప్పకుండా నిశ్శబ్దంగా, నడుముకు కట్టుకున్న మూటను విప్పాడు. భయంకరంగానున్న ఆ తల నేలమీదపడి, అసమా నంగా దొర్లుతూ కాంగ్ గోడవద్దకు పోతూవుంటే, అక్కడున్నవాళ్ళంతా భయంతో ముడుచుకొనిపోయారు.

"దేశద్రోహి లియూ తల ఇది" అని గర్వంతో పొంగిపోతూ అరచాడు జిన్లంగు.

"జిన్లంగునయిన నేను మట్టిమరకను దులిపేసినట్లు అతిచులాగ్గా దులిపేశాను....వాడు చుట్టూ పెద్ద కందకంగల పట్నంలో చుట్టు పెద్ద ప్రహరీగల పట్నంలో నివసిస్తున్నాడన్న విషయం మీకు తెలుసు. ప్రతి

తావులోనూ, జపానువాళ్ళు పెద్దపెద్ద సెర్చిలైట్ల సహాయంతో కాపలా కాస్తున్నారు. నన్నాపగలిగారా? దాన్నే ఎల్లప్పుడూ గొప్పగా కోస్తూ వుంటాడు—ఏదో! వాడిన్ని లోపలికిపొమ్మనుచూద్దాం. ఒక తలను తీసుకు రమ్మను చూద్దాం!"

"నువ్ చెప్పేది ఏ లియూ౧గురించి?" అని ష్వాంగు అడిగాడు. అతనికళ్ళు యింకనూ రెప్పార్పకుండా జూస్తూవున్నాయి.

"ఏం? వ్యాపారుల పట్నంలోని వ్యాపారుల సంఘానికి అధ్యక్షుడు వాడు—పెద్ద దేశద్రోహి! వాణ్ణెరుగవా?"

ఇది చెడ్డవనియన్నవిషయం ష్వాంగుకి తెలుసు. కాని, ఆ క్షణములో ఏ విధంగా మాట్లాడాలో అతనికి తెలియకపోయింది. పోయి కొంత విశ్రాంతి తీసుకోవలసినదిగా అతనికి చెప్పాడు. బ్లాకీతేన్ యిప్పుడే త్వరలోవస్తాడని చెప్పాడు.

జిన్లంగ్ తా నొక ఘనవిజయాన్ని సాధించినట్లుగా భావించాడు.

గర్వప్రేరిత సంతృప్తితో ఆ తలను ఒక తన్నుతన్నాడు "దీన్ని బ్లాకీ చూడనీ! చౌరస్తాలో దీన్ని వ్రేలాడగట్టుదాం. అందర్నీజూడనిద్దాం" ఏదో అమూల్యరత్నంలాగున ఆ తలను మరల మూటగట్టుకొని జిన్లంగు బయటికి మోసుకొనిపోయాడు.

* * * *

సివౌ చెంప బాగా వాచియుండటాన్ని ష్వాంగు గమనించాడు. అతని ముఖంలోని ఒకపెడంతా బాగా వాచిపోయివున్నది. జిన్లంగు యిందాక కొట్టినదెబ్బ ఘాటుగా తగిలిందన్నమాట!

ష్వాంగు అతడిన్ని ప్రక్కగా తీసుకొనిపోయి ఇలా వాయటానికి కారణమేమని అడిగాడు మొట్టమొదట విషయాన్ని బయటపెట్టటానికి సివౌ జడిశాడు.

నీకేమి భయంలేదని ష్వాంగు అభయహస్తమిచ్చిన తర్వాత, రోషంగా కథనంతటినీ, బయటపెట్టేచాడు సివౌ.

బ్లాకీ రాగానే ష్వాంగు అతనికి పూసగుచ్చినట్లు అంతా చెప్పేశాడు. అతడనుకున్నదానికన్న మహాఘోరంగా జిన్లంగు తప్పులున్నాయని బ్లాకి చెప్పాడు. అతడు వెంటనే వ్యక్తిగతంగా మాట్లాడటానికని, జిన్లంగును పిలిపించాడు.

నీవు చేసింది తప్పు అని బ్లాకీ ముఖం చిట్లించుకొని చెప్పేసరికి తలబిరుసు వొయ్యారంతోవున్న జిన్లంగుకు ఆశ్చర్యం కలిగింది. "నిన్ను నువ్వు అనుమతి తీసుకోకుండా యిద్దరు మనుషులను వెంటబెట్టుకొని పోయావు అదొక తప్పు; ఒక మనిషిని చంపటము అంత తేలికమైన వ్యవహారంగాదు; జిల్లా, కౌంటీప్రభుత్వాల రెండింటి అనుమతిని తీసుకోవాల్సి వున్నది. అలాంటి విషయాన్ని నీయంతట నీవే నిర్ణయించటానికి నీకు అధికారంలేదు" అన్నాడు బ్లాకీత్సే.

"ఒక దేశద్రోహిని హత్యచేయటంలో తప్పేమున్నది" అని జిన్లంగు అడిగాడు. అతనికి హాని జరిగినట్లనిపించినది. చెంపకుదెబ్బతిన్న ట్లనిపించింది.

"వ్యాపార సంఘానికి అధ్యక్షుడైనంతమాత్రాన దేశద్రోహిగా అతణ్ని భావింపనవసరంలేదు. అలాంటివ్యక్తిని మొదట సమీపించి, బోధించి, సత్కరించటమే కమ్యూనిస్టుల పాలసీ; అలాంటివాళ్ళు బాగా దుష్టులఖుతేనే, బాగా క్రూరులయితేనే, సంస్కరించడానికి వీలులేకుండా తయారయితేనే వాళ్ళను రద్దుచేస్తాం; ప్రతివ్యక్తి విషయాన్నీ జాగ్రత్తగా తూచాలి. ఎవడియిష్టమొచ్చినట్లు వాడు పోయి, స్వంతబాధ్యతమీద చంపి రారాదు;" అన్నాడు బ్లాకీ.

జిన్లంగు గర్వం దెబ్బతిన్నది. గౌరవం దెబ్బతిన్నది. రెప్పార్ప కుండా జూస్తూ దెబ్బతిన్న గర్వం, గౌరవాలకు స్వాంతనం జెప్పకుంటు న్నాడు.

బ్లాకీ అతనివంక అసంతృప్తిగా జూస్తూ తన సంభాషణను సాగించాడు. "ఎందుకలా చేశావ్? జపానువాళ్ళపై దెబ్బతీయాలనా? లేక నీ స్వంతంకోసమా?—పట్నంనుండి ఏమేమి దోచుకొని తెచ్చావో చెప్పు;" అన్నాడు.

జిన్లంగు ముఖం కళావిహీనమైంది. వెంటనే ఎర్రబడింది. "నీ మాటల కర్థమేమిటి?" తప్పించుకోటానికి ఎదురుప్రశ్న వేశాడు. "ఒక్క సూదికూడా ముట్టుకోలేదు! అలాంటిభావం నీ కెందుకు తట్టింది?" అన్నాడు.

ఈ జిడ్డమొదటి కప్పదాటుతనాన్ని జూసేసరికి బ్లాక్‌కి రోతపుట్టింది ప్రయత్నపూర్వకంగా కోపాన్ని అణచిపెట్టుకున్నాడు. అతను వహన పూరితంగా, "జిన్లంగ్! నేనా విధంగా అడుగుతున్నానంటే నువ్వు దోచి తెచ్చుకొన్నదానిలో భాగం పంచుకోవాలనే వుద్దేశంతోగాదు. నీకు కొన్ని మురికిఅభిప్రాయాలున్నాయి. వాటిని సరిదిద్దామన్న అభిప్రాయముతో అడుగుతున్నా! నిన్నటిరోజున ష్వాంగు, నేనూ నీతో చాలా సేపు మాట్లాడాం. మేము చెప్పినదానిలో ఒక్కవిషయాన్నయినా నువ్వు అర్థం జేసుకొన్నట్లు తోచటంలేదు. యథార్థానికి నువ్వు పూర్వంకన్న మరింత అధ్వాన్నంగా తయారయ్యావ్. నిన్నుగురించిమాత్రమే నువ్వు ఆలోచించుకుంటూ వుండటం విప్లవానికి హానికరం. అంతేగాని మేలుగాదు. వ్యక్తిగతంగా నీ విషయాన్ని తీసుకొందాం: నువ్వు తప్పులను వెంటనే సరిదిద్దుకోకపోతే దినదినం అవి అధ్వాన్నంగా తయారౌతాయి. చిట్టచివరకు అవి నిన్ను నాశనంజేస్తాయి."

తనగుట్టు బట్టబయలయిందన్న విషయాన్ని జిన్లంగుగ్రహించాడు. అతనికి మొట్టమొదట తట్టినదేమంటే ఏదోవిధంగా దాస్వే తన గుట్టును కనిపెట్టి బట్టబయలుచేశాడనుకున్నాడు.వాని రోషం, ఆత్మరక్షణ కోపంగా ప్రజ్వలితమయింది.

"హాఁ మారిపోయాను" అని మండిపడుతూ, చివాలున లేచాడు. "ప్రాణాన్ని పందెంగాపెట్టాను. అయినప్పటికి నేను మంచివాణ్నిగాదు, దీనిలో ఏదో గూడుపుఠాణీవుంది. నాకు తెలుసు. నా వెనకాల గోతులు త్రవ్వుతున్నదెవరో నాకు తెలుసు. దాగా తెలుసు. నిన్నుజూసి వూరు కుంటున్నా. లేకపోతే తుపాకితీసుకొని, వాణ్ని కాల్చేసేవాణ్ణే! కిటికీతెరచి అందరికి వినపడేటట్లు చెపుతానుపటు. నేనో- దాస్వేయా? ఎవరో ఒకరు పోవాలి. నా కీ ఉద్యోగం దేనికి? ఏమైనాగానీ, నేను శత్రువుల్లో జేరను;

నేను దేశద్రోహిగా తయారుగాను- యింటికి పోతాను. సాధారణ పౌరుడుగా వుండిపోతాను.

జిన్లంగు తన పిస్తోలును టేబుల్‌మీద విసిరేశాడు. చివాలున బయటికి పోతూవుంటే, అప్పుడే లోపలకు వస్తూవున్న దాన్వే, అతనూ ఢీకొన్నారు. కోపంతో మండిపోతూవున్న ముఖంగల జిన్లంగు అతనివంక చూడనైనా చూడలేదు. మరింత కోపంగా దారిన పడి పోయాడు.

జిన్లంగు సూటిగా తనదళం వుంటున్న గదికి పోయాడు. అతనక్కడ పొగలుగ్రక్కాడు. బుసలుకొట్టాడు. ఆ దళ సభ్యులందరికి ఈ జాడ్యము వ్యాపించినది. తమ గౌరవానికి "అవమానం" జరిగినట్లుగా భావించారు. రోషం కలిగింది. వెంటనే రాజీనామా పెడతామంటూ, అందరూ కట్టకట్టుకుని ఒక్కటిగా లైపే నాయకత్వాన బయలుదేరారు. కీవద్దకు వచ్చారు. బ్లాకీ జిల్లా సభ్యులలో కొంతమంది వారికి నచ్చజెప్పజూచారు. జిన్లంగును విమర్శించినది సబబేననీ, ఆ విమర్శన ఏ విధముగానూ దళంలోని ఇతర సభ్యులపై ప్రతిబింబించదనీ నచ్చజెప్పేసరికి యాతనయినది. అందరూ వప్పుకున్నారు. లైవేమాత్రం వప్పుకోలేదు.

తాను రాజీనామా పెడతానని లైవే పట్టుబట్టాడు. "ఈ కూడు నాకొద్దు. వుండదలచుకొన్నవాళ్లు వుండండి. నేను పోతా!"నని తుపాకిని వప్పగించి వెళ్ళిపోయాడు.

జబ్బుగావున్న తన కొడుకును సాకుతూ, మేయీ ఇంటివద్దనే వుంది. ఆమె, పిల్లవాణ్ని భుజాలమీద పడుకోపెట్టుకొని, అటూ యిటూ పచార్లుజేస్తూ, మృదువుగా పాటపాడుతూ పిల్లవాడిని జోకొడుతూవున్నది. ఆ పిల్లాడు చాలా బలహీనంగా, ఎడతెరిపిలేకుండా ఏడుస్తున్నాడు.

మేయీ అద్దంముందు ఆగి, "చూడు! ఎవరిది?" అన్నది.

ఎండిపోయిన తన చిన్న ముఖంయొక్క ప్రతిబింబాన్ని అద్దంలో చూచి, పిల్లవాడు వుల్లాసంగా నవ్వాడు. మేయీ కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయ్.

జిన్లంగు కోపంతో పొగలుగక్కుతూ. బుసలుకొడుతూ లోపలికి

తోసుకొనివచ్చే సమయానికి, మేయీ పిల్లవాడికి, కోడిగుడ్డును పెడుతూ వుంది. "మేయీ! నీవు నా పెళ్ళానివైతే పక్కబట్టలు సర్దిసి యిప్పుడే నాతో రా! లేకపోతే, నీకూ నాకూ యింతటితో సరి!" అని అరచాడు.

ఆశ్చర్యముతో, మేయీ కళ్ళు చిరుగంటలంతయ్యాయ్! "ఏం జేయ బోతున్నావ్?" అని అడిగింది.

జిన్లంగు వికటంగా నవ్వాడు. "నేను మనిషినీగాదు; దయ్యాన్నీ గాదు. నేను ఈ ఉద్యోగాన్ని వదలిపెడుతున్నా. వాళ్ళకు నాతో అవసరం లేకపోతే, కావలసినవాళ్ళు బోలెడంతమంది వున్నారు. నీ వుద్యోగాన్ని వదిలేయ్! నాతో రా! లేకపోతే మనిద్దరికీ "రాంరాం!" అన్నాడు.

"జిన్లంగ్! నన్ను బెదరించబోకు!" అన్నది తిరస్కారంగా. సూటిగా అతని కళ్ళల్లోకి జూచింది.

మనపని 'ఖతం' అంటావా? సరే! 'ఖతం'గానీ. నీ మూలంగా నేను పిల్లవాన్ని విడిచిపెడతానన్నమాట అబద్ధం. గుర్రాన్ని బురదరోడ్డు మీద, బండిని మంచిరోడ్డుమీద దొర్లనీ. ఎవరికివారే యమునాతీరే. ఒక రినిగూర్చి మరియొకరు జోక్యం కలుగజేసుకోవద్దు!" అన్నది.

"సరేలే!" అని మొరిగాడు జిన్లంగ్. "నన్ను నీ భర్తగా గుర్తించటము నీ కిష్టంలేకపోతే, నీ కీ పిల్లాడెందుకు?" అని పిల్లవాణ్ని చేతులు పట్టుకొని గుంజి మేయీనుండి లాక్కో యత్నించాడు.

మేయీ పిల్లవాణ్ని గట్టిగా పట్టుకొంది. భయంతో ఆ పిలవాడు ఏడ్వసాగాడు. "జబ్బుగా వున్నాడు. వాణ్ని భయపెట్టకు!" అని వెర్రిగా బ్రతిమాలింది.

జిన్లంగు ఒక్కవూపుతో పిల్లాడిని గుంజేశాడు. మేయీ గిరిగిం తాలుకొడుతూ నేలపైపడింది. జిన్లంగ్‌ముఖం ద్వేషంతో ముడుచుకొంది. క్రూరంగా ఆమెను అనేకసార్లు తన్నాడు. గిర్రున తిరిగి తలుపు తాళం వేసి, పారిపోయాడు. ఏడుస్తూ మేయీ ద్వారంకడకు ప్రాకిపోయింది. లేచి నిలబడి, పిడికిళ్ళతో తలుపుగ్రుద్దింది. బిడ్డ ఏడ్పులు అంతకంతకు దూరమయ్యాయి.

కొన్నిరోజుల తర్వాత జిన్లంగునుండి కౌంటీప్రభుత్వానికి ఒక

జాబు వచ్చినది. అందులో పెళ్ళాము భర్తతో నివసించాలని సూచించాడు మేయీ తన యింటికి రాకపోతే విడాకులివ్వదలచానని వ్రాశాడు. నీ అభిప్రాయమేమిటని మేయీని అధికారులు అడిగారు.

"నా హృదయాన్ని ముక్కలుజేశాడు." అన్నది మేయీ కటువుగా. "వాడొట్టి వంకరమనిషి- సమూలంగా వంకరమనిషి. విప్లవానికి సేవజేయ నిరాకరిస్తున్నాడు. వానితో నేను జీవించలేను. విడాకులివ్వనీ- ఏమైనా చేసుకోనీ, నేను కోరేదల్లా ఏమంటే- నా పిల్లాడిని నాకిచ్చేయమని. పిల్లాడికి చెరుపుచేస్తాడు వాడు!" అన్నది.

విడాకులకు అనుమతించబడింది. పిల్లాడివిషయములో చర్య తీసుకోవలసిన అవసరంలేకపోయింది. పిల్లాడిని తీసుకొని జిన్సంగు పారిపోయిననాడే వాడికి రొమ్ముమీద జలుబుపట్టింది. కొన్నిదినాలయిన తర్వాత వాడుకాస్తా గుటుక్కుమన్నాడు.



# 8 అధ్యాయం

కేంద్రహోపేరాష్ట్రంలోని బాలూ సైన్యాన్నీ దాని ఆధ్వర్యము క్రింద నడుస్తున్న ప్రజాసైనిక శక్తులన్నింటినీ, "ఊడిచిపెట్టేయ" టానికి మే మాసాంతరంలో జపానువాళ్లు పెద్ద దండయాత్రను ప్రారంభించారు. ఈసారి జపానువాళ్లు చాలా బలంగా వున్నారు. ప్రధాన బాలూ స్థావరాలను నాశనం చేయుటకై నలుమూలలనుండి సైన్యాలను దింపారు. ప్రధాన కమ్యూనిస్టుసైన్యం ఇతర ప్రాంతాలకు స్థావరాన్ని మార్చింది. స్థానిక కమ్యూనిస్టు పరిపాలక సంఘాలనూ గెరిల్లా సంఘాలను రహస్య జీవితానికి పోవలసినదిగా ఆజ్ఞాపించారు.

కౌంటీస్థాయిలో ప్రతి తావులోనూ పార్టీసభ్యుల సమావేశాలు జరుపబడినాయి. లొంగకుండా వూగిసలాడకుండా వుండగలమనీ, ప్రజలతో చిట్టచివరవరకూ వుండగలమనీ కమ్యూనిస్టులు శపథాలు తీసుకున్నారు. రానున్నకాలం అతికష్టమైనదనీ, కాని దాన్ని గడిస్తే విజయము తథ్యమనీ అందరూ అంగీకరించారు. ఆ ప్రాంతములో వందల కొలది మంది ప్రతి తావులోనూ లేచి నిలబడ్డారు. శపథాలు పట్టారు.

జపానువాళ్ళ ప్రవాహం, చిన్నచిన్న గ్రామాలనుకూడా సమీపిస్తూ వుంది. ప్రజాశక్తులను నిలబెట్టటానికి, దాచటానికి రక్షించటానికి తొందరగా కార్యకర్తల గ్రూపులు ఏర్పరచబడ్డాయి. అలాంటి ఒక గ్రూపులో దాస్వే, షాంగు, మేయీలు వున్నారు. వారు జిల్లాకేంద్రానికి వచ్చారు. ప్రయోజనకరమైన వస్తువులను దాచటానికి, రహస్య జీవితానికి పోవు

చున్న పురుషుల స్త్రీలగుర్తులను రహస్యంగా వుంచటానికి. వారు ప్రజలను సమీకరించారు. ఖంగారుచా ప్రజలు, కార్యకర్తలు అవసరయత్నాలు చేయసాగారు.

శత్రువులు అంతకంతకు దగ్గరగావస్తున్నారు. బాయాంగ్ సరస్సు ప్రాంతంలో నీరు తగలకుండా, లోతుగా, త్రవ్వగలటం అసంభవం. అందువలన సొరంగాలు త్రవ్వటం అసంభవమని తేల్చివేశారు. కంటికి అగుపించకుండా వుండేలాగున చిన్న కందకాలు త్రవ్వుదామని ప్రతిపాదించారు. కాని వాటివలన ప్రయోజనముంటుందని ఎవరికీ నమ్మకం లేక పోయింది. చిట్టచివరకు రైతులతోపాటు సాధారణ దుస్తులా ధరించి, జనంలో కలిసిపోయి ఒక గ్రామంనుండి మరియొకగ్రామానికి సురక్షిత స్థానాన్ని వెతుక్కొంటూ పోతూవున్న జనంలోపాటు పోదామని నిశ్చయించుకొన్నారు కార్యకర్తలు.

శత్రువుల సంఖ్య అధికమయింది. ఎంతమంది శత్రుసైనికులు గలరో, ఎక్కడినుండివస్తున్నారో, ఎక్కడికిపోతున్నారోయన్న సమాచారం ఎవరికీ తెలియటంలేదు. సరస్సులమీద, నదులమీద, ఆనకట్టలమీద రాకపోకలను—అన్నింటినీ, జపాను కాపలావాళ్ళు బంద్ చేశారు. కాస్త కదలిక కనిపిస్తేసరి అదేదైనప్పటికీ అటువైపుగా, జపానువాళ్ళు యిష్టమొచ్చినట్లు తుపాకీగుళ్ళవర్షాన్ని కురిపిస్తున్నారు. గ్రామాలను చుట్టుముట్టుస్తున్నారు. ప్రజలు గోధుమ పొలాల్లో దాక్కోవటానికి యత్నిస్తున్నారు.

ఒకనాటి సాయంత్రం జపానువాళ్ళు, పదిమైళ్ళ పరిధిలో వల పన్నారు. కేంద్రంవైపునకు అన్నివైపులనుండిత్రోసుకొస్తున్నారు. ప్రజలు తూర్పుదిక్కుగా పరుగెత్తారు.

కాని వారికి అక్కడ కాల్బలం ఎదురయింది. పడమటిదిక్కుగా పారిపోతే అక్కడ, వారికి ఆశ్వికదళం ఎదురయింది. ఎక్కడజూచినా జపానువాళ్ళే. స్త్రీలు, పిల్లలు భోరున ఏడుస్తున్నారు. ఒక గ్రామం తమ

వాత మరియొక గ్రామాన్ని జపానువాళ్ళు పరశురామప్రీతిజేశారు. జపాను వాళ్ళ తుపాకుల మ్రోత అంతకంతకు అధికమయింది. గ్రామాలన్నీ మంటలపాలై నుసైపోతున్నాయ్.

దాస్వే, తదితర కార్యకర్తలు తమ కోపాన్ని అణచిపెట్టుకోవాలిసివచ్చింది. తమ పిస్తోళ్ళను పొలాలలో పాతిపెట్టారు. వాటిపై రాళ్ళో, రప్పలో, లేక యింతమట్టిసుదలో గుర్తుగా పెనఃదేరారు. కొన్నిక్షణాల తర్వాత శత్రువుల ఆశ్వికదళం గోధుమపొలాలలోవున్న ప్రజలందరినీ చుట్టుముట్టింది.

వారందరినీ ఒకచోటకు జేర్చింది. ఉక్కుటోపీలనుధరించిన తోలుబూట్లను ధరించిన జపానుకాల్బలదళ సైనికులు పచ్చని సైనిక దుస్తులను ధరించిన కీలుబొమ్మసైనికులు, మెరుస్తూవున్న తుపాకులను జూపుతూ రైతాంగప్రజలందరినీ, రాజబాటమీద మందవేశారు. పురుషులను స్త్రీలనుండి వేరుజేశారు. అన్నిదిక్కులనుండి మెషిన్‌గన్నర్లు తమ ఆయుధాలపై నక్కుకొనియున్నారు.

ఒక 'దుబాసీ' సాధారణపౌరుని దుస్తులను ధరించిన ఒక దేశద్రోహి, ఖైదీలపంక్తికి యీ చివరనుండి ఆ చివరవరకూ నడిచారు. "మీలో బాలూ ఎవరు? మీలో కమ్యూనిస్టెవరు? వాళ్ళను చూపండి!" అని, అడుగసాగారు.

ఎవ్వరూ జవాబు చెప్పలేదు.

"మీలో కార్యకర్త ఎవరు? గెరిల్లా ఎవరు?"

మళ్ళీ జవాబులేదు.

"ఈ ప్రాంతమంతా జపాను- వ్యతిరేక- గూఢుయని మాకు తెలుసు! మేం వాళ్ళను కనిపెడ్తాం!" అన్నాడు తెల్లషర్టు ధరించిన దేశద్రోహి యొకడు.

కీలుబొమ్మసైనికుడి నొకణ్ని తనప్రక్క బెట్టుకొని, జపాను ఆఫీసరొకడు విసుగ్గా, పురుషఖైదీలను ఒక్కరొక్కరినీ, తానే స్వయముగా పరీక్షించసాగాడు.

వాళ్ళ చేతులను పరీక్షించాడు. వాళ్ళ పిక్కలకండరాలను పట్టి

జూశాడు. అనేకమంది రైతులను పంక్తిలోనుండి బయటకులాగాడు. వారిలో కొందరిని గుర్తుపట్టింది. మిగతావాళ్ళెవరో ఆమెకు తెలియదు. మరుక్షణంలోనే తేవారును, వృద్ధుడైన మంచూరియా దేశీయుడయిన కెప్టెనును, దాస్వేని బయటకులాగారు. మేయీకి హృదయం కంపించినట్లనిపించింది.

అటుతర్వాత, 'ప్రదర్శనం' కొరకు స్త్రీల ఎన్నిక ప్రారంభ మయింది. వాళ్ళు మేయీని సమీపించగానే, దేశద్రోహులలో ఒకడు, "ఆమె భలే అందగత్తె! ముఖం మలినముగా వుందని మోసపోకండి! ముఖంనిండా మసి పులుముకొంది!" అన్నాడు. అంతకుపూర్వం కుప్పగా ఒకచోట జేర్చబడిన యువతుల గుంపులోనికి మేయీని తోశారు.

సూర్యుడు అస్తమించుతూవున్నాడు. పంక్తినుండి బయటకులాగ బడిన మనుష్యులలో అయిదుమందిని జపానువాళ్లు ఏరారు. అందులో తేవారు, వృద్ధకెప్టెనుకూడా వున్నారు. జపానువాళ్లు వాళ్ళచేతులను భద్ర ముగా వెనక్కువిరిచి కట్టారు. పొలాలలోనికి త్రోసుకెళ్ళారు. దేశ ద్రోహులు పారలుతెచ్చారు. గొయ్యి త్రవ్వమని రైతులనుఆజ్ఞాపించారు రైతులు నిరాకరించారు. ఆ పని చేయుటకు వప్పుకొనేటంతవరకూ, రైతులను నిర్దాక్షిణ్యంగా బందకర్రలతో నెత్తిమీద బాదారు. చావ కొట్టారు.

గోతివద్దకు ప్రప్రథమంగా లాగబడిన బలి- వ్యక్తి, ఒక పసి వాడు. వాడు గుండెలు బ్రద్దలయ్యేటట్లు ఏడ్వసాగాడు. బంధనాలను విప్ప దీసుకోవాలని పెనగులాడాడు.

నిస్సహాయతతో రైతులు భోరున ఏడ్చారు. "వాడు పసిగందు! వాణ్ని వదలిపెట్టండి!" అని బ్రతిమాలారు.

ఆ పసిగాయను జపానువాళ్ళు గోతిలోకి తన్నారు.

రెండవ బలిపశువుగా వృద్ధకెప్టెనును చేశారు. అతడు పళ్ళుబిగించి జపానువాళ్ళవంక ద్వేషంగా చూశాడు. అతడు గోతిఅంచుకు చేరబోయే ముందు, గిర్రున మడిగాలిలాగున తిరిగి ఒక జపానుసైనికుని గజ్జల్లో బలంకొద్దీ తన్నాడు. జపానుసైనికుడు బాధతో నేలకొరిగాడు. ఇతర

శత్రుసైనికులు, వృద్ధకెప్టెనుపై బడ్డారు. తమ సన్నీంతో పొడిచారు గోతిలోనికి అతణ్ణి విసిరేశారు.

జపానువాళ్ళూ, దేశద్రోహులూ పొగలుగ్రక్కుతూ, గోతిలోకి మరిద్దరు మనుషులను విసిరేశారు. అటుతర్వాత అయిదవవాడు కడగొట్టువాడయిన తేవారును ముందుకు లాక్కొచ్చారు. తన్నికులాడుతూ, పెనుగులాడుతూ, తేవార్ శత్రువులను బూతులు తిట్టసాగాడు.

"మీ అవ్వల్ని—! చైనావాళ్ళందరినీ చంపలేరురా! ఇప్పుడో, ఎప్పుడో మీరంతా చస్తారురా...." ఇతరులతోపాటు తేవార్‌నుకూడా గోతిలోనికి తోశారు. కాని, అతడు శత్రువులపై తిట్లదుమారాన్ని ఆపలేదు. జనం కదలసాగారు.

దేశద్రోహులు తొందరగా గోతిని మట్టితో పూడ్చవలసిందిగా రైతులను ఆజ్ఞాపించారు. ఒక్కరూ కదలలేదు. తమంతట తామే పారలు తీసుకొని, దేశద్రోహులు గోతిలో మట్టిపోయసాగారు. వారా విధంగా గోతిలోనివారి గోలను అణచారు. ప్రజలెంత మొత్తుకున్నా ప్రతిమాలినా లక్ష్యపెట్టకుండా ఆ దేశద్రోహులు గోతినిపూడ్చి, కాళ్ళతో మట్టినిగట్టిగా మట్టగించారు;

బాకా ధ్వని వినపడింది. మిగతా ఖైదీలను తీసుకొని జపానువాళ్లు ముందుకు సాగిపోయారు!

జపానువాళ్లు అలా వెళ్ళిపోగానే, ప్రజలు తమ రిక్త హస్తాలతో గోతిమీది మట్టిని పెల్లగించసాగారు. ఒక్కొక్కరినే బయటకిలాగారు. మొదటివాడు ఇప్పటికే చనిపోయాడు. రెండవవాడుకూడా చనిపోయాడు. ఊపిరాడక ఆ అయిదుగురు ఖైదీలూ క్రిందనుండి పైవరకూ నల్లబడిపోయారు.

అయ్యో! గుండెలు బ్రద్దలుజేసే రోదనలు! కన్నీళ్లు కార్చుతూనే, ప్రజలు ఆ అయిదుగురి గోళ్ళల్లోని, ముక్కులలోని మట్టిని తమవ్రేళ్ళతో బయటికి లాగేయసాగారు.

కళ్ళవెంట ఏకధారగా నీళ్లు కార్చుతూ షాంగ్, తేవారు చేతులను పుచ్చుకొని మెల్లగా రుద్ద సాగాడు. నెమ్మదిగా తేవార్‌కి ప్రాణంచేరుకొంది

ఇంకా యిద్దరు బ్రతికారు. కాని మొదటి పసివాడు వృద్ధకెప్టెన్ బ్రతకలేదు.

* * * *

ఖయిదీలను రోడ్డుమీద నడిపించసాగారు. ముందు వరుసలో పురుషులు, వెనుక వరుసలో స్త్రీలు. పురుగురేసి ఖయిదీలను ఒక త్రాటికి కట్టేశారు. వరుసకూ వరుసకూ మధ్యలో జపాను సైనికులు నడుస్తున్నారు. మొగవాళ్ళ చేతులను వెనక్కి విరగదీసి కట్టారు. వాళ్ళ వీపులపై జపానువాళ్ళు తమ సంచీలను వేశారు. అమిత భారంగావున్న ఆ సంచీలను బరువుక్రింద మూల్గుతూ, మొగవాళ్లు కుంటుతూ నడువసాగారు. సంచీల త్రాళ్ళను ఖయిదీల కంఠాలకు తగిలించారు. అవి ఖయిదీలను వూపిరాడకుండా చేస్తున్నాయి.

దాస్వే రెండు తుపాకిగుళ్ళ పటకాలను మాత్రమేగాక ఒక పెద్ద సంచినికూడా మోయాల్సి వచ్చింది. అతని మెడకు ఇవి ఉరిత్రాళ్లగా తయారయ్యాయి. వాటివిగిచే దాస్వేకి వూపిరాడటంలేదు. అతడు మెల్లగా తన గడ్డాన్ని సంచిపటకాక్రిందకు పోనిచ్చి దాన్ని నోటిలోకి తెచ్చుకున్నాడు. నళతో గట్టిగా కరచిపట్టుకున్నాడు. అతడు అవిఘ్నంగా నడుస్తూపోతూ తేవారు వృద్ధకెప్టెన్గురించి తలనోయసాగారు. వేడికన్నీళ్ళతో అతని కళ్ళు తిమిరాంధప్లావితమయ్యాయి. మేయీవంక చూడాలని తల వెనక్కి త్రిప్పాడు. కాని యినుములాంటి జపాను బూటు ఒకటి అతణ్ణి ముందుకుపడేటట్లు తన్నింది.

ఖయిదీలప్రక్కగా పోతున్న జపాను అశ్వికదళం. ధూళి మేఘాలను రేపుతూ, ఖయిదీలను వుక్కిరిబిక్కిరి చేస్తుంది. తెగకారుతూవున్న ముఖంమీద చెమటను, కారుతూవున్న ముక్కులను తుడుచుకోవటానికి మోకాలిని పైకెత్తి దానికి రుద్దుకోవటమొక్కటే వారికిగల మార్గము.

"అయ్యో! వాళ్లు మన పీకలమీద కూర్చుంటున్నారు. వాళ్ళు తమ ఇష్టమొచ్చినట్లు వ్యవహరించటానికి అవకాశంవుంది. దీనెమ్మ యిదేమి

ప్రపంచమబ్బా' జపాను వ్యతిరేకయుద్ధం మూడుదశలగుండా పోవాల్సి వుందనీ, ఈ దశలను గడచిన తర్వాత విజయం తథ్యమనీ చైర్మన్ మావ్ చెపుతున్నాడు. అయితే, మనమెంతకాలం బాధపడాలి? మిడుతల దండులాగున తరుగకుండా వున్నారు జపానువాళ్లు. చిట్టచివరకు మనమే గెలుస్తామన్న విషయము నాకు తెలుసు. నాకు పట్టుకున్న భయమేమంటే ఆ విజయాన్ని చూడటానికి బ్రతికుంటానో లేదోయని!" అని తలవోయ సాగాడు దాస్వే.

వారొక చిన్న గ్రామముగుండా పోతుండగా వారికి నగ్న స్త్రీల గుంపొకటి కనబడింది. ఆ స్త్రీలు భయంతో వణికిపోతూ విల్లోచెట్లకింద వున్నారు. వస్త్రవిహీనలయివున్న ఆ స్త్రీలకు యాభై గజాలదూరములో ఒక దిబ్బమీద జపాను సైనికుడొకడు తన తుపాకి చివర రెండు లాగూలను వ్రేలాడవేసుకొని నిలబడ్డారు. వాడేదో అరచాడు. తనచేతినిఊపాడు. ఆ స్త్రీలందరూ అతనివైపు పరుగెత్తారు. లాగూలకొరకు త్రొక్కిసలాడారు. వాడా లాగూలను చేతనైనంత ఎత్తుగా ఎత్తిపట్టుకొని పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వుతున్నాడు

మరియొక గ్రామములో కొంతమంది స్త్రీలను బట్టలను విప్పదీసి, వాళ్ళచుట్టూ జపాను సైనికులు కాపలాకాస్తున్నారు. వారి మధ్యలో ఒక దేశద్రోహి కొన్ని బట్టలను తన భుజంమీద వేసుకొని ఒకచేతితో రెండు కోడిపిల్లలను పట్టుకొని నిలబడ్డాడు.

"ఈ కోడిపిల్లలను ఎవరు పట్టుకొంటే వారికి బట్టలిస్తాం!" అని గొంతు పగిలేటట్లు అరుస్తున్నాడు. వాడు కోడిపిల్లలను విసిరేశాడు. కోడి పిల్లలను పటుకొందామన్న ఆశతో ఆ నగ్నస్త్రీలు ఒకళ్ళనొకళ్లు తోసు తోసుకొంటూ పరుగెత్తుతూ వుంటే వాళ్ళ నగ్నత్వాన్నిజూచి అమిత సంతోషముగా నవ్వుకుంటున్నారు జపానువాళ్ళు.

మేయీ అవమానంతో క్రుంగిపోతూ మండిపోతున్న హృదయముతో తల త్రిప్పేసుకున్నది. గ్రామములోనుండి స్త్రీల ఏడ్పులు వినవస్తున్నాయి. మేయీ వళ్లు జలదరించినది. తానెలాగయినా ఈ బంధాల

నుండి బయటపడాలనుకొంది. కాని, దారేది? ఆమె వెన్ను ఝల్లుమంది. మణికట్టు బంధాలను సడలించ యత్నించినది. కట్లు కొద్దిగా వదులయ్యాయి. ఆమెకు కొంత ఆశ్చర్యం కలిగింది. కట్లు ఆవిధంగా వదులవుతాయని ఆమె భావించలేదు. ఆమె పెనుగులాడినది. కట్లువూడి క్రిందకు జారిపోయేటంత వదులయ్యాయి. కాని చేతులతు అలాగే వెనక్కుకొంది. ఏమి తెలియనట్లు వూరుకొంది.

ఆ రాత్రి వారు ఒక చిన్నగ్రామములోని ఒక యిరుకుసందుగుండా పోతున్నారు. మేయీ ముతాను కాపలాకాస్తున్న దేశద్రోహి అప్పుడే సందు మలుపు తిరిగాడు. అతని కంటబడకుండా ఖయిదీలగుంపు వెనక బడింది. మేయీ తన చేతులను వదులుచేసుకుంది. రోడ్డుమీదకు లేడి లాగున పరుగె త్తింది. పబ్లిక్ పాయిఖానా దొడ్డిలో దూరింది. ఒకమూల నక్కింది. ఆమె కణతలు కొట్టుకొంటున్నాయి.

ఖయిదీలగుంపు సాగిపోయిన కొన్ని గంటలవరకు ఆమె అక్కడ నుండి కదరలేదు. ఎందువల్లనంటే ఆమెకు జపానువాళ్ళ కేకలూ, అరుపులూ, నవ్వులూ, వాళ్ళ బూట్ల దడదడలూ వినపడుతూనే వున్నాయి. గ్రామములో జపానువాళ్ళు మకాం చేశారేమోనని ఆమె భయపడింది. అంతులేకుండా గంటల తరబడి ఆ పాయిఖానాదొడ్డిలో దాక్కోలేనన్న విషయం ఆమెకు తెలుసు. కొంత సద్దుమణిగేవరకూ మేయీ అక్కడే వుంది. ఆ తర్వాత ధైర్యాన్ని చిక్కబట్టుకుంది. మళ్ళీ వీధిలోనికి గోడకు కరచుకొని నీడల్లో నిశ్శబ్దంగా నడుస్తూ మేయీ గ్రామాన్ని విడిచి వెళ్ళింది. గాఢాంధకారంగావున్న పొలాల్లోపడి వెళ్ళాలి.

అలా పొలాలలో కొంతదూరం నడిచిన తర్వాత ఆమె కూలబడినది. విశ్రాంతి తీసుకోసాగినది. ఆ తిమిరావృతరాత్రిలో తానెక్కడ వున్నదీ మేయీకి తెలియదు. భయభ్రాంతయై ఏకాకిగావున్న ఆ యువతి-మేయీ ఏడ్వసాగినది. దాస్వేకి ఏగతి పట్టినదో అని తలపోయసాగింది. సజీవముగా పూడ్చిపెట్టబడిన వాళ్ళగతి ఏమయిందోనని బాధపడసాగింది.

నిరసముగావున్న ఆ పొలాలలోపడి మేయీ తిండీతిప్పలూ లేకుండా ఆ రాత్రీ, మరునాటి పగలంతా తెగతిరగసాగినది. ఆకలి ఆమె

ప్రాణాలను కొరికేస్తూవుంది. ఆనాటి సాయంత్రము ఆమె ఒక గ్రామము చేరినది. జాగర్తగా ఆ గ్రామంచుట్టూ ఒకసారి చుట్టివచ్చి ఆ గ్రామంలో చడీచప్పుడూ లేకుండా నిశ్శబ్దంగా వుండటంచూసి మెల్లగా గ్రామంలోకి జొరబడినది. ఆ గ్రామం పెద్దబజారునిండా చెల్లాచెదరుగా డబ్బాలుపడేసి వున్నాయి పందుల బొమికెలూ, కోడిపిల్లల బొమికెలు చెల్లాచెదరుగా పడివున్నాయి. ఈకెలు వొయ్యారముగా వేసంగిగాలిలో కదులుతున్నాయి. అన్నిదిక్కులా కాలిపోయిన యిళ్ళూ, కూలిపోతున్న కొంపలూ కానవస్తున్నాయి. కాలిపోయిన కొన్ని యిళ్ళనుండి పొగ యింకనూ చుట్టలుచుట్లుగా పైకెగయుచూవుంది. ముక్కుగోళ్ళూ ఘాటైనవస్తువులు కాలిపోయిన వాసన తగులుతూవుంది. అక్కడక్కడ రక్తం గుంటలు కట్టివుంది. అదింకా ఆరలేదు. ఈ దారుణ దృశ్యాన్ని చూసేసరికి మేయీకి తలతిరిగింది. ఆ వీధినుండి ప్రక్కసందులో పడిపోయింది. తగలబడకుండావున్న ఒక కొంపను సమీపించినది. మెల్లగా తలుపుకొట్టింది.

నలభైయేళ్ళ వయసుగలిగిన ఒక స్త్రీ తలుపు సందులోనుంచి చూసినది. మెయీ ఒక్కతే వచ్చినదని చూసి, ఆమె మేయీని లోనికి రానిచ్చినది. మేయీకి ఆమె రెండు బియ్యపురొట్టెలనూ, త్రాగటానికి వేడినీళ్ళనూ యిచ్చినది. అలాంటి కమ్మని రొట్టెలను జీవితములో తానెప్పుడూ తినలేదనిపించితిది మేయీకి. రొట్టెలను తింటూనే మేయీ ఆమెను జపానువాళ్ళగురించి అడిగినది.

ఆమె తలత్రిప్పుతూ "వాళ్ళు ప్రొద్దున్నేవచ్చారు. సాయంత్రము వరకూ గ్రామాన్ని విడిచిపోలేదు. అదంతా ఘోరం! మమ్మలనందరినీ చుట్టుముట్టేశారు. ఎవరైనా బాలూని దాస్తూవుంటే వప్పజెప్పండి. లేకపోతే మీ కుటుంబములోని వాళ్ళందరి తలలు ఎగిరిపోతాయ్! ఇల్లు తగలబెడతామని బెదరించారు. అయ్యొయ్యో! ఏమిజెప్పను. ముగ్గుర్ని నడిబజారులో చంపేశారు. ఇద్దరి తలలను నరికేశారు. ఆ తర్వాత మా పొరుగింటివాళ్ళ పిల్లాడు రెండేళ్ళవాడు-పాపం! చాలా మంచిపిల్లాడు. ఒక జపానువాడొచ్చి వాడిని కాళ్లు పుచ్చుకొని ఈడ్చికెళ్ళాడు. మెడవరకూ

రెండుగా చీల్చేశాడు. ఎంత రక్తం కారిందనుకున్నావ్! ఏమి చేయాలో నాకు తోచలేదు. పారిపోదామంటే ఎక్కడా చోటులేదు. ఉండిపోదామంటే భయం!"

మేయీకి ఆకలి మిక్కుటముగా వున్నది. కాని ఈ విషాదగాథ వినేసరికి రవ్వంతయినా తినలేకపోయింది. విషాదసముద్రములో మునిగిపోయి ఆ స్త్రీలిద్దరూ కొద్దిక్షణాలపాటు నిశ్శబ్దంగా వూరుకొన్నారు. తన మనస్సునావరించిన విచార మేఘాన్ని బలవంతముగా పారద్రోలినది మేయీ.

"వాళ్ళపని పట్టిద్దాంలే!" అని మేయీ ఆమెను వోదార్చింది. "ఈ దశను దాటామా మనకు మంచిదినాలు తప్పక వస్తాయి" అన్నది మేయీ.

ఆ మాటలను విన్నవెంటనే ఆ స్త్రీ మేయీని ఒక కార్యాకర్తగా అనుమానించింది. ఆ స్త్రీకి అమితముగా భయమేసినది. "ఇది నీకు మంచిచోటు గాదు!" అని అరచినది. "రొట్టెలను త్వరగా తిని పారిపో!"

"కాని శత్రువులు ప్రతిచోటా వున్నారు" అని మేయీ బ్రతిమాలి చెప్పింది. "ఎక్కడికి పోవాలి? కనీసం నన్ను ఒక రాత్రయినా ఇక్కడ వుండనీ! మేం జేసేపనంతా ప్రజలకొరకే:— నీలాంటివాళ్ళ కొరకే! ఎవరైనా వచ్చి అడిగితే యింకో గ్రామమునుండి వచ్చిన నీ మేనకోడల్ని అని చెప్పు. మీకేమి జరగదని వాగ్దానంచేస్తున్నా!"

ఆ స్త్రీ హృదయము కరిగింది. కాని ఆమెను భయము పట్టుకొని పీడిస్తూ వుంది. ఒక నిర్ణయానికి రాజాలక వూగిసలాడసాగింది.

కళ్ళవెంట నీరుకార్చుతూ మేయీ "శత్రువులతో పోరాడేవాళ్ళం మేయీ, ప్రజలైన మీరు ఒకే కుటుంబం వాళ్ళము. శత్రువుల క్రూర హస్తాలలో పడవలసినదిగా ఎలా చెప్పగలుగుతున్నావమ్మా?" అన్నది.

తల్లిలాగా ఆప్యాయంగా మేయీ భుజాలపైన తన చేతులను

వుంచుతూ ఆ స్త్రీ "అలా అనబోకు తల్లీ! నేను భరించలేనమ్మా! నువ్వి క్కడేవుండు!" అని బ్రతిమాలింది. తన కొడుకు ఏదో గ్రామం వెళ్ళాడనీ, తన కోడలు పుట్టింటికి వెళ్ళిందనీ తాను, తన భర్తాతప్ప యింట్లో ఎవ్వరూ లేరని ఆ స్త్రీ చెప్పింది.

ఇంతలోనే అకస్మాత్తుగా వారికి కదంతొక్కుతూ నడుస్తూవున్న పాదాలసవ్వడి, రోడ్డు గులకరాళ్ళమీద బరువైన చక్రాలు దొర్లుతూవున్న చప్పుడు వినవచ్చింది. ఆ స్త్రీ బయటికి పరుగెత్తిపోయింది. కాంపౌండ్ గేటుకు తాళంవేసి గట్టిగా బిగించింది. ఉక్కిరిబిక్కిరవుతూ పాలిపోయిన ముఖంతో తిరిగి పరుగెత్తుకొచ్చింది.

"తిరిగి జపానువాళ్ళు వస్తున్నారు. వూఁ, త్వరగా గదిలోకి పద!" అని రొప్పుతూ చెప్పింది.

మేయిని ప్రక్కగదిలోకి నెట్టింది. కాంగ్‌మీద పడుకోవలసిందిగా చెప్పింది. చినిగిపోయిన బొంతలో మేయిని కప్పింది. వేగంగా పరుగెత్తిపోయి కుండెడు మురికినీళ్ళు తెచ్చి నేలమీద కాంగ్‌వరకూ పోసింది. దానిమీద కచ్చికల బూడిద చల్లింది. ఒక పగిలిపోయిన టీ కుండను, పగిలిన ముంతనూ మేయి తలగడదిండు ప్రక్కగా వుంచినది. గబ్బుకంపుకొట్టే పాత చెప్పులను కాంగ్‌కుదగ్గరగా వుంచింది.

పొరుగువారి తలుపుపై దడదడ గ్రుద్దిన చప్పుడు వాళ్ళకు వినవస్తూవుంది. పురుషుల కేకలు, పెడబొబ్బలూ, తిట్లూ వినపడుతూ వున్నాయి. ఈ ధ్వని ప్రారంభంకాగానే, ఈ ఇంటియజమాని పొరుగు వాని సరిహద్దు గోడఎక్కి తనయింట్లో ప్రవేశించాడు.

పడక గదిలో ప్రవేశించగానే అతడు "వాళ్ళు ప్రతి ఇల్లూ సోదా చేస్తున్నారు." అని వూపిరాడకుండా చెప్పాడు. అటు తర్వాత యిటు తిరిగి జూచాడు. మేయీ అతని కంటపడింది. ఆమెను చూడగానే ఆశ్చర్యముతో నోరు వెళ్ళబెట్టాడు. "ఏంజేస్తున్నావిక్కడ?" అని గద్దించాడు మేయీ జవాబు చెప్పలేదు. నిస్పృహగా అతను నేలమీద కాళ్ళు దట్టించాడు. 'ఇక్కడినుంచి పో! త్వరగా పో! మా నెత్తిమీదకు తీసుకొద్దా

మనుకున్నావా?' అని ఇనకొట్టాడు. "వాళ్లు ఇళ్ళు తగులబెడతారు. హత్యలు జేస్తారు. ఈ విషయము నీకు తెలియదూ?"

మేయీ కన్నులలో నీళ్ళు గిర్రున తిరిగాయి. లేచి కూర్చుంది. ఆమె జవాబుచెప్పే లోపలనే బయట తట్టుమారం రేగినది. కాంపౌండు తలుపు బండకర్రతో బాదిన ధ్వని రాసాగినది.

"వీళ్ళమ్మ!....లంజ.... ఎవళ్ళురా! తలుపేసింది. తియ్యరేం? బతకదలచుకొన్నారా లేదా?" అని రాక్షసకంఠం అరచినది.

ఆ యిల్లాలు తన భర్తను ప్రక్కకు తోసింది. మేయీని కాంగ్‌మీద పడుకోబెట్టింది. తలనుండి కాళ్ళవరకూ పాత బొంతతో కప్పేసింది.

బయటి తలుపుమీద కొట్టటం ఎక్కువయింది. ధన్‌మంటూ తలుపు బ్రద్దలై పడిపోయింది. ఎనిమిదిమంది జపానువాళ్లు, దేశద్రోహులూ గది లోకి తోసుకొంటూ వచ్చారు. బాలూచి దాచారంటూ ఆ దంపతులను బండబూతులు తిట్టసాగారు. మేయీకి బొంతలోనుండి తలను పైకిపెట్టే ధైర్యం లేకపోయింది. కాని యింటిలోని సామానులు బ్రద్దలవుతూన్న ధ్వని వింటూనేవుంది. ఆ ఇంటియజమాని తనగుట్టు బయటపెడ్తాడేమోననే భయంతో గజగజ వణికింది. "ఎందుకు వణుకుతావ్? నీకు నావుమూడితే చస్తావ్!" అని మేయీ తనలో తాను తిట్టుకోసాగింది. వెంటనే ఆమె మంచుగడ్డలాగా ప్రశాంతిని చేపట్టింది.

"మేము రైతులము మాత్రమే. బాలూ సంగతి మాకేమి తెలుసుంది?" అని యింటి యజమాని జవాబు చెపుతున్నది. మేయీకి విన పడుతూనే వుంది.

డబ్బుయిమ్మని జపానువాళ్ళు యింటి యజమానిని డిమాండు చేశారు. అతను యివ్వకపోయేసరికి అకన్ని బాదారు. అటు తరువాత వాళ్ళు గాంగ్ పైపుగా పోయారు. "బాలూ బాలూ," అని అరచారు.

ఇల్లాలు చెవిటిదానిలాగా నటించింది. "నాకేమి అర్థంగావటంలేదు" అని అరచింది. "మీకేం కావాలి?"

జపానువాళ్ళ నాయకుడు కంపుకొడుతూవున్న చెప్పుల వంక చూశాడు. కాంగ్‌చుట్టూవున్న మురికిని చూశాడు. "అదేమిటి?" అని దూరివున్న పీలికలమూటవంక చూస్తూ అడిగాడు.

"నా మేనగోడలు" అని యిల్లాలు గర్జించింది. "జబ్బుగావుంది. రోజులతరబడి తిండి తినటంలేదు....యిప్పుడే మందు తాగింది!"

"బాలూ!" అని నొక్కిచెప్పసాగాడు జపానువాడు. తనసన్నీతో బొంతను లాగాలని చూశాడు ఆ జపానువాడు. కాని లోపల మేయీ బొంతను గట్టిగా పట్టుకుంది ఒక దేశద్రోహి ముందుకువచ్చాడు. తన చేతులతో బొంతను చింపి లాగాడు. ఒకమూల పారేశాడు.

"కప్పేయ్!" అని బ్రతిమాలింది యిల్లాలు. "ఇప్పుడే మందు తాగింది. జలుబుపడుతుంది. కప్పేయ్!" అని బ్రతిమాలింది.

మేయీ తలక్రిందనుండి దేశద్రోహి దిండును లాగేశాడు. ఒక మూలకు విసరేశాడు. బుర్ర చెడగొట్టుకోకుండా మేయీ జాగ్రత్తగా మెలగింది. జలహీనంగా దగ్గిసాగినది. మూర్ఛపోతున్నట్లుగా కళ్ళు మూసింది.

"ఓపికపట్టమ్మా పిచ్చితల్లీ!" అంటూ మేయీ నుదురును రాస్తూ ఆ యిల్లాలు యేడ్వసాగింది. "తాగటానికి నీళ్ళు కాచి యిస్తానులేతల్లీ! యిప్పుడే యిస్తాగా!"

బొంతను మరల మెయీపై కప్పుతూ నా మేనగోడలు జబ్బుగా వుందని యింటి యజమానిని గొణుగుతూవుంటే జపానువాళ్ళ నాయకుడు వెక్కిరింతగా చూడసాగాడు.

"మహిళాసంఘం!" అని బొబ్బరించాడు జపానువాడు. వాడికింకా అనుమానం తీరలేదు.

"ఏమంటున్నావ్? నీకు తినుబండారాలు కావాలా? మా యింట్లో అట్టై సరుకులేదు. అయినా చూస్తాను వుండు" అని అంది ఆ "చెవిటి" యిల్లాలు.

"పోదాం పదండి!" అన్నాడు ఒక దేశద్రోహి. వాడికి యిక్కడ

వుండటం రోత అనిపించింది. "ఇక్కడేం గిట్టుబాటుకాదు. శ్రమదండుగ తప్ప మరేంలేదు. అంతేగాక, ఇక్కడ కంపుకొడుతూ వుంది."

దాడినిసిన ఆ ఘాతుకదళం జపానుభాషలో తిట్టుకొంటూ కోపంగా వెళ్ళిపోయింది. వాళ్ళ వెనకాలే యింటి యజమాని వచ్చి తలుపు మూసేశాడు.

స్వేచ్ఛగా వూపిరిపీల్చుకొంటూ ఆ యిల్లాలు "యివ్వాళ మనకందరికీ మూడిందనుకున్నా!" అన్నది.

మేయీ చివాలున కాంగ్‌మీదనుండి లేచింది. తన చేతులను ఆ యిల్లాలి మెడచూట్టూ పెనవేసింది. కృతజ్ఞతాపూర్వకంగా "యీ విషయాన్ని నా జీవితంలో మరచిపోను తల్లీ! నీవు నా రెండవ తల్లివి!" అన్నది మేయీ.

"మొట్టమొదట నేను పరిస్థితులను బాగా అర్థంజేసుకోలేకపోయాను. అందుకు విచారపడుతున్నాను కామ్రేడ్" అని ఆ యింటి యజమాని క్షమార్పణ వేడినాడు. "నన్ను క్షమించాలి" అన్నాడు.

"ఆ విధంగా అనవద్దు మామా" అన్నది మేయీ. "నేను మీకు ఎంతో బాధను, ప్రమాదాన్ని కలిగించాను....నన్ను క్షమించండి. పరిస్థితులు యీనాడు చాలా క్లిష్టంగావున్నాయి. కాని పరిస్థితులు కుదుటపడగానే మళ్ళీ యిక్కడికి తరచుగావచ్చి మీ యిద్దరికీ సవ్యంగా అభివందనాలర్పిద్దామని వుంది."

మేయీ ఆ రాత్రిమాత్రమే అక్కడ గడుపుదామనుకుంది. కాని ఆ మరునాటి ఉదయం జపానువాళ్ళు యింకా ఆ గ్రామం విడిచిపోలేదని వారికి తెలిసింది. ఏమైనప్పటికీ ఆమె అక్కడనుండి వెళ్ళిపోదామని నిశ్చయించుకొంది. సురక్షితమార్గాన్ని ఆ యింటి యజమాని వెదకి వచ్చాడు.

జపానువాళ్ళు ప్రొద్దుటిభోజనం చేయటానికని ఒకచోటగుమిగూడియున్న సమయంలో మేయీ మెల్లగా గ్రామీణ ప్రాంతంలోకి జారుకొంది.

పొలాలలో గోధుమ విరగబడి తల భారంతో వూగుతూవుంది.

ధాన్యం మొక్కలచుట్టూ కలుపుమొక్కలు తెగ పెరిగాయి. పొడునాటి కోయల్వియాంగ్ పంటమొక్కలచుట్టు కలుపుమొక్కలు విపరీతంగా వున్నాయి.

కాని వాటిని పెరికివేసే నాథుడేడీ? భయభ్రాంతులై పంటపొలాల్లో తలదాచుకొంటూవున్న వందలాది రైతులు మేయీకి అగుపించారు. ఏడుస్తూవున్న పసిపిల్లల నోళ్ళల్లో స్తనాల బొడపెలనుదోపి తల్లులు వాళ్ళ నోళ్ళుమూస్తున్నారు. కాని పాలుతాగుతూవున్న పిల్లల ముఖాలపై తల్లుల కన్నీళ్ళు ఏకధారగా పడుతున్నాయి. శత్రువుల అశ్వికదళాలు, శకటాలు రోడ్లమీద ముందుకూ వెనుకకూపోతూవుంటే నిశ్చేష్టితంగా వూపిరైనా పీల్చుటకు ధైర్యంలేకుండా కాందిశీకులు వాటిని భయభ్రాంతులతో చూస్తున్నారు.

మధ్యాహ్నమయేసరికి గోధుమ పొలాలకు దగ్గరలో తుపాకుల మోత వినవచ్చింది. గోధుమకంకులపైనుండి జాగ్రతగా చూడసాగింది మేయీ. రోడ్డుకు దిగువభాగంలో జపానువాళ్ళ పటాలమొకటి బ్లాకీత్సేను, అతని అనుచరులనూ వేటాడుతూవుంది. పరుగెత్తుతూ యిరుపక్షాలవాళ్ళూ తుపాకులు పేల్చుతున్నారు. జపానువాళ్ళ మెషిన్‌గన్నొకటి మొరగ సాగింది. తన కామ్రేడ్స్‌యొక్క దౌర్భాగ్యపరిస్థితిని జూచి మేయీ హృదయం ఎగిరిపడింది. కాని బ్లాకీత్సే తన అనుచరులను ఏదో ఆజ్ఞాపించాడు; చేయివూపాడు; అతని అనుచరులు వెంటనే రోడ్డుకుసూటిగా ఎదురుగావున్న పొలాలకు అడ్డంపడ్డారు. తన అనుచరుల పలాయనానికి రక్షణ కల్పించుటకుగాను బ్లాకీ తన రెండుచేతులతోనూ రెండు పిస్తోళ్ళను పుచ్చుకొని, అక్కడే నిలబడి శత్రువులపై కాల్చసాగాడు.

ఒక ఫిరంగి బ్రద్దలవుటతో దాని ధ్వని ఘోరంగా నలుమూలలా వ్యాపించింది. బ్లాకీకి సూటిగా వెనుకభాగంలోవున్న ఒక చెట్టు తునాతునకలై గాలిలోకి ఎగిరింది. మేయీకి, ఈ దృశ్యాన్ని చూడగానే ముచ్చెమటలు పోశాయ్. బాకీ ఎగిరిగంతేశాడు. అతని బట్టలకు నిప్పంటుకున్నది వంకరటింకరగా పరుగెత్తాడు. చినిగినగుడ్డలతో పరుగెత్తిపోతున్నాడు.

అతని మెడమీద, భుజాలమీద గాయాలయ్యాయి. గాయాలనుండి రక్తం కారుతూ వుంది.

ఇతర గెరిల్లాలు యిదివరకే పారిపోయారు. రమారమి రెండు వందలమందికి పైబడిన సంఖ్యలో జపాను సైనికులు, ప్లాకీని పట్టుకోటానికి కేంద్రీకరించారు. బాగా ఎత్తుగాపెరిగిన కోయిలియాంగ్ పంటపొలాలలోపడి పారిపోయాడు బ్లాకీ. మేయీకి అగుపించిన కడగొట్టు దృశ్యమిదే. జపానువాళ్లు బండబూతులు తిట్టుతూ అతని వెంటపడ్డారు. ఫిరంగి గుళ్ళు ఘోరంగా అరుస్తున్నాయి.

* * * *

లక్ష్యశూన్యంగా, అనేకమంది కాందిశీకులు దిమ్మరజొచ్చారు. ఒకనాడు పోతూ పోతూ మేయీ, అకస్మాత్‌గా నియూరిని కలుసుకుంది. ఆ యువతులిద్దరూ ఒకళ్ళనొకళ్ళు కావలించుకొని ఏడ్చారు. కొంతకాలంపాటు వాళ్ళిద్దరూ ఆకలేసినప్పుడు పస్తుపెట్టుకుంటూ ఒకేచోట వుండగలిగారు. కాని, వారు ఒకనాడు ఒక జపానుదండు వున్నచోటకు పొరబాటున వెళ్ళారు. భయంతో చెల్లాచెదరుగా పారిపోయారు. యెవరి దారి వారిది అయింది.

కొంతసేపైన తర్వాత అలసిపోయిన మేయీ, మూలికలు ఏరుకొంటూవున్న ముసలిదానిని కలుసుకొంది.

"తల్లీ! నాకు దిక్కెవరూ లేరు. ఒక్కపనిచేసిపెట్టమ్మా! నన్ను మీ యింటికి తీసుకొనిపో, నీ కూతురుగా బ్రతుకనీ" అని ఆ ముసలమ్మను బ్రతిమాలింది మేయీ.

ఆ ముసలమ్మ జాలిపడింది. మేయీని వెంటబెట్టుకొని ధ్వంసమైపోయిన ఒక గ్రామంలోని శిథిలమైనపోయిన ఒక కొంపలోకి తీసుకొనిపోయింది.

రెండురోజులు గడచినతర్వాత ఆ ముసలమ్మ, మేయీ ఒక

కార్యకర్తయని కలిపెట్టింది. ఆ ముసలమ్మకి భయం లంకించుకొంది. తన యిల్లు విడిచిపోవలసినదిగా ఆజ్ఞాపించింది.

"చూడమ్మా! బయట గాఢాంధకారంగా వుంది. విపరీతముగా వర్షం కురుస్తూవుంది. ఇలాంటి సమయంలో ఎక్కడికి పొమ్మంటావమ్మా" అన్నది మేయీ అతి విచారంగా.

ముసలిది భయంతో వణికిపోయింది. "నీవు తప్పక వెళ్ళిపోవాలి. మొన్నటిరోజున ఇలాగే ఒకామె ఒక బాలూకి రక్షణయిచ్చింది. ఆమె కుటుంబములోనివాళ్ళ తలలన్నీ ఎగిరిపోయాయి. ఆమె కోడలి స్తనాలను కోసేశారు... ఆమె మర్మస్థానాలను కోసి ముక్కలుచేసిపారేశారు.... నీవు పోకపోతే నేను భరించలేను" అన్నదా ముసలిది.

తెల్లవారేవరకూ వుండనిమ్మని మేయీ ఎంతో జాలిగా బ్రతిమాలింది. ముసలిది ససేమిరా అంది.

"జపానువాళ్ళు.... వాళ్ళనుజూస్తే నాకు భయం—అంతేగాని నేను కఠినహృదయురాలినని అనుకోబోకు—"—అన్నదా ముసలిది నీళ్లనిండిన కళ్ళతో. ఆమె తలుపుతెరచి మేయీని బయటకునెట్టింది.

వర్షంలో తడిసిముద్ద నిర్జనంగాపడివున్న వీధిలోపటి హోరున వీస్తున్నగాలికి ఎదురీదుతూ వర్షధారలదెబ్బకు కళ్ళు కనబడకుండావున్నా మేయీ ముందుకుసాగింది.

ఆమె తట్టిన ప్రతి యింటితలుపూ గట్టిగా మూసుకొనివుంది. ఒక్కటూ తలుపు తెరవలేదు. వీధిలో కంటికి ఒక్కమనిషైనాఅగుపించలేదు. ఆమె వళ్ళంతా వర్షంతో తడిసిపోయింది. చలి పీక్కుతినసాగింది. గ్రామంచివరవున్న ఒక దేవాలయానికి చేరింది. అందులో తలదాచుకొందామనుకొంది. దేవాలయంలో ప్రవేశించిందోలేదో యింతలోనే అత్యద్భుతమైన ఒక మెరుపు మెరిసింది. ఆ మెరుపుకు గదియంతా వెలుగుమయమైంది.

పచ్చని ముఖంగల పెద్దరాక్షసిలాంటి విగ్రహం కానవచ్చింది. ఆ విగ్రహం నోరు భయంకరముగా తెరచుకొనివుంది. ప్రజ్వలిత నయనాలతో ఆ విగ్రహం తన్ను పరీక్షించుతూవున్నదా అనుకొంది మేయీ. ఆ

విగ్రహం కుడిచేతిలో పెద్ద గదవుంది. చేయెత్తి కొట్టబోతూవుందా అనిపించింది మేయీకి. ఆ క్షణంలో ఆమె బుర్రలో తాను చిన్ననాడు విన్న కట్టుకథలన్నీ పిచ్చిగా పరుగెత్తసాగాయి. ఆమె తలవెంట్రుకలు నిక్కబొడుచుకొన్నాయి. భయంతో అక్కడినుండి పారిపోయింది.

నిస్పృహ నైరాశ్యాలు భయసంభ్రమాలు మేయీని ఆవరించాయి. దేవాలయప్రాంగణంలో ఒకమూల వొదిగింది. మేయీ ఏడ్వసాగింది. జపానువాళ్ళు ఎక్కడబడితే అక్కడే కనిపిస్తున్నారు. వాళ్ళను వోడించేదెలా? ఆమె కామ్రేడ్స్—దాస్వే, షావ్యాంగ్, ప్లాకీత్సే—అందరూపోయారు బహుశా చచ్చిపోయారేమో! తానొక్కతే మిగిలింది. అర్ధరాత్రివేళ బయటికి నెట్టబడిందిగదా! జపానువాళ్ళు తన్నుపట్టుకొని చంపేసినట్లయితే ప్రతిఘటనయుద్ధంలో తాను తన జీవితాన్ని అర్పించినట్లు సాక్ష్యమిచ్చేదెవరు? తాను గట్టిగానూ పట్టుదలగానూ వుండగలనని వాగ్దానం చేసింది గదా! ఆ వాగ్దానం చెల్లించుకొనే వైనమేది?

రెండు సంవత్సరాలక్రితం తన తల్లి చచ్చిపోయింది. చచ్చిపోయే ముందు ఆమెను చూడటం పడలేదు. క్రూరాతిక్రూరుడు. నిర్దాక్షిణ్యాగ్రేసర చక్రవర్తి జినంగ్ హస్తాలలో చనిపోయిన తన బిడ్డనుగురించి వాపోవసాగింది. ఘోరాతిఘోరంగా పీడింపబడుతున్న ప్రజానీకపు కన్నీటిధారలు లాగున ఏకధారగా వర్షంకురుస్తూవుంటే ఆమెలో కోపం, కాఠిన్యం, బాధ ఉవ్వెత్తుగా పెరుగసాగాయి.

దుఃఖంతో మేయీ వూగిపోయినది. దృఢమనస్కురాలైన ఆమె విచలితమనస్కురాలయింది. స్థిరచిత్తయైన ఆమె కంపితచిత్తయయింది. బరువులెత్తే యంత్ర మొకటి ఆవరణకు ఆవలివేపున కనిపించిందామెకి. దానిక్రింద తప్పకుండా ఒక బావి వుంటుందని మేయీకి తెలుసు. నిస్పృహ నైరాశ్యాలు ముప్పిరిగొన గుండెలు బద్దలయ్యేటట్లు ఏడుస్తూ మేయీ నూతిలోదూకి ఆత్మహత్య చేసుకొందామని అటువైపుగా పాకిపోయింది.

మెరపు చాలాదగ్గరగా మెరిసింది. ఆమె భయంతోబయలుదేరింది. భయంకరంగా కొట్టుకొంటూవున్న తన హృదయాన్ని నెమ్మదిపరచుటకు ఒక్కక్షణమాగింది.

అణచిపెట్టదామని యెంత యత్నించినా ఆమె హృదయములో కొన్నిభావాలు పైకి తన్నుకొస్తూవున్నాయి. ఆమె ఒక కమ్యూనిస్టు; చైర్మన్ చిత్రంఎదుట శపథముతీసుకుంది—గట్టిగా నిలబడాలనీ నిస్పృహ నైరాశ్యాలకు లొంగిపోవలదని ఆమె నాయకులు నొక్కివక్కాణించారు. ఫలశూన్యమైన ఆత్మహత్యవలన ప్రయోజనమేమిటి? మండుటెండలో ఇసుక ఎడారులను పిక్కుతినే చలిగాలిలో మంచుకొండలను ఎర్రసైన్యం దాటిన వైనాన్నిగురించి కథలనేకం!

అమిత కష్టదినాలలో ఎర్రసైనికు లేవిధంగా గట్టిగా పట్టుదలతో నిలబడిందీ బ్లాకీ ఆమెకుచెప్పాడు. గాయాలవెంట రక్తంకారుతూవున్నా లక్ష్యపెట్టకుండా వందలాది జపానువాళ్ళను యెదిరించి బ్లాకీ ఏకాకిగా నిన్నగాక మొన్న పోరాడిన దృశ్యం ఆమెకు జ్ఞప్తికివచ్చింది.

ఆత్మహత్యచేసుకోవటం ఎంత అవమానకరమో ఆమె గుర్తించింది. నేను చచ్చానా ఆ చావుకు విలువుండాలి! చస్తే ప్రజలకోసం చావాలి!

దిగ్భ్రమతో బలహీనంగా ఆమె చాలాసేపు నూతిగోడను ఆనుకొని నిలబడింది. చలిగాలి తడిసిముద్దయిన ఆమె బట్టలకుతగిలి వళ్ళను ఝల్లుమనిపించింది.

ఆమెకు మెలుకువ వచ్చింది. చలితో గజగజ వణుకుతున నడక సాగించింది. ఆమె ఆవరణలో ఒకమూలకు పాకిపోయింది. పూర్తిగా అలసిపోయిందేమో ఆమె వళ్ళుతెలియని నిద్రలో మునిగిపోయింది.

తెల్లవారినతర్వాత వర్షం ఆగింది. మేఘాలు తొల్గాంది. తడిసి ముద్దయిన ఆమె బట్టలు చల్లగా వంటికి అంటుకుపోయివున్నాయ్. జపానువాళ్ళ కావలావాళ్ళు చూస్తారన్నభయంతో ఆమె ఆ గ్రామాన్నివిడిచింది. నడిచి నడిచి పాడుబడ్డ ఒక భవనాన్ని జేరుకొంది ఆ భవనముఆవరణలో ఒక తోట వుంది, ఆ తోటలో ఒక చిన్నగుడిసె వుంది. ఆ గుడిసె

ద్వారబంధంవద్ద నియూరి, మరియు కార్యకర్తలబడిలోని ఆమె స్నేహితులు— తియాన్ టీచర్ మిస్‌చెన్‌లు నిలబడివున్నారు. ఎన్నాళ్ళక్రితమో విడిపోయి కలిసిన బంధువులులాగున ఆ స్త్రీలు ఒకరినొకరు కౌగలించుకొన్నారు. వారి కళ్ళవెంట ఆనందబాష్పాలు కురిసినాయి.

"మీ రందరూ బాగా చిక్కిపోయారు!" అన్నది మేయీ విచారముగా.

"నీవూ చిక్కిపోయావు" అన్నారు వారు.

ఆమెను తడిబట్టలు విప్పేయమన్నారు. పొడిబట్టలు యిచ్చారు. ఆరేసిపెట్టారు.

జపానువాళ్ళ బారినుండి తప్పించుకోటానికి ఒక గోడఎక్కి దూకే సరికి మిస్‌చెన్‌కు కాలు బెణికిందనిచెప్పారు. తియాన్ కడుపులోనొప్పితో బాధపడుతూ వున్నది. ఇన్ని బాధలు పడుతూవున్నా వాళ్ళందరూ ఉత్సాహంగా వున్నారు.

"నా మూట నా కిప్పుడుంటే చాలాహాయిగావుండేదాన్ని" అన్నది నియూరి వేళాకోళంగా. "మేయీ! నీకు జ్ఞాపకంవుందా? ఆరోజున మనం జపానువాళ్ళనుజూచి పారిపోయాం. మనిద్దరం వేరుపడ్డాం. అప్పుడు నా మూట నెక్కడో మైదానంలో జారవిడిచా. దానిలో నా వస్తువులన్నీ వున్నాయ్. రెండు పగళ్ళూ, రెండు రాత్రిళ్ళూ తిరిగితిరిగి అక్కడికేవచ్చి చేరాను. ఎలా వచ్చానో అడుగబోకు—నా మూట అక్కడేవుంది. మళ్ళీ పరుగుచ్చుకొన్నాను. దీనిమంపతెగా, ఎక్కడో జారిపోయింది." అన్నది నియూరి.

ఆ యువతులు గలగల నవ్వారు.

"అంత బిగ్గరగా నవ్వబోకండి! మనం పెద్దరోడ్డుకు దగ్గరగానే వున్నాం. మనం ఇక్కడనుంచి వెళ్ళిపోవటం చాలామంచిది" అని మిస్‌చెన్ హెచ్చరించింది.

వారు బయలుదేరారు. మేయీ, నియూరీలు టీచరుకు సాయంగా నడుస్తున్నారు. తియాన్ ముందుకువొంగి నడుస్తూవున్నది. రెండు చేతుల లోనూ కడుపును అదిమిపట్టుకొని నడువసాగింది.

"ఈ నా వీపు నా కొరకు హెచ్చరిక" అని ఆమె మూల్గింది. "ఏం జేసినాసరే, నడుము ఎత్తలేను. నిజంగానే!" అన్నది.

అల్లరిపిల్ల నియూరీ వెంటనే వెక్కిరింతగా తియాన్‌ను అనుకరించింది. నవ్వుపుట్టించేటట్టు మూలుగులు సాగించింది. ఆమె వెక్కిరింతనుజూచి అందరికీ కడుపుబ్బ నవ్వు వచ్చింది. కాని ఆపుకొన్నారు. వాళ్ళ మొగాలు కందగడ్డలాగున ఎర్రబడ్డయ్. మిస్ చెన్, ఆమెను సాయపడుతున్న ఆ యిద్దరు యువతులు తడినేలమీద కాళ్లువేశారు. బురదలోకి జారిపడ్డారు. వాళ్ళ గుడ్డలన్నీ బురదతో నిండిపోయాయ్. బురద పూత పూసినట్లయింది. ఇంత బురదవచ్చి నియూరీ ముక్కుమీదపడింది. నవ్వు ఆపుకోలేకపోయారు. పొట్టచెక్కలయ్యేటట్లు నవ్వారు.

పల్చని నియూరీ వంటికి అంటుకొన్న ఎర్రబురదను చూపిస్తూ "మంచిశాస్తి జరిగింది" అని తియాన్ కిలకిల నవ్వింది. "నన్ను వెక్కిరించినందుకు శాస్తి. మేకపిల్ల లేమంటాయో తెల్సా! నా మాటను అనుకరించావంటే నీ నోరు కుళ్లుతుంది. నా నడకను అనుసరించావంటే, నీవు పనుపుకుక్క వవుతావ్. యిప్పుడు నువ్వు పసుపుపచ్చగా వున్నావ్."

నవ్వుతో పొట్టచెక్కలవుతూ వాళ్లు మిస్ చెన్‌ను లేవదీశారు. నియూరీ ఆమె చేతులుపట్టుకొంది. మేయూ ఆమె కాళ్లుపట్టుకుంది. క్రమంగా వాళ్ల శత్రువుల చూపు కందకుండా గోధుమపొలాడలోనికి పోయారు.

"మేఘంమీద స్వారీచేస్తూపోయిన నాటకములో నాయిక లాగున వుంది నా కిప్పుడు" సుఖంగా నిట్టూర్చుతూ మిస్ చెన్ అన్నది.

ఏ గ్రామంలోకి పోవుటకూ ధైర్యంచాలక వాళ్ళు కొన్ని దినాల పాటు పొలాలలోనే తిరుగసాగారు. అయితే, వాళ్ళకు అక్కడ తినటానికిగానీ, తాగటానికిగానీ ఏమి దొరకలేదు.

వారికి ఎవరైనా ఒకరైతు కనిపిస్తే, అతనివద్ద ఒకరొట్టె ముక్క ఎత్తేవారు. అందరూ సమానంగా పంచుకుతినేవారు. అందులో ప్రతి వొక్కరూ పెద్దముక్కలను యితరులనోళ్ళల్లో బలవంతాన కుక్కాలని చూసేవారు. మిగతా సమయాలలో తియ్యదుంపలను, అడవి వుల్లిపాయలు — ఏదైనాసరే, కాస్త పొట్ట నిండితేచాలు — దొరికినదానినల్లా తినేవారు.

వాళ్ళకు కనురెప్పలపట్టు నల్లబడసాగింది. మెలిద్రిప్పిన మోకులాగున వారి పొట్టలు తయారైనాయి.

ఆ పలుచని బట్టలతో తడినేలమీద నిద్రించేవారు. వారికి ఆచ్ఛాదన ఆకాశంమాత్రమే. వాళ్ళని ఆకలి ఎప్పుడూ వదిలిపెట్టిపోలేదు. మిస్ చెన్‌కి జబ్బుపట్టింది. వెంటనే అది తీవ్రమయింది. ఆమె శరీరము జ్వరముతో భగ్గునమండిపోసాగింది. ఆమెను చేతులలోకి తీసుకొని కాపాడుతూ ఆమెకు ఏవిధంగానైనాసరే సహాయపడుటకు ఏదయినా మార్గము కలదాయని తెగ ఆలోచించసాగారు.

"ఈరకముగా జీవించటము అసంభవం! ఆరోగ్యం కలవాళ్ళయినా ఈ రకపు జీవితాన్ని ఎక్కువకాలము భరించలేరు. జబ్బుతోవున్న వ్యక్తి అసలే భరించజాలదు. ఈమెను కాస్త విశ్రాంతి, ఆహారము దొరకగల గ్రామాన్ని వెదకి ఈమెను అక్కడికి జేర్చాలి." అన్నది మేయీ.

ఈ అభిప్రాయాన్ని మిస్ చెన్ వ్యతిరేకించినది. "ప్రమాదంలో పడతారు. అలాంటిపని చేయబోకండి" అని మిస్ చెన్ బలహీనకంఠముతో ఆజ్ఞాపించినది "ఈ వ్యాధిని తప్పించుకొని ఏవిధంగానూ బయటపడలేనని అనిపిస్తూవుంది. నడవలేను—నిలబడలేను. మీకు నేనొక భారముగా తయారయ్యాను. మనము ఏదయినా గ్రామములోనికి వెళ్ళితే, మనకందరికీ మూడుతుంది. నన్ను వదలిపెట్టు మీదారిన మీరు పొండి!" అన్నదామె.

"అలా అనబోకండి!" అని వాళ్ళంతా కోపంగా అరచారు. "చస్తే మనమంతా కట్టకట్టుకుని చద్దాము" అన్నాడు.

ఆమె యెంత వ్యతిరేకించినా లక్ష్యపెట్టకుండా, వారామెను దగ్గరలోవున్న గ్రామానికి ఆరాత్రి మెల్లగా మోసుకొనిపోయారు. వారు గ్రామపరిసరాలలో ఆగిపోయారు. విషయాలను పసికట్టివద్దామని మేయీ, నియూరీలు బయలుదేరారు. శత్రువులు అప్పుడే ఆ గ్రామాన్ని విడిచి వెళ్ళారన్న సంతోషకరవార్తను తెచ్చారు. వాళ్ళు తనయింట్లో విశ్రాంతి తీసుకోటానికి వప్పుకొన్న రైతాంగనను కలుసుకొన్నామని చెప్పారు.

మిస్ చెన్‌ను మోసుకొనిపోతూ వారు నిశ్శబ్దముగా గ్రామములో ప్రవేశించారు. ఒక చిన్న కొంపవద్దకు చేరారు. నలభై యేళ్ళ వయసుగల ఒక స్త్రీ తలుపుసందునుంచి తలబయటికి పెట్టినది. జాగ్రత్తగా ఇటూ అటూ చూసినది.

ఎవరయినా వస్తున్నారేమో చూచి చెప్పటానికని తన హాతుర్ని తలుపువద్ద కాపలా పెట్టింది. వాళ్ళను లోపలిగదిలోనికి తీసుకొనిపోయింది. మిస్ చెన్‌ను వెచ్చని కాంగ్‌పై పడుకోబెట్టింది. ఒక బొంతతో ఆమెను కప్పింది. దీపమార్పివేసినది.

"మనమంతా ఒకేకుటుంబము—నేనుకూడా ప్రతిఘటనోద్యమములో పనిచేసున్నా" అని మృదువుగా ఆ స్త్రీ చెప్పినది. "మీ యిష్టమొచ్చినన్ని రోజులు ఇక్కడ వుండండి. జపానువాళ్లు మళ్ళా తిరిగి వస్తే మన వొలాలలోనికి పోదాము. మీ యిల్లులాగే భావించి, సుఖంగా వుండండి—తాగటానికి నీళ్లుకాచి వస్తా" అన్నదా యిల్లాలు.

ఆ యువతులు సుఖముగా, నొప్పుతున్న తమకాళ్ళతు మిస్ చెన్ ప్రక్కగా కాంగుమీద చాచుకొన్నారు. వెంటనే నిద్రలో మునిగిపోయారు. కొద్దిసేపయిన తర్వాత ఆ యిల్లాలు వాళ్ళను గాఢనిద్రనుండి లేపినది. ఆయిల్‌లాంపు కులాసాగా వెలుగుతూ వున్నది. కిటికీకి దట్టముగా ఒక పాతగుడ్డ కప్పబడివున్నది.

"భోజనము చేద్దాం లేవండి కామ్రేడ్స్! ఈ ఆహారాన్ని చాలా కాలమునుండి దాస్తున్నాము—జపానువాళ్లు దీన్నికాస్తా గుంజుకొనిపోతారేమోనని భయపడ్డా. మీరు దీన్ని భుజించటముకంటే నాకువేరే కోర్కె లేదు!" అని లోకంఠంతో చెప్పిందాయిల్లాలు.

ఆమె పొగలుగ్రక్కుతూవున్న నాలుగుగిన్నెల పులుసును కాంగ్ మీద వుంచినది. అటుతర్వాత వాళ్ళకు చెంచాలు యిచ్చింది. వాళ్లు గిన్నెలను పెకెత్తారు. ఆశ్చర్యమేమంటే ఆ పులుసులో తెల్లని పిండితో తయారుచేయబడిన వుండలు ఈదుతున్నాయి! బీదరైతులకు యిదొక గొప్ప సంగతే! కమ్మని ఫుల్లిపాయలవాసన వేస్తూవున్నది. ఓహో! ఎంత

కాలానికి యింతచక్కని తిండి: వాళ్లు అపస్మారకముగా నవ్వసాగారు. కళ్ళనుండి నీలాలు బుగలమీదకు జారినాయి.

"తల్లి! మాకు రెండు బియ్యపురొట్టెలుపడేస్తే చక్కనికిగొప్పగా అనుకొనేవాళ్ళం! మాకోసం తెల్లపంక్తితో పిండిపంటలు చేశావా!.... తల్లీ! నీ ఋణం తీర్చుకోలేం!...." అని సియూరీ కన్నీరుగార్చినది.

ఆ యువతుల హృదయాలు మిస్ చెన్ హృదయం, ఆ యిల్లాలు చూపించిన ఆప్యాయతకు ద్రవిస్తునాయి. తినండమ్మాయని ప్రతిమాలుతున్న ఆ యిల్లాలి కళ్లు వాడా చెమ్మరించినాయి.

* * * *

భోజనము పూర్తి అయిన తర్వాత, జబ్బుగావున్న మిస్ చెన్ తప్ప మిగిలినవారందరూ దగ్గరలోనున్న గోధుమపొలాలకు వెళ్ళారు. లోతయిన వెడల్పుగల గుహలాంటి కందకాన్ని తవ్వారు. దానికి మనిషి పట్టేసందు, ద్వారంగా వదలిపెట్టారు. ఆపని పూర్తిచేయటానికి ఆ రాత్రి అంతా పట్టినది. ఎందువలనంటే, వాళ్లు చీకటిలో పనిజేయాల్సివచ్చినది. అంతేగాక తవ్విన మట్టిని గోతి ద్వారమునుండిమోసుకొనిపోయి వెదజల్ల వలసి వచ్చినది. వాళ్ళు ఎండుగడ్డిని యింటినుండి మోసుకొనివచ్చి ఆ కందకములో పడకగా అమర్చారు.

జపానువాళ్ళు ఎడతెరిపిలేకుండా దాడులు చేస్తున్నారు. కాబట్టి హెచ్చరిక యివ్వకుండానే వాళ్ళు రావటానికి అవకాశముగలదు కాబట్టి. పగలూ, రాత్రీ ఆ కందకములోనే కాలము గడుపుదామనుకొన్నారు. రోజుకు రెండుసార్లు అడవిమల్లంగి యేరుకొని తెచ్చుకోటానికన్న నెపముతో ఆ యిల్లాలు, ఆమె కూతురు వాళ్ళకు భోజనాన్ని తెచ్చేవారు. వార్తలను అందించేవారు. పరిస్థితులంత ప్రోత్సాహకరముగాలేవు. ఆ గ్రామములో కీలుబొమ్మ ప్రభుత్వము యేర్పాటు చేయబడినది. పరిసర ప్రాంతాలలోవున్న పెద్ద గ్రామాలలో జపానువాళ్ళు కీలుబొమ్మ సైన్యాలు కలిసి, కోటలను కడుతున్నారు. కోటలను ఆక్రమించుకొంటున్నారు.

చీకటిగానూ, తడిగానూవున్న గుహలాంటి ఆ కందకములో అనేకరోజులపాటు నివసించుటవలన వాళ్ళకు వంటినిండా చీడపేలు, కురుపులు, ముఖమునిండా మొటిమలు పుట్టుకొచ్చాయి. వాళ్ళ జీవితము ఘోరముగా వున్నది. వాళ్లు నలుగురూ ఆ యిరుకు కందకములో ఎత్తు కొని కూర్చోవాల్సి వచ్చేది. కాళ్లుచాపుకోటానికి వీలుండేదిగాదు. పైకప్పు యెత్తు చాలా తక్కువ. అందువలన తలలువంచి కూర్చోవాల్సివచ్చేది.

"కసాయివాని దుకాణములో వండి సిద్ధంచేసిన కోడిపిల్లలాగా వున్నదని" మేయీ పరితాప హృదయముతో అన్నది

"యిక్కడ దాక్కోవటం మూలాన శ్వాసాడటములేదు ! ఏమైనా సరే యిక్కడినుండి బయటపడి కాస్త పరుగెత్తాలనిపిస్తున్నది!" అని మూలిగినది నియూరీ.

"ఏమయినాసరే భరించటము మంచిది; పిల్లలాటలో పడవోకు !" అన్నది తియాన్.

మనవాళ్లు ఎక్కడున్నారో తెలిస్తే వాళ్ళతో సంబంధాలు ఏర్పాటు చేసుకోగలము" అన్నది మిస్ చెన్.

ఈ గుహ మన నలుగురికీ చాలదు. చాలా చిన్నది. దీనిలో యిద్దరువుంటే కొంత విశాలముగా వుంటుంది. నేనూ నియూరీ కలిసి బయటికిపోయి మనవాళ్ళెక్కడున్నారో తెలుసుకొని, సంబంధాలు యేర్పాటుచేసుకొంటే?" అని మేయీ మిస్ చెన్‌కు సలహాయిచ్చినది.

"తియాన్ యిక్కడ వుంటున్నది. మీ పోషణవిషయము చూస్తున్నది. మేము విజయవంతులమయితే మిమ్ము తీసుకొనిరావటానికి మనుషులను పంపుతాము. ఏమంటారు?" అన్నది మేయీ.

ఈ సలహాకు అందరూ అంగీకరించారు.

ఆ రాత్రి ఆ యువతులిద్దరూ కందకమునుండి బయటపడ్డారు. హెహాంగ్ హెవా గ్రామమువైపుగా పయనించారు. ఆ యిల్లాలు వండి యిచ్చిన చిలగడదుంపలనూ, బియ్యపురొట్టెలనూ తట్టలో పెట్టుకొని బయలుదేరారు. అంతులేకుండా కూలబడివుండటము వలన ప్రొద్దుపైన వేసంగిరాత్రిలో రోడ్డుపై నడవటమంటే వాళ్ళకు యెంతో హాయియని

పించినది. నియూరీ గాఢముగా వూపిరిలాగినది, నర్గీసుపువ్వుల వాసన వేస్తూవుందని అన్నది.

"కాదు, పచ్చగోధుమల వాసన. పొలాలు బాగా ఎత్తుగా పెరిగాయి. ఇక మనము చురుకుగ పనిచేయవచ్చును" అన్నది మేయీ.

వాళ్ళు గ్రామం మొగకు చేరుకున్నారు. వింటూ నీడల్లో నిలబడ్డారు. పరిపూర్ణంగా వున్నది. ఎక్కడా చడీచప్పుడు లేదు. రహ్యంగా ఆలోచించుకొన్న తర్వాత, గ్రామంలో ప్రవేశించారు. ఇరుకు గొందులలోపడి నడవసాగారు. వారికంటికెవ్వరూ అగుపించలేదు. "రైతుల గృహం" తలుపులు గట్టిగా మూసివున్నాయి. తలుపుతట్టటానికి ధైర్యం చాలకపోయింది. విదేశభాషలో గ్రాంఫోన్ రికార్డు పాడుతూ వున్నది వాళ్ళు ఏమిచేయాలో తెలియక కొంతసేపు అలాగే నిలబడిపోయారు. అర్థంగాని భాషలో మాట్లాడుతూ కంఠధ్వని వినిపిస్తూవున్నది.

మేయీ నియూరీచేతులను గట్టిగా పట్టుకొంది. "సరిగ్గా వాళ్ళ ముక్కులక్రిందకే వచ్చేశాము!" అని గొణిగింది.

సందు చివరనుండి, నియూరీ జాగ్రత్తగా, తలను బయటకుపెట్టి పెద్దబజారులో ఎవరయినా వున్నారేమోనని చూసింది. వాళ్ళ కళ్ళ ఎదుట మెరుస్తూవున్న కోట బురుజు ప్రత్యక్షమయింది. ఆమె తలను వెంటనే వెనక్కి లోక్కొంది.

"ఎంత దురదృష్టం!" అని బుసకొట్టింది. "పోదాంపద యిక్కడనుండి" అన్నది.

వెళ్ళిపోదామని వెనక్కు తిరిగాడు. ఇంతలోనే ఒక తలుపు తెరచుకొంది. ఒక మనిషి బయటికివచ్చాను. ఎక్కడివాళ్ళక్కడే నిలబడండి! అని మొరిగాడు. "ఇక్కడేం జేస్తున్నారు?" అని ప్రశ్నించాడు.

"బిచ్చగాళ్ళం బాబూ!" అన్నది వెంటనే నియూరీ.

"అర్థరాత్రివేళ ముష్టెత్తటం ఏమిటి?" అన్నాడు అతడు అనుమానంగా. "మీ ఇద్దరినీ చూస్తే ఏదో కథ వుందల్లే వుందనిపిస్తూంది." అన్నాడు. అతని చేతిలోని పిస్తోలును చూడగానే, మేయీ హృదయం ముకుళించింది. "నాతోరండి!" ఆజ్ఞాపించాడు. వాళ్ళను ముందుకు త్రోసి, తాను వెనుకనుంచున్నాడు. ఇంట్లోకినెట్టాడు.

వాళ్లు యింటిలో ప్రవేశించగానే, నియూరి చేతులలో వున్నతట్టను గుంజుకొన్నాడు. దానిలోని వస్తువులను లాంపు వెలుగులో పరీక్షించాడు. దానిలో యింకా రెండు చిలగడదుంపలూ, చాలా రొట్టెలూ వున్నాయి.

తలవూపాడు. "మీరు అబద్ధమాడుతున్నారు. బిచ్చగాళ్ళు ఒక యింటినుండి మరియొక యింటికిపోయి దొరికినవల్లా యేరుకొని తెచ్చుకుంటారు. అన్నీ ఒకేరకంగావున్న ఒక్కరంగుతోవున్న ఈ రొట్టెలెలా వచ్చాయి? అవన్నీ ఒకేరకం అని తెలుస్తుంది! మేలు జరగాలంటే నిజం చెప్పండి" అని గద్దించాడు.

తమకథను మార్చాల్సిన అవసరంగలదని ఆ యువతులు వెంటనే గుర్తించారు.

"మేము నిజంగా బిచ్చగాళ్ళం కాము" అని వప్పుకొంది మేయీ "మా బంధువును చూడటానికి వచ్చాము. చీకటిలో తప్పుదారిపడ్డాం" నియూరిని చూపిస్తూ మేయీ తన సంభాషణను సాగించినది. "ఈమె నా చెల్లెలు. ఆమె తప్పుజెప్పినది. ఆమె మాటలను తీవ్రంగా తీసుకోకండి!" అన్నది.

అతడు సాధారణ పౌరదుస్తుల్లో వున్నాడు. రమారమి యిరవై ఏళ్ళు మాత్రమే వుంటాయి. అతడు పరిశీలనగా ఆ యిద్దరినీ చూశాడు. మొదట ఒకామెను తర్వాత రెండవ యువతినీ చూశాడు. వాళ్ళవంక రెప్పార్పకుండా చూశాడు. వాళ్ళు తలలు వంచుకొన్నారు. వెన్నెముకలు ఝల్లుమన్నాయి.

అతడు అకస్మాత్‌గా అరచాడు. "మీరిద్దరూ తప్పకుండా కార్యకర్తలు! ఏ జిల్లాలో పనిజేస్తున్నారు? చెప్పండి."

"కార్యకర్తలంటే ఏమిటో మాకు తెలియదు!" అని గట్టిగా నిరాకరించినది నియూరీ. "మేము వొట్టి రైతులం!" అన్నది.

అతడు వాళ్ళవంక ఒక్క-క్షణంపాటు చూశాడు. మళ్ళీ ఒకప్రశ్న వేశాడు. 'మీరు బ్లాకిత్సేని ఎరుగుదురా లేదా?' "లేదు ఎరుగం!" అని ఆ యిద్దరు యువతులూ ఏకకంఠంతో అన్నారు. వాళ్ళకు అంతకంతకు భయం మిక్కుటమవుతూవుంది.

"మీరు నిజం చెప్పకపోతే కోటకు పంపి చివేస్తాను!" అని అరచాడు. వాళ్ళముఖాలు తెల్లపడుతూంటే అతడు నవ్వసాగాడు. "భయపడకండి!" అని నమ్మబలికాడు. మేం కూడా వుద్యమములోవున్నాము. యిది కొంటీసైన్యాల కేంద్రము. మీతో మాట్లాడటానికి ఒకమనిషిని తీసుకొని వస్తా!" అన్నాడు.

ఆ వ్యక్తి యింటిని విడిచిపెట్టిపోతూ తలుపు మూసేసిన చప్పుడు వినపడగానే ఆ యువతులిద్దరూ సమాలోచన జరుపసాగారు.

"ఎవరిని మోసగిస్తున్నా ననుకొంటున్నాడు?" అని అపహాస్యంగా అన్నది మేయీ. "కొంటీ ప్రజాసైన్యం తన కేంద్రాన్ని జపానువాళ్ళ కోటక్రిందే ఎప్పుడు స్థాపించినది? మనము మరియొక కట్టుకథను అల్లుదాము. వచ్చేవరకూ దాన్నే అంటిపెట్టుకుని కూర్చుందాం!"అంది మేయీ.

ఆ యువతులిద్దరూ కాంగ్‌మీద దగ్గరగా కూర్చున్నారు. ఏం జెప్పాలో రహస్యంగా ప్లాను వేయసాగారు.

కొద్దినిమిషాల తర్వాత వాళ్ళను ప్రశ్నించిన వ్యక్తి నల్లని దుబ్బులాంటిగడ్డంగల చిరునవ్వును తొలకరిస్తున్న వ్యక్తిని వెంటబెట్టుకొచ్చాడు. అతను బ్లాకిత్సే! ఆ యువతులు కాంగ్‌మీదనుండి వుద్వేగంగా దూకారు.

"ఆ ఘోరకలి అయిన తర్వాత యదార్థానికి నువ్వేనా!" అని అరచారు సంతోషంగా.

"మమ్మల్ని భయపెట్టి చంపేశావ్!" బ్లాకీ హస్తాలను గట్టిగా నొక్కుతూ అన్నది నియూరీ.

అతని మెడమీద గాయాలు యింకా మానలేదు. అతను నవ్వుతూ

వుంటే తల ఒక ప్రక్కకు వొరుగుతూవున్నది. "బిచ్చగాళ్ళవేషం వేసుకొని మీ యిద్దరూ ఏంజేస్తున్నారు? మీరు దేశద్రోహులని మన కార్యకర్తలు భావించారు."

ఆ యువకునివంక జూపుతూ "అతడు దేశద్రోహి అనుకున్నా!" అని నియూరీ గలగల నవ్వింది.

"ఇంత భయమయినాలేకుండా దుడుకుతనంగా కోటకు దగ్గరగా ఎలా వుండగలిగావ్?" అని అడిగింది మేయీ.

"శత్రువుకు ఎంత దగ్గరలోవుంటే వాడు మనలను గుర్తుపట్టే అవకాశముండదని భావించాం" అని నవ్వాడు క్లీకీ "మళ్ళీ మనం కార్యకర్తలతోనూ, ప్రజలతోనూ సంబంధాలు పెట్టుకోగలిగితే మనకు అడ్డు ఏదీవుండదు. చేయలేనిదంటూ ఏమీవుండదు! హోపేరాష్ట్రంలో కొండలు కొద్దిగానే వుండవచ్చు. కాని కొండలకన్న బలీయమైన ఒకగట్టి కొండను తయారుచేయగలం. అదే ప్రజలు!" అన్నాడు.

తాము ఎరుగున్న కామ్రేడ్స్‌నుగురించి క్లీకీ వాళ్ళకు చెప్పాడు. దాస్వే పట్టుబడిన తర్వాత అతనేమైనదీ తెలియలేదనిచెప్పాడు. తియూనులను తీసుకురావటానికి మనుషులను పంపాడు. వాళ్ళను ఇంటికి తీసుకొని పోయాడు. వాళ్ళు స్నానంచేసి, భోజనంచేశాడు. తమ సంఘంతో సంబంధాలు ఏర్పడగానే చాలాపనులు చేయుటకు అవకాశంగలదన్న విషయం ఆ యువతులకు తెలుసు. ఉత్సాహంగా వూపిరిపీల్చుకోసాగారాయులు. విశ్రాంతి తీసకోవలసిందిగా క్లాకీ వాళ్ళకు చెప్పాడు.

కొన్నిదినాలు వాళ్ళు విశ్రాంతి తీసుకున్న తర్వాత క్లాకీ మేయీ, నియూరీలను పిలిచాడు.

"ఇప్పటినుండి మళ్ళీ మనమంతాకలిసి పనిచేదాం" అన్నాడు. "జిల్లా సంఘాలను స్థాపించాం; చేయవలసినపని చాలావుంది! మీరిద్దరూ పోయి హిస్యేలియూగ్రామంలోవున్న ష్యాంగును కలవండి" అన్నాడు.

వాళ్ళను గమ్యస్థానానికి చేర్చటానికి ఒక కార్యకర్తను వాళ్ళకు తోడుగా పంపాడు.



# 9 అధ్యాయం

దాస్వేని పట్టుకొన్న రాత్రి ఖైదీలను ఒక పెద్దగ్రామానికి నూరు గజాలదూరంలో నిలబెట్టారు. పరిసరాలలో ఇళ్లు యింకా మండుతూనే వున్నాయి. మంటలవెలుగులో జపానుసైనికులు ముందుకూ వెనుకకూ పరుగెత్తుతున్నారు. గ్రామంనుండి బయటకువచ్చిన చైనాదేశద్రోహులు గ్రామంనిండా జపానుసైనికులున్నారని చెప్పారు. అయినప్పటికీ స్త్రీ ఖైదీలను గ్రామంవైపుగానే తీసుకొనిపోయారు.

వాళ్ళు వరుసగా నిలబడుతూవుంటే, కృంగిన హృదయంతోదాస్వే వాళ్ళవంక విచారంగా చూడసాగాడు. కొంతమంది స్త్రీ ఖైదీలు తలలు వంచుకొని నడుస్తున్నారు. మరికొంతమంది తమ చేతుల్లో తమ పసికందులను మోసుకొనిపోతున్నారు కొంతమంది ఏడ్వసాగారు. కొంతమంది భయంతో తమచుట్టూ చూస్తున్నారు. ఆ స్త్రీ ఖైదీలలో మేయీ ఎక్కడా కానరాలేదు. ఏమైనారాఏమిటియని దాస్వే బాధపడసాగాడు. ఆమెనుచంపేశారా ఏమిటి! అనుకోసాగాడు. జపానువాడి లాఠీ ఠంగున దాస్వేబుర్రపై మోగింది. ఖైదీలను ముందుకు సాగవలసిందిగా చెప్పుటకు జపానువాళ్ళు వినియోగించే పంథా యిదే!

జపానువాళ్ళు మొగఖైదీలను ఒక పెద్ద పొలంలోనికి తోలుకొని పోయారు. అన్నివైపులా మండుతున్న యిళ్ళనుండి మంటలుతొందరగా విలయతాండవమాడుతున్నాయి. తలుపులనూ, దర్వాజాలను, కిటికీలను, కుర్చీలను, కొయ్యసామాగ్రి ఏది దొరికితే దాన్ని మంటలలోనికి విసరి

వేస్తున్నారు జపానువాళ్ళు. ఖైదీలమెడకు తగిలించిన సైనిక సంచులను క్రిందకు దింపారు.

ఖైదీలకు పెద్ద బరువు దించినట్లయింది. కాస్త వూపిరి పీల్చుకోసాగారు. జపానువాళ్లు క్రింద కూర్చున్నారు. నుష్టుగా భోజనం చేయసాగారు. ఖైదీలకు ఆహారము దొరుకుట అసంభవమన్నమాట యధార్థం. ఖైదీల గొంతులు ఎండిపోయి, విపరీతంగా బాధపెట్టుతున్నాయ్. కాసిని మంచినీళ్ళయినా దొరికితే బాగుండుననుకున్నారు.

ఒక బొక్కెనతో నీళ్ళు తీసికొని, ఒక ముసలివాడు అక్కడకు వచ్చాడు. వెంటనే అతణ్ని ఖైదీలు చుట్టుముట్టారు. బొంగురుకంఠాలతో నీళ్ళిమ్మని బ్రతిమాలారు. ఇంతలోనే ఒక జపాను ఆఫీసరు, తెల్ల గుర్రాన్ని ఎక్కి అక్కడికివచ్చాడు. బొక్కెననుండి దూరంగా పడిపోయేటట్లు ఖైదీలను గుర్రంచేత తన్నించాడు. గుర్రం బొక్కెననీళ్ళనూ, తన కడుపు పుచ్చకాయలాగున వుబ్బేవరకూ త్రాగింది. బొక్కెనలో ఒక్క చుక్క నీరైనాలేదు. జపానువాడు వెళ్ళిపోయినతర్వాత, ఖైదీలలో కొంద రమాంతంగా బొక్కెనవున్నచోట బోర్లపడ్డారు. తడిమట్టిని నాకసాగారు. మిగిలినవారు ద్వేషంతో మండిపోతూవున్న కన్నులతో జపానుఆఫీసరు పోయినదిక్కుగా మిర్రి మిర్రి చూడసాగారు.

ఆ రాత్రి ఒకడి తలను మరియొకడి తలకు ఆనించి, వలయాకారంగా నిద్రించారు ఖైదీలు. వారిచుట్టూ రెండు వరుసలుగా జపానుసైనికులు పడుకొన్నారు. ఎందుకంటే ఖైదీలలో ఎవరయినా పారిపోవుటకు యత్నిస్తే, నిద్రపోతూవున్న జపానువాడిమీద అడుగేసి వెళ్ళాల్సివస్తుంది అప్పుడు వాణ్ని పట్టుకోవటం చాలా సులభం.

ఆ రాత్రి దాస్వేకి నిద్రపట్టలేదు. ఖైదీలలో కొందరు మూలుగులు ప్రారంభించారు. కాని, కాపలావాళ్ళు బండబూతులు తిట్టి నోరు మూయించారు.

ఆ మరునాటి ఉదయం జపానుసైనికులు, కీలుబొమ్మసైనికులు భోజనము చేసినతర్వాత ఖైదీలను వరుసలో నిలబెట్టారు. దాస్వేతోసహా

ఆరుగురిని ఏరారు. మిగిలినవాళ్ళను ఒక కోటను కట్టటానికి పంపారు. దాస్వే, అతనితోటి ఖైదీలనూ జపానువాళ్ళు ఆక్రమించుకొన్న పట్నానికి తీసుకుపోతామని చెప్పారు.

పట్నానికి పోవలసిన ఖైదీలు రోజంతా నడిచారు. అక్కడ ఆగిపోయారు.

ఒక అంతస్థు గల భవనము ఒకటివుంది. దాని మురికి ఆవరణలోకి వీళ్ళను తీసుకొనిపోయారు. శుభ్రంగావున్న ఉత్తరపువైపు వరండాను జపానువాళ్ళు ఆక్రమించుకొన్నారు. తూర్పువైపు వరండాను కీలుబొమ్మ సైనికులాక్రమించుకొన్నారు. మట్టియిటికలతో కట్టిన ఒక చిన్న గది లోకి యీ ఖయిదీలను తోశారు. ఇది భవనానికి పడమటి దిక్కుగా వున్నది.

రెండు రోజులనుంచి యీ ఖైదీలకు తినటానికి తిండి పెట్టకపోగా త్రాగటానికి నీళ్ళుకూడా యివ్వలేదు. ఖైదీలు ఆకలితో మలమల మాడి పోతున్నారు. పొట్టలు వెన్నెముకకు అంటుకున్నాయి. గొంతుకలు మంటలతో మండిపోతున్నాయి.

శరీరాలు వేడెక్కిపోయాయి. బాగా అలసిపోయారు. తలలు తిరిగి పోతున్నాయి. బలహీనంచే నేలకొరిగారు. సుఖం ఆవంతైనాలేదు. బాధతో మూలగనైనా మూలగకూడదు. మూలిగితే కిటికీగుండా జపానువాడిసన్నీ పోటు ప్రమాదకరంగా ప్రత్యక్షమవుతూవున్నది.

ఖైదీల గదివద్ద కాపలాగా ఇద్దరు కీలుబొమ్మ సైనికులను వుంచారు జపానువాళ్ళు. అటుతర్వాత సుష్టుగా భోజనము చేసి నిద్రపోయారు అందరూ.

ఖైదీలతో దాస్వేతోపాటు ఒక గ్రామకార్యకర్త, ఒక ప్రజాసైనికుడూ వున్నారు. మిగిలినవారు రైతులు. రైతులలో ఒకడు పదిహేడేళ్ళ పిల్లవాడు. వానికి దాహంచే పిచ్చెక్కిపోయింది.

"అయ్యో! దాహం! గొంతెండిపోయింది; చచ్చిపోతున్నా!" అని ఏడ్వసాగాడు. "ఉచ్చయినా దొరికితే త్రాగుతా! అయ్యో! ఉచ్చయినా రావటంలేదురోయ్. మంటెత్తిపోతూవుంది!" అని హృదయవిదారకంగా

ఏడ్వసాగాడు. ఏడుస్తూ తలను ఫెడీమని గోడకేసి కొట్టుకొన్నాడు. మట్టిబెల్లలు వూడి క్రిందపడ్డాయి.

దాస్వే ఆ పిల్లవాని బాధజూచి జాలిపడ్డాడు. మట్టిబెల్లలు పడగానే దాస్వేకి ఒకరకమైన ఉత్సాహం కలిగింది. ఏమ్యూనిస్టుగా తన కర్తవ్యాన్ని ఎలా నిర్వహించాలాయని తెగ ఆలోచిస్తున్నాడు. ఇప్పు డా మట్టిబెల్లలు అతని కొక నూతనభావాన్ని కలుగజేశాయి.

"బాధపడబోకు ఓస్నేహితుమ్మడా!" అని ఆ పిల్లవానిని వోదార్చాడు. "యీ కూపంనుండి బయటపడతాంలే" అన్నాడు. కిటికీవద్దకు పోదామని లేవటానికి యత్నించగానే దాస్వే తల గిర్రునతిరిగింది. ఎలాగోఅలాగు కిషపడి మోకాళ్ళమీద లేచి కిటికీపద్దకుపోయాడు. పాత కాపలావాడు పోయి కొత్త కాపలావాడు వచ్చేవరకూ అక్కడే వేచివున్నాడు. కొత్త కాపలావాడు డ్యూటీలో ప్రవేశించేముందు పాత కాపలావాడు పోగానే ఖైదీలందరూ వున్నారా లేరాయని కిటికీనుంచి తొంగిచూడటానికొచ్చాడు. దాస్వే అతనితో మాటలు ప్రారంభించాడు. ఆ కీలుబొమ్మసైనికునితో వాదించాడు. బ్రతిమాలాడు. చిట్టచివరకు మంచినీళ్ళు తెచ్చిపెట్టుటకు అతణ్ణి వప్పించాడు.

మంచినీళ్ళు వస్తున్నాయని వినగానే ఖైదీలందరూ కూలబడ్డారు. వాళ్ళందరికి మధ్యగా దాస్వే కూర్చున్నాడు. అందరినీ దగ్గరగా జరగవలసిందిగా కోరాడు. వాళ్ళందరూ దగ్గరదగ్గర కూర్చున్నారు.

"మనమంతా కష్టంలోవున్న స్నేహితులం. అందువలన యీ విషయాన్ని బాగా చర్చించాలి. మనలను రేపు పట్టణానికి తీసుకుపోగానే కాల్చేస్తారు. లేదా తలలు నరికేస్తారు. చావు ఎలాగైనా తప్పదు. అందువలన మీరు మీ సర్వస్వాన్నీ యిప్పుడే పణంగాపెడితే మంచినీళ్లు మన ప్రాణాల్ని రక్షించవచ్చును" అన్నాడు దాస్వే.

వాళ్ళకు తన ప్లాను విప్పిచెప్పాడు. వాళ్ళు కొన్ని నిమిషాలపాటు గుసగుసలాడుకున్న తర్వాత వాళ్ళంతా అంగీకరించారు.

కీలుబొమ్మసైనికుడు బొక్కెనుడు నీళ్లు తీసుకొనిరాగానే ఖైదీలందరూ కలసి అతనికి అమితంగా అభినందనా లర్పించారు. అతను

తత్తరపాటుగా మనమంతా చైనావాళ్ళంగదా అని గొణిగాడు. బయటికి పోయాడు; తాళం వేశాడు. ప్రతిమనిషి కొన్నిగుక్కల నీళ్ళుమాత్రమే త్రాగవలసిందిగా దాస్వే ఖైదులతో చెప్పాడు. ఆచర్యకమ్యూనిస్టుగా తాము నీళ్ల తాగటం మానివేశాడు.

పెనుగులాడి ఎలాగయితేనేం తమ చేతులను వెనక్కివిరిచి కట్టిన మోకును ఖైదీలందరూ విప్పివేసుకొన్నారు. తమ చొక్కాలనూ, తల రుమాళ్ళనూ అమూల్యమయిన ఆ నీటిలో తడిపారు. వాటితో గోడలో ఒక భాగానికి రుద్దారు. గోడమట్టి తడిసి మెత్తబడింది. ఒక ఖైదీకిటికీవద్ద కాపలాకాస్తున్నాడు. మిగతా అయిదుగురు తడిసిన గోడమట్టిని వ్రేళ్ళతో గోకసాగారు. క్రమంగా మట్టిపెల్లలు వూడిపస్తున్నాయి.

ఆ విధంగా వాళ్ళు ఒక చిన్న కంత చేసేసరికి కిటికీవద్దనున్న మనిషి "వా డొస్తున్నాడు! వా డొస్తున్నాడు!" అని అరచాడు. ఖైదీలు మామూలుస్థానంలో చేతులు వెనక్కిపెట్టుకొని కూలబడ్డారు. దాస్వే తన విశాలమయిన వీపును కంత కడ్డంగాపెట్టి కూర్చున్నాడు. వూపిరిపీల్చే ధైర్యం ఎవరికీ లేకపోయింది.

కీలుబొమ్మసైనికుడు తలుపు తెరచుకొని లోపలికి వచ్చాడు. "నీళ్ళు అందరికీ సరిపోయాయా?" అని అడిగాడు.

"ఓ! మహబాగా! మహబాగా సరిపోయాయ్. చాలా అద్భుతంగా వున్నాయ్" అని వారు అతనికి జవాబిచ్చారు.

చిరునవ్వు నవ్వుతూ అతను బొక్కెనను తీసుకొనివెళ్ళి తలుపు తాళంవేశాడు.

గాబరాతోనూ, భయంతోనూ కొంతమంది ఖయిదీలు వణికిపోతు న్నారు.

"భయపడకండి" అని దాస్వే వాళ్ళను బ్రతిమాలాడాడు. "కొద్దిగా కష్టపడితే మనమంతా బయటపడతాం" అన్నాడు.

మరల త్రవ్వ ప్రారంభమయింది. ఆకలిని మరిచిపోయారు.

దాహాన్ని మరిచిపోయారు. శక్తులన్నింటినీ కేంద్రీకరించారా ఖయిదీలు. మనిషిపట్టేంత కంతనుత్రవ్వారు. ఆ కంతగుండా దాస్వే తన తలను బయటికిపెట్టి జాగర్తగా పరిశీలించాడు. బయటికిప్రాకిపోయాడు. ఒక్కొక్క ఖయిదీ అతడు చూపిన దారిని అనుసరించాడు. అందరూ బయటపడ్డారు. దాస్వే మెల్లగా వారందరినీ గ్రామంనుండి బయటి పొలాలలోనికి తీసుకొనిపోయాడు. అక్కడ వాళ్ళంతా విడిపోయారు.

* * * *

గ్రామీణప్రాంతాలలో కొన్నిదినాలపాటు దిమ్మరినతర్వాత ఒంటరిగా తానేమి చేయజాలనని దాస్వే గుర్తించాడు. కొంతకాలంపాటు రహస్య 'కోటల'లో గడుపుదామనుకున్నాడు. 'కోట'లకు అర్ధం రాతికోటలూ కాదు, మటికోటలూగాదు. రహస్యంగా పనిచేస్తున్న సంఘంలో సభ్యులుగాకూడా వుంటూవున్న రైతుల యిళ్ళల్లోగానీ, పొలాలలోగానీ దాక్కొనే స్థలాలను 'కోట' లంటారు. జపానువాళ్ళ 'సర్వనాశన కార్యక్రమం' ఉచ్ఛదశలో నున్నప్పుడు, యీ 'కోటలు' తలదాచుకోటానికీ సంఘంలోని యితర సభ్యులతో సంబంధాలు కల్పించటానికి సాధనాలుగా వుపయోగబడ్డాయి.

ఆ రాత్రి దాస్వే ఒకగ్రామములో ప్రవేశించాడు. ఇన్ 'మామ' యింటి ప్రహరీగోడను ఎక్కాడు. ఇన్ పచ్చనిమనిషి, వృద్ధుడు. గెడ్డం తెల్లబడిపోయింది. దాస్వే లోపలికి లోపలికి ప్రవేశించే సమయానికి తన మనుమనితోపాటు కూర్చొని భోజనము చేస్తున్నాడు ఇన్ మామ.

"దాస్వే!" అన్నాడా వృద్ధుడు ఆనందపరిపళహృదయంలో "చాలాకాలానికి మనవాళ్ళలో మొదట కనుపడినవాళ్ళలో నీవే మొదటివాడివి! మీరు కనుపించకపోతే సూర్యుడులేని ఆకాశంలాగున్నదోయ్! నాకు ఏమి తోచటంలేదు!" కాంగ్‌మీద కూర్చుని తమతోపాటు భోజనం చేయవలసిందిగా పట్టుపట్టాడు ఆ వృద్ధుడు.

భోజనము చేస్తూవుండగా 'కోడిపిల్లలగూడు' తవ్వాలని బయట

యదార్థానికది పొయ్యిక్రింద లోపైన గోయి. ఎవరో ఒకరువచ్చి దానిని ఉపయోగించుకుంటారన్న భావనతో వున్నానని చెప్పాడు. కొంతసేపు మాట్లాడుకొన్నతర్వాత మామ రసాయనిక పదార్థాలలో ముంచిన మందు తాటిని దోమలను పోగొట్టటానికిగాను వెలిగించాడు.

కొంగమీద సుఖంగా నిద్రపోవలసినదిగా దాస్వేకి చెప్పాడు. తాను తన మనుమడు జపానువాళ్ళు వస్తున్నారేమో కనిపెట్టుటకై కాపలా కాస్తూ వుంటామన్నాడు.

"నేను మెలకువగావుండగా భయపడాల్సిన అవసరంలేదు" అన్నాడు మామ.

"నేను ముసలివాణ్ణైనప్పటికీ నావి పాముచెవులు సుమా!"

చినిగిపోయిన దుప్పటి ఒకటి తీసుకొని మనుమడిని వెంటబెట్టుకుని ఇంటిపైకెక్కి కూర్చున్నాడు. శత్రువులు వస్తున్న చప్పుడేమయినా వినపడుతుందేమోనని కళ్ళలో వత్తులేసుకొని రాత్రల్లా మేల్కొన్నాడు.

తెలవారుఝామున అతనికి చప్పుడు వినపడింది. జపానువాళ్ళు గ్రామములో ప్రవేశిస్తున్నారు. వృద్ధుడు దాస్వేని మేల్కొల్పాడు. నీళ్ల కాచుదానను పొయ్యిమీదనుండి దింపాడు. కచ్చికల బూడిదక్రింద ఒక పెద్ద రేకువుంది. దానిక్రింద మనిషి పట్టే గొయ్యివుంది. ఆ గొయ్యికి మూతగా యీ రేకు వుపయోగపడుతూ వుంది.

దాస్వే ఆ గోతిలో దూరి కంటికి కనపడకుండా పోయినతర్వాత ఆ వృద్ధుడు గోతిపై రేకును వుంచాడు. మళ్ళీ ఆ రేకుపై కచ్చికలబూడిదను పోశాడు. పొయ్యిమీద బానను పెట్టి నిప్పంటించాడు.

మామ యింటిని సోదా చేయటానికి జపానువాళ్ళు రావటానికిఎంతో సేపు పట్టలేదు. పొయ్యి కెదురుగా ప్రశాంతంగా కూర్చున్న వృద్ధుని తన్నటానికి ఒక దేశద్రోహి కాలెత్తాడు.

"ఏయ్! నువ్వే! ఇక్కడ బాలూ ఎవరైనా దాక్కొన్నాడా?"

మామ నెమ్మదిగా లేచాడు. చెవిప్రక్క చెయ్యిపెట్టి చెవిటివాని లాగున "ఏమన్నారు?"

"బాలూని చూశావా అని అడుగుతున్నా?" అని దేశద్రోహి అరచాడు.

"ఓ! బాలూ విషయమా! అవును చూచాను. బూడిదరంగు సైనిక దుస్తు లేసుకుంటారుకదూ! తుపాకులు భుజా నేసుకుపోతూ వుంటారు కదూ!"

"అవునవును" అన్నాడు విసుగ్గా దేశద్రోహి. "ఎక్కడ చూచావ్ వాళ్ళని? వూఁ, తొందరగా చెప్పు!"

"అయ్యో! బోలెడంతమంది వున్నారు. వాళ్ళు రాత్రంతా గ్రామములో గడిపారు!"

"ఎప్పుడొచ్చారు? ఎక్కడున్నారు?" అని కోపంగా అన్నాడా దేశద్రోహి.

"గాబరాపడకండి. ఒక్క నిమిష మాలోచించనీయండి. ఆరోజున మార్కెటునుండి తిరిగివస్తున్నా. సంవత్సరాది పండుగ బొమ్మలు కొంటున్నా. ఆ రోజున అగ్నిదేవుడు స్వర్గానికి పోయి...."

దేశద్రోహి కోపంగా మామ ముఖంమీద చరిచాడు. "నీయమ్మ-విరుటి సంగతి నిన్నెవ్వ డడిగాడురా! కుష్టగాడిదకొడకా!"

"కంత! కంత!" అని మొరిగాడు జపానువాళ్ళలో ఒకడు.

"కంత యెక్కడుందో చెప్పమంటున్నారు!" అని మామ చెవిలో దేశద్రోహి గొంద్రుపెట్టాడు.

ఆ వృద్ధుడు అమిత అశ్చర్యంతో కళ్ళార్చాడు. "ఆ పిల్లి వచ్చినప్పటినుండి మా యింటిలో కన్నాలు లేవు. ఎలుకలపాలిటి మృత్యువది. అనేకమాసాలనుండి ఎలుక కన్నాలేమీ లేవు."

"ఆరినీయమ్మ—! చిన్న కన్నాలుగాదురా! పెద్దకన్నాలు-భూమిలో త్రవ్వినవి!" అని అరచాడు దేశద్రోహి.

ప్రతిమాటనూ జాగర్తగావింటానికి మామ తన తలను ఒక ప్రక్కకు వొరగబెట్టాడు. అతని ముఖంమీద కమ్మని నవ్వు తాండవించినది. "అదా సంగతి! ఆ సంగతి మొదట్లోనే చెబితే పోయేదిగా నాతో రండి!"

వాళ్ళను దొడ్డిలోవున్న ఒక గోతివద్దకు గొనిపోయాడు. ఆ గోతిలో ఎరువు మురుగుతూవుంది. "అదిగో!" అన్నాడు విజయవంతముగా. "మూడుమాసాలక్రితమే ప్రారంభించాము. యింకా తయారుకాలేదు. చూడండి—" అని ఒకకొయ్య తెడ్డునిండా ఆ మురుగునీటిని తీసి వాళ్ళ ముక్కులక్రింద పెట్టాడు.

ఊపిరాడకుండా దగ్గుతూ సోదాచేయటానికి వచ్చిన ఆ జపాను వాళ్ళు, దేశద్రోహి అసహ్యంతో వెనక్కు తగ్గారు. "పారబొయ్యి! పారబొయ్యి!" అని తొందరగా దేశద్రోహి అరచాడు.... ఆ వృద్ధుణ్ని మనసారా, కరువుదీరా బండబూతులు తిడుతూ వాళ్ళు వెంటనే వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిపోగానే మామ దాస్వేని బయటకు లాగాడు. జరిగిన విషయాన్నంతా చెప్పుకొని, వారిద్దరూ పొట్టచెక్కలయ్యేటట్లు నవ్వుకున్నారు. ఇవి కష్టదినాలు. ఈ కష్టదినాలలో ఒక చిన్న విజయాన్ని సాధించినా ఉత్సాహాన్ని ఇనుమడింపజేస్తుంది. ఆశయానికెంతో తోడ్పడుతున్నది.

* * * *

ప్రశాంతంగా కొన్నిదినాలు గడిపిన తర్వాత దాస్వే కలవరపడసాగాడు. తన మిత్రులెక్కడ వున్నదీ తెలుసుకోవాలనే ఆదుర్దా, తిరిగి పనిలో దిగాలనే ఆదుర్దా దాస్వేలో పెరిగినది. ఒకనాటి రాత్రి మామగారి రక్షణస్థావరాన్ని విడచిపెట్టి, దాస్వే మరల పొలాలలోపడ్డాడు. తాను తన తుపాకిని ఎక్కడ దాచిందీ వెతకసాగాడు.

పండువెన్నెలలో దాస్వే తన తుపాకిని పాతిపెట్టిన చోటుకై వెతకసాగాడు. కోయలియాంగ్ పంటమొక్కలు వరి బాగా ఎదిగినాయి. వాటిలో కలుపుమొక్కలూ బాగా ఎదిగి పంటను పాడుచేస్తువుండుటను జూచి దాస్వే విచారపడ్డాడు. కలుపు తీయాలని తనలో తాను అనుకున్నాడు.

అక్కడినుండి దాస్వే మరికొంతదూరం ముందుకు సాగాడు. ఒక చెట్ల గుంపులో ప్రవేశించాడు. అతనికి అకస్మాత్తుగా పలెకారియైన జోప్, హోషాంగులు ఎదురుపడ్డారు. ఒకళ్ళనొకళ్ళు కలుసుకొన్నందుకుగాను చాలా సంతోషపడ్డారు. కాని హోషాంగ్ ముఖం ఉత్సాహ రహితంగానున్నది.

దాస్వే చేతిని పుచ్చుకొంటూ అతడు "దాస్వే! నీకొక వార్త చెప్పాలి. చాలా కఠినమయిన వార్త అది. జపానువాళ్లు మీ నాయనను పట్టుకెళ్ళారు. చిత్రహింస జేశారు. నీ వెక్కడున్నదీ చెప్పమన్నారు. ఆయన నోరు మెదపలేదు వదిలిపెట్టారు. రెండురోజులు మాత్రమే బ్రతికాడు" అని చెప్పాడు.

దాస్వే హృదయం బాధాతప్తమయింది. విచారంతో కొయ్యబారిపోయాడు. మెల్లగా ఒక సమాధిపై కూలబడ్డాడు. ఆ వ్యక్తులిద్దరూ అతణ్ని వోదార్చటానికి యత్నించినప్పుడు మాత్రమే అతడు స్తబ్దదశనుంచి మేల్కొన్నాడు. దుఃఖం పొంగిపొరలింది. వెల్లువలై కన్నీరు ప్రవాహంగా మారినది. అతని ఏడ్పులు అంతకంతకు అధికమయ్యాయి. వళ్ళు గజగజ వొణకసాగింది. చిట్టచివరకు ఏడ్వటం మానివేశాడు. కళ్లు తుడుచుకొన్నాడు.

"జపాన్ రాక్షసులారా! దేశద్రోహులారా! మీ విషహస్తాలలో జబ్బుతోవున్న వృద్ధుణ్ని చంపారా! మిమ్మలను హతమార్చి తండ్రి రుణం తీర్చుకుంటాను!" అని శపథం తీసుకున్నాడు.

దాస్వే తమ్ముడు రియూ, ష్వాంగులతో, కలసి పనిచేస్తున్నాడని జోప్ విన్నాడు. పాతిపెట్టిన తుపాకులన్నిటినీ ష్వాంగ్ పెల్లగించి భద్రం జేశాడు. బ్రతికుండగానే అతడు పాతిపెట్టబడిన తర్వాత తేవారు రక్షించబడ్డాడు. జపానువాళ్ళ చేతులనుండి మేయీ తప్పించుకొన్నది. ఈ శుభవార్తలను వినగానే దాస్వే హృదయం కొంత తేలికపడింది.

ష్వాంగ్, బ్లాకీలు ఎక్కడవున్నారని దాస్వే అడిగాడు. తానిప్పుడే బ్లాకీవద్దనుండి వచ్చాననీ, పాత కార్యకర్తలందరూ షాంగ్‌తో కలసి సంఘాన్ని పునరుద్ధరించవలసినదిగా బ్లాకీ సూచించాడనీ, హోషాంగ్ అత

నికి చెప్పాడు ఎన్ని ఇబ్బందులు కలిగినాసరే. సభ్యులు ఒకరితో మరి యొకరు సంబంధాలు కలిగివుండాలని బ్లాకీ నొక్కిచెప్పాడు. ఆయుధాలను ఎన్నడూ విడిచిపెట్టరాదని చెప్పాడు బ్లాకీ. అవసరమైనప్పుడు శత్రువుల మీద ప్రయోగించమన్నాడు. ప్రజలలో బాగా పనిచేయమన్నాడు. జపాను వాళ్ల ప్రస్తుత తీవ్రతను తగ్గించుకోగానే, కార్యకర్తలు ప్రజాబలాన్ని సమీకరించాలన్నాడు. వేర్వేరుగావున్న శత్రుస్థావరాలను ధ్వంసంచేయా లన్నాడు. బ్లాకీ సూచనలివి.

తనతావులో యీ పనులకు ప్రారంభించవలసినదిగా బ్లాకీ, అప్పుడే ష్వాంగుకు చెప్పేవాడు" అని చెప్పాడు హోషాంగు."ష్వాంగు హిసియా గ్రామములో రహస్యంగావున్న రైతు "కోట"లో పని ప్రారంభించాడు. మనమంతా కలిసిపోవచ్చు."

వాళ్ల గ్రామాన్ని చేరుకోగానే తాము చేరుకోవాల్సిన రైతు ఇంటి చిరునామాను హోషాంగు మరచిపోయినట్లు బయటపడింది. అంతకంతకు వ్యాకులపడుతూ, వాళ్ల వేగుచుక్క పొడిచేటంతవరకూ, ఆ గ్రామం గొందులోపడి తిరుగసాగారు చీకటిలో హోషాంగు ఆ కొంపను గుర్తించలేకపోయాడు. వెతుకులాటమాని మరల పొలాలోనికి వచ్చి పడ్డారు.... వంతులువారీగా కాపలాకాస్తూ, గడ్డివాములో నిద్రపోయారు.

తెల్లవారుఝామున మంచు బాగా పట్టినది. కన్నుపొడుచుకున్నా ఎదుటమనిషి కానరావటంలేదు. పొడుగాటి కోయలియాంగు మొక్కలలో మనుషులు కదలిన చప్పుడు విని, దాస్వే మేల్కొన్నాడు. కాపలా కాస్తున్న హోషాంగు, పడి నిద్రపోతున్నాడు. దాస్వే అతణ్ని, జోవ్‌ను లేపాడు.

"లేపండి! ఎవళ్ళో వస్తున్నారు!" అని రహస్యంగా చెప్పాడు.

అతడు, హోషాంగు గడ్డివామివెనుక దాక్కున్నారు. కాని తుపాకి గల జోవ్, బయటనిలబడి శత్రువులకోసం ఎదురుచూడసాగాడు. కోయ లియాంగు చేలనుండి అయిదుగురు దేశద్రోహులు బయటికి వచ్చారు. గ్రామంపై దాడిచేయబోతూవున్న జపానువాళ్ళ దాడి.ముఠాకు ఆ దేశ ద్రోహులు దారి చూపుతున్నారు. జోవ్ రెండుగుళ్లు ప్రేల్చాడు. దేశద్రో

హులలో ఒకణ్ణి నేలకొరిగించారు. కంటికి కనపడకుండా పారిపోయాడు, అంటే దేశద్రోహులు తన వెంటపడేటట్లు చేశాడు జోవ్.

ఎదురు దిక్కుగా పానిపోతూవున్న దాస్వే. హోషాంగులు సూటిగాపోయి జపానువాళ్ళ హస్తాలలో పడ్డారు. ఒక్కవూపు వూపి హోషాంగు తన్ను పట్టుకున్న జపానువాడిని విదిలించి పారిపోయాడు. కాని దాస్వేని అనేకమంది చుట్టుముట్టారు. అతను చిక్కిపోయాడు.

• • • •

జపానువాళ్లు తమ ఖయిదీమైన దాస్వేని గ్రామంలోనికి యీడ్చుకొనిపోయారు. ఒక పెద్ద విల్లోవృక్షానికి కట్టేశారు. జపానువాళ్ళ ప్లాటూన్ నాయకుడైన ఇయినోకి కొద్దిగా చైనాభాష వచ్చును

"నీవు ఏం పని చేస్తావ్?" అని అడిగాడు.

"పుచ్చకాయలు పండిస్తా."

ఎర్రని విస్కీరంగు ముక్కుగల ఆ ప్లాటూన్ నాయకుడు తాను నమ్మటంలేనట్లుగా చీదరించాడు. దాస్వే చేతికండలను పిక్కకండలను గిల్లిచూశాడు. బలంగావున్న అతని భుజాలను పరీక్షించాడు.

"బాలూ పెద్దమనిషి!" అని వెక్కిరించాడు. యిద్దరు జపాను సైనికులు దాస్వే ముఖంమీద గ్రుద్దసాగారు. తమ భారీబూట్లతో యిష్టమొచ్చినట్లు తన్నసాగారు. జపాను సైనికదళమొకటి తలనుండి రక్తం విపరీతంగా కారుతున్న జపానుసైనికులు తమ కార్యక్రమాన్ని కొంతసేపు ఆపారు. అటు చూడసాగారు. ఆ ఖయిదీ హోషాంగు. ఇంతాచేస్తే అతణ్ణికూడా పట్టుకున్నారన్నమాట!

హోషాంగును దాస్వే ఎదుటికి త్రోశారు. "వీణ్ణి ఎరుగున్నావా?" అని పెద్ద పటకాను చేతితో పుచ్చుకొన్న దేశద్రోహియొకడు హోషాంగును అడిగాడు.

"వాణ్ణి నేనెరుగను, వాడు నన్నెలా ఎరుగుంటాడు?" అని జోక్యం కలుగజేసుకున్నాడు దాస్వే.

ఆ దేశద్రోహి తన పటకాతో ముఖం బ్రద్దలయేటట్లు దాస్వేముఖం మీద కొట్టాడు. "నీయమ్మ—నిన్నెవ డడిగాడురా?" అన్నాడు. హోషాంగును ఆ దేశద్రోహి వేధించసాగాడు. "చెప్పు, యెరుగున్నావా? లేదా?" అన్నాడు.

"నే.... నెరుగను" అని హోషాంగ్ జవాబు చెప్పాడు.

ఇద్దరు జపానువాళ్ళు అతణ్ణి క్రిందపడేశారు. నిర్దాక్షిణ్యంగా లాఠీలతో చావమోదారు. హోషాంగ్ ఏడ్చాడు. గొంతుబొంగురుపోయే టట్లు వెక్కి వెక్కి ఏడ్చాడు. అయితేనేం, లాఠీదెబ్బవర్షం ఆగలేదు. బాధాతప్తపెనుగులాటలో ఎలాగో లేచాడు హోషాంగ్, పొలాలపైపుకు పరిగెత్తాడు.

"ఇద్దరూ బాలూ లిద్దరూ చావాలి!" అని ప్లాటూన్ నాయకుడు కోపంలో మండిపోయాడు. తలకు గురిచూచి హోషాంగ్‌ను కాల్చాడు. హోషాంగ్ నేల కొరిగాడు.

దాస్వే కళ్లుమూసుకొన్నాడు. చావుకై ఎదురుజూశాడు. కాని రెండవగుండు ప్రేల్చబడలేదు. జడపదార్థంలాగున కదలకుండాపడివున్న హోషాంగ్ శరీరాన్ని చూశాడు దాస్వే. దాస్వేలో కోపం పొంగి పొరలింది.

"నన్ను చంపవేం?" అని అరచాడు దాస్వే.

"నీవు బాలూవా?" నొక్కి అడిగాడు ఒక దేశద్రోహి.

"అవును, నేను బాలూను! వూఁ కానీయండి. కాల్చండి."

సంతృప్తితో యికిలించాడు ఆ ప్లాటూన్ నాయకుడు. జపాను భాషలో ఏదో ఆ దేశద్రోహికి చెప్పాడు.

మరియొక ఖైదీని ముందుకు నెట్టారు. అతడొక వున్నతవ్యాపారి. చక్కని దుస్తులు వేసుకొనివున్నాడు.

నేను బాలూని కాదని అతడు గట్టిగా వాదిస్తున్నాడు. జపానువాళ్లు ఆ వర్తకునిపై బాముడు క్రమంగా ప్రారంభించారు.

"ఉండండి! ఉండండి!" అని అతడు అరచాడు.

"నాకో తమ్ముడున్నాడు. వాడూ మీరూ మంచి స్నేహితులు! వాడికోసమని మీరు నన్ను మంచిగా చూడాలి" అన్నాడా వర్తకుడు.

"నీ తమ్ముడెవరు?" అని ప్రశ్నించాడొక దేశద్రోహి.

ఆ వర్తకుడు కాలిమేజోడును విప్పతీశాడు. చైనాదేశంలో తాము ఆక్రమించుకొన్న ప్రాంతాలలో చలామణికొరకు జపానువాళ్ళు కరెన్సీని ముద్రించారు. దాన్ని ఆక్రమణ కరెన్సీ అంటారు.

ఆ వర్తకుడు ఆక్రమణ కరెన్సీ నోట్లచుట్టను తన కాలి మేజోడు నుండి బయటకులాగాడు. వాళ్ళ చేతి కందించాడు. "ఇదే నా సోదరుడు" అని నవ్వుతూ అన్నాడు.

"ఇది నిజముగా మీ మంచి స్నేహితుడుగాదా?"

"నువ్వు నిజంగా వ్యాపారివోయ్!" అని, వ్యాఖ్యానించాడా దేశద్రోహి.

జపాను ప్లాటూన్ నాయకుడు, బుడగలాంటి తన ముక్కును ముడతలు పడేశాడు. కళ్ళు కొట్టాడు. పచ్చని పళ్ళను యికిలిస్తూ బయట పెట్టాడు. డబ్బు! డబ్బు! అని, తల వూపాడు. "వ్యాపారి మంచివాడు!" చేతిని వూపుతూ "పో! పో!" అన్నాడు.

పిక్కబలంకొలదీ పరుగెత్తికొనిపోయాడా వ్యాపారి.

గ్రామంలోనివారందరినీ ఒకే వరుసలో నిలబెట్టారు. జపానువాళ్ల దాస్వే కట్లు విప్పేశారు.

బాలూ ఎవరెవరో వాళ్ళని బయటికిలాగమన్నారు. భయంతో వణికిపోతూవున్న స్త్రీలు, పురుషులు, యువకులు, వృద్ధులు-అతణ్ణి రెప్పార్పకుండా చూడసాగారు.

దాస్వేని ఆ వరుసవెంట ముందుకు నెట్టసాగారు జపానువాళ్ళు. రైతులలో నిలబడియున్న షావ్వాంగును చూసేసరికి దాస్వేకి ఆశ్చర్యమేసింది. "నువ్వు కమ్యూనిష్టువు. నీ గుండె బలమెలాంటిదో యిప్పుడు తేలుతుంది!" అన్నట్లుగా షావ్వాంగు దాస్వేవంక జూడసాగాడు.

తుపాకిపట్టుకొని జపానువాళ్ళ ప్లాటూన్‌నాయకుడు, "యిక్కడ వాలూ వుందా?" అని ప్రశ్నించాడు.

"లేదు:" అని అరచాడు దాస్వే.

ఇయినో తన పంది కళ్ళను వంచించాడు. సన్నీ మొనను దాస్వే గుండెపై నొక్కాడు.

"యెవరూ లేరు" అని పళ్ళునూరుతూ అన్నాడు దాస్వే. "పొండి వండి!" అరిచాడు.

ఆ జపానువాడు పందిలాగున మూలిగాడు. దాస్వేని ముందుకు నెట్టాడు. భయంతో చాలామంది ముఖాలు పాలిపోయాయి. చాలామంది ఆడవాళ్ళు భోరున ఏడుస్తున్నారు.

తన తమ్ముడైన రియూని, చెదరుగొట్టి మాను- అనేకమంది ప్రజాసైనికులను దాస్వే గుర్తుపట్టాడు. వాళ్ళతనివంక భయంగా చూస్తున్నారు. కాని, దాస్వే యెవరినీ బయటపెట్టకుండా 'గుర్తింపు' పరీక్షను పూర్తిజేశాడు.

ఇయినో కోపంతో మండిపోయాడు. అతని ఆజ్ఞను అనుసరించి, సైనికులు భయంకరమైన మూడు పెద్ద కుక్కలను బయటికి తీసుకొని వచ్చారు.

అవి తమ పళ్ళగుండా ఎర్రని తమ నాలుకలను బయటికిపెట్టి వూపుతున్నాయి. త్రాళ్ళను తెంచుకొని బయటపడాలని పెనుగులాడుతున్నాయి. ఇయినో యేదో ఆజ్ఞనిస్తూ మొరిగాడు. కుక్కల వీపుపైతట్టాడు. ఆ కుక్కలు ఒక్కదూకు దూకి, దాస్వే పిక్కలను లంకించుకొన్నాయి. తమ క్రూరదంష్ట్రిలతో మాంసపుకండలను కొరికేశాయి. దాస్వే పశువులాగున అరచాడు. అతని పిక్కలనుండి రక్తం ఏరులై పారసాగింది. కుక్కలను వెనక్కులాగారు.

దాస్వే బలహీనంగా వూగిపోయాడు. నుదుటిమీద పుచ్చెమటలు పోశాయి. ఆ జపానువాడు తన జబ్బలు చరిచాడు. మళ్ళీ ఏదోఆజ్ఞాపిస్తూ మొరిగాడు.

ఆ పైశాచిక జంతువులు మళ్ళీ మానవమాంసాన్ని చీల్చాయి. దాస్వే పెద్ద కూతపెట్టి మూర్ఛపోయాడు.

భయంతో గ్రుడ్లుమిటకరిస్తూ చూస్తూన్న జనంతోనుండి తలనెర సిన రైతు స్త్రీ ఒకామె ముందుకు పరుగెత్తుకొంటూ వచ్చింది. సాష్టాంగ పడింది. "వాణ్ణి ఆ విధంగా ఎలా బాధపెట్టగలుగుతున్నారు బాబూ! నా కొడుకు వాడు. నా కొడుకుని చంపేస్తున్నారా బాబూ." అని భోరున ఏడ్వసాగింది.

రైతాంగప్రజలందరూ మొత్తుకుంటున్నారు. భోరున ఏడుస్తున్నారు "వాడు మంచి పాలేరుపిల్లాడు" అని అరచారు. "కనికరించండి!" అని మొత్తుకోసాగారు.

ప్రజలతో వచ్చిన యీ సంచలనం ఏ విధంగా తిరుగుతుందో తెలి యక జపానువాళ్ళు తత్తరపడ్డారు. వాళ్ళు ఆ ముసలిదానిని ఒక్క తన్ను తన్ని ప్రక్కకుతోశారు. దాస్వేని అక్కడనుండి మోసుకొనిపోయారు.

గ్రామ మిలిటరీ పోలీసుస్టేషను దొడ్డిలోనున్న కొయ్యబోనులో తన్ను వుంచారన్న సంగతి దాస్వేకి తెలివిరాగానేబోధపడింది. సూర్యా స్తమానం అయినతర్వాత దాస్వేకి జైలర్‌గావున్న వృద్ధుడు అతన్ని సమీపించాడు.

"మీ అమ్మ వచ్చింది. మెల్లగా మాట్లాడుకోండి" అని రహస్య ముగా చెప్పా డా వృద్ధుడు. నీడలో నుంచున్న ఒక స్త్రీని ఆ వృద్ధుడు రమ్మని పిలిచాడు.

'మా అమ్మ చనిపోయి చాలా సంవత్సరాలయింది. ఈమె ఎవ రబ్బా!' అని ఆశ్చర్యపోయా డతను. చూడటానికి వచ్చిన ఆ వృద్ధురా లిని జాగ్రత్తగా చూశాడు దాస్వే. ఆమెకు అరవై సంవత్సరాలుంటాయి. ఆమె జుట్టు పూర్తిగా నెరసిపోయింది. ఒక తట్టను తీసుకొనివచ్చింది. ఆమె ఎవరోకాదు. జపానువాళ్ళు తమ కట్టకడపటి "తుడిచివేత" దండ యాత్రలో సజీవంగా వుండగానే షుగేన్ అనే పిల్లవాడిని పాతిపెట్టారు. ఆ షుగేన్ తల్లే యీ వృద్ధురాలని గుర్తించా డతను.

ఆమె జైలరుతో ఏదో చెప్పింది. ఆ వృద్ధుడు అక్కడనుండి వెళ్ళి పోయాడు।

బోను కడ్డీలను పుచ్చుకొని, ఆ వృద్ధ వనిత మోకాళ్ళమీదకూర్చుని బోర్లగిలాపడివున్న దాస్వేకి దగ్గరగా తలను పెట్టింది. "దాస్వే! నిన్ను నే నెరుగుదును. ఈ రోజునుండి నీ పేరు షుగేన్ అని చెప్పు. గుండెలు దిటవుగా వుంచుకొమ్మని ష్వాంగు చెప్పాడు. నీవేమీ వప్పుకోబోకు. గ్రామంలో ప్రతిమనిషీ నీకు అండగా నిలబడతామన్నారు. అయ్యో! నా తండ్రీ! యీ ఉదయం నీతోపాటు మేమంతా బాధపడ్డామోయ్! రోజల్లా గ్రామంలో ఎవరూ ఒక్కమెతుకయినా కొరకలేదు. నిన్ను కాపాడటాని కని డబ్బు ప్రోగుజేస్తున్నాము" అని చెప్పింది.

దాస్వే హృదయం ఆప్యాయతతో నిండిపోయింది. అతనిలో ఒక నూతనోత్సాహం జనించింది. కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. "అమ్మా! నీ హృదయాన్ని చిక్కపట్టుకో. బ్రతికినా, చచ్చినా గట్టిగా నిలబడతానని ష్వాంగుకుచెప్పు. నాకోసం మీరెవ్వరూ బెంగపెట్టుకోకండి" అన్నాడు దాస్వేహృదయం ద్రవించింది. చిరిగిన తన జాకెట్ అంచుకో కళ్ళు తుడుచుకుంది ఆ వృద్ధమాత. తనతట్టలోనుండి చాలా ఆహారాన్ని బయటకుతీసి బోనుకడ్డీలగుండా దాస్వేకి అందిచ్చినది. చిన్న నోట్లకట్ట కూడా బయటకుతీసి, జలపంతంగా దాస్వే చేతుల్లో వుంచింది.

"వ్యక్తిగతంగా నేను యిస్తున్నది" అని చెప్పింది. "ఎక్కువగా లేకపోయినా నీకు సాయపడుతుంది." అక్కడ ఎక్కువసేపు వుండలేక పోయింది. కొద్ది మాటలు చెప్పి ఆ వృద్ధమాత ఆ చోటును విడిచి పోయింది.

రెండురోజులు గడిచాయి. మళ్ళీ ప్రశ్నించుటకుగాను జపాను కమాండరు ఎదుట దాస్వేని హాజరుపెట్టారు. ద్వారానికి ఆవలివైపున నిలబడివున్న రైతులతోపాటు తాను జైలుబోనులో వుండగా చూడ వచ్చిన వృద్ధమాతకూడా నిలబడివుండటాన్ని దాస్వే గమనించాడు.

జపాను కమాండరు, పాలిపోయిన మనిషి కంటికి చిన్న అద్దాల జోడు తగిలించుకొని వున్నాడు. పొడుగాటి బల్లముందు కూర్చున్నాడు.

దానిప్రక్కన ఒక దుబాసీ, స్థానిక కీలుబొమ్మ సైన్యాల నాయకుడు కూర్చున్నాడు. దుబాసీ దాస్వేని నీ పేరేమిటి? వూరేమిటి? వృత్తియేమిటని అడిగాడు. తనపేరు షుగేన్ అనీ, తానా గ్రామవాసినని దాస్వే నొక్కి చెప్పాడు.

కీలుబొమ్మనాయకుడు బల్ల చెక్కలయ్యేటట్లు గుద్దాడు. "నీవు బాలూవి అవునా, కాదా?" అని అరచాడు.

"సంవత్సరం పొడుగునా దున్నటము, నాట్లువేయటము, కలుపు తియ్యటము. కోతలు కొయ్యటము యిదేపనితో సరిపోతుంది. నేను బాలూనవుటకు తీరికేది?" అని దాస్వే ప్రత్యుత్తరమిచ్చాడు.

"నీవు బాలూవికాకపోతే మొన్నటిరోజున బాలూనని యెందుకు చెప్పావు?"

"నేనేం చెపుతున్నానో నాకు తెలియకుండా వుండేవరకూ నన్ను చావబాదారు!"

కీలుబొమ్మ నాయకుడు ఏదో జపానువాడి చెవిలో వూదాడు. వాడు తలవూపాడు. వాడు ఒక కాగితం ముక్కమీద "కమ్యూనిస్టుపార్టీ" అని వ్రాశాడు. జపానువాడు దాస్వేకి చూపించాడు.

"నీవు కమ్యూనిస్టుపార్టీ!" అన్నాడు. దాస్వే తెల్లబోయాడు. అయితే జపానువాడు వ్రాయటం పూర్తికాలేదు. వాడామాటల ఎదుట 'X' అని వ్రాశాడు. "నీవు—కాదా!" అన్నాడు.

"బాలూ" "రహస్యంగా పనిచేసే వర్కరు" అన్న మాటలువ్రాసి దాస్వేకి చూపించినప్పుడల్లా ఆ జపానువాడు అదేపద్ధతిని అవలంభించాడు. ప్రతి తడప మృత్యుదండన విధించబోతున్నట్లుగా దాస్వేని అదరగొట్టాడు. చిట్టచివరకు ఆ జపానువాడు "పౌరుడు" అని వ్రాశాడు.

"నీవు-పౌరుడు-మంచిది, మంచిది! పోవచ్చు" అన్నాడు జపాను కమాండరు.

కరుణామయ మందహాసాన్ని వెళ్ళబోస్తూ, కీలుబొమ్మ నాయకుడు "మాన్యశ్రీవారు నిన్ను క్షమించారు; పోయి పొలం దున్నుకొంటూ

మంచిమనిషిగా బ్రతుకు" అన్నాడు. దాస్వే చేతులకుకట్టిన తాళ్ళను విప్ప దీయవలసిందిగా ఆజ్ఞాపించాడు.

దాస్వేని ప్రశ్నించిన ఆ పెద్దమనుషులిద్దరూ ఆ గదిని విడిచివెళు తుండగా, జపానువాడికి, కీలుబొమ్మ నాయకునికి జరిగిన సంభాషణ బయటివాళ్ళకు వినిపడుతూవుంది. జపానువాడిలా అంటున్నాడు. "ఈ కేసులో బాగా డబ్బు సంపాదించావనుకుంటాను. ధనవంతుడివికా!"

తన సుగుణత్వాన్ని వెళ్ళబోస్తూ కీలుబొమ్మ నాయకుడు వ్యతిరే కించసాగాడు. "నేను డబ్బు కేసుకుంటూవుంటే మిరివి చేయవచ్చు"అని తన కంఠానికి అడ్డంగా చేతినిపోనిచ్చి చూపాడు.

జపానువాడు యికిలింతగా నవ్వాడు. అంతే!

దాస్వే వీధిలోకిరాగానే అతణ్ణి డజనుకొలది రైతులు చుట్టేశారు! అతని గాయాలకు కట్లుకట్టారు. శుభ్రమైన గుడ్డలు యిచ్చారు. గ్రామం వెలుపలవరకూ వెంటవచ్చారు. అతనికి హస్యేలియూ అంత సురక్షిత మయిన ప్రదేశంగాదనీ. జపానువాళ్ళు చురుకుగాయుండని గ్రామము మరియొకటి గాలదనీ, ఆ గ్రామానికి తీసుకొనిపోతామని చెప్పారు రైతులు.

వాళ్ళావిధంగా కొద్దిమైళ్ళు మాత్రమే నడిచారు. ధూళిని రేపె డుతూ దూసుడుగా ఒక అశ్వికదళం ఆ రోడ్డువెంట వస్తోంది. దాని దారి నుండి తప్పుకోటానికిగాను రోడ్డుప్రక్కకు తొలగాల్సి వచ్చింది. గుర్రపు దళంలో మొదటివాడు బందిపోటుదొంగ హోలాగున్నాడేయని దాస్వే అనుకున్నాడు.

"నగరంలోవున్న జపానువాళ్ళకు సిడిభుజం లాంటి మోటామనిషి, పోదాంపదండి!" అని చెప్పారు గాజరాగా ఆ రైతులు.

అప్పుడే ఒక రౌతు గుర్రాన్ని వెనక్కి త్రిప్పి దౌడాయిస్తూ వచ్చాడు. వాడి నడుముకు ఒక పిస్తోలువుంది. "అక్కడే నిలబడండి! ఏంజేస్తున్నారిక్కడ? అని అరిచాడు.

ఆ దుష్టపుముండాకొడుకు జిన్లంగు! భూస్వామిక తొత్తు! జపాను వాళ్ళు గ్రామీణప్రాంతాలలో అంటువ్యాధిలాగా వ్యాపించిన తర్వాత

జిన్లంగు దేశద్రోహిగా తయారయ్యాడు. తన పాత యజమాని హోకి తోడుగా జేరాడు. జిన్లంగు గుర్రంమీదనుండి ముందుకివంగి దాస్వేవంక అదే పనిగా జూశాడు.

"ఆహా! నీవే అనుకున్నా!" అన్నాడు సంతోషంతో పొంగిపోతూ జిన్లంగు. తన పిస్తోలు బయటికిలాగి గుర్రాన్ని దిగాడు. "ఎంత అదృష్టము! తోసుకొంటూవచ్చి నీమీదపడ్డాను. నాతో రా!" అన్నాడుజిన్లంగు.

"ఏమంటున్నావ్?" అని అరచింది దాస్వే వృద్ధమాత. "జపాను వాళ్ళిప్పుడే అతణ్ణి వదిలారు. మనమంతా చైనావాళ్ళం."

ముఖంమీద బలంగా ఒక దెబ్బకొట్టి జిన్లంగు ఆమెను నేలకొరిగించాడు. తన పిస్తోలుతో దాస్వేని నెట్టుకెళ్ళాడు. "నీవొక పెద్దవీరుడవు కదూ మిస్టర్ కెప్టెన్." అని వెక్కిరించాడు. "కమాండరు హోగారి ఎదుట మీ వీరత్వాన్ని కొద్దిగా ప్రదర్శింతురుగాని!"

మరియిద్దరు రౌతులుకూడా వెనక్కి వచ్చారు. నిస్సహాయంగా కోపంతో మండిపోతున్న రైతులను వారు అదిమిపట్టుకున్నారు.

"నీవీవిధంగా తయారవుతావని నాకు తెలుసు! వీరుడిని అయినా కాకపోయినా, కనీసం నేను కుళ్ళుకంపుకొట్టె దేశద్రోహినిగాదు. పోదాం పద! నేను ఏదోఒకనాడు నీకన్నా వుత్తముణ్ణి అనిపించుకోకపోతే మా అయ్యను నేను పుట్టలేదను!" అని అరచాడు దాస్వే.

తనకు సహాయంగా వచ్చిన ఆ యిద్దరు కీలుబొమ్మలకు తన గుర్రాన్ని వప్పగించాడు జిన్లంగు. దాస్వే చేతులను భద్రంగా వెనక్కి విరచికొట్టాడు. రోడ్డుమీద ముందుకు తోసుకొనిపోయాడతణ్ణి.

* * * *

1940లో జపానువాళ్ళతో చేరిపోవుటకు హో తన గ్రామంనుండి పారిపోగానే, హోజ్వాంగు గ్రామంలోని రైతులు హో ఎవరెవరివద్ద నుండి భూమిని గుంజుకొన్నాడో వారికి వారిపొలాన్ని సంక్రమింపజేశారు.

రైతాంగప్రజలు తమరక్తాన్ని ధారబోసి పండించుకొన్న ధాన్యాన్ని హో గుంజుకొని, తన ఆవరణలో పాతరేశాడు. రైతులు ఆ పాతర్లనుండి ధాన్యాన్ని బయటకులాగి క్షామబాధితులకు పంచిపెట్టారు.

అటుతర్వాత 1942 లో ప్రతిఘటనోద్యమానికి వ్యతిరేకముగా జపానువాళ్ళు జరిపిన దండయాత్రలో జపానువాళ్ళ తరఫున ఒక నాయకుడుగా తన గ్రామానికి తిరిగివచ్చాడు. రైతులనుండి మరల పొలాన్ని గుంజుకొన్నాడు. ఇంటింటికి తిరిగి కనపడిన ఆహారాన్నంతనూ దోచాడు. పశువులను దోచాడు. కార్యకర్తలకోసం వెతకసాగాడు. అదృష్టవశాత్తు స్నేహితుల, తమ బంధువుల సహాయంతో కార్యకర్తలు, వారి దగ్గర కుటుంబాలు తప్పించుకొన్నారు. ఒక్కరినీ పట్టుకోలేకపోయేసరికి హో కోపంతో మండిపోయాడు. కార్యకర్తల, వారి దగ్గరకుటుంబాల ఇళ్ళను మంటలకాహుతి జేశాడు. ఆవిధంగా తనకోపాన్ని తీర్చుకున్నాడు.

హోజ్వాంగ్ గ్రామంలోని యీ రాక్షసుని భవనానికే దాస్వేని తీసుకుపోయారు. దొడ్డిలోనున్నగదిలో అతణ్ణి బంధించారు.

ఆ సాయంత్రము జపాను జనరల్ కామెసాకా ఆ గ్రామముగుండా వెళుతూ, తన పాతస్నేహితుని చూచిపోదామని ఆగాడు. హో అతనికి అత్యద్భుతమయిన విందుచేశాడు. మంచి విలువగలిగిన ద్రాక్ష సారాయాన్ని సేవింపజేశాడు. హో అతణ్ణి భట్రాజులాగున పొగడాడు.

ఆ జపానువాడిది పాంకోడు డెక్కలాంటి ముఖం మెలితిరిగిన పొడుగాటి మీసాలు, వాటిని ఎప్పుడూ తిప్పుతూవుంటాడు. ఇదీ అతని అవతారం. చైనావాళ్ళ ఎదుట తన గొప్పతనాన్ని ఎప్పుడూ ప్రదర్శించుకొంటూ వుండుటకు వుబలాటపడుతూవుంటాడు. వాడికి చైనాబాష బాగా వచ్చు. తన గడ్డాన్ని పైకెత్తి పచ్చని తన కళ్ళను హోపై కేంద్రీకరించాడు. వాడు మాటాడితే ఆటవాళ్ళు మాటాడుతూవున్నట్లు వుంటుంది. గర్వంగా హోతో మాటాడసాగాడు,

"ప్రపంచంలోకెల్లా జపాను పెద్ద బలంకల దేశం. జపాను సామ్రాజ్యసేన పసిఫిక్ మహాసముద్రంలో అమెరికావాళ్ళను పూర్తిగా ఓడించివేసింది. కూర్చుంటే లేవలేనిస్థితిలోనున్న చిన్నదేశమైన యీ చైనా మామీద యుద్ధంచేయయత్నించరాదు!" అన్నాడు కచ్చితంగా.

చైనా-జపాను సహకారాన్ని గురించి వాంగ్-చింగ్‌వైయొక్క పెద్దమనిషి తరహాని గురించి కామెసాకా అతి విస్తారంగా మాటాడాడు. చియాంగ్‌కై షెక్‌కూడా చెడ్డవాడు కాదని అన్నాడు. ఎందువలనంటే, అతడు దొద్దారిన "జపాను సామ్రాజ్యసేనకు" దోహదమిస్తున్నాడని అన్నాడు. యదార్థమైన ప్రమాదం యదార్థశత్రువు కమ్యూనిస్టుపార్టీ మాత్రమేనన్నాడు. అందువలన కమ్యూనిస్టుపార్టీని నాశనం చేయుటకు మనమంతా చేతులు కలపాలన్నాడు. కమ్యూనిస్టుపార్టీని హతమార్చాలని ఆ జపానువాడు వుపన్యాసమిస్తుంటే జపానువాని బుషిదోతత్వం అతనిలో వుప్పొంగినది. అతని ముఖంమీద రక్తనాళాలు వుబ్బినాయి.

"కమ్యూనిస్టులను నాశనంచేయుటమంటే అడవిని నరికేయటం అన్నమాట!" అని అరచాడా జపానువాడు. వాడు ఈ మాటలు చెపుతూ వున్నప్పుడు వెయ్యి కోకిలలు ఒక్కసారి కూశాయనిపించింది. నీవు కొమ్మలను మాత్రమే నరికేశావా. చెట్లు ఇంకా సజీవంగా వుంటాయి. ఈ కమ్యూనిస్టులకు రహస్య ప్రజాసంఘాలు వ్రేళ్లలాంటివి. అందువలన వీటిని త్రవ్వివారేయాలి. చెట్టును సమూలంగా నాశనం చేయాలి. అప్పుడు మాత్రమే కమ్యూనిస్టులు నశిస్తారు.

జపాన్ జనరల్ వెళ్ళిపోయిన తర్వాత హో దాసీని తన ఎదుటకు రప్పించుకున్నాడు. ఈ "సందర్శనం" జరగవలసిన గదిలో రెండు పెద్ద లాంపులు వెలుగుతున్నాయి. అవి గదినిండా వెలుతురు చిమ్ముతున్నాయి. ఖూనీకోరులయిన హోయొక్క తొత్తులు భయంకరంగా అక్కడే హో ప్రక్కగా నిలబడివున్నారు. గదిలో ఒకప్రక్కన కత్తులు, కఠారులు, లాఠీలు, కొయ్యగడలు, చాకులు, బాకులు, తాళ్ళు వున్నాయి. వీపుమీదపెట్టి నొక్కి బొమికలు విరగగొట్టటానికి ప్రత్యేకంగా తయారు జేయబడిన పెద్దదుంగ వున్నది. వాతలుపెట్టేందుకు యినుపకడ్డీలు, పట

కాటలువున్నాయి. ఒక చిన్నపొయ్యి వుంది. పొయ్యని వెలిగించి అవ్వటికి యినుపకడ్డీలను ఎర్రగా కాల్చి వుంచాడ నరకగుహలో ప్రవేశించానాయని దాస్వే అనుకోసాగాడు.

"మేం మీకోసం అన్నీ సిద్ధంచేయించాం. తమకు ఎలాంటి ఆహారం కావాలో చెప్పండి. మీ చిత్తమొచ్చిన భోజనాన్ని చేయిస్తాం." అన్నాడు హో విషపునవ్వు నవ్వుతూ.

హో యొక్క రాక్షసులలో ఒకడు దాస్వేని ముందుకునెట్టాడు. "మోకరించు!" అని ఆజ్ఞాపించాడు.

"ఎందుకు?" అని డిమాండు చేశాడు దాస్వే. "నేను నేరస్థుడిని కాదు!"

"వంగరా లంజకొడకా!" అని హో మొరిగాడు.

ద్వేషాన్ని వెళ్ళగక్కుతూ దాస్వే పెదిమలు మెలితిరిగాయి! "దేశద్రోహివైన ఒక వెధవముందా!

రుచి చూపించండి!" కోపముతో మండిపోతూ హో మొరిగాడు....

ఇద్దరు రాక్షసులు దాస్వే చేతులను లంకించుకొన్నారు. మూడవవాడు దాస్వే నుదుటిమీద గుడ్డ గట్టిగా బిగించాడు. మరియొకడు మంచి గంధం చెక్కతో దాస్వే బుగ్గలమీద చరిచాడు. ఆవిధంగా డజనుసార్లు బాదారు. దాస్వే నోరు నెత్తుటితో నిండిపోయింది. వుబ్బిపోయింది. వాళ్ల ఆ బాదుడు కార్యక్రమం ఆపేసరికి దాస్వే కళ్ళలో ఒకటి మూసుకొనిపోయింది దానినుండి రక్తం కారసాగింది.

హో మరల తన ప్రశ్న పరంపరను సాగించాడు. "షాంగ్, బ్లాక్‌ప్లేన్లు ఎక్కడున్నాయిరా?"

"నాకు తెలియదు!

"ఆరాత్రి నీవూ, ష్వాంగూ నన్ను అరెస్టు చేయటానికి వచ్చారు కదా—మీకు నేను యిక్కడికివచ్చానని ఎవరు చెప్పారురా?"

ఇంకా పొడవనికంటితో దాస్వే హోవంక తీవ్రంగా జూశాడు. "నన్ను అడుగబోకు. దానివల్ల నీకేమి లాభంకలుగదు."

హో మృత్యుహాసాన్ని చిలకరించాడు. "వాడికి తిండిచాలలేదురా జొన్నపులుసు పెట్టండి."

ఆ రాక్షసులు దాస్వేని వెనక్కి గుంజాడు ; ఒక బొక్కెనుడు పచ్చని మిరికిద్రదాన్ని ముక్కులలో పోశారు. "ఈ భోజనాన్ని పసందుగా తింటావురా." అని హో అనటం దాస్వేకి వినపడింది. ఆ మిరికి ద్రావకం దాస్వే మెదడును తింది. అతడు మూర్ఛపోయాడు. కాగితం పొగ అతని ముక్కులోకి దూరించి. అతని ముక్కులక్రింద కాగితం పొగబెట్టారు. అతనికి స్పృహవచ్చింది.

హో అతనివంక పైశాచిక సంతృప్తితో చూచాడు. "ఓయ్! మంచి బలమున్నమాట నీకు. సరే అయితే విను. నీకు యినుములాంటి నోరున్నా, రాగిలాంటి పళ్లున్నా దేవదారు చెక్కలాంటి నాలుకవున్నా మసిము లంకించుకొంటే నుజ్జునుజ్జు అవుతాయి. తెలుసా! మనదెబ్బకేవీ ఆగవ్!"

"నీకెందుకొచ్చిందిరా యీ బాధ! ఆ కాస్తాచెప్పేసెయ్! వదలిపోతుంది" అన్నాడు జిన్లంగ్ స్నేహపూర్వకంగా. అతని పెదవులనుండి సిగరెట్ వ్రేలాడుతూవుంది. "నీవొక పార్టి సభ్యుడవు. ఏం జరుగుతున్నదీ వాస్తవానికి నీకు తెలుసు. జిల్లా ప్రభుత్వంలో నీవొక పెద్ద అధికారివి. గ్లకిత్సే నీకు అన్నయ్య అవుతాడు. షావాంగ్‌కు నీవు కుడిభుజానివి. ఎక్కువగా నీవే ప్రజాసంఘాలను ఏర్పాటుచేస్తూ వుంటావు. నీకు తెలిసినవన్నీ చెప్పేసెయ్! నిన్ను సరిగా చూస్తాం. లేకపోతే యీ లోకములో నీవు బ్రతికి బట్టకట్టటం దుర్లభం. నేనూ నీవుచేసిన పనినేచేస్తూ వుండేవాణ్ని గదా? నేనూ నీలాంటి మనిషేనా కదా? ఏం? నేను యీ పక్షానికి వచ్చేశాను. శుభ్రంగా బాగుపడ్డాను ! చూస్తున్నావుగదా!" అన్నాడు జిన్లంగ్.

దాస్వేకి కోపంతో వళ్ళంతా వణికిపోయింది. ఒక గుక్కెడు నెత్తురుతో నిండిన చొంగును దాస్వే, జిన్లంగ్ ముఖంమీద వుమ్మేశాడు. "దేశద్రోహి తొత్తుకొడకా! మనిద్దరం ఒకేరకంగా ఎప్పుడున్నాంరా!"

దాస్వేకి కోపంతో వళ్ళంతా వణికిపోయింది. ఒక గుక్కెడు నెత్తురుతో నిండిన చొంగను దాస్వే, జిన్లంగ్ ముఖంమీద వుమ్మేశాడు. "దేశద్రోహితొత్తుకొడకా! మ నిద్దరం ఒకేరంగా ఎప్పుడున్నామురా?" అన్నాడు.

ఎర్రగా కాలిన ఒక యినుపకడ్డీని తీసుకొన్నాడు జిన్లంగ్. దాస్వే వీపుమీద అడ్డంగా నొక్కాడు దాన్ని. బుసబుస ధ్వనీ మాంసం కాలిపో తున్న ముక్కలు పగిలే కంపు. దాస్వే పెదబొబ్బలతో మిశితమైపో పోయాయి. అతని కళ్ళవెంట వచ్చినవి కన్నీళ్ళుగాదు; నెత్తురు!తాత్కాలి కంగా సంతృప్తిజెంది, జిన్లంగ్ ఆ ఎర్రనికడ్డీ నొకపక్కకు విసరి వేశాడు.

హో నెమ్మదిగా సిగరెట్ దమ్ము పీల్చుతూ క్రీగంటితో ఆ చిత్ర హింసకు లోలోన ఆనందిస్తున్నాడు. అకస్మాత్‌గా సిగరెట్ ముక్కను పారేసి, చిరునవ్వును వొలకబోస్తూ "దాస్వే! పెంకితనాన్ని వదలిపెట్టు" అని కృత్రిమంగా నవ్వుతూ బ్రతిమాలాడు. "కోడిగ్రుడ్డుతో కొండను పగులగొట్టగలవా? లేవు! ఎన్నటికీ పగులగొట్టలేవు. అనవసరంగాఎందుకు బాధపడతావ్? బ్లాకీ, ష్వాంగ్‌లకోసం నీ వీ విధంగా బాధపడడ మెందుకు చెప్పు? ఇంకాకూడా గట్టిగా నిలబడ్డావా, నీకు చావు తప్పదు; నీకోసం ఎవ్వరూ ఏడ్వరు" అన్నాడు హో.

దాస్వేకి కట్లను విప్పదీయవలసిందిగా తనవాళ్ళను ఆజ్ఞాపించాడు హో. ఒక స్టూలుమీద కూర్చోనిచ్చాడు దాస్వేని. "ఇదంతా నేను చేశా నని కపులో పెట్టుకోబోకు" అని వాదించసాగాడు హో. "నేను కొద్దిగా తాగుతున్నాలే. ఆ కుర్రాళ్ళు నీయందు మొరటుగా ప్రవర్తించారు.అందుకు నేను క్షమార్పణ వేడుకొంటున్నా. నీకేదో చెడు చేద్దామన్న వుదేశ్యం మాకులేదు. దీన్ని కడుపులో పెట్టుకోబోకు. జిన్లంగ్‌వంక చూడు. మాతో అతడు సుఖంగా వుంటున్నాడు. మంచి తిండి తింటున్నాడు. మంచిగుడ్డలు వేసుకొంటున్నాడు. ఖర్చుపెట్టుకోటానికి చేతినిండా డబ్బువుంది. నువ్వు

ఖ్యగా సంచరిస్తె, నిన్ను ఒక అధికారిగా చేస్తా. ధనవంతుడవవుతావ్" బోధించసాగాడు హో.

హో ఆ విధంగా మాట్లాడుతూవున్నప్పుడు అతడు తన బలిపశు వైన డాస్వేపై రెప్పార్పకుండా కళ్ళు కేంద్రీకరించి చూడసాగాడు. కాని దాస్వే తన తలను వంచుకొని, యీ మాటలు వింటున్నాడు. జవాబేమీ చెప్పలేదు. అతణ్ని వప్పించగలిగా ననుకున్నాడు హో. జిన్లంగ్‌కు కన్ను కొట్టాడు. జిన్లంగ్ బయటికిపోయాడు.

"ప్రతిఘటనోద్యమానికి సంబంధించినంతవరకు, నేను కూడా దానితో పనిజేశాను" అని తన ఉపన్యాసాన్ని మృదువుగా సాగించాడు హో. "యిప్పటికికూడా నేను జపానువాళ్ళకు వ్యతిరేకమే: అయితే మీ రున్నంత చురుకుగా నేనిప్పుడులేను. ఏమైనప్పటికీ, యుద్ధం ఎక్కువ కాలం సాగుతుందిగదా: తొందరేముంది?" అన్నాడు హో.

జిన్లంగ్ వెంట ఒక ట్రేనిండా ఆహారాన్ని, ద్రాక్షసారాయాన్ని వుంచుకొని ఒక మనిషి వచ్చాడు. ఆ ట్రేని దాస్వే ఎదుట ఒక చిన్న బల్లపై వుంచాడు. హో మహోదాత్తంగా తన చేతినివూపాడు.

"కామ్రేడ్ డాస్వే: భుజించండి. విశ్రాంతి తీసుకోండి. మీరు చాలా ఉదాత్తపురుషులు. ఇప్పటినుండి మనమందరము స్నేహితులుగా వుందాం" అన్నాడు.

కోపంతో కుతకుత వుడికిపోతున్న డాస్వే ఆ పళ్ళెములోనుంచి చిక్కని పులుసు కప్పు ఒకటి తీసుకొన్నాడు. హో సాటినొపట్టి షెర్వానీ మీద విసరికొట్టాడు. హో ముఖం ఎర్రబడింది.

"ఈ వేధవకు మంచీ చెడూ తెలియదు" అని అరచాడు హో. "నేనొక మంచిమార్గాన్ని చూపించా: వాడికి బాగుపడే రోజు లుంటేగా. నన్ను వ్యతిరేకించి బ్రతగలడేమో చూస్తా" అన్నాడు హో. పెనుగు లాడుతున్న ఆ ఖైదీని ఆశ్చర్యపోయిన ఆ దేశద్రోహులు గట్టిగా పట్టు కొని తన్నారు.

వాళ్ళు దాస్వేపై ఆకలిగొన్న క్రూరమృగాలులాగున పడ్డారు. ఆ రాక్షసుల బుర్రలకు తోచినవిధంగా అన్నిరకాల భయంకర సాధనాలను వినియోగించి దాస్వేని గంటలకొలది క్రూరాతిక్రూరంగా బాధించారు. నిశాంత సమయ మది.

అయినప్పటికీ దాస్వే ఆ రాక్షసులకు ఒక్కటి వస్యంతయినా రహస్యాలను బయటపెట్టలేదు. అతణ్ని వేధిస్తున్న ఆ రాక్షసులే అలసిపోయారు.

నున్నగా వున్న, ధగధగా మెరుస్తున్న బట్టతలపై పట్టినచెమటను తుడుచుకొన్నాడు హో.

"వీడు మనిషిగాడు" అని అరచాడు ఆ దేశద్రోహి హో. "బయటకి తీసుకొనిపొండి. తలను నరికెయ్యండి. వాడి వళ్ళు కోసి కుక్కలకు వేయండి!" అని ఆజ్ఞాపించా డా దేశద్రోహి హో.

గ్రామం వెలుపలి ప్రదేశానికి; రక్తం కారుతూవున్న, స్పృహ లేకుండా పడివున్న దాస్వే శరీరాన్ని యిద్దరు కీలుబొమ్మసైనికులు మోసుకొనిపోయారు.

రెండువైపులా పదునుగల ఖడ్గాన్ని ధరించి, వాసుకికాయ జిన్లంగ్ వాళ్ళకు నాయకత్వం వహించి దారిచూపుతున్నాడు. ఆ మృత్యుసైనికుల వెంటా వెనకాల హో రాక్షసుని వేటకుక్కలనేకం వస్తున్నాయి. తమ ఆహారాన్ని త్వరగా తినబోతున్నామంటూ తోక లాడిస్తున్నాయి.

పాలిపోయిన చందమామ యింకనూ ధవళాకాశంలో మెరుస్తున్నాడు. తెల్లవారబోయేముందు గ్రామంలోనివారంతా గాఢనిద్రలో మునిగివున్నారు.

దాస్వేకి తెలివి వచ్చింది. తా నొక పెద్ద ఖర్జూర చెట్టుక్రింద వున్నానని తెలుసుకున్నాడు. తనచుట్టూ భయంకరమయిన కుక్కలు పేరాశతో కనిపెట్టుకొనివుండడం చూశాడు.

జిన్లంగ్ ఒక బండపై తన ఖడ్గానికి పదునుపెట్టుకొంటున్నాడు. ఆ

రాయి బలిపీఠంగా గోచరించింది దాస్వేకి. ఆ వెన్నెలలో ఖడ్గం యెంత మిలమిలా మెరుస్తూవున్నది!

దాస్వేని మోకాళ్ళపై బలవంతంగా కూర్చోపెట్టారు. తన భారీ ఖడ్గాన్ని పైకెత్తసాగాడు జిసంగ్. దాస్వే మెదడు అతణ్ని మరల అంధకారంలోనికి తోసివేసింది. దాస్వేకి మైకం కమ్మింది. ఏమి జరుగుతున్నదీ అతనికి తెలియటంలేదు.



# 10 అధ్యాయం

"ఆగండి! ఆగండి!" అని అపస్తా గ్రామంనుండి ఒక కీలు బొమ్మసైనికుడు పరిగెత్తుకొంటూ వచ్చాడు. జిన్లింగ్ చేతిని గట్టిగా పట్టుకొన్నాడు.

"కమాండర్‌గారు యేమన్నారంటే: వాడిని చంపవద్దన్నారు. వెనక్కు తీసుకొనిరమ్మన్నారు."

మైక మింకా వదలని దాస్వో తాను చనిపోయానా యని ఆశ్చర్య పడ్డాడు. ఇదేమిటి నా తల యింకా భుజాలపైనే వుందే? హో భవనానికి మోసుకొనిపోయి మళ్ళీ దొడ్డిలోనున్న గదిలో బంధించారన్న విషయం లీలామాత్రంగా గుర్తువుంది దాస్వోకి.

జిన్లింగ్ సందిగ్ధావస్థలో పడ్డాడు. తన ఖడ్గాన్ని అలాగే చేతిలో పుచ్చుకొని హోగారిని చూడటానికి పోయాడు. అక్కడ హోగారిచుట్టూ వృద్ధుడైన అతని తండ్రి, తల్లి యితర బంధువులు మూగివున్నారు. వాళ్ళందరూ ఏక శృతిలో ఏడుస్తున్నారు. హోగారు అంగరక్షకుని పైవిపరీతంగా హెచ్చుస్థాయిలో నాలుక ఝాడిస్తున్నారు.

ఆ పరిస్థితులు జూచినతర్వాత ప్రశ్నలు వేయటానికి జిన్లింగ్‌కు ధైర్యం చాలకపోయింది. వాడు ఒకప్రక్కన కూలబడి విషయాలన్నిటినీ శ్రద్ధగా వినసాగాడు. చుట్టూరా గోడలుగల పట్నంనుంచి హోగారి

కొడుకు గోపీ అంగరక్షకుని వెంటబెట్టుకొని వస్తూవున్నాడట. ఈ విష యాన్ని షాంగ్‌యొక్క గెరిల్లాలు పసికట్టారట. వాళ్ళు అమాంతంగా హోంగారి పుత్రరత్నమైన గోపీని, అంగరక్షకుని లంకించుకొని బంధించి ఖైదీలుగా పట్టుకెళ్ళారుట. దాస్వేని వదలిపెట్టేటట్లయితే గోపీని వదలి పెడతామని ఒక జాబువ్రాసి అంగరక్షకుని చేతికిచ్చి పంపారు. దాస్వేని ఎక్కడకు తీసుకొనివచ్చి వదలిపెట్టాలో ఆ ప్రదేశాన్ని నిర్ణయించి పంపారు గెరిల్లాలు. మరునాటివరకూ హోంకు టైము యిచ్చారు. ఆ టైము లోపల దాస్వేని వప్పగించకపోతే, గోపిని ముక్కలుముక్కలు కోస్తా మని షాంగ్ ఆ జాబులో హెచ్చరించాడు.

తాను బంధింపబడియున్న ఆ చిన్నగదిలో దాస్వే కళ్ళుతెరచి చూశాడు. అతని గాయాలనుండి కారిన రక్తం, పది పన్నెండు తావులలో పుద్దకట్టింది. గుడ్డలను, శరీరానికి గట్టిగా అతికించివేసింది. ఆ కటికనేల మీద పరుండటం బాధాకర మనిపించింది దాస్వేకి. కాస్త లేచి కూర్చుందా మని యత్నించాడు.

కాని బాధ మిక్కుటమయింది. వేయి కత్తులతో పోట్లుపొడుస్తున్న ట్లనిపించిం దతనికి. చిత్రహింస జేయబడుతున్నప్పటికంటె యిప్పుడు బాధ అధికమైపోయినట్లుగా తోచిం దతనికి. గోడకు తలఆనించి బలహీ నంగా భగ్నహృదయంతో రోదించసాగాడు దాస్వే.

ఈ నరకంలో ఎలా పడ్డాను? అని విచారపడసాగా డతను. నేను ఉద్యమంలో చేరకపోయినట్లయితే, గొప్పయింటివాకని ఎదిరించకపోయి నట్లయితే యీ నరకంలో పడేవాణ్ణికాదుగదా అనుకొన్నాడు. ఇది ఘోర మైన నరకం! నా సంగతి ఎవరికీ పట్టినట్లులేదు. చచ్చానో బ్రతికానో ఎవరూ విచారించరుగదా! నే నెలాంటి యమయాతనపడుతున్నదీ ఎవరికి పట్టలేదు అనుకోసాగాడు.

భరింపరాని బాధతో నిండిపోయిం దతని శరీరం. "దీన్ని భరించే దెలా?" బాధానివృత్తికై తహతహలాడాడు. "నాకు చావుకలిగితే యీ బాధ పోవునుగదా" యనుకున్నాడు.

చనిపోవుటకు గల మార్గా లన్నింటినీ మనస్సులో ఆలోచించుకో

సాగాడు. కాని చేయగలిగినదల్లా తలను నేలకేసి కొట్టుకోవటంమాత్రమే అది చేస్తామన్నా శరీరంలో ఏ అంగాన్నీ కదిలించగల స్థితిలో లేడు.

దాస్వే బలవంతంగా ఒక కన్ను తెరచాడు. ప్రకాశవంతంగావున్న సూర్యరశ్మివంక జూశాడు. సూర్యరశ్మి కిటికీ పునాది అంచులపైపడుతూ వున్నది. చిలుకలు, గోరువంకపిట్టలు కిలకిల సవ్వడిచేస్తున్నాయి. ఎందుకనో తెలియదుగానీ సూర్యరశ్మిని చూడగానే దాస్వేకి బ్లాకీల్సే, మేయీ తదితర కామ్రేడ్స్ జ్ఞాపకానికి వచ్చారు.

వాళ్ళకు ఏ గతి పట్టిందో తెలియదుగాని, బ్రతికున్నట్లయితే మాత్రం తప్పకుండా గట్టిగా నిలబడి పోరాడుతూ వుండివుంటారని అనుకున్నాడు. తాను చేయెత్తి పరిస్థితి ఎంత కఠినంగావున్నాసరే గట్టిగా నిలబడి పోరాడుతానని శపథం జేసినరోజు అతనికి జ్ఞాపకంవచ్చింది.

"నేను ఏమని ఆలోచిస్తున్నాను?" అని తన్ను తాను తిట్టుకోసాగాడు. "నేను కమ్యూనిస్టునా! ప్రజల మన్నన పొందటానికి అర్హుడను గాను. జపానువాళ్ళ క్రూరత్వానికి గురియవుతూగూడా ప్రజలేమో గట్టిగా నిలబడి పోరాడుతూ యీ యమయాతనలు పడుతూవుంటే, కాస్త బాధను అనుభవించానో, లేదో చావగలిగితే బాగుండు ననుకుంటున్నా. ఛీ! నేనెంత మట్టిబుర్ర వెధవను" అని అనుకోసాగాడు. కోపంతో అతని వళ్ళు వెచ్చబడింది. గాయాల బాధ ఆ వెచ్చదనంతో కొంత తగ్గినట్లు అనిపించింది అతనికి.

జపానువాళ్ళ కుక్కలనుండి తన్ను రక్షించిన ఆ వృద్ధమాతను గురించి ఆలోచించసాగాడు. తన 'కోట' లో ఇన్ 'మామ' తన్నురక్షించిన సంగతి జ్ఞాపకంవచ్చింది.

తన జీవితాన్ని కాపాడుటకై తమ జీవితాలను పణంగాబెట్టిన వారందరూ దాస్వేకి జ్ఞాపకానికి వచ్చారు. ఇప్పుడు చావటమంటే వాళ్ళందరూ తనపై వుంచిన విశ్వాసానికి ద్రోహంచేయుటయే కాగలదని అనుకున్నాడు. తన కష్టాలను, వారి కష్టాలతో పోల్చిచూచుకొన్నకొలదీ తనలో ప్రవేశించిన తాత్కాలిక బలహీనతను తలచి సిగ్గుపడసాగాడు దాస్వే.

"నేను ఉద్యమంలో జేరకపోయినట్లయితే యీ పాటికి చచ్చిపోయేవాణ్ణి" అని గుర్తించాడు. "సజీవంగా పాతిపెట్టబడిన రైతాంగప్రజల మాటేమిటి? చంపబడిన రైతాంగప్రజల మాటేమిటి. ఈ కష్టాలన్నీ ఆ జపానుతొత్తుకొడుకుల మూలంగా జరుగుతున్నాయి. ఆ రాక్షసులే దీనికంతకూ కారణం. వీళ్ళమ్మ—నేను బ్రతకాలి—కసి తీర్చుకోవాలి!" అని అనుకోసాగాడు దాస్వే.

దాస్వేకి కాస్త నిద్రపట్టటం, మళ్ళీ మెలకువరావటం, మళ్ళీకాస్త నిద్రరావటం, మళ్ళీ మెలకువరావటం....యీ తీరుగా ఆ రోజల్లా గడిచింది. చీకటిపడింది.

ఏదో వూగుతున్నట్లు అనిపించింది. తెడ్ల చప్పుడు వినిపించింది దాస్వేకి. "నేను పడవమీదవున్నా" ననుకున్నాడు దాస్వే."వాళ్ళు నన్ను నదిలో తోసి, ముంచేయాలనుకున్నారు కాబోలు" అని అనుకున్నాడు. లేచి కూర్చోటానికి యత్నించాడు. తలను పైకెత్తె బలమన్నా లేకపోయిందతనికి. ఆ యత్నంవలన మళ్ళీ మైకంలోపడ్డాడు.

కీలుబొమ్మసైనికులు ఆగారు, రెల్లుదుబ్బులలోని ఒక కాలువలో ఎవరికొరకో ఎదురుచూస్తూ కూర్చున్నారు. ఇంతలోనే ఒక చిన్న బోటు అగుపించింది. వాళ్ళవైపుగా ఆ పడవ వచ్చింది. దాని ముంచుభాగంలో మంచులాగున తెల్లగావున్న గెడ్డంగల ఒక వృద్ధుడు కూర్చున్నాడు. ఆ వెన్నెలలో ఆ గెడ్డ వెండిలాగున మెరుస్తూవున్నది. ఆ వృద్ధుడు వాళ్ళను పలుకరించాడు. బోటుమీదకు వచ్చాడు. హో యొక్క తండ్రి, అతి నమ్రతగా వొంగి సలాంజేసి, కూర్చోపెట్టా డా వృద్ధుడు.

"మధ్యవర్తిగా పనిచేయవలసినదిగా వాళ్ళు నన్ను కోరారు" అన్నా డా వృద్ధుడు. "దాస్వేని తీసుకొచ్చారా?" అని అడిగాడు.

పడవమీదపడివున్న నల్లని ఆకారంవైపు హో తండ్రి చూపించాడు. మధ్యవర్తిగావున్న ఆ వృద్ధుడు చిరిగిపోయిన దుప్పటిని లాగాడు. ఆ ఆకారాన్ని చూడగానే భయంతో కృంగిపోయాడు. దాస్వే గుండెపై చేయివేసి చూశాడు. నెమ్మదిగా దుప్పటిని మరల కప్పాడు. నోటివెంట మాటరాక కళ్ళనీరుపెడుతూ నిలబడ్డాడు.

వృద్ధజంబుకమైన హోతంద్రి వెంటనే దాస్వేకి యీ గతిని పట్టించింది జపానువాళ్ళనీ తనకేమి తెలియదనీ చెప్పాడు. అంతేగాక గోపీని పట్టించగానే దాస్వేని వదలిపెడతామని చెప్పాడు.

"అవిశ్వంగా చేయజాలమేమోనని భయంగావుంది" అని నిట్టూర్చాడావృద్ధుడు. "నేను మీ పిల్లవాణ్ని చూశాడు. ఒక్కరవ్వంతయినా వాడికి హాని జరుగలేదు!" వాళ్ళ మనిషి ఈ స్థితిలో వున్నాడు. వాళ్ళకేమని జవాబు చెప్పాలి? ఒకచేతితో భూమిని, మరియొక చేతితో ఆకాశాన్ని కప్పజాలను. అసాధ్యమైన పని చేయజాలను వారి అభిప్రాయమేమంటే మీరు ముందుగా దాస్వేని విడిచిపెట్టాలని. అది మీకు యిష్టంలేకపోతే ఈ విషయాన్ని ఎలా చక్కదోయాలో నా కర్థంకావటంలేదు.

చిట్టచివరకు ఆ వృద్ధుడు గోపీని విడుదల చేయిస్తానని వ్యక్తిగతంగా హామీయిచ్చిన తర్వాత దాస్వేని వదలిపెట్టారు. కిరకిరలాడుతూ పున్న తెడ్డచప్పుడు చేసుకొంటూ స్పృహలేకుండా పడియున్న దాస్వేని మోసుకొనిపోవుచున్న ఆ పడవ కాలువలో అనేక మలుపులు తిరిగింది. అటుతర్వాత రెల్లుదుబ్బులలో ప్రవేశించింది. మధ్యవర్తిగానున్న ఆ వృద్ధుడు పెద్దగా ఈలవేశాడు. రహస్యప్రదేశంనుండి రెండు చిన్న పడవలు బయటకువచ్చాయి. తొందరగా ప్రక్కకు వచ్చాయి.... తేవార్, ష్వాంగ్, దాస్వేతమ్ముడు రియూ వృద్ధుడున్న పడవలోకి ఎక్కారు. స్పృహలేకుండా మూటగాపడియున్న దాస్వేపై కప్పబడిన దుప్పటిని లాగారు! వాళ్ళు ఆ ఆకారాన్ని చూడగానే భయంతో గడ్డకట్టిపోయారు.

"దీని నేమంటారు వాళ్ళు!" అని కోపంతో పళ్ళు నూరుతూ అరచాడు తేవార్. "మనవాడిని సగంచంపి పంపారా! వాళ్ళ గోపీని అతిధిగా పెంచమంటారా! రాక్షసులు."

"వాళ్ళపని తర్వాతపడదాం" అన్నాడు ష్వాంగ్. "ఏమైనాగానీ మన దాస్వే మనకు దక్కాడు. ఆ వృద్ధుడికి పరిస్థితులను క్లిష్టంచేయబోకండి"

వాళ్ళు అజాగ్రత్తగావున్న సమయంలో రియూ అమాంతంగా తనబోటులోకి దూకాడు. తన బాకును బయటికి లాగాడు. గోపీ ముక్కను

కోసేశాడు. ప్రాణాన్ని రక్షించవలసిందిగా ప్రతిమాలుకూ గోపి యేడ్వసాగాడు.

"ఇంకొక్క—పోటురా! నీయమ్మ—!" అని బూతులు తిట్టాడు రియూ. "నిన్ను ముక్కలుముక్కలు చేస్తారా!" అన్నాడు.

షావ్వంగ్ వాళ్ళిద్దరిమధ్యకుదూకి ఉద్వేగిగానున్న ఆ పిల్లవాడిని పట్టుకొన్నాడు. "ఇకచాలు వాకికిశాస్తి!" అని అన్నాడు. "ఇక ఆగు! ఇదేవిధంగానూ దేన్నీ పరిష్కరించదు!"

బూతులుతిడుతూ రియూ తన బాకుకు అంటిన రక్తాన్ని కాలి చెప్పుపై తుడుచుకొన్నాడు. బాకును మరల వొరలో పెట్టాడు. దాస్వేని జాగర్తగా గెరిల్లా పడవలలో వుంచిన తర్వాత మధ్యవర్తిగావున్న ఆ వృద్ధుడు గోపిని అతని కుటుంబానికి వప్పగించాడు.

కార్యకర్తలబోట్లు, సరస్సులోనున్న ఒక చిన్నదీవికి చేరుకొనే సరికి అర్ధరాత్రయింది. గెరిల్లాలరాకకై ఎదురుజూస్తూ, మేయీ, అనేక మంది స్త్రీలు చీకటిలో కళ్ళు చిల్లులుపడేటట్లు గంటలతరబడి నిలబడి ఆదుర్దాగా చూడసాగారు. గెరిల్లాలు తిరిగివచ్చారు. ఒక రైతుయింట్లో ఒకగదిని ఆ స్త్రీలు శుభ్రంగా వూడ్చి కడిగి అట్టిపెట్టారు. కాంగ్‌ను వెలిగించారు. నీళ్ళనుకాచి అట్టిపెట్టారు. దాస్వేని జాగర్తగా మోసుకొని రావటం, జాగర్తగా మెల్లగా క్రిందికి దింపటాన్నిజూచి, వాళ్ళకు వణుకు పుట్టింది. వాళ్లు దీపాన్ని వెలిగించి, చినిగిపోయిన దుప్పటిని తీసిచూశారు. చిత్రహింసచేయబడిన అతని శరీరాన్నిజూచి, వాళ్ళ గుండె బ్రద్దలయ్యేటట్లు ఏడ్వసాగారు.

"దాస్వే! దాస్వే! గుండులాంటి మనిషివిరా. బాబూ! నిన్నెంత హింసపెట్టానురా నాయనా!" అని ఆ స్త్రీలు భోరున ఏడ్వసాగారు. దాస్వే నుదురు వాచిపోయింది. ఆనవాలుపట్టడానికి వీలులేకుండా తయారయింది. గాయాలలో పురుగులు పాకుతున్నాయి. అతని చేతివేళ్ళ గోళ్ళను వూడగొట్టారా రాక్షసులు! మోచేతులనుండి క్రిందిభాగాన్ని బాగా నలగగొట్టారు. అతని అస్థిపంజరంమీద శుభ్రమైన మాంసపుకండ ఎక్కడా

కనిపించలేదు. వళ్ళంతా హూనం హూనమైపోయింది. దాస్వే ప్రాణం గుటగుటలాడుతూవున్నది.

కౌంటీ ప్రభుత్వంనుండి వచ్చిన వైద్యుడు దాస్వేకి ఒక యింజెక్షన్ యిచ్చాడు. దాస్వేకి మెల్లమెల్లగా తెలివివచ్చింది. దాస్వే తన ఎడమ కంటిని తెరచాడు. షాంగ్‌వంక జూశాడు తర్వాత. మేయీవంక జూశాడు. అతనికి స్మారకంవచ్చింది. ఒక్కొక్కరినే గుర్తించాడు. లేచి కూర్చోటానికి పెనుగులాడాడు.

"ఏమిటి? మీరా!" అన్నాడు. చెప్పరానంత హీనంగా వుంది అతని కంఠధ్వని.

కళ్ళవెంట ఏకధారగా ప్రవహిస్తున్నకన్నీళ్లు మేయీ చెక్కిళ్ళపై పడసాగాయి. ఆమె మృదువుగా అతనికి చేయూతయిచ్చింది. "దాస్వే!" అని యేడుస్తూ. "తిరిగొచ్చావ్....ఇప్పుడన్నీ సవ్యంగా జరుగుతాయ్."

వాచిపోయివున్న అతనిముఖం వికారరూపాన్ని పొందింది. అంతే అతడు చిరునవ్వు నవ్వుటకు యత్నించగా అతనిముఖం ఆవిధంగా తయారయింది. "నేను తిరిగొచ్చాను" "మరల మనమంతా ఒకచోటేవున్నాం.. హ్హా....హ్హా....అతడు చిన్నపిల్లవాడిలాగా తొక్కుపలుకులు పలికాడు. హ్హా....హ్హా...." దాస్వే మూర్ఛరోగిలాగా వికటంగా నవ్వసాగాడు. అరచాడు, గొణిగాడు. చిట్టచివరకు అతనికి మైకం క్రమ్మింది.

వ్యధతో గుందుతున్న హృదయాలతో అతని స్నేహితులు అతి విచారంగా అతనివంక చూడసాగాడు.

ఆ ఆకురాలుకాలంలో శత్రువులు. ఉత్తరచైనా మైదానప్రదేశాలలో గట్టిగా పాతుకొనిపోయారు. ప్రతిమైలుకూ ఒకకోటను నిర్మించారు. ప్రతి అరమైలులోనూ భూగర్భకోటలను నిర్మించుకొన్నారు. జాయాంగ్ సరస్సుప్రాంతంలోని పెద్దపెద్ద గ్రామాలలో జపానువాళ్ళు కోటలను నిర్మించుకొన్నారు. చిన్నగ్రామాలపై దాడులు చేయసాగారు. భూమిశిస్తులన్నీ అమితంగా వసూలుచేయసాగారు. రైతువద్దనున్న ధాన్యాన్నంతటినీ దోచేశారు. పందిమాంసం గోధుమపిండి, కోడిగ్రుడ్లను మెక్కసాగారు జపానువాళ్ళు....ఇక రైతాంగ ప్రజల విషయమంజూస్తే వాళ్లు

గడ్డిని, పిచ్చిగింజలను, చెట్లబెరళ్ళను, మూలికలను తిని బ్రతకాల్సి వచ్చింది. అవికూడా కరువైపోయాయి. బీదప్రజానీకం ఆకలితో మలమాడిచచ్చింది.

ఇలాంటి కష్టదినాలలో బ్లాకీత్సే. ష్వాంగులు కార్యకర్తలను సమీకరించసాగారు. ప్రజలతో సంబంధాలను బలపరచుకొన్నారు. శత్రువులకు వ్యతిరేకంగా యుద్ధతంత్రాన్ని ఏర్పాటుజేశారు.

కార్యకర్తలు రోజుకు ఒకవూరుచొప్పున తిరుగుతూ వుండాల్సి వచ్చింది. నెమ్మదిగా ఆరోగ్యాన్ని పుంజుకొంటూవున్న దాస్వేని రైతుల రక్షణక్రింద వదలిపెట్టాల్సి వచ్చింది. రైతులు దాస్వే పైకిప్పబడిన గుంటలలో దాచేవాట. ఒక్కొక్కప్పుడు యేదో పడవలో దాచేవాట. ఎత్తుగాపెరిగిన రెల్లుపుబ్బులలో ఒక రహస్య స్థావరానికి దాస్వేని సవారీపై మోసుకొనిపోయేవా రా రైతులు. అవిరళంగా ఆ రైతులు దాస్వేని రక్షిస్తూవచ్చారు. కొద్దికాలంలో దాస్వేకి గాయాలు పూర్తిగా మానిపోయాయి. కాని, అతడు యింకా బలహీనంగానే వున్నాడు.

వర్షాకాలమొచ్చింది. సరస్సులోని నీటిని, వాగులలోని నీటినీ గడ్డకట్టించింది. ఆ మంచుగడ్డలపై నీలాకాశం ప్రతిబింబిస్తూవున్నది. ఒక గ్రామంనుండి మరియొక గ్రామానికి స్లెడ్జిబండ్లపై జపానువాళ్ళు వేగముగా కదలుటకు అవకాశమేర్పడింది. గ్రామాలలోని బీదరైతుల కొంపలపై ప్రతిరోజూ దాడిచేస్తూ జపానువాళ్ళు వాళ్ళ ప్రాణాలను విసుగెత్తించసాగారు. బాలూ మరల చురుకుగా పనిచేస్తున్న విషయం శత్రువులకు బాగా తెలుసు. కాని, వాళ్లు బాలూ గెరిల్లాలను ఎన్నడూ చేత జిక్కించుకోలేకపోయారు.

ప్రతిఘటనోద్యమాన్ని నాశనముజేయాలన్న పట్టుదలతో తమ "స్థావర్" సైన్యాలకు సహాయభూతంగా "దండకార సైన్యాలను" అంటే రైతాంగప్రజలను శిక్షించుటకుగాను సైన్యాలను పంపారు. అందువలన అతిచిన్న గ్రామాలలోకూడా ఎక్కడజూచినా శత్రుసైనికుల దైనందిన కార్యకలాపాలేమంటే. రైతాంగ ప్రజల యిళ్ళను సోదాచేయటం, దోచు

కోపటం. యిళ్ళలోని సామాను లన్నింటినీ పచ్చడి పచ్చడిక్రింద కొట్టే యటం, ఇళ్ళల్లో వున్నవారిని తలలు బ్రద్దలుకొట్టటం, మానభంగాలు చేయటం, ప్రశ్నలు వేసి చంపటం- యివి వారి నిత్యకలాపాలు. బాగా 'ఎర్ర' మనుషులుగా గుర్తింపబడిన షాఁంగ్, అతని గ్రూపు గ్రామాధికా రులలో కొంతమంది ప్రజలసహాయంతో తప్పించుకొనిపోయారు. బాగా వత్తుగా పెరిగివున్న రెల్లుపొదల్లో స్థావర మేర్పరచుకున్నారు. రైతు లకు బాగా డబ్బు అవసరం వున్నప్పటికీ. ఆ సంవత్సరం రెల్లుపొదలు లన్నింటినీ కోసివేయలేదు. అక్కడక్కడ దుబ్బులపొదలలో మధ్య భాగంలోమాత్రం కోసి, కార్యకర్తలు తలదాచుకోటానికి అవకాశము కలుగజేశారు.

తమకు వున్నదానిలోనే ఏదో చేతనైనంత ఆహారాన్ని కేటాయించి ప్రతిరోజూ రైతులు రెల్లుదుబ్బులలో తలదాచుకుంటున్న కార్యకర్తలకు రహస్యంగా పంపేవారు. కార్యకర్తలకు దాహం అయినప్పుడు మంచు ముక్కలను తినేవారు. వాళ్ళకు లభించిన ఆహారంలోనుంచి మంచిదానిని దాస్వేకి పెట్టేవారు.

కట్టుకట్టిన తన తలను తేవాటు గుండెపై పెట్టుకొనివుంటూ వున్న దాస్వే "నాకు నయమయింది. అందరికంటే మంచిఆహారాన్ని నేనెందుకు తినాలి?" అని వ్యతిరేకించేవాడు దాస్వే.

తన బియ్యపురొట్టెనుగాని, గోధుమరొట్టెనుగానీ విరచి ముక్క లుగా జేసి అందరూ సమానంగా తిందామని పట్టుబట్టేవాడు.

రైతులామెకు యిచ్చిన బొంతలాగూలను మేయీ ధరించింది. ఆ లాగూలు మోకాళ్ళవద్ద చిరిగినవి. చిరిగిన గుడ్డపీలిక నైరుతి మంచు గాడ్పులకు టపటప కొట్టుకొంటూ వుండేది.

అల్లరిపిల్ల నియూరీ దీన్నిజూచి వేళాకోళంజేస్తూ వుండేది."ఆహా! ఎంత అదృష్టం! నీ లాగూలకు తెరలున్నాయి!" అని హాస్యమాడుతూ వుండేది.

"నన్ను ప్రదర్శిస్తూ పోబోక!" అని మేయీ గలగల నవ్వుతూ బెదరించేది.

పగటిపూట మంచుగడ్డల వెలుగు కార్యకర్తల కళ్ళను నొప్పింపవ జేసేది. వాళ్ళందరూ ఒకళ్ళనొకళ్లు వతుకొని కూర్చునేవారు. అనేక విష యాలను చర్చిస్తూ, తుపాకులను బాగుచేసుకొనేవారు.

రాత్రిపూట ప్రకాశవంతమైన వెన్నెలలో ఆ గెరిల్లాలు శత్రువులని వేటాడటానికని గ్రామాలకు బయలుదేరేవారు. కార్యకర్తలు వెనుకడిగ బడిపోయేవారు. కోసిన రెల్లును పడకగా జేసుకొని, ముగ్గురు నలుగురేసి ఒకే దుప్పటిక్రింద నిద్రపోయేవారు.

వారి శరీరాల వేడి వాళ్ళను వెచ్చజేసేది. అంతేగాక పడకగానున్న మంచునుకూడా కరిగించేది. తత్ఫలితంగా మంచు బుడగలు ఏర్పడేవి.

"ఏదో ఒకరోజున యీ మంచు అంతా కరగి, సరస్సు అడుగుకు పోతాం!" అన్నది మేయీ వేళాకోళంగా.

"ఉఫ్! ఈ మంచు మంచి గట్టిది. కణకణలాడే పొయ్యిలో పడే సినా కరుగదిది!" అని జవాబుచెప్పాడు దాస్వే.

గడ్డకట్టిపోయిన సరస్సుపై జీవించటంవలన వారి కళ్ళు వుబ్బి వుండేవి, కార్యకర్తలు శరీరాలంతటా నొప్పులతో బాధపడేవారు. కాని వారి ఉత్సాహం అమిత వున్నతంగా వుండేది; చాలా సంతోషంగా వుండేవారు.

ఒక రాత్రి మిక్కుటమైన చలిగాలి సరస్సును లంకించుకుంది. చలి గాలి కార్యకర్తలపై మంచుముక్కలను విసరసాగింది. వాళ్ళు గడ్డకట్టి పోయారు. ఒక్కరికి నిద్రపట్టలేదు. ఎవరో "యువసైనా" గేయాన్ని పాడ నారంభించారు. క్రమేణా అందరూ పాటలో కంఠం కలిపారు. తమ ఎదిరింపును చలిగాలికి తెలియజేస్తున్నారా అన్నట్లు బిగ్గరగా పాడ సాగారు——

"ముందుకే, మున్ముందుకే!
సాగిపో!
తరలిపో!
యువచైనా!
యువచైనా!
పోరు సల్పుమా!
యువచైనా!
యువచైనా!

నెటడి సంద్రాన కట్టుబడి,
తుఫానులో జిక్కినా
నావలాగున్నదిరా!
మన చైనా నేడూ!
ఎదిరించుమోయ్!
శత్రుబలము నణచగాన్!
గుంజుకోవోయ్!
రేపటి విజయాన్ని!



# 11 అధ్యాయం

బాలూ సైనికులకోసం,గెరిల్లాలకోసం కార్యకర్తలకోసం, గ్రామాలను సోదాలుచేస్తూ, రైతాంగప్రజలను విచారించుతూ, జపానువాళ్ళ "దండకారిసైన్యం" లేక "యమటసైన్యం" కాలం గడుపుతూవున్న సమయంలో, ఏడురోజులపాటు... నిక్కచ్చిగా ఏడురాత్రిళ్ళూ, ఏడుపగళ్ళూ-కార్యకర్తలు, మంచుగడ్డపై జీవించారు. ఇక లాభంలేదనుకొని శత్రువులు తమ సుస్థిరస్థావరాలయిన నగరాలకు, పెద్ద పెద్ద ప్రహరీగోడలచే పరిరక్షింపబడుతూవున్న పెద్ద పెద్ద నగిరాలకు తరలిపోయారు. అనాక్రమితంగా వున్న చిన్నగ్రామాలకు మరలివచ్చారు కార్యకర్తలు.

ఒక రాత్రి ష్వాంగ్, బ్లాకీత్సే కార్యకర్తల పాఠశాలయొక్క హెడ్ మాష్టరు చెంగ్, అంతా కలిసి కౌంటీ నాయకుల సమావేశానికి హాజరయ్యారు. ఇటీవల దండయాత్రలో జపానువాళ్ళు ఆక్రమించుకున్నఅనేక తావులను నిలబెట్టుకోటానికి, వారికి తగినంత అంగబలంలేదని, రిపోర్టులు యివ్వబడినాయి. తమ కోటలను కీలుబొమ్మసైనికుల చేతులలో వదలి, అనేక గ్రామాలనుండి జపానువాళ్లు తమ సైన్యాలను తరలించుకొని పోతూవున్నారని తెలియవచ్చింది. ఈ గ్రామాలను ఒక్కటొక్కటిగా మరల స్వాధీనంజేసుకొనుటకు పార్టీ నాయకులు నిశ్చయింకొన్నారు.

సమావేశం ముగిసినతర్వాత, ష్వాంగ్ తన జిల్లాకు తిరిగివచ్చాడు పార్టీ సూచనను అమలుజరుపుటకై కార్యకర్తలతో సమాలోచనలుజరిపి, ప్లానులు వేశాడు.

వాళ్ళు ముట్టడించాలని నిశ్చయించుకొన్న మొదటి గ్రామంయొక్క కోట, "ఏకాక్షి" అని పిలువబడు రాక్షసునికి స్వాధీనంలోవుంది. వాడు రైతులందరినుండి గుంజే గుంజుడుకు అంతూపొంతూలేదు. వాడు రైతులు అర్పించుకొన్నది తృప్తికరంగా లేకపోతే, క్రూరంగా బాధించేవాడు. తనకు తెల్లపిండిని కానుకగా అర్పించుకోవలసిందిగా ఒకసారి రైతులను ఆజ్ఞాపించాడు. వాళ్ళు తెచ్చారు కాని, వాళ్లు తెచ్చిన పిండి వాడికంటికి ఆనలేదు. చాలినంత తీసుకొనిరాలేదని ఆ పిండినంతా పారబోశాడు; కోపంతో మండిపోయాడు. బండబూతులు తిట్టాడు.

"మీయమ్మల్ని——పోతే, నేను మీ తండ్రినేగాదు" అని మొరిగాడు ఏకాక్షి.

వాడి పచ్చి కసాయీతనం అమితం. ప్రజలంతా వాణ్ని అమితంగా ద్వేషించేవారు. ఏకాక్షిదృష్టిలో నీచమంటూ ఏదీలేదు. ఒకసారి ఒకసారి వాడు పదునాలుగేండ్ల బాలికనుకూడా చెరచాడు. వాడి చేతులలో ఎవరయినా ఒక కార్యకర్త చిక్కితే, ఆ కార్యకర్తను చంపటంతో తృప్తిపడేవాడుగాదు; కార్యకర్త శరీరాన్ని, ఏకాక్షికి, ఎనిమిది ముక్కలుగా ఖండించేవాడు.

"నేను, బాలూని సరిగా చూడనని ఎవరంటారు?" అని ఏకాక్షి అడిగేవాడు. "ఇదిగో! వీడిని యీ మంచు రాజభవనంలో నిద్రపోవటానికి పంపుతున్నా, చూడండి!" అని ఆ ఏకాక్షి, గడ్డకట్టిపోయిన ఆ సరస్సులోని ఒక గోతిలోకి తాను ముక్కలు ముక్కలుగా నరికిన కార్యకర్త శరీరాన్ని త్రోయించేవాడు.

ఒకరోజున ఏకాక్షిగాడు రైతులనుండి డబ్బు, వస్తువులు గుంజుకోడానికి ఒక గ్రామానికి పోయాడు. వాడివెంట ఒక కీలుబొమ్మ సైనికుడుకూడా పోయాడు. అక్కడ వాళ్ళపని పూర్తి అయింది. రెండు

*స్లెడ్జిబళ్ళను యివ్వవలసిందిగా డిమాండుచేశారు. రెండు స్లెడ్జిబళ్ళు వారికి యివ్వబడినాయ్! ఆ బళ్ళను లాగటానికని యిద్దరు మనుషులు కూడా వచ్చారు.

ఆ స్లెడ్జిబళ్ళు గడ్డకట్టిపోయిన బాయాంగ్ సరస్సు పైభాగంలో పరుగెత్తుతున్నాయి. సరస్సు తీరాన్ని అంటుకొనిపోతూ, వారు బాగా పెరిగిన రెల్లుదుబ్బుల పొదలలోనికి పోయారు. ఆ తర్వాత రెల్లుదుబ్బులలో వున్న కాలువలలో ప్రవేశించారు. ఏకాక్షి వీటిని గుర్తించలేదు.

తన తలను డ్రైవరువైపుగా వెనక్కి త్రిప్పుతూ ఏకాక్షి "ఏయ్! యిది తప్పుదారి! మనకిక్కడ పనేమిటి?" అన్నాడు.

ఒక్కపల్చగావున్న ఆ రైతు వెదురుబొంగును గట్టిగా పట్టుకొని ఏమీ ఫరవాలేన్నట్లు చిరునవ్వు నవ్వాడు. "ఏం భయపడకండి కెప్టెన్ గారూ! ఈ సరస్సును మూడువందల అరవై అయిదురోజులూ దాటుతూ వుంటా. కళ్ళుమూసుకొని చెప్పమంటే సరస్సులో ఎక్కడేమున్నదీచెప్తా" అన్నాడు.

"ఇది దగ్గర రారండి!" అన్నాడు రెండవ డ్రయివరు. వాడు దుక్కలాంటి మనిషి, "యీ దారిగుండా మిమ్మల్ని మీ ఇంటికి వేగంగా పంపిస్తాం" అన్నాడు.

కొద్దినిమిషాలు గడిచిన తర్వాత ఏకాక్షి ఏదో ప్రశ్నవేద్దామను

---

*స్లెడ్జిబళ్ళు అంటే, కుక్కలతో లాగబడే బళ్ళులాగున వుంటాయి. కాని వాటిని కుక్కలు లాగవు. మనుష్యులే లాగుతూవుంటారు. బళ్ళను తోలేవాడు వెనకనుంచుంటాడు. బండిని తోలేవాడు తన కాళ్ళమధ్య పది యడుగుల పొడవుగల వాసపుబొంగును నొక్కిపట్టుకొంటాడు. ఈ వాసపు బొంగుచివర పెద్ద మేకువంటిది వుంటుంది. యీ మేకును మంచులో గుచ్చుతాడు. వెదురుబొంగుచివరను రెండు చేతులతోనూ గట్టిగా పట్టుకొని ఒక్కవూపు ముందుకు వూపేసరికి, ఆ బండి అమితవేగంగా ముందుకు దూకుతుంది. ఆ బండిమీద ప్రయాణంచేసేవాడు ముందు కూర్చుంటాడు.

కొంటూవుండగా యింతలోనే వాడి వీపుమీద యేదో చల్లగా నొక్కినట్లు అనిపించింది. కదలబోకు!" అని డ్రయివరు అనటం ఏకాక్షికి వినిపించి నది. ఒక చెయ్యి ముందుకు సాగింది. ఏకాక్షియొక్క పిస్తోలును లాగే సింది. అదేవిధంగా రెండవ స్లెజ్జిబండిమీదకూడా జరిగింది.

క్రిందకు దిగవలసిందిగా ఆ కీలుబొమ్మలిద్దరూ ఆజ్ఞాపించబడ్డారు. ఆ తర్వాత రెల్లుదుబ్బులలోనికి లోపలగా నడువవలసిందిగా ఆజ్ఞాపించ బడ్డారు. పెద్ద శైలువేషంలో వున్నవాడు తేవార్. తేవార్ ఏకాక్షిని రెండవఖైదీకి యిరవై గజాలదూరంగా నెట్టాడు.

భయంకరమయిన కంఠధ్వనితో "ఓరీ! దేశద్రోహికుక్కా! రైతులప్రాణాలను బలిగొన్నావ్! మానాలను హరించావ్! బాలూని చంపావ్! రాక్షసుడా! నిన్ను యీ రోజున హతమార్చవలసిందిగా నన్ను ఆజ్ఞాపించింది మా కౌంటీ ప్రభుత్వం. వెనక్కు తిరుగు!" అని అరచాడు తేవార్.

ఏకాక్షిముఖం కళావిహీనమయింది. వాడేదో చెప్పదామని తెర చాడు. కాని వాడినోటివెంట మాటరాకముందే తేవార్ ఏకాక్షి బుర్రకు గురిచూచి ప్రేల్చాడు. ఏకాక్షి రాక్షసుడు ఆ విధంగా అంతమయ్యాడు.

ఆ రెండవ కీలుబొమ్మ సైనికుడు భయంతో గజగజ వణక సాగాడు.

"నీవు భయపడినక్కర్లేదు!" అన్నాడు ష్వాంగ్. బక్కపల్చగా వున్న రెండవ "డ్రయివర్" అతడే! "మేం రాక్షసులను మాత్రం హత మార్చుతాం. ఇక శత్రువులకు సాయపడనని వాగ్దానంచేస్తే నిన్ను వదిలి పెడతాం" అన్నాడు ష్వాంగ్.

ఇంటికి తిరిగిపోయి సాధారణ పౌరుడుగా జీవించుటకన్న తనకే విధమయిన కోరిక లేదని వొట్టుపెట్టుకున్నాడా కీలుబొమ్మ సైనికుడు.

ష్వాంగు, తేవారులు అతనికి కొంతసేపు వుపన్యాసమిచ్చారు. మొట్టమొదట వాడు తమకు యేదోవిధముగా తోడ్పడి తన నిజాయితీని రుజువుచేసుకొంటే, వాడి కోరిక తీర్చుతామన్నారు.

ఆ రాత్రి తుపాకులను పుచ్చుకొని గెరిల్లాలు కోటను చుట్టు ముట్టారు. ఏకాక్షిగాడి దుస్తులను ధరించి, షొవాంగ్ ఖైదీగా పట్టుకొన్న కీలుబొమ్మ సైనికుని ముందుంచుకొని, ధైర్యంగా కోట కందకాలవద్దకు పోయాడు.

"బ్రిడ్జిని వాల్చండి! కెప్టెన్‌గారు వచ్చారు!" అని ఆ కీలుబొమ్మ సైనికుడు అరచాడు.

బ్రిడ్జిని వాల్చారు. షొవాంగ్ నిశ్శబ్దంగా బ్రిడ్జీ దాటాడు. ఒక్క మాటయినా పలుకకుండా బర్రున పిస్తోలుతీసి భయభ్రాంతులయిన సైనికులను ఆశ్చర్యపరచారు. అతణ్ణి తొందరగా అనుసరించారు తేవారు, ఇతర గెరిల్లాలు. ఆశ్చర్యంలో మునిగిపోయివున్న కీలుబొమ్మ సైనికులను నిరాయుధులజేశారు. ఒక్క తుపాకిగుండు అయినా పేల్చకుండా, కోటను పట్టుకొన్నారు గెరిల్లాలు.

కీలుబొమ్మ సైనికులనుండి సైనికసామాగ్రి నంతనూ వసూలు జేసిన తర్వాత గెరిల్లాలు ఆ కీలుబొమ్మ సైనికులను తమతమ యిళ్ళకు పోవలసిందిగా ఆజ్ఞాపించారు. కోటను కాల్చివేశారు.

* * * *

ఒకనాటి మధ్యాహ్నం నలుగురు గెరిల్లాలు పల్లెకారులవేషం వేసుకొన్నారు. రెండు స్లెడ్జ్ బళ్ళనిండా చేపలబుట్టలు. మంచునుకోసే కత్తులను వేసుకొని బయలుదేరారు. ఆ గెరిల్లాల గుడ్డచెప్పులకు మంచునుండి రక్షించుకోటానికని తోలుముక్కలు తాపటం చేయబడినాయి. వాటికి మేకులున్నాయి. అయిదు మొనలుగల బరిసెలను ధరించి దాస్వే. తేవారులు తమ బళ్ళముందు నిలబడ్డారు. వాళ్ళ వెనకాల షొవాంగ్, పల్లెకారియైన జోప్ బయలుదేరారు. పొడుగాటి వెదురు బొంగుల మర్మర ధ్వనులను అనుకరిస్తూ తమ స్లెడ్జి బళ్ళను జోరుగా ఆ మంచు సరస్సుపై నడిపారు.

సరస్సు వొడ్డునకు సమానాంతరంగా పరుగెత్తుతూ వారు "చిన్న రేవు" గ్రామానికి యాభై గజాలదూరంలోనికి వచ్చారు. ఆ గ్రామం యొక్క కోటద్వారానికి వెలువల కాపలాకాస్తున్న కీలుబొమ్మసైనికుని కంటిలో పడ్డారు వాళ్ళు.

తేవారు బరిసెపై మంచినీటి చేప ఒకటి వ్రేళ్ళాడుతూవుంది. అది యింకా గిలగిలా కొట్టుకొంటూనేవుంది. ఆ చేపను చూసేసరికి కాపలాదారుని కన్నుకుట్టింది. వాడి పేరాశ కళ్ళఎదుట గెరిల్లాలు మెల్లగా తమ స్లెజ్ బళ్ళను పోనిచ్చారు.

"ఏయ్! బెస్తవాళ్ళూ! ఇక్కడకు రండి!" అని ఆ కీలుబొమ్మ సైనికుడు కేకేశాడు.

"మాకు పనుంది. ఏం కావాలి?" అని తిరిగి కేకేశాడు తేవార్.

వాళ్ళను కలుసుకోటానికని కీలుబొమ్మసైనికుడు సరస్సు వొడ్డు వెంట పరుగెత్తసాగాడు.

"మీ యమ్మల్ని—ఇక్కడకు రండిరా! మీ వద్ద యేముందో చూడాలి" అన్నాడు.

కోటకు చాలాదూరంలో వొడ్డుమీద ఒక విల్లోవృక్షం వుంది. ఆ చెట్లక్రిందకు తమ స్లెజ్‌బళ్ళను పోనిచ్చారు గెరిల్లాలు. కీలుబొమ్మసైనికుడు రొప్పుకుంటూ పరుగెత్తుకొచ్చాడు. తేవార్ బరిసెమీద వ్రేళ్ళాడుతున్న చేపవంక చూపాడు.

"దాన్ని తీసుకొనీ; మా కమాండరుగారికి చేపలంటే అమితప్రేమ తర్వాత డబ్బిస్తాలే" అన్నాడు వాడు.

అంత తేలికగాదు దోస్తు! యీ కోటకు దిగువనున్న కోటవాళ్ళకు యీ చేప నిత్తామని వాగ్దానం చేశాం. ఈమారు పట్టుకొన్నవాటిలో పెద్ద చేపను మీ కిస్తాం" అని జవాబుచెప్పాడు తేవార్.

పెద్ద చేప బుట్టలలో ఒకదానివంకచూపిస్తూ షావ్యాంగ్ "ఆ బుట్టలో

వున్న చేపలలో మీ కేదయినా నచ్చితే నచ్చవచ్చు. కావాలంటే చూసుకోండి" అని సలహాయిచ్చాడు.

"నాకు పెద్దది కావాలి" అని హెచ్చరిస్తూ, బుట్టలో ఏమున్నదో చూద్దామని ముందుకు వంగినా డా కీలుబొమ్మ సైనికుడు.

షాంగ్ తన పిస్తోలుతో వాడి బొమికల్లో పొడిచాడు. "నోరు మూసుకో!" కీలుబొమ్మ సైనికుడు ఆశ్చర్యంతో నోరు తెరుచుకొని చూస్తున్నాడు. యింతలోనే వాడి తుపాకిని లాగేశాడు తేవార్.

"నీవు వున్నదంతా చెప్పేస్తే నీకేం భయంలేదు! మేము చైనా వాళ్ళం. అందువలన చైనావాళ్ళను చంపం. అయితే యిక చెప్పు— కోటలో సైనికులు ఎక్కడుంటారు? ఆయుధా లెక్కడ పెడతారు?" అన్నాడు షాంగ్.

కీలుమ్మ సైనికుని పళ్ళు గొడవగా ధ్వనిచేస్తున్నాయి. "నేను— నేను చెప్పేస్తా! నా ప్రాణాన్ని రక్షించండి. మొదటి అంతస్థులో ఉత్తరపు వరండాలో సై....ని....కులు వుంటారు. తూ....తూ....తూరుపు గ.... గ—గదిలో ఆయుధాలుంటాయి. మే—మే....మేం—తన్ను— విడిచి పారిపోతామోనని కమాండరుకు భయం! అందుకని ఆయుధాలనుతూరుపు గదిలోపెట్టి తాళంవేశాడు" అని చెప్పాడు.

ఇంతలోనే అనేక పడవలు అక్కడకు వచ్చాయి. వాటినిండా గెరిల్లాలు వున్నారు. షాంగ్ వాళ్ళను పలుకరించి "రండి! రండి! కొన్ని చేపలను వదిలించుకొద్దాం" అని చెప్పాడు.

ఆ కీలుబొమ్మకాపలావాడిని కాపలాకాయటానికిగాను ఒక మనిషిని అక్కడవుంచి, వారంతా ఒడ్డుఎక్కారు. కోటవైపుగా నడిచిపోయారు. దాస్వే, తేవార్ తమ వామహస్తాలలో చేపలను పుచ్చుకొన్నారు. వారి కుడి భుజాలమీద బాగా బరువుగావున్న బొంత- దుస్తులు అజాగ్రత్తగా వ్రేళ్ళాడుతున్నాయి.

వాటిల్లో పిస్తోళ్ళు వున్నాయి. వాళ్ళను వెంబడించిన వారు వెనుక భాగంలో చొక్కాలక్రిందుగా తుపాకులను గుండెలకు తాళ్ళతో బిగించుకొనివున్నారు.

ఇంతకుపూర్వంవరకూ తాము ఖైదీగాపట్టుకున్న కీలుబొమ్మ కాపలాదారుడు కాపలాకాస్తూవున్న గేటుద్వారా కోటలో ప్రవేశించారు ఆ గెరిల్లాలు. సూటిగా ఉత్తరవరండాలో ప్రవేశించారు.

కీలుబొమ్మసైనికులు నడుమువరకూ గుడ్డలు విప్పదీసుకొని వున్నారు. తమ బట్టలలో ప్రాకుతున్న చీడపేలను ఏరుతూ, గాడిపొయ్యి వద్ద కూర్చున్నారు

దాస్వే. తేవారులు తూర్పుగదిలో ప్రవేశించారు. అక్కడ కమాండరు తన మెడచుట్టూ ఒక తెల్లని తుండు గుడ్డను చుట్టుకునికూర్చు న్నాడు. ఒక మంగలి అతనికి క్షవరం చేస్తున్నాడు.

దాస్వే. తేవారులవంక క్రీగంటిచూపు జూశాడు కమాండరు. "ఆహా! చేపలు తెచ్చారా!" అన్నాడు.

తేవార్ తన బొంత దుస్తులను క్రిందపారేసి మెరుస్తూవున్న పిస్తో లును కమాండరు నుదుటిమీదకు గురిపెట్టాడు. "అవును! యిదికూడా తెచ్చాం!" అన్నాడు తేవార్.

అప్పటికి కమాండరు తలపై ఒక భాగంమాత్రమే క్షవరం చేయించుకోవటం పూర్తిఅయింది. అతడు వాళ్ళవంక మూగమొద్దులాగ చూడసాగాడు. భయంతో గజగజ వణుకుతూ మంగలి, తన కత్తిని క్రిందకు జారవిడిచాడు. ఇంతలోనే అక్కడకు యితర గెరిల్లాలు వచ్చారు. కీలుబొమ్మసైనికుల తుపాకులన్నింటినీ పోగుజేసుకొన్నారు గెరి ల్లాలు. ఆ కీలుబొమ్మ నాయకుడ్ని బంధించారు దాస్వే. తేవారులు.

"ఇది నీకు సంబంధించిన విషయంగాదు. నీవు యింటికి పోవ నిందుకని?" ఆ మంగలికి చెప్పారు.

వాళ్ళ కంఠధ్వనినిబట్టి వారు బాలూసైనికులని మంగలిగుర్తించాడు అతడు తన సామాను అన్నింటినీ సర్దుకుని, నవ్వుతూ యింటికిపోయాడు.

కీలుబొమ్మసైనికులు కొందరు తమ సైనిక దుస్తులపై చొక్కాలు తొడుగుకొని తాము దాక్కొనివున్న పడమటి గదినుండి మెల్లగా బయటికి జారుకోవాలని యత్నిస్తున్నారు. ఈ విషయాన్ని దాస్వే తమ్ముడయిన రియూ, పల్లెకారి జోవ్ కనిపెట్టారు.

"ఎవరయినా పారిపోవటానికి ప్రయత్నిస్తే అప్పచ్చులు తగులుతాయి" అని హెచ్చరించాడు రియూ.

చిటికలో కమాండరును, వాడి సైనికులందరినీ కోట ముందువున్న వాకిపై వరుసగా నిలబెట్టారు! గ్రామంనుండి బయటకువచ్చిన కొంత మంది రైతులు ఏమి జరుగుతున్నదీ గ్రహించారు. వాళ్ళకు పట్టరాని సంతోషం కలిగింది. ఆ పెద్ద విల్లోచెట్లక్రిందవున్న స్లెడ్జిబళ్ళను తీసుకొని వచ్చి, ఖైదీలను, సామాగ్రినీ, స్లెడ్జిబళ్ళలో యెక్కించుటలో గెరిల్లాలకు సాయపడ్డారు.

కోటకు నిప్పంటించి నేలమట్టం జేయుటకై దాస్వే. తేవారులు వెనుకదిగబడ్డారు. వారికొరకు ఒక స్లెడ్జిబండిని వదలి వెళ్ళారు మిగిలిన గెరిల్లాలు. మంట బాగా అంటుకోటానికిగాను రైతులు పాత రెల్లు చాపలను, తడికలను, చెత్తాచెదారాన్ని పోగుజేసి తీసుకొనివచ్చారు. ఒకొయ్య భవనంలో అగ్ని ప్రవేశించింది. నలుమూలలా ఫెళఫెళమంటూ వ్యాపించింది. ఆ భవనంతో పొరపాటున వదలివేయబడిన చేతిబాంబు లున్నాయి కాబోలు! వాటికి నిప్పంటుకుంది. చేతి బాంబులు పెద్ద ధ్వనిజేస్తూ ప్రేలసాగాయి. ఆ ధ్వనికి యితర రైతులుకూడా అక్కడకు పరిగెత్తుకొంటూ అక్కడికి వచ్చారు.

"బాలూ యిక్కడికి ఎప్పుడొచ్చారు?" అని నవ్వుతూ వాళ్ళనుఒక రైతు అడిగాడు. "కంటితో వాళ్ళను చూడనయినా చూడలేదే! దీని తస్సాచెక్కా, కోటకాస్తా ఎగిరిపోయింది."

* * * *

ఆనాడే బ్లాకీత్సే గెరిల్లాకేంద్ర స్థావరానికి వచ్చాడు. కొంటీ అధికారులలో చాలామందికి శత్రువుకు వ్యతిరేకంగా పోరాటాన్ని నడుపుటకు గాను జిల్లాప్రభుత్వహోదా యివ్వబడింది. షాంగ్‌యొక్క సంఘంలో పనిజేయుటకు బ్లాకీత్సే పంపబడ్డాడు.

ఆ సాయంత్రం గెరిల్లాలతో స్థానికపరిస్థితులను చర్చించినతర్వాత

బిగ్‌పాప్లార్ గ్రామంలోనున్న కోటపై ముట్టడి జరుపవలసిందిగా గ్రాకిత్సే సలహాయిచ్చాడు. ఈ గ్రామంలోని కోట కీలుబొమ్మలకు ప్రతిష్ఠాపరంగా వుంది. ప్రతిఘటనోద్యమానికి పక్కలో బల్లెంలా వున్నది. అందువలన కీలుబొమ్మ సైనికులకు పట్టుగొమ్మగావున్న ఈ స్థావరాన్ని నాశనం చేయటం చాలా అవసరం. ఈ కోటను ఎప్పుడు నాశనంజేదామాయని గెరిల్లాలు వువ్విళ్ళూరుతున్నారు. ఎందువలనంటే యీ కోటలోని దేశద్రోహి స్థావర సైన్యాలకు కమాండరుగా జిన్లంగ్ వున్నాడు. వీడంటే అందరికీ ద్వేషమేగదా! వాడికి సహాయకుడుగా లైవే ఆ కోటలోనే వున్నాడు. జిన్లంగ్‌ను ఖైదీగా పట్టుకోగలిగితే దాస్వేయొక్క పగను సాధించవచ్చునని అందరూ అన్నారు.

అయితే జిన్లంగ్ చాలా జిత్తులమారి. వాడు బిగ్‌పాప్లార్ గ్రామం విడిచి, బయటకు రావటంలేదు. కోటను బహుదిట్టంగా రక్షించుకొంటూ వున్నాడు. దిట్టంగా కట్టబడిన భవనాలచుట్టూ రెండువరుసలు యినుప ముళ్ళ తీగకంచెలు వేయించాడు. దానిలోపల కీలుబొమ్మ సైనికులు అహర్నిశలు కాపలా కాస్తున్నారు. రాత్రిపూట బాగా ఎత్తుగా కట్టబడిన ప్రహరీగేటును భద్రంగా తాళంవేస్తున్నారు. ముళ్ళ తీగెకంచెలకు బయటి ఆవరణలో భయంకరమైన వేటకుక్కలను రాత్రిపూట వదిలిపెడుతున్నారు. కోటలోని ప్రతిగది పైకప్పుమీదనూ, కాపలా పెడుతున్నారు. గ్రామంలోని వారందరినీ వెయ్యికళ్ళతో కనిపెడుతూవున్నాడు జిన్లంగ్. అందువలన, తమకు సహాయగలవారెవయినా గలరాయని గెరిల్లాలు ఆలోచించినప్పుడు వారికి అట్టివారెవ్వరూ కనపడలేదు.

"మా అమ్మవైపు బంధువులు బిగ్‌పాప్లార్ గ్రామంలోనే వుంటున్నారు. నేను అక్కడికిపోయి వాళ్ళనొకసారి చూసివస్తే ఎలాగుంటుంది?" అన్నది మేయీ.

కాని దాస్వేకి సందేహంగానేవున్నది. "నాకు తెలియదు.... మీ మేనమామ కోటలో నౌకరుగా పనిజేస్తున్నాడటగా! అతడు రిపోర్టుచేస్తే ఏమవుతుంది?" అన్నాడు.

మేయీ తీసుకొనివచ్చిన ప్రతిపాదనను యితర గెరిల్లాలాలుకూడా వ్యతిరేకించారు. కాని మేయీ పట్టువదలలేదు. తాను తీసుకునే కార్యాన్ని పూర్తిగావించలేకపోయినా చెరుపు జరగదు గదాయని మేయీ నొక్క సాగింది. చిట్టచివరకు ఆమె అక్కడకు బ్లాకీత్సేపోవుటకు వప్పుకున్నాడు.

ఆ రాత్రి బిగ్‌పాప్లార్ గ్రామపరిసరాలవరకు గెరిల్లాలు తోడుగా రాగా ఆమె దొంగచాటుగా గ్రామంలో ప్రవేశించింది.

మూడురోజులు గడిచిపోయాయి. మేయీ తిరిగిరాలేదు. గెరిల్లాలు ఆదుర్దాపడసాగారు. నియూరీ మేయీ యేమైపోయిందోనన్న భయంతో ఏడ్వసాగింది. ఏదో కీడు మూడివుంటుందని బ్లాకీత్సేకూడా భయపడ సాగాడు.

"ఆమె యీరాత్రికి రాకపోతే, మనమంతా ఆమెను వెతకటానికి బయలుదేరుదాం" అన్నాడు.

గెరిలాకేంద్రంలో ఆ చిన్నగదిలో, గెరిల్లాలందరూ అర్థరాత్రి వేళవరకు వేచియున్నారు. అప్పటికి మేయీ తిరిగి వచ్చింది.

ఆమె బుగ్గలు చల్లని ఎర్ర రేగిపండ్లలాగున ప్రకాశిస్తున్నాయి. తల రుమాలునుండి బయటకు పొడుచుకొనివచ్చిన ఆమె జుట్టు మంచుతో తెల్లబడిపోయింది. తన స్నేహితులందరినీ చూస్తూవుంటే ఆమె కళ్ళు సంతోషంతో నాట్యమాడసాగాయి.

బరువుగానున్న బొంతకోటును విప్పదీస్తూ మేయీ "కత్తెరతీసుకొనిరా" అని నియూరీకి చెప్పింది.

"ఏమిటే ఆ ఎత్తు?" అని నియూరీ నవ్వుతూ అంది.

"నా చేతులు గడ్డకట్టిపోయాయి. యీ మూల అంచును కత్తిరించిచూడు. ఒక కాగితంముక్క కనపడుతుంది. దానిని బ్లాకీకి యియ్యి" అన్నది మేయీ.

నియూరీ ఆవిధంగానే చేసింది. గెరిల్లాలందరూ బ్లాకీచుట్టూ మూగారు. ఒక కాగితంమిద యేవో గీతలు, సున్నాలు, చదరాలూ వున్నాయి. అవేమిటో వాళ్ళకు అంతుపట్టకుండా వున్నది.

"ఇదేంరకం ఆట?" అని గెరిల్లాలలో ఒకడునవ్వాడు.

"ఆ చిన్న 'ఆట'తో మనం కోటను స్వాధీనంచేసుకోగలుగుతాం" అని చిరునవ్వుతూ మేయీ జవాబుచెప్పింది. ఆమె తన వ్రేలితో చూపుతూ వివరించసాగింది. "దక్షిణంనుండి ఉత్తరదిశకు ఇది సరస్సు. ఇవి ఆన కట్ట. తర్వాత చదువు ప్రదేశం; త్వరలో లోతయిన కందకం. ఈ వాల్పుడు వంతెనను దాటితే మరల నేల. వంకరగావున్న యీ గీతలు యినుప ముళ్ళతీగ కంచె మనిషి ఎత్తుకన్న ఎత్తుగావున్నది. ఇక్కడ తీగ కంచెవుంది. దానికొక గేటువుంది. ఆ గేటుకొక పెద్దతాళం వుంది. ఈ గేటులోపల. ఈ అయిదుసున్నాలూ, అయిదు భయంకరమయిన కుక్క- లకు గుర్తు. వీటిని దాటివెళ్ళితే కొండరాళ్ళతో కట్టిన ప్రహరీగోడవుంది. దానిద్వారం యిది. దీని తాళంచెవిని జిన్లంగ్ తనవద్దనే వుంచుకొంటు న్నాడు. ద్వారంద్వారా వెళితే, మొదటి ఆవరణ వస్తుంది. ఉత్తరదిశలో కీలుబొమ్మ సైనికులదళమొకటి నివసిస్తూన్నది. ఈ పైకప్పు యీ ప్రభు జానికి అర్థమేమంటే శత్రువులగూడు అన్నమాట. అక్కడ ఒకమనిషి రాత్రీ, పగలూ కాపలావుంటాడు. ఇంకా ఉత్తరంగా పోతే, రెండవ ఆవ రణలో ప్రవేశిస్తావు. మధ్యలోవున్న యీ పెద్దసున్నా కోట బురుజన్న ఇది ముప్పయి అడుగుల యెత్తువున్నది. మూడంతస్తులు. రోజంతా యిరవైనాలుగు గంటలూ, పైకప్పుపై ఒక కాపలావాడు పహరాయిస్తూ వుంటాడు. లేపై మూడవ అంతస్తులో నివసిస్తున్నాడు. రెండవ అంత స్తులో ఒక సైనికదళం నివసిస్తున్నది. మరల ఉత్తరంగా మూడవ ఆవ రణ వున్నది. జిన్లంగ్ తూర్పుభవనంలో నివసిస్తున్నాడు. వాని అంగరక్ష కుడు గది బయట నిద్రపోతూ వుంటాడు. పడమటిదిక్కు ఖాళీగావున్నది. రెండు అంతస్తులమేడ వొకటి ఉత్తరపు గోడమీద వున్నది. ఆ మేడ పైభాగంలో మరియొకదళం సైనికులు నివసిస్తున్నారు. ఈ ప్రహరీగోడ అంతా, పది అడుగుల మందంగల ఎత్తయినగోడ లోపలవున్నది...." అని మేయీ చెప్పసాగింది.

"ఏయ్! మమ్మల్ని సందిగ్ధావస్థలో పెట్టి చంపబోక. యింకనూ లోపలికి ఎలా వెళ్ళావో చెప్పు." అన్నది విసుగ్గా నియూరీ.

"అరి దీనెమ్మ—! కష్టమైనపనే!" అన్నాడు దాస్వే. చేయనీ యండి. మూడవ ఆవరణకు ఉత్తరంగా నాలుగో ఆవరణ వొకటుంది. వీటిమధ్య సంబంధంవుండేది. కాని యీ రెండింటిమధ్యనున్న ద్వారాన్ని పూడ్చివేశారు. మూడవ ఆవరణకు ఉత్తరదిశకు చివలోవున్న రెండతస్తుల మేడ పైభాగానికి రెండు కిటికీలు వుండేవి. అవి వుత్తరముఖంగా నాలుగవ ఆవరణవైపుగా వుండేవి. కాని వాటినికూడా పూడ్చివేశారు...."

"ఒకటే వాగుడు....లోపలి కెలావెళ్ళాలో చెప్పవేం!" అని విసుక్కుంది నియూరీ.

"విషయానికే వస్తున్నా; ఇదిగో యీ కిటికీలగుండానే లోపలికి పోవటానికి యత్నించాలి. ఈ కిటికీలను పూడ్చేశారుగాని సిమెంటుతో పూడ్చలేదు. అందువలన రాళ్ళను వూడదీయటము సులభం!" అన్నది మేయీ.

"ఆ అంతస్థుమీద నివసిస్తూన్న దళం సంగతేమిటి?" అని ష్వాంగ్ అడిగాడు.

"వాళ్ళగది, ఆ అంతస్థులో పడమటివైపున వుంది. నేను చెప్పిన కిటికీ తూర్పుకొసను వుంది. ఈ కొసనుంచి పై అంతస్తుకు మెట్లు వున్నాయి" అన్నదామె.

"నాలుగో ఆవరణ సంగతేమేమిటి? అదెలా వుంటుంది?" అని అడిగాడు దాస్వే.

"అది ఖాళీగావుంది. దానిలో కోటను అజమాయిషీచేసే వృద్ధుడొకడుతప్ప అక్కడెవ్వరూ వుండరు. ఉత్తరదిశ కొసలలో దానికొక దారివుంది. గేటుద్వారా వచ్చి గోడకు కరచుకుని నడిస్తే బురుజుమీద వున్న కావలావాని కంటికి అగుపించకుండా యిటుకలతో పూడ్చబడిన కిటికీలుగల భవనానికి వెనుక భాగానికి చేరుకోవచ్చు" అన్నది మేయీ.

"భేష్! ఈ కోటను మనం పట్టుకోగలిగితే ఆ ప్రతిష్టంతా నీదే. బాగా గొప్పగా పని చేసుకొచ్చావ్!" అని మేయీని మెచ్చుకొన్నాడు బ్లాకీ....

"నాకీ సమాచారాన్ని అందజేసింది కోటలో నౌకరుగా పనిజేస్తున్న మా మామ. ఆయన్ని మాట్లాడించేసరికి తాతలు దిగొచ్చారంటే నమ్ము!" అని నవ్వింది మేయీ.

వారు తెల్లవారేవరకూ ముట్టడి ప్లానును చర్చిస్తూ కూర్చున్నారు మరికొంతమంది గెరిల్లాలను ప్రోగుజేసుకొని రావటానికని రియూ, నియూరీలను పంపారు.

* * * *

ఆ రాత్రి అన్నీ సిద్ధంజేసుకొన్నారు. కన్ను పొడుచుకున్నా ఎదుటి మనిషి కానరానంత కటిక చీకటిగావుంది. ఒక నిచ్చెన, ఒకచిన్న రంపం వెంటతీసుకొని గెరిల్లాలు బిగ్‌పాప్లార్ గ్రామానికి పడమటిదిక్కునవున్న రెల్లుదుబ్బుల పొదలలోనికి పోయారు.

మేయీ చేతిలో ఒక చిన్న నూనెసీసా వుంది. "ముందుగా నేను వెళ్ళతా. మీ రిక్కడే వుండండి" అన్నదామె.

"నీవొక్కదానివే చేయగలవా?" అని ష్వాంగ్ అడిగాడు. "నేను కూడా నీతో రాకూడదా?" అన్నాడు.

"వద్దు. నేనొక్కదానినే చక్కబరచుకొని వస్తా" అని మేయీ నొక్కిచెప్పింది.

ఆమె జాగర్తగా గ్రామంలో ప్రవేశించింది. నాలుగవ ఆవరణ యొక్క ఉత్తర దిశగేటువద్దకు పోయింది. ఆ గేటు తెరచివున్నది. ఆమె నిశ్శబ్దంగా ఎవరికంట పడకుండా లోపల ప్రవేశించింది. దిక్కూ మొక్కూలేకుండా పడివున్న తోటలో కలుపుమొక్కలు బాగా ఎత్తుగా పెరిగినాయి. ఆ మొక్కల్లో దాక్కుంది మేయీ. కోట అజమాయిషీ దారుడైన ఆ వృద్ధుడు ప్రతిరాత్రీ భోజనంచేసిన తర్వాత గేటుకు తాళం వేస్తూ వుంటాడని ఆమెకు ఆమె మేనమామ చెప్పాడు. అదేవిధంగా ఒక

గంట గడచిన తర్వాత ఆ వృద్ధుడు ఒక చిన్న గదినుండి బయటికి వచ్చాడు. ఆ గిదిలో లాంపు వెలుగుతూ వున్నది. ఆ వృద్ధుడు ఆవర ణను దాటివచ్చాడు. కిర్రు చప్పుడుచేస్తున్న గేటును మూశాడు. దానికి అడ్డకడ్డి తగిలించిన తర్వాత, తన గదికి వెళ్ళిపోయాడు. లాంపును వూదేశాడు.

కొన్ని నిమిషాలపాటు మేయీ నిశ్శబ్దంగా వేచివుంది. అటు తరు వాత గేటును సమీపించింది. తానుతెచ్చిన నూనెతో గేటుబందులను తడి పింది. అడ్డకడ్డీని తొలగించింది. బయటకు జారిపోయింది. గ్రామం వెలు పలవున్న రెల్లుదుబ్బుల పొదలకు పోయింది.

"గేటు తెరచివుంది. యిప్పుడు మనం వెళ్ళవచ్చును" అన్నది.

ఆ కటిక చీకటిలో చకచకా నడుస్తూ, మేయీ గెరిల్లాలను నాల్గవ ఆవరణకు తీసుకొనిపోయింది. నిచ్చెన లోపలికి దూరటానికిగాను వారు తమ ఎత్తుకన్న బాగా ఎత్తుగా వత్తుగా పెరిగిన కలుపుమొక్కలగుండా మూడవ ఆవరణయొక్క ఉత్తరప్రహరీగా ఏర్పడిన భవనానికి వెనుక భాగానికి ప్రాకిపోయారు. భవనంయొక్క తూర్పుభాగంలోనికి యిటిక లతో మూద్చబడిన కిటికీక్రింద నిచ్చెనవేశారు.

సిమెంటుతో గాకపోయినా, యిటుకలను గట్టిగా బిగించబడి వున్నాయి. శబ్దంచేయకుండా కోయుటకు వీలుగానుండుటకుగాను వారు తాముతెచ్చిన రంపానికి పచ్చివెల్లుల్లిపాయచు బాగా రుద్దారు. కిటికీయొక్క కొయ్యచట్రంలోని పైభాగంలో కొంత కోసేశారు. ఈ ఖాళీ ఏర్పడగానే చప్పుడుగాకుండా ఒక్కొక్క యిటుకనే వొలిచి నిచ్చెనక్రింద వున్న వారికి అందియ్యటం సులభం. వారావిధంగా జేశారు.

ఏమి జరుగుతున్నదో కనిపెట్టటానికని ష్వాంగ్, కిటికీగుండా లోపలికి దూరాడు. వసారా చివరనున్న మెట్టుపై కాలు పెట్టాడు. మెల్లగా పిల్లిలాగా హాలులోనుండి కీలుబొమ్మ సైనికులు నిద్రపోతున్న గది యొద్దకు పోయాడు. ద్వారంచెంత నిలబడి ఏమి జరుగుతున్నదీ వినసా గాడు. వాళ్ళందరూ గుర్రుపెట్టి నిద్రపోతున్నారు. మెల్లగా పిల్లివాగున

నడుస్తూ షాంగ్ మెట్లెక్కి మూడవ ఆవరణలోకి దిగాడు. తూర్పు భాగంలోవున్న జిన్సంగ్‌యొక్క గదంతా చీకటిగావున్నది. షాంగ్ రెండవ ఆవరణకు పోయాడు. రెండవ అంతస్థుయొక్క బురుజులో లైట్లు వెలుగుతున్నాయి. అక్కడనుండి వినవస్తున్న ధ్వని అల్లా యేమంటే, పైకప్పుమీద నిలబడి కాపలాకాస్తున్న కాపలాదారుడు వుల్లాసంగా ఈల వేస్తున్నాడు.

షాంగ్ మొదటి ఆవరణలోనికి పోయాడు. ఉత్తరభాగంలోని ఒక అంతస్థుభవనంలో చచ్చిన గేదెదూడల్లాగునపడి నిద్రపోతున్నారు అక్కడున్న సైనికులందరూ. పైకప్పుమీదవున్న గూడులో చడీచప్పుడు లేదు. అక్కడున్న సైనికులుకూడా బండనిద్రపోతున్నాడల్లే వుంది. షాంగ్ గెరిల్లాలవద్దకుపోయి తాను చూచినదంతా చెప్పాడు.

అయిదుగురేసి చొప్పున ఆ గెరిల్లాలందరూ నాలుగు ముఠాలుగా విడిపోయారు. పల్లెకారి జోవ్‌తో మొదటి ముఠా మొదటి ఆవరణకు పోయింది. రెండవముఠా బ్లాకీత్సే, షాంగ్‌ల నాయకత్వాన రెండవ ఆవరణలో బురుజు క్రిందిస్థానాన్ని ఆక్రమింకొంది. మూడవ ఆవరణ యొక్క తూర్పుభాగములోవున్న జిన్సంగ్ గదికి ఎదురుగుండా దాస్వే నాయకత్వాన మూడవముఠా నిలబడింది. నాలవ ముఠాలో దాస్వేతమ్ముడు రియూ వున్నాడు. ఆ నాలవముఠా తాము లోపలికి ప్రవేశించిన భవనం యొక్క రెండవ అంతస్థులో నిలబడింది. బురుజుమీదవున్న కాపలా వానిని బ్లాకీత్సే అంతమొందించేవరకూ అందరూ వేచియుండాలని. అటు తర్వాతనే అందరూ ఒక్కుమ్మడిగా దెబ్బతీయాలని నిర్ణయించుకొన్నారు.

షాంగ్, బ్లాకీత్సే, వారిముఠా బాగా ప్రకాశవంతముగా లైట్లు వెలుగుతున్న బురుజుయొక్క రెండవ అంతస్థులో ప్రవేశించారు. చచ్చిన పందులులాగా కీలుబొమ్మ సైనికులు గదిలో చిందరవందరగా నిద్రపోతున్నారు. ముగ్గురు గెరిల్లాలను తమవెనుక వదలిపెట్టి షాంగ్, బ్లాకీలు ఒక ఆయిల్ లాంపును తీసుకొని మూడవ అంతస్థు ఎక్కారు. ఆ గోడలన్నింటిమీదనూ మేకులకు ఆయుధాలు వేలాడుతూ వున్నాయి.

ఒకపక్కన పైకప్పువంక ముఖంపెట్టి నోరు తెరచుకొని లైవే పడి నిద్రపోతూ గుర్రుపెడుతున్నాడు. షాంగ్ అతన్ని కనిపెడుతూ అక్కడే వుండిపోయాడు. పిస్తోలు చేతితో పట్టుకొని పైకప్పుకుగొని పోయే మెట్లను ఎక్కసాగాడు.

"ఎవరక్కడ?" అని కేకవేశాడు కాపలావాడు.

"నేనే!" అని తడవకు రెండుమెట్లు యెక్కుతూ జవాబు చెప్పాడు బ్లాకీ.

"ఎవరు నీవు?"

"నేనే. ఎవరనుకుంటున్నావ్?" అని బ్లాకీ నవ్వాడు.

"నా బదిరీవా?"

బ్లాకీ పైమెట్టు ఎక్కాడు. సెంట్రీ సిగరెట్ కాలుస్తూ వున్నాడు. ఆ వెలుగువైపుగా కటిక చీకటిలో బ్లాకీ ముందుకు సాగాడు. ఆ కీలుబొమ్మ సైనికుని బాహువులలో రెండుబారుల షాట్‌గన్ వున్నది. చలి నుండి కాపాడుకోటానికని చేతులను చొక్కాజేబులలో వుంచుకొన్నాడా సెంట్రీ. ఏమి జరుగుతున్నదీ సెంట్రీ తెలుసుకునేలోపలనే బ్లాకీ అతని షాట్‌గన్‌ను గుంజుకొని పిస్తోలుతో అతన్ని బెదిరించాడు.

"కదలబోకు!" అని అరచాడు బ్లాకీ. "జాగ్రత్తగా మెలగు, నీ ప్రాణానికేమీ ప్రమాదం కలుగబోదు."

"కదలబోకు!" అని బ్లాకీ వేసినకేక ప్రతిధ్వనిగా "కదలబోకు" అన్నది ప్రతి ఆవరణలోనూ మ్రోగింది.

మచ్చికచేయబడిన మృగంలాగా సెంట్రీ మూడవ అంతస్తుకు పోయేమెట్లను దిగాడు, అతని వెనుక బ్లాకీ వచ్చాడు. షాంగ్ తన తుపాకితో పొడిచి లైవేను లేపుతున్నాడు. "లే! లేరా!" అని షాంగ్ గర్జిస్తున్నాడు.

లైవే కళ్ళు యింకనూ నిద్రమత్తుతో వున్నాయి. "ఎందుకోసం ఈ గొడవంతా?" అని లైవే గొణుగుతున్నాడు. "నాకు దొరక్క దొరక్క కాస్త విశ్రాంతి దొరికింది."

లైవే చెవిని పట్టుకొని, షాంగ్ అతన్ని లేపి కూర్చోబెట్టాడు.

తన ఎదుట నిలబడిన ఆ యిద్దరు గెరిల్లా నాయకులను చూడగానే, లైవే తనకళ్ళను తానే నమ్మలేకపోయాడు. భయంతో వాడి వళ్లు జలదరించింది. ఇప్పటికి వాడికి నిద్రమత్తు వదిలింది. మెలకువ వచ్చింది. రెండవ అంతస్థుకు నడువుదామని వారాజ్ఞాపించారు! లైవే పిల్లిలాగా ముందు నడిచాడు.

కీలుబొమ్మ సైనికులదళమొకటి గదిలో తనవైపున వరసగా నిలబడివున్నది. హడావిడిగా దుస్తులు వేసుకొన్నట్లు కనపడుతున్నారా కీలుబొమ్మ సైనికులు. వాళ్ళను కాపలాకాస్తున్న గెరిల్లాల భుజాలమీద అప్పుడే కీలుబొమ్మ సైనికుల తుపాకులన్నీ వ్రేళ్ళాడుతూవున్నాయి. ప్లాకీ. ష్వాంగ్‌లను గుర్తించిన కీలుబొమ్మ సైనికులు కొందరు వంగి నమస్కారం చేస్తూ—

"కమాండర్! జిల్లానాయకా! మీ రాకకై ఎదురుచూస్తున్నాం!" అన్నారు.

"మంచిది!" అని నవ్వాడు ప్లాకీ. "మీ పక్కచుట్టలనూ. సామాగ్రినీ సర్దుకోండి! బయటికి పోదాం పదండి!" అన్నాడు.

అప్పుడే దాస్వే. తేవారులు పైకి పరుగెత్తుకొచ్చారు. ముఖాలు ఎర్రబా వున్నాయి.

"జిన్లంగ్ యిక్కడ వున్నాడా?" అని వారు అడిగారు.

"అదేమిటి?" అని ఆశ్చర్యంగా అడిగాడు ప్లాకీ.

"వాడు తన గదిలో లేడా?"

"వాడికి అంగరక్షకుడుగా పనిజేస్తున్న ఆ కుర్రవెధవ మాత్రమున్నాడు" అని జవాబుచెప్పాడు దాస్వే. "క్రిందినుండి పైదాకా అన్ని ఆవరణలనూ వెతికాం. కాని జిన్లంగ్ జాడేలేదు."

తన కాలితో నేలనుతాడించుతూ తేవార్ కోపంగా "ఏమిటీచిత్రం. ఆరి! వీడెమ్మ- ఆ కుర్రవెధవకూడా తన కేమీ తెలియదంటున్నాడు!" అరచాడు.

ష్వాంగ్ లైవేని ఒకప్రక్కగా తీసుకొనిపోయాడు. స్నేహపూర్వ

కంగా అతనితో మాట్లాడాడు. "లైవే! నీకు తప్పకుండా తెలిసివుంటుంది. జిన్లంగ్ ఎక్కడున్నాడో చెప్పు" అని ష్వాంగ్ ప్రశాంతంగా అడిగాడు.

లైవే బుర్రగోక్కున్నాడు. వాళ్ళవంక మొద్దులాగున చూశాడు. "ఎక్కడున్నాడో నాకు సరిగా తెలియదు" అన్నాడు.

తేవార్ కోపంగా అతని గొంతుక పట్టుకున్నాడు. "మురికితొత్తు కొడకా!" అని అరచాడు. "ఇంకా దేశద్రోహిగా వుందామనుకున్నావురా? చెప్పు! లేకపోతే నిన్ను గొంతు పిసికి చంపుతా!"

లైవే కళ్ళు భయంతో పాలిపోయాయి. "నన్ను పోనీ. చెప్తాను! చెప్తాను" అని గోలజేశాడు అతను.

అసహ్యించుకొంటూ తేవారు అతణ్ని వదిలాడు.

"వాడు తప్పక ఏ మురంద కొంపలోనో వుండివుంటాడు. అది ఎవతైనదీ నాకు తెలియదు. అంగరక్షకుడుగావున్న ఆ కుర్రవెధవని అడగండి. వాడెక్కడికిపోయినా వాడివెంట యీ కుర్రవెధవ పోతూవుంటాడు. మళ్ళీ వాడిని వీడే కోటకు తీసుకొని వస్తూవుంటాడు. వాడు ఎక్కడవున్నదీ వీడికిమాత్రమే తెలుసు" అన్నాడు లైవే.

ఫైదీలను, పట్టుకొన్న ఆయుధాలను, మందుగుండు సామాగ్రినీ-అంతటిని మూడవ ఆవరణలోనికి జేర్చవలసిందిగా గెరిల్లాలను ఆజ్ఞాపించాడు బ్లాకీ. తేవార్, దాస్వే, లైవేలను వెంటపెట్టుకొని జిన్లంగ్ యొక్క అంగరక్షకుడిని ప్రశ్నించటానికి పోయాడు బ్లాకీ.

ఆ కుర్రవాడు తన తలను క్రిందవంచుకొని అపేపనిగా యేడ్వసాగాడు. వాని కన్నీళ్లు ఏకధారగా చెక్కిళ్ళపై కారుతున్నాయి. జిన్లంగ్ ఎక్కడుంటాడో తనకు తెలియదని నొక్కిజెప్పసాగా డా కుర్రవాడు. కుర్రవాడు భయపడిపోయాడన్న సంగతిని బ్లాకీ గ్రహించాడు. వాని ప్రక్కన కూర్చొని, మృదువుగా ఆ కుర్రవాని భుజంమీదికి తన చేతిని పోనిచ్చాడు బ్లాకీ.

"ఇక్కడకు యెలా వచ్చావ్ చిట్టితమ్ముడూ?" అని ప్రశ్నించాడు బ్లాకీ.

ఆ కుర్రవాడు తల ఎత్తకుండా ముఖం చిన్నపుచ్చుకొని "కొద్ది

లోజులపాటు పనిచేయటానికి మా నాన్నకు బదులుగా వచ్చాను. కాని జిన్లంగ్ నన్ను వదలిపెట్టలేదు" అన్నాడు.

"హా! ఇదా వాడనుసరిస్తున్న పద్ధతి. దేశద్రోహి తొత్తుకొడుకు జిన్లంగ్ జపానువాళ్ళలాగున తయారైనాడన్నమాట. పైనావాళ్ళమైన మనల్ని వేటాడుతున్నాడు. ఆ వెధవ ఎక్కడున్నాడో చెప్పు. వాణ్ణి మేం పట్టుకుంటాం. నీకు స్వేచ్ఛ లభిస్తుంది. మన ప్రజలకు హానిచేస్తున్న దేశద్రోహుల సంఖ్యలో ఒకడు తగ్గుతాడు. ఏమంటావ్?"

కన్నీటితో తడిసిముద్దయిపోయిన తన ముఖాన్ని ఆ కుర్రవాడు బ్లాకీవంక త్రిప్పాడు. "నా—నాకు ధైర్యంలేదు—లేదు—వాడు కన్నుక్కున్నాడంటే నన్ను చంపేస్తాడు" అని ఏడ్వసాగాడు.

"ఈ రోజునుండి నువ్వు మాతో వుండిపోదువుగాని. మేమునిన్ను రక్షిస్తాం. భయపడాల్సిన అవసరంలేదు" అని బ్లాకీ నమ్మబలికాడు.

ఆ కుర్రాడు వినటానికి ఎదురుచూస్తున్నదీ విషయమే. అతడు తన కన్నీళ్ళను తుడిచేసుకున్నాడు. "సరే! వాడున్న చోటుకు మిమ్మల్ని తీసుకొనిపోతా" అని ధైర్యంగా చెప్పాడు.

కోటను షాంగుకు పప్పగించి, బ్లాకీ సగంమంది గెరిల్లాలతో ఆ కుర్రవానివెంట వెళ్ళాడు. ఆ కుర్రవాడు వాళ్ళను నవయవ్వనవతియగు ఒక వితంతువు యింటికి తీసుకొనిపోయాడు.

ఆ వితంతువుతోనే జిన్లంగ్ ఆ రాత్రి మజాచేస్తున్నాడు. జోవ్, రియూలు ప్రహరీగేటువద్ద కాపలావేశారు. దాస్వే, తేవార్‌లు, దొడ్డిదారి వద్ద కాపలాకాస్తున్నారు. బ్లాకీ, తదితరులు ఆ కుర్రవానితో యింటిపై కప్పు కెక్కారు.

ఇంటిపైకప్పుమీద అడుగుల చప్పుడు వినపడే సమయానికి,జిన్లంగ్ మంచంమీద పడుకొని వితంతువుతో సల్లాపాలు జరుపుతున్నాడు. అడుగులు చప్పుడు వినగానే ఏదో మూడిందని గ్రహించాడు.

"మనల్ని పట్టుకోటానికి వచ్చారు. వేగంగా దుస్తులు వేసుకో! నిన్ను నేను రక్షిస్తా! మనం తప్పించుకొందాం" అని ఆదుర్దాగా ఆమె చెవిలో వూదాడు.

భయంతో నవయవ్వనవిలసితయైన ఆ వితంతువు కంపించిపోయి నది. వారు హడావిడిగా దుస్తులు ధరించారు. తన పిస్తోలును తీసుకొని, జిన్లంగ్ ఆమెను తలుపువైపు తోసుకుపోయాడు.

ఒక అంతస్తు భవనాల చదరంగంలో ఆ ప్రహరీవుంది. జిన్లంగ్ పడుకొన్న గదికి ఎదురుగానున్న గది పైకప్పుపై గెరిల్లాలు వున్నారు. తుపాకులను బారుచేసి సిద్ధంగావున్నారు. జిన్లంగ్ మెల్లగా గడియతీశాడు. తలుపు దడాలున తెరిచాడు.

ఒక్క వూపులో గెరిల్లాలమీద కాల్చాడు. వితంతువును ఆవరణ లోకి నెట్టాడు. ఆ చీకటిలో ఆమెయే జిన్లంగ్‌యని భావించారుగెరిల్లాలు. జవాబుగా తుపాకులు కాల్చారు. ఆ గుళ్ళు వితంతువు శరీరాన్ని తూట్లు పొడిచాయి. కిమ్మనకుండా చచ్చిపడింది.

బాణంలాగున జిన్లంగ్ ఆవరణలోనికి పరుగెత్తాడు. ప్రహరీగేటు ద్వారా దూసుకొనిపోయాడు. జిన్లంగును కాల్చటానికని జోప్ తన తుపా కిని పైకెత్తగానే జిన్లంగును సజీవంగా పట్టుకుందామన్న అభిలాషతో, రియూ తుపాకిని ప్రక్కకుతోసి ఆ దేశద్రోహిమీద కలియబడటానికి ముందుకుదూకాడు. ఒక్కగుద్దుతో జోప్ జిన్లంగ్‌వెంటపడ్డాడు. జిన్లంగు చీకటిలోనికి పారిపోయాడు.

వారిద్దరిలో ఎవరూ తీసిపోలేదు. ఇద్దరూ వేగంగా పరుగెత్త సాగారు. ఆ ఇటుకగొందులలో అనేక మలుపులు తిరిగారు. జోప్ తుపాకి కాల్చాడు. తుపాకి గుండు జిన్లంగు తలకు దగ్గరగా దూసుకుపోయింది. జిన్లంగు జవాబుగా కాల్చాడు కాని, ఆ దేశద్రోహి గురితప్పాడు. వాళ్ళి ద్దరూ రొప్పుతూ, గ్రామాన్నివిడిచి పరుగెత్తారు. గడ్డకట్టిపోయిన సర స్సుకు చేరుకున్నారు. జిన్లంగు మంచులోపడి పరుగెడుతున్నాడు. అతని వెనుక జోప్ పరిగెత్తసాగాడు.

"ఆగు! జిన్లంగ్! ఆగు!" అని ఆ గెరిల్లా అరచాడు. "నీవు చైనా వాడివి- లొంగిపో; నిన్ను చంపం!"

"నన్నుపోనీ జోప్! నీ కేదో ముట్టచెపుతాలే!" అని అరుస్తూ పరి గెత్తసాగాడు జిన్లంగు.

ద్వేషంతో పళ్ళునూరుతూ, జోవ్ మోకాలిమీద వంగి, తనఎదుట నల్లని నీడగావున్న జిన్లంగుపై గురిజూచి కాల్చాడు. జిన్లంగు కుడిభుజం చీరుకొనిపోయింది. బాధ అమితంగావున్నాజిన్లంగు పరిగెడుతూనేవున్నాడు వాడి అదృష్టం పండిందికాబోలు! ఒక్క పిస్తోలు గుండుదెబ్బతో జోవ్‌ను చంపాడు.

తుపాకి కాల్పుల ధ్వనినిబట్టి దిక్సూచితులై, బ్లాకీ యితర గెరిల్లాలు సరస్సువైపుగా పరుగెత్తారు. ఆ గాఢాంధకారంలో వాళ్ళకు ఏమి కనపడంలేదు. జాగ్రతగా మంచుపై నడవసాగారు. కొన్నిగజాలదూరం మంచుమీద ఏదో ఆకారం ప్రాకసాగింది. ఆకారాన్ని ఒక గెరిల్లా జూచాడు. గెరిల్లాలందరూ మోకాళ్ళపై వంగారు. తుపాకులను బారు చేశారు. కాని ఆ ఆకారం మరల కదలలేదు. వాళ్ళ కేకలకు జవాబివ్వలేదు. వారు అటువైపుగా పోయి చూశారు. అక్కడున్నది జోవ్.

దాస్వే పళ్ళతోముకునే బ్రష్ పిడిని వెలిగించాడు. దానివెలుగులో ఆ యువక పల్లెకారి శరీరాన్ని పరీక్షించారు. ఆ బక్కపల్చని జోవ్, యింకనూ శత్రువుపైద గురిచూస్తున్నట్లుగా ఒక కన్ను మూసుకొని వున్నాడు. అతని శరీరం అప్పటికే కొయ్యబారిపోయివున్నది. గుండు దెబ్బతిని తూటుపడిన అతని హృదయం నుండి అమితంగా రక్తం స్రవించి, గుండెక్రింద గుంటకట్టింది. అతని శరీరాన్ని మంచుకు అతికించివేసింది.

"జోవ్ చాలా ఉత్తముడు" అని బ్లాకీ విచారపడ్డాడు.

తన ప్రియమిత్రుని పోగొట్టుకొన్నందుకుగాను దాస్వే భోరున ఏడ్చాడు. గడ్డకట్టిపోయిన ఆ సరస్సుపై భాగంపై గెరిల్లాల కన్నీటి వర్షం కురిసింది.

అక్కడున్న గెరిల్లాలందరూ, పల్లెకారి జోవ్ ప్రాణాలను బలిగొన్నవానిపై పగ తీర్చుకుంటాం! అని శపథంజేశారు.

బిగ్‌పాప్లోర్ గ్రామంపైవున్న నీలాకాశానికి ఎర్రని మంటలు ఎగ బ్రాకుతున్నాయి.

దాని ప్రతిబింబం సరస్సుపై పడింది. ష్వాంగ్‌దళం, రైతాంగ ప్రజలూ కలసి ఆ గ్రామంయొక్క కోటను ధ్వంసంచేస్తున్నారక్కడ.

తూర్పుదిశలోనున్న గ్రామాలనుండి అగ్నిజ్వాలలు ఆకాశానికి ఎగురుతున్నాయి. బాయాంగ్ సరస్సుయొక్క తూర్పుతీరంలో శత్రువుల కోటలు మంటలపాలు కాసాగాయ్.



# 12 అధ్యాయం

గెరిల్లాలబారినుండి ఆ విధంగా తప్పించుకొన్న తర్వాత జపాను వాళ్ళ కీలుబొమ్మల హస్తాల్లోవున్న షెన్‌జ్యా గ్రామానికి జిన్లంగ్ చేరుకొన్నాడు. గాయానికి మందు వేయించుకున్నాడు. తన స్నేహితుడయిన జీవోతో ఒక వారం రోజులపాటు కోటలో విశ్రాంతి తీసుకొన్నాడు. అటు తర్వాత జపానువాళ్ళ స్వాధీనంలోవున్న ఎత్తయిన ప్రహరీగల పట్నానికి వలసపోయాడు.

తాము పట్టుకున్న కీలుబొమ్మ సైనికులకు మూడు రోజులపాటు బోధించినతర్వాత గెరిల్లాలు వాళ్ళందరిని, లైవేనికూడా వదలిపెట్టారు.

వసంత వాయువులు వీయుట ప్రారంభించగానే, బాయాంగ్ సరస్సులోని మంచుగడ్డలు కరిగినాయి. గెరిల్లాలు విజృంభించసాగారు. అనేక కోటలను పట్టుకొన్నారు, నాశనం జేశారు. గెరిల్లాలచే ధ్వంసం గావింపబడిన కోటలను పునర్నిర్మించుటకుగాను, శత్రువులు కూలిపటాలలోనికి రైతులను యీడ్చుకొచ్చేవారు.

కాని ప్రజలు, బాలూ ఒకే మనస్సుతోనున్నారు. ఎలాగయితేనేం, మరమ్మత్తులు ఎప్పటికీ పూర్తికాలేదు. ఎందువల్లనంటే పగటిపూట రైతులు శత్రువుల బలవంతంమీద నిర్మించినదానినంతనూ, రాత్రిపూట భగ్నం చేసేవారు. జపానువాళ్ళు ఏమీ చేయులేకపోయారు.

బాయాంగ్ సరస్సుప్రాంతంలోని అత్యధిక గ్రామాలపై బాలూకు క్రమేణా ఆధిపత్యమేర్పడింది. ఇంకా గెరిల్లాలు స్వాధీనంలోనికి రాని

గ్రామాలలో కూడా కీలుబొమ్మసైనికులలో అత్యధికభాగం రహస్యంగా గెరిల్లాల ఆజ్ఞలను అమలుజరుపసాగారు.

అతికష్టమైన ప్రదేశాలేవంటే నగరాలు, ఎత్తయిన ప్రహరీలుగల పట్నాలు. షెన్‌జ్యా గ్రామంలాంటి ఒకటి రెండు గ్రామాలు. ఈ ప్రదేశాలలో జపానువాళ్లు తిష్టవేసి కూర్చున్నారు. ఈ స్థావరాలనుండి శత్రువులు గ్రామీణప్రాంతాలపై దాడిచేస్తూ వుండేవారు. రైతులనుండి ఆహార-ధాన్యాలను దోచేవారు.

ప్రజలను రక్షించుటకుగాను జపానువాళ్ళతో 'మధ్యవర్తులు'గా వ్యవహరించుటకై ప్రతి గ్రామానికి కమ్యూనిస్టు పార్టీ తన మనుషులను పంపింది.

జపానువాళ్ళతో సహకరించుటకు యిష్టపడుతున్న స్థానికాధికారులుగా వారు నటించేవారు. కీలుబొమ్మ పౌరపరిపాలక ఆఫీసులన్నీ గ్రామాలలోని అభ్యుదయవాదులతో నింపబడ్డాయి. కమ్యూనిస్టు తత్వంగల ఎంతమందితో తాము వ్యవహరిస్తున్నారో జపానువాళ్ళకు తెలియదు!

ప్రతిఘటనావిధానం యీ విధంగా వుంది: "శత్రువు దేనినయినా ఎప్పుడయినా కోరితే, దానిని వానికి యివ్వవద్దు; అథవా యిస్తేవా ఆలస్యంగా యివ్వు; వాడు కోరినదానికంటే తక్కువ యివ్వు!" శత్రువులను మోసంచేయటానికి, వారి కళ్ళు కప్పటానికి, వారి చెవులకు వినపడకుండా జేయటానికి రైతాంగప్రజలు అనంతకోటి ఉపాయాలను కనిపెట్టారు.

మహసూళ్ళు పూర్తికాగానే శరత్కాలంలో, జీవోయొక్క కీలుబొమ్మసైనికులు, అనేక గ్రామాలమీద పడ్డారు. ఒక్కొక్క గ్రామం రెండుటన్నుల తెల్లపిండినీ, రెండుటన్నుల చేపలను సమర్పించుకోవలసిందిగా డిమాండ్ చేయసాగారు. "సహకారం అధికారులు, యింత పెద్ద మొత్తాన్ని తమ జీవితంలో వసూలు చేయజాలమని ఫిర్యాదు చేశారు. సరకులను విడుదల చేయకుండా ఆలశ్యంజేశారు. చిట్టచివరకు జీవో ఒక ఆజ్ఞాపత్రాన్ని వ్రాశాడు. దానిలో సంగతులేమంటే, ఈ ఆజ్ఞాపత్రం చేరిన యిరవైనాలుగు గంటల లోపల తాను డిమాండ్ చేసిన సరుకులు సమ

ర్షించుకోకపోతే ఒక్క కుక్కయినా, కోడిపెట్ట అయినా మిగలకుండా సజీవమైన దానినంతనూ తన అనుచరులు నాశనం జేయగలవారని.

గడువు దాటిపోయింది. పడవలు రాలేదు. కీలుబొమ్మ సైనికులు జపానువాళ్ళు షెన్‌జ్యా గ్రామాన్ని వదలిపెట్టి తమ పడవలలో పెంకిగానున్న గ్రామాలపై విరుచుకొనిపడటానికి బయలుదేరారు. సరస్సులో సగందూరం పోగానే వాటికి చేపలు, పిండి నింపుకొనివస్తున్న మూడు చిన్న పడవలు కనిపడ్డాయి.

"ఎక్కడికి పోతున్నారు?" అని సైనికులు అడిగారు.

"మేం బిగ్‌పాప్లాక్ గ్రామంనుండి వస్తున్నాం" అని జవాబు ఒక వృద్ధుడు; "ఈ పదార్థాన్ని మీ కోటకే పంపుతున్నాం" అన్నాడు.

జీనో ఆ పదార్థాలవంక అసంగీకారంగా చూచాడు. "ఏం యింత తక్కువగా వున్నయేం?" అని డిమాండు చేశాడు.

ఆ వృద్ధుడు కళ్ళార్పాడు. "ఏయ్! సామి! దీన్ని గోక్కొచ్చేసరికి మా ప్రాణాలు పోయాయ్! సరస్సు ప్రాంతంలో గోధుమలుపండే పొలమే లేదు. ఈ యేడు అందరూ ఆకలితో చస్తున్నారు. ఎవడు చేపలు పడతాడు? గ్రామాధికారులు రాత్రీ పగలూ కష్టపడి వసూలుజేశారు. వీధులలో గంటలు మ్రోగించారు. గొంతులు పగిలేటట్లు అరిచి చెప్పారు. మీరంతట మీరే వెళ్ళిచూడండి! వాళ్ళింకా యత్నిస్తూనే వున్నారు!" అన్నాడు.

జపానువాళ్ళు బలంకొలదీ బండబూతులు తిట్టారు. జీనో ఆ వృద్ధునివంక మిర్ర మిర్రగ జూశాడు. "నీయమ్మ—! కాలం వృథాజేస్తున్నావురా! త్వరగాపోయి నీవు తెచ్చింది వప్పజెప్పరా!" అన్నాడు.

"చిత్తం! చిత్తం! కమాండరుగారూ!" అని తలవూచాడు ఆ రైతు. "ఓ తొందరగా పోతాం!" ఆ చిన్న పడవలవాళ్ళు తెడ్లాడించారు. షెన్‌జా గ్రామంవైపు పోయారు. కాని, శత్రువులు కనుచూపుకు దూరం కాగానే పడవలను మరియొక మార్గానికి పట్టించారు. చక్కగా రెల్లు దుబ్బుల పొదలమధ్యకు పోయారు. అక్కడ శుభ్రంగా పక్కలు వేసుకొని సుఖంగా నిద్రపోయారు.

బిగ్‌పాప్లార్ గ్రామంలో పెద్ద గందరగోళంగా పోట్లాటలు కాట్లాటలూ, తిట్లదుమారాలు రేగుతూవుండటాన్ని జీవో, అతని అనుచరులు గమనించారు. దొరికినదానినల్లా ప్రోగుచేస్తూ యింటింటికి బయలుదేరారు గ్రామాధికారులు, వారి సిబ్బంది తొక్కిసలాడుతూ ఒక పెద్ద గంపనిండా పాత పరుపులను, పిల్లల చెడ్డీలను, ముసలమ్మల టోపీలను-అన్నిరకాల చెత్తాచెదారాన్నీ ప్రతి ఇంటివద్దనూ ప్రోగుజేస్తున్నారు.

ఆశ్చర్యమగ్నులై శత్రువులు ఈ తతంగాన్నంతనూ చూస్తున్నారు. విరిగిపోయిన తొల్లిక నొకదానిని ఒక యింటినుండి తీసుకొని బయటకు వచ్చాడు ఒక గ్రామాధికారి. వాని వెనకాలే ఒక ముసలాడు వచ్చాడు. వాడు మోకరించి, అధికారి పాదాలపై పడ్డడు.

"బాబూ! నా తొల్లికను తీసుకోకండి బాబూ! ఇది నాకు మా బాబు యిచ్చిన ఆస్తి. ఎన్నో సంవత్సరాలనుండి వుపయోగించుకొంటున్నా....! ఇది లేనిదే పని జరుగదు. మేమంతా మాడిపోవలసి వస్తుంది బాబూ!" అని మొత్తుకోసాగాడు.

"ఈ చెత్తనేమిచేస్తావోయ్?" అని జీవో ఆ అధికారిని అడిగాడు. ఆ అధికారిపేరు "మి"

"మీకు తెలియదా, కమాండరుగారూ! చెప్పుకోదగిన మంచి సామానుగల కుటుంబమొక్కటీ ఈ గ్రామంలో లేదు. ఈ పాతచెత్తనే తీసుకోవలసి వచ్చింది. మేం ఈ సామాగ్రినంతనూ అమ్మివేస్తాం; వచ్చినదానితో మీకు గోధుమపిండి కొనితెస్తాం!" అని చిరచిరలాడుతూ జవాబు చెప్పాడా అధికారి.

ఆ అధికారి ఈ విధంగా మాట్లాడుతూవుండగా ఆ వీధి చివరనే మరియొక గందరగోళం బయలుదేరింది. అక్కడొక గ్రామాధికారి, ఒక ముసలమ్మ ఒకరిమీదొకరు కేకలేసుకొంటూ, పోట్లాడుకొంటున్నారు. ఇంతకీ ఆ పోట్లాట ఒక ఇనుపకాగును గురించి జరుగుతూవున్నది. అధికారి ముసలమ్మ ముఖంమీద గట్టిగా కొట్టాడు. ఆమె నేలమీదపడి దొర్లుతూ వున్నది. భోరున ఏడుస్తూవుంది.

"మీ" ఆవిధంగా గ్రామవాసుల దరిద్రగొట్టుతనాన్ని గురించి మొత్తుకొంటూ, మెల్లగా జీవో చేతులలోనికి నోట్లకట్టను జారవిడిచాడు.

"కమాండరుగారు ప్రజలకోసం ఎంత కష్టపడి పనిచేస్తున్నదీ ప్రతి మనిషికీ తెలుసు" అని జీవో చెవులలో "మీ" వూదాడు. "మీ స్వంత ఖర్చులకోసం ఈ చిన్నెంత డబ్బును ఎలా గోతంటాలుపడి పోగుచేశాం" అన్నాడు.

ఏమీ ఎరుగునట్లు జీవో ఆ డబ్బునే ఎవరి కంటికి అగుపడకుండా దాచివేసుకొన్నాడు. వాళ్ళు తలలు వూపారు. "వీధి నిర్వహణ"పై ఒక చిన్న వుపన్యాసం దంచటానికి రైతులందరినీ ఒకచోట ప్రోగుజేసి, ఉపన్యాసాన్ని ముగించిన తర్వాత, శత్రువులు ఆ గ్రామాన్ని విడిచి పెట్టారు.

వారు షెన్‌జ్యాగ్రామంలోని తమ కోటను జేరుకోగానే, ఆ మూడు చిన్నపడవలు సరుకులను తీసుకొనివచ్చి యివ్వలేదని వారికి తెలిసింది. జపానువాళ్లు కోపంతో మండిపోసాగారు. బిగ్‌షాప్లార్ గ్రామాన్ని ఆ మరునాడు నేలమట్టం చేస్తాం చూడమన్నారు. కాని ఆ మరునాటి ఉదయం పెందలకడనే ముఖం ముడుచుకొని "మీ" కోటలో ప్రత్యక్షమయ్యాడు.

"మీరు మా గ్రామాన్ని మీ కళ్ళతోనే చూచారుగదా! అందువలన మే మెంతగా దరిద్రంతో బాధపడుతున్నదీ మీకు వేరే చెప్పనవసరం లేదు" అని జీవోకు ఫిర్యాదు చేయసాగాడు.

"మీకోసం మేము నిన్న పంపిన చేపలు, పిండి సరిపోలేదని భావిస్తే మాతో మాటమాత్రం చెపితే సరిపోయేదిగదా! మా మనుషులను పడవలను మీరు స్వాధీనం చేసుకోవటంలో అర్థమేమిటి? నా గ్రామప్రజలకు నే నేమని జవాబు చెప్పుకోవాలి సామీ?"

"ఏయ్! దురదృష్టం!" హృదయభారంతో జీవో అన్నా డా మాటలు. "ఆ సామానులు మాకు జేరనేలేదు! బాలూగాళ్ళు కొట్టేశారల్లె వుంది!"

"మీ" నిట్టూర్చాడు. చుట్టూ చూశాడు. చుట్టూవున్న వాళ్ళంతా నమ్మే

టట్లుగా దుఃఖించసాగాడు. అదిజూచి జపాను అధికారులలో ఒకడు అతన్ని ఓదార్చటానికి యత్నించాడు.

"బాలూ చాలారోత! గ్రామంవాడు మంచి! రేపు సామ్రాజ్యసేన బాలూని కనుక్కొంటుంది! అన్నీ చంపు-చంపు!"

"మీ" జపానువాడికి బాగా ఒంగి సలాంచేశాడు. "అవును! అన్నీ చంపు-చంపు!" అన్నాడు. "మీ"కి నవ్వాగపోయింది. అందుకని వెంటనే అక్కడినుండి వెళ్ళిపోయాడు.

* * * *

జపానువాళ్ళ "యమఘట సైన్యానికి" దెబ్బమీద తగలసాగింది. ఒకసారి బియ్యం, రెల్లుచాపలు, పాతగుడ్లను నిండావేసుకొని మోసుకొనిపోతున్న మూడు మిలిటరీ పడవలు, శత్రువుల ఆధీనంలోవున్న నగరంనుండి బయలుదేరాయి. వాటి గమ్యస్థానం టీన్‌స్టిన్. అవి బాయాంగ్ సరస్సునుండి బయటపడే లోపల గెరిల్లాలు వాటిపై దాడిచేశాయి. ఆ పోరాటంలో యిరవైమంది జపానువాళ్ళు చచ్చారు. జెక్ రకానికిజెందిన రెండు తేలికరకపు మెషిన్‌గన్లు, ఒక మందుఫిరంగి, గెరిల్లాల చేతులలో పడ్డాయి. అప్పటినుండి బాయాంగ్ సరస్సులో ప్రయాణం చేయటం మానారు జపానువాళ్లు.

శరత్కాల పండుగదినమది. కీలుబొమ్మ గ్రామీణ పరిపాలక అధికారవర్గం, ధాన్యసేకరణ వుద్యమాన్ని ప్రారంభించింది. ఆ సందర్భంలో అన్ని గ్రామాల మేయర్లను, షెన్‌జ్యా గ్రామంలోని సమావేశానికని పిలిపించింది. బిగ్‌పాప్లర్ గ్రామంయొక్క మేయరు పైకిమాత్రం కీలుబొమ్మ వర్గానికి సంబంధించినవాడు. యదార్థానికి బాలూ తరఫున పనిజేస్తున్నాడు. సమావేశం ముగిసినప్పటికీ, ఆ మరునాటిరాత్రికికూడా అతడు తనగ్రామానికి తిరిగిరాలేదు. ఒక బాలూ రైతుకొంపలో ఆ మేయరు కొరకు [illegible], అనేకమంది గెరిల్లాలు వేచియున్నారు.

ప్రహరీగోడకు ఆవలివైపునున్న చెట్లమీదుగా పూర్ణచంద్రుడు ఉదయిస్తున్నాడు. ఆవరణలోకి మృదువెన్నెల వస్తూవుంది. రైతులు పంపిన ద్రాక్షపండ్లను, బటాణీగింజలను, ఖర్జూరకాయలను మేయీ, నియూరీలు పంచుతున్నారు. ష్వాంగ్, తేవారులు పొట్టచెక్కలయ్యేటట్లు అందరినీ నవ్విస్తున్నారు.

దాస్వే మాత్రం విసుగుగానూ, వైరాగ్యంగానూ వున్నాడు గుమ్మం మెట్లమీద నీడలో కూర్చొనివున్నాడు ఆనాడు హో. అతని అనుచరుల చేతులలో అనుభవించిన యమయాతనలమూలంగా ఏర్పడిన బలహీనత అతణ్ని యింకా వదలలేదు. గట్టిగా పనిజేస్తే ఇంకా నోటివెంట రక్తం పడుతూనే వుంది. మిగిలినవాళ్ళందరూ కేరింతాలు కొడుతూవుంటేవాళ్ళలో వున్న దాస్వే తన తండ్రి ఏ రకంగా భయంకర మృత్యువువాతపడిందీ దాన్నిగురించి విచారపడుతున్నాడు. అతడు అతివిచారంగా నీడల్లో వొదిగి కూర్చున్నాడు.

మేయీ అతనిప్రక్కగా కూర్చున్నది. అతని చేతిని తన చేయుల లోనికి తీసుకొంది. "ఏమిటలావున్నావ్?" అని మెల్లగా అడిగింది."మళ్ళీ బాధ కలుగుతూవుందా ?"

"అబ్బే! ఏం లేదు."

వాళ్ళిద్దరూ ప్రక్కప్రక్కగా కూర్చోవటం తేవార్ చూశాడు. "నే నేమనుకుంటున్నానో తెలుసా?" అని పెద్దగా అడిగాడు. "దాస్వే పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నా డనుకుంటాను."

తత్తరపాటుగా దాస్వే లేమ లేదని జవాబుచెప్పాడు. కొంతకాలం నుండి దాస్వే మానసికంగా బాధపడటాన్ని బ్లాకీ గుర్తించాడు. దాస్వే స్థితినిజూసి చాలా విచారపడ్డాడు. ఇప్పుడు బ్లాకీత్వే విసరినహాస్యం అత్యద్భుతమైన భావంగా బ్లాకీకి తట్టింది.

"ఏమంటావ్?" అని నవ్వుతూ బ్లాకీ అడిగాడు. "నీ కొక ప్రియురాలిని తెచ్చిపెట్టమంటావా?" అన్నాడు.

చేయివూపుతూ ష్వాంగ్ ముందుకు పరుగెత్తుకొచ్చాడు. "మనము వెతుకనక్కరలేదు!" అని వుల్లాసంగా ప్రత్యుత్తరమిస్తూ "మీ కళ్ళ ఎదుటనే సిద్దంగావుంది" అన్నాడు.

అందరి కళ్ళూ మేయివంక తిరిగాయి. సిగ్గుతో మేయి తలవంచుకున్నది. బటాణీగింజలను వొల్చుతీస్తూ కూర్చుంది.

నియూరి ఆమెను బయటకులాక్కొచ్చింది. "ఈమే ననుకుంటాను. అందరూ అంగీకరిస్తారా?"

"నీ యభిప్రాయ మేమిటమ్మా మేయీ?" అని కిలకిల నవ్వాడు బ్లాకీ.

మేయి గుండె విపరీతంగా కొట్టుకొంది. ముఖం ఎర్రబడింది. తనకు అంగీకారమేనని చెప్పటకు చాలా సిగ్గుపడింది. అంగీకారం కాదని చెప్పటం ఆమెకు ఏమాత్రం యిష్టంలేదు. నవ్వుతూ సమస్యను కష్ట దాటువేచింది.

"నేనంటే అతని కిష్టంలెదేమోనని నా భయం" అన్నది.

రియూ తన సోదరుని ముందుకులాగాడు. "ఆమె నీకు యిష్టమవునా కాదా?" అని నొక్కి అడిగాడు.

అన్నివైపులనుండీ స్నేహితులు అదే ప్రశ్నవేశారు. దాన్నేని తప్పించుకోనీయలేదు.

వప్పుకోవటం తప్ప అతనికి వేరే దారి లేకపోయింది. "ఆమె అంటే నాకు చాలారోజులక్రితమే యిష్టం!" అన్నాడు. అంగీకారసూచకంగా వారందరూ కేరింతాలు కొట్టారు.

వారిద్దరూ ఉత్తమదంపతులు కాగలరని బ్లాకీ అనుకున్నాడు. వారిద్దరూ పెళ్ళిచేసుకోటానికి నేను తోడ్పడాలి!

అప్పుడే అక్కడ కొక రైతువచ్చి వార్త అందించాడు. ఆ వార్త వారి సంతోషాన్ని పాడుచేసింది. షెన్‌జ్యా గ్రామంలోని సమావేశానికి హాజరవుటకుపోయిన మేజర్లందరినీ జపానువాళ్ళు, కీలుబొమ్మలు అరెస్టు చేశారట!

పదిరోజుల లోపల ధాన్యసేకరణ కోటాలను పూర్తిచేయకపోతే

మేయర్లందరినీ కాల్చి చంపేస్తామని కీలుబొమ్మ ప్రభుత్వం ప్రకటించిందని ఆ రైతు చెప్పాడు.

ఆ వార్తను వినగానే అంతటా నిశ్శబ్దం ఆవరించింది. చిట్టచివరకు బ్లాకీ లేచినిలబడి మాట్లాడాడు.

"కీలుబొమ్మ ప్రభుత్వంలో పనిజేస్తున్నవారిద్వారా యీ సమస్యను పరిష్కరించాలి; ఇదొక్కటె మార్గమనుకుంటాను" అన్నాడు.

ఈ పద్ధతి విజయవంతం గావటం సందేహాస్పదమని అందరికీ తెలుసు. షెన్‌జ్యాగ్రామంలో జపానువాళ్లు పెద్ద కోటను కట్టారు. దానిలో కఠిన మిలిటరీ సూత్రాలను అమలుజరుపుతూ ఆ కోటను కాపాడుకొంటున్నారు. పూర్వపు మేయరు షెన్. జిన్ కీలుబొమ్మ గ్రామపరిపాలక సంఘాల అధినేతగా తన ఆఫీసును ఆ గ్రామంలోనే పెట్టుకొని పనిజేస్తున్నాడు. వానితో వేగటం చాలా కష్టం.

వాడు చాలా దురాశాపరుడు. అంతేగాక, యుద్ధవాతావరణం ఎటువైపు మొగ్గుగావున్నదీ కనిపెట్టి దానిప్రకారం నడచుకొనే అతితెలివితేటలుగల మనిషి. జపానువాళ్లు యుద్ధంలో జయిస్తున్నారని పసికడ్తే అటువైపు మొగ్గేవాడు. రహస్యప్రజాసంఘాలకు దూరంగా వుండేవాడు. ఇటీవా హోగారి కొడుకు గోపీ, వేగువాళ్ళ సంఘానికి పెద్ద అధికారిహోదాలో కోట కమాండరైన జీవోకు సహాయపడుటకు షెన్‌జ్యాగ్రామంపోయాడు. ఈ ఎత్తుకు అర్థమేమంటే గ్రామాలలోనున్న బాలువర్కర్లను నాశనము చేయుటకు జపానువాళ్లు వేసుకొన్న యీ ప్లానులో యీ ఎత్తుకూడా ఒక భాగమే.

గోపీ, తన రాక్షస సామర్థ్యంతో తన విధులను నిర్వహిస్తున్నాడు అందువలన క్రొత్తవాడు షెన్‌జ్యాగ్రామంలో ప్రవేశించటం అతికష్టమైన పనిగా తయారయింది.

"అరెస్టుచేయబడిన మేయర్లను తప్పక విడుదల చేయించాలి" అన్నాడు బ్లాకీ.

"వాళ్ళను జపానువాళ్ళు చంపేస్తే, భవిష్యత్తులో మనం మన కార్యకలాపాన్ని కొనసాగించుటకు రెట్టింపు కష్టమౌతుంది. మేయర్లను

రక్షించుటలో మనకు తోడ్పడటానికి, అంతేగాక యీ ప్రాంతంపై శత్రువుల పట్టును బ్రద్దలుకొట్టటం అనే యావత్ సమస్యలోనూ మనకుతోడ్పడటానికిగాను, షెన్‌తో మాట్లాడిరావటానికి మనం ఎవరినో ఒకరిని పంపాలి, వాళ్ళ పట్టును బ్రద్దలుజేయాలి!"

షెన్‌జ్యా గ్రామానికిపోవుటకు సిద్ధంగా వున్నామని ఒక డజనుమంది లేచి నిలబడ్డారు.

"అది కత్తుల కొండయినాసరే నేను ఛేదించుకొనిపోతా!" అని అరచాడు తేవార్.

"ఆ గ్రామం నాకొక పూలతోట వంటిది" అన్నాడు వాన్వే. "మనం గ్రామాలను స్వాధీనం చేసుకోవటం ప్రారంభించినప్పుడు ఆ గ్రామాన్ని స్వాధీనం చేసుకొన్నది నా ఆధ్వర్యం క్రిందనే, దాన్ని పెంచింది నేను మళ్ళీ దాన్ని జయించుకొని రావటానికి నాకే అవకాశం వుండాలి!"

"నేనుపోతే బాగుంటుందనుకుంటాను. నేను జయించలేకపోతే నువ్వు ప్రయత్నించవచ్చు" అన్నాడు షాంగ్.

బాగా ఆలోచించిన తర్వాత ప్రథమయిత్నాన్ని చేయుటకు షాంగ్‌ను పంపుటకే నిశ్చయించుకొన్నాడు ప్లాకీ. ఆ మరునాటి రాత్రి ఆ చేనేత పారిశ్రామికుడు షెన్‌జ్యా గ్రామంలోనికి చొరబడ్డాడు.

* * * *

షాంగ్ షెన్‌జ్యా గ్రామవీధుల్లో అతిజాగ్రత్తగా నడుస్తున్నాడు. ఆ వీధిచివర దూరంగా గొప్పిని చూశాడు షాంగ్. గొప్పి, అతని వేగులబృందం షాంగ్ వైపుగానే వస్తున్నారు. కోతిలాగున చులాగ్గా షాంగ్ వేగంగా పక్కసందులోకి జారాడు. కాని జారిపోతూవున్న అతని నీడను ఆ పండువెన్నెలలో గొప్పి పసికట్టాడు. కేకలేస్తూ వేగులముఠా షాంగ్ వెంటపడ్డది.

ఇరుకు గొందులలోపడి ష్వాంగ్ అనేక మెలికలు తిరిగాడు. అతను వాళ్ళను గుండ్రముగా త్రిప్పిత్రిప్పి తాను వచ్చిన దారినే గ్రామం నుంచి మెల్లగా జారుకోవాలనుకున్నాడు. కాని అతడు దురదృష్టవశాత్తు గ్రుడ్డిసందులో పడ్డాడు. బయటికిపోవటానికి మార్గంలేకపోయింది. తన్ను వేటాడుతున్న వారి పదధ్వనులు వీధిమొగను వినిపిస్తున్నాయి. చేసేది ఏమీలేక ష్వాంగ్ తలదాచుకోటానికి ఏదయినా రైతుకొంప దొరుకుతుం దేమోనని తలుపులు తట్టిచూశాడు. అందరూ తలుపులు బిగించుకొని కూర్చున్నారు. మంటకాహుతయి ధ్వంసమైపోయిన ఒకయిల్లు కనపడి నది. దానిలో దూరాడు. ఆ ఇంటి గోడలుమాత్రం మిగిలాయి. "ఇది గ్రుడ్డిసందు. ప్రతికొంపా వెదకండి. తొత్తుకొడుకు ఎక్కడికీ పోలేడు." అని గాపేవేస్తున్న కేకలను ష్వాంగ్ విన్నాడు రొప్పుతూ తన పిస్తోలును బయటకులాగి, సిద్ధంచేసి ఎదురుచూడసాగాడు.

కీలుబొమ్మ ఆ సందులోని ప్రతి ఇంటినీ వెతికారు. కొత్తవాడెవడూ కనిపించపోయేసరికి యింటివాళ్ళను బండబూతులు తిట్టసాగారు. ఇదంతా ష్వాంగ్ వింటూనేవున్నాడు. అతనికి పరిచయమైన కంఠమొకటి "నే నక్కడ చూసివస్తా!" అన్నది. ధ్వంసమైపోయియున్న ఆవరణలోకి ఎవరో వచ్చారు. కిటికీద్వారా చూశాడు ష్వాంగ్. వస్తున్నది లైవే యని గుర్తుపట్టాడు ష్వాంగ్. లైవే ఆవరణలో ప్రవేశించగానే, ఒకచేత్తో ష్వాంగ్ ఆ దేశద్రోహి కంఠాన్ని బిగించేశాడు. పిస్తోలు ప్రక్కబొమికల లోనికి పోనిచ్చి నొక్కాడు.

"అరవబోకు!" అని బుసకొట్టాడు ష్వాంగ్. "గతసారి నిన్ను బాగాజూశాం. మళ్ళీ యీ చండాలపు పనిజేస్తున్నావా! నిన్ను మళ్ళీ క్షమిస్తా. కాని నువ్వు నాకు సహాయంచేయాలి!" అన్నాడు.

భయంతో వణుకుతూ లైవే "యిది నా అభిప్రాయం కాదు. నాకు యిష్టంలేదు. వాళ్ళు నన్ను బలవంతంజేశారు." అని జవాబు చెప్పాడు.

"సరే అయితే! నేను చంపుదామనుకొంటే ఈపాటికి చచ్చేవాడివి. మనిద్దరం చైనావాళ్ళం. జపానువాళ్ళకోసం నా తుపాకిగుళ్ళను అట్టే

పెడతా! నిన్ను పోనిస్తున్నా! నీకు నిజంగా చైనావారిగుండెవుంటే ఇక్కడెవరూ లేరని చెప్పు. వాళ్ళను యిక్కడకు తీసుకొనివచ్చావా నేను చస్తే చావవచ్చు. కాని నువ్వుమాత్రం బ్రతికుండవని ఘంటాపదంగా చెప్తా! నేను చైనాప్రజలకోసం చస్తా! నీవెవరికోసం చస్తావ్? బాగా ఆలోచించుకో!" అన్నాడు ష్వాంగ్.

"నన్ను పోనియ్యి! నీకు ద్రోహంచెయ్యనని ఒట్టుపెట్టుకుంటున్నా" అని లైవే సమ్మపలికాడు. ష్వాంగ్ అతన్ని ఎదలగానే వాడు కుందేలు పిల్లలాగా గంతేశాడు.

"కష్టమల్లేవుంది!" అని గొణుక్కొంటూ ష్వాంగ్ ఆవరణ ప్రవేశ మార్గానికి, దగ్గరలోవున్న కిటికీ ద్వారా పిస్తోలును బారుచేసి వుంచాడు.

బయటవున్న సందులో లైవే, గూలూను కలుసుకున్నాడు. గూలూ కూడా దేశద్రోహులలో కలసిపోయాడు. గూఢచారులముటాలో సభ్యుడుగా చేరాడు.

"వాడెక్కడా కనిపించలేదు! చిత్రంగావుంది!" అన్నాడు గూలూ. "ఆ ఆవరణలో ఎవడయినా వున్నాడా?"

"ఎవరూలేరు!" అని జవాబుచెప్పాడు లైవే.

యిరుగుపొరుగు రైతుకొంప లన్నింటినీ గోపీముటా గాలించివేసింది వాళ్ళకు కొ__మనిషి ఎవ్వడూ కనిపించలేదు. ఇక మిగిలిందల్లా ధ్వంసమైపోయిన ఆ కొంప ఒక్కటిమాత్రమే

"ఈ యింటిని వెతికారా?" అని అడిగాడు గోపీ. వెతికేవుంటారని ఎవరో అన్నారు. గోపీ పిస్తోలును చేతిలోపుచ్చుకొని ముందుకు సాగండని తన ముటాకు చేయివూపాడు. "మళ్ళీ వెతకండి! మళ్ళీ వెతకండి! రెక్కలు మొలిపించుకొని ఎగిరిపోయాడనుకోను! ఎక్కడో యిక్కడే వుంటాడు. వెతకండి!" అన్నాడు.

తుపాకులను చేతితోపుచ్చుకొని ముగ్గురు కీలుబొమ్మలు ఆవరణలో ప్రవేశించారు. తప్పించుకొనిపోవటానికి మార్గంలేదల్లేవుందని ష్వాంగ్ అనుకొన్నాడు. సరే! నేనివ్వగలిగినదంతా యిస్తాను వాళ్ళకు! అను

కొన్నాడు. జాగర్తగా గురిచూసి పిస్తోలు ప్రేల్చాడు. ఆ దెబ్బకు ఒక కీలుబొమ్మ నేలకొరిగాడు. తక్కిన యిద్దరూ తోకముడిచి పారిపోయారు.

"భలే! వాడక్కడేవున్నాడు. అందరూ ఒక్కుమ్మడిగాపోయి ప్రాణాలతో పట్టండి వాణ్ణి!" అని అరిచాడు గోపి.

ఆవరణలోనికిపోవుటకు ఆ దేశద్రోహులలో ఒక్కనికీ దమ్ములు చాలలేదు.

కిటికీచాటున దాక్కొని ష్వాంగ్ గోపీయొక్క ప్రలాపాలన్నిం టినీ వింటున్నాడు. పరిస్థితి అతిక్లిష్టంగావున్నా. వాడి ప్రలాపాలను వింటూన్న ష్వాంగ్ ముఖంపై చిరునవ్వు చిందులాంది. "ఓహో! ఆ తొత్తుకొడుకు తెగ కోతలు కోస్తున్నాడు! ప్రాణాలతో పట్టుకొంటాడట. హా! హా! నన్ను ప్రాణాలతో పట్టుకొనేది. వాళ్ళజన్మలో చేయలేరు. నే నిప్పుడే ఒకణ్ణి కూల్చేశాను! నా ప్రాణానికి విలువ సంపాదించేశాను. ఇంకా గురిచూసికొట్టి, వాళ్ళమ్మ—.... "పెట్టుబడి!" సంపాదిస్తా నోయ్!" తనలో ష్వాంగ్ నవ్వుకోసాగాడు.

నిర్భీతిగా, పరిపూర్ణ ఆత్మవిశ్వాసంతో ష్వాంగ్ కాంపౌండ్‌గేటుకు గురిచూస్తూ నిలబడ్డాడు.

పైకి కోతలుకోస్తున్నా తన మనుషులు చావుకు భయపడుతున్నా రన్న విషయాన్ని గోపీ గ్రహించాడు. వాళ్ళను భయంకరంగా బండ బూతులు తిట్టాడు. కాని ఒకరూ కదలలేదు. వాళ్ళవెనుక నిలబడి తుపాకితో వాళ్ళను ముందుకు నెట్టసాగాడు.

"పదండిరా; ముందుకు పదండి! చూస్తారేం ....?" అని మొరిగాడు.

"లాభంలేదు కమాండరుగారూ!" అని బలహీనంగా కీలుబొమ్మ లలో ఒకడు జవాబుచెప్పాడు. "వాడా మాకు కనపడటంలేదు. చూదామా పండువెన్నెల. వాడు దాన్ని బాగా వుపయోగించుకొంటాడు. ఆ ఆవరణ బహిరంగ ప్రదేశంలో మమ్మల్ని ఒక్కొక్కణ్ణే ఏరిపారేస్తాడు! అక్క డికి పోవటమంటే ఆత్మహత్య చేసుకోవట మన్నమాట!"

నాయకత్వం వహించడానికి గోపికే భయమేస్తూవుంది. సైన్యాలను తీసుకొనివచ్చుటకుగాను కోటకు ఒక మనిషిని పంపాడు.

* * * *

ఎనభైమంది జపాను సైనికులు, కీలుబొమ్మ సైనికులు వచ్చి పడ్డారు. ఆ ఆవరణకు యిరుగుపొరుగునవున్న యిళ్ళపైకెక్కి నిలబడ్డారు షాంగ్ దాగొనియున్న యింటికి సూటిగా ఎదురుగావున్న యింటిమీద మరతుపాకిని స్థాపించారు. ఆ స్థావరంనుండి జీవో సూచనల ప్రకారం గూలూ, మరిద్దరు కీలుబొమ్మలు అరవసాగారు.

"త్వరగా బయటికి రారా! నిన్ను చుట్టుముట్టేస్తాం! ఎక్కడికి పారిపోగలవు?"

"తుపాకిని బయటపారేసి. బయటికిరా! లొంగిపో! సామ్రాజ్య సైన్యాలలో జేరిపో! ఆ దరిద్ర దాలూకన్నా యిక్కడ చాలా బాగా వుంటుంది!"

గూలూ తన మహోపన్యాసాన్ని ప్రారంభించాడు. "అరేయ్! లోపలవున్నవాడా!——విను! నీ తలకుసరిగ్గా గురిచూస్తూ ఒక మరతుపాకీ వుంది. ప్రాణాలు పణంపెట్టి కూర్చున్నావు ఏం బావుకుందామనిరా? నేనూ బాలూవాళ్ళ తిండి తిన్నవాణ్ణే! ఏమంత చక్కని తిండిరా అది. వాళ్ళు నిన్ను ఉక్కుచట్రంలో బిగిస్తారు. ఖర్చు చేసుకోటానికని డబ్బు యివ్వరుగదా! వాళ్ళకోసం నువ్వు ప్రాణాలివ్వటం దేనికిరా? నేనూ యీ పక్షంలో చేరిపోయాను. ఖర్చుచేసుకోవటానికి కావలసినన్ని నోట్లకట్టలు లభిస్తున్నాయ్! దిట్టంగా తింటున్నా, తాగుతున్నా ఆడుతున్నా——! యిది జీవితమంటే! లొంగిపోవటం మంచిదిరా!" అని గూలూ తన మహోపన్యాసాన్ని ముగించాడు.

అటుతర్వాత పదినిమిషాలపాటు, ఆ విధంగా ఆ కీలుబొమ్మలు కేకలు వేయసాగారు. కాని, ఆ పాడుపడిన కొంపనుండి ఒక్కరవ్వంతయినా ధ్వని వినిపించలేదు. ఆ కొంపకు ఎదురుగావున్న కొంప పైకప్పు

అంచుకు ఒక కీలుబొమ్మ పాకాడు. కాంపౌండులోనికి చూడటానికని పిట్టగోడపైకి కొంచెం తలయెత్తి చూసాడు. షా్వంగ్ చిరునవ్వు నవ్వాడు. గురిచూశాడు. ట్రిగర్ నొక్కాడు! పెద్ద చప్పుడు చేసుకొంటూ పిస్తోలు గుండు ఆ కీలుబొమ్మపైనికుని బుర్రను చీల్చుకొంటూపోయింది. వాడి శరీరం గాలిలో గిరిగింతలుకొట్టింది. ధన్‌మని చప్పుడుజేస్తూ సందులో పడింది.

గట్టిసుందాకొడుకు! అనుకొన్నారా కీలుబొమ్మలు. ధైర్యం వారిని విడిచి పారిపోయింది. కదలటానికి దమ్ములులేక, వాళ్లు పైకప్పు మీద బోర్లాపడ్డరు.

కోపంతో మండిపోతూ జపానువాళ్ళు మరతుపాకిని ప్రేల్చసాగారు. తామరతంపరగా తుపాకిగుళ్ళు మట్టిగోడలను చీల్చుకొనిపోయాయి. కిటికీచట్రం కొయ్యముక్కలు ఎగిరిపడ్డాయి. లోపల పెద్ద పెద్ద మట్టిగడ్డలు వూడిపడ్డాయి. గోడలు త్వరలోనే కూలగలవని షా్వంగ్ గ్రహించాడు. ఎగురుతున్న సీసపుముక్కలువచ్చి అతని కుడిదవడను కోసుకుపోయాయి. భుజంలో రెండుకంతలు చేశాయి. ఆ గాయాలనుండి రక్తం స్వేచ్ఛగా ఏ అడ్డులేకుండా ప్రవహించసాగింది. కళ్లు గిరగిరా తిరగసాగాయి. కిటికీకింద కూలిపోయాడు షా్వంగ్. ఉద్రేకం, అలసట అతని పాతనొప్పిగా బయటవేశాయి. గొంతులో మంట బయలుదేరింది. నోటివెంట రక్తం కక్కాడు.

త్వరలో శత్రువులు తనమీద పడగలరన్న విషయం షా్వంగ్‌కు తెలుసు. అతడు తనలో మిగిలిన కడగొట్టు బలాన్ని సమీకరించాడు. పెనుగులాడి మోకాళ్ళమీద కూర్చున్నాడు. తన నడుముకువున్న బెల్టులోని రెండు చిన్నచేతిబాంబులనూ తీశాడు. తెరచుకొనివున్న ద్వారం ప్రక్కగా పాకుతూ బరువెక్కిపోయిన కళ్ళతో ఆవరణవంక జూచుటకు యత్నించాడు.

మరతుపాకి మొరగటం మానివేసింది. అతడు భావించినట్లుగానే

జపానువాళ్ళముటా ఒకటి ఆవరణలోనికి తోసుకొనివచ్చారు. ష్వాంగ్ విసరిన మొదటి చేతిబాంబు యిద్దరు జపానువాళ్ళను బలిగొన్నది. మిగతా జపానువాళ్ళు గాయపడి, తోకముడిచి పారిపోయారు. మరల వాళ్ళు లోపలికి తోసుకొని వచ్చారు. మళ్ళీ అతని చేతిబాంబు వాళ్ళను ఆవరణనుండి బయటకు తరిమింది!

ఇక ష్వాంగ్‌వద్ద మిగిలినదల్లా ఒక్క పిస్తోలుగుండు మాత్రమే. శత్రువులకు కోపం మితిమీరింది. అంతమంది కలిసి ఒక్క బాలుతో యుద్ధం చేయలేకపోయారే! వాళ్ళపక్షంలో చచ్చినవారుగానీ, గాయపడినవారుగానీ పదిమందికి మించారు. ఎన్నిరకాలుగా ముట్టడించినా నష్టతోనే బయటపడవలసి వచ్చింది. సత్వర యుద్ధకౌన్సిల్ సమావేశాన్ని జరిపారు. తమకు సహజమైన మురికి జపాను "ఎత్తుగడను" అవలంబించుటకు నిర్ణయించుకొన్నారు. బళ్ళకుబళ్ళు ఎండు పొదలను, కట్టెలను తెచ్చారు.... ఇంటి పైకప్పువరకూ మేటువేశారు. ఒక్కొక్కపొదనే అంటించి ఆవరణలోనికి విసిరి, ఆ కొంపనూ, కొంపలోని మనిషినీ మాడ్చి మసిబొగ్గు చేయాలని ప్లాను వేశారు.

ష్వాంగ్ బట్టలు రక్తంతోనూ, చెమటతోనూ తడిసి ముద్దయినాయి. పడిపోతున్న గోడ లోపలిభాగానికి వంకరగా ఆనుకొన్నాడు. అంతకంతకు బలహీనపడిపోతున్నాడు ష్వాంగ్. షెన్‌జ్యాగ్రామంలో తాను నిర్వహించగల కర్తవ్యాన్ని పూర్తిచేయలేకపోతున్నానేయని తీవ్ర బాధపడ్డాను. తన అసమర్థతను తీవ్రంగా నిందించుకొన్నాడు.

ఇంటిపైకప్పు ఎక్కాడు గొపి. క్రోధావేశంతో బూతుల పంచాంగాన్ని పారచసువ ప్రారంభించాడు. "అరేయ్! నీ ముత్తాతలు పద్దెనిమిది తరాలను——! బయటకువస్తావా? రావా? ఒక్కనిమిషంలో నిన్ను మాడ్చి మసిబొగ్గు చేయబోతున్నాం! నువ్వు శుద్ధంగా లొంగిపోయావా—— తొత్తుకొడుకా! నీ కుక్కబ్రతుకుని రక్షిస్తాంరా!"

రక్తరంజిత నేత్రాలతో ష్వాంగ్ వాడివంక చూశాడు. స్రవించి పోతూవున్న జీవితబలాన్ని ఒక్కసారి చిక్కబట్టి ష్వాంగ్ ప్రత్యుత్తరమిచ్చాడు. "నీ నీచపు సలహాలు నాకక్కరలేదురా! నేను కమ్యూనిస్టు

నురా!....కమ్యూనిస్టుని!.... చావనైనా చస్తాగాని లొంగనురా!.... నేను చచ్చినా ఫరవాలేదురా!....ఈరోజున మీనుండి కావలసినంత మూల్యాన్ని గుంజానురా!"

ముక్కచెక్కలై పోగా మిగిలిన ముఖంతో వెక్కిరింతను ప్రదర్శించాడు ష్వాంగ్. ఇంకా వాళ్ళను వెక్కిరించాలని ఉబలాటపడ్డాడు మృత్యుశయ్యావశిష్టుడయిన ష్వాంగ్. కాని అతని దవడ మొద్దుబారిపోయింది. నాలుక కొయ్యబారింది. నోరు మాటలను రూపొందించలేకపోయింది. అతనికి స్పృహతప్పసాగింది.

అంతట అతడు ఆలోచించసాగాడు-నేను నా పిస్తోలు శత్రువుల చేతుల్లో పడనీయకుడదు. అతనికి ఇంకనూ ఆలోచనాశక్తి పూర్తిగా నశించలేదు. పిస్తోలును కాల్చినప్పుడు దానిమూతిని మూసివేస్తే దానికంత బద్ద లయిపోతుందని ఎక్కడో విన్నసంగతి అతనికి జ్ఞాపకం వచ్చింది. అమిత ప్రయాసతో మంచుగడ్డలాగున్న పిస్తోలుగొట్టాన్ని నోటిలో దూర్చాడు. "ఈవిధంగా పార్టీకొరకు, చైర్మన్ మావ్‌కొరకు, ప్రజల కొరకు సవ్యమైనపని చేయగలను" అనుకున్నాడా ఆత్మత్యాగి ష్వాంగ్.

ఇంకొక్క క్షణమైనా ఆలోచించక పిస్తోలు ట్రిగర్‌ను నొక్కాడు.



# 13 అధ్యాయం

ష్వాంగ్ తన జీవితాన్ని ఏ విధంగా త్యాగంచేసినదీ, బిగ్‌పాప్లార్ గ్రామంలో ఆ సమాచారమంతా తెలిసింది. గెరిల్లాలు మితంగా దుఃఖించారు. చొరవగల ఆ చిన్న చేనేతకార్మికుడంటే అనేకమంది రైతులకు ప్రేమ. వారు భోరునఏడ్చారు. శవాన్ని వెనక్కు తీసుకొనిరావటం అసాధ్యమైన పని. ఎందువల్లనంటే, ప్రచారకార్యకలాపాలకొరకు ష్వాంగ్‌శవాన్ని ఫొటో తీయించుటకై నగరానికి పంపివేశారు శత్రువులు.

తన ప్రియస్నేహితుడు చనిపోయాడని వినగానే బ్లాకీకి విషాదచ్ఛాయలు ఆవరించాయ్. అతని హృదయం ద్రవించింది. ద్రవించిన అతని హృదయం శత్రువులచే ఆక్రమించబడిన ప్రాంతంపై మరల అధికారాన్ని సంపాదించాలన్న పట్టుదలతో గడకట్టింది. తన పైవారు యిచ్చిన ఆజ్ఞలను అమలుజరుపుటకు కృతనిశ్చయుడయ్యాడు.

"మనం కమ్యూనిస్టులం. ధైర్యంగానూ, కృతనిశ్చయంగానూ వుండాలి. చావుకు వెరువరాదు" అని బ్లాకీ దాస్వేతో అన్నాడు. "ఒకడు పడిపోతే, రెండవవాడు పోవాలి; మరల యత్నించాలి. త్వరగానో, ఆలస్యంగానో మనం తప్పక జయించుతాం! నీకు పెన్‌జ్యాగ్రామం కొట్టినపిండి. నేను నిన్ను పంపుదామనుకుంటున్నాను. ఏమంటావ్—నీకుధైర్యముందా ?"

యధార్థానికి దాస్వేకి తన శక్తిసామర్థ్యాలను గురించి బాగా తెలుసు. అలాంటి క్లిష్టతర కర్తవ్యాన్ని నిర్వహించగలనో లేదో అనుకున్నాడు.

ఎందువల్లనంటే, ష్వాంగ్‌లాంటి తెలివిగలవాడే నిర్వహించలేకపోయా డన్నది కళ్ళకుకట్టినట్లు కనబడుతూనేవుంది. బ్లాకీ యీ సమస్యను ధైర్యా నికి ముడిపెట్టాడు. అందువలన అతడు సందిగ్ధమైన జవాబు యివ్వాల్సి వచ్చింది.

"నన్ను ఉద్రిక్తపర్చాల్సిన అవసరంలేదు బ్లాకీ" అని అరచాడు. "పార్టీ బాధ్యతను ఎలా స్వీకరించాలో నాకు తెలుసు! నేను చచ్చిపోయినా గౌరవంగా చస్తాను!"

షెన్‌జ్యాకు పోయే హక్కు తనకు యివ్వవలసిందిగా తేవార్ డిమాండ్‌చేయసాగాడు. దానికి కారణాలు చూపించాడు.

"మీరు మొగ కామ్రేడ్స్ యిట్టే బయటపడిపోతారు" అని మేయీ జోక్యం కలుగజేసుకొంది. "ఈ పనిని స్త్రీకి వదిలితే బాగుంటుందనుకొం టాను. మమ్మల్ని శత్రువులు ఎక్కువగా గుర్తించలేరు!"

"ఆజ్ఞాపత్రం నా కప్పుడే లభించింది" అని నవ్వాడు దాస్వే. "మీ రెవ్వరూ దాన్ని గుంజుకోలేరు" అన్నాడు.

"సరి! మీరు పోట్లాడుకోబోకండి. ఎవరికి తగినపని వారుచేయాలి అందరికీ పనివుంది. ఎవరూ వృధాగా కాలం గడుపనక్కరలేదు"అన్నాడు బ్లాకీ.

విషయాలను బాగా చర్చించుకొన్నతర్వాత మేయీ, బిగ్‌పాప్లార్ గ్రామంలోనే వుండిపోయి పార్టీ నిర్మాణవ్యవహారాలను చక్కబెట్టుటకు నిర్ణయించబడింది. కీలుబొమ్మ సివిల్ నాయకులతో రాయబారాలు జరుపు టకుగాను, వివిధవ్యక్తులు వివిధగ్రామాలకు పంపబడ్డారు. మూడు రోజు లయినతర్వాత అందరూ వచ్చి తమ తమ రిపోర్టులను యివ్వాలని నిర్ణ యించుకొన్నారు.

ఆ రాత్రి గెరిల్లాలు క్రిమిత్రగ్రామాలకు బయలుదేరారు. ష్వాంగ్ పొందిన అనుభవంనుండి గుణపాఠాన్ని నేర్చుకొన్న దాస్వే. శత్రువుల పహరావాళ్ళ కళ్ళల్లో పడకుండా వుండుటకుగాను, వారు పహరాయిచ్చే వేళను తప్పించి లస్యంగా బయలుదేరుదామనుకున్నాడు. దాస్వే అర్ధ

రాత్రివేళ బయలుదేరుటకు సిద్ధమయ్యాడు. కాని ఏ కారణంవల్లనో షెన్‌జ్యా గ్రామానికి పడవలో తీసుకుపోతానన్న రైతు రాలేదు. దాస్వే విసుక్కోసాగాడు.

"ఇంకా ఆలస్యంచేయకు" అన్నది మేయీ. "కావలసినన్ని బోట్లు న్నాయి. అందరూ నిద్రపోతున్నారు. ఇప్పుడు పడవ మనిషి దొరకడం కష్టం. అందుకని నేనే నిన్ను తీసుకొనిపోతా." అన్నది మేయీ.

"అవసరంలేదు. థాంక్స్! నన్ను తీసుకపోవటానికి నీవు సాయ పడగలవు. కాని మళ్ళీ నీవు ఒంటరిగా ఎలా దారి కనుక్కొని తిరిగి రాగలవు? బాయాంగ్ సరస్సులో దారి తప్పటం చాలా సులువు" అన్నాడు దాస్వే.

"హుం! కంతలోనుండి తొంగిచూస్తే మనిషి అసహ్యంగా కనిపి స్తాడు. అంత పక్షపాతంగా వుండబోకు. నేనూ యిక్కడ పుట్టిపెరిగిన దాన్నే! ఈ సరస్సులో పడవేసుకొని ఎన్నిసార్లు ఈ సరస్సు దాటానో లెక్కలేదు, నేనెందుకు తప్పిపోతాను?"

అయిష్టంగా దాస్వే వప్పుకున్నాడు. వాళ్ళు నీళ్ళ అంచుకుపోయారు చిన్న పడవను కట్టువిప్పారు.

"నువ్వు పడవ ముందుభాగంలో కూర్చో!" మేయీ సూచించింది.

"నేనే నడుపుతాను. నేను నిన్నెలా ...." అన్నాడు దాస్వే.

"కాదు" అని గట్టిగా పట్టుబట్టింది మేయీ. "నీ పనికోసం విశ్రాంతి తీసుకో" అన్నదామె.

దాస్వే నమ్రతగా వెళ్ళికూర్చున్నాడు. మేయీ అతని కెదురుగా నిలబడింది. చొక్కాపైకి చేతులుముడిచింది. గట్టిగా నిలబడుటకుగాను ఒక కాలు ముందుకు, ఒక కాలు వెనుకకువేసింది. పొడుగాటి తెడ్డుకర్రను పట్టుకొని మెల్లిగా పడవను నీళ్ళలోనికి నెట్టింది. పడవ నీళ్ళమీద తేలి కగా పరుగెత్తసాగింది.

ఆమె తెడ్లువేస్తూ పడవను నడుపుతూవుంటే, అవి నీటిమీద ప్రకా శిస్తూవున్న పూర్ణచంద్రబింబాన్ని ఎగురుతున్న, నాట్యమాడునట్టి, వెండి వెలుగుముక్కలుగా చేస్తున్నాయి.

వారు త్వరలోనే విశాల సరస్సులో ప్రవేశించారు; తెడ్ల చప్పుడు తప్ప మరే చప్పుడూ వినరావటంలేదు. ప్రశాంత నిశ్శబ్దంలో వారిద్దరూ మునిగిపోయారు. చాలాసేపటివరకూ వారిద్దరూ మాట్లాడలేదు.

చిట్టచివరకు మేయీ ఆ నిశ్శబ్దాన్ని భంగంకలుగచేసింది. "నీ వక్కడకు చేరగానే మొట్టమొదట ఎక్కడకు పోతావ్?" అని ప్రశ్నించింది.

"మా పాతయింటికి దగ్గరలోనేవున్న లీ మామయింటికి పోదామనుకుంటున్నా. ఏమంటావ్?"

"ఊఁ నేనా వృద్ధుణ్ని ఎరుగుదును. బాలూపట్ల ఆయన ఎలప్పుడు చాలా స్నేహంగా వుండేవాడు. ఇప్పుడెలాగున్నాడో తెలియదు. నీవు షెన్ ఇంటికి పోయినప్పుడు జపాను వాళ్ళుగాని, కీలుబొమ్మలుగాని తారసిల్లితే ఏంచేస్తావ్?"

"ముందు జాగ్రత్తగా చూసుకొనేపోతాను. బాకీ యిదివరకే నాతో చెప్పాడు. మరీ తుచ్ఛ దేశద్రోహిగా తయారైతేగాని షెన్‌ను చంపకూడదన్నాడు. షెన్ ఆవిధంగా తయారయితే షూట్‌చేసి, పరుగెత్తుతాను. జపానువాళ్ళుగానీ, దేశద్రోహులుగానీ నామీదపడితే వాళ్ళను చంపడానికి ప్రయత్నిస్తాను. బయటపడలేకపోతాననుకో, అప్పుడైనా గౌరవప్రదంగా చస్తాను "బండిచక్రాలు పోతూ గాడిపెట్టి పోతాయిగదా;" ష్వాంగ్ నాకు ఆదర్శం! అతడు ప్రయాణించిన మార్గాన్నే అనుసరిస్తాను."

దాస్వే మాటలు మేయీ హృదయాన్ని పిసికివేశాయి. ఆమె నిశ్శబ్దంగా పడవను నడుపసాగింది. అతనిపంక మెరుస్తున్న కళ్ళతో చూడసాగింది. ఆమె అతనికి యేమేనా చాలా చెపుదామనుకున్నది. కాని మాట్లాడజాలకపోయింది. కొద్ది నిమిషాలపాటు వారు తమతమ ఆలోచనలలో మునిగిపోయారు.

నుదుటిమీద ముత్యాలులాగున పోసిన చిరుచెమటలను తుడుచుకోటానికి, పడపతెడ్డేయటం ఆపింది. ఆమె మెల్లగా "దాస్వే! పన్ను పెరకుటకు యీసారి నీవు పులినోటిలోనికి పోతున్నావ్. నువ్వు చాలా జాగ్రత్తగా వుండాలి. నీవు ఏమిచేసినాసరే, పట్టుపడబోకు! కళ్ళను చెవులను

చురుకుగా వుః యోగించుకో. యిరుకులోనైనా వొదిగివుండు. పనిపూర్తి చేయగానే సూటిగా వచ్చేసెయ్! నీవేమైపోయావో అనే అనుర్దాలో పడ వేయబోకు మమ్మల్ని!"

తానంటే యింత ఆప్యాయంగా వున్నదిగదాయని దాస్వే సంతోషంతో వుప్పొంగిపోయాడు. ఆమె సుందరనయనాలలోనికి అతడు సూటిగా చూశాడు. చిరునవ్వు చిలకరించాడు.

"నేనీపని యిప్పుడే సవ్యంగా పూర్తిజేసుకొస్తా! కొన్నేళ్ళనుండి ప్రజలు నాకు తిండిపెడుతున్నారు. వారు నాకు పెట్టిన తిండి వ్యర్థాయను కానేటట్లు చేయను. ఇంకా నాకు అనేక ప్లానులు నీవిప్పుడు నాతో చెప్పిన విషయాన్ని మరువను. ఇక నేను తప్పుడుమార్గాన పడటకు అవకాశం లేదు. ఉండు! నేను నీకు మ చివార్తలు తెస్తాను." అని నమ్మకంగా చెప్పాడు. షెన్‌జ్యా గ్రామంలోని శత్రువులకోటలో దివిటీలు వెలుగుతున్నాయి. సరస్సులో జపాను వాళ్ళ కీచుబొమ్మల కంఠధ్వనులు వినవస్తున్నాయ్! వారిద్దరూ మాట్లాడటం మానివేశారు.

మేయీ ఆ చిన్నపడవను రెల్లుపొదగుండా గ్రామానికి కొద్ది దూరంలోవున్న ఆనకట్టవొద్దకు దగ్గరకు తీసుకొనిపోయింది. దాస్వే మెల్లగా వొడ్డుకు దూకాడు. మెడసారించి మెల్లగా "తిరిగివెళ్ళు అన్నాడు. ఆ గాఢాంధకారంలోకి నడిచిపోయాడు."

అతని కాలిచప్పుడు వినపడుతున్నంతవరకూ తదేకంగా అటువైపే చూస్తూ మేయీ, అక్కడే కూర్చున్నది. అటుతర్వాత పడవను సరస్సులోనికి నడుపుకొనిపోయింది. ఇంటికి చేరుకుంది.

* * * *

దాస్వే మెల్లగా గ్రామంలో చొరబడ్డాడు. సందులలో ఒకప్రక్కగా వొత్తుకొని నడువసాగాడు. చడీచప్పుడూ చేయకుండా లీ మామయింటికి పోయాడు. పిట్టగోడలను లంఘించాడు. తెరచివున్న కిటికీవద్దకుపోయి మెల్లగా పిలిచాడు. ఎవరూ జవాబివ్వలేదు. ఎండిన గడ్డిపోచను తీసుకొని

చెయ్యిదూరేటంతవరకూ ఆ చీకటిగదిలోనికి పోనిచ్చాడు. లోపల ఎవరో దగ్గారు, కాని జవాబురాలేదు.

"నేను మామా!" అని మెల్లగా అన్నాడు దాస్వే. "తలుపు తెరు!"

పరిచిత కంఠధ్వనిని వినగానే, లీమామ తలుపు గడియతీశాడు. దాస్వేని లోనికి తీసుకొనిపోయాడు. దుప్పటితో కిటికీని కప్పేశాడు. లాంపు వెలిగించాడు.

"అరి భగవాన్! ఏంజేస్తున్నావిక్కడ?" అని ఆ వృద్ధుడు అడిగాడు.

"నిన్ను చూడటానికి వచ్చాను మామా! మనం త్రవ్విన "కోట" వుందా? లేదా? చెప్పు!"

"లేదు నువ్వేచూడు!" లాంపును పైకెత్తుతూ. ఆ వృద్ధుడు జవాబు చెప్పాడు.

దాస్వే, కాంగ్ ముందుభాగంనుండి కొన్ని ఇటుకలను లాగాడు. లోపలకు చూశాడు. అది యింకా పాడవలేదు. యధాతథంగానే వుంది. ప్రక్కయింటిలోవున్న పొడుగుపాటి కాంగ్ వద్దకు ఇక్కడినుండి సొరంగము ఏర్పాటుచేయబడివుంది.

దాస్వేకి నమ్మకం చిక్కింది. తాను గ్రామం వదలిపోయిననాటి నుండి షెన్ జ్యాగ్రామంలో జరిగిన సంఘటనలను గురించి దాస్వే ముసలివానిని అడిగాడు. దాస్వే తండ్రిపోయిననాటినుండి ష్వాంగ్ వీరోచితంగా తన ప్రాణాలను అర్పించిన నాటివరకూ జరిగిన సంఘటనల నన్నింటినీ, లీమామ పూసగ్రుచ్చినట్లు చెప్పాడు. గ్రామంలోని ప్రస్తుత పరిస్థితులను గురించి వివరించాడు. రైతుల కొంపలను విడవకుండా శత్రువులు సోదా చేస్తున్నారని చెప్పాడు.

"యిక్కడి తొత్తుకొడుకులు నాకు దోకు పుట్టిస్తున్నారోయ్ నాయనా!" అని ఆ వృద్ధుడు ఉమ్మేశాడు. "నేను మిమ్మల్ని రోజూ

తలచుకొంటూవుంటాను. మీకోసం కళ్ళల్లో వత్తులేసుకొని చూస్తున్నానోయ్‌బాబూ! కళ్లు కాయలుకాచి పోతున్నాయ్!" అని అన్నాడు ఆప్యాయంగా. చిట్టచివరకు యీరోజున నిన్ను చూడగలిగాను. దాస్వే! నీ యిష్టమొచ్చినన్నిరోజులు యిక్కడేవుండు! నాకున్నదంతా నీదే."

లీ మామ కొడుకూ, కోడలూ అక్కడకు వచ్చారు. దాస్వేని ఆప్యాయంగా పలుకరించారు తెల్లవారేవరకూ పిచ్చాపాటీ చెప్పుకున్నారు. అటుతర్వాత దాస్వే ఒక దుప్పటినీ, దిండునూ తీసుకొని సొరంగంలోనికి ప్రాకిపోయాడు. అక్కడే అతడు భోజనంచేశాడు. నిద్రపోయాడు.

ఆ సాయంత్రంవరకూ దాస్వే ప్రశాంతంగా అక్కడే నిద్రపోయాడు. అటుతర్వాత సొరంగంలోనుంచి బయటకువచ్చాడు.

"షెన్‌ను చూడబోతున్నా" అని రహస్యంగా లీమామకుచెప్పాడు దాస్వే.

"వాణ్ని చూడబోతున్నావా?" ఆశ్చర్యంగా అడిగా డా వృద్ధుడు. వా డిప్పుడు పెద్ద అధికారి— పూర్వంకన్నా అధ్వాన్నంగా తయారయ్యాడు వాడు!"

"ఏం ఫరవాలేదులే. వాణ్ని వంచడమెట్లాగో నాకు తెలుసు. ఏమైనప్పటికి, ఏదయినా దుర్ఘటన సంభవిస్తే, నేను నిన్ను బయటపెట్టేకన్న చచ్చిపోతాను!" అన్నాడు దాస్వే.

ఆ వృద్ధుని నీలిరక్తనాళాలుగల హస్తం, దాస్వే హస్తాన్నిగట్టిగా పట్టుకొంది. "అలా మాట్లాడబోకు నాయనా! ప్రజలమైన మాకోసం మీరు మీ ప్రాణాలను అర్పిస్తున్నారు. నావంటి బీదముసలాడు భయపడాల్సిన భయపడాల్సిన అవసర మేమున్నది....వాణ్ని నువ్వు యెక్కడ కలుసుకొంటావ్?"

"వాడి కొంపకే పోతున్నా."

"నేను పరిసరాలను చూచివచ్చేటంతవరకూ ఇక్కడే వుండు. అటుతర్వాత పోదువుగాని."

ఖాళీ సీసా నొకదానిని తీసుకొని, లీమామ నూనె కొనటానికని బయలుదేరాడు. ఇరవైనిమిషాలైనతర్వాత తిరిగివచ్చాడు.

"షెన్ యింట్లోనేవున్నాడు. ఇప్పుడే నీకు ఛాన్సు!" అన్నాడు లీమామ. "పూ విధంగా ఎందుకు చేయకూడదూ? మొదట నేను వెళతాను. నా వెనకాల దూరంగా నువ్వు నడుస్తూ వుండు. నీ వెనకాల దూరంగా మా అబ్బాయి నడుస్తూవుంటాడు. ఈ చివరగానీ, ఆ చివరకానీ పిచ్చి కుక్కలు కనిపిస్తే మేం దగ్గుతాం! నువ్వు తప్పుకోటానికది గుర్తు! సరేనా!"

"చాలాబాగుంది. అలాగేచేద్దాం పదండి! నా కేదైనాముప్పొందా బిగ్‌ప్లార్‌కు కబురుచేయండి...." అన్నాడు దాస్వే.

"నీవలాంటిమాటలు అనకూడదు బాబూ! భగవంతుడు నిన్ను రక్షిస్తాడు. కీడేమి సంభవించదు!" అని అడ్డుపడ్డాడు లీమామ.

"మంచిది. మంచిది! పోదాం పదండి" అన్నాడు దాస్వే.

ఆ ముగ్గురువ్యక్తులు యిరుకుగొందులద్వారా డొంకతిరుగు మార్గాన్ని అవలంబించారు. ఏ దుర్ఘటనా సంభవించకుండా షెన్‌ఇంటికి జేరాడు, కాంపౌండు గేట్లు తెరచివున్నాయి. తన పిస్తోలును బయటకులాగి దాస్వే జాగ్రత్తగా పరిశీలించాడు. పిస్తోలును సరిజేశాడు, సేఫ్టీని తీసి వేశాడు. లోపలికి పోయాడు.

* * * *

మొదటి ఆవరణ ఖాళీగానూ, చీకటిగానూ వున్నది. లోపలి ఆవరణకు గొనిపోయేమార్గంలో ఒక చిన్న ద్వారముంది. దానిద్వారా దాస్వే లోపలికిపోయాడు.

తూర్పువైపు గదులలోనుండి, పడమటివైపునుండి దీపాలకాంతి అగుపిస్తూవుంది. ఉత్తరదిశలోనున్న ద్వారంచెంత నిలబడి దాస్వే ఏమైనా మాటలు వినబడతాయేమోనని చూశాడు. నిశ్శబ్దంగావుంది. నెమ్మదిగా లోపలికిపోయాడు.

లోపలి గది చీకటిగావున్నా. దానికి కుడివైపు ద్వారం తెరలో

నుండి దీపపుకాంతి కనిపిస్తూవుంది. నల్లమందు పొగవాసన ముగ్గోళ్ళను చుట్టేసింది.

దాస్వే తనలో తాను తిట్టసాగాడు. "అరిదీనెమ్మ— షెన్. నల్లమందు త్రాగుడు సమావేశానికని కీలుబొమ్మ నాయకుడ్ని ఆహ్వానించాడు కాబోలు! అయితే వాళ్ళు మాటాడుకోవటంలేదేం? వాడు అంగరక్షకులను వెంటబెట్టుకొని వచ్చివుంటే, ముందు వాళ్ళపనిపట్టి తా! అటుతర్వాత కాంగ్‌ల మీదవున్న త్రాగుబోతుల పని పట్టి—" అనుకున్నాడు.

దాస్వే తన పిస్తోలుతో తెరను తొలగించి, లోపలకు దూకాడు.

ఒక ఎత్తు తక్కువ బల్లప్రక్కగా నమము వాల్చాడు షెన్. ఆ బల్లమీద నల్లమందు దీపం వెలుగుతూవుంది. వాడికి ఎదురుగుండాకూర్చుని వాని ఉంపుడుగత్తె హుక్కా నింపుతూవుంది.

వాళ్ళిద్దరూ కళ్ళు పైకెత్తిచూచారు. దాస్వేని చూడగానే భయపడ్డాడు. షెన్ ముఖం పాలిపోయింది. మోచేతిపై తలను పెట్టుకున్నాడు.

కంపితస్వరంతో "కమాండర్! ఎందుకొచ్చారు?" అని అడిగాడు షెన్.

లేవవద్దని అతనికి సైగజేశాడు దాస్వే. "పొగత్రాగటం పూర్తి జేసుకో, తర్వాత మాటాడుకుందాం" అన్నాడు.

"అయిపోయింది! అయిపోయింది!" తొందరగా కాంగ్‌మీదనుండి లేస్తూ షెన్ నమ్మబలికాడు. "దయచేసి కూర్చోండి! క్షమించండి! యీ విధంగా యిలాంటి దుర్వ్యసనాలతో కాలం వృధాజేయరాదని నాకు తెలుసును!"

షెన్ నిరాయుధుడుగా వుండటంజూచి దాస్వే పిస్తోలు మూసేశాడు.

చాలా అందంగా అలంకరించబడింది ఆ గది. చక్కగా రంగు వేయబడిన చావకర్రసామాగ్రి ప్రతిబింబం అద్దాలలో ప్రతిబింబిస్తూవుంది. మిలమిలా మెరుస్తూవుంది. దాస్వే ఒక కుర్చీని లాక్కొనికూర్చొన్నాడు. దానిప్రక్కగానున్న బల్లపై పిస్తోలు పెట్టాడు.

షెన్‌గారి వుంపుడుకత్తె భయంతో వణకిపోయింది. లాగూలను తడుపుకొంది.

తన యజమాని ఆజ్ఞను అనుసరించి ఆమె వణకుతున్న కాళ్ళతో టీ తీసుకురావటానికని వెళ్ళుతూవుంటే దాస్వే ఆమెను ఆపాడు.

"వెళ్ళబోకు! నాకేమి అక్కరలేదు."

కోయ్యబారినట్లుగా ఆమె మరల కుర్చీలో కూలబడింది. షెన్‌ను కూడా కూర్చోమని ఆజ్ఞాపించాడు దాస్వే. ప్రశ్నలు కురిపించసాగాడు.

"తూర్పుగదుల్లో, పడమటి గదుల్లో ఎవరుంటున్నారు?"

"తూర్పుగదుల్లో నా కోడలు వుంటుంది. పడమటిగదుల్లో నా తల్లి, భార్య వుంటున్నారు. ఇంకెవ్వరూ లేరు!"

"వాళ్ళందరినీ యిక్కడకు తీసుకొనిరా! నేను నీతో వస్తాను!"

వాళ్ళు ఆవరణలోనికి పోయారు. పెద్ద గేటును మూసి తాళంవేసిన తర్వాత షెన్ కుటుంబంలోనివారందరినీ పోగుజేసి, వుత్తరపైవునున్న గదుల్లోకి తీసుకొనివచ్చారు. ఆడవాళ్లు భయంతో వణికిపోతున్నారు.

"భోజనంచేశావా?" అని దాస్వేని ప్రశ్నించారు.

"భోజనంచేశాను. నాకు దాహంకూడా వేయటంలేదు" అని దాస్వే జవాబు చెప్పాడు. "నేను మీతో మాట్లాడదలచాను. బాలూ పిచ్చిగా ఎవరినీ చంపడు. భయపడకండి" అన్నాడు.

కూర్చోవలసిందిగా ఆ స్త్రీలను దాస్వే ఆహ్వానించగా వారు కూర్చున్నారు. వాళ్ళకు పాటాలు చెపుతున్నట్లుగా దాస్వే వారికి జాతీయ, అంతర్జాతీయ సమస్యలపై, ఐక్యసంఘటనలపై ఉపన్యసించాడు. ఉపన్యాసాన్ని పూర్తిచేయగానే దాస్వే యింటియజమానివైపు తిరిగాడు.

"నేను చెప్పింది బాగుందా షెన్‌తాతా?" అన్నాడు.

"ప్రతిమాటా పరిపూర్ణసత్యం" అని జవాబుచెప్పాడు మనఃపూర్వకంగా షెన్.

"మంచిది! మనమంతా చైనావాళ్ళం. మనమంతా ఏకంగావుండాలి. జపానువాళ్ళను ఎదిరించి పోరాడాలి. నీవు కీలుబొమ్మ ప్రభుత్వంలో

వున్నావు. కోటలో పరిస్థితులెలా వున్నదీ తెలుసుకోదలచాను. నాకు చెప్ప టానికి నీకు ధైర్యముందా?"

షెన్‌కు పిల్లిలాంటికళ్ళు వున్నాయ్! పరిస్థితులు మారిపోతున్న సంగతి అతనికి తెలుసు. "మసమందరం చైనావాళ్ళం. చెప్పటానికి నాకు భయందేనికి?" అని గట్టిగా జవాబు చెప్పాడు షెన్. "కీలుబొమ్మల ఆహారం తినటానికి నాకు బాగానేవుంది. కాని అరగంట కష్టంగా వుంది. జపానువాడిలాగా చైనావాడు ఎలా అవుతాడు?"

కోటలోవున్న సైనికులసంఖ్యను, ఆయుధాలసంఖ్యను, ఫీసర్ల పేరులను, గూఢచారులు ఉపయోగించే పద్ధతులను షెన్ తనకు తెలిసిన విషయాలన్నింటినీ వివరించాడు.

"ఇంకేమైనా వుందా?" అని అడిగాడు.

"ఆఁ వుంది. ఆ విషయాన్నిగురించే...." అని తలవూపి దాస్వే ప్రారంభించాడు. "నిర్మొగమాటంగా చెప్పుతున్నా. నీవుచేస్తున్న యీ పని చాలా ప్రమాదకరం. చైనావాడివన్న సంగతిని నీవు మరచావని బాలూ అభిప్రాయపడుతూ వున్నది. యెవడినో ఒకడిని పంపుదామని అను కుంది...."

"కమాండరు" అని తొందరగా షెన్ అడ్డు తగిలాడు. "నేనెల్ల ప్పుడూ హృదయంలో చైనావాణ్నే" అన్నాడు.

"బాగుంది! బాలూవిధానం చాలా పుదారంగానుంది. మంచిపనులు జేసి, నీ పాతతప్పిదాలను కడిగివేసుకుంటూన్నంతకాలం, విజయానం తరం నీకు సమాజంలో స్థానముంటుంది. నీవు జిల్లా కీలుబొమ్మ గ్రామ పరిపాలకసంఘాల అధ్యక్షుడుగా అనేక గ్రామాలలోని వేలాదిరైతులను కంట్రోలుచేస్తూ వుంటావు. నీవు జపానువాళ్ళతో సహకరిస్తున్నట్లు నటిం చాలి. ఆచరణలో ప్రజలకు చేయగలిగినదంతా చేయాలి" అన్నాడు దాస్వే.

"అవును! అవును! నా చేతనైనంత ప్రజలకు మేలుచేస్తా" అని మనఃపూర్వకంగా అన్నాడు షెన్.

గ్రామమేయర్లను విడిపించటానికి మార్గాన్ని ఆలోచించవలసిందిగా

దాస్వే షెన్‌కు చెప్పాడు. షెన్ కలవరపాటుగా బుర్ర గోక్కుంటు న్నాడు.

ఆలోచనాపూర్వకంగా షెన్ "జపానువాళ్ళు ఆ ఆజ్ఞను ప్రకటించారు.... దానిని మార్చటం నా ఆధీనంలో లేదు.... అయినప్పటికి.... మీరు కోరుతున్నారు కాబట్టి. అదెంత కఠినమైనా, పరిష్కరించటానికి మార్గాన్ని వెతుకుతాను?" అన్నాడు.

"త్వరగా కానీయి!"

"రేపుదయం మొదట ఆ సంగతే చూస్తాను."

కొంతసేపు వారు మాట్లాడుకొన్నారు. "ఆలస్యమవుతూవుంది. నిద్రపోదాం!" అన్నాడు దాస్వే.

"మీ మకాం ఎక్కడ?" అని అడిగాడు షెన్.

"ఈ రాత్రికి మీ యింట్లోనే వుంటా మనం యిద్దరం ఒకచోటే పడుకుందాం" అన్నాడు దాస్వే.

షెన్ ఒక్కక్షణం ఆలోచించాడు. "కోటనుండి ఎవరయినా వస్తారేమోనని భయంగావుంది. ఆ లోపలిగదిలో మనం పడుకోవటం మంచిది" అన్నాడు.

"సరే, మీ కుటుంబంకూడా ఇక్కడే నిద్రపోవాలని చెప్పు. ఎవరూ ఈ చోటు విడిచిపోరాదు. శత్రువెవడైనా వస్తే, నివు ఇంటిలో లేవని చెప్పమను" అన్నాడు దాస్వే.

ఆరాత్రి ఆ యింటిలోని స్త్రీలందరూ బయటిగదిలోని కాంగ్‌మీద నిద్రించారు. షెన్, దాస్వేలు ఆక్రమించుకొన్న లోపలిగదిలోని కాంగ్ మీద, ఎర్రని దుప్పటిని వేశారు. చక్కని దిండ్లనువేశారు. కాని దాస్వేకి నిద్రపట్టలేదు. ఏవో ప్లానులూ లెక్కలు వేస్తున్నాడు. అంతేగాక షెన్ మెల్లగా బయటకు జారిపోయి, తన్ను పట్టించటానికి శత్రువులను పిలుచుకొస్తాడేమోనన్న భయంకూడా పట్టుకొని పీడిస్తూవుందతన్ని. దిండుక్రింద పిస్తోలును దాచాడు. నిద్రపోతున్నట్లు నటించాడు. యదార్థానికి ప్రతి చప్పుడునూ వింటున్నాడు.

షెన్‌కుకూడా నిద్రపట్టలేదు. అతడు తన మనసులో తాను భవిష్యత్‌లో అవలంభించబోయే కార్యక్రమంయొక్క బాగోగులనుగురించి చూస్తున్నాడు. కోడికుయ్యగానే అతడు నిద్రలో పడ్డాడు. దాస్వేమాత్రం మేల్కొనేవున్నాడు.

* * * *

సూర్యోదయం కాగానే దాస్వే లేచాడు. షెన్‌ను లేపాడు. కాంగ్ నుండి ఒక్కదుముకు దుమికాడు. బయటకు పోసాగాడు.

"ఎక్కడకు పోతున్నావ్?" అని అడిగాడు.

"పాయ్‌ఖానాకు."

"నేనూ వస్తా!" అన్నాడు దాస్వే. షెన్‌ను వెంబడించాడు.

ఇంతకుపూర్వమే కుటుంబమంతా లేచింది. నాస్తా తయారుచేస్తున్నారు. తన అతిథి మొగం కడుక్కోటానికిగాను నీళ్ళుతెచ్చి ఇచ్చాడు షెన్.

"మీరు ముందు కడుక్కొని త్వరగా వెళ్ళండి." అన్ని సూచించాడు దాస్వే.

షెన్ ఆవిధంగానే చేశాడు. వెంటనే షెర్వానీ వేసుకొన్నాడు. చక్కని టోపీ పెట్టుకొన్నాడు. అతడు బయలుదేరేముందు అతన్ని దాస్వే హెచ్చరించాడు.

"పనిజేసుకొని రావాలి మీ కబురుకోసం ఎదురుచూస్తూవుంటాను. నా ప్రాణానికి మీ కుటుంబమంతా హామీవుంటుంది. నన్ను పట్టుకోవటానికి శత్రువులొస్తే నేను చస్తే చావొచ్చును. కాని మీ కుటుంబంలో ఒక్క పురుగైనా మిగలదు." అని హెచ్చరించాడు దాస్వే.

"ఇంతాచేస్తే నేనూ చైనావాడినేగదా! నీవే చూస్తావుగదూ!" అని షెన్ జవాబుచెప్పాడు. బయటికి పోయాడు.

"లోపలి గదుల్లో ఏదో ఒకదానిలో దాక్కోరాదూ?" అని షెన్ తల్లి దాస్వేకి సలహాయిచ్చింది.

అలాంటిదేమీ చేయను. అతను తనలో అనుకొన్నాడు.దాస్వే"మీ ఆవరణ పూడ్చిపెడతాను" అని జవాబుచెప్పాడు.

పెద్దచీపురుకట్ట తీసుకొని చొడ్డి అంతా వూడ్చేశాడు. ముందు ఆవరణలోకి వచ్చాడు. ఎద్దుకు, కంచరగాడిదకు మేతవేశాడు. పచ్చగావున్న పెద్ద ఎద్దొకటి గడ్డిమేస్తూవుంది. దానిని ఆప్యాయంగా చూడసాగాడు దాస్వే. అలాంటి పశువును సంపాదించగలిగితే బాగుండునుకదా అనుకున్నాడు దాని మెడమీద బుజ్జగింపగా తట్టాడు. తనపొలాన్ని దున్నుకోటానికి ఆ నాగలికి అలాంటి యెద్దును కలిగివుంటే ఎంత బాగుంటుంది అనుకున్నాడు.

ఇది మంచిచోటు అని దాస్వే ముచ్చటపడ్డాడు. ముందు ఆవరణ వంక చూశాడు. "గేటుకు తాళంవేస్తాను. ఎవరూ బయటికి పోలేరు" అనుకున్నాడు. "నన్ను అరెసుచేయించటానికి షెన్ సైనికులను వెంట బెట్టుకొనివస్తే నేను వెనక దొడ్డిలో వున్నాననుకుంటాడు. వాళ్ళని అక్కడికే సూటిగా తీసుకుపోతాడు. దానివలన నేను పారిపోవటానికిగానీ, లేదా పోరాడటానికి సిద్ధమవటానికిగానీ అవకాశం లభిస్తుంది" అనుకున్నాడు.

గేటుకు బరువయిన ఇనుపకడ్డీని అడ్డంగా వేశాడు. దక్షిణపు గదిలో కూర్చున్నాడు. అక్కడినుంచి చూస్తే లోపలికి వచ్చేవాళ్ళను, బయటికి పోయేవాళ్ళనూ కనిపెట్టవచ్చును. కొన్ని నిమిషాల తర్వాత ఒక ముసలిది—ఆ యింటి నౌకరు— ఒక ట్రేలో వేయించిన కోడి గ్రుడ్లనూ, తెల్లని గోధుమపిండితో తయారుచేసిన పదార్థాలను తీసుకొని వచ్చింది.

"వెనక్కు తీసుకుపో!" అని ఆజ్ఞాపించాడు దాస్వే. "మీ రెప్పుడూ మీ పనివాళ్ళను యిలాంటి చక్కనితిండే పెట్టి పోషిస్తున్నారా?" అని అడిగాడు.

"యిప్పటికే తయారు చేశాము," అన్నది ఆ వృద్ధురాలు కించపడుతూ.... "యింకేమయినా తయారు చేయమంటారా ?" అని ప్రశ్నించింది....

ఆ ముసలమ్మను అనవసరంగా యాతనపెట్టుట ఎందుకని దాస్వే ఆమె తెచ్చినదానిని తినేశాడు. మళ్ళీ ఆమె మధ్యాహ్నం యేదో ఆహారాన్ని తెచ్చింది. అలాంటి ఆహారం సంవత్సరంలో ఒకసారి లభించినా అదృష్టంగా భావిస్తాడు సామాన్యుడైతు. ఆ ఆహారాన్ని చూడగానే,దాస్వే కాలితో నేలను తాడించాడు.

"బాలూలమయిన మాకు రోజుకు రెండుసారులు మాత్రమే భోజనము చేయటము అలవాటు. నాకు యింకా భోజనమువేళ కాలేదు." అన్నాడు.

రమారమి మూడుగంటలకు షెన్ గేటు తట్టాడు. ఒక నౌకరు అతని తలుపు తీశాడు. ఒంటరిగా రెండు చేపలను చేతితో పుచ్చుకొని, సూటిగా దొడ్డిలోనికి వెళ్ళాడు షెన్.

షెన్ అలా వెళ్ళగానే, దాస్వే యిలా పడుకొని నిద్రపోతున్నట్లు నటించసాగాడు. యింతలోనే అక్కడకు షెన్ వచ్చాడు. అతన్ని కుదిపి లేపాడు.

"యిలాంటి సమయంలో నిద్రపోతూ వున్నావంటే నీవు భలే ధైర్యవంతుడివి ....!" అన్నాడు షెన్ అతని ధైర్యాన్ని మెచ్చుకొంటూ.

దాస్వే నవ్వుతూ లేచాడు. "మీరంటే నాకు నమ్మకముంది. ఇది సురక్షితమైనదాపని నాకు తెలుసు."

ఆ మాటలు వినేసరికి, షెన్‌కు సంతోషం కలిగింది. "నీవు నిజంగా మిత్రుడివోయ్ ! లోపలికిపోయి మాట్లాడుకొందాము పద !" అన్నాడు.

"యిప్పుడు కోటనుండి యెవరయినా వస్తారని అనుకొంటు న్నారా ?"

"లేదు! వాళ్ళు పేకాటలో మునిగున్నారు."

వారు సుఖంగా అతిధుల గదిలో కూర్చున్నారు. షెన్ రిపోర్టు ఇవ్వసాగాడు. "నేనా సమస్యను సవ్యంగా పూర్తిజేశాను "

విజయగర్వంతో తన మీసాలను దువ్వుతూ షెన్ కూతపట్టాడు. "జపాను కమాండర్‌కు ఈ విధంగా చెప్పాను. మహాప్రభూ! వారం రోజులూ పూర్తి అవుతున్నాయ్! మనం నిజంగా మేయర్లందరినీ వురితీస్తే ప్రజలల్లో మనకు చెడ్డపేరు వస్తుంది. మేయర్లను వాళ్ళ పనులలో తిరిగి ప్రవేశించనిస్తే మన తరఫున ధాన్యసేకరణ చేయించితే చాలా బాగుం టుంది.

మొదటి విషయం సామ్రాజ్యసైన్యం చాలా వుదారంగా ప్రవర్తించిం దని ప్రజలు మెచ్చుకొంటారు. రెండవ విషయమేమంటే; బాధ్యత గల మనుషులను మనం గ్రామాలలో పెట్టినవాళ్ళమవుతాం. వారిద్వారా మన పనులు చేయించుకోవచ్చు!" అని చెప్పాను.

నేను వాడికి అట్టే చెప్పవలసిన అవసరం లేకపోయింది. వాడు వప్పుకొన్నాడు. రేపు వాళ్ళను విడుదల చేస్తానని వాగ్దానం చేశాడు!.... సరే ! కెప్టెన్ దాస్వే ! నా పద్ధతి యెలాగున్నదని నీ అభిప్రాయం ?" అన్నాడు షెన్.

దాస్వే అతణ్ని కమ్మగా పొగడాడు. షెన్ వుబ్బిపోయాడు.

"సరే! యీ గండం గడిచాం. వాళ్లు మళ్ళీ ధాన్యాన్ని డిమాండు చేస్తే ఏం చేద్దాం?"

"తడవకు ఒక అడుగువేద్దాం" అని చిరునవ్వు నవ్వాడు దాస్వే. "ముందర వాళ్ళ ఆట కట్టటానికి ప్రయత్నిద్దాం. అది లాభంలేకపోతే మరొకటి ఆలోచిద్దాం!"

షెన్ ఒక్కక్షణం ఆలోచించాడు. తెచ్చిపెట్టుకొన్న నవ్వుతో "మంచిది అలాగేకానీయండి" అన్నాడు.

ఆ సాయంత్రం షెన్ మంచి విలువయిన ఆహారాన్ని దాస్వే కొరకు తెప్పించాడు. ఆ విలువయిన ఆహారాన్నిజూచి దాస్వే ఏవగించు కొన్నాడు.

"ఆహా! యిది నన్ను పాడుచేస్తుంది. ఈ ఆహారమంతా ప్రజలు చెమటోడ్చగా, రక్తాన్ని అర్పించగా వచ్చింది" అన్నాడు దాస్వే.

షెన్ కలవరపడ్డాడు. "యీ ఒక్కసారికే తీసుకోండి" అని ప్రతిమాలినాడు. "మంచి ఆహారం మీకు దొరకనే దొరకదు. బాలూపట్ల నాకు గల గౌరవానికి చిహ్నంగా యీ ఆహారాన్నిసమర్పించుకొంటున్నా" అన్నాడు.

కొంత తటపటాయింపు అయిన తర్వాత దాస్వే ఆహారాన్ని భుజించుటకు వప్పుకున్నాడు; భోజనంచేస్తూవుండగా దాస్వే. షెన్‌కు శత్రువును ఏ విధంగా ప్రతిఘటించాల్సినదీ చెప్పాడు. భవిష్యత్తులో షెన్‌తో సంబంధాలను కలిగియుండుటకు అవసరమైన ఏర్పాట్లు చేశాడు.

భోజనం పూర్తికాగానే, దాస్వే బల్లవద్దనుండి లేచాడు. "ఇప్పుడు నేను వెళ్ళిపోవాలి. కొంతదూరం నాతో రండి" అన్నాడు. "సరే"అన్నాడు షెన్.

"దారిలో మన కెవరైనా ఎదురవుతే నీవేమీ మాట్లాడబోకు, నన్నే మాట్లాడనీ" అన్నాడు.

వా రా గ్రామం వెలుపలకు జేరుకొన్నారు. దారిలో ఎలాంటి సంఘటనలూ సంభవించలేదు. షెన్ దాస్వేని అక్కడ వదలిపెటియింటిముఖం పట్టాడు. వెన్నెలలో దాస్వే ఆనకట్టవెంట ఒకానొక విలోవృక్షంవద్దకు నడచిపోయాడు.

అక్కడ నిలబడి ఘాటుగా యీలవేశాడు. పదునిమిదియేళ్ళ వయసుగల కుర్రవాడొకడు పడవను మర్మరధ్వనిచేస్తున్న రెల్లుదుబ్బుల ద్వారా బాణంలాగున వొడ్డుకు నడుపుకొనివచ్చాడు.

"విజయాన్ని సాధించావా సోదరా?" అని మందహాసంచేస్తూ అడిగా డా కుర్రవాడు.

"అవును. విజయాన్ని సాధించాను!" బోటులో దూకుతూ జవాబు చెప్పాడు దాస్వే.

ఆ కుర్రవాడు వొడ్డునుండి పడవను బాణంలాగున ముందుకు దూకించాడు. బాయాంగ్ సరస్సు హృదయంపై ఆ పడవ ప్రశాంతంగా పయనించసాగింది. వొడ్డునుండి చూస్తే, క్రమేణా ఆ పడవ, ఆ మను షులు ఆ రాత్రి మంచులో కరిగిపోయారా అనిపిస్తుంది.



# 14 అధ్యాయం

బ్లాకీ బిగ్‌పాప్లార్ గ్రామాన్ని జేరుకొన్నాడు. కీలుబొమ్మ ప్రభుత్వ ఆధీనంలోవున్న గ్రామాలకు పోయిన కార్యకర్తలుకూడా తమతమ పనులు పూర్తిజేసుకొని వచ్చారు. వారిలో ప్రతి కార్యకర్త తనపనిని విజయవంతంగా ముగించుకొన్నాడూ అంటే, బాలూతో కీలుబొమ్మనాయకులు సహకరించేలాగా వొప్పించివచ్చారు.

ఆ మరునాడు షెన్ వాగ్దానం ప్రకారం మేయర్లందరూ తమతమ గ్రామాలకు పోవుటకు విడుదల చేయబడ్డారు. జపానువాళ్ళతో సహకరిస్తున్నామని నటిస్తున్నా చైనా అధికారులతో కలిసి పనిచేయాలనీ, ప్రజలను సమీకరించే కార్యక్రమాన్ని చిక్కబరచాలనీ పార్టీ సూచించింది. ఈ సూచనలను యేవిధంగా అమలుజరపాలన్న విషయంపై చర్చించుటకుగాను ఆ సాయంత్రం ఒక సమావేశం జరుపబడింది. కార్యకర్తలందరికీ కొత్తపనులు వప్పగించబడ్డాయ్. జపానువాళ్ళ "సర్వధ్వంస" వుద్యమం లాటినుండి షెన్‌జ్యా గ్రామంలోని ప్రజాసంఘాలు మూలపడ్డాయ్. వాటిని రహస్యంగా పునరుజ్జీవింప జేసేబాధ్యతను దాస్వేకి అప్పగించారు.

దాస్వే తన రహస్య కార్యకలాపాలను ప్రారంభించి వారం రోజులు గడచిన తర్వాత గౌపీ, అతని గూఢచారుల ముఠా తమ క్రూర హస్తాలను విస్తరింపచేయసాగారు. ఆ ముక్కుతెగిన గౌపీ షెన్‌జ్యా గ్రామ ప్రజలదృష్టిలో క్రూరమైన అడవి కుక్క. వాడెక్కడకుపోతే అక్కడ తన కంపును విడచివస్తూ వుంటాడు. ఈసారి వాడి ఆజ్ఞలను

అనుసరించి వాని గూఢచారులు అర్ధరాత్రివేళ తేవారుతల్లి కొంపకు నిప్పంటించారు. చిట్టచివరకు ఆమెను ఎలాగయితేనేం బయటికి లాగారు. గుర్తుపట్టటానికి వీలులేకుండా ఆమె శరీరం మసిబొగ్గయిపోయింది.

దాస్వే వెంటనే యీ వార్తను బిగ్‌పాప్లార్ గ్రామంలోవున్న బ్లాకీ త్వేకు అందజేశాడు. బ్లాకీత్వే కోపంతో మండిపోయాడు.

"మన పాలసీ చాలా వుదారంగా వున్నది. కాని గోపీలాంటి పందులపట్ల మనం యిక వుదారంగా వుండనక్కరలేదు!" అన్నాడు బ్లాకీ కోపంగా.

గెరిల్లాలందరూ గోపీని వురితీయాలన్న ప్రతిపాదనకు అంగీకరించారు. కోపంతో గుండెలు బాదుకొంటూ, విచారంతోనూ, కోపంతోనూ నేలను కాలితోతాడిస్తూ తేవార్ తన పగ తీర్చుకోటానికి తనకు అవకాశమివ్వవలసిందిగా డిమాండ్ చేశాడు. ఈ ప్రతిపాదనను బ్లాకీ ఇతరులతో చర్చించాడు. ఈ పనిని తేవార్, దాస్వేల కిద్దరికీ వప్పగించుటకు నిర్ణయించారు. గోపీని చిక్కించుకొనుటకు వుపాయాన్ని వారే ఆలోచించుకొని, పశ్చాత్తాపంలేని దేశద్రోహులందరకూ ఒక హెచ్చరికగా వాడిని వురిదీయాలి.

వారు వెంటనే బయలుదేరారు. ఆ రాత్రి షెన్‌జ్యా గ్రామం జేరినారు. ఆరా తీయగా గోపీ, లైవేబు ఒక కొరియన్ దేశస్థుని రహస్య పానశాలలో కాలం గడుపుతున్నారని తెలిసింది. తొందరగా ఆ గెరిల్లాలిద్దరు ఆ రహస్య పానశాలకు జేరుకున్నారు. గోడనెక్కి లోపలికి దూకారు. ఆ భవనంలోని ఉత్తరపువైపు గదిలో గోపీ, లైవేబు ఒక కాంగ్ మత్తుగా పడియున్నారు.

పానశాల యజమాని వాళ్ళకు హుక్కాలు నింపుతున్నాడు. ఒక మూల అంగరక్షకుడు దుంగలాగునపడి నిద్రపోతున్నాడు. గెరిల్లాలు ఆ గదిలోనికి దూరారు. తేవార్ ముందుకుసాగాడు. కాంగ్‌మిద పడుకొనియున్న గోపీని కిందకులాగాడు. దాస్వే మిగిలినవారికి తన పిస్తోలు చూపించి అదరగొట్టాడు.

"ఎవ్వరంత చప్పుడుచేసినా చంపేస్తా! నోరు మూసుకొని పడి

యుండండి! చెప్పినట్లు చేయండి" అని అదలగొట్టాడు దాస్వే. దాస్వే అంగరక్షకులనుండి తుపాకులను లాగివేశాడు.

తేవార్ వాళ్ళనూ, కొరియావాడిని బంధించాడు. వారి నోళ్ళలో గట్టిగా గుడ్డలు కుక్కాడు. పైవేను బంధిస్తూ "ఇంకా దేశద్రోహిగానే పనిజేస్తున్నావా! వెధవా!" అన్నాడు తేవార్.

భయపడితుడై, గిరగిరా తిరుగుతున్న నేత్రాలతో గెరిల్లా చేస్తున్న ప్రతి పనినీ చూడసాగాడు ఆ మొక్కలేని వెధవ గోపి. ఉరిదండన జరిగేటప్పుడు పైవేనికూడా అక్కడవుంచితే వాడి మనసు మార్పుజెందగలదేమోయని అలా చేయటం మంచిదని తేవారు, దాస్వేలు రహస్యంగా సమాలోచన చేయసాగారు

"ఇది మీకు సంబంధించినదిగాదు. మీరు యిద్దరూ చడీచప్పుడు జేయకుండా యిక్కడే వుండిపోండి" అని దాస్వే ఆ అంగరక్షకునితోనూ కొరియావాడితోనూ అన్నాడు.

పిస్తోళ్ళతో తమ ఖయిదీలను ముందుకు నెట్టుకొనిపోయారు ఆ గెరిల్లాలు. ఆవరణ దాటించి, గ్రామం వెలుపలి ప్రదేశానికి చడీచప్పుడూ చేయకుండా నెట్టుకొనిపోయారు. దేశద్రోహులను వారి నడుముకు కట్టు వస్త్రాలలోనే బంధించారు. అవి మెత్తగానూ, జారుడుగానూ వున్నాయి. దాస్వే, తేవారులు విడివిడిగా ఒక్కొక్క ఖయిదీయొక్క నడుముకట్టు వస్త్రం కొసను పుచ్చుకొని నడిపించుకొంటూ పోసాగారు.

తన దౌష్ట్యాలపుట్టను యేవిధంగా తాను పెంచుకున్నదీ గోపికి తెలుసు. తనపట్ల దయాదాక్షిణ్యాలు చూపబడవన్నదీ అతనికి తెలుసు. కొసను తేవారు కొంత వదులుగా పట్టుకొన్నాడని గ్రహించగానే గోపి ఒక్కగుంజు గుంజి వుడాయించాడు. రోడ్ మీద అమితవేగంగా పరుగెత్తసాగాడు.

"షూట్ చేయవేం?" అని అరచాడు దాస్వే.

తొందరగా తేవార్ షూట్ చేశాడు. కాని గురితప్పింది. పైవే యీ అదనుజూసి, ఒక్కగుంజు గుంజి దాస్వేచేతులనుండి తప్పించుకొని పారిపోసాగాడు. కుడివైపునున్న పొలాలపడి పరుగుతీశాడు.

దాస్వే గురిచూసి తుపాకి కాల్చాడు. అయితే, లైవేని చంపునా మన్న వుద్దేశ్యం దాస్వేకి లేదు. గాయపరుద్దామని మాత్రమే అనుకొన్నాడు. కాని దాస్వే గురిచూచికొట్టిన తుపాకీగుండు సూటిగాపోయి లైవే తలను బ్రద్దలుచేసింది దాస్వే ఆ శరీరాన్ని సమీపించేసరికి, కంతపడిన లైవే నుదుటినుండి రక్తం చిమ్ముతూవుంది.

తేవార్ గోపిని వెంటాడుతూ నేవున్నాడు. కాని గోపి చీకటిలోనికి తప్పించుకొనిపోయాడు. విసుగుతోనూ, తీవ్ర వేదనతోనూ తేవార్ తన నుదుటిమీద కొట్టుకొంటూ, మెల్లిగా దాస్వే వైపుకు నడిచివచ్చాడు.

"నేను చచ్చిపోయినట్లయితే బాగుండేది!" అన్నాడు కోపంగా. "యిప్పుడు పారిపోనిచ్చాను నా వెధవని." అని అంత గట్టి యువకుడూ కూలబడి ఏడ్వసాగాడు.

"యిదంతా చండాలంజేసేశాం!" అని దాస్వే విచారంగా అన్నాడు. "లైవే పారిపోయాడు. తొందరలో వాడిని చంపేశాను దీనెమ్మ! దురదృష్టమోయ్! చంపకూడనివాణ్ని చంపాం. చంపాలనుకున్నవాడు జారిపోయాడు."

అప్పుడే తుపాకి పేలిన ధ్వని విని అటువైపుగా కోట బురుజులోని మరతుపాకిని పేల్చసాగారు. తుపాకిగుళ్ళు అతి ప్రమాదకరంగా ఆ గెరిల్లాలిద్దరికీ అతిదగ్గరగా ఎగురసాగాయి. తొందరగా వారిద్దరూ అక్కడినుండి వెళ్ళిపోయారు

వారు బిగ్‌పాప్లార్ గ్రామానికి జేరుకోగానే, వారిని తీవ్రంగా విమర్శించారు. షెన్‌జ్యా గ్రామంలో యిక వుండే దమ్ములు లేకపోయాయి గోపికి.

వాడికి వణుకుపుట్టింది. తనతండ్రికి పట్టుగొమ్మయైన ప్రహరీ గోడలచే రక్షింపబడుతూ వున్న పట్నానికి పారిపోయాడు. అక్కడ మంచమెక్కాడు. కొన్నిరోజుల వరకూ వాడు మంచంలోపడి తీసుకొంటూనేవున్నాడు.

బాలూ సంఘబలం నానాటికి పెరుగుతున్నదన్న భయంతో, కొన్ని వారాలు గడచిన తర్వాత జపానువాళ్ళు షెన్‌జ్యా గ్రామాన్ని విడిచిపెట్టి పట్నం చేరుకొన్నారు.

వాళ్ళు పోతూపోతూ, షెన్‌జ్యాగ్రామం కోటను కీలుబొమ్మ సైన్యాల చేతులలోపెట్టిపోయారు. పరిస్థితులు యీవిధంగా మారిపోవటను చూచి ఆ కోటకు కమాండరు అయిన జీవో భయంచే పీడించబడసాగాడు వాడూ తనకు జబ్బుగావుందని నటించి, "ఆరోగ్యం పుంజుకోటాని"కని పట్నానికి పారిపోయాడు.

రైతాంగాన్ని పీడించటం ఆపివేయవలసిందిగా కోటలోనున్న దేశద్రోహులకు [illegible]కీ హెచ్చరిక పంపారు. జపాను వ్యతిరేక నినాదాలుగల పోస్టర్లను గెరిల్లాలు షెన్‌జ్యాగ్రామంలోని గోడలనిండా అతికించారు. ఇక కోటగోడలకు ప్రతిఘటనోద్యమంలో చేరవలసిందిగా కీలుబొమ్మలను ఆహ్వానిస్తున్న పోస్టర్లను అంటించారు.

ఒకనాటి సాయంత్రం, అతని యింటిలోనే షెన్‌తో బ్లాక్, దాస్వేలు మాట్లాడుతున్నారు. ఇంతలోనే ఆవరణలో మనుషుల మాటలు వినపడ్డాయి. కిటికీగుండా చూడగా, తుపాకులను ధరించిన ముగ్గురు సైనికులు లోపలకు వస్తున్నారని తెలిసింది. షెన్ తెల్లపోయాడు. హడావుడిగాలేచి నిలబడ్డాడు.

"త్వర! తొందరగా ప్రక్కగదిలో దాక్కోండి!" అని బ్రతిమాలినాడు.

"ఏం ఫరవాలేదు" అన్నాడు బ్లాక్ ప్రశాంతంగా. "వాళ్ళ సంగతేమిటో నేను తేల్చుతా" అన్నాడు తనచొక్కాలో చిన్న పిస్తోలును దాచుకొన్నాడు. పెద్దపిస్తోలు కంటికి కనబడేటట్లుగా కాంగ్‌మీద పడేశాడు. అంటే తాను జాగ్రత్తగా వున్నానని తెలియపరచటానికని అలాచేశాడు. ప్రశాంతంగా దాస్వేకి ఏవో రెండుమాటలు చెప్పాడు దాస్వేకూడా అలాగే చేశాడు.

కీలుబొమ్మలు ద్వారంతెరను తొలగించి లోపలికి వచ్చారు. కాంగ్

మీదవున్న వాళ్ళిద్దరినీ రెప్పార్పకుండా చూడసాగారు. ఆ యిద్దరిలో ఒకడు బొద్దుగా గుండ్రంగా వుంటాడు. నల్లగావున్నాడు. చురుకయిన కళ్ళు గలవాడు. ఆ క్రొత్త పెద్దమనిషి తమ్ముళ్ళనూ నఖశిఖపర్యంతం పరీక్షిస్తూ వుండటను ఆ కీలుబొమ్మలు గుర్తించారు. ఆ నల్లవాని ప్రక్కగా బలశాలియైన యువకరైతు కాంగ్ మీద కూర్చునివున్నాడు. జిల్లా కీలుబొమ్మ గ్రామరక్షక పాలక సంఘానికి అధ్యక్షుడయిన షెన్ గారు చికాకుగా దూరంగా నిలబడి యుండుటనుకూడా ఆ కీలుబొమ్మలు గుర్తించాలి. ఆ కీలుబొమ్మలు కాంగ్ మీదవున్న పెద్ద పిస్తోలునుజూసి, ఆ గదిలోవున్న కొత్తవారిద్దరూ ఎర్రసైన్యానికి చెందినవారని గ్రహించారు. కీలుబొమ్మలకు వణుకుపుట్టు కొచ్చింది. తోకముడిచి పారిపోవుటకు వుద్యుక్తులయ్యారు.

"వెళ్ళకండి!" అని పెద్దరైతు ఆజ్ఞాపించాడు. "మా కమాండరు గారు మీతో యేదో చెప్పదలచారు" అన్నాడు.

"కమాండర్" అన్న మాటలను వినగానే కీలుబొమ్మసైన్యాలకు మరింత భయం ఆవేశించింది. వారు వెంటనే వరుసగా నిలబడి సైనిక వందనం జేశారు.

"కమాండరుగారి ఆజ్ఞలకు ఎదురుచూస్తున్నాం!"

"ఇంత ప్రొద్దుపోయేవరకూ పనీపాటా లేకుండా తిరుగుతున్నా రేమి?" అని కోపంగా ప్రశ్నించాడు బ్లాకీ.

అతని కంఠధ్వని మహా చురుకుగావుంది. ఆ దెబ్బతో కీలుబొమ్మ ముఖాలు వెలవెలబోయాయి. చేతులను గట్టిగా ప్రక్కనబెట్టుకొని "కాస్త షైరుకు వచ్చాం. సిగరెట్లుపోచామని వచ్చాం. అంతకన్న మరేమీలేదు" జవాబు యిచ్చారు.

"కూర్చోండి!" అని ఆజ్ఞాపించాడు బ్లాకీ.

"కమాండరుగారు కూర్చున్నప్పుడు మేం నిలబడాలి!"

"ఏం ఫరవాలేదు. మనమంతా చైనావాళ్ళం. కూర్చోండి మనం కొంతసేపు మాటాడుకొందాం" అన్నాడు బ్లాకీ.

కీలుబొమ్మలందరూ ఒక బల్లపై కూర్చున్నారు. తుపాకులను ప్రక్కగా వుంచుకొన్నాడు. దళనాయకుడు బూడిదవర్ణం ముఖంగలవాడు.

నల్లమందుకు అలవాటుపడిన వ్యక్తి. జ్లాకీకి వాడు ఒక సిగరెట్ నివ్వ వచ్చాడు. తనకు సిగరెట్ తాగే అలవాటులేదని జ్లాకీ చెప్పాడు. వాడు దాస్వేకి సిగరెట్ యివ్వబోగా అతడూ నిరాకరించాడు.

"మా బాలూ సిగరెట్లు తాగే అలవాటు చేసుకొనజాలదు. అవి చాలా ఖరీదు" అంటూ దాస్వే తనపైపును, పొగాకు సంచిని బయటకు తీశాడు.

ఈ విధంగా రెండుదెబ్బలు తిన్న తర్వాత, దళనాయకుడు షెన్‌కు సిగరెట్ యివ్వ యత్నించాడు. కాని, దానిని తాగటానికి షెన్‌కుకూడా ధైర్యం చాలకపోయింది. అతడు సిగరెట్ పాకెట్‌ను జేబులో పెట్టివేసుకున్నాడు.

జ్లాకీ పొదలాంటి తన కనుబొమలను ముడిపేశాడు. "మీకు కొన్ని ఆజ్ఞలు యివ్వాల్సివుంది!" అన్నాడు. అతని కంఠం చాలా కఠినముగా ధ్వనించింది.

అతని ప్రవర్తన కాఠిన్యత కీలుబొమ్మలను అమాంతంగా లేచి నిలబడేటట్లు చేసింది. వారు లేచి నిలబడ్డారు. గజగజ వణుకుతూ అతణ్ని అత్యంత నమ్రతాపూరితంగా సంబోధించారు.

"ఆజ్ఞలివ్వండి కమాండర్! మేమనుసరిస్తాం" అన్నాడు.

"మొదటిది— పనిలేనిదే మీరు వీధులలో తిరుగరాదు."

"యస్ కమాండర్."

"రెండు— మీరు రైతులను పీడించడం మానివేయాలి."

"యస్, కమాండర్."

"మూడు— మీరు తుపాకునను ధరించే పద్ధతిని జాగ్రతగా మార్చుకోవాలి; తుపాకులమూతులను క్రిందివైపుగా పెట్టి వీపుమీద వ్రేళ్ళాడేసుకోవాలి."

"యస్, కమాండర్."

"ఇంకా ఏమంటే, భవిష్యత్తులో మీ కేదైనా కావాల్సివస్తే, మేయపనడగండి. రైతులకు దూరంగా వుండండి. వాళ్ళు గౌరవప్రదంగా బ్రతికే జనం. మీ డంబాలను వాళ్ళు భరించజాలరు. రైట్?"

"యస్, యస్, యస్, కమాండర్!"

దాస్వే తన గొంతును సవరించుకొన్నాడు. కీలుబొమ్మలవంక తీక్ష ణంగా చూశాడు. "నావీ కొన్ని ఆజ్ఞలున్నాయి! రైతులనుండి మీరు గోధుమపిండిని డిమాండ్ చేయటం మానివేయాలి. ఇలాంటి క్లిష్టసమయా లలో మిమ్మల్ని మేపటానికి, రైతులకు గోధుమపిండి ఎక్కడ దొరుకు తుంది? అవునా?"

"యస్! యస్! పూర్తిగా రైట్!" అని ఆ కీలుబొమ్మలు తలలను బలంగా వూచారు.

"దానిసలాగున మీరా విధంగా మాటాడనవసరంలేదు" అన్నాడు బ్లాకీ స్నేహపూర్వకంగా.

"మనమంతా చైనావాళ్ళం; ఒకే దేశానికి చెందినవాళ్ళం. మీరు చూస్తూనే వున్నారుగా, మేం మా ఆయుధాలను కాంగ్‌మీద పెట్టాం; దాని కర్థమేమంటే, మిమ్ములను మేం శత్రువులుగా భావించటంలేదు. కాని, మేం మీకు యీనాడు చెప్పిన విషయాలను తప్పక మీరు అమలుజరపాలి యీనాటినుండీ అమలుజరపాలి. మీరు సరిగా అమలుజరుపుతున్నారో లేదో తనిఖీజేయటానికని మేం తరచుగా వస్తూవుంటాం. అందువలన మరచిపోకండి" అన్నాడు బ్లాకీ

వారిచ్చిన జ్ఞలను తప్పక అనుసరించగలమని ఆ కీలుబొమ్మలు నమ్మబలికారు. తప్పక జ్ఞాపకముంచుకుంటామన్నారు.

"మంచిది! మీరిక పోవచ్చు. భవిష్యత్‌లో మీరే విధంగా సంచ రిస్తారో కనిపెడుతూవుంటాం" అన్నాడు బ్లాకీ.

"యస్, కమాండర్! మేమేవిధంగా అమలుజరుపుతున్నదీ మీరు చూస్తారుగా! మీకన్ని విషయాలూ తెలుసును" అని, ఆ కీలుబొమ్మలు తమ తుపాకులను తీసుకొని శాల్యూట్ చేసి, బయలుదేరారు.

ఈ సంఘటనలో తన పాత్రనుగురించి ఆ కీలుబొమ్మలు ఏ విధ ముగా రిపోర్టుచేయగలరోయన్న అనుమానం షెన్‌ను బాధించింది. తొంద రగా అతడు ముందుకు సాగాడు.

"మీ వెంట రాలేనందుకు క్షమించాలి మిష్టర్ స్క్వాడ్‌లీడర్! ఈ బాలూ కామ్రేడ్స్ యిద్దరూ నాకు పాఠాలు నేర్పాలని వచ్చారు!" తన్ను తాను కాపాడుకోవటానికి వాదించుకొంటూ "అదే సమయంలో మీకుకూడా బోధించే అవకాశం లభించింది. చాలా చిత్రమయిన సంఘటన... హ్హా! హ్హా! హ్హా!

"చాలా వెలుగునిచ్చింది! నల్లమందుతాగితే కలిగే సంతోషంకన్న అమిత సంతోషాన్ని కలుగజేసింది" అని దళనాయకుడు జవాబు చెప్పాడు.

గౌరవప్రదంగా కీలుబొమ్మలు వెళ్ళిపోయారు. కీలుబొమ్మలు చాలాదూరం పోయివుంటారని అనుకోగానే తమలో బుసబుస పొంగి వస్తూన్న నవ్వును బిగించడా విప్పేశారు. అమిత ఉల్లాసంగా పొట్టచెక్కలయ్యేటట్టు నవ్వుకొనసాగారు

అలాంటి సంఘటనలు అనేకం గెరిల్లాల, కీలుబొమ్మల మధ్య జరిగాయి. తదుపరి కీలుబొమ్మల ప్రవర్తన అపారంగా అభివృద్ధి అయింది. కాని షెన్ జ్యాగ్రామం కోటకు కొత్త కమాండరుగా వచ్చినవాడు వొక అడవిమృగంలాగున సంచరిస్తున్నాడు. వాడి కొక మారుపేరుకూడావుంది. వాణ్ని పెద్దకాకి అంటారు.

వాడు తరచుగా షాపులనుండి వస్తువులను మూల్యాన్ని చెల్లించకుండా కొట్టేస్తున్నాడు. నిరంతరం బాలూనిగురించి బూతులుతిడుతున్నాడు నిందాప్రచారాన్ని చేస్తున్నాడు.

"జపానువాళ్ళు వాళ్ళందరినీ తుడిచిపెట్టేశారులే!" అని పెద్దకాకి వెక్కిరించాడు.

రహస్యంగా పునరుద్ధరించబడిన రైతు యూనియన్లలోనూ, యువజన సంఘాలలోనూవున్న అభ్యుదయ కాముకులు కొంతమంది దాన్తోతో రహస్య సమావేశాన్ని జరిపారు. కొలది రాత్రులు గడిచినతర్వాత ఒక చీకటి సందులో పెద్దకాకిని లంకించుకున్నారు.

"ఏరా! పులిగుండె తింటున్నావా ఏమిటిరా! మహదుడుకుగావున్నావట? బాలూ అనేవాళ్ళే లేరని కోశావటగా?" అని వాణ్ని అడిగారు.

దాస్వేవంక చూపించి, "మంచిది! అయితే యిదిగో, నీ కళ్ళయెదుటనే వున్నాడు బాలూ! ఇకనుంచైనా ప్రజలను వేధించటం మానుకొంటావా, లేదా ?"

ఆ కీలుబొమ్మ వెధవ, పెద్దకాకిగాడు చేసిన ప్రతి పనినీ, కూసిన ప్రతి తప్పుడుకూతనూ దాస్వే ఏకరువుపెట్టసాగాడు. పెద్దకాకిగాడికి భయంచే వళ్లు గజగజ వణకిపోయింది. చేతులు ముందుకుపెట్టుకొని, అనేకసార్లు సాష్టాంగపడ్డాడు ఆ పెద్దకాకి.

"నాకు పెద్ద కళ్లువున్నాయ్! కాని ఏంలాభం. కళ్ళలో పాపలులేవు సామీ!" అని నీచాతినీచంగా ఏడ్వసాగాడు పెద్దకాకి. అంతేగాక "మానవుడుగా సంచరించటం నాకు తెలియదుసామీ! నా విషయమంతా మీకు తెలుసు! నేనొక తప్పుడు గాడిదకొడుకులాగా వ్యవహరించాను. ఈరోజు నుంచి బుద్ధితెచ్చుకొని బ్రతుకుతా!" అని తన్నుతాను నీచాతినీచంగా తిట్టుకొనసాగాడు.

వానికి ఒకగంటసేపు వారు వుపన్యాసమిచ్చారు. ఆ తర్వాత వారు వాడిని కోటకు తిరిగిపోనిచ్చారు.

ఆనాటినుండి పెద్దకాకి మొదలుకొని క్రిందివాడివరకూ షెన్‌జ్యా గ్రామంలోని ప్రతి కీలుబొమ్మ సైనికుడూ బాలూ ఆజ్ఞలను అనుసరించి నడుచుకోసాగారు. అవసరమైతే బాలూకి పెద్దకాకికి కబురుజేసేవాడు. వానికి ప్రత్యేకసూచనలు యిచ్చేవాడు.

ఒకసారి పెద్దకాకియొక్క అంగరక్షకుడు ఒక స్త్రీయొక్క చొక్కాను దొంగిలించాడు. ఆమె యీ విషయాన్ని మహిళాసంఘానికి రిపోర్టుచేసింది. వెంటనే ఆ సంఘసభ్యులు పదిహేనుమంది సమావేశమై కోటబురుజుకు ఎదురుగావున్న కొంపలపైకి ఎక్కారు.

"ఓ కీలుబొమ్మ దేశీయులారా! బాలూ మీకు విధించిన సూత్రాలను, నియమాలనూ మరచిపోయారా! ప్రజలకు ఎలా చెరుపుచేయగలుగుచున్నారు?" అని అరచారు

బురుజుమీదనుండి పెద్దకాకి వాళ్ళకు ప్రత్యుత్తరమిచ్చాడు. "ఏం బాధ కలిగిందో చెప్పండమ్మా!"

"మిసెస్ జోవ్ జాకెట్‌ను మీ అంగరక్షకుడు దొంగిలించాడు. ఇలాంటి విషయాలను మా మహిళాసంఘం సహించదు."

ఆ మరునాడు అపహరించబడిన వస్తువు స్వంత ఆసామికి చేర్చబడింది.

* * * *

ఇప్పుడావిధంగా షెన్‌జ్యా గ్రామం ఆధీనంలోనికివచ్చింది. బ్లాకీ త్సే దాస్వే. మేయీలతో ఒక సమావేశాన్ని జరిపాడు. హోజ్యాంగ్ గ్రామాన్ని శత్రువుల హస్తాలనుండి విముక్తిజేయుటకు నీవుపోయి యత్నిస్తావాయని దాస్వేని. షెన్‌జ్యా గ్రామంలో వుండి దాస్వేచేస్తున్న పనిని నీవు చేస్తావాయని మేయీని బ్లాకీ అడిగాడు. ఆ కార్యకర్తలిద్దరూ ఆవిధంగా జేయుటకు సంతోషంగా వప్పుకున్నారు.

కాంగ్‌మిద వాళ్ళిద్దరూ జంటగా కూర్చొవటం చూసి వాళ్ళిద్దరూ అద్భుతమయిన దంపతులు కాగలని అనుకున్నాడు బ్లాకీ. వాళ్ళిద్దరూ ఆ విధంగా జంటగాకూర్చుంటే ఆ దృశ్యం అతనికి పండుగజేసింది. వాళ్ళిదరూ ఒకరినొకరు తమతమ హృదయాలలో ప్రేమించుకుంటున్నారన్న విషయం అతనికి తెలుసు. కాని వారిని ముందుకు త్రోసితే యీ జన్మలో వారు వారి హృదయాలను ఒకరినొకరు విప్పి చెప్పుకోలరన్న విషయం కూడా అతనికి తెలుసు.

"మీరిద్దరూ భలేప్రేమేడ్స్!" అన్నాడు పళ్ళు బయటపెడుతూ బ్లాకీ. "యిందులో ఒకరు అసలు పెళ్ళేచేసుకోలేదు; మరియొకరు విడాకులిచ్చి ఎంతోకాలమయిపోయింది. మీ యిద్దరికి జోడా కుదురుతుందనుకుంటాను. మీరిదరూ పెళ్ళిచేసుకోగలరని లాంఛనప్రాయంగా నన్ను ప్రతిపాదించనీయండి! మొదట మీరు యిద్దరూ ఒకరినొకరు బాగా తెలుసుకోండి! తర్వాత బాగా ఆలోచించుకోండి: ఏమంటారు?" అన్నాడు బ్లాకీ.

"హాఁ!" అని కొట్టుకొంటున్న హృదయంతో దాస్వే జవాబిచ్చాడు. "ఇన్ని సంవత్సరాలు ఇద్దరంకలిసి పనిచేసిన తర్వాత ఆమె హృదయ మెలాంటిదో నాకు తెలియదని మీరనుకుంటున్నారా?" అన్నాడు.

మేయీ సిగ్గిలింది. ఆమె తనలో యీవిధంగా అనుకోసాగింది. అతనిలో అర్థంజేసుకోవాల్సిన విషయమేమీ మిగలలేదు. అతనిలోని ప్రతి భావమూ నాకు ఎంతోకాలంనుండి తెల్సు!

నిశ్శబ్దాన్ని చిట్టచివరకు దాస్వే భంగపరచాడు. అతడీ విషయాన్ని కదిపాడు. "నాకేమి అభ్యంతరంలేదు!" అతడీ విధంగా మాట్లాడినప్పుడు అతనిలో తత్తరపాటు జనించిందని అతని కంఠధ్వని సూచించింది. "కామ్రేడ్ మేయీ అంటే నాకు మహత్తరమయిన సదభిప్రాయముంది. ఆమె కష్టపడి పనిజేస్తుంది. కార్యకర్తలకన్న మిన్నగా పనిచేస్తుంది. చాలా మెరుగు. ప్రతిఘటనోద్యమంలో జేరనీయకుండా జిన్లంగ్ కుటుంబం ఆమెకు అడ్డుపడాలని ప్రయత్నించినప్పటికీ ఆమె దానిని తప్పించుకొంది...." దాస్వే తొట్రుపడ్డాడు. "ఏమైనాగానీయండి. ఆమె అద్భుతమైన వ్యక్తి! ఎలా చెప్పాలో నాకు తెలియుటలేదు...."

"నన్నుగురించి యిప్పటికే చాలా పొగడేశావు!" అని మేయీ అడ్డుపడింది. మెరుపులాంటి చిరునవ్వు ఆమె పెదవులపై చిందులాడింది. "నాలో కావలసినన్ని తప్పులున్నాయి. ఏవిధంగా చూసినా నీవు నాకంటే వెయ్యిరెట్లు మెరుగు!" అన్నది. జాకీవంక తిరిగి, దాస్వేలాంఛనోపన్యాసానిని సరితూగేటట్లుగా "కామ్రేడ్ దాస్వే అంటే నాకు పూర్తిగా ఇష్టం. ఆయన అద్భుతమయిన వ్యక్తి. మహామేరువులాంటి గట్టివ్యక్తి. జపాను వాళ్ళు క్రూరాతిక్రూరంగా అతడిన్ని బాధించినా ఒక్క రవ్వంతైనా జంకలేదు. నాకంటే చాలా బాగా పనిచేస్తాడు, చక్కగా నేర్చుకొంటున్నాడు. నాకుకూడా అభ్యంతరంలేదు!" అన్నది.

జాకీ నవ్వాపుకోలేకపోయాడు. చాలాసేపు కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వాడు.

"మంచిది, మంచిది! మీరిద్దరూ యీవిధంగానే భావిస్తేని పార్టీ కమిటి ఆశిస్తూవుంది. పరిస్థితులు కొంచెం బాగుపడగానే మీరిద్దరూ పెళ్ళి చేసుకొందురుగాని! అంతవరకూ ఉల్లాసంగా పనిచేస్తూవుండండి! మధనపడనక్కరలేదు!" అన్నాడు డాక్టర్.

వాళ్ళముఖాలు ఎర్రబారినాయి. కాని అంతరంగికంగా హృదయాలు వుల్లాస సముద్రంలో యీదులాడాయి. మేయీ, దాస్వేలు తమ అంగీకారాన్ని గొణిగారు.

ఆ మరునాడు మేయీ లీమాపును కలుసుకొన్నది. షెన్‌ష్యాంగ్రామంలో ప్రజాసమీకరణ రహస్య కార్యకలాపాలను ప్రారంభించింది. సాధారణంగా ఆమె ప్రచ్ఛన్నవేషంలో రాత్రివేళలందు పనిజేసేది. తనపై అధికారుల సూచనల ననుసరించి. ఆమె అప్పుడప్పుడు షెన్‌ను కలుసుకునేది. కీలుబొమ్మ గ్రామపరిపాలక సంఘానికు అధ్యక్షుడయిన షెన్, ఇప్పుడు రహస్యంగా బాబాకు సహాయం జేస్తున్నాడు. అతడు అందించిన సమాచారాన్ని ఆమె ఒక "వార్తాహరుని" ద్వారా గెరిల్లా హెడ్‌క్వార్టర్స్‌కు అందజేసేది.

ఆవిధంగా ఆమె అనేక వారాలపాటు పనిచేసిన తర్వాత ఒకనాటి రాత్రి షెన్ యింటికి పోయింది. కాని యీమారు ఆమె జాగ్రత్తగావుంది. ఆవరణలో పదధ్వనిని ఆమె పట్టించుకోలేదు. ప్రక్కగ్రామమైన హిస్సేలియా గ్రామంలోని కోటకు కమాండరుగా ఇయినో పనిచేస్తున్నాడు. వానికి అసిస్టెంట్‌గా జీవో పనిజేస్తున్నాడు. వాడు ఇయినోకు షెన్‌వద్ద మంచి దంతపుసామాగ్రి గలదని చెప్పాడు. ఆ సామాగ్రిన వేడుకొని తీసుకుపోదామని ఆరాత్రి ఇయినో రావటం తటస్థించింది.

ఇయినో, తన అంగరక్షకులను బయటవుంచి, మేయీ, షెన్‌లు రహస్య కార్యక్రమాన్ని గురించి చర్చించుకొంటున్న గదిలో చొరబడ్డాడు. జపానువాడు హఠాత్తుగా తలవని తలంపుగా వచ్చిపడుటచే మేయీ బిత్తరపోయి లేచింది. ఎర్రబారిన ముఖంతో, ఆమె కోపంగా షెన్‌వంక జూసింది.

షెన్‌కూడా ఖంగారుపడ్డాడు. ఖంగారు పడినట్లు పైకిమాత్రం పొక్కలేదు.

"ఆహా, ఘనశ్రీగారా! ఎప్పుడు వేంచేశారు....రండి! లోపలికి రండి!....దయచేసి కూర్చోండి!" అన్నాడు మృదువుగా షెన్.

జపానువాడి కళ్ళు మేయీమీదనే వున్నాయి........ "ఆమె ... యెవరు ?"

"నా మేనగోడలు!" అని షెన్ వెంటనే జవాబుచెప్పాడు. దయ చేసి కూర్చోండి!"

"నేనుపోయి నీళ్ళు కాచుటలో అత్తకు సాయపడతాను" అని చెప్పి మేయీ, ఆ గదినుండి బయటికిపోయింది.

అర్ధనిమీలితనేత్రుడై ఇయినో ఆమెపోయిన దిక్కుగా చూస్తూ కూర్చున్నాడు. కలగనసాగాడు. చిట్టచివరకు కలనుండి బయటపడి వింతగా నవ్వాడు ఇయినో.

"మీ మేనగోడలా యిది!" అన్నాడు షెన్‌తో. పిడికిలినుండి బొటనవేలిని బయటపెడుతూ, బకిపిల్లాడులాగా కిలకిలనవ్వాడు "బాగుంది! బాగుంది!"

పగటిపూట ఇళ్ళల్లోనే దాగొనివుండవలసి వచ్చుటచే, మేయీ శరీరపురంగు తెల్లబడింది. తాను షెన్ ఇంట్లో వున్నానన్న విషయాన్ని ఇయినో కనిపెట్టాడని ఆమె భావించగానే, ఆమె ముఖం ఎర్రబారింది. అతనివంక తన విశాలనేత్రాలతో జూచినప్పుడు ఆమె ముఖానికి వింత అందమొచ్చింది. ఆ అందాన్నిజూచి, జపానువాడికి మహాఘోరంగా కామజ్వరం పట్టుకొంది.

షెన్ తన నుదుటిమీదనున్న చెమటను కృత్రిమంగా తుడుచుకొన్నాడు. ఇయినో దృష్టిని యితర విషయాలమీదకి దొర్లించాలనే ఉద్దేశంతో షెన్ యితర విషయాలను వుల్లాసంగా మాట్లాడసాగాడు. కాని ఇయినోకి అప్పటికే కామజ్వరం నెత్తికెక్కిపోయింది. వాడికి యితర విషయాలేమీ పట్టలేదు.

"మీ మేనగోడలివయసు?" అన్నాడు ఇయినో.

"చాలా చెడుగా తయారవుతోంది యీ విషయం!" అనుకున్నాడు షెన్. "ఆమె వయసును ఎక్కువచేసి చెప్తా" అనుకున్నాడు.

"ఆమెకు యిరవై అయిదేళ్ళు! మా కోటను జూచి వచ్చారా?" అన్నాడు షెన్.

వెకిలిగా నవ్వుతూ ఇయినో, తన సారాయిరంగు ముక్కును ముడతవేశాడు.

"నాకు—" అని పది వేళ్ళను పైకెత్తిజూపి, మూడుసార్లువేరులు ఊపాడు ఇయినో.

"ఆహా! ఆహా! ఘనశ్రీగారికి ముప్పయి ఏళ్ళా!" అని షెన్ తల ఊపాడు.

ఆలోచనాసముద్రంలో మునిగిపోయి ఆ జపానువాడు కొంతసేపు ఆ విధంగా మొద్దులాగున కూర్చున్నాడు. దంతపు సామాగ్రినిగురించి ఒక్కమాటయినా చెప్పమరచాడు. అకస్మాత్తుగా లేచి బయటకు వెళ్ళిపోయాడు.

ఆ మరునాడు ఇయినోయొక్క చైనాదుబాసీ, షెన్‌ను చూడటానికి వచ్చాడు. ఒక రిస్టువాచీని, ఒక ఉంగరాన్ని, రెండు తాన్ల సాటిన్ పట్టు గుడ్డను ఆ దుబాసీ తీసుకొనివచ్చి యిచ్చాడు. షెన్ మేనగోడలిని ఆ జపానువాడు పెళ్ళిచేసుకోగోరెతున్నాడని దుబాసీ చెప్పాడు. వాణ్ణి ఏదో రకంగా మోసం చేద్దామనే ఉద్దేశ్యంతో తన మేనగోడలి పెళ్ళి యిదివరకే యింకొకరితో నిశ్చయమైపోయిందని షెన్‌చెప్పాడు. పరిస్థితు లెలాగున్నా సరే ఆ పిల్లను తనకిచ్చి పెళ్ళిచేయవలసినదిగా గట్టిగా జపాను కమాందరు ఇయినో చెప్పాడనీ, ఎల్లుండి తప్పకుండా ఆ పిల్లను హిస్సే గ్రామానికి పంపమన్నాడనీ, అలా జేయకపోతే షెన్ కుటుంబాన్నంతనూ అరెస్టు చేసివేయమన్నాడనీ చైనాదేశీయుడయిన ఆ దుబాసీ చెప్పాడు.

దుబాసీ తాను తెచ్చిన కానుకలను షెన్‌గారి యింట్లో విడిచి వెళ్ళిపోయాడు.

ఖంగారుగా షెన్ చేతులు రుద్దుకుంటూ గదిలో అటూ యిటూ

పచారుజేయసాగాడు. అతనికి ఏమిచెయ్యాలో పాలుపోలేదు. అతనిది మంచి తెలివితేటలుగల బుర్ర. అయినప్పటికీ యీ సమయంలో అది కూడా మార్గాంతరాన్ని సూచించజాలకపోయింది.

మేయీ యీ కబురు వినగానే ఉద్రేకపడింది. తొందరగా గెరిల్లా హెడ్‌క్వార్టర్స్‌కు పోదామనుకుంది. కాని షెన్ ఆమెను వదలిపెట్టుటకు భయపడుతున్నాడు.

"ఏంజేద్దామనుకున్నావ్?" అని కోపంగా అడిగింది మేయీ. "నన్ను జపానువాళ్ళకు అప్పగిద్దామనుకుంటున్నావా? అలా చేశావంటే, జాయీ నిన్ను ఎన్నటికీ క్షమించదు" అన్నది.

బాధగా షెన్ కాళ్ళతో నేలను తాడించాడు. "ఏంజేయబోతున్నాను? ఇయినో నా మెడలమీద కూర్చున్నాడు. వాడెలాంటివాడో నీకు తెలుసు! నామీద వాడికి కోపమొస్తే నోటివెంట ఒక్కమాటను జారవిడిస్తే చాలు. వాళ్ళు నా పీకను ఉత్తరించేస్తారు! ఇదేమి వేళాకోళం వ్యవహారం గాదు" అన్నాడు షెన్.

"గాబరాపడబోకు" అన్నది మేయీ అతణ్ణి నోదార్చుతూ. "నేను హెడ్‌క్వార్టర్స్‌కు వెళ్ళిపోతాను. అక్కడ మేము యీ విషయాన్ని గురించి ప్లానువేస్తాం. ఏ విధంగానయినాసరే, నీకు హాని జరుగకుండా చేస్తాం. అలాచెయ్యటం బాగుండదూ?" ఆమె ఆ విధంగా ఒక గంటసేపు అతనితో మాట్లాడింది.

ఎలాగయితేనేం అతనికి యిష్టమున్నా లేకపోయినా ఆమె హెడ్‌క్వార్టర్స్‌కు తిరిగివెళ్ళుటకు ఒప్పుకున్నాడు.

మేయీ, బిగ్‌పాప్లార్ గ్రామం చేరింది. ఆ సమయంలోనే అక్కడ గెరిల్లాలు హిస్యేలియూ గ్రామాన్ని ఎలా పట్టుకోవాలాయని చర్చిస్తున్నారు. ఈ గ్రామం కోటను పట్టుకోవాల్సిన బాధ్యత బ్లాకీది.

అతడు యింతకుపూర్వమే ఆ గ్రామములో రహస్య ప్రజాసంఘాలను పునరుద్ధరించాడు. లీగల్ మార్గాలద్వారా రహస్యంగా పనిచేస్తున్న ఒక కామ్రేడ్‌ను మేయరు పదవికి ఎన్నికొనుటకు తోడ్పడ్డాడు. కోట

లోని కీలుబొమ్మ సైనికులు సహకరించుటకు యిష్టపడుతున్నారు. అయితే ఒక చిక్కు వుంది.

కొన్ని డజన్లమంది జపాను సైనికులు ఆ కోటలోవున్నారు. వాళ్ళు యీ కీలుబొమ్మ సైనికులను ఒక కంట కనిపెడుతూవున్నారు. భారీ ఆయుధాలన్నీ- అంటే, రెండు మెషిన్ గన్లుకూడా- జపాను సైనికుల చేతులలోనే వుంచబడినాయి. గెరిల్లాలు యీ కోటను పట్టుకోలేకపోతున్నారు.

ఈ కోటకు కమాండరు ఇయినో. వీడు మేయీమీద కన్నేశాడని మనకు యిదివరకే తెలుసు.

వీడెంత విషపుపుచ్చేయో, అంత జిత్తులమారి. "ఘనమైన జపాను చైనాతో ఒక కుటుంబం. సామ్రాజ్యవాదసేన బీదప్రజలను రక్షించుటకు వచ్చింది!" అని మాటిమాటికి చెప్పటమంటే వీడికి దాగా సరదా. కాని, రెప్పపాటులోపల తన క్రూరత్వానికి కళ్ళాలు సడలించివేస్తాడు. వాడు అంతులేకుండా చైనావాళ్ళను చంపేశాడు. తన చేతులారా యితరులను చంపటమంటే వాడికి చాలా సరదా.

వాడు మోకరించివున్న ఖైదీ మెడపై బిందెడు చన్నీళ్ళను పోయవలసిందిగా తన సేవకునికి ఆజ్ఞాపించేవాడు. అటుతర్వాత, తన సాము ఖడ్గాన్ని తీసుకొని ఖైదీ మెడను తెగవేసేవాడు.

"జపానుకు చైనాప్రజలంటే దయ. లేకపోయినట్లయితే, ఏనాడో చైనావాళ్ళందరినీ చంపేసేవి" అని మొరిగేవాడు.

ఇయినోతో సంఘర్షణ, వాడు పెళ్ళినిగురించి పట్టిన పట్టుగురించి మేయీ తన కామ్రేడ్స్‌తో చెప్పింది.

ఆమె యీ సమాచారాన్ని వారికి చెప్పగానే గెరిల్లాలందరూ కోపంతో గర్జించారు. ప్రశాంతంగా వుండవలసిందిగా వారిని ప్లాకీ కోరాడు. పరిస్థితితో సరితూగుటకుగాను ఒక పద్ధతిని ఆలోచించవలసిందిగా కోరాడు. ఈ విషయాన్ని బాగా చర్చించినతర్వాత ఒక ప్లాను వేశారు.

షెన్‌ను కబురంపారు. అతడు వెంటనేవచ్చాడు. కానివ్యూహంలో అతడు వహించవలసిన పాత్రను అతనికి వారు వివరించగానే అతడు తాత్సారంచేశాడు; తటపటాయించాడు. బహుశ భయపడివుండవచ్చు. అందు

వలన, గెరిల్లాలు అతని పాత్రను ప్లానునుండి పూర్తిగా తొలగించివేశారు తాత్కాలికంగా అతణ్ని బిగ్‌పాప్లార్ గ్రామంలోనే వుంచివేశారు. చెన్ గారి మేనగోడలి కుటుంబం యీ పెళ్ళికి పూర్తిగా అంగీకరించిందనీ. నిర్ణీత దినంనాటికి పెళ్ళికూతురిని పంపమని జాబువ్రాసి, ఒక మనిషి చేతి కిచ్చి పంపారు.

కామ్రేడ్‌ కర్టిలు, హడావుడిగా పెళ్ళిప్రయత్నాలు చేయసాగారు. కొన్ని ఏర్పాట్లు చేయుటకుగాను, బ్లాక్ ముందుగానే హిస్కేలియా గ్రామానికి పోయాడు.

* * * *

పెళ్ళినాడు, ఐదునెనిమిదేళ్ళ వయస్సుగల రియూ పెళ్ళికూతురు వేషాన్ని వేశాడు. పెద్ద విగ్గు పెట్టుకున్నాడు. పూలు అద్దబడిన సాటిన్ జాకెట్ వేసుకొన్నాడు. ఎత్తయిన మడిమలుగల చెప్పులు వేసకొన్నాడు. పెదిమలకు రంగువేసుకొన్నాడు. ముఖానికి పౌడరు, రంగూ వేసుకున్నాడు అందమైన పెళ్ళికూతురులాగున తయారయ్యాడు. అతని తలకు ఎర్ర ముసుగు వేయబడింది. నడుముకట్టులోపల ఒక పిస్తోలు దాచుకొన్నాడు.

పెళ్ళికూతురుకు దాసిగా వ్యవహరించుటకు వచ్చుకున్న మిస్ చెన్ చాలా చక్కగా అలంకరించుకొంది. యీనాడు బిగ్‌పాప్లార్ గ్రామానికి మేయరైన మిష్టర్‌పి, పెళ్ళికూతురు సోదరుడిగా వ్యవహరించబో తున్నాడు.

అతడు సరిక్రొత్త దుస్తులను ధరించాడు. నెత్తికి మిలమిలా మెరిసే టోపీ పెట్టుకొన్నాడు. బంధుకోటి ప్రతినిధులుగా బాలూ కౌంటీ ప్రజాసైన్యంనుండి నలుగురు పెద్దలు వెళ్ళారు. ఆ ఆరుగురూ, తమ దుస్తులలో ఆయుధాలను దాచుకొని బయలుదేరారు.

తమతమ విధులను నిర్వహించుటకుగాను అప్పటికే యితర కామ్రేడ్స్ బయలుదేరిపోయారు. ఆ సాయంత్రం బారెడు ప్రొద్దున్నదన గానే పెళ్ళివారు పడవలో బయలుదేరారు; సరస్సును దాటారు. పెళ్ళి

వారిని ఆహ్వానించుటకై హిస్యేలియూగ్రామం ఆనకట్టమీద, ఆ గ్రామం యొక్క క్రొత్త మేయరైన వాంగ్, నలుగురు మేళగాళ్ళు, అనేకమంది జపానువాళ్ళు, కీలుబొమ్మ సైనికదళ మొకటి, ఎదురుచూస్తున్నారు. చక్కగా అలంకరించబడిన పెళ్ళికూతురు మేనా, ఒకటి రెండు చిన్న మేనాలు సిద్ధంగా వున్నాయి.

పెళ్ళివారి పడవలు వొడ్డుదగ్గరకు రాగానే, వాళ్ళను చూడమని కోటనుండి కీలుబొమ్మ సైనికులు పరుగెత్తుకొనివచ్చారు. దగ్గరలోనే బెస్తవాళ్ళు కొంతమంది, చిన్న పడవలలో నిలబడి, చిత్రంగా యీ దృశ్యాన్ని కళ్ళార్పకుండా చూడసాగారు. వాళ్ళు "వూ! వూ! హో." అంటూ తమ చేతులలోనున్న పక్షులను వదిలారు. ఆ చెరువుకాకులు గాలి లోనికి ఎగిరెగిరిపోయాయి. గిరగిరా వంకరటింకరగా పల్టీలుకొట్టాయి. నీళ్ళలోనికి దుమికాయ్. వెండిలాగున మెరుస్తున్న చేపలను పట్టుకోటాని కని లోపలికిపోయాయి. చేపలను పట్టుకొని తమ యజమానుల పడవల మీదకు గొనివచ్చే విధంగా ఆ పక్షులకు తర్ఫీదు యివ్వబడింది.

పెళ్ళివారు ఆనకట్ట ఎక్కుతూవుండగా, హిస్యేలియూ గ్రామం యొక్క క్రొత్త మేయరూ, బిగ్‌పాప్లార్ గ్రామం మేయరూ కుశల ప్రశ్నలు వేసుకొన్నారు. పెళ్ళికూతురు పెద్ద మేనాలో ఎక్కుటకు సహాయపడిన తర్వాత, మిస్ చెన్, మిష్టర్ మీ, తమకొరకు ప్రత్యే కించబడిన చిన్న వాహనాలలోనికి యెక్కారు. మేళగాళ్ళు కమ్మగా పాడసాగారు. సైనికులు వెంటరాగా పెళ్ళివారు గ్రామములో ప్రవేశించి నారు.

కోటమీద ఒక పెద్ద జపానుజెండా ఎగురుతూవుంది. దానికి దగ్గ రలోనున్న ఆవరణలో తన తాత్కాలిక నివాసాన్ని యేర్పాటుచేసు కొన్నాడు. ఆ ఇంటిముందు కాపలావాళ్ళను పెట్టాడు. ఆ ఇంటికిపోయే దారులన్నీ సిగరెట్లు, బిళ్ళలూ అమ్మేవాళ్ళతోనూ, యీ వింతను చూడ టానికని తండాలు తండాలుగా వచ్చినజనంతోను నిండిపోయాయి.

మేనాలు గేటువద్ద ఆగగానే ఇయినో, మరిద్దరు జపానువాళ్ళు పెళ్ళివారిని ఆహ్వానించుటకు వచ్చారు. దుక్కలాగున బలిసివున్న ఆ

పొట్టి పెళ్ళికొడుకు పాశ్చాత్యుని మాదిరిగా నల్లదుస్తులు వేసుకున్నాడు. తెల్లనిషర్టు వేసుకున్నాడు.

బల్బులాంటి వాని విస్కీరంగు ముక్కు మరింత ఎర్రగా వుంది. ఇకిలింతగా పళ్ళన్నీ బయటపెడుతూ అతిథులను ఆహ్వానగదిలోనికి తీసుకొనిపోయాడు.

పెళ్ళికూతురుని చూడాలని పట్టుబడుతూ చాలామంది జపానువాళ్లు మూగారు. నా చిరునవ్వును పొలకబోస్తూ మిస్టర్ మీ జోక్యం కలుగజేసుకొని "మహాశయులారా! చైనా సాంప్రదాయాలను అనుసరించి మీరు బురఖాను తొలగించకూడదు!" అన్నాడు.

హిస్యేలియూగ్రామం మేయరైన వాంగ్ మిస్టర్ మీని పెళ్ళికూతురు దాయాదిగా పరిచయంజేశాడు. ఈ సమయంలో మిస్ చెన్ "పెళ్ళికూతురుపిల్ల"ను పెళ్ళిగదిలోనికి తీసుకొనిపోతుంది. రియూకి బాగా కనపడటంలేదు. ఎందువలనంటే అతనికి వంటినిండా ముసుగువుంది. అంతేగాక అతనికి ఎత్తుమడమల బూట్లు అలవాటులేదు. గుమ్మంలో కాలుజారి పడిపోయేవాడు. కాని యింతలోనే అతన్ని మిస్ చెన్ పట్టుకుంది. అతన్ని పట్టుకొని పడకగదిలో కూర్చుండబెట్టేసరికి ఓచరైన మిస్ చెన్‌కు ముచ్చెమటలు పోసినాయి.

ఇయినో అభిప్రాయాల ననుసరించి పడకగది చక్కగా అలంకరించబడింది. ఒక యినుపమంచం, దోమతెరలు, పెద్ద అద్దం, ఒక సోఫా.... జపానువాళ్ళముటా ఒకటి లోపలికి తోసుకొనివచ్చింది. పరుపు చివర కూర్చునివున్న పెళ్ళికూతుర్నిజూచి నవ్వసాగారు.

"మీరంతా వెంటనే వెళ్ళిపొండి. మా పిల్లసిగ్గుపడుతూ వుంది!" అని ఆజ్ఞాపించింది మిస్ చెన్.

"అందరూ బయటకు! అంతా బయటకు" అని జపానువాళ్ళను బయటకుతోస్తూ మిస్టర్ మి నవ్వసాగాడు.

చీకటిపడింది. భోజనాలశాలలో అద్భుతంగా లైట్లు వెలుగుతున్నాయి. చైనాదేశీయులైన అతిథులు, జపానువాళ్ళయిన అతిథులూ బల్లచుట్టూ మూగారు. మీరు ముందుంటే మీరుముందంటూ అతివినయాన్ని ప్రదర్శించారు. అందరూ కూర్చున్న తర్వాత వడన ప్రారంభమయింది. కోడిపిల్లలు, బాతులు, చేపలూ, విస్కీ, బీర్ పానీయాలబరువుతో బల్లలు మూల్గసాగాయి.

"మీరు చైనాపిల్లను పెళ్ళిచేసుకుంటున్నారు. అందువలన చైనా సాంప్రదాయాలను అనుసరించాలి! మనమీనాడు అమితంగా త్రాగాలి!" అన్నాడు ఇయినోతో మిస్టర్ మి.

అమిత సంతోషంగా ఇయినో ఇకిలిస్తూ నవ్వుతున్నాడు. ఆ యికిలింతవలన వాడికళ్ళూ, ముక్కూ ఒకే కొయ్యముక్కపై అతికించబడినట్లుగా వున్నాయి. వాడు గ్లాసు చెల్లగా గ్లాసు సారాయాన్ని తాగసాగాడు. హిస్కేలియూగ్రామ మేయరైన వాంగ్ సారాయాన్ని ఇయినో గ్లాసులో పోయసాగాడు. వాడి గ్లాసు ఖాళీగావుండకుండా చూశాడు. ఇయినో తప్ప త్రాగాడు. తతిమ్మా జపానువాళ్ళుకూడా తప్పత్రాగారు. ప్రక్కగదిలో నున్న తప్పవహోదాకుజెందిన కీలుబొమ్మ ఆఫీసర్లుకూడా పందాలు వేసుకొని తప్పత్రాగుతున్నట్లు కేకలు, నవ్వులు వినిపిస్తున్నాయి.

జపానువాళ్ళు త్రాగినకొలది మరీ అల్లరిగా తయారయ్యారు. బుడ్లకుబుడ్లు త్రాగసాగారు. గంతులువేయసాగారు. అందులో ఒకడు తూలుతూ లేచాడు. వాడిముఖం మండిపోతూవున్నది. తన బొక్కాను విప్పదీసివేశాడు. గది మధ్యభాగంలో నాట్యమాటసాగాడు. పందికళ్ళు లాంటి చిన్నకళ్ళను త్రిప్పుతూ, చేతులువూపుతూ బొంగురుగొంతుకతో పాటపాడ సాగాడు. తక్కిన జపానువాళ్ళందరూ తమ గ్లాసులను చెంచాలనూ తీసుకొని దరువేయసాగారు. అందరూ కంటాలువిప్పి పాడసాగారు.

బల్లలమీద గ్రుద్దటం, గ్లాసులు, ప్లేట్లు బద్దలుగొట్టటం ప్రారంభమయింది. ఉన్మత్తులాగా జపానువాళ్లు పిచ్చిగల్లంతు చేయసాగారు.

జపానువాళ్ళపై ద్వేషంతో గెరిల్లాలకళ్ళు మండసాగాయి. వారు జపాను వాళ్ళ పిచ్చిగల్లంతును జూస్తూ కూర్చునారు.

*  *  *  *

[illegible] పాంగ్ భార్య వంటగదిలో సహాయపడుతూ వున్నది. ఆమె రియూకు, మిస్ చెన్‌కు కొంత ఆహారాన్ని పంపింది. వారు ఆహారాన్ని తొందరగా మ్రింగివేశారు. మిస్ చెన్ ఆయిల్‌లాంపు వెలిగించింది. కాని వత్తిని తగ్గించింది

"వాడు వచ్చేవేళయింది. పట్టుబడబోకుసుమీ!" అని రియూకి మెల్లగా చెప్పింది.

"నేను నా పని పూర్తిచేసేలోపల మీరేమి చేయరా? ఏదయినా పొరబాటు జరిగితే. నన్ను విడచి పారిపోకండి" అని అతడు మెల్లగా హెచ్చరించాడు.

"మే మలాంటి పనెందుకు చేస్తాం?" నీ పనిని నీవు బాగా చెయ్యి. ప్రక్కగదిలోవున్న కుర్రాళ్ళుపని వాళ్ళు బాగా చేస్తారు" అని నవ్వుతూ జవాబు చెప్పింది మిస్ చెన్.

కొద్దినిమిషాలు గడచిన తర్వాత ఆ గదిలోనికి తూలిపోతూవున్న ఇయినోను యిద్దరు జపానువాళ్లు మోసుకొనివచ్చి సోఫాలో దించారు. వారు పెళ్ళికూతురును జూచి యికిలించి వెళ్ళిపోయూరు. వాళ్ళవెంటపోతూ మిస్ చెన్ తలుపును మూసేసింది. అందముగా తలవంచుకొని పరుపు చివర కూర్చున్నాడు రియూ. ఆ గదిలో గ్రామఫోను పాడుతూవున్న ధ్వని బయటవాళ్ళకు కొద్దిగా వినపడుతూవుంది.

ఇయినో సగంమత్తులో సోఫామీద వెన్నువాల్చాడు. మూర్ఖంగా నవ్వుతూ, రెప్పలార్పుతూ తన పెళ్ళికూతురువంక చూడసాగాడు. సగం సిగరెట్ పీల్చి ఆర్పేశాడు. సోఫాలో తన ప్రక్కస్థానాన్ని జూపి తట్ట సాగాడు.

"రా! రా! ఇక్కడ కూర్చో!"

రియూ గుండెలు కొట్టుకొంటున్నాయి. కాని అతడు జవాబు చెప్ప

లేదు. దీనిని సాధారణంగా కన్యకువుండే సిగ్గుగా ఇయినో భావించాడు. గాడిదలాగా నవ్వుతూ తన పచ్చని పళ్ళనీన్నీ బయటపెట్టాడు. రియూ మరింత వెనుకకు పరుపుమీద పాకిపోయి తన రొమ్ముల్లో దాచుకొన్న చిన్న పిస్తోలును జాగ్రత్తగా చేతులలోకి తీసుకొన్నాడు. ఇయినోకి కామ జ్వరం తలకెక్కిపోయింది ముందుకువంగి, రియూ కాలిని లంకించుకొన్నాడు ఇయినో. రియూ ఆ జపానువాడిమీద కాల్చాడు. కాని పెనుగులాటలో గురితప్పింది. బిత్తరపోయి, ఇయినో నోరు తెరచుకొని చూడసాగాడు. వాని తలకు గురిచూచి పేల్చాడు రియూ. ఇయినో తల చక్కలయింది

తుపాకిగుళ్ళ ధ్వని వినగానే అకస్మాత్తుగా చైనాదేశీయులయిన "పెళ్ళికివచ్చిన అతిథులందరూ" తమ తుపాకులను బయటికి లాగినారు బల్లలను పడదోశారు. ఆయుధాలుగల ప్రతి శత్రువుమీదనూ తుపాకీ గుళ్ళవర్షన్ని కురిపించారు. జపానువాళ్ళకు తమ పిస్తోళ్ళు బయటికి లాగుటకు ఒక్కక్షణమయినా వీలుచిక్కలేదు. తుపాకిగుళ్ళకు ఎరయై జపాను వాళ్లు ఒక్కరొక్కరే చనిపోయారు. భయంతో కీలుబొమ్మలు నేలమీద దొర్లారు. జపానువాళ్ళను చంపుతున్నప్పుడే గెరిల్లాలు, చైనా దేశద్రోహులకు కేకవేసి చెప్పారు. "లొంగిపోయి బ్రతుకండి!" ఆ సలహాను కీలుబొమ్మలు వెంటనే అమలుజరిపారు.

ప్రచ్ఛన్నవేషంలోవున్న జిల్లా కౌంటీ ప్రజాసైనికులు డజన్ల కొల గోడలెక్కి ఆవరణలోకి దూకారు. జపానువాళ్ళపని పట్టించసాగారు గేటు కాపలాదారులుగావున్న యిద్దరు జపానువాళ్లు తుపాకులు తీసుకొని లోపలకు పోవుటకు యత్నించగా వాళ్ళను "బిళ్ళలు, సిగరెట్లు అమ్మే వేషంలో" వున్న గ్రామ కార్యకర్తలిద్దరు షూట్‌చేసి చంపారు.

చంద్రోదయమింకా కాలేదు. అందువలన యింకా బాగా చీకటిగా వుంది. గ్రామంలోని యితర ప్రదేశాలలో ఆ చీకటిలో కార్యకలాపాలు బాగా జరుగుతున్నాయి సరస్సులోని "చెరువుకాకి బెస్తవాళ్లు" పిస్తోళ్ళను చేతబుచ్చుకొని ఎక్కారు. దేవాలయంలోని ఒకముఠా "పనివాళ్లు" అదే విధంగా సాయుధులయ్యారు. అందులో ప్రతిఒక్కడూ జిల్లా ప్రజాసైన్యా

నికి చెందినవాడో, లేదా స్థానిక గ్రామగెరిల్లాదళానికి చెందినవాడో. కీలుబొమ్మలతో కోటవిషయంలో ఛాకీచేసిన ఏర్పాట్లు చక్కగా పనిజేయసాగాయి. లోపలినుండి బయటినుండి వత్తిడిచేయగానే ఒక్క తుపాకి గుండు పేల్చకుండా కోట గమ్మున లొంగిపోయింది.

ఇంటిలో కాల్పులు ఆగిపోయినాయి. కీలుబొమ్మ జూనియర్ ఆఫీసర్లందరూ యేదో ఒక సమయంతో ఛాకీచే "సూచనలు" పొందినవారే. అందువలన చాలా సైనికులు కాల్పులు ప్రారంభించగానే వారు తమ ఆయుధాలను వదిలిపెట్టారు. చచ్చిన, గాయపడిన జపానువాళ్ళతో నేల నిండిపోయింది. చావగా మిగిలిన జపానువాళ్ళలో కొంతమంది మోకాళ్ళమీదపడి తమ ప్రాణాలను రక్షించవలసినదిగా ప్రాధేయపడసాగారు. బల్లలక్రిందదూరిన కొంతమంది జపానువాళ్ళను బయటకు లాగాల్సివచ్చింది. మరికొంతమంది కిటికీ అద్దాలను బద్ధలుజేసుకొని బయటకుదూకారు. కాని వారు ఆవరణలోనే పట్టుబడ్డారు.

గదియంతా చెత్తకుండీలాగా తయారయింది. బద్దలైన కుర్చీలు, బల్లలూ, ప్లేటులు అన్నీ చిందరవందరగా పడివున్నాయ్. రియూ గెరిల్లాలతో వచ్చి చేరాడు. గెరిల్లాలు ఆయుధాలకోసం పూర్తిగా సోదా చేస్తున్నారు. రియూ విగు ఎక్కడో పడిపోయింది. క్రిందజారి సనందుగా అలంకరించుకొన్న స్త్రీవేషం, పైన బోడితల, ఛిలే నవ్వుపుట్టించేటట్లుగా వున్నాయి. ఒక కాలిబూటు వూడిపోయింది. ఆ కాలినుండి పెద్ద మేజోడు వ్రేళ్ళాడుతూవుంది. ఇప్పుడు అనుకొన్న ఫార్సు అయిపోయింది. యీ వేషంలో వుండటం రియూకి కష్టంగావుంది. ఒకమూల పెద్దకోటు కనబడింది. దానిని ధరిద్దామని అక్కడికి పోయాడు. అది కదలసాగింది. రియూ వళ్ళు జలదరించింది. జాగ్రత్తగా అతడు తన తుపాకి చివరతో ఆ కోటు లాగాడు. కోటు వ్రేలాడుతున్న గడమీద కోతిలాగా కరచి పట్టుకొని ఒక జపాను సైనికుడు వున్నాడు. వాడు గజగజా వణికిపోతున్నాడు.

"కిందకు రారా!" అని అరచాడు రియూ।

ఆ జపానువాడు కుప్పలా కూలాడు. వాడెవడోగాదు; ఆ సాయం

త్రము తెగత్రాగి మత్తెక్కి మొట్టమొదటగా అసహ్యంగా చిందులాడిన జపానువాడే.

వీధులలో జయగణధ్వని బయలుదేరింది. పిల్లలూ, పెద్దవాళ్ళూ, స్త్రీలూ, పురుషులూ దివిటీలు, తట్టలు, పలుగులు, పారలూ పట్టుకొని కోటవైపు బయలుదేరారు. తెల్లవారేసరికి ఒక్క పెంకుముక్కయినా మిగలకుండా ఆ గ్రామస్థులు కోటనంతా త్రవ్వి ఎవరికి కావలసింది వారు తమతమ ఇళ్ళకు మోసుకొనిపోయారు. ఇదివరకు కోటవున్న తావులో ఇప్పుడు ఖాళీస్థలంమాత్రం మిగిలింది.

గెరిల్లాలు హిస్యేళియా గ్రామంలో సాధించిన విజయం పరిసర గ్రామాలలోని కీలుబొమ్మ సైనికుల ఆత్మవిశ్వాసాన్ని బాగా సడలించి వేసింది.

"వేడిగావున్నప్పుడే బజాయించాలి" అని కార్యకర్తలు రైతులతో చెప్పారు. "దీనెమ్మ! ఒక్కమాసంలోనే మిగతా కోటలన్నిటినీ తుడిచివేద్దాం," అన్నారు.

కొద్దిరోజులు గడిచిన తర్వాత మేయీ షెన్‌జ్యాగ్రామంలోని కార్మికుల, కర్షకుల యూనియన్లనూ, బాలసంఘాలనూ, యువజనసంఘాలనూ, మహిళాసంఘాన్నూ సమీకరించింది. వాళ్ళందరూ ఉత్సాహంగా చేతికి దొరికినదాల్లా—ఆయుధంగా ఉపయోగపడే ప్రతివస్తువునూ పుచ్చుకొని బయలుదేరారు. దాస్వే జిల్లాప్రజాసైన్యంలోని ఒకభాగాన్ని కొత్తగా షెన్‌జ్యాగ్రామంలో ఏర్పాటుచేసిన గ్రామసైన్యాన్ని సమావేశపరచాడు. చీకటిపడగానే, యీ మానవ సముద్రము కోటవైపునకు తరలింది....

ఏమిజరుగుతున్నదీ కమాండర్ పెద్దకాకికి, వాని అనుచరులకు బోధపడకపోయింది. వాళ్ళు భయతో గజగజ వణికిపోయారు. తన ముఖాన్ని చూపించుటకు భయపడి, బురుజు గోడలచాటున తలదాచుకొని పెద్దకాకి అరవసాగాడు.

రైతు స్నేహితులారా! బాలూ కామ్రేడ్స్! మనమంతా ఒక కుటుంబం! మీ మనసులలో యేదైనావుంటే వెంటనే చెప్పివెయ్యండి!"

"ఒరేయ్! మీ రిక్కడ చాలాకాలంనుండి వుంటున్నారురా! ఖాళీ చేయాల్సినకాలం వచ్చింది! బయటకురండి! మేం కోటను ముట్టుపెట్టవలచాం" అని ప్రజలు అరచారు.

"పెద్దకాకీ! మా గోధుమపిండిని మేమేతినదలచాం! మీరు మీ యిళ్ళకుపొండి! మరల రైతులుగా బ్రతకండి!"

"ఆ కోటకు వుపయోగించిన రాళ్ళూ, రప్పలూ, పెంకులూ, మా కొంపలనుండి తెచ్చినవి — వాటిని మళ్ళీ మేం తీసుకొనదలచాం!" అని ప్రజలు అరవసాగారు.

తాను నేర్పిన పాటపాడుతూ, పాడిస్తూ మేయీ తన దళాలను నడుపుకొనిపోయింది.

"పక్షులు వెలుతురువై పెరుగునోయ్ !
మానవుడు జీవితమార్గాన్ని నడవాలోయ్ !
విదేశీయులబానిసవు కాబోకుమా !
జపానువాడికుక్కవు గాబోకుమా !
మనసు మార్చుకో !
కొత్తమనిషివి కమ్మోయ్ !
త్రిప్పేయుము నీ తుపాకి !
మా నేస్తానివి కమ్మోయ్ !

పాట ముగియగానే దాస్వే "పెద్దకాకీ!" అని అరచి చెప్పసాగాడు. "హిస్పేలియూగ్రామంలోని జపానువాళ్ళు ఏవిధంగా నాశనమయినదీ విన్నావుగదా! మన దేశస్థులను చంపటం మా కిష్టంలేదు. అందుకని దిగిరా. మీ తుపాకులను మాకిచ్చెయ్యండి. సామానులను ప్రజలకు వాపసు చెయ్యండి. మనమంతా చైనావాళ్ళం. చైనావాళ్ళపక్షానికేవచ్చేయ్!"

"ఒక్కనిమిషమాగండి!" అని జవాబు చెప్పాడు ఆ కమాండరు "మా మనుషులతో మాట్లాడుతాను!" అన్నాడు.

ఆగాలన్న కోర్కెలేదు కీలుబొమ్మలకు. వాళ్ళకంఠాలు వీధులలో వున్నవాళ్ళకు వినిపించసాగాయ్.

"మాట్లాడాల్సిన అవసరం యేముంది? క్రిందకు పోవాలంటే పోవ

టమే. అంతేగాని ఆగటమెందుకు? పోరాడంపదండి! ఈ విధంగా జీవించు టంటే నాకెప్పుడో రోతపుట్టింది!"

"ఈ కోటలో కుళ్ళిచావటంకూడా ఒక జీవితమేనా? శాశ్వతంగా యిక్కడే పడి చావమంటావా?"

"మేమంతా సిద్ధంజేసివుంచాం! ఈ శుభదినంకోసమే యెదురు జూస్తున్నాం!"

ఆ సైనికులు వెంటనే తుపాకులన్నింటినీ చక్కగా కట్టకట్టారు. వాటిని, తుపాకిగుళ్ళ బెల్టులను, చేతిబాంబులనూ పదిలంగా తాళ్ళమీద క్రిందివారికి అందించారు. ఈ దృశ్యాన్నిజూచి కొంతమంది రైతులు చప్పట్లుకొట్టారు. వేలాదిప్రజలు వాటిననుసరించారు. కొద్దినిమిషాలలో గ్రామమంతా సంతోష కరతాళధ్వనులతో మారుమోగిపోయింది.

"రండి! దయచేయండి! స్వదేశీయులారా!.... పెద్దకాకికి మీరు బుద్ధిచెప్పినందుకు మేం చాలా సంతోషిస్తున్నాం!....ఈనాడు మా యింటికి వచ్చి గోధుమపిండి పంటకాలు తినిపోవలసిందిగా ఆహ్వానిస్తున్నాం!"

ఆ మరుసటి రెండువారాలలో హ్వాంగ్‌హ్వ, హోజాంగ్, డంగ్స్యూ గ్రామాలలోనూ, అనేక తదితర గ్రామాలలోనూవున్న కోటలలోన కీలు బొమ్మలు పైవిధంగానే "బయటకు పిలిచివేయబడ్డారు."



337

# 15 అధ్యాయం

1942 సంవత్సరములో జపాను సామ్రాజ్యసేనల చక్రబంధాన్ని తప్పించుకొన్న చైనా కమ్యూనిస్టుసైన్యం, తదుపరి మాసాలలో శత్రు ఆక్రమితప్రాంతానికి బయటప్రాంతంలో అనేక విజయాలను సాధించినది. శత్రుశ్రేణుల వెనుకభాగంలో స్థానిక కమ్యూనిస్టుపార్టీ యూనిట్లు ప్రజలను సమీకరించాయి.

విజయవంతంగా అనేక పోరాటాలను నడిపాయి. ప్రతితావులోనూ శత్రువుల బలం విచ్ఛిన్నం కాసాగింది. జపానువాళ్ళ 'సర్వవినాశకదండయాత్ర' పూర్వపుస్థితికి పరిస్థితులు వచ్చాయి. గ్రామీణప్రాంతాలలో ప్రతిఘటనశక్తులు బలపత్తరంగా తయారయ్యాయి. గ్రామాలలో ప్రజాప్రభుత్వపు అధికారం నానాటికి బలపడసాగింది. సైనికసామగ్రి మరింతఅధికమయింది.

ఏమైనప్పటికి జపానువాళ్ళ అధికారం ఉచ్ఛదశలో నున్నకాలంలో భూస్వాములు తమ పనులను చక్కబెట్టుకొనసాగారు. రైతాంగప్రజలు గుంజుకొన్న భూమిని భూస్వాములు మరల వారివద్దనుండిగుంజుకొన్నారు అంతేగాక రైతాంగ ప్రజలనుండి అదనంగాకూడా భూమిని గుంజుకొన్నారు. బలాత్కారంగా పాత కౌలు బకాయీలనుకూడా వసూలుజేశారు. రైతులనుండి ఆహారాన్ని దోచేశారు.

మానవుడు తినాలి, మానవునికి తినటానికి వుండాలి. జపాను

సామ్రాజ్యవాద సేనలను ఎదిరించి పోరాడాలంటే కడుపునిండా తిండి వుండాలి. కాలుతున్న కడుపుతో ఎవరూ పోరాడజాలరు! ప్రజాతంత్ర ప్రభుత్వం పునరుద్ధరింపబడగానే కౌలుధనం తగ్గింపు కార్యక్రమాన్ని ప్రారంభించాలని, ప్రజాప్రభుత్వాన్ని ప్రజలు డిమాండుచేశారు. ఈ కౌలు ధనం తగ్గింపు వుద్యమాన్ని నడుపుటకుగాను, జిల్లా ప్రజాప్రభుత్వంలో ని కౌంటీ ప్రజాప్రభుత్వంలోని కార్యకర్తలు గ్రామీణప్రాంతాలకు బయలు దేరారు.

ఈ కార్యక్రమాన్ని అమలుజరిపే క్రమంలోనే దాస్వే, మేయీల మధ్య అభిప్రాయభేదాలు ఏర్పడ్డాయ్.

వాళ్ళిద్దరూ తమకు పెళ్ళిజేసుకోవాలనే అభిలాష కలదని బ్లాకీతో చెప్పారు. అతడు వారి పెళ్ళి ఏర్పాట్లుచేయుటకు సహాయపడదామని అనుకున్నాను. కాని, అతనికీ తలమున్కలుగా పనులుండుటచే ఏ విధంగా వారికి తోడ్పడలేకపోయాడు. చెరియొక గ్రామంలో పనిచేయుచుండుటచే ఆ ప్రేమికు లిద్దరూ ఒకరినొకరు కలుసుకోవటం చాలా అరుదైపోయింది.

మేయీ షెన్‌జ్యాగ్రామంలో పనిజేస్తూవుంది. ఆమె ఒకనాడు రైతుప్రతినిధులను వెంటబెట్టుకొని కౌలుధనం తగ్గింపువిషయంలో షెన్‌తో చర్చించుటకై అతని యింటికి పోయింది.

షెన్‌కు చాలా భూమివుంది. అతడు తన భూమిలో చాలాభాగం కౌలుకిస్తూ వుంటాడు. షెన్ మేయీని, రైతుప్రతినిధులను మహదొడ్డగా ఆహ్వానించాడు. వాళ్ళందరికీ నమోవాకాలు పలికి, ఆసనాలు చూపించాడు; వచ్చిన పని ఏమిటని అడిగాడు. కౌలుధనం తగ్గింపు విషయంలోమాట్లాడటానికై వచ్చామని వారు చెప్పారు.

షెన్ ఆప్యాయంగా నివ్వాడు. "మంచి కార్యక్రమం అది. నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. యధార్థానికి, నే నీ కార్యక్రమాన్ని ఆహ్వానిస్తున్నాను.మనం తప్పకుండా ఒక నిర్ణయానికి రాగలమనుకుంటున్నాను- నాకు పూర్తిగా నమ్మకముంది" అన్నాడు షెన్.

షెన్ సహకారవైఖరినిజూచి ప్రతినిధులు మెచ్చుకున్నారు. వారు కొంత పట్టువిడిచారు. అంత కష్టమైన పని కాదని అనిపించింది వారికి.

"మిష్టర్ షెన్, మీరు అంగీకరిస్తున్నారు. కాబట్టి చాలాబాగుంది. మన మే విధంగా నిర్ణయానికి రావాలో ఆలోచిద్దాం" అన్నారా ప్రతినిధులు.

ఆ భూస్వామి, పైకి ఆ విధంగా ఒక గొప్ప అభ్యుదయవాదిగా మాట్లాడినప్పటికీ, యథార్థాని కతడు కాలయాపన చేద్దామని అనుకుంటు న్నాడు. ఎందువల్లనంటే మళ్ళీ గాలి ఎటు వీచనున్నదో అతడు ముందు గానే కొంత సమాచారాన్ని పోగుజేసుకొన్నాడు. దానికొరకు యత్నాలు కూడా జరుపుతునే అట్టిపెట్టుకొన్నాడు

నౌకర్లు వచ్చారు. భోజనపు బల్లలను అమర్చారు. అతి అందంగా నవ్వుతూ షెన్ లేచాడు. భోజనబల్లవైపు చేయి చూపుతూ జూపుతూ షెన్ తన వేడికోలు ప్రారంభించాడు.

"మహాశయులారా! మీరు రాకరాక మా యింట్కి వచ్చారు. ఈ దాసునిది ఒక చిన్నకోర్కె వుంది; అది తీర్చగలరనే ఆశిస్తున్నాను. మీరు మా యింట యీ పూట నా ఆతిథ్యాన్ని స్వీకరించాలని కోరుకుంటున్నాను" అన్నాడు.

ప్రస్తుత పరిస్థితులలో భూస్వామి యింట విందారగించటం అంత శ్రేయస్కరం గాదని మేయీ భావించింది; "ఆలస్యమవుతూంది. పోదాం పదండి! మనం యిక్కడ మన పని పూర్తిచేసుకొన్నతర్వాత యింకా చాలా తావులకు పోవాల్సివుంది" అన్నది మేయీ.

"కామ్రేడ్ మేయీ" అని వుల్లాసంగా పరిహాసంచేస్తూ షెన్ ప్రారంభించాడు.

"పనితోపాటు తినటం అనేది మీకులేదా? మీకు ఆకలివేయకపోతే యీ పెద్దలకు ఆకలి వేస్తూవున్నది. వారికి లేకపోతే నాకు వేస్తూవుంది! మనం భోజనంచేస్తూ ఎందుకు మాట్లాడుకోకూడదు?" అన్నాడు. మేయీ యింకనూ తటపటాయిస్తూనేవుంది. అన్యాయంజరిగినవాడిలాగున అతడు ఆమెను నొక్కసాగాడు. "మీరు ఈనాడు నా యింట్లో భోజనంచేయుటకు యిష్టపడకపోతున్నారంటే నేనంటే మీకు యిష్టంలేదని భావిస్తాను. జపానువాళ్ళు షెన్‌జ్యాగ్రామంలో వున్నప్పుడు మీరు మా యింట్లో తర చుగా భోజనంచేస్తూ వుండేవారు. ఆ రోజులలో మీరు నన్ను పరాయి

వానిగా చూడలేదు! యీ రోజున మీరు మరియొకచోట భోజనంచేదామనుకుంటున్నారంటే సిగ్గుతో నా ముసలితలను ఎక్కడ పెట్టుకోవాలి?"

మేయీ జవాబు చెప్పేవరకు షెన్ ఆగలేదు. ఆమెను మెల్లగా బల్లసద్ద ముందుగా కూర్చోబెట్టాడు. అతని కోపావేశానికి మేయీ కొంత తత్తరపడింది. ఎదురు జవాబు చెప్పలేకపోయింది.

"ప్రతివొక్కరినీ ఆహ్వానించమంటారా? మహాశయులారా!" అని షెన్ ఆ ప్రతినిధులను సంబోధించాడు. "మనమంతా ఒకరినొకరు బాగా ఎరుగున్నవాళ్ళం. మీలో కొంతమంది నా పైతరానికి జెందినవారు, కొంతమంది ఉన్నతరానికి జెందినవారై వుండవచ్చును - ఏమయినప్పటికీ మనమంతా ఒక కుటుంబంవారం; దయచేసి కూర్చోండి!" అన్నాడు.

మేయీ ఒప్పుకున్నట్లు కనపడింది కాబట్టి, ఆ ప్రతినిధులు నిరాకరించలేకపోయారు. వారు బల్లచుట్టూ కూర్చున్నారు.

ఆరోజున షెన్ సాధారణ రైతుదుస్తులు ధరించాడు. వాని మాటల ధోరణి, రూపం భూస్వామితరహాగాలేవు. భోజనసమయంలో అతిథులందరిలోపాటు తాగాడు. వాళ్ళతో పిచ్చాపాటి చెప్పసాగాడు. భోజనసమయంలో అతను మేయీని, ప్రతినిధులను పొగడినాడు. జపాను వాళ్ళకు వ్యతిరేకంగా తానేవిధంగా కష్టపడి పనిచేసిందీ చెప్పసాగాడు. షెన్ యథార్థంగా తమలోనివాడేయని అతిథులు భావించసాగారు. వాళ్ళు తమ జాగ్రత్తను సడలించారు.

ఆవిధంగా షెన్ తాను చెప్పదలచిన విషయాలన్నింటినీచెప్పి నెమ్మదినెమ్మదిగా వాళ్ళమనస్సులను ఆక్రమించుకొన్నాడు; తదుపరి కౌలు ధనం తగ్గింపువిషయాన్ని ప్రస్తావించాడు. తన పరిస్థితిని గురించి వాపోసాగాడు.

"నా పరిస్థితులు మీ కందరికీ తెలుసు. పేరుకు నేను భూస్వామినేగాని, నా పరిస్థితులు చాలా క్లిష్టంగావున్నాయి. యథార్థానికి నా పరిస్థితి మీకన్న కొద్దిగా మెరుగుగావున్నది. మీకు అనుకూలమైనవిధంగా కౌలుధనాన్ని తగ్గించండి. నాకేమీ అభ్యంతరంలేదు" అన్నాడు షెన్.

మేయూ కౌలుధనం తగ్గింపుశాసనంయొక్క షరతులను వివరించింది. ఆ షరతులను అమలుజరుపవలసిందిగా షెన్‌ను కోరింది. యెట్టి మినహాయింపులను సూచించకుండా షెన్ ఆ షరతులకు అంగీకరించాడు. ఆ మరునాడే యీ షరతుల ప్రకారం కొత్త కౌళ్ళను యిస్తానన్నాడు.

షెన్ బాగా బుద్ధితెచ్చుకొన్న భూస్వామియని ఆ ప్రతినిధులు భావించారు. అతని స్నేహపూర్వక ప్రవర్తనకు మురిసిపోయారు. అందుకని ఆ గ్రామాన్ని జపానువాళ్లు ఆక్రమించుకొన్నకాలంలో అతడు రైతులనుండి అక్రమంగా వసూలుచేసిన "పాత కౌలుధనాన్ని" గురించి ప్రసంగించలేకపోయారు. ఇంతాజేస్తే తాము అతనితో కరస్పర్శ చేశారు. అతనియింట విందు గుడిచారుగదా! అలాంటప్పుడు అతనిపట్ల కటువుగా ఎలా ప్రవర్తించగలరు?

విముక్తప్రాంతాలలోని గ్రామాలను జపానువాళ్ళు ఆక్రమించుకొంతకాలంలో ఆ గ్రామాలలోని భూస్వాములు పాతకౌళ్ళ ప్రకారం రైతులనుండి బలాత్కారంగా కౌలుధనాన్ని వసూలుజేశారు. అంటే రైతులు గడచిన సంవత్సరాలకు పాత కౌలుధనానికి, కొత్త కౌలుధనానికీ గల వ్యత్యాసాన్ని యిచ్చుకోవల్సింది. కౌలుధనం ధాన్యంరూపములో చెల్లించబడేది. భూస్వాములు పండినపంటలో నూటికి డెబ్బయిపాళ్ళు పంటను కౌలుధనంగా తీసుకొనేవారు. ఇది బలాత్కారంగా వసూలు చేయబడే కౌలుధనంగానీ, బరాయీలుగానీ రైతులకు తలకుమించిన భారమయ్యాయి. గ్రామాలు మరల విముక్తిజెందించబడేటంతవరకు యీ అక్రమ విధానం అమలులో వుండేది. గ్రామాలు విముక్తిచేయబడిన తర్వాత, కౌలుధనం తగ్గింపుశాసనం అమలుజరుపబడింది. దీనిప్రకారం రైతులు భూస్వామికి తమపంటలో న్యాయమని భావించిన భాగాన్ని మాత్రమే కౌలుధనంగా చెల్లించాలి. అక్రమంగా వసూలుచేసిన కౌలుధనాన్ని భూస్వాములు కక్కాలి. ఇవీ ఆ శాసనంలోని షరతులు.

* * * *

ఆ మరునాడు భూస్వాములు రైతులకు కొత్తకౌళ్ళను యిచ్చే టప్పుడు పర్యవేక్షించుటకై రైతుయూనియన్ సమావేశం జరిగింది. 1938 సంవత్సరములో షెన్‌యొక్క యేడు ఎకరాలభూమిని ప్రక్కగ్రామమైన స్వెంజ్యాలో కలిపారు. ఎందువలనంటె ఆ గ్రామప్రజలకు సాగు చేసుకోటానికి తక్కువయింది. ఆ గ్రామాధికార్లు ఆ భూమిని ఆ గ్రామ వాసులకు అప్పటి కౌలు తగ్గింపు రేట్ల ప్రకారం షెన్ తరపున కౌలు కిచ్చారు. కౌళ్ళను వసూలుచేయగానే షెన్‌కు పంపుతూవుండేవారు. షెన్‌కు షెన్‌జ్యాగ్రామంలో యిరవై ఎనిమిది ఎకరాల పొలమున్నది. కాని, కౌళ్ళను తయారుజేసేటప్పుడు అ ఇరవై ఎనిమిది ఎకరాల భూమిలోనూ యిరవై ఎకరాలకు మాత్రమే కౌళ్ళు తయారుజేశాడు.

"నే ననుకున్నదానికంటే యిక్కడ తక్కువభూమి వుంది" అన్నాడు రైతు ప్రతినిధులలో ఒకడైన మేయీ.

"స్వెజ్యాగ్రామంలో నాది ఏడెకరాల భూమివుంది. ఈ గ్రామ ప్రజల ప్రయోజనాలకై మీరు పాటుపడుతున్నారు గదా— ఆ ఏడెకరాలను మనగ్రామంలో ఎందుకు చేర్పించరు? అని సలహాయిచ్చాడు షెన్. ఈవిధంగా వాళ్ళను మాటల్లోపెట్టి తన ఎంతభూమిని కౌలురిజిష్టరులోని కెక్కించుతున్నదీ వాళ్ళు పసికట్టకుండా వుండుటకై వారి దృష్టిని మరొక విషయంపై మరలించాడు. "మనకు భూమి చాలా తక్కువగా వుంది. వాళ్ళకు వాళ్ళవుపయోగానికన్న ఎక్కువవుంది" అన్నాడు షెన్.

మేయీది పాదరసంలాంటి తత్వం. ఈ కాస్తచురక తగిలేసరికి, అతడు ఏమైనాసరే షెన్‌జ్యాగ్రామానికి ఆ ఏడెకరాలూ రావల్సిందేనని పట్టుబటాడు. ఈ ప్రతిపాదనకు తక్కిన ప్రతినిధులుకూడా వప్పుకున్నారు. వారంవిషయాన్ని మేయీకి చెప్పారు.

"స్వెంజ్యాగ్రామంలోని వాళ్ళకు తగినంత భూమిలేదేమో?" అన్నది మేయీ.

"హూఫ్! వాళ్ళకు కావలసినంతభూమి వుంది" అని జవాబిచ్చాడు షెన్!

"వాళ్ళకు భూమి తక్కువగాకపోయినా, యింకా తక్కువేయవి

చెప్తారు!" అంటూ మరియొక ప్రతినిధి జోక్యం కలిగించుకొన్నాడు. "ఎక్కువభూమిని పొందుదామని ఎవరికి ఆశవుండదు? లేదా ఏమిటి?"

వాళ్ళకు తగినంత భూమి లేకపోతే, వాళ్ళకేగా బాధ! మనకేం పట్టింది! చూడవలసినవాళ్ళే చూస్తారు!" అన్నాడు మూడవప్రతినిధి.

"మనకే తక్కువైనప్పుడు, మా భూమిని వాళ్ళను దున్నుకోనివ్వట మేమిటి?" అని వాపించాడు ఎనభై యేళ్ళ వృద్ధుడు. అతణ్ణి "తాత" యని పిలుస్తూవుంటారు.

"మనకే ఆకలిగావుంటే ఏనండిబాబూ అని ఇతరులకు గోధుమ రొట్టెలు పెడతారా!" అని మాటల్లో చొరబడ్డాడు ఒక కుర్రవాడు.

మేయీ చెవులు చిల్లులు దేవంతవరకూ యీ వాదోపవాదాలు జరుగుతూనేవున్నాయి. అసలు పరిస్థితి ఏమిటో అర్థంకాకపోయినా, మేయీకి వారివాదం సబబుగానే తోచింది. దాస్వే స్వుంజ్యాగ్రామంలో పనిజేస్తున్నాడు కాబట్టి యీ వ్యవహారాన్ని సులభంగా పరిష్కరించుకోవచ్చునను కుంది మేయీ. అతనిరూపు ఆమెకళ్ళల్లో మెదలగానే ఆమెకు వళ్ళు పులకరించింది.

మేయీ తానా విషయాన్ని విచారించి, ఒకటి రెండురోజులలో ఆ విషయంపై రిపోర్టు యిస్తానని ఆ ప్రతినిధులకు చెప్పింది. అందరూ వెళ్ళిపోయిన తర్వాత ఆమె తన నోటుబుక్‌లోనుండి ఒక తెల్లకాగితాన్ని చింపింది. దానిమీద చక్కని కుంచెతో, అతిజాగ్రత్తగా జాబు వ్రాయ సాగింది.

"కామ్రేడ్ దాస్వే,

బాగా పనిమీదున్నావేమిటి? కులాసాగా వున్నావా? నీపని సంతృప్తికరంగా జరుగుతూవున్నదా? నీపని విజయవంతంగా సాగుతూవున్నదని భావిస్తాను. మీ ట్రయినింగు అనుభవాలనుగురించి నాకు తప్పక బోధించి సహాయపడాలి. నేను ఈనాడు మీకు జాబువ్రాస్తున్న కారణమేమంటే మీతో ఒక సమస్యను చర్చించాల్సివుంది. అదేమంటే మాకీగ్రామంలో సాగుచేసుకోటానికి తగినంత భూమిలేదు. ప్రస్తుతం మీరున్న స్వుంజ్యాగ్రామంలోనికి ఈ గ్రామంయొక్క ఏడెకరాలభూమిని యిదివరలో కలి

పారు. ఆ భూమి తమకు మరల కావాలంటున్నారు యిక్కడి రైతు ప్రతి నిధులు. యదార్థానికి మాకు భూమి తక్కువగావుంది. ఈ విషయంపై బాగా ఆలోచించండి. మా కోరికను అంగీకరిస్తూ జాబు వ్రాస్తారని ఆశిస్తు న్నాను. నాపని సంతృప్తికరంగా వుంది. నేను కుశలంగా వున్నాను. అందువలన ఆదుర్దా పడవద్దు. ఇంతే సంగతులు, మీ క్షేమం వ్రాయండి.

నమస్కారాలు. మీరు సుఖంగా మీ విధులను పూర్తిగా నిర్వహిస్తా రని ఆశిస్తున్నాను.

మీ—

మేయీ "

మేయీ తన పేరును పూర్తిగా వ్రాసి, ఆ దస్కతు క్రింద కోడి గ్రుడ్డు ఆకారంలో ముద్రవేసింది. దాస్వే చిరునామాను వ్రాసింది. ఒక రైతు చేతికిచ్చి స్వంత గ్రామానికి పంపింది.

దాస్వే ఆ జాబును చూడగానే, తెరవకుండానే మేయీ దస్తూరిని గుర్తించాడు. అతని హృదయం పులకరించింది. రెండుసార్లు ఆ జాబును చదువుతున్నాడు. అతడు కుంచెను తీసుకొని, మేయీకి జాబు వ్రాశాడు.

"కామ్రేడ్ మేయీ!

మీ జాబు అందినది. మీరు సంతృప్తికరంగా పనిచేస్తున్న విష యాన్ని గ్రహించాను. మీరు ఆరోగ్యంగా వున్నట్లు తెలుసుకున్నాను. ఈ వార్తలు నన్ను చాలా సంతోషపెట్టినాయి. మీరు నన్ను బోధించవలసింది గానూ, సహాయపడవలసిందిగానూ కోరినారు. నిజానికి నేను మీకు క్షమా పణ చెప్పుకోవాల్సివుంది. ప్రతిరోజూ మీ గ్రామానికి వద్దామనుకుంటూ వుంటాను. కాని ఏదో ఒక పని అడ్డుతగులుతూ వుంటుంది. సాధారణ ముగా నేను రోజువారీ పనులతో కాలం గడుపుతున్నాను. నాకు నిజంగా సిగ్గేస్తు వుంది. ఇకముందు మనం రోజూ కలుసుకుంటూవుందాం. అధ్య యనంలోనూ, పనిపాటలలోనూ, విజ్ఞానాన్ని ఆర్జించుటలోనూ, రాజకీయా లను అర్థంజేసుకొనుటలోనూ ఒకరికొకరు సహాయపడుతూవుందాం. ఇదే నా కోర్కె. మీరు లేవెత్తిన సమస్యనుగురించి నాకేమీ తెలియదు. ముఖా

ముఖిని మాట్లాడుకోటానికి వస్తే బాగుంటుంది. త్వరగా రండి. తప్పకుండా రండి! మీతో మాట్లాడవలసిన విషయాలు చాలావున్నాయ్.

అభివందనాలతో-

మీ దాస్వే."

దాస్వే తన పూర్తిపేరు ఆ జాబుక్రింద వ్రాశాడు. చతురశ్రమప్పు ముద్రవేశాడు. ఆ జాబును మేయీ జాబును గొనివచ్చినాతని చేతికే యిచ్చి పంపాడు.

దాస్వే జాబు చేరిన మరునాటి ఉదయం రైతుప్రతినిధులతోపాటు అమిత సంతోషభరితహృదయియైన యువతి యొకతె స్వ్యంజ్యాగ్రామానికి బయలుదేరింది. తాతకు ఆ ఏడెకరాల భూమి కళ్ళల్లో మెదుల్తూవున్నది. పెద్ద చేతికర్రను వూతగాగొని తాతకూడా బయలుదేరాడు.

* * * *

తమ గ్రామంలోని భూసమస్యలను రైతు ప్రతినిధులతో దాస్వే చర్చించుతూవుండగా షెన్‌జ్యాగ్రామ రైతు ప్రతినిధులు అక్కడకు వచ్చారు. ఆ రెండుగ్రామాల కార్యకర్తలు, రైతుప్రతినిధులూ ఒకరినొకరు కుశలప్రశ్నలు వేసుకొన్నారు. కొంతసేపు స్నేహంగా కబుర్లు చెప్పుకొన్న తర్వాత షెన్‌జ్యాగ్రామ రైతుప్రతినిధులు ఆ యేడెకరాల సంగతి ప్రస్తావించారు. ఆ డిమాండు వినగానే స్వ్యంజ్యాప్రతినిధులు వారివంక రెప్పార్పకుండా చూశారు. రహస్యసమాలోచనకై దాస్వేని పక్కగదిలోనికి పిలిచారు. కొన్ని నిమిషాలయిన తర్వాత వ్యాకులతోపాటు స్వ్యంజ్యాగ్రామ ప్రతినిధులు బయటికి వచ్చారు. వ్యవహారాన్ని దాస్వేకి వదలివేసి కూర్చున్నారు.

"ఆహా! కామ్రేడ్ మేయీ!" అని నవ్వుతూ దాస్వే ఉపక్రమించాడు.

"యీ సమస్యను గురించి మేము చేయగలిగిన దేమీ లేదను కొంటాను!"

"షెన్‌జ్యాలో మీకు కావలసినంత భూమి వుందికదా? మీరు యీ యేడెకరాలనూ మళ్ళీ ఎందుకు తీసుకొంటున్నారు?"

మేయీ కొంచెం బిర్రబిగిసింది. ఆమెకూడా కొంత నవ్వును తెచ్చు కొంటూ "మీ రావిధంగా మాట్లాడుతారేమిటి? మాకు దున్నుకోటానికి చాలినంత భూమిలేదు!" అన్నది.

మేయీ, దాస్వేలమధ్య సంభాషణ జరుగుతున్నకొలదీ వారి చిరు నవ్వులు క్రమంగా అంతరించసాగాయి. వారి సంభాషణ వింటున్నకొలదీ రైతుప్రతినిధులుకూడా అంతకంతకు కోపాన్ని తినసాగారు. వారి సంభా షణలు శ్రుతిమించసాగాయి. రాగాలాపనలో పడ్డాయి.

"ఏమైనప్పటికి ఆ భూమి షెన్‌జ్యాగ్రామానిది; అందువలన దాన్ని ఆ గ్రామానికే యిచ్చివేయాలి."

"దాన్ని స్వుంజ్యాగ్రామానికిచ్చారు. మాకు దానిమీద ప్రత్యేక హక్కు వుంది."

"యుద్ధం ప్రారంభంకాకపూర్వమే మేము దాన్ని సేద్యంలోనికి తెచ్చాం. అందువలన ఆ భూమిమీద మీకన్న మాకే ముందుగా ప్రత్యేక హక్కు ఏర్పడింది."

"1938 కౌలు తగ్గింపుశాసనం అమలులోనికి వచ్చేటంతవరకూ ప్రత్యేకహక్కులంటూ ఏమీలేవు. ఆ భూమి మా స్వాధీనంలోకి వచ్చిన నాటినుండే ప్రత్యేకహక్కులు ఏర్పడ్డాయి."

"మేం షెన్‌జ్యా గ్రామరైతుల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నాం. మీరలాంటి వైఖరిని అవలంబిస్తే మేం వాళ్ళకు ఏమని రిపోర్టుయివ్వాలి?"

"స్వుంజ్యాగ్రామప్రజలపట్ల మా బాధ్యతలనేవిధంగా మేం నిర్వ హించాలి?"

డెలిగేట్లు యీవిధంగా పోట్లాడుకొంటూవుంటే, మేయీ, దాస్వేలు ఒకరిమీద మరొకరు కేకలువేసుకొనసాగారు.

"వాదించాల్సిన అవసరమేలేదు. విషయాలు స్పష్టంగావున్నాయి" అని అరిచాడు దాస్వే.

"నేను నీతో మాట్లాడదలచటంలేదు. నీవు నీ గ్రామం మేలు మాత్రమే చూసుకుంటున్నావుగాని, మా గ్రామం విషయం చూడటం లేదు" అన్నది మేయీ కోపంగా.

"ఛలే నాయకురాలివి. ప్రజల తోకవు నీవు!"

"నేను తోకనైతే నువ్వా తోక చివరవి!"

ఒక కార్యకర్తకు వ్యతిరేకంగా మరియొక కార్యకర్త, ఒక డెలిగేటుకు వ్యతిరేకంగా మరియొక డెలిగేటు, నిలబడి ఘోరంగా వాదించుకోసాగారు. వారి ముఖాలు కందగడ్డలాగా ఎర్రబారినాయి. రైతులు చెవులు చిల్లులుపడేటట్లు అరవసాగారు. ఒకడిగొంతుక బొంగురుపోతే, మరొకడు రొప్పుతున్నాడు. దాస్వేకు తల గిర్రున తిరుగుతున్నట్లు అనిపించినది. మేయీకి కడుపులో నొప్పి కలిగింది. తాత ఒకమూల కూర్చున్నాడు. వూపిరికోసం పెనుగులాడుతున్నాడు. అతనికళ్ళు పత్తికాయలంత అయ్యాయి.

ఈవిధంగా అక్కడ గందరగోళం తన పరిపాలన స్వేచ్ఛగా సాగిస్తూవుంది. ఇంతలోనే అక్కడకు బ్లాకీత్సే కౌంటీప్రభుత్వంనుండి తనిఖీకోసం వచ్చాడు.

"మంచిది! బ్లాకీత్సే మంచి సమయానికే వచ్చాడు. యీ వ్యవహారాన్ని పరిష్కరించవలసిందిగా అతణ్ణే కోరుకుందాం" అని వారంతా అన్నారు.

దాస్వే తనకథను చెప్పాడు. మేయీ తన వ్యవహారాన్ని వివరించింది. షెన్‌జ్యాప్రతినిధులు తమస్థితిని వివరించారు. స్వ్యాంజ్యాడెలిగేట్లు తమ వాదనలోని బలమైన అంశాలను చెప్పారు. యధార్థానికి వాళ్ళ మాటలువింటూవుంటే, అందరిదీ సత్యమేననిపిస్తుంది. ప్రతిమనిషీ తన వాదాన్ని తీవ్రంగావుంటే, అందరిదీ సత్యమేననిపిస్తుంది. ప్రతిమనిషీ తన వాదాన్ని తీవ్రంగా సమర్థించుకొంటూ మాట్లాడడం పూర్తి అయిన తర్వాత పొట్టచెక్కలయ్యేటట్లు నవ్వి, బ్లాకీ వాళ్ళందరినీ ఆశ్చర్యపరిచాడు.

వాళ్ళందరినీ కూర్చోమన్నాడు. కాస్త విశ్రాంతి తీసుకోమన్నాడు. ఆటుతర్వాత తన ప్రశ్నపరంపరలను ప్రారంభించాడు.

“షెన్ పాతకాలుధనాన్ని యిదివరలో వసూలుచేసుకొన్నాడుగదా! దాన్ని మీరు వానిచే కక్కించారా?”

“అదా....ఆఁ....ఆఁ.... యింకాలేదు!” అని మేయీ గ్రూపు నత్తురుకొట్టింది.

“మాకు యింకా సమయం దొరకలేదు.” అని న్యూంజ్యా ప్రతినిధులు గొణిగారు. “మేం చెత్తాకానీ వ్యవహారాలలోపడి కొట్టుకొంటున్నాము!”

“షెన్ భూమివిషయంలో తప్పుడులెక్కలు ఏమయినా వ్రాశాదేమో తనిఖీచేశారా?”

రైతులు ముఖాముఖాలు చూసుకొన్నారు. “అయ్యో!.... ఎవరికి తెలుసు?”

బ్లాకీ ఇకిలించాడు. “మీరు భూమి విషయంలో పోట్లాడుకొంటున్నారు. కానీ ఎంత భూమివుందో తెలియదన్నమాట. భలే బాగుందే! దేనికోసం యీ పోట్లాట?” వారు తెల్లబోయి చూడసాగారు. వారి తెలివితక్కువతనానికి బ్లాకీ నవ్వకుండా వుండలేకపోయాడు. అతడు మరల తన ప్రశ్న పరంపరలను ప్రారంభించాడు.

భూస్వాములతో వ్యవహారాలు పరిష్కరించుకోదలచిన రైతులా మీరు? లేక, రైతులకు వ్యతిరేకంగా పోట్లాడుతున్న రైతులో మీరు?”

డెలిగేట్లు బాగా కలవరపడ్డారు. “యధార్థానికి విషయమంతా అదే కాని, ఆ విషయాన్ని మేమంతా పూర్తిగా మరచిపోయాం” అని వారిలో ఒకడు గొణిగాడు.

తాతా తన కర్రతో నేలనుకొట్టాడు. “ఏయ్! షెన్‌కు యింకా బోలెడంత పొలముంది! మనం సరిగాచూస్తే,బయటపడుతుంది”అన్నాడు.

“హుంఫ్! మాంసం మన నోట్లోనేవుంది కాని, దాన్ని నమలటానికి

బదులు మన నాలుకను మనమే నములుతున్నాం" అని ఒకడు పిడికిలిని తన అరచేతిలో గ్రుద్దాడు.

డెలిగేట్ మేయీ ముందుకువచ్చాడు. "మనం మోసంజేయబడ్డాం. దీనెవ్వరి—ఇదంతా నా తప్పు! నేను, పెన్ చెప్పినమాటలు విని మోస పోయాను. యీ యేడెకరాల ప్రవహారాన్ని లేవెట్టాను వాడు నన్ను తన ఇంపుడుకోతిలాగున ఆడించాడు" అన్నాడు మేయీ.

"ఇది నా తప్పు!" అన్నది మేయీ సిగ్గుపడుతూ.

"ఆనాడు వాడు తనయింటో చేసిన విందులో పాల్గొనుటకు వప్పు కోకుండా వుండాల్సింది. వాడు తన లాలింపు మాటలతో మనందరినీ మోసంచేశాడు" అన్నది మేయీ.

రైతులు ప్రశాంతంగా కూర్చున్నారు. లెక్కలువేయసాగారు. పెన్‌కు కనీసం ముప్పైఅయిదెకరాల భూమి కలదని తేల్చారు. వాడు ఖచ్చితంగా అనేక యెకరాల భూమిని దాచిపెడుతున్నాడనీ, దానిని రహస్యంగా ఎవరికో కౌలు కిచ్చుటకు యత్నిస్తున్నాడని తేల్చారు. అదనంగా వున్న భూమిని న్యాయసమ్మతమైన రేటువైన కౌలు కిచ్చేటట్లుగా వాణ్ని బలవంతంజేస్తే, షెన్‌జ్యాగ్రామానికి భూమి కొరతే వుండదు. వాడు యిదివరకు అక్రమంగా వసూలుజేసిన ధాన్యాన్నికక్కిస్తే గ్రామంలోని రైతులు ఆకలితో మాడాల్సిన అవసరమే వుండదు.

వారీ విధంగా ప్రశాంతంగా కూర్చొని మరల స్పష్టంగా ఆలోచించుకొంటూవుంటే వారి ముఖాలమీద మరల చిరునవ్వు తాండవించ సాగింది.

తమ మొరటు ప్రవర్తనకు వాళ్ళు ఒకరికొకరు క్షమార్పణ చెప్పుకొన్నారు మేయీ, దాస్వే లిద్దరూ తాము వర్గస్వభావాన్ని మరచామని వప్పుకొన్నారు. బ్లాకీ వారిని క్రీగంటితో చూచాడు. సంతోషంతో పొంగిపోయాడు.

"చాలు! చాలు!" అని అరచాడు వేయీ.

"మనమంతా ఒకే కుటుంబం—యీ మర్యాదలెందుకు? మనమంతా పోయి షెన్‌తో లెక్కలు తేల్చుకుందాం" అన్నాడు.

ఇతర రైతులుకూడా ఆ నినాదాన్ని అందుకున్నారు. "పదండి! పదండి! ఈ ప్రపంచంలోని రైతులందరూ ఒకే కుటుంబం! మనమంతా కలసిపోదాం పదండి!"

"బాగుంది! మీ రిద్దరూకూడా కల్సివెళ్ళండి. ఎంతమంది ఎక్కువగా వుంటే అంత బలం" అని బ్లాకీ దాస్వే. మేయీలకు చెప్పాడు. అయితే అక్కడున్నవాళ్ళందరూ ఒక హెచ్చరికచేశాడు. "అంతేగాక మీరు ఒక విషయాన్ని మరచిపోరాదు. మనం ఒక విధంగా భూస్వాము లతో పోరాడుతూవున్నాం. అంతేగాకుండా యింకొకవిధంగా వారి సహకారాన్నికూడా కోరుతున్నాం. ఈ విషయాన్ని మరచిపోకండి. పోరాటం లేనిదే ప్రజలజీవిత విధానాన్ని బాగుపరచనిదే, మనం జపానువాళ్ళను వోడించజాలమన్నది సుస్పష్టం. సహకారంలేనిదే, ఐక్యప్రజాతంత్ర సంఘటనలేనిదే మనకు కావలసిన అదనపు బలాన్ని చేకూర్చుకోజాలం. ఐక్యతను పొందగలుగుటకుగాను మనం పోరాడాలని ఛైర్మన్ మావ్ చెప్పాడు. జపానువాళ్ళను ప్రతిఘటించటానికి మనం ఐక్యంకావాలి మనం మితవాదులంగా వుండకోరుటలేదు! ఈ సూత్రాలను ప్రతి ఒక్కరూ మనసులో పెట్టుకోవాలి!"

"రైట్! రైట్!" అని జవాబు చెప్పారా రైతులు. "మేం షెన్ పట్ల న్యాయంగా వ్యవహరిస్తాం" అన్నారు.

వారందరూ సంతోషంగా బయటికి కట్టకట్టుకొనిపోయారు. దాస్వే. మేయీలుకూడా వారిని అనుసరించారు. తాత తన చేతికర్రమీద వూత వేసి వారి వెనుక గంతులేసుకుంటూ పోసాగాడు.

* * * *

వారా విధంగా షెఙ్ జ్యాగ్రామానికి పోతూవుండగా వారిలో వారు చాలా స్నేహంగానూ, వుల్లాసంగానూ వ్యవహరించారు. దాస్వే, మేయీ లిద్దరూ కలిసి నడిచారు

"ల్లాకీ మంచి సమయానికే వచ్చాడు" అన్నాడు దాస్వే. "అతడు తనిఖీకి రాకపోయినట్లయితే యీ పోట్లాట ఎంతదాకా పోయేదో యెవరికి తెలుసు?" అన్నాడతడు.

మేయీ నవ్వింది. "నీవు నిజంగా భయంకరంగా ప్రవర్తించావ్. నా ముక్కుమీద వేలుపెట్టిచూపిస్తూ, తిట్టావ్! నేనూ నీలాగే తయారయ్యాను. నీవు నన్ను ఒకటి తిడితే పది తిట్టాను" అన్నది.

"నాకు వీపుమీద అద్దముంది. అది యితరుల ప్రతిబింబాన్ని చూపుతుందిగాని, నా రూపాన్ని నేను చూసుకోలేకపోయాను. నిజంగా నిన్ను పిచ్చిగా తిట్టాను" అన్నాడు.

"నాకు నిజంగా భలే రోషమొచ్చింది. నాలో నేననుకున్నా- అతనింత అన్యాయంగా ప్రవర్తిస్తున్నాడే ? ఆటోపులాంటి తత్వం. ఇకనుండి అతనితో నేను సంబంధం పెట్టుకోవద్దనుకున్నాను" అన్నది.

"నిజంగానా? యితరానా?" అన్నాడు.

"ఎలా అడగగలిగావ్?" అన్నదామె; ముఖం ఎర్రబారింది.

వాళ్ళిద్దరికీ త్వరలో పెళ్ళి కానున్నదని అందరికి తెలుసు. అందుకని ఖిజాలు రామకొంటూ తిరిగితే, వాళ్ళేమి వెక్కిరిస్తారోనని వాళ్ళిద్దరూ భయపడ్డారు. తత్తరపడుతూ, వాళ్ళిద్దరూ విడిపోయి రైతుప్రతినిధులతో కలిసిపోయారు.

"ల్లాకీ బాగా చెప్పాడు" అంటున్నాడు తాత. "మనమంతా గందరగోళంలోపడ్డాం. రెండు మూడు మాటల్లో అతను సమస్యనంతా పరిష్కరించివేశాడు" అన్నాడు తాత.

"కమ్యూనిస్టుపార్టీ నాయకత్వమూ, చైర్మన్ మావ్ మార్గదర్శకత్వాలే లేకపోయినట్లయితే, మనమింకా ఆ బురదలోనే మురిగిచచ్చేవాళ్ళం" అని వేయీ ఉత్సాహకరంగా అరచాడు.

ఎవరో చైర్మన్ మాసీయాంగ్‌పై వ్రాయబడిన పాటను పాడ సాగారు. పదఘట్టనతో లయకలుపుతూ వుల్లాసవంతంగా అన్నిరకాల కంఠధ్వనులూ ఆ పాటలో కలిశాయి.

> "ఉదయాద్రికొలూని బాలభానుండు
> పైకెక్కి పారజూస్తుంటేనూ !
> తూరుపూ కొండలెల్ల ఎఱ్ఱబారె
> ఇటు చైనాదేశంబులోన
> జన్మించెనోయీ !
> మాసీయాంగ్ !"



353

# 16 అధ్యాయం

కౌలుధనం తగ్గింపు ఉద్యమం పూర్తిగా విజయవంతమయింది. తెలియకుండానే వసంతకాలం వచ్చిపడింది. దాస్వే, మేయీవిద్దరూ కమ్యూనిస్టులు కాబట్టి, వారి పెళ్ళిసమస్యను బ్లాకీత్సే కౌంటీపార్టీ కమిటీ ముందుంచాడు. ఈ ప్రతిపాదనను ఏకగ్రీవంగా ఆమోదించుటయేగాక, యీ కామ్రేడ్స్‌కు పెళ్ళి ఎప్పుడో జరిగివుండాల్సిందని కౌంటీపార్టీకమిటీ కామ్రేడ్స్ అన్నారు.

ఈనాటికి దాస్వే తన స్వంతజిల్లాలో, జిల్లాపార్టీ సెక్రటరీ అయ్యాడు. మేయీ కౌంటీమహిళాసంఘంలో పనిచేస్తూవుంది. మార్చి 18వ తారీఖున మహిళాదినం. ఆ శుభదినంనాడే వారి పెళ్ళి జరుపుటకు నిశ్చయించబడింది. పెళ్ళిప్రయత్నాలు జరుపుకొనుటకుగాను జిల్లా కౌంటీ పార్టీ సంఘాలు కొంత ధనాన్ని యిచ్చాయి.

చిట్టచివరకు ఆ శుభదినం వచ్చింది. రైతులకు యీ పెళ్ళివర్తమానం తెలిసిందంటే స్వంతడబ్బును ఖర్చుజేసి యేమైనా బహుమతులు తీసుకొనిఃస్తారన్న భయంతో పెళ్ళికి వివిధ ప్రభుత్వ యూనిట్లలోని మెంబర్లను మాత్రమే ఆహ్వానించారు. ఈ పెళ్ళికి దాస్వేయొక్క ఇల్లు, ఆఫీసు రెండూ ఒకటే అయిన ఇంటిలో జరుపుటకు నిశ్చయించారు. ఉదయమంతా ప్రతిమనిషి తీవ్రంగా పెళ్ళిప్రయత్నాలు చేయసాగాడు.

కౌంటీ మహిళాసంఘంనుండి మేయీ. ఆమె కామ్రేడ్స్ వచ్చిచూసేసరికి తేవారు, ప్రజాసైనికులు కలిసి, ఇంకా యిల్లు కడుగుతూనే వున్నారు. నడుమునకు ఒకగుడ్డను బంధించి, జిల్లానాయకుడయిన జీవో సొంతంగా వంటచేస్తున్నాడు.

"కొత్త గది తయారుగా వుందా?" అని తియాన్ ప్రశ్నించింది.

"ఇక్కడ పూర్తి అయింది" అని కేకేసి చెప్పింది నియూరీ పడమటివైపునుండి.

కొత్తగా వచ్చినవాళ్ళు హడావిడిగా లోపలికిపోయారు. జిల్లా మహిళాసంఘానికి సంబంధించిన ముగ్గురు యువతులు వులాసంగా 'గదిని' అలంకరిస్తున్నారు. కిటికీలకు కొత్తకాగితం అంటించబడింది. దానిమీద ఎర్రని రంగుకాగితం ముక్కలను అంటించారు. కాంగ్‌మీద తెల్లని దుప్పటిను పరచారు. దానిమీద ఎర్రని బొంతనువేశారు. వీటిని జిల్లాపార్టీ, కౌంటీపార్టీ సంఘాలు కానుకలుగా ఇచ్చాయి. కాంగ్‌కు ఎదురుగావున్న గోడకు చిత్రపటాన్ని వ్రేలాడగడుతూ నియూరీ ఒక బల్లమీద నిలబడి వుంది. పచ్చ ఆకులమధ్య ఎర్రతామరపువ్వులు రెండింటిని వాటర్ కలరుతో చిత్రించబడిన చిత్రపటమది.

మేయీ లోపలికివచ్చి ఆమె చేతిని పట్టుకోగానే "నియూలీ బల్లమీద నుండి మేమలంకరించాం. ఏమైనా విమర్శలున్నాయా?" అని అడిగింది నియూరీ.

సిగ్గుతో మేయీ చెక్కిళ్ళు అలంకరించబడిన పూలరంగుగా ఎర్రనయ్యింది. "నీకూ త్వరలోనే పెళ్ళి అవుతుందిలే అల్లరిపిల్లా! అల్లరి చేస్తున్నావా?" అన్నది తెచ్చిపెట్టుకొన్న కోపంతో మేయీ.

తియాన్ తానుకట్టిన దిండును కాంగ్‌మీద వుంచింది. యితర కార్యకర్తలు చేతిరుమాళ్ళనూ, సబ్బులనూ, టూత్‌బ్రష్‌లనూ, టూత్‌పేస్టులనూ, నోట్‌పుస్తకాలు వగైరా కానుకలుగా తీసుకొనివచ్చారు. హైస్కూల్ మాష్టర్ ఛెంగ్ పెళ్ళికి రాలేకపోయాడు. కాని రెండు ఆశీస్సు పత్రాలను పంపాడు. వాటిని చిత్రపటానికి యిరుప్రక్కలా అలంకరించారు. ఆ ఆశీస్సు పత్రాలు ఎర్రని కాగితంమీద నల్లని సిరాతో వ్రాయ

బడినాయి. దానిలోని విషయం గ్రాంధికభాషలో వ్రాయబడివున్నా భావా లలో ఆధునికతత్వం కనపడుతూవున్నది.

"క్రొత్త ప్రజలు పాతవిధానాన్ని కూలదోస్తారు.
పాతస్నేహితులు క్రొత్తదంపతు లవుతారు."

ఇంతేగాక ఇతర ఆశీస్సుపత్రాలుకూడా వున్నాయ్!

అవన్నీ విప్లవాన్నిగురించీ, పెళ్ళినిగురించీ జతపరచి వ్రాయబడి నాయి. అందులో కొన్నిటిలోని విషయం తీవ్రంగావుంది. మరికొన్ని నవ్వుపుట్టించేవి. వాటినన్నింటిని గోడలమీద వ్రేలాడకట్టేశారు.

* * * *

పెళ్ళికివచ్చినవారంతా వుత్సాహంగా వున్నారు. రైతుల మాదిరి గానే వేళాకోళాలాడుకొంటున్నారు. సాంప్రదాయంగావచ్చే పెళ్ళిహాస్యం లేకపోవటాన్ని బ్లాకీ గమనించాడు.

"ఓయ్! దాస్వే ఎక్కడ?" అని అడిగాడు.

"ఎక్కడున్నాడో చూసివస్తా" అని నియూరీ గదులన్నింటినీ వెతకసాగింది!

దాస్వేకి తలతిరుగుతూన్నట్లు అనిపించింది. అతడు తూర్పు గదిలో దాక్కున్నాడు. మేయీ వచ్చిందని వినగానే, అతని హృదయం దడదడ కొట్టుకోసాగింది. ముఖం ఎర్రబారింది. ఈ స్థితిలోనున్న తన్ను యితరులుజూస్తే నవ్విపోగలరన్న సంగతి అతనికి తెలుసు. అందువలన కాంగ్‌మీద పడుకొని ఏమీ ఎరుగనట్లు నటించుటకై పేపరు చదువుకొన సాగాడు. కాని ఒక్కమాటయినా అతనికి అర్థంగావటంలేదు. నియూరీ అతణ్ని కనిపెట్టేసింది. నవ్వింది: చప్పట్లుకొట్టింది.

"అందరూ వచ్చి చూడండోయ్! పెళ్ళికొడుకు చదువుతూ పడు కొన్నాడు."

పేపరును లాగేస్తూ అతణ్ని కాంగ్‌మీదనుంచి గుంజింది. కార్య

కర్తలంతా నవ్వారు. ముఖం కందగడ్డలాగున్న దాస్వేని చుట్టుముట్టారు అతడు తప్పించుకోలేకపోయాడు. తానుకూడా వాళ్ళతోపాటు యికిలించాడు.

హాలులో మూడు మేజాబల్లలు ఒకచోట చేర్చబడినాయి. వాటికి యిరుప్రక్కలా పొడుగాటి బెంచీలను వేశారు. వేడి వేడి ఆహారాన్ని వడ్డించారు. అందరూ కూర్చున్నారు. హోదాతో నిమిత్తంలేకుండా జిల్లా, కౌంటీ కార్యకర్తలందరూ వడ్డనవాళ్ళుగా పనిజేసారు. మాంసం, చేపలు, కూరగాయలు, అన్నం- యిది భోజనసామగ్రి. చాలా చక్కని భోజనమది. అతిథులు కడుపార తిన్నారు. దాస్వే మితంగా భోజనం చేయసాగాడు. కాని, అతిథులు అలాంటి మర్యాదలకు ఒప్పుకోలేదు.

"నీవు కడుపునిండా తినకపోతే, నిన్ను పెళ్ళిచేసుకోనివ్వం" అని అతిథులు హెచ్చరించారు.

రైతులకు పెళ్ళివార్త తెలియనీయకుండా జాగ్రత్తపడినప్పటికి, రాత్రి అయ్యేసరికి పెళ్ళివార్త గ్రామాలలో తెలిసిపోయింది. పరిసర గ్రామాలనుండి రైతులు ఆ దంపతులపట్ల తమ గౌరవాన్ని చూపుటకు వచ్చారు.

ఆ విధంగా వచ్చిన వందలాదిమందికి ఆ యిల్లు యిరుకయింది. కాంపౌండుకూడా చాలలేదు. ఆహ్వానపు గదులలో రియూ, అతని స్నేహితులు, ఎర్రసిల్కు దీపాలను వ్రేలాడగట్టారు. స్నేహితులు చిరునవ్వును వొలకబోస్తూ దాస్వే, మేయీలలో ముచ్చటలాడసాగారు. దాస్వే, మేయీలు చైర్మన్ మావ్, జనరల్ ఛూటేల చిత్రాలకు క్రిందుగా కూర్చున్నారు. పాటలు, పాటలు, పద్యాలు, నవ్వులు, కేరింతలతో ఆ యిల్లు ప్రతిధ్వనించింది.

కాగితంతో నియూకీ సొంతంగా కొన్ని పూలగుత్తులను తయారుచేసింది. వాటిని ఆమె ఆ దంపతుల కోటులకు గుచ్చింది. ఆ దంపతుగది మధ్యకు తీసుకొనివచ్చి కూర్చోపెట్టింది. ఎదురుగొడ్డ మా మేజాబల్లలమీద అతిథులకొరకు బటాణీగింజలు పోశారు. అతిథులకు టీ యివ్వబడింది.

పెళ్ళిముహూర్తం ఆసన్నమయింది!

పురోహితుని సూచనప్రకారం అందరూ లేచారు. చైర్మన్ మావ్, జనరల్ ఘూటేం చిత్రాలకు నమస్కరించారు. అటుతర్వాత మేయీ, దాస్వేలు ముందుకువచ్చి ప్రజానాయకుల చిత్రాలకు నమస్కరించారు. అటుతర్వాత అతిథులకు నమస్కరించారు.

"పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ ఒకరికొకరు నమస్కరించుకోండి!" అని పురోహితుడు చెప్పాడు.

కఢీలాగున నిలబడ్డ దాస్వే తన పెళ్ళికూతురు కెదురుగా నిలబడ్డాడు. పురోహితుడు చెప్పినవిధంగా చేద్దామని సిద్ధమయ్యాడు. అతని గంభీర ఆకారాన్ని చూచేసరికి మేయీకి నవ్వాగలేదు. ఆమె కిలకిలా నవ్వుతూ పారిపోయింది.

"అలా చేయరాదు" అని నవ్వారు అతిథులు. "నువ్వు బాగా వంగి పాదాభివందనం చేయాలతనికి" అన్నారు.

స్త్రీలు మేయీని పట్టుకొనివచ్చారు. ఆమె తొందరగా అతనికి నమస్కరించింది. అతడు మరల నమస్కరించాడు.

అందరూ తమ తమ ఆసనాలలో కూర్చున్నారు. సాక్షులను చిన్న ఉపన్యాసాలు యివ్వవలసిందిగా పిలాచారు. ట్లాకీ "సాక్షిగానూ, పరిచయకర్త"గానూ వ్యవహరించాడు. నవ్వుతూ లేచి లబడి అతిథులవంక మిలమిల్లాడుతున్న కళ్ళతో చూచాడు.

"కామ్రేడ్స్!

ఈనాడు కామ్రేడ్స్ దాస్వే, మేయీల మధ్య జరుగుతున్న వివాహము అత్యంత అభివందనీయమైనది. వారిద్దరూ కలిసి విప్లవంలో పాల్గొన్నారు. అతి కఠిన పోరాటాలలో అత్యద్భుతమైన విప్లవాత్మక యోధులుగా తయారయ్యారు. వారిద్దరికి పెళ్ళి జరుగుతూవుంటే నాకెంత సంతోషంగా వున్నదో చెప్పజాలకున్నాను. పాత సమాజంలో ఈ విధంగా స్వేచ్ఛగా పెళ్ళిచేసుకోటానికి అవకాశం వుండేదికాదు. చాలా బాధపడవలసివచ్చేది. ఈనాడు జపానువ్యతిరేక ప్రజాప్రభుత్వం ఆధ్వర్యంక్రింద యుద్ధంలో స్నేహితులైన వీరిద్దరు కొత్త దంపతు లవుతున్నారు. వారి

జీవితం పరిపూర్ణ సుఖంతో సాగిపోగలదనుట నిర్వివాదాంశం. అయితే శత్రువు లింకా వోడిపోలేదు; ముందు ముందు తీవ్ర పోరాటాలను నడుప వలసి వుంది. కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన మీరిద్దరూ కష్టపడి పనిచేస్తూ పోరాటారనీ, ఆత్మవిమర్శలు చేసుకొంటూ చేస్తూవుంటారనీ, నిరంతరం అవిచ్ఛిన్నంగా అభ్యుదయపథాన పయనిస్తూవుంటారనీ ఆశిస్తున్నాను" అని షాక్రీ తన వుపన్యాసాన్ని పూర్తిజేయబోయేముందు ఆ దంపతులవంక సూటిగా జూచాడు. హాస్యంగా కళ్ళెగరేసి "తుదకు విప్లవం యొక్క యువతరంలో అనుయాయుడుగా చేరుటకై చక్కని దుక్కలాంటి పిల్లవాడు వచ్చే సంవత్సరానికి కలుగుతాడని ఆశిస్తున్నాను" అని తన వుపన్యాసాన్ని పూర్తిజేశాడు. కేరింతలు, కరతాళధ్వనుల మధ్య షాక్రీ కూర్చున్నాడు.

సెన్‌జ్యూ గ్రామంలో 'కోట' యజమానియైన వృద్ధుడు లీమామ షాక్రీ కూర్చున్నతర్వాత లేచి నిలబడ్డాడు. ఎర్రకాగితంలో చుట్టబడిన రెండు పొట్లాలను టేబిలుపై వుంచాడు.

తన నెత్తిసటోపిని తీసి, చేతిలో పెట్టుకొన్నాడు. మెరుస్తూన్న అతని బట్టతల బయటపడింది. పెళ్ళికూతురు, పెళ్ళికొడుకుకు పాత పద్ధతిలో సలాంచేశాడు.

"దాస్వే, మేయీలు పెళ్ళిచేసుకొంటున్నారంటే, ప్రతి రైతు హృదయం సంతోషంతో ఉప్పొంగిపోయింది" అని లీమామ బిగ్గరగా చెప్పసాగాడు.

"మేమంతా పెళ్ళికి వద్దామనుకున్నాం; ఏవో చక్కని వస్తువులను కొనియిద్దామనుకొన్నాం. కాని, అధికారులు మా మాటలు చెవినిపెట్టలేదు. అందువలన మా ప్రేమచిహ్నంగా యీ రెండు పొట్లాలనుమాత్రం, మా హృదయాలను వెల్లడించుకోటానికి యిస్తున్నాం" అన్నాడు.

లీమామ ఒక ఎర్రకాగితాన్ని తీసుకొని, దానిపై వ్రాసివున్నదానిని బిగ్గరగా చదువసాగాడు. "మనం త్వరగా శాంతిని అనుభవించగలుగుటకుగాను, త్వరగా జపానువాళ్ళను వోడించండి— అది మొదటి పొట్లం. ఖర్జూరపండ్లు! రెండవదేమంటున్నదంటే మేయీ, దాస్వేలు కూలంచి

జోడా! వాళ్ళిద్దరూ ఒకే హృదయంతో విజయంకోసం పాటుబడతారు. హ్హా! హ్హా! అది దేగిపల్లి!

అతిథులంతా నవ్వారు. చప్పట్లు చరిచారు.

మరల ప్రోహితుడు ప్రారంభించాడు. "పెళ్ళికూతురు, పెళ్ళికొడుకుల్లారా! మీరేవిధంగా ప్రేమించుకున్నారో చెప్పండి?" అన్నాడు.

ఈ ప్రతిపాదనకు ఆమోదసూచకంగా నవ్వులు, కేరింతాలూ, చప్పట్లూ వర్షంలాగా కురిశాయి. దాస్వేని గది మధ్యకు లాక్కొచ్చారు. క్రొత్త ఆర్మీటోపిని, కొత్త సైనిక దుస్తులను ధరించిన దాస్వే ముఖం ఎర్రబారింది. తనకోటుమీద గుచ్చబడిన ఎర్రపూల రంగుకన్నా ఎర్రగా అయ్యిందతని ముఖం.

"నేనేం చెప్పగలను?" అని నవ్వుతూ అడిగాడతడు. "మేం ప్రేమించుకోలేము" అన్నాడు.

"వప్పుకో" అని అతిధులు అరిచారు. "చెప్పాల్సి తప్పదు" అని అరిచారు.

"నిజంగానే మేం ప్రేమించుకోలేము" అని నొక్కి చెప్పాడు దాస్వే.

"విందాం పట్టండి" అని ఎవరో అరిచారు. "ముద్దుపెట్టుకున్నారా?" అని ప్రశ్నించారు.

"లేదు పెళ్ళి! మేము కొన్ని సంవత్సరాలనుండి అన్నాచెల్లెలు లాగున కలసి పనిజేశాం. మేమెన్నడూ ముద్దుపెట్టుకోలేదు సరిగదా కరస్పర్శ అయినా చేసుకోలేము" అన్నాడతను.

"ముద్దుపెట్టుకొందామని నీకెప్పుడయినా తోచిందా?" అని గదికి వెనకప్రక్కనుండి రియూకే కేసి అడిగాడు.

దాస్వే నవ్వాడు. ధైర్యం తెచ్చుకొన్నాడు. "అం తప్పకుండా! నేనామెను చాలాకాలంనుండి ప్రేమిస్తున్నాను." అని తన టోపిని తీసుకొని తుర్రున బయటికి పారిపోయాడు.

"ఇప్పుడే మేయోవంతు!" అని అరిచారు కార్యకర్తలు.

సిగ్గుపడుతూన్న మేయోని, ఆమె స్నేహితులు లాక్కొచ్చారు. ఆనాడు నీలిరంగు గౌను ధరించింది మేయో. ఆమె హృదయంమీద

ఎర్రని కాగితంపువ్వు తగిలించబడింది. తత్తరపాటుతో ఆమె తలవంచు కొనివుంది. చేతివ్రేళ్ళతో తన జుట్టును మెలిపెడుతూవుంది. సిగ్గుతో ఆమె ఎక్కువసేపు మాట్లాడలేకపోయింది.

"నన్ను ప్రేమిస్తున్నాడు........" చిట్టచివరకు ఎలాగయితేనేం, ఆ మాటలను నోటినుండి పెకలించగలిగింది. "ఈ మాటలను నా హృదయము ఎన్నిసార్లు జపంచేసి దో చెప్పలేను" అంటూ మేయీ, మిస్ చెన్ కౌగిలిలోకిపోయి పడింది. "ఇంక చెప్పలేను" అంది.

చాలామంది గొంతులు సరిచేసుకున్నారు. ముక్కులు చీదు కున్నారు. కంట తడిపెట్టుకొన్నారు. ఆడపెళ్ళివారికిది సహజం. ఇక్కడ అతిధులే ఆడపెళ్ళివారు.

పురోహితుడు లేచి మరల ప్రారంభించాడు. "పెళ్ళికూతురూ పెళ్ళి కొడుకూ కరస్పర్శ చేసుకోండి" అన్నాడు.

రెండు ఉత్తుంగతరంగాలులాగా దాస్వేని మగ కార్యకర్తలూ, మేయీని స్త్రీ కార్యకర్తలూ లంకించుకొని గది మధ్యకు తీసుకువచ్చారు. వారిద్దరి చేతులనూ కార్యకర్తలు కలుపుతూవుంటే మేయీ సిగ్గుతో తన ఎర్రగులాబీ ముఖాన్ని పెడకు తిప్పుకుంది. అతిధులు చప్పట్లుకొట్టారు. గులాబీ చెక్కిళ్ళుగల ఆ దంపతులను పడకగదిలోనికి తీసుకొని పోయారు హాస్యమాడుతూ, కిలకిలా నవ్వుతూ గలగలనవ్వుతూ కార్యకర్తలు శోభనపుగదిని జరికించసాగారు. క్రమేపి ఒక్కొక్కరే తప్పుకున్నారు. కడగొట్టు అతిథి తలుపుమూసి వెళ్ళాడు.

పెళ్ళికూతురు, పెళ్ళికొడుకూ వొంటరిగా వున్నారు. చిరునవ్వు నవ్వుతూ తలవంచుకొని మేయీ కాంగ్ అంచుమీద కూర్చున్నది. దాస్వే మెల్లగా తలుపు గడియవేశాడు. తదుపరి ఆమెవంక సిస్నహాయంగా చూస్తూ నిలబడ్డాడు. ఆమె అవనివంక నీలాలులాంటి కళ్ళతో చూడ సాగింది. లాంపు వెలుగులో ఆమె చెక్కిళ్ళు సంతోషంతో మెరిశాయి.

"అలసిపోయారు. విశ్రాంతి తీసుకోండి" అన్నది మేయీ ఏదువుగా.

కాంగ్ ప్రక్కగావున్న చిన్న బెంచీపై దాస్వే కూర్చున్నాడు. మంత్రముగ్ధునిలాగున ఆమెవంక చూడసాగాడు.

"అలాచూస్తున్నారేం! నన్నెప్పుడూ చూడలేదా?" అని సిగ్గుపడుతూ మేయీ అడిగింది. చిరునవ్వుతో ఆమె బుగ్గలు సొట్టపడ్డాయి.

"కొన్ని సంవత్సరాలక్రితం మీ అక్కగారింటికి వస్తూ వుండేదానివి. ఆ రోజులు జ్ఞాపకానికొచ్చాయి. నీ వింకా అప్పటికి జడకుప్పెలు వేసుకుంటూ వుండేదానివి. కొత్తమనిషిని చూస్తే తల ఎత్తేదానివి కావు. అటుతర్వాత, మనం కార్యకర్తల బడిలో కలిశాం. మొదటి వుపన్యాస మిచ్చుటకు ప్రయత్నించిననాడు నీవు ఏడ్చావు అది నాకు జ్ఞాపకముంది. మనిద్దరం అప్పుడు వట్టి తెలివితక్కువగా వుండేవాళ్ళం. ఆ రోజులు తలచుకొంటే భలే నవ్వొస్తుంది" అన్నాడు.

"ఆనాడు వట్టి గందరగోళంగా వుండేవాళ్ళం. త్రాగకూడని సిగరెట్ తాగినరోజు జ్ఞాపకంవుందా?" అన్నది.

వారిద్దరూ నవ్వుకున్నారు. వారిద్దరూ ఆ విషయాలను జ్ఞాపకంచేసుకొన్నకొలదీ సాన్నిహిత్యం పెరిగింది. లాంపుదీపపు కాంతి తగ్గసాగింది. గదిలో జీకటి వ్యాపిస్తావుంది.

దాస్వే కాంగ్‌మీద మేయీ ప్రక్కన పడుకొన్నాడు. ఆమె ఆనంద బాష్పాలు అతని భుజాలపై వర్షించసాగింది. అతని శరీరంమీదిమచ్చలను ఆమె మృదువుగా ముద్దిడుకుంది.

మృదువుగా ఆమె "దాస్వే" అని పిలిచింది. "దాస్వే! నినాన్నరోజున వాళ్ళు బాధపెట్టినతర్వాత మనవాళ్ళు నిన్ను యింటికి మోసుకొచ్చారు ఆనాడు నిన్ను చూడగానే నా గుండె బద్దలయింది. ఆ దుఃఖంతోనే మరణిస్తాననుకున్నాను" ఆమె అతని మెడపై ముఖం దాచుకొంది. "నీవు చాలా బలశాలివి. మంచివాడివి. కల్తీలేని బంగారంలాంటివాడివి" అన్నది.

"నీవూ, మన కామ్రేడ్స్ నన్నెంతో ఆప్యాయంగా చూచారు. మీ

ప్రేమనంతనూ నామీద కురిపించారు. నన్నెంతో జాగ్రత్తగా కాపాడారు. మీరు నన్నా విధంగా జాగ్రత్తగా పోషించకపోయినట్టయితే, యీనాటికి బ్రతికుండేవాణ్ణా" అన్నాడు. దాస్వే హృదయం ఉద్వేగంగా కొట్టుకుంది.

"విప్లవవాదులందరూ ఒకే పెద్ద కుటుంబం- ప్రతి విప్లవవాదీ ఆత్మబంధువు."

దాస్వేకి తన తండ్రి జ్ఞాపకమొచ్చాడు. అతని కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. "ఆహా! మా నాయన యిప్పుడుంటే ఎంత బాగుండేది! మనిద్దరిని భార్యాభర్తలుగా చూడాలని ఆయనెంతో ముచ్చటపడ్డాడు. ఎంత సంతోషించేవాడో గదా! ఆనాడు అనుకున్నప్పుడే మనకు పెళ్ళయితే బాగుండేది" అన్నాడు.

"నిన్ను పెళ్ళిచేసుకోవాలని ఎంతో ఉబలాటపడ్డాను. కాని, నాకు అవకాశముంటేగా" అన్నది మేయీ.

"మనిద్దరం దగ్గరగా రావటానికి విప్లవంమాత్రమే తోడ్పడింది" అన్నాడతడు. అతని పెదిమలమీద ప్రేమ పొంగిపొరలింది. అది ఆమె పెదవులమీద ముద్దుగా రూపాంతరం పొందింది.

దీపం నిద్రపోయింది. గాఢాలింగనంలో వారిద్దరి హృదయాలూ ఏకమయ్యాయి. చాలా సేపటివరకూ ప్రేమ ప్రవాహపు జిలిబిలిగొణుగుళ్లు ఆ గదిలో నిశ్శబ్దాన్ని భంగం గావించాయి.

* * * *

మేయీ దాస్వేలకు వివాహం జరిగిందన్నవార్త ఎత్తయిన ప్రహరీ గోడలుగల పట్టణంలోవున్న జిన్లంగ్ చెవులకు సోకింది. అతడు తన వుక్రోషాన్ని, ద్వేషాన్నంతనూ తోటితొత్తు జీవోతో వెళ్ళబోసుకున్నాడు.

"ఆ తొత్తుకొడుకేదో చేస్తాడని నాకు తెలుసు" అని జిన్లంగ్ మండిపోసాగాడు. "నేనా- వాడక్కడను-! యీ బాకుతో వాణ్ణి హతమార్చిందే నిద్రపోతే వొట్టు" అన్నాడు.

"నిన్ను నాపవెధవకింద జమకట్టా దేనాదో" అన్నాడు జీవో విషపు నవ్వు నవ్వుతూ.

"చూస్తారుగా! ఎప్పుడో ఒకప్పుడు వాళ్ళిద్దరినీ చంపేస్తా!" అని మొరగసాగాడు జినంగ్.

ఆర్డర్లీ ఒక దక్కడకు వచ్చాడు. కమాండరు మీతో మాట్లాడాలంటున్నారని జినంగ్‌తో చెప్పాడు

కీలుబొమ్మలు ఒక కేథలిక్ చర్చిని ఆక్రమించుకొన్నారు. దానిలో పెద్ద కోటను కట్టారు. హో కోట వెనుకభాగంలోవున్న పెద్ద భవనంలో కాపురముంటున్నాడు. అక్కడే జినంగ్ అతణ్ణి కలిశాడు.

కమాండరు హో హుషారుగా వున్నాడు. 'బందిపోట్లప్రాంతం'లో చొరబడటానికని 'అగ్రగామి దళాల'ను ఏర్పాటుచేయబోతున్నామని, కొమింటాంగ్ తన వార్త పంపినదని అమిత సంతోషంగా కమాండర్ హో, జినంగ్‌తో చెప్పాడు.

ఈ అగ్రగామి దళాలు చేయవలసిన పనులేమంటే 'పోగొట్టుకున్న ప్రాంతాలను' మరల గెల్చుకోవడానికి, రహస్యంగా యీ ప్రాంతాలలో చొరబడి, కార్యకర్తలను హత్యజేయుటకై ఖూనీకోళ్ళముఠాలను ఏర్పరచాలి!

ఈ కార్యక్రమంలో పాల్గొన్నందుకు హోగారి కీలుబొమ్మలకు పారితోషిక మివ్వబడుతుందని కొమింటాంగ్ ఆ జాబులో వ్రాసింది. అంతేగాక దీనికితోడుగా, జపాను జనరల్ కామెసాకా యీ కార్యక్రమాన్ని ప్రోత్సహించుటకై చాలా డబ్బు పంపాడు. ప్రాథమిక ఖర్చులకుగాను హోగారు జినంగ్‌కు పెద్ద నోటకట్టను ప్రసాదించాడు.

ఇలాంటి పనంటే జినంగ్‌కు మహాప్రీతి. "నా కీ పని నప్పజెప్పటం వలన మీరు పొరపాటుపడినట్లుగాదు" అని జినంగ్ గప్పాలు దంచాడు. తన పిడికిలితో గుండెమీద కొట్టుకొంటూ చెప్పాడు ఆ విధంగా. హోగారితో వ్యూహాన్ని చర్చించి జినంగ్ తన మనుషులను తీసుకొని, సాధన సామగ్రిని వెంటబెట్టుకొని బయలుదేరాడు.

ప్రజాసైనికులకొరకు రైతాంగనలు కుట్టి తయారుచేసిన వంద

జత్తల చెప్పులను మేయీ పోగుజేసింది. ఆమె ఆ చెప్పులను మూడు కట్టలుగా కట్టింది. కౌంటీ ప్రభుత్వం వున్న తావులో ఒక సమావేశం జరుగనున్నది. ఆ సమావేశానికి యీ చెప్పులను తీసుకొని మేయీ బయలుదేరింది. చీకటిపడుతూ వున్నది. చెప్పులకట్టలు బరువుగా వున్నాయి. దాస్వే, వాంగ్ అనే కార్యకర్తలు ఆ కట్టలను మోయుటలో సాయపడతామన్నారు.

వాళ్ళు బయలుదేరేసరికి బాగా చీకటిపడింది. చంద్రోదయం కాలేదు. నక్షత్రాలుమాత్రం అక్కడక్కడా మెరుస్తూవున్నాయి. వాళ్ళు కొద్దినిముషాలపాటు కబుర్లు చెప్పుకుంటూ నడవసాగారు. ఇంతలోనే దాస్వే హెచ్చరికగా చేయెత్తాడు.

"మాట్లాడబోకండి! ఆ సమాధుల వెనుక కనపడుతూవున్నది మనిషినీడ కాదూ?" అన్నాడు.

"ఎక్కడ?" అని మెల్లగా మేయీ అడిగింది. దాస్వే జవాబు చెప్పేలోపలనే, రెండు తుపాకిగుళ్ళు మ్రోగాయ్. మేయీ పైచేతికి చీరుకొనిపోయినట్లు నొప్పికలిగింది. మేయీ తొట్రుపడుతూ అరచింది.

"నేలమీదపడండి" అని అరచాడు దాస్వే. అతడు ఆమెను, వాంగ్‌నూ నేలకులాగాడు. వారి నెత్తిమీదుగా తుపాకిగుళ్ళు బజ్‌మంటూ ఎగిరిపోయాయి.

"దొంగతొత్తుకొడుకులు!" అని తిట్టాడు వాంగ్. "వాళ్ళెమ్మా-! కుక్కలకొడుకులను పట్టుకుందాంపద" అన్నాడు.

తుపాకిగుళ్ళు వచ్చినదిక్కుగా వాంగ్, దాస్వేలు తమ పిస్తోళ్ళను గురిచూసి కాల్చారు. తుపాకి కాల్పులధ్వని వినగానే గ్రామంనుండి మరికొంతమంది ప్రజాసైనికులు పరుగెత్తుకొచ్చారు. సమాధివెనుకనున్న వ్యక్తులు మాయమయ్యారు.

మేయీ చొక్కాచెయ్యి రక్తంతో తడిసిపోతూవుంది. పళ్ళను నొక్కిపెడుతూ పెద్దగాయంకాదులెమ్మన్నదామె. దాస్వే ఆమెకు చేయూతనిచ్చాడు. వారందరూ మరల గ్రామానికి తిరిగివచ్చారు. ఇది కీలుబొమ్మ గూఢచారుల పనేనని వాళ్ళు వూహించారు.

మేయిని స్థానిక ఆసుపత్రికి పంపారు. అక్కడ ఆమె గాయానికి కట్లుకట్టారు. అదృష్టవశాత్తు చేత ఎముక విరగలేదు. ఆమె తొందరగా కోలుకొంది.

* * * *

కొద్దిరోజులలోనే మరియొక సంఘటన సంభవించింది. ప్రస్తుతం జిల్లాప్రజాసైన్యంలో సభ్యుడు శివా. వాడిమూలంగానే ఆ రెండవ సంఘటన జరిగింది. వాడికి సిగరెట్లు కొనుక్కోటానికి చేతిలో డబ్బులేకపోయినది. వాడొక రైతుయొక్క కోడిపిల్లను దొంగిలించి అమ్మటానికని మార్కెట్‌కు తీసుకొనిపోతూవుండగా తేవార్ వాణ్ని పట్టుకున్నాడు.

ఆ ప్రజాసైనికునికి కోపంవచ్చింది. శివాను గట్టిగాచీవాట్లు వేశాడు. శివా ఆ కోడిపిల్లను దాని యజమానికని వప్పజెప్పి చెంపలేసుకోవాల్సి వచ్చింది.

శివా అసంతృప్తితో కుమిలిపోయాడు. కాని ఎదురు జవాబేమి చెప్పలేదు. కొద్దిరోజులు గడచిన తర్వాత శివా తనకు జబ్బుగావుందన్న సాకుతో ఇంటికిపోయాడు. డబ్బు సంపాదించుదామన్న ఆశ యింకా అతనికి చావలేదు. అతడు ఎవరివద్దనో ఒక చిన్న పడవతీసుకొని, చేపలు పట్టుటకు పోయాడు. ఆ రోజున పొగమంచు బాగా పట్టింది. కనుచూపు మేరలో అంతా తెల్లగానే కనబడియున్నది. శివా సరస్సులో వల వేశాడు. తనదోవవైపుగా వలనులాగుతూవుండగా ఎవరో పిలిచినట్లు వినిపించిందతనికి.

"ఏయ్! శివా! ఏ జేస్తున్నావిక్కడ?"

శివా తనచుట్టూ కలయజూశాడు. మరొకమనిషితో జిన్లింగ్ రెల్లు దుబ్బులలోనుంచి బయటకు వస్తున్నాడు. ఆ కొత్తవాడిని శివా గుర్తుపట్టలేకపోయాడు. జిన్లింగ్‌ను చూడగానే శివాకు భయంవేసింది. కాని పారిపోదామంటే ధైర్యంచాలక అక్కడే నరాలను చిక్కబట్టుకొని నిలబడ్డాడు.

జిన్లంగ్ బోటు మరింత దగ్గరగా వచ్చింది. వూకదంపుడు కబుర్లు చెప్పుకొన్న తర్వాత. ఆ కీలుబొమ్మ ప్రజాసైన్యంలో వుండకుండా యిక్కడ చేపలుపడుతున్నావేమని శివౌను అడిగాడు. శివౌ తన పరిస్థితులను జిన్లంగ్‌కు వివరించుకొన్నాడు.

"రోజంతా చేలుపడతావనుకో, ఎన్నిచేపలు పట్టుకొనగలుతావ్?" అని నవ్వాడు జిన్లంగ్. "కాలాన్ని వృధాచేయబోకోయ్! సొంత ఖర్చులకు ఈ కొది డాలర్లను తీసుకుపో!" అన్నాడు. శివౌ సందేహించాడు. కాని జిన్లంగ్ కామాలిపు జీడిలాగున వదలక "మనిద్దరం సోదరులం. 'నీది', 'నాది' అనేభేదమే వుండకూడదు మనిద్దరిమధ్య. వూఁ తీసుకో" అని బలవంతం జేశాడు.

ఇప్పుడు అతనివద్ద ఈవిధంగా డబ్బు తీసుకొంటే యేదోవిధంగా ముట్టజెప్పవలసియుంటుదన్న విషయం శివౌకు తెలుసు. కాని ఈ పరిస్థితులలో అతిదేమి చేయగలడు? అతడు ఆ డబ్బును తీసుకున్నాడు. జిన్లంగ్ పడవనడుపుకొంటూ వెళ్ళిపోయాడు.

తదుపరి మూడురోజులపాటూ యిల్లువిడిచిపెట్టి పోవటానికి శివౌకు భయమేసింది. మూడవరోజు సాయంత్రం శివౌను చూడటానికి జిన్లంగ్ వొంటరిగా వచ్చాడు. తోడేలు మేకపిల్లను గౌరవించటానికి వచ్చినవిధంగా వుందన్న విషయం శివౌకు తెలుసు. కాని అతదేమి చేయగలడు? అతిధిని ఆహ్వానించాలిగదా! ఇంటికి వచ్చిన అతిధితో మాట్లాడకుండా, గౌరవించకుండా ఎలా వుండగలుగుతాడు? అందువలన శివౌ తన అతిధిని ఆహ్వానించాడు. జిన్లంగ్ వెంటనే అసలువిషయాన్ని కాస్త బయటపెట్టాడు. బాలూ రోజులు దగ్గరపడ్డ యన్నాడు. గ్రామాలలోవున్న బాలూని నాశనం చేయటానికి త్వరలో జపానువాళ్ళూ, కీలుబొమ్మలూ రానున్నారని చెప్పాడు. పాత తాపులో కొత్తకోటను కట్టబోతున్నారని చెప్పాడు.

శివౌ జిన్లంగ్‌చెప్పిన ప్రతిమాటనూ నమ్మాడు. "నేనేంజేయాలి?" అని జిన్లంగ్‌ను అడిగాడు గాబరాగా శివౌ.

"నీవు భయపడాల్సిన అవసరమేమీలేదు" అని జవాబు చెపుతూ స్నేహపూర్వకంగా చిరునవ్వు నవ్వాడు జిన్లంగ్. "మిగతావాళ్ళెవరూ

తప్పించుకోలేరుగానీ, నీకేమి ఫరవాలేదు. నాతో కాస్త సంబంధాలు పెట్టుకుంటూవుండు. నీకేం మూడదని నేను వ్యక్తిగతంగా హామీ యిస్తున్నా" అన్నాడు జిన్లంగ్.

శివౌకు కొన్ని పాకెట్ల నల్లమందును యిచ్చి జిన్లంగ్ వెళ్ళిపోయాడు.

ఆ మరునాటి రాత్రి జిన్లంగ్ మరల వచ్చాడు. సానుభూతిపూర్వకంగా జిన్లంగు ఉపక్రమించాడు. "శివౌ, నువ్వు యింత బీదరికాన్ని అనుభవిస్తూవుంటే చూడలేకుండా వున్నా. కాస్త దార్లుకాచి దోచుకోటానికి ఏదో కొంతమందిని ఒకముటా లేవతీద్దాంపట్టు. తీరికసమయంలో యేదో ఒకరిద్దరు కార్యకర్తలను చంపి, వాళ్ళ తుపాకులను లాక్కుందాం. జపానువాళ్ళు మనకు బహుమతులు ఇస్తారు. ఏమంటావ్?" అన్నాడు జిన్లంగు.

"నే - నేను ఆ విషయం ఆలోచిస్తాను" అని జవాబు చెప్పాడు సివౌ.

జిన్లంగు వెళ్ళిపోవుటకు లేచి నిలబడ్డాడు. "నా హృదయంలో నీ మేలు కోరకపోయినట్లయితే, యిప్పుడు మీ యింటికి వచ్చేవాడినిగాదు. ఫరాణదోస్త్! మా పక్షంలోజేరి పనిచేశావా అంటే నీకే చాలాలాభం కలుగుతుంది: అయితే నిన్నొకటి హెచ్చరిస్తున్నా! నా విషయం బయట పెట్టావంటే నీ కుటుంబమంతా చావటానికి సిద్ధంగావాలి: ఆలోచించుకో!" అని బెదిరించాడు జిన్లంగు.

జిన్లంగు అక్కడినుండి వెళ్ళిపోయిన తర్వాత, శివౌ గంటల కొలది ఆ విషయంమీద బుర్రపగులకొట్టుకున్నాడు. దేశద్రోహియైన జిన్లంగుకు సహాయపడటం అతనికిష్టంలేదు. అయితే వాణ్ని బట్టబయలు చేయటానికి ధైర్యం లేదతనికి.

జిన్లంగు మరల వచ్చినప్పుడు "మంచిది. నిశ్చయించుకొన్నావా" అని ప్రశ్నించాడు సివౌను.

ఈనాటి శివౌను జాడ్యం అంటుకుంది. అంతేగాక, వానికి మార్గాం

తరమేమీ కనపడటంలేదు. "మీరు మీ సంఘాన్ని ప్రారంభించండి. దానిలో జేరటానికే నిశ్చయించుకొన్నా" అని జవాబు చెప్పాడు శివొ.

ఒక్కసారి దేన్నయినా కోరికాడంటే దాన్నంతా మింగేవరకూ నిద్రపోయేరకంగాదు జిన్లంగ్. అతడు వెంటనే రిక్రూట్లనందరినీ పోగు జేసే పనిని శివొకు వప్పగించాడు. తనకు చాతనయినదంతాచేస్తానని వాగ్దానం జేశాడు జిన్లంగ్.

రెండురోజులతర్వాత మరల జిన్లంగ్ వచ్చాడు. వాడు బాగా తప్పతాగాడల్లే వుంది. కళ్ళు జ్యోతుల్లాగున ఎర్రగావున్నాయ్. బాగా మండుతున్నాయి. "ఎంతమందిని పోగుచేశావ్?" అని శివొను అడిగాడు.

"సరియైనవా డొక్కడూ దొరకలేదు. జుజ్జురకంతో వ్యవహరిస్తే మనకు చెరుపు జేస్తారేమోనని భయమేసింది" అని శివొ జవాబుచెప్పాడు.

జిన్లంగ్ అతనివంక నిరుత్సాహంగా చూశాడు. "నీవొట్టి పనికి మాలినవాడివి. ఆఖరికి నీవు మొగవాడివికూడా కాదు. ఊః ఫరవాలేదులే! ఫరవాలేదు. అటు తర్వాత చూసుకోవచ్చు. రేపు మనం దెబ్బతీస్తాం."

"ఏవిధంగా?" అని వణుకుతూ ప్రశ్నించాడు శివొ.

జిన్లంగ్‌యొక్క కనుబొమలు క్రూరంగా ఎగిరాయి. అతనికళ్ళు ఖూనీకోరుతనన్ని కక్కాయ్. "అంతా సిద్ధంగావుంది." అని క్రూరవేగముతో చెప్పాడు జిన్లంగ్. "వాళ్ళ జిల్లా హెడ్‌క్వార్టర్స్‌ను ముట్టిపెట్టబోతున్నాం. తేవార్‌ను చంపబోతున్నాం. దాస్వేను పట్టుకోబోతున్నాం. ఆ తొత్తుకొడుకులచుట్టూ వుక్కవలను వేయబోతున్నాం. రేపురాత్రి మనమంతా కలసిపోదాం. వాళ్ళను ఈ భూమినుండి సాగనంపే ఆనందాన్ని పొందుదాం" అన్నాడు జిన్లంగ్.

శివొ హృదయం తృళ్ళిపడింది. వళ్ళు ముడుచుకొంది. కాని ఏమీ పట్టనట్లు నటించాడు.

"అయ్యో! తుపాకి తెచ్చుకోవటం మరచిపోయాను" అన్నాడు శివొ విచారంగా.... "ఉత్త చేతులతో నేనేం చేయగలుగుతాను?" అన్నాడు.

"ఛూ!" అని వుమ్మేశాడు జిన్లంగు. "వీటిని వుపయోగించవచ్చునులే" అని సివొకు జపానువాళ్ళ చేతి బాంబులను రెండింటిని యిచ్చాడు.

"ప్లానేమిటి? మనకెంతమంది వున్నారు?"

జిన్లంగు తప్పతాగినప్పటికీ తెలివిలోనే వున్నాడు. "ఆ విషయం గురించి బెంగపెట్టుకోకు" అన్నాడు అతికంత్రీగా.

"రేపురాత్రి మృగశిర దక్షిణ దిక్కున వుదయించేసరికి నీవు హ్వాంగుహ్వా గ్రామానికి తూర్పుదిక్కున వున్న గుంట దగ్గరలోని విల్లోవృక్షంక్రింద వుండు. నీకోసం ఒకమనిషి వస్తాడు. వాడు మూడు మాట్లు చప్పట్లుకొడతాడు. అదేగుర్తు వాడికి. వాడు నిన్ను మావద్దకు తీసుకొనివస్తాడు" అన్నాడు.

సివొ ముఖం పాలిపోయింది. అతనిముఖంవంక తీవ్రంగాజూచాడు జిన్లంగు. లోకంఠంతో "నా సంగతి తెలుసుగా! జాగర్త" అన్నాడు. "నీవు బాగా పనిజేస్తే, మేం జయంపొందితే, నీకు బాగా ముట్టజెపుతా. నీవు తప్పిపోయావా చూసుకో నా తడాకా! నా చేతులు నలుపెక్కాల్సి చస్తుంది. ఆ తరువాత నన్నని లాభంలేదు!" అని బెదిరించి జిన్లంగు కాంగుమీద డబ్బుపడేసి తొందరగా వెళ్ళిపోయాడు.

సివొకు ఆ రాత్రంతా నిద్రపట్టలేదు. అతని గుండెలమీద యేదో వెయ్యిమణుగుల బరువుపెట్టినట్లయింది. ఆ మరునాటి ఉదయం అతనికి భోజనము రుచించలేదు. అతనికి ముఖం అంతా మండిపోతున్నట్లుగా అనిపించింది. విసగటగా కాంగుమీదపడి దొర్లుతూవున్నాడు. మధ్యాహ్నమయేసరికి తేవార్, దాస్వేలు వచ్చారు. వాడు వస్తూ ఉడకబెట్టిన కోడిగ్రుడ్లనూ, యేదో పులుసు కూరనూ తెచ్చారు. సివొ ముఖం బాగా యెర్రబారి, వుబ్బివుంది. అతని ముఖాన్ని చూడగానే దాస్వే ఖంగారుపడ్డాడు.

"ఏమిటి బాధ సివా?" అని అడిగాడు దాస్వే. "కొద్దిరోజుల్లోనే బాగా చిక్కిపోయాడే" అన్నాడు.

జబ్బుగావున్న ఆ మనిషి చేతులను పుచ్చుకొని తేవార్ "నాదొట్టి దుడుకు స్వభావమోయ్! నాకా పిచ్చికోపమొచ్చినపుడు నేనేంజేస్తున్నానో నాకే తెలియదు. నాకు చాలా విచారంగావున్నది. నిన్నావిధంగా బాధపెట్టి నందుకు క్షమించు" అన్నాడు

"దాస్వే. తక్కిన కామ్రేడ్స్ నన్ను విమర్శించినారు.... నాదే తప్పుని ఒప్పుకున్నాను. నన్ను క్షమిస్తావని ఆశిస్తున్నా" అన్నాడు తేవార్.

కళ్ళనీళ్ళు పెట్టుకొంటూ సివా "అ(ః) అలా అనబోకు. అదంతా నా తప్పు. నీ ముఖం చూడాలంటే నాకు సిగ్గేస్తుంది" అన్నాడు సివా. హృదయభారంతో కృంగిపోతున్నాడు. అతనికి నోటవెంట మాటలు పెకలలేదు. భోరున యేడ్వసాగాడు. ఆ కార్యకర్తలు అతణ్ని వోదార్చ సాగారు.

"మనమందరం తప్పులుచేస్తాం, అందరికి లోట్లున్నాయి." అని వోదార్చారు. "ఒక్కమారు వాటిని సరిదిద్దుకొన్నావా, అప్పుడవన్నీ సవ్యముగా నడచిపోతాయ్: కొంతకాలం విశ్రాంతి తీసుకో. వంట్లో బాగున్నప్పుడే పనిలోకిరా. ఏదయినా కావల్సివస్తే మాతోచెప్పు. మేం తప్పకుండా సహాయంచేస్తాం. నీ ఆరోగ్యాన్ని గురించి కామ్రేడ్స్ అందరూ గాబరా పడుతున్నారు. వాళ్ళంతా వచ్చి నిన్ను చూడాలనుకుంటున్నారు" అన్నారు వారు.

తనకేమీ జబ్బుగాలేదని సివా నొక్కిచెప్పాడు. ప్రజాసైన్యంలోకి తప్పకుండా మరల తీసుకొంటామనిచెప్పి, ఆ కార్యకర్తలు అక్కడనుండి వెళ్ళిపోవుటకు లేచారు.

"ఈ రాత్రి మాకు ఒక సమావేశం వుంది. మళ్ళీ ఒకనాడు వచ్చి చూస్తాం" అని చెప్పారు. తేవార్, దాస్వేలు అతనివద్ద సెలవు తీసుకొన్నారు.

వాళ్ళు ఆవరణదాటి బయటకిపోతూవుండగా, సివా బుర్రలో

తుఫాను రేగింది. "తమ్ముళ్ళ అతిద్రోహకరంగా నాశనంజేయుటకు ఆ ద్రోహులు వేస్తున్న ప్లానులు పాపం! వీళ్ళకు తెలియవు ...ఎంత మంచి వారు వీరు! కాని నాకు తెలుసు. నోరుమూసుకుని ఎలా పడివుంటాను" అనుకోసాగాడు సివా. అతనిరక్తం ఉడికిపోసాగింది. తనసంగతే మరచి పోయి, కాంగుమీదనుండి దూకాడు. పొట్టి కాళ్ళతో పరుగెత్తారు. ఇతని కేకలు వినగానే వాళ్లు వెనక్కు తిరిగొచ్చారు. అతనిలో జి ంగంటే భయం ముప్పిరగొంటున్నప్పటికీ భోరున ఏడుస్తూ యావత్కథనూ కక్కేశాడు.

దాస్వే, తేవారులు తమగ్రామానికి తిరిగివెళ్ళారు. జిల్లాప్రభుత్వ పెద్దయయిన జియువోతో ఈ విషయాన్ని చర్చించారు. గూఢచారితో సివాను కలియనిచ్చి దూరాన్నుంచి వాళ్ళను ప్రజాసైనికులు కనిపెడుతూ వాళ్ళదరివెంట ఖూనీకోరుల ముఠా దాక్కొన్న తావులకుపోయి, వాళ్ళం దరినీ మొత్తంగా పట్టేయాలని వాళ్ళు మొదట ప్లానువేశారు. గూఢచారి తమ్ముళ్ళ కనిపెట్టేస్తాడేమోననీ లేకపోతే ప్రజాసైనికులు చుట్టుముట్టే లోప లనే ఖూనీకోర్ల ముఠా తప్పించుకొని పారిపోగలదేమోననీ భయపడ్డారు. చిట్టచివరకు గూఢచారినే లంకించుకొని, ఆ ముఠా ఎక్కడ దాక్కొన్నదో వానిచేతనే బయటపెట్టించాలని వాళ్ళనుకున్నారు.

సివాను రహస్యంగా జిల్లా హెడ్‌క్వార్టర్స్‌కు తీసుకొనిపోయారు. ప్లానులో అత నేరకమైన పాత్రవహించవలసిందీ అతనికి చెప్పారు. కాని వాడు భయంతో వణికిపోయాడు. సహకరించ నిరాకరించాడు. తేవార్, దాస్వేలు అతనితో బాగా వాదించారు. నచ్చజెప్పిన తర్వాత మొదటి ప్లానులో కొన్నిమార్పులు జేసిన తర్వాత అయిష్టంగా వప్పుకున్నాడు.

"సివేనా సి ?" అని పిస్తోలు చూపిస్తూ అడిగాడు వాడు.

"అవును. మన మెక్కడికిపోవాలి?" అని సివా అడిగాడు.

"నాతో రా!"

తేవార్, దాస్వేలు సీదల్లోనుండి బయటకుదూకి, తమ తుపాకులను సివా, గూఢచారిమీద గురిపెట్టి "మాట్లాడారా చంపుతాం! తుపాకులు కిందపడేయండి." అని బెదిరించారు.

"ఇదిగో తుపాకి!" అని మొరిగాడు ఆ గూఢచారి. చేతినివూపి తుపాకి కాల్చి పారిపోయాడు.

వాణ్ణి సజీవంగా పట్టుకోవాలన్న వుద్దేశంతో కార్యకర్తలు వేగముగా వాడివెంట పరుగెత్తారు. కాని ఆ కీలుబొమ్మ గోధుమ పొలాల వైపు పరుగెత్తుతూంటే, వాడు తప్పించుకొని పారిపోతాడేమోనన్న భయంతో మూడుసార్లు తమ తుపాకులు పేల్చి, వాణ్ణి నేలకొరిగించారు.

ఆ పరిసరప్రాంతాన్నంతటినీ గాలించివేసింది జిల్లాప్రజాసైన్యం. కాని లాభంలేకపోయింది. కాల్పులధ్వనిని వినగానే జిన్లంగూ, వాని రాజకీయ బందిపోటు దొంగలముఠా కాలికి బుద్ధిచెప్పింది.



373

# 17 అధ్యాయం

దాస్కో, మేయీలకు వివాహమయిన కొద్ది రోజులకే మేయీ గర్భవతి అయింది. 1945 సంవత్సరం ప్రారంభమయ్యేసరికి మేయీకి నెలలు వచ్చినాయి. అయినప్పటికి ఆమె అధికోత్పత్తిని సాగించుటకు రైతాంగ ప్రజలను సమీకరిస్తూనేవుంది. తన కివ్వబడిన పనిని మానకుండా రాత్రింబవళ్ళు పగలూ కష్టపడి పనిచేస్తూనేవుంది. ప్రతి రైతుకు జనించే ఉత్పత్తి సమస్యలను పరిష్కరించుటలో సహాయపడుతూ, మేయీ ప్రతి గ్రామం, ప్రతి యిల్లూ తిరుగుతూనేవుంది. విశ్రాంతి తీసుకోవలసినదిగా మిత్రు లెంత బ్రతిమాలినా వినకుండ పనిచేస్తూనేవుంది.

ఒకనాడు మేయీ ఒక మీటింగునుండి వచ్చింది. ఆమె బాగాఅలసిపోయింది. ఆమె తన గదిలో ప్రవేశించగానే, ప్రసవవేదన ప్రారంభమయింది. నొప్పులు అధికమయ్యాయి. అమితవేగంగా నొప్పులు రావటాన్నిజూచి మేయీ తను వుంటున్న యింటి యజమానురాలిని కేకేసింది. ఆ యిల్లాలు వెంటనే పరుగెత్తుకొచ్చింది. మేయీవంక జూచి, తన పని ప్రారంభించింది.

"అయ్యో నా పిచ్చితల్లీ! పడుకోవేమే" అని చివాట్లు పెట్టింది. మేయీని కాంగ్‌మీద పడుకోబెట్టింది. "పిచ్చిదానిలాగున పనిజేస్తున్నావు. ఈ మాసంలోకూడా పనిజేస్తారా! నెలలు నిండినాయన్న సంగతి నీకు తెలియదూ?"

"ఉత్పత్తి.... చాలా ప్రధానం" అని రొప్పుతూ జవాబు చెప్పింది.

మేయీ. "బాగా చెయ్యకపోతే....మనం జపానువాళ్ళను నోడించలేం" అన్నది.

ఆ యిల్లాలు తలాడించి "మా రైతులకోసం నీ రక్తాన్ని ధారపోస్తున్నావమ్మా" అన్నది.

కొద్ది నిమిషాలైన తర్వాత మేయీ ప్రసవించింది. కొడుకుపుట్టాడు గులాబిరంగు; చక్కగా బొద్దుగా వున్నాడు. తెల్ల టాల్కం పౌడరు కొట్టినట్లుగా వుం దతని శరీరం రంగు.

మేయీ ప్రసవించిన వార్త ఆ వాడకట్టంతా తెలిసిపోయింది. ఆ వాడకట్టులోని స్త్రీలందరూ ఖర్జూరకాయలు, మిఠాయి, బియ్యం, కోడిగ్రుడ్లు కానుకలుగా తెచ్చారు. అందరూ ఆ పిల్లవాణ్ని యెత్తుకోవటానికి వుబలాటపడినవాళ్ళే।

"ఇదిగో చూడు ఎంత బాగున్నాడో!" అని ఒక స్త్రీ మెల్లగా చెప్పింది. "పెద్ద తల, పెద్ద చెవులు- తప్పకుండా తెలివిగలవాడవుతాడు- దాస్వే రూపమే! అంతా మూర్తులా దాస్వేకి నకలు!"

"ఆ కళ్ళు చూడు! ఎంత బాగున్నాయో! అంతా తల్లి కళ్ళే!" అని యింకొక స్త్రీ అన్నది.

"నిజమే! మంచి పుల్లిపాయకు మంచి బొద్దుంటుందని సామెత. అలాగే మంచి తల్లిదండ్రులకు మంచి బిడ్డలు!" అన్నది యింటి యజమానురాలు.

దాస్వేకి యీ కబురు తెలియగానే యింటికి పరుగెత్తుకొనివచ్చాడు. అతణ్ని పిచ్చి సంతోషం ఆవేశించింది. అమాంతంగా పిల్లాణ్ని యెత్తుకొన్నాడు. మురిసిపోయాడు. చూడటానికి వున్న రెండు కళ్ళూ చాలవనిపించిం దతనికి.

చిట్టచివరకు ఆ పిల్లవానికి 'చిన్నచెబ్బీ' యని పేరుపెట్టి పిలుద్దామనుకున్నారు. మామూలు పేరు తర్వాత పెట్టుకోవచ్చులే అనుకున్నారిద్దరూ.

ఆ మరునాటి ఉదయం మేయీ దాస్వేని ఆఫీసుకు పోవలసిందిగా

బ్రతిమాలింది. తనకు పిల్లాడికి సహాయం చేయటానికి బోలెడంతమంది యిరుగు పొరుగువాళ్ళున్నారని చెప్పింది. అతికష్టంమీద దాస్యే యిల్లు విడిచి ఆఫీసుకు పోయాడు.

* * * *

1945 వసంతకాలంలో "శత్రు ఆక్రమితప్రాంతాన్ని కుంచించి, విముక్తప్రాంతాన్ని విస్తరింపజేయండి" అని చైర్మన్ మావోయాంగ్ పిలుపిచ్చాడు. దాన్ని అనుసరించి ప్రాంతీయసైన్యం విజృంభణయుద్ధాన్ని ప్రారంభించింది. తత్ఫలితంగా అనేక ప్రదేశాలను మరలస్వాధీనంచేసుకోగల్గింది.

మే నెలలో జరిగిన ప్రాంతీయ ప్రభుత్వ సమావేశానికి హాజరైన తర్వాత బ్లాకీత్సే కౌంటీ జిల్లాకార్యకర్తలను సమావేశపరిచాడు. సోవియట్ యూనియన్‌చే జర్మన్, ఇటాలియన్ ఫాసిస్టులు వోడింపబడ్డారనిచెప్పాడు కార్యకర్తలు సంతోషంతో వుప్పొంగిపోయారు.

"ఇక రంగంలో జపానువాళ్ళు మాత్రమే మిగిలారన్న మాట!" అని కార్యకర్తలు ఉత్సాహంగా అరిచారు. "వాళ్ళను త్వరలో పూర్తి జేద్దాం" అన్నారు.

కార్యకర్తల చప్పట్లు, కేరింతలు తగ్గినతర్వాత, బ్లాకీత్సేప్రాంతీయ సైన్యానికి తోడ్పాటుగా జిల్లా కౌంటీ సైన్యాలు శత్రువులపై దెబ్బతీయవలసినదిగా అధికారుల పిలుపు యిచ్చారని చెప్పాడు. నగరాలలోనూ, ఎత్తయిన ప్రహరీ గోడలుగల పట్నాలలోనూ మిగిలిన శత్రువు స్థావరాలన్నింటినీ వెంటనే తుడిచిపెట్టివేయాలి.

అంగీకారసూచకంగా కేకలు, కరతాళధ్వనులూ చెలరేగాయి. దీర్ఘకాలంగా ఎదురుచూస్తున్న ఆజ్ఞను విజయవంతం జేయుటకై వెంటనే ప్లానులు వేయబడ్డాయి.

బ్లాకీ బాధ్యతక్రిందవున్న కౌంటీలో ఒక నగరం, ఎత్తయిన ప్రహరీ గోడలుగల ఒక పట్నం వున్నాయి. జపానువాళ్ళు ఆ పట్నం నుండి తప్పుకొని నగరం జేరారు. పట్నంలోమాత్రం యేభైమంది సైని

కులు గల ఒక ప్లాటూనును వుంచిపోయారు. ఒక ప్లాటూన్ కీలుబొమ్మ సైనికులతో జపానువాళ్ళు ఆ పట్నంలో దక్షిణపు పెద్దగేటునకు కొన్ని వందలగజాల దూరంలో మిలిటరీ హెడ్‌క్వార్టర్స్ కేంద్రాన్ని నడుపుతున్నారు. వీరికి తోడుగా 150 కీలుబొమ్మసైనికులుగల కంపెనీ హో నాయకత్వంక్రింద నడుస్తూంది. ఈ కంపెనీకి జిన్నంగు లెఫ్టినెంట్‌గా పని జేస్తున్నాడు. ఈ కంపెనీయొక్క మొదటిప్లాటూనుకు జీవో నాయకుడు. జీవో, హో, జిన్నంగులు ఇంతకుపూర్వం కాథలిక్ చర్చిగానున్న దానిలో కట్టబడిన ఎత్తయిన బురుజుగల కోటలలో నివసిస్తున్నారు. రెండవ ప్లాటూనులో సగభాగం దంగ్ అనేవాడి నాయకత్వాన పట్నంయొక్క తూర్పుభాగంలో కాపలాకాస్తూవున్నది. మిగతా సగానికి గౌపీ నాయకుడు. పట్నంయొక్క పశ్చిమభాగంలో ఒకకోట కట్టబడింది. దానిలో తమ సైనికులతో గౌపీ వుంటున్నాడు. పట్నంచుట్టూవున్న గోడలపై ఎనిమిదిగూళ్ళ కట్టారు. అందులో మూడవప్లాటూనులో సైనికులు కాపలా వుంటున్నారు. కఠిన సైనికశాసనం అమలుజరుపబడుతూ వుంది.

జాయాగు సరస్సులో ప్రవేశించేముందు పూనది రెండుపాయలుగా చీలింది. మధ్య లంక ఏర్పడింది. ఈ లంకమీదనే మనం చెప్పుకొంటున్న పట్నముంది. పట్నం గోడలచుట్టూ సహజకందకంగా నదివుంది. ఇక ఆ పట్నానికి పోవాలంటే నదీతటంనుండి తూర్పుగేటువద్దకు ఒక బ్రిడ్జి వుంది. అదొక్కటేమార్గం.

ప్రాంతీయ ప్రజాసైన్యం యీ గేటులో ప్రవేశించి తూర్పు ఉత్తర గోడలవదనున్న కీలుబొమ్మలను పట్టుబెట్టాలనీ, అటుతర్వాత పట్నం నడిబొడ్డులోవున్న కాథలిక్కు చర్చిలోని శత్రుమూకలను నాశనంచేయాలనీ, ప్రజాసైనికులు ప్లానువేసుకొన్నారు. ప్రాంతీయసైన్యానికి అడ్డంగా బాకీయొక్క కౌంటీప్రజాసైన్యం లోపల ప్రవేశించి, దక్షిణపు గేటువద్దనున్న జపానువాళ్ళను కీలుబొమ్మ సైనికులను హతమార్చాలని నిర్ణయించారు. దాస్వే, తేవారులు తన జిల్లా ప్రజాసైనికులను తీసుకొనిపోయి పట్నంయొక్క పడమటిదిక్కునవున్న శత్రుమూకలను హతమార్చాలని నిశ్చయించారు. మిగిలిన జిల్లా ప్రజాసైనికులు, దక్షిణపు పడమటిగోడల

మీద శత్రుసైనికులను మట్టుపెట్టాలని నిర్ణయించారు. అంతేగాక, ఇతర కౌంటీలు రెండింటినుండి వచ్చిన ప్రజాసైనికులు, పట్నంలోవున్న సైనికులను అండగా నగరంలోవున్న జపానువాళ్ళ సైనికులను పంపకుండా అడ్డగించుటకై రోడ్డుమీద కాపలా కాయాలని నిశ్చయించారు.

ముట్టడికై నిర్ణయించబడిన రాత్రి, బ్లాకీ తన నాయకత్వంక్రింద పనిచేస్తున్న కౌంటీ, జిల్లా ప్రజాసైనికులను సమావేశపరిచాడు. ఒక కమ్మరి వృద్ధుని వెంటబెట్టుకొని దాస్వే. తేవారుల గ్రూపు వున్న తావును వెదకుతూ బ్లాకీ వచ్చాడు.

"తూర్పుగేటుకు తీసుకొనిపోయే బ్రిడ్జి చాలా యిరుకైనది" అన్నాడు బ్లాకీ. "దాన్ని ముట్టడించాలంటే చాలామంది జనాన్ని పోగొట్టుకోవాల్సి వస్తుంది. ప్రాంతీయ ప్రజాసైన్యం హెడ్‌క్వార్టర్సు ఎవరినో ఒకరిని పట్నంలోనికి పంపి, గేటును లోపలినుండి తెరిపించవలసిందిగా ఆదేశించింది. దాన్ని తెరవడమెలాగో యీ వృద్ధునికి బాగా తెలుసు. నేను కమ్మరం నేర్చుకొంటున్న రోజులలో నాకు గురువు యీయన. ఆ పట్నంలోనే వుంటూవుంటాడు. బాగా తెలివితేటలుగలవాడు. ధైర్యంగలవాడయిన ఒక కామ్రేడ్‌ను ఎన్నుకోండి. ఈ వృద్ధునితో పంపుదాం. అది చాలా ప్రధానమైన పని. చాలా ప్రమాదకరమైనదికూడాను. ఎవరీ పని చేయగలుగుతారని మీ అభిప్రాయం?" అని అడిగాడు బ్లాకీ.

"నేను చెయ్యనా?" అని దాస్వే అడిగాడు.

"నే వెళ్తా" అన్నాడు తేవార్.

"మీ యిద్దరూ వద్దు" అని బ్లాకీ నవ్వాడు. "మీ యిద్దరూ మీ యిద్దరూ మీ ప్రజాసైన్యాలను నడపాలి" అన్నాడు.

తన సోదరుడు రియాని పంపితే బాగుంటుందని సలహాయిచ్చాడు దాస్వే. తేవార్ సంతోషంతో నేలను తాడించాడు. "రైట్! ఆ కుర్రాడికి భలే తెలివితేటలున్నాయి. మంచి ధైర్యంకూడావుంది. బాగాచేసుకొస్తాడు" అన్నాడు తేవార్.

రియోని పిలిపించారు. "నీ కిష్టమేనా?" అని అడిగారు.

"ఓ! తప్పకుండా!" అని సంతోషంగా జవాబుచెప్పాడు రియో. "ఎప్పుడు బయలుదేరుదాం?" అని అడిగాడు రియో.

"మెరుస్తూన్న డయల్‌గల గడియారం యిదిగో! సరిగా రాత్రి పన్నెండు గంటలకు నీవు గేటు తెరవాలి: నీవు బ్రిడ్జి మీదుగా వాళ్ళను తప్పించుకొని రావటానికని మన సైన్యం శత్రువులమీద మెషిన్‌గన్ ప్రేల్చుతూవుంటుంది. ఈ పని చేయగలననే ధైర్యముందా?" అడిగాడు బ్లాకీ.

ఆ కమ్మరి కడు వృద్ధుడు. బొడ్డు గడ్డంవాడు; గడ్డమంతా నెరిసి పోయింది. చూపులకు ఆ విధంగా వున్నా, యధార్థానికి మంచి బలశాలి. అతని విశాలహృదయంనుండి గలగల నవ్వు పొంగి పొరలివచ్చింది. "నేను దాన్ని తెరుస్తానని హామీ యిస్తున్నా! ఆ తాళాన్ని తెరుచుటకు నా ప్రాణాల్ని వొడ్డుతా!" అని రియోపంక అప్యాయంగా చూచాడు. "అబ్బా! కుర్రాడా! ధైర్యంగా నా వెంట వస్తావా?" అని అడిగాడు.

రియో తన బుగ్గలను వుబ్బించాడు. తలను ఒక్కప్రక్కకు వొరగబెట్టి "ఎందుకు కాదు" అని కోపంగా అన్నాడు. "మోసపుపెళ్ళిలో జపానువాడు ఇయ్‌నోను చంపినది నేనే! నేను పని సరిగ్గా చేయకపోతే నా తల కొట్టండి."

"సరే! సరే!" అని నవ్వాడు బ్లాకీ. రియోని బుజ్జగించాడు. "ఈ పని మీ యిద్దరిదీనూ!— వృద్ధునిది, కుర్రాడిది. మనం పట్నాన్ని పట్టుకొంటే మనకు ప్రథమ గౌరవం దక్కుతుంది." బ్లాకీ తన జేబునుండి మరియొక గడియారాన్ని బయటికి లాగాడు. "ఇది ప్రాంతీయ ప్రజా సైన్యానిది. మీ గడియారంతో దీన్ని సరిచేయండి" అన్నాడు బ్లాకీ.

ప్రాథమిక చర్యలు పూర్తయ్యాయి. రియో అమితోత్సాహంతో ఆ వృద్ధునివెంట ఎగురుతూ వెళ్ళాడు. దాస్వే వారివెంట నడిచాడు. తన సోదరుని భుజంమీద అప్యాయంగా చెయ్యివేసాడు దాస్వే.

"రియో! నీవు చిన్నవాడివి. చేయాల్సినది పెద్ద పని. అది చాలా తీవ్రమయిన పని. నీవు ఏదయినా చేసేముందు బాగా ఆలోచించి చెయ్యి.

వృద్ధునికి సహాయపడు. ధైర్యంగా వ్యవహరించు. అయితే అతి జాగ్రత్తగా వుండాలిసుమా! తప్పులు చేయబోకు!"

ఆ కుర్రవాడు నిటారుగా నిలబడ్డాడు. దాస్వే కళ్ళలోకి చూశాడు. అతిధైర్యంగా "ఏం గాబరాపడవద్దు! నేను నా డ్యూటీని పూర్తిచేయనైనా చేస్తాను, లేదా తిరిగి రాను" అన్నాడు.

దాస్వే అతని వీపుమీద చరిచాడు. "నువ్వు చేయగలవు. నిన్నభినందించుటకు ఎదురుచూస్తూ వుంటా "

రియూ, వృద్ధుడు ఇద్దరూ కంటికి కనపడనంతదూరంపోయేవరకు దాస్వే వారివంక రెప్పార్పకుండా చూశాడు.

మెల్లగా వెనుదిరిగి తన ప్రజాసైన్యం యూనిట్ వున్న స్థావరం వైపుగా తరలిపోయాడు దాస్వే.

* * * *

రియూ, ఆ వృద్ధుడూ ఆ పట్నానికి కందకంగావున్న యేటిపాయ వొడ్డువెంట నడువసాగారు. పట్నం ప్రహరీగోడకు నైరుతిదిక్కుకు యెదురుగా వచ్చి నిలబడ్డారు.

యేటిలో నీరు లోతుగానూ, వేగంగానూ వున్నది. ఏటిపాయను యీదుటలో సాయపడవలెనని రియూ వృద్ధునితో అన్నాడు. కాని ఆ వృద్ధుడు నవ్వాడు. అంతే! బట్టలు విప్పదీసి ఒక చేతితో పైకెత్తి పట్టుకొని రెండవచేతితో చులాకగా యీది ప్రహరీ గోడప్రక్కనున్నభూమి వద్దకు చేరాడా వృద్ధుడు. రియూకూడా ఆ విధంగానే చేశాడు.

గోడ పది అడుగుల ఎత్తువుంది. వాళ్ళ కెదురుగావున్న గోడభాగం కొంచెం ఏటవాలుగా వుంది. దానిపై భాగం, పంచభూతాల తాకిడికి అరిగిపోయి గుంటలుపడింది. చులకనగా ఆ వృద్ధుడు ప్రహరీ గోడమీదకు ఎక్కాడు. రియూ పెనుగులాడుతూ పైకెక్కాడు. భలే ముసలాడు! అనుకున్నాడు రియూ

వారు గోడ కటువైపు చూశారు. అటువైపు పట్నం వున్నదిగదా!

గోడకు దగ్గరలోనున్న ఒక పెద్ద తామరకొలనుప్రక్కన నిలబడ్డారు. దాని చుట్టూ తిరుగుతూ ఆ కమ్మరివృద్ధుడు రియూని నిర్జనంగావున్న వీధుల గుండా ఆ కటిక చీకటిలో, పట్నం తూర్పుభాగంలోవున్న తన యింటికి తీసుకొనిపోయాడు. వాళ్ళు అక్కడ ఒక గంటవరకూ వున్నారు.

రాత్రి పదకొండు గంటలయ్యేసరికి తూర్పు గేటువద్ద పరిస్థితులెలా వున్నాయో చూచిరావలసినదిగా ఆ వృద్ధుడు తన భార్యనుపంపాడు. ఆమె తిరిగివచ్చింది. ప్రశాంతంగానే వున్నదని చెప్పింది. కమ్మరి వృద్ధుడు ఒక పలుగును, పాత గుడ్డముక్కలను తీసుకొన్నాడు.

"అవన్నీ ఎందుకు?" అని అడిగాడు రియూ.

"గేటు తెరటానికి" అని నవ్వాడు వృద్ధుడు.

వారు వెళుతున్న గొంది ఒక పెద్దవీధిలో కలిసింది. ఎవరి కంటికి అగుపించకుండా వుండుటకుగాను వారు వీధిమలుపులోవున్న యింటిగోడలకు కరచిపెట్టుకున్నారు. జాగ్రత్తగా తమ తలలను బయటికిపెట్టారు. గేటుకు పోవాలంటే వారు ఒక సొరంగంగుండా పోవాలి. ఆ సొరంగం అంధకారంగా వుంది. ఆ సొరంగానికి యిరవై గజాల దూరంలోనికి వచ్చారు. ఇక్కడ పట్నం ప్రహరీగోడ యిరవై అడుగుల మందం వుంది. గోడలో ఒక సొరంగంవుంది. దాని చివర ఒక తలుపుంది. అది చాలా బరువయిన తలుపు. దానికి యినుప అడ్డకడ్డీలు దలసరిగా తగిలించివున్నాయి. ఈ తలుపే మనవాళ్ళు తెరువవలసిన గేటన్నమాట. అయితే ఇంకొక్క విషయంవుంది. వీధిలో అవలివైపున ఒక పచారీ షాపువుంది. దానికొక ప్రహరీవుంది. ఆ షాపు గోడ కెదురుగుండా నిలబడి ఈపాసులుగల ముగ్గురు కీలుబొమ్మ సైనికులు యేదో గుసగుసలాడుతున్నారు.

"బహుశా వాళ్ళు నిద్రపోయింటారు" అన్నాడొకడు వేగంగా. ఇద్దరు కీలుబొమ్మసైనికులు, ఆ షాపుయొక్క ప్రహరీగోడనెక్కి లోనికి దూకారు. మూడవవాడు పహారా యిస్తున్నట్లుగా ముందుకూ, వెనక్కూ నడుస్తున్నాడు.

ఆ దుకాణం యజమాని వూళ్ళోలేడన్న సంగతి కమ్మరి వృద్ధునికి

తెలుసు. అయితే యీ కీలుబొమ్మగాళ్ళు లోపలికి దూరింది దొంగిలించటానికయినా అయివుండాలి అనుకున్నాడా వృద్ధుడు. విసుగెత్తేవరకూ అతడు, రియూ అక్కడే నిలబడ్డారు. గడియారంముళ్ళు చెక చెక పన్నెండువరకు వస్తున్నాయి. ఆ వీధిలోవున్న కీలుబొమ్మసైనికుని కంట బడకుండా సొరంగంలో చొరబడటానికి వారికి వేరేమార్గంలేదు. వృద్ధునకు విసుగు జాస్తీ అవసాగింది. ఏమిచేయాలో తోచలేదు. రియూకి ఒక ప్లాను తట్టింది. దానిని వాళ్ళిద్దరూ అతివేగంగా చర్చించారు. కమ్మరి వృద్ధుడు రియూవేసిన ప్లానును వప్పుకున్నాడు. రియూ తానువచ్చిన గొంది వెంట వేగంగా తిరిగిపోయాడు.

జాగ్రత్తగా పక్కగొందులవెంటబడి, అదే వీధిలోకి గేటునుండి కొన్ని గొందుల దూరంలోకి వచ్చాడు. చేతితో ఒకరాయి తీసుకున్నాడు. కీలుబొమ్మ సైనికునికి గురిచూసి కొట్టాడు. అదృశ్యమయ్యాడు. ఆ కీలుబొమ్మసైనికునికి గాభరా ఎత్తింది. నిర్జనంగావున్న ఆ వీధిలో ఎగువకూ దిగువకూ చూశాడు. ఒక్కనిమిషమైన తర్వాత, రియూ మరల రంగంలోకివచ్చాడు. పట్టెడురాయి తీసుకొన్నాడు. మరల కీలుబొమ్మసైనికునికి గురుచూచి వాడివీపు పగిలేటట్లు కొట్టాడు.

"ఎవరక్కడ?" అని కోపంగా అరచాడా సైనికుడు.

రియూ వీధిలోకి అడుగేశాడు. "ఏయ్! వెధవలూ! ఏం జేస్తున్నారోయ్ అక్కడ?" అని వాణ్ణి కవ్వించాడు. వెనుదిరిగి గొందులోనికి పారిపోయాడు. బూతులుతిడుతూ ఆ కీలుబొమ్మ సైనికులు అతని వెంట పడ్డాడు.

తీరం శుభ్రపడగానే కమ్మరివృద్ధుడు పరుగెత్తుకొనిపోయి తూర్పు గేటు సొరంగంలో దూరాడు. కాని అనుకున్న సమయం దాటిపోవుటచే, ప్లాను భగ్నమైనదని భావించి, బయటనున్న ప్రాంతీయ ప్రజాసైన్యాలు ముందుకు దూకసాగాయ్! అయిదు మెషిన్‌గన్‌లతో గేటుపై గోడమీద వున్న కీలుబొమ్మల కట్టడాలను వూపివేయసాగాయ్! వెంటనే శత్రువులు జవాబిచ్చారు. వివిధ స్థావరాలకుపోయే వీధులన్నీ కీలుబొమ్మ సైనికులతో నిండిపోయాయ్. సొరంగంలోనుండి బయటకురావటానికి కమ్మరివృద్ధు

నకు ధైర్యం చాలకపోయింది. అతనికివున్న అవకాశమల్లా ఒక్కటే. గేటును తెరచుట అనేదే. అతడు తొందరగా, పలుగుకు పాత గుడ్డలను చుట్టాడు. అడ్డకడ్డీలను జతవేసి పట్టుకొన్న తాళంలోనికి పలుగును దూర్చాడు. ఒక్కవూపుతో తాళం తెరచుకుంది. పలుగును లాగేశాడు. గేటును బాహాటంగా తెరచాడు.

"తెరచుకుంది! తెరచుకుంది!" అని అరుస్తూ, గోడ వెలుపలికి పరుగెత్తాడు.

శత్రుసైనికులు అతనిపై తుపాకిగుళ్ళ వర్షాన్ని కురిపించారు. గోడమీదనున్న శత్రుసైనికులు, చేతిబాంబులను కురిపించారు. నేలమీద బోర్లాపడి, కొన్నిగజాలు దొర్లాడు. అమాంతంగా లేచాడు. దక్షిణ దిక్కుగా పరుగెత్తాడు. ప్రహరీగోడ బయటనున్న ఏటిపాయకు. గోడకు మధ్యనున్న భూమిపైవు పరుగెత్తాడు. అమాంతంగా యేట్లోకి దూకాడు. ఈదుకొంటూపోయి సురక్షితస్థానానికి జేరుకొన్నాడు.

కేరింతాలుకొడుతూ, తుపాకులతోనూ, మోర్టారులతోనూ, మెషిన్ గన్లతోనూ ప్రాంతీయ ప్రజాసైనికులు గేటు లోపలికి, గేటుచుట్టూ గుళ్ళ వర్షాన్ని కురిపించారు. శత్రువుల పౌరుషం త్వరలోనే క్షీణించింది.

చేతిలో పిస్తోలు పుచ్చుకొని, ఒక కంపెనీ నాయకుడు ముందుకు దూకాడు. "పోదాం పదండి!" అన్నాడు.

అతని అనుచరులు ప్రవాహంలాగా అతనివెంట బ్రిడ్జిమీద పట్నానికి సాగిపోయారు. శత్రువులు అవిఘంగా సాగివస్తున్న ప్రజాసైనికుల పైన మెషిన్‌గన్లను కాల్చారు. ప్రజాసైనికులలో కొంతమంది నేలకొరిగారు! కంపెనీ నాయకునకు గాయాలు తగిలినాయి. అతడు బాధపడుతూ ముందుకు సాగజొచ్చాడు. "కామ్రేడ్స్! ఛార్జి!" అని అరచాడు. పెనుగులాడుతూ ముందుకు సాగారు.

"సాగండి! చంపండి!" అనే వందలాది సింహగర్జనలు వినిపించాయి. కంపెనీ పట్నంలోనికి తోసుకొనిపోయింది.

దళంతర్వాత దళం గర్జిస్తూ, ఏటిపాయను దాటివచ్చాయి. గేటుపై గోడమీదనున్న గూళ్ళలోని కీలుబొమ్మసైనికులు గోడమీద పరుగెత్త

సాగారు. లోవలికి ప్రవేశించిగానే ప్రజాసైనికులు మెల్లమీదుగా పై కెక్కారు. అక్కడ నిలబడి, శత్రుస్థావరాలమీద గుళ్ళవర్షాన్ని కురిపించారు. వీధులలోనున్న శత్రుసైనికులమీద తుపాకీ గుళ్ళవర్షాన్ని కురిపించారు. తెల్లవారేసరికి తూర్పు, ఉత్తర దిశలలోనున్న శత్రుసైనికులు హాంఫట్ మారిపోయారు. ఆ స్థావరాలు ప్రజాసైనికుల చేతులలో చిక్కాయి.



ఉదయం ఎనిమిదిగంటలకు ప్రాంతీయ ప్రజాసైన్యాలు పట్నములో సాధారణ విజృంభణ యుద్ధాన్ని ప్రారంభించాయి. పట్నం తూర్పుభాగంలోవున్న కోటలోని కీలుబొమ్మల రెండవ ప్లాటూను చక్రబంధంలో బిగిసిపోయింది. ఆ కోట తుక్కుతుక్కయింది. శత్రుసైనికులలో ఒక్కడూ తన తలను ధైర్యంగా బయటికి చాచలేకపోయాడు. ఇంతలోనే కోటమీదనుండి "మా ఆయుధాలను క్రింద పారేసున్నాం" అన్న కేక వినిపించింది. రిక్తహస్తాలతో కీలుబొమ్మ సైనికులు బెలబెల్లాడుతూ వీధులలోపడ్డారు. ఒకరిద్దరుమాత్రం ఆయుధాలను కట్టకట్టి మోసుకొనివస్తున్నారు. అందులో ఆఖరికి బయటికి వచ్చినవాడు, రెండవ ప్లాటూడు నాయకుడయిన దంగ్. అతని అనుచరులు యేమంత నొక్కిచెప్పకుండానే, అతడు తనంతట తానే లొంగిపోయాడు. కీలుబొమ్మసైనికులందరినీ వెనుకశ్రేణులకు ప్రజాసైనికులు పంపారు.

దక్షిణగేటుకు ఉత్తరంగా చతురశ్రమంగావున్న ఆవరణలో జపానువాళ్ళ కీలుబొమ్మల హెడ్‌క్వార్టర్స్ వున్నది. దానిచుట్టూగల యిళ్ళపై బ్లాక్ త్సే తన కొండప్రజాసైన్యాన్ని నిలబెట్టాడు. ఆవరణలోకి ప్రజాసైనికులు చేతిబాంబుల వర్షాన్ని కురిపించసాగారు. భుగభుగలు, భగభగలూ, పొగమేఘాలు ఆకాశాన్ని అంటసాగాయి. ఈ మహాగ్ని గుండంనుండి బయటపడాలని, శత్రుసైనికులు అనేకసార్లు యత్నించారు. కాని అన్నిసార్లూ అనేక నష్టాలను పొందుతూ వెనక్కుమళ్ళాల్సి వచ్చి

నది. చిట్టచివరకు మిగిలిన శత్రుసైనికులు గదులలో దాక్కొన్నారు. ప్రతిఘటించటం మానివేశారు. అద్దాలు పగిలిన కిటికీలగుండా తమ తుపాకులను ఆవరణలోనికి గిరాటువేశారు.

ఒక దళం కౌంట్‌ప్రజాసైనికులను వెంటబెట్టుకొనిపోయి, బ్లాకీత్సే ఆవరణ ద్వారం తలుపును తన్ని తెరిచాడు. గజగజ వణుకుతూ కీలుబొమ్మసైనికులు యింటిలో ఒకమూల కూర్చున్నారు. మిమ్మల్ని బాగా చూస్తామని బ్లాకీ వారికి హామీ యిచ్చిన తర్వాతనే లేచి నిలబడటానికి ధైర్యం కలిగింది.

అయితే జపానువాళ్ళెక్కడా కానరావటంలేదు. కొయ్యమంచం మీదనుండి క్రిందకు జారిపడుతూవున్న ఒక దుప్పటికొసను ప్రజాసైనికుడొకడు పట్టుకొనిలాగాడు. మంచంక్రింద ఒక జపానువాడు దాక్కొన్నాడు. వాడు తలను గోడవైపుగాపెట్టి మెల్లగానక్కి పాకుతున్నాడు. వాడి వెనుకభాగం ఒంటెమూపురంగులాగున పైకి నిక్కబొడుచుకునివుంది. బయటికి రారా అని ఎంతచెప్పినా వాడు ససేమిరా అంటున్నాడు. చిట్టచివరకు యిద్దరు మనుషులు, వాణ్ణి కాళ్ళుపట్టి బయటకులాగారు. వాడిముఖం మసికొట్టుకొని నల్లగావుంది. వాడు చప్పున కూలబడి, మసిబారినముఖంతో నిశ్శబ్దంగా రెప్పలార్పుకొంటూ ప్రజాసైనికులవంక చూడసాగాడు.

మరియొక కామ్రేడ్ ఒక కితనారసంచీని తన్నాడు. అతడందులో ధాన్యం వున్నాయనుకొన్నాడు. కాని ఆ సంచీ అతనిచేతి తాకిడికి కదలింది. మెలికలు తిరగసాగింది. అందులో ఒక జపానువాడు దూరి సంచి నోరును గట్టిగా తన చేతులతో లోపల పట్టుకొనివున్నాడు. ఇద్దరు ప్రజాసైనికులు ఆ సంచీని తలక్రిందుగా పైకెత్తారు. వాణ్ణి నేలమీద కుమ్మరించారు.

ఖైదీగా పట్టుబడిన కీలుబొమ్మ ఒకడు కాంగ్‌వైపుకు చూపించాడు. బ్లాకీ రెల్లుచాపను ప్రక్కకు తోశాడు. కాంగ్‌మీదనున్న ఇటుకలను తొలగించి, యిద్దరు జపానువాళ్ళు లోపల దూరి వుండుటను గమనించాడు బ్లాకీ.

వాళ్ళిద్దరినీ బయటకు లాగాడు బ్లాకీ. వాళ్ళ అవతారంజూస్తే పొట్ట చెక్కలయ్యే నవ్వు వస్తుంది. అపాదమస్తకం వాళ్లు బూడిదతో నిండి పోయారు.

"మీ తుపాకు లెక్కడ?" అని డిమాండుచేశాడు బ్లాకీ.

జపానువాళ్ళు మూర్ఖంగా అతనివంక జూచారు. అంతేగాని జవాబు చెప్పలేదు. ప్రజాసైనికులు సోదాచేయగా కాంగ్‌లో రెండు ఆటో. మేటిక్ పిస్తోళ్ళు, మూడు రైఫిళ్ళు దొరికాయి.

* * * *

పట్నానికి పశ్చిమభాగ పది. దక్షిణ పశ్చిమదిశల గోడలపైనున్న కీలుబొమ్మలు లొంగిపోయారు. కాని, గొపీ నాయకత్వంక్రింద అక్కడ వున్న కోటమాత్రం గట్టిగా ఎదిరించి పోరాడుతూవుంది. దానికి కారణ మేమంటే— దాస్వే. తేవారుల నాయకత్వానవున్న ప్రజాసైనికుల సంఖ్య చాలా కొద్ది. వాళ్ళకు మెషిన్‌గన్లు లేవు.

అందువలన ధైర్యంగా గొపీ ఎదిరించి పోరుతున్నాడు. కోటను వదలిపెట్టి లొంగిపోయేటట్లు కీలుబొమ్మలకు నచ్చజెప్పవలసిందిగా, ప్రాంతీయ ప్రజాసైన్యాధికారులు దాస్వే. తేవారులను ఆదేశించారు.

ప్రజాసైనికులు కోటను చక్రబంధంలో బిగిస్తూవున్నసమయంలో వారికి రియూ కనబడ్డాడు. కోటకు వంద గజాల దూరంలోవున్న యిళ్ళ వెనుక ప్రజాసైనికులు నక్కుతూపోతూవుంటే వాళ్ళలో కలిశాడు దాస్వే. తేవారులు వంతులువారీగా కీలుబొమ్మలను హెచ్చరించసాగారు.

"ఏయ్! కీలుబొమ్మదేశీయులారా! మేం పట్నాన్ని ఆక్రమించు కున్నాం. మీరు ఆయుధాలను వప్పగించ రెందుచేత? మీ ప్రాణాలను జపాను దయ్యాలకోసం బలిపెట్టుకోవద్దు."

గొంతులు బొంగురుపోయేవరకూ దాస్వే. తేవారులు అరచారు. కాని కోటలోనుండి ఒక్కరవ్వంతైనా జవాబు రాలేదు.

"ఇదేమీ ప్రయోజనంలేదు. తొత్తుకొడుకులకు మన మజా చూపించాల్సిందే" అన్నారు ప్రజాసైనికులు.

తుపాకీగుళ్ళవర్షాన్ని కురిపించారు ప్రజాసైనికులు వాటికి జవాబిచ్చారు శత్రుసైనికులు. యుద్ధంసాగింది.

"మనమంతా చైనావాళ్ళం! మాతో యుద్ధానికి దిగకండి. మా పైదీలను బాగా చూస్తాం. ఆయుధాలను విసర్జించండి" అని కేకలేస్తూనే వున్నారు ప్రజాసైనికులు.

కోటశిఖరంనుండి "మీకు మా తుపాకులు కావాలా?" అని అరచాడు గొపి.

"అదే! వెంటనే ఆయుధాలను క్రింద పారేయండి!" అన్నారు ప్రజాసైనికులు.

"కావాల్సివస్తే కోటపైకివచ్చి తీసుకోండి!" అని అరచాడు గొపి.

అమితకోపంగా, ప్రజాసైనికులు యుద్ధం చేయసాగారు.

ఇక్కడి యుద్ధ పరిస్థితినిగురించి ప్రాంతీయ ప్రజాసైనికాధికారు తెలియపర్చబడింది. పిండి సంచీలలో అయిదువందల పౌన్లు బరువుగల ప్రేలుడు పదార్థాలన్నీ పెట్టి ధంసకదళానికిచ్చి పంపారు. ప్రాంతీయ ప్రజాసైనికాధికారులు కోటక్రిందుగా భూమిలో సొరంగం త్రవ్వటలో యీ దళానికి సాయపడవలసిందిగా జిల్లా ప్రజాసైన్యాన్ని ఆదేశించింది. ప్రాంతీయ ప్రజాసైన్యం కోటకు దగ్గరలోనున్న యిళ్ళల్లో ఒకదానిని ఖాళీచేసి దానిలోనుండి సొరంగం వేయ ప్రారంభించారు. సరిగ్గా కోట క్రిందిభాగానికి వేయుటకుగాను, త్రవ్వతున్నవాళ్ళకు గుర్తుగా పైనుంది ధ్వంసకదళ నాయకుడు అప్పుడప్పుడు చేతిబాంబును విసరివేయసాగాడు. ఆ ధ్వనినిబట్టి, సొరంగం పనిచేస్తున్న మనుషులు సూటిగా కోట గోడల క్రిందకు త్రవ్వుకొనిపోయారు.

ఆ గోడలక్రిందకు అయిదువందల పౌన్లు ప్రేలుడు పదార్థంగల

కొయ్యపెట్టెను నెట్టారు. దాని కొక ఫ్యూజును తగిలించి బయటకిలాగారు. లొంగిపోవలసినదిగా దాస్వే కీలుబొమ్మలకు అంతిమ విజ్ఞప్తి చేశాడు.

"బయటికి రండోయ్! సన్నాసుల్లారా! కోటక్రింద ప్రేలుడు పదార్థం పెట్టాం. మీరు బయటికి రాకపోతే, భరతనాట్యం చేయాల్సి వస్తుంది జాగ్రత్త!" అని దాస్వే వాళ్ళను హెచ్చరించాడు.

ప్రజాసైన్యంయొక్క విధ్వంసకశక్తిని చవిచూడాలనే కోర్కె గోపీలో గాఢంగా పాతుకొనిపోయింది. పాపం! వీళ్ళు వట్టి సన్నాసుల్లే అనుకున్నాడు. "కాస్త నాట్యంచేసేమాత్రం ఏం? చేస్తాం! మీ రేవిధంగా పేల్చగలుగుతారో చూస్తాం" అని అరిచాడు గోపీ పెడసరంగా.

సూర్యాస్తమానం అవుతూవుంది. ఫ్యూజును అంటించారు. ప్రజా సైనికులు తమకు, కోటకు మధ్య దూరముండేటట్లు వెనక్కి పోసాగారు.

"కీలుబొమ్మలారా! తొందరపడండి! మందుతాటిని అంటించాం! ఒక్క నిమిషంలో పేలిపోతుంది!" అని అరచాడు దాస్వే.

గోపీ మనుషులలో యిద్దరు క్రిందకు దూకుదామనుకొన్నారు. కాని ఆ దేశద్రోహి వాళ్ళపై తుపాకి బారుచేసి, వాళ్ళను అక్కడే నిలబెట్టాడు.

"నిలబడండి!" అని గోపీ ఆజ్ఞాపించాడు. "వెంట్రుకవాసైనా వాళ్లు మనకు హాని చేయలేరు. బాలూగాళ్లు వట్టి చెత్తవెధవలు. మనలను భయపెట్టటానికి ఎత్తు వేస్తున్నారు వాళ్ళు!" అని అరిచాడు గోపీ. ముక్కులేని గోపీ బాలూ సైనికులను బండబూతులు తిట్టసాగాడు. "ఓ బాలూ వెధవల్లారా! మీ పని పూర్తయిందిరా. మీ కా సంగతి తెలియదు. మిమ్మ ఒక్కరినే నాశనంచేస్తాం. మా మొగుళ్ళు వస్తున్నారులే!...." అని తిట్ట సాగాడు.

ఇంకా వాడి బండబూతులు పూర్తిగాకముందే, బ్రహ్మాండంగా ధ్వని అయింది. కోట ముక్కలు ముక్కలయింది. దాని ముక్కలు గాలిలోని కెగురసాగాయి. మైలు చుట్టుకొలతలోనున్న ప్రతి యింటి కాగితపు కిటికీలూ, ఆ ప్రేలుడుకి ముక్కలుముక్కలై గాలిలోకి ఎగిరాయి.

దుమారం ఆగిపోగానే ధ్వంసమైన కోట ప్రదేశానికి ప్రజాసైని

కులు ఆయుధాలేమైనా వున్నాయేమో వెతకుటకు వెళ్ళారు. గోపీ, వాని అనుచరుల జాడేలేదు. కోటకు చాలాదూరంలో కీలుబొమ్మల తెగిన చేతులు, కాళ్ళు, మొండాలూ కనపడ్డాయి. కీలుబొమ్మల తుపాకులనీవి ముక్కలు ముక్కలయ్యాయి. అందులో ఒక్కటీ పనికొచ్చేది కనబడ లేదు.

* * * *

ఇక శత్రువుల చేతులలో మిగిలిన కోటల్లా కాథలిక్కు చర్చి ఆవరణలో కట్టబడిన రెండు బురుజుల కోట మాత్రమే. ఈ శత్రువులకి సహాయంగా నగరంలోని జపానువాళ్లు పంపిన జపాను కీలుబొమ్మల సైన్యాలను, ప్రజాసైనికులు పట్నం వెలుపల రోడ్డుమీదనే యెదిరించి చావుదెబ్బలు కొట్టి పంపారు. పడమటి గోడకు ఎదురుగావున్న ఖాళీ ప్రదేశంలోనికి తమ సైన్యాన్ని తీసకొనిపోయి, విశ్రాంతి తీసుకోవల సిందిగా దాస్వే, తేవార్‌లు ఆజ్ఞాపించబడ్డారు.

దాస్వే తన డ్యూటీని తేవార్‌కు వప్పగించి కొంతమంది సైనికులను తీసుకొని, ఆవరణలోకి సాగిపోతున్న సైన్యాలతో చేరాడు. మనం పూర్తిగా చుట్టుముట్టేశాం అని సంతోషపడసాగాడు. హో, జిన్లంగ్, మిగిలిన వెధవలంతా యీసారి తప్పించుకొని పోలేరు అనుకున్నాడు.

ఆ కాంపౌండ్ పట్నంమధ్యభాగంలోవున్న ఒక విశాలమైన వీధి కెదురుగావుంది. దాని బురుజులపై ఒక్కొక్క కీలుబొమ్మ షార్ప్‌షూటర్ చొప్పున వున్నారు. ఆ ఆవరణచుట్టూ ఎనిమిది అడుగుల ఎత్తుగల ప్రహరీగోడ వుంది. జపానువాళ్ళచే తయారుచేయబడిన 38 తుపాకులతో వీధిలోకి వెళ్ళిన ప్రతిమనిషినీ బురుజులపైనున్న కీలుబొమ్మలు కాల్చి చంపేస్తున్నారు. యుద్ధరంగండి దూరంగా తొలగిపోదామన్న ఉద్దేశ్యంతో పాపం యిద్దరురైతులు వీధిలోబడి పరిగెత్తసాగారు. కాని వాళ్ళిద్దరినీ పొట్టనబెట్టుకొన్నారు కీలుబొమ్మలు. పౌరులను కీలుబొమ్మలు యీ విధముగా కాల్చిచంపుతూవుంటే, వాళ్ళ ఘాతుకత్వానికి అసహ్యించుకొని ప్రాంతీయ ప్రజాసైనికాధికారులు. తమ సైన్యంలోని నలుగురు షార్ప్

షూటర్లను. బురుజులకు సూటిగా అయిమూలగావున్న భవనంమీద కెక్కవలసిందిగా ఆజ్ఞాపించారు. వాళ్ళు యిసుకబస్తాల వెనుకగా పాకిపోయి, తూర్పు బురుజుమీదనున్న యిటుకకట్టడాలలోని కంతలలోనికి గురిజూశారు. అప్పటికి చీకటిపడిందనే చెప్పాలి. కాని ప్రజాసైనికులు కొట్టిన మొదటి దెబ్బకే బురుజులోవున్న శత్రు సైనికుడు ఆహూతి అయ్యాడు.

"మీ యమ్మల్ని—!" అని తిట్టసాగాడు పడమటి బురుజుపై కీలుబొమ్మ సైనికుడు. "దబ్బుకంపు తొత్తుకొడుకుల్లారా! చేతనయితే రండిరా! ఆరితేరినఘటంతో తేల్చుకోండిరా!" అని అరచాడు.

దాస్వే జిన్లంగ్ కంఠధ్వనిని గుర్తుపట్టాడు. అతనికి కోపం తలకెక్కిపోయింది. ముందున్న వస్తువులేమీ కానరాకుండా పోయాయి. ఇంతలోనే ప్రజాసైనికుడొకడు వెక్కిరింతగా జిన్లంగ్కు జవాబుచెప్పటను దాస్వే విన్నాడు.

"అరేయ్! నీ తిట్లు దాచిపెట్టుకో! దెబ్బకు దెబ్బ! సై! కాచుకో!" అన్నాడు ప్రజాసైనికుడు.

"అచ్ఛా!" అని జిన్లంగ్ అరచాడు. "ఎవడు వీరుడో చూద్దాం! ఇదిగో యీ పెంకుచివరను పట్టుకుంటున్నా!" చేతనైతే దీన్నికొట్టు! నేను తుపాకిని అవతల పారేస్తా!" అన్నాడు.

"అదే చేస్తా! నువ్వు ముందు కాల్చు చూద్దాం!" అన్నాడు ప్రజాసైనికుడు. ప్రజాసైనికుడు యిసుకబస్తాలమీద పెంకుపెట్టాడు.

జిన్లంగ్ ఒక్క తుపాకిగుండు దెబ్బతో దాన్ని ముక్కలు ముక్కలుగా జేశాడు.

"ఏయ్! ఏం? అంత చెడ్డదిగాదనుకుంటాను!" అని హూశాడు. జిన్లంగ్ "ఇప్పుడు నీవంతు!" అన్నాడు. అలా అంటూనే పిట్టగోడమీద ఒక పెంకును వుంచుదామని తనచేతిని పైకెత్తాడు. అతడు ఆ పెంకును పెట్టాడోలేదో యింతలోనే తుపాకిపేలిన ధ్వని అయింది. బర్రున వొక గుండు వచ్చి పెంకును, జిన్లంగ్చేతిని చీల్చివేసింది.

ఈ దృశ్యాన్ని చూడగానే ప్రాంతీయప్రజాసైనికుల కరతాళ

ధ్వనులు, కేరింతలు మిన్నుముట్టాయి. గొంతుచించుకొని జిన్లంగ్ బండ బూతులు తిడుతున్నాడు. వాడి కంఠధ్వనిని ప్రజాసైనికుల చప్పట్లు ముంచి వేశాయి. అయితే. విషయాన్ని తీవ్రంగా పరిష్కరించవలసకాలం వచ్చే సింది. చీకటిపడింది. తెల్లవారకముందే, ఆవరణమూ దాని బురుజులతో సహా స్వాధీనంచేసుకోవలసిందిగా ప్రజాసైనికులకు ప్రాంతీయ ప్రజా సైనికాధికారు ఆదేశించారు.

వెంటనే ప్రజాసైనికులు శత్రుకోటమీద మోర్టార్, మెషిన్‌గన్, తుపాకిగుళ్ళ వర్షాన్ని కురిపించారు. కీలుబొమ్మ సైనికులు తిరుగుదెబ్బ తీశారు. బులెట్ల మోత, షెల్లులమోత చెవులను చిల్లులుపడేస్తూ వుంది. శత్రువుల బురుజులలోని రంధ్రాలచుట్టూ మాలగా కంతలుపడ్డాయి. ప్రజాసైనికుల తుపాకిగుళ్లు గురితప్పకుండా ఒక కీలుబొమ్మ సైనికుని తర్వాత మరియొకనిని నేలగూల్చుతూనే వున్నాయి.

హో లొంగిపోవ నిరాకరించాడు తాము వోడిపోవుటకు ఎంతో కాలం పట్టదన్న విషయం అతనికి తెలుసు. తనతొత్తు జీవోతో రహస్యంగా సంప్రదించిన తర్వాత హో తన సైనికులకు వుపన్యాసం దంచాడు. అంతలో మరునాటి ఉదయం అయ్యేసరికల్లా తమకు నగరం నుండి సహాయం వస్తుందని బయటపెట్టాడు. యధార్థానికి వొట్టి అబద్ధం. ఈ అబద్దాన్ని నొక్కి వక్కాణిస్తూ రేపటి వుదయంవరకూ సైనికులందరూ లొంగిపోకుండా నిలబడి పోరాడాలన్నాడు. అలా చేయకపోతే కాల్చి చంపుతానని బెదిరించాడు. అందువలన యుద్ధం జోరుగాసాగింది.

పడమటి బురుజుకు దగ్గరగావున్న ఒకకొంపలో ఒక పెద్దబిజారును పెట్టారు. దాని టాంకునిండా గాసులైన్ పోశారు. చేతిపంపుకూడా వున్నది. పంపుకొట్టడం ప్రారంభించారు. రబ్బరుగొట్టంద్వారా గ్యాసులైనుపోయి బురుజును క్రిందనుండిమెదకి తడిపింది. అదేసమయంలో బురుజుమీదకు మోర్టారు షెల్లులను ప్రేల్చసాగారు. బురుజుకు నిప్పంటుకొంది. మహాగ్నిస్తంభంలాగా మండజొచ్చింది. అటుతర్వాత తూర్పు బురుజుకుకూడా యిలాగే నిప్పుపెట్టారు. అదికూడా భగభగ మండ సాగింది.

ఉత్తరచైనా మైదానాలమీదగా వీస్తున్న ప్రచండమయిన గాలి నల్లనిమేఘాలను వెనుకకు తరుమసాగింది. ప్రాంతీయ ప్రజాసైన్యం వర్షం జోరుగా కురుస్తున్నా పోరాటాన్ని సాగిస్తూనే వున్నది. కాని వర్షం పెద్ద పట్టెడుపట్టెడు నడగళ్ళవర్షంగా మారింది. ఇళ్ళలో తలదాచుకోవలసినదిగా ప్రజాసైనికులు ఆదేశించబడ్డారు.

దాస్వేకి విసుగెత్తిపోయింది. శత్రుసైనికులెంతమందో మిగులు లేదని తాను గట్టిగా విశ్వసిస్తున్నానని దాస్వే చెప్పాడు. తనపై అధికార్లు తన్ను అనుమతిస్తే కొంతమంది ప్రజా సైనికులను వెంటబెట్టుకొనిపోయి, కీలుబొమ్మ నాయకులను పట్టుకోగలనని చెప్పాడు. ప్రాంతీయ ప్రజాసైన్యాల కమాండరు దాస్వే కోరికను అంగీకరించాడు. శత్రువుల జాడ తెలిసికొని రావలసిందిగా తానిప్పుడే ఒక ప్లాటూన్ సైనికులకు చెప్పాననీ వారితోకూడా దాస్వే, అతని అనుచరులూ పోవచ్చుననీ అతడు చెప్పాడు.

కుంభవర్షం కురుస్తూవుంది. ఆ వర్షంలో దాస్వేయొక్క దళం కాంపౌండ్ గోడకు ఈశాన్యమూలకు ప్రాకిపోయారు. ఒక నిచ్చెనవేశారు. లోపలి ఆవరణలోనికి దిగారు. జాగ్రత్తగా వారు కలుపుమొక్కలబడి చర్చివద్దకు పోయారు. ఈ బిల్డింగ్ మాత్రమే చెక్కుచెదరకుండా వుంది. వాళ్ళకు వినపడుతున్నదల్లా పడిపోతూవున్న బురుజులోని ధ్వని మాత్రమే. శత్రుసైనికులు నక్కివున్నారేమోనన్న భయంతో వారు, దొడ్డిగోడ తలుపును తెరవలేదు. ఆ బిల్డింగ్ గోలచుట్టూ తిరిగారు. సింహద్వారం వద్దకు చేరుకున్నారు. సింహద్వారం తలుపులు బాహాటంగా తెరచుకొనివున్నాయి. చీకటిగావున్న ఆ ప్రాంగణంలోకి దాస్వే కాలుపెట్టాడో లేదో అతను కాలుజారి దేనిమీదోపడ్డాడు. తీరాచూస్తే అది ఒక మెషిన్ గన్.

ప్రజాసైనికులు తమ ఫ్లాష్‌లైట్లను వేసిచూశారు. సోదా చేయసాగారు. చర్చిగోడమీద ఖాళీబుల్లెట్ల బెల్టులు వ్రేలాడుతూ వున్నాయి. కాగితాల గుట్టలు హాలుమధ్యలో తగులబెట్టబడి వున్నాయి.

కుర్చీలు, మేజాబల్లలూ తిరగబడివున్నాయి. వాటిలోని సామాను చెల్లా చెదరుగావున్నాయి. అప్పటికే శత్రువులు పారిపోయారు.

* * *

బురుజులకు నిప్పంటుకొనకపూర్వమే హో, అతని వుంపుడుకత్తె జిన్లంగ్, మరి యిరవైమంది తప్పించుకొని పారిపోవుటకు ప్లానువేశారు. ప్రాంతీయ ప్రజాసేనలు వడగళ్ళవర్షంనుండి తలదాచుకోటానికి యిళ్ళ లోనికి పోయేటప్పటికి, దేశద్రోహులు కాంపౌండ్ గోడలో కంత జేశారు. పడమటిదిక్కుగా పారిపోయారు. తామరకొలనులోపడి నడచిన తర్వాత, వాళ్ళు పట్నంగోడను సమీపించారు. జిన్లంగ్ పట్టికాళ్ళతో గోడ నెక్కాడు. తక్కినవారినందరినీ ఒకతాటితో పైకిలాగాడు. వాడు ఆ తాటి చివరదు పిట్టగోడకు ముడివేశాడు. కీలుబొమ్మలు ఒక్కరొక్కరే యేటి పాయ యిరుకువైపునకు జారారు. ఆ రాత్రి పట్టిన పొగమంచుగుండా జాగ్రత్తగా పరిశీలించగా వారికి ఎదుటిగట్టుమీద ప్రజాసైనికుల ఛాయలు కనిపించాయి. శత్రువులు పారిపోకుండా పడమటి యేటిగట్టుమీద కాపలా కాయవలసిందిగా తేవారు అనుచరులు ఆదేశించబడ్డారు. ఈ ప్రజాసైని కులు ఒక్కదళంమాత్రమే అక్కడ కాపలాకాస్తున్నారు.

హో దేవాంతకుడు. అతివేగంగా వానిబుర్ర పనిచేసింది. వ్రేలాడు తున్న తుపాకిని వీపుమీదనుండి తీసి చేతితో పుచ్చుకొన్నాడు. తుపాకి వుండే బెలుతో తన వుంపుడుకత్తెను మోదసాగాడు. గొంతుక పగిలే టట్లు దానిని తిట్టసాగాడు.

"నీయమ్మ—! దొంగముండా! దేశద్రోహి! నిన్ను పట్టేశాను!— ఇంక నడు! నడవ్వేం! అని బిగ్గరగా హో తిట్టసాగాడు.

ఏటిపాయవద్దనున్న ఆ కీలుబొమ్మలవంక తుపాకిని గురిపెట్టాడు బెదురుగొడ్డు మా. బెదురుగొడ్డు మా అక్కడున్న ప్రజాసైనికులదళానికి నాయకుడు. "సాంకేతిక పదాన్ని చెప్పండి!" అని అరచాడు బెదురు గొడ్డు మా.

"ఏుండ సాంకేతికపద మెవ్వడికి కావాలోయ్" అని హో అర చాడు. "మేం ప్రాంతీయ ప్రజాసైన్యాల హెడ్ క్వార్టర్సునుండి వస్తు న్నాము. హోనాడి వుంపుడుకత్తెను పట్టుకున్నాం! తడిసిముద్దయినాం! చలితో బాధపడుతున్నా! త్వరగాపోయి కొన్నిపడవలను తీసుకొనిరండి. మేం ఆవలికి పోవాలి!" అని ఏరల అరిచాడు హో.

బెదురుగొడ్డు మాకు అనుమానం యేమి తగలలేదు. అతడూ అతని అనుచరులూ కలిసి మూడు చిన్న పడవలను వెంటనే యేటిపా యలో నెడుప్పకొంటూపోయారు. వాళ్ళు కీలుబొమ్మవున్న ప్రదేశానికి చేరారు. హో తన వుంపుడుగత్తెను ఒడ్డుకునెట్టి ఒక పడవలోకి ఎక్కించి తానుకూడా ఎక్కాడు.

"తప్పుడుముండా!" అని హో తిట్టసాగాడు. "ఇంకా తప్పించుకు పోదామనుకుంటున్నావా?"

కీలుబొమ్మలు పడవలోకి ఎక్కగానే మైదానప్రదేశంపై పు పడవ లను నడపవలసిందిగా ప్రజాసైనికులను హో ఆజ్ఞాపించాడు. ప్రజాసైని కులు తెడ్లువేయసాగారు. ఇంతలోనే తనపక్కన కూర్చున్న శివావంక చూశాడు హో.

స్నేహపూర్వకంగా సెప్పతూ హో, "యేదీ! నీ తుపాకీని చూడనీ," అని అతని ఆయుధాన్ని తనచేతుల్లోకి తీసుకొని బరువు చూడ సాగాడు. "అచ్చే యిదేం లాభంలేదు!" అని హో అన్నాడు. ఆ తుపా కిని నీళ్ళలోకి విసిరేశాడు

"అలా ఎందుకు చేశావు?" అని శివా ఉద్రిక్తంగా ప్రశ్నించాడు హో వుల్లాసంగా నవ్వాడు." ఇలాంటి పాతచెత్తను వుపయోగించరాదు. మేము అద్భుతమైన ఆయుధాలను పట్టుకున్నాము. హెడ్‌క్వార్టర్స్‌కు జేర గానే నీకొక మంచి ఆయుధాన్ని యిస్తా!"

పడవలు మైదానంపద్దకు జేరుకొన్నాయి. ఆనకట్టను ఆనుకొని

యున్న తీరంలో కీలుబొమ్మలు దిగారు. వారు చకచకా ఆనకట్టను ఎక్క సాగారు.

"మేము లిటిల్‌ప్లమ్ గ్రామానికి పోతున్నాం. మాకు సహాయంగా నల్గురు మనుష్యులు కావాలి!" అని హో ఆజ్ఞాపించాడు.

యథార్థానికి ప్రజాసైనికుల దళంలో సంఖ్య 5 మంది మాత్రమే. ఎదురుగొడ్డు మా, శివో, మరియిద్దరు ప్రజాసైనికులు కీలుబొమ్మలతో వెళుతూయుండగా యిక కాపలాకాయటానికి వాంగ్ ఒక్కడే మిగిలాడు. దేశద్రోహులలో ఒకడు వెనకపడటం, ఆనకట్టమీదనున్న ఒక రైతు గుడిసెలోకి దూరటాన్ని వాంగ్ చూశాడు. ఒక నిమిషమయిన తరువాత ఆ గుడిసెలోనుండి ఒక ముసలాడు బయిటకొచ్చాడు. వాంగ్‌వున్న తావుకు పరుగెత్తుకొనివచ్చి అతనిచేతిని గట్టిగా పట్టుకొని ఆ ముసలాడు చెప్పసాగాడు.

"వాడు మనవాడులాగున కనపడటంలేదు." అని రైతు తొందరగా వాంగ్‌చెవిలో వూదాడు. "వాడు నా పక్కచుట్ట, గుడ్డలు దోచేస్తున్నాడు. బాలూ సైనికుడెవడు యిలాంటి పనిచేయగా యెప్పుడూ నేను చూడలేదు" అని ఆ రైతు మొరపెట్టుకొన్నాడు.

వాంగ్ అమాంతంగా గుడిసెవద్దకు పరుగెత్తుకుపోయాడు. అక్కడ గుడిసెలోదూరిన దేశద్రోహి చేతులనిండా దొంగిలించినవస్తువులున్నాయి. వాంగ్ తనపిస్తోలును కీలుబొమ్మ గుండెలకు గురిపెట్టాడు.

"అరవబోకు!" అని హెచ్చరించాడు. "మీరంతా ఎవరు? ఊఁ! తొందరగా చెప్పు!"

"కాల్చబోకు! కాల్చబోకు! చెప్తా! చెప్తా! మా ముఠాకు నాయకుడు హో."

వాంగ్‌కు విపరీతంగా కోపంవచ్చింది. నిస్పృహజెందాడు. ఆ పరిస్థితులలో దేశద్రోహులను ఒంటరిగా వెన్నాడినంతమాత్రాన ఏవిధంగాను లాభం కలుగబోదనుకొన్నాడు. కీలుబొమ్మవద్దనున్న తుపాకిని గుంజుకొని, తన పిస్తోలును ఆ ముసలివానికిచ్చి ఖయిదీని కాపలా కాయవలసిం

దిగా ఆ ముసలివానికి చెప్పి యీ విషయాన్ని రిపోర్టుచేయుటకు ఆనకట్ట వెంట పరుగెత్తుకొనిపోయాడు.

ఇదేసమయంలో దాస్వే అతని అనుచరులు పట్నంయొక్క ప్రహరీగోడను యెక్కుటకు శత్రువులు ప్రయోగించిన మోకును పట్టు కొన్నారు. శత్రువుల కాలిజాడనుబట్టి వారు ఏటిపాయ పడమటి ఒడ్డుకు జేరుకొన్నారు. అక్కడ వారికి తేవారు, అతని జిల్లాప్రజాసైనికులు కలి శారు. కీలుబొమ్మ నాయకులు ఏవిధంగా తప్పించుకొనిపోయింది దాస్వే చెపుతూండగా వాంగ్ అక్కడికి పరుగెత్తుకొనివచ్చాడు. హో, అతని ముటా సెలుగురు ప్రజాసైనికులు బందీలుగా తీసుకొని పడమటిగట్టువెంట పోతున్నారని చెప్పారు. తేవార్, దాస్వేలు వెంటనే ఆలోచించుకొన్నారు. పడవలలో వెళితే త్వరగా ఆ కీలుబొమ్మ నాయకులను కలుసుకోవచ్చు ననుకొన్నారు. 30 మంది ప్రజాసైనికులు, 3 పెద్దపడవలలోకి ఎక్కారు. హో, అతని ముటాని తాము వెన్నాడుతున్నామన్న విషయం రైతుసైని కులకి తెలియగానే వారు తమ శక్తినంతా వుపయోగించి పడవను జోరుగా నడుపసాగారు.

ఆ కీలుబొమ్మలవెంట అంగరక్షకులుగా పోవుచున్న ప్రజాసైని కులు ముందుభాగంలో నడుస్తున్నారు. తాము లిటిల్‌ప్లమ్ గ్రామం దిక్కుగా పోవుటలేదని బెదురుగొడ్డు మా పసికట్టాడు. వారావిధంగా నడి చినకొలదీ బెదురుగొడ్డు మాకు అనుమానం ఎక్కువయింది. అతడు వెను దిరిగి దేశద్రోహులవంక చూడసాగాడు. కీలుబొమ్మల తుపాకులు తమ మీద గురిపెట్టి వుండటాన్ని బెదురుగొడ్డు మా గ్రహించాడు.

"ఛీ! యీ వెధవలు కీలుబొమ్మలు!" అనుకొన్నాడు బెదురు గొడ్డు "మనమింత మూర్ఖులం అయిపోయామేం? వీళ్ళను తీసుకొనిరావ టానికి పడవలనుకూడా పంపామే!" అని కోపాన్ని మింగసాగాడు. తమ అసమర్థతకు అతనికి కోపం వచ్చింది. కోపంతో కళ్ళలో నీళ్లు గిర్రున తిరిగాయి. "ఏమైనాసరే! వీళ్ళను వదలకూడదు. యేదో వుపాయమాలో చించాలి...."

చెమరుగొండు ఆగాడు. "మనము యీ దారిని పోలేం!" అని చెప్పాడు దేశద్రోహులకు. "ఈ భాగంలో ప్రేలుడు పదార్థాలను పాతి పెట్టారు" అన్నాడు.

"అయితే నీవే ముందునడువు" అని వారు జవాబు చెప్పారు.

కాలయాపనచేద్దామన్న వుద్దేశంతో చెమరుగొండు ప్రతి అంగుళం భూమి పరీక్షించసాగాడు. అనేకట్టమీద వంకరటింకరగా డొంకతిరుగుడుగా కీలుబొమ్మలను నడిపించసాగాడు చెమరుగొండు. ఈ విధంగా ఆలస్యజేస్తే, తమను వెన్నాడుతూ ప్రజాసైనికులు తప్పకుండా రాగలరనే ఆశ అతణ్ణిపట్టి పీడిపిస్తూవుంది.

చీకటిలో శివా, ఆ దేశద్రోహులలో కొంతమందిని చూడగలిగాడు. అతడు జీవో, చిహ్నంగులను గుర్తించగానే, అతని హృదయం కృంగింది. మొట్టగా దుక్కలాగున నా వెనుకనడుస్తున్న మనిషి తప్పకుండా హో అయివుంటాడని శివా తనలో అనుకొన్నాడు. "వాణ్ణి చంపాలి. నా ప్రాణంపోయినాసరే వాడినిమట్టుకు వదలరాదు. చంపేయాల్సిందే!" అనుకోసాగాడు శివా. భయనిశ్చయాలమధ్య కొట్టుమిట్టాడుతూ వున్న శివాకు కాళ్ళు గజగజ వణకసాగాయి. ఒక అడుగైనా ముందుకు వేయలేకపోయాడు.

"తొత్తుకొడకా! ముందుకు తొందరగా నడవరా!" అని హో శివాని ముందుకునెట్టి తిట్టసాగాడు.

ఆ నెట్టుకు, శివా కోపాగ్నిమహాపర్వతాన్ని బ్రద్ధలుచేసింది. తన నడుముకి కట్టుకొన్న బెల్టునుంచి చేతిబాంబును లాగాడు.

"ఏ జేస్తున్నావ్?" అని మొరిగాడు హో.

శివా గిర్రున వెనుదిరిగి హో కంఠాన్ని లంకించుకొని చేతిబాంబులను అతని గుండెకేసి కొట్టాడు. ఉన్మత్తవేగంలో శివా చేతిబాంబు యొక్క పిన్నునులాగటం మరచిపోయాడు. అందువలన ప్రేలలేదు. హో స్వేచ్ఛగా మెలిదిరిగాడు. పిస్తోలును సరిజేసుకొన్నాడు. శివా తలకు గురిచూసి కొట్టాడు. శివా యీ లోకాన్ని వీడాడు....

మబ్బులనుండి పూర్ణచంద్రుడు బయటికివచ్చాడు. తన చంద్రికలను నలుమూలలా వెదజల్లసాగాడు. అమితవేగ నా యిరవై నిమిషాలు పడవలను నడిపి ప్రజాసైనికులు ఒడ్డుకు పట్టించారు. ఒడ్డుజేరారు. వారికి శత్రువుల జాడ ఎక్కడా కానరాలేదు.

ఆ యేడు వర్షాలు బాగా కురియలేదు. అందువలన నదిలో నీరు అమితంగా లేదు. ప్రజా సైనికులు ఆగిన ప్రదేశానికి కొంతదూరంలో ఒక చిన్న లంక వున్నది. దానిమీద ఒత్తుగా, ఎత్తుగా రెల్లుమబ్బులు పెరిగున్నాయి.

"మనం జాగ్రత్తగా వుండాలి" అని దాస్వే, తేవారుకు చెప్పాడు. "శత్రువులు దాక్కోటానికి ఆ రెల్లుదుబ్బులు మంచి వీలుగా వున్నాయి. ముందుగా ముగ్గుర్ని స్కౌట్లుగా పంపు. మిగిలినవాళ్ళం మనమంతా లోపలి అనకట్ట సోలువులో మెల్లిగాపోదాం" అన్నాడు.

ప్రజాసైనికులు జాగ్రత్తగా ముందుకు నడిచారు. కొన్ని నిమిషాలయినతర్వాత స్కౌట్లలో ఒకడు తిరిగివచ్చాడు.

"అక్కడ ఎవరిదో ఒకశవం పడివుంది!"

"ఎవరైనదీ గుర్తుపట్టావా?"

"లేదు"

తేవార్, దాస్వేలు అనకట్టపైకి ఎక్కారు. స్కౌట్లు నిలబడివున్న ప్రదేశానికి పరుగెత్తిపోయారు. శివో తల బయటి సోలువులోనికి వాలి వుంది. అతని చెయ్యి ఇంకా చేతిబాంబును గట్టిగా పట్టుకొనివుంది. శివో చనిపోయివున్నాడు.

"మనకు కాల్పుల ధ్వనే వినిపించలేదెందుచేత?" అని తేవార్ అడిగాడు.

"మన తెడ్లు అమితంగా చప్పుడుచేసి వుంటాయి. అందువలన మనకు వినపడలేదేమో!" అని జవాబు చెప్పాడు దాస్వే. "శవం ఇంకా వేడిగానే వుంది. యెంతోదూరం పోయివుండరు. త్వరగా పద!" అన్నాడు దాస్వే.

తేవార్ స్కౌట్లను మరల ముందుకు పంపాడు. ప్రజాసైనికులు మరల లోపల సోలుపువెంట బయలుదేరారు. రెల్లుదుబ్బుల్లోనుండి అకస్మాత్తుగా ఒక కంఠధ్వని వినిపించింది.

"సాంకేతికపదం!"

స్కౌట్లు ఆనకట్టవైపుగా జారారు. వారి నెత్తిమీదుగా బులెట్లు ఎగిరాయి. స్కౌట్లను కలుసుకున్నారు ప్రజాసైనికులు. స్కౌట్లు ప్రక్కగా పడుకొని శత్రువులమీద తుపాకులు కాల్చసాగారు. యిరవైగజాల దిబ్బ ఆ యిరుపక్షాలకూ మధ్యగా నుండుటచే యెవరికీ గాయాలు తగులలేదు.

"చేతిబాంబులు తీసుకొని రాకపోయాంగదా. చాలా చెడ్డపనిచేశాం" అన్నాడు దాస్వే విచారంగా "ఈవిధంగా రాత్రల్లా పోరాడినా అంతూ పొంతూవుండదు."

అతడు తేవార్‌తో ఆలోచించాడు. ప్రజాసైనికులలో సగంమందిని తేవారు తనవెంట తీసుకొనిపోయి, కీలుబొమ్మలకు దూరంగా ముందు ప్రదేశానికి చేరాలనీ, ఆనకట్టకు ఆవలివైపునకు దిగి, శత్రువులపై కాల్పులు జరపాలనీ నిశ్చయించుకొన్నారు. సోలుపును కరచుకొని నక్కుతూ పోయారు తేవార్, ఆతని అనుచరులూ. కాని తేవార్ తన హడావిడిలో తాను పోవాల్సిన దూరాన్ని తప్పుడు అంచనా వేశాడు. ఒక్క నిమిషంలో శత్రువుకు పదిగజాలదూరంలోనున్న తావుకు మాత్రమే తన సైనికులను తీసికొనిపోయి ఆనకట్ట ఎక్కాడు. ఈ సంఘటనను కీలుబొమ్మలు బిత్తరపోయి చూస్తున్నారు. కీలుబొమ్మలపై కాల్పులు సాగించవలసిందిగా దాస్వే, తన సైనికులకు ఆజ్ఞాపించాడు. ఏమి జరుగుతున్నదీ కీలుబొమ్మలు తెలుసుకునేలోపుగానే తేవార్ సైనికులు కీలుబొమ్మలపైబడి, వాళ్ళను నిరాయుధులనుగా జేసి బంధించివేశారు. కీలుబొమ్మలకు రక్షకులుగా బలాత్కారంగా లాక్కొనిపోబడిన బెదురుగొడ్డు మామిగిలిన యిద్దరు ప్రజాసైనికులూ, దేశద్రోహులతో పోరాడి గాయపడ్డారు. దేశద్రోహులు వారి తుపాకులను లాగేసి, చేతులను వెనక్కి విరిచి

క్కటారు. బెదురుగొడ్డు భోరున ఏడవసాగాడు. కాళ్ళతో నేలను తాడిస్తూ, "అయ్యో! అయ్యో! పిచ్చెమ్మ—" అని ఏడ్వసాగాడు. "ఒక్క నిమిషం కిందనే, రెండు వసపలలో ఆ తొత్తుకొడుకులు తప్పించుకొనిపోయారు. ఈ వెసపలను పాలాపెట్టి పోయారు. హో. వాడి ముండ, జిన్నంగు. జీవోగాళ్ళంచహూ తప్పించుకుపోయారు!" అని బెదురుగొడ్డు యేడవసాగాడు.



# 18 అధ్యాయం

ఆ మరునాటి ఉదయం జపాను ఖైదీల నందరినీ పట్నం దక్షిణ భాగంలోగల ఒక దేవాలయం ఆవరణలో సమావేశపరచారు. జపాను వాళ్ళ తలకుగానీ కాళ్ళకుగానీ ఆచ్ఛాదన మేమీలేదు. వాళ్ళ ముఖాలు మురికిగా వున్నాయి. బట్టలు చిరిగివున్నాయి. వాళ్ళందరూ ఒకేచోట వరుసగా కూర్చున్నారు. మాటా పలుకూ లేకుండా తలలు వంచుకొని విచారంగా కూర్చున్నారా జపానువాళ్ళు.

ఒక యువ బాలూసైనికుడు వాళ్ళకు సబ్బునూ, తుండుగుడ్డలనూ: బొక్కెనలతో నీళ్ళనూ, కొన్ని చిన్న అద్దాలను సప్లయిజేశాడు. తమ ముఖాలను ఆ చిన్న అద్దాలలో చూచుకున్నారు. నల్లని ముఖాలలో ఎర్రని నోళ్ళు చూడటానికి నవ్వు పుట్టిస్తున్నాయి. వాళ్ళ ముఖాలలో మార్పేమీ కనపడలేదు. ఏమైనప్పటికీ, త్వరిత్వరగా ముఖాలు కడుక్కొన్నారు. స్నానాలుచేశారు. అటుతర్వాత వాళ్ళకు శుభ్రమైన బట్టలనూ, చెప్పులనూ, బాలూ సైనికులు సప్లయిజేశారు.

బట్టలు మార్చుకొంటూ ఆ జపానుఖైదీలు "బాలూ చాలా మంచివారు. థాంక్ యూ! థాంక్ యూ!" అని అభినందించసాగారు.

అటుతర్వాత ఆ జపానుఖైదీలను, ప్రజాసైనికులు దేవాలయంలోని ఒక గదిలోనికి భేటీకొరకు తీసుకొనిపోయారు. అక్కడ హెడ్ మాష్టరు చెంగ్ వారిని స్నేహపూర్వకంగా ఆహ్వానించాడు. హెడ్‌మాష్టర్

ఆర్చిడ్ కళ్ళు తుడుచుకొంటూ "అది నిజమే! నేను మంచిదాన్ని. తెగిన చెప్పును కాదుగా! నామీద వాడి కేం అధికారముంది? నా యిష్ట మొచ్చినవాణ్ని నే నెందుకు ప్రేమించకూడదు? నా కేమైనా వాడు పుస్తె కట్టాడా?" అన్న దామె.

గూలూ వేగంగా ఆమె చేతులు పుచ్చుకొన్నాడు. ఎవరిని ప్రేమిస్తున్నావో చెప్పవూ?" అన్నాడు.

"హుం....వాణ్ణా!" అని ఆర్చిడ్ మూతి విరిచింది. "అలాంటి కక్కులుకొట్టిన ముఖాన్ని ఎప్పుడూ చూడలేదు" అన్నది.

"మరి నేనో?" అని నొక్కి పేరాశగా అడుగసాగాడు గూలూ.

"నీవా?" అని పరధ్యానంగా అతనివంక క్రీగంటితో చూసింది. "చప్పుడులేని గొడుగువని భయపడుతున్నా—తుఫానువస్తే నిలబడలేవేమో! నేను నిన్ను పిచ్చిగా ప్రేమించేసుందే మనిద్దరం విడిపోవడం మంచిది" అన్నది.

"ప్రేమతోనే చచ్చిపోమంటావా?" అని గొణుగుతూ గూలూ ఆమెను తనివిదీర తన బాహువుల్లో బంధించాడు.

ఆర్చిడ్ కిలకిల నవ్వి తన వ్రేలికొనతో అతని నుదురునొక్కింది "నీవు నన్నీవిధంగానే చంపేస్తావనుకుంటున్నా" అన్నది.

ఉన్మత్త సంతోషంతో కళ్ళుమూసుకొని గూలూ, "ప్రియా! నీవు నన్ను ప్రేమించినంతకాలం నీ వేది చేయమంటే అది చేస్తా" అన్నాడు.

ఆర్చిడ్ అతని కౌగిలినుండి తప్పించుకొంది. "నీవు నిజంగా నన్ను ప్రేమిస్తూవుంటే బాలూతో సంబంధాలు పెట్టుకొని, జీవోని నాశనం చెయ్యి. మనం మనవాళ్ళతో కలసిపోయి గౌరవంగల చైనావాళ్లలాగున బ్రతుకుదాం. నేను నిన్ను పెళ్ళిచేసుకుంటా. నీ కా దమ్ములు లేకపోతే ఇకనుండి నా దగ్గరకు రాబోకు—ఎప్పటికీ రాబోకు! నే నెట్లా పోయినా

నువ్వు పట్టించుకోబోకు! నీకేం సంబంధంలేదు. వూఁ ఏ మాటా తేల్చి చెప్పు, ఇప్పుడే విడిపోదాం" అన్నది.

"విడాకు సంగతెత్తబోకు ప్రియా" అని గూలూ ఆమెను ప్రతిమాలాడాడు. "జపానువాళ్ళ కూడు మింగాలంటే నాకు చాలారోజులనుండి బహు చెడ్డ కష్టంగా వుంది. మనం సంబంధాలు పెట్టుకోవాలంటే యెలా వీలవుతుంది?" అన్నాడు.

ఆలోచనాపూరితంగా అతనివంక రెప్పార్పకుండా చూస్తూ, ఆర్చిడ్ "నువ్వు చెప్పింది బాగుంది.కాని నీవు నన్ను మోసంజేస్తున్నావో లేదో నా కెట్లా గురు? వొట్టు పెట్టుకో" అన్నది.

"నువ్! నువ్!" అంటూ గూలూ కోపంగా నేలను తాడించాడు. కాని వొట్టుపెట్టుకున్నాడు. "పైన ఆకాశం సాక్షి. క్రింద భూమిసాక్షి. నా హృదయం సాక్షి. నేను నీతో అబద్ధమాడుతూవుంటే, నన్ను తుపాకి గుండు బలితీసుకొంటుంది.

అప్పుడు ఆర్చిడ్ అతనికి తా నా గత రాత్రి ఎక్కడికి పోయిందీ చెప్పింది. ఒక గంట తర్వాత ఆమె అతణ్ని చెన్‌మాత యింటికి తీసుకొని వచ్చింది. మేయీని చూడగానే అతడు చాలా సిగ్గుపడ్డాడు. సిగ్గుతో తల వంచుకున్నాడు.

"నేను గత కొన్ని సంవత్సరాలనుండి చాలా అవమానకరంగా ప్రవర్తించాను. బాలూ నామీద దయదలచి నన్ను క్షమిస్తే, నేను సరియైన మార్గంలోపడతానని వాగ్దానం జేస్తున్నా" అని గూలూ మెల్లగా చెప్పాడు.

"శత్రువులపక్షంలోజేరి పనిచేయటం చాలా తీవ్రమైన తప్పిదం" అని జవాబుచెప్పింది. "కాని, ప్రతిఘటనోద్యమంలో జేరి కష్టపడి పనిజేసి నీ నిజాయితీని రుజువుచేసుకొంటే బాలూ నిన్ను తనలో జేర్చుకుంటుంది" అన్నది మేయీ. సైనిక, రాజకీయరంగాలలో తాము చేపట్టుతూ వున్న విజయాలను గురించి ఆమె అతనికి వివరించింది.

"నేను గెరిల్లాలతోవున్న రోజులలోకన్న బాలూ బాగా అభివృద్ధి జెందింది!" అని గూలూ ఆశ్చర్యపోయాడు. "కీలుబొమ్మల పస తెల్లవా

రింది. నా కడుపునిండా తిండి దొరకటంలేదు. నాకు వాళ్ళు దుస్తులిచ్చి రెండేళ్ళయింది. వీళ్ళెమ్మ..! ఆ తొత్తుకొడుకు జీవోగాడు మమ్మల్నిఅంద రినీ నేలగొట్టి కాలరాస్తున్నాడు. నేను గొప్పలుచెప్పటం కాదుగానీ- జాలూ నాకు సహాయంజేస్తే ఆ కుక్కలకొడుకులను హతమార్చుతా. నువ్వే చూద్దువుగానిగా!"

తనమాదిరిగానే బాధపడుతున్న కీలుబొమ్మలను కొంతమందిని సంఘటితపరచవలసిందిగా గూలూతో మేయీ చెప్పింది. కోటలో తిరుగు బాటు తీసుకొనివచ్చుటకు సిద్ధంకావలసిందిగా చెప్పింది. అంతా సిద్ధమైన తర్వాత ఒకసారివచ్చి కలుసుకోమన్నది. కీలుబొమ్మల తిరుగుబాటు, జాలూసైన్యం ముట్టడి ఒకేసారి జరిగేటట్లు ఏర్పాట్లుచేస్తానన్నది.

"మాకు జిన్లంగ్‌నికూడా పట్టుకోవాలనివుంది" అని చెప్పింది. ఆ మురికిముండాకొడుకునికూడా పట్టేయటానికి సిద్ధంగా వుండు! ఛాన్స్ దొరి కితే పోనీయబోకు!" అన్నది మేయీ.

* * * *

గూలూ కోటకు తిరిగివెళ్లాడు. ఈ ప్లాన్‌ను తన స్నేహితుడయిన జాన్‌తో చెప్పాడు. కీలుబొమ్మగా తన జీవితంలో కలుగుతున్న రోతను గురించి అనేకసార్లు తన అసంతృప్తిని వ్యక్తిగత సంభాషణలో వెల్ల డించాడు జాన్.

గూలూ అనుకున్నట్లుగానే, జాన్ అతనితో సహకరిస్తానన్నాడు. వారా విధంగా మాట్లాడుకొంటూవుండగా, తప్పతాగిన జిన్లంగ్ హుషా రుగా అక్కడకి వచ్చాడు. దొడ్డిలో తనూ, జీవోలతోపాటు త్రాగటానికి రావలసిందిగా గూలూని బలవంతంజేశాడు. ఇష్టంలేకపోయినా గూలూ వెళ్ళక తప్పిందికాదు.

ఆ ముగురూ అర్ధగంటసేపు దిట్టంగా తాగారు. ఆ సమయంలో జీవోకు ఆర్చిడ్ జ్ఞాపకంవచ్చింది. ఆమెని తీసుకురావలసిందిగా జీవోతన

అంగరక్షకుడిని పంపాడు. కాని ఆమె తనకు వంట్లో బాగాలేదని కబురు చేసింది. జీవో గూలూవంక అసహ్యంగా చూచాడు.

విషపునవ్వును విసురుతూ "రెండు రోజులనుండి పనిలో మునిగున్నా. నా వెనకాల ఎవడో దాని కొంపలో దూరుతున్నాడు. దాని మనసు విరిచాడు. ఆ తొత్తుకొడుకు యింకా ఏంజేస్తాడో ఎవరికి తెలుసు!"

గూలూ, తానేమీ వినటంలేదన్నట్టు తన సారాయి కప్పులో నోరు పెట్టి తలవంచుకుని ఏమీ మారాడకుండా పూరుకున్నాడు. ఇలాంటి పోట్లాటలను మరింతగా రెచ్చగొట్టమంటే జిన్లింగ్‌కు మహాసరదా. వాడు రెండు సమిధలు తగిలించాడు.

మీకు ద్రాక్షసారాయం కొంత చేదుగా వుందనుకుంటాను దాదా జీవో!" అని ఎత్తిపొడిచాడు జిన్లింగ్.

జివోముఖం భయంకరంగా ఎర్రబడింది. "చేదా, వెంట్రుకలా!" అని బల్లగుద్దుతూ గర్జించాడు. "దానికి చేదు తినిపించి చూపిస్తా!" అని మొరిగాడు జీవో.

గూలూ హృదయంలో భయద్వేషాలు పెనుగులాడినాయ్! నుదుటి మీద పట్టిన చెమటను తుడుచుకొంటూ చులకనగా నవ్వాడు. "స్త్రీ హృదయము చాలా గాఢం. మరుక్షణంలో ఏమిచేస్తుందో ఎవరికీ తెలియదు" అన్నాడు.

జీవో తన సారాయికప్పును బల్లమీద పగలేశాడు. "నంతనాచి కబుర్లు చెపుతావేం?" అని తన వేళ్ళను గూలూ ముక్కుక్రింద పెట్టి అరవసాగాడు జీవో. "నాకు తెలియదనుకుంటున్నావా నీ వేషాలు!"

"నేనేం వేషం వెయ్యటంలేదు" అని ప్రత్యుత్తరమిచ్చాడు గూలూ, "ఆమెకు యిష్టంలేదేమో రాలేదు. దానికీ నాకూ సంబంధం ఏమిటి?"

సిగ్గులేకుండా ఒక దళనాయకుడు తనలాంటి కంపెనీ కమాండ

రుకు ఎదురుజవాబు చెప్పటాన్ని జీవో సహించలేకపోయాడు. అమాంతంగా లేచి జీవో గూలూను మొఖంవాచేటట్లు కొట్టాడు. వానిముత్తాత పద్దెనిమిదితరాల వెనుకనుండి క్రిందివరకూ బండబూతులు తిట్టాడు జీవో. ఈ వ్యవహారం శ్రుతిమించి రాగానపడటం జిన్లంగ్‌కు యిష్టం లేదు. ఖాళీగావున్న ప్రక్కగదిలోనికి జిన్లంగ్ జీవోను లాక్కెళ్ళాడు.

గూలూకూడా బాగా త్రాగాడు. జీవో చేతుల్లో దెబ్బతినేసరికి అతనికి మరింత కోపం ఎక్కువయింది. తొట్రుపడుతూ నడవసాగాడు. "ఓః మొద్దువెధవా!" అని తనలో గొణుక్కోసాగాడు. "నీకెవ్వరూ యెదురు చెప్పగూడదేం! హా! మంచిది, చస్తానులే! త్వరలోనే నీకు మూడిందిలే! నీ పెంకితనం ఏమవుతుందో చూస్తాం! నీ తల ఎగిరిపోయే రోజులు వచ్చాయ్!" గూలూ ముందు ఆవరణలో యిటూ అటూ పచారుచేయసాగాడు.

యథార్థానికి అతడు తనలోతాను గొణుక్కోటంకాదు. బిగ్గరగానే మాట్లాడాడు. ఆ మాటలన్నింటిని జిన్లంగ్ గోడప్రక్కన నిలబడి విన్నాడు. తాగుబోతువాడి చెత్తవాగుడుకన్న ఈ మాటల్లో ఏదో గూఢార్థము కలదని భావించాడు జిన్లంగ్. అతడు తొందరగా గూలూని అనుసరించాడు. గూలూవుంటున్న గది కిటికీ క్రింద నిలబడి వినసాగాడు జిన్లంగ్.

"ఇంకా ఎక్కువకాలం ఆగజాలను." అని కోపంగా గూలూ జాన్‌తో చెప్పుతున్నాడు. రేపుప్రొద్దున్న వీడి భరతం పట్టేటట్లు ఏర్పాటు చేస్తా! ఆ కుక్కలకొడుకును ముక్కలు ముక్కలుగా తరిగేస్తేనేగాని నాకు నిద్రపట్టదు." అన్నాడు గూలూ.

జాన్ విసనకర్రతో దోమలు తోలుకొంటున్నాడు. "అంత బిగ్గరగా మాట్లాడబోకోయ్! ఎవరయినా వింటే మూడుతుంది!" అని హెచ్చరించాడు జాన్.

జిన్లంగ్ ఆ కిటికీక్రింద ఎక్కువసేపు నిలబడలేదు. జీవోను వెతుకుతూ వెళ్ళాడు.

రాత్రి ఒంటిగంటకు కీలుబొమ్మ సైనికులు గూలూ జాన్‌లు నిద్ర పోతున్న గదిలో జొరబడ్డారు. వారిద్దరినీ చేతులు వెనక్కు విరిచి కొట్టారు. కోట ఆవరణలోనున్న పెద్దగదిలోనికి తీసుకొనిపోయారు. అక్కడ వీరికొరకు జీవో, జిన్లంగులు వేచియున్నారు.

జాన్‌ను మొదట ప్రశ్నించారు. అతనేమీ బయటపెట్టలేదు. అతన్ని కాలి బొటనవేళ్ళకు తాడుగట్టి తలక్రిందులుగా దూలానికి వ్రేలాడదీయవలసిందిగా జిన్లంగు ఆజ్ఞాపించాడు.

గూలూ పసగుట్టు బయటపడిపోయిందని భయపడి, పెనుగాలికి ఆకులాగున గజగజలాడాడు. "నాకేం తెలియదు....! నే-నే నేను తాకున్నాను. నేనేం అన్నానో నాకే తెలియదు!" అని వణుకుతూ చెప్ప సాగాడు.

కీలుబొమ్మ కమాండరుకు కన్నుగొట్టి, జిన్లంగు చెయ్యివూపాడు. "భయపడబోకు గూలూ!" అన్నాడు స్నేహపూర్వకంగా జిన్లంగు. "బాలూకి దయాదాక్షిణ్య విధానం వుంది. అయితే, అది మాకూ వుంది. నిజం ఒప్పుకో! నీ ప్రాణాన్ని కాపాడుకో. జపానువాళ్ళ హెడ్‌క్వార్టర్సులో నాకు చాలా పలుకుబడి వుందన్నవిషయం నీకు తెలుసుగా. యుద్ధానికి ఎవడు బ్రతికుండాలి, ఎవరు చావాలన్న విషయాన్ని నిర్ణయించేది నేనేనన్న విషయం నీకు తెలుసుగా! నీ ప్రాణాలకు హామీయిస్తున్నా! తొందరగా మాట్లాడు!" అన్నాడు జిన్లంగు.

గూలూ తలవంచుకొన్నాడు. అతని కనుబొమలనుండి చెమటకార సాగింది. గూలూకు ధైర్యం పూర్తిగా సన్నగిలిపోయింది. మోకాళ్ళమీద పడి ఏడ్వసాగాడు.

వెక్కి వెక్కి ఏడుస్తూ "నన్ను రక్షించండి! అంతా చెప్పేస్తాను! తప్పకుండా చెప్పేస్తాను!" అనసాగాడు గూలూ.

విషయాన్నంతా బయటపెట్టేశాడు గూలూ.... దూలంనుండి వ్రేలాడుతూ వున్న జాన్ యీ దృశ్యాన్ని జూచి నిస్సహాయతగా ఏడ్వ సాగాడు.

తన్ను చంపటానికి గూలూ, ఆర్చిడ్‌లు ఏవిధంగా కుట్రపన్నినదీ వినగానే జీనోయొక్క కక్కులు కొట్టిన ముఖం ఎర్రబారింది. అమాంతంగా ఒక తుపాకిని తీసుకొని వణికిపోతూవున్న గూలూవైపుకు పోయాడు. అతిభయంకరంగా గూలూ గ్రుడ్లు తిరగసాగాయి. తన్ను రక్షించవలసిందిగా జీనోకాళ్ళపైపడి ప్రాధేయపడసాగాడు గూలూ. జీనో అతణ్ని లేగి ఒక తన్ను తన్నాడు. సన్నీతో గూలూ చచ్చేటంక వరకూ క్రూరంగా పొడిచి చంపాడు.

* * * *

తూర్పున తెలిరేఖలు కనిపించే సమయంలో కీలుబొమ్మలు ఆర్చిడ్‌ను అరెస్టుచేశారు. అదేసమయంలో, జిస్లంగు కొంతమంది కీలుబొమ్మలను వెంటబెట్టుకొని చెన్‌మాత యింటిని ముట్టడించాడు. ఆ వృద్ధురాలు అప్పుడే నిద్రనుండి లేచింది. గేటుద్వారం తలుపులమీద దడదడశబ్దం అయిన సమయంలో కొంగుమీదవున్న మేయీ తన పిల్లవానికి పాలు యిస్తూవుంది.

కించిత్తయినా అనుమానపడకుండా చెన్‌మాత "ఎవరు వచ్చారో చూసివస్తాను" అని చెప్పి వెళ్ళింది. ఆవరణద్వారం తలుపులు తెరిచింది. ఆమెను ఒకప్రక్కకు నెట్టేస్తూ ఆవరణలో సాయుధులైన కొంతమంది మనుషులు జొరబడ్డారు.

కిటికీగుండా మేయీ, జిస్లంగు రాకను గమనించింది. ఆమె హృదయం దడదడలాడింది. పిల్లవాణ్ని కొంగుమిద పడుకోబెట్టింది. దిండుక్రిందనున్న పిస్తోలును బయటికిలాగింది. కాళ్ళకు చెప్పులైనా వేసు

కోకుండా పరుగెత్తుకొనిపోయి గది తలుపుచాటున దాక్కొంది. ఒక్క క్షణమయిన తర్వాత జిన్లంగు చేతిలో పిస్తోలుతో లోపల ప్రవేశించాడు. పళ్ళు గట్టిగా కరచిపట్టుకొని మేయీ జిన్లంగుయొక్క ముచ్చిలిగుంటను గురిజూసి పిస్తోలు ట్రిగర్ నొక్కింది. పిస్తోలుగుండు ప్రేలిందిగాని గురి తప్పింది. ప్రేలిన ధ్వనిని జిన్లంగు అటుదిక్కుగా తిరిగాడు. పిస్తోలుని లంకించుకొన్నాడు. కాని మేయీ పిచ్చిబలంతో పిస్తోలుని గట్టిగా పట్టు కుంది. జిన్లంగు అమితబలంగా గుంజసాగాడు. మేయీ అతని ప్రేలుని కొరికింది. జిన్లంగు బాధతో చర్రున చేతిని వెనక్కు లాక్కున్నాడు. అతని ప్రేలిబొమికకంటా గాటుపడింది. ఇంతలోనే అనేకమంది కీలు బొమ్మలు లోపలికి జొరబడి మేయీని గట్టిగా పట్టేశాడు.

బాధిత హస్తాన్ని వూపుతూ జిన్లంగు ఆమెవంక క్రూరంగా చూడసాగాడు. అకస్మాత్‌గా కాంగుమీదవున్న పెంకు నొకదానిని తీసు కొని దాన్ని మేయీనెత్తిమీద విసరిగొట్టాడు. ఆమె స్పృహతప్పి క్రింద పడిపోయింది.

ఈ గందరగోళానికి బెదరిపోయి, కాంగుమీదవున్న పసివాడు ఏడ్వసాగాడు. జిన్లంగు ఆ పసివానిని లంకించుకొని "చావరా లొత్త కొడకా!" అని తిట్టి నేలకు విసరేశాడు. అంతటితో వూరుకోకుండా జిన్లంగు పన్నీని యివ్వవలసిందిగా ఒక కీలుబొమ్మని అడిగాడు.

"అలాంటి పసివాని కేమితెలుస్తుంది? ఆ విషయం మరచిపొండి" అన్నాడు చిరచిరలాడుతూ ఆ కీలుబొమ్మ. పిల్లవాడు గొంతు బొంగుప పోయేటట్లు ఏడ్చాడు. గొంతుకెండిపోయి పిల్లాడు స్పృహతప్పిపోయాడు. చెన్‌మాత పందుకు కుంటుకుంటూవచ్చి పిల్లవాణ్ని తన చేతులలోకి తీసు కొంది. జిన్లంగు ఆమెచూసి మండిపోయాడు.

"ఈ తొత్తుముండకూడా యిందులోవుంది. తీసుకుపోండి దీన్ని కూడా!" అని అరచాడు జిన్లంగు.

ఆ వృద్ధురాలిని కీలుబొమ్మలు బంధించే సమయానికి మేయీకి తెలివి వచ్చింది. "చెన్ మాతకేమీ తెలియదు. ఆమెని విడిచిపెడతారా విడిచిపెట్టండి. లేకపోతే నేనిక్కడనుంచి చచ్చినా కదలను!" అని అరచింది మేయీ.

వినుగా జిన్లంగు వృద్ధురాలినుండి పిల్లవాణ్ని గుంజుకొన్నాడు. వాణ్ని ఒక కీలుబొమ్మమీదకు విసరివేశాడు. వృద్ధురాలిని పడతన్నాడు. క్రూరాతిక్రూరంగా ఆమెమీద ఎక్కి అనేకసార్లు తొక్కాడు. అటు తర్వాత ఆ కీలుబొమ్మల ముఠా నగరానికి తరలిపోయింది.

మేయీ రెండుచేతులకు రెండు త్రాళ్ళను కట్టి, కీలుబొమ్మలు ఆ త్రాళ్ళ చివర పుచ్చుకొని, ఆమె వెనకగా నడుస్తున్నారు. తుపాకులు బారు చేసి కీలుబొమ్మలు కొంతమంది ఆమెప్రక్కగా నడుస్తున్నారు. వారా విధంగా సగందూరం నడిచారు. నూతిలోనుండి నీళ్ళు తోడుతున్న ఒక మనిషిని చూచింది మేయీ.

తనకు విపరీతంగా దాహమేస్తూవుందని చెప్పింది. తాళ్ళను పట్టుకున్న కీలుబొమ్మలామెని నూతివద్దకు తీసుకొనిపోయారు. వాళ్ళని ఒక్క గుంజు గుంజి మేయీ నూతిలో దుమికింది.

ఆమె ఆత్మహత్యా ప్రయత్నం భగ్నమయింది. ఎందువల్లనంటే, నూతిలో నీళ్ళ లోతునాలేవు. అదీగాక దుమికేటప్పుడు తలక్రిందుగా దుముకుటకు బదులుగా, కాళ్ళమీద దూకింది. ఆమెని వదనిపెట్టిన కీలుబొమ్మని బండబూతులు తిడుతూ జిన్లంగ్, నీళ్ళతోడుతున్న ఆవృద్ధుణ్ని నూతిలోకి దిగమన్నాడు. కొన్ని నిమిషాలుతర్వాత ఆ వృద్ధుడు బయటికి వచ్చి "ఆమె రానంటున్నది" అని చెప్పాడు.

పిస్తోలుని నూతిలోనికి జూపుతూ "తప్పుడుముండా! బయటికి రా! లేకపోతే చంపేస్తా!" అని జిన్లంగ్ బండబూతులు తిట్టసాగాడు.

"దేశద్రోహి, కుక్కలకొడకా! ఊఁ! కానియ్. షూట్ చెయ్యరా! నీ చేతుల్లో పడేదానికన్నా చస్తాను. చంపెయ్! హాయిగా వుంటాను!" అని అరచింది మేయీ.

రెండుసార్లు గురిజూచి పేల్చాడు జిన్లంగ్. మొదటి గుండు ఆమె భుజానికి తగిలింది. కంటిబొమికని విరచింది. రెండవదెబ్బ ఆమె చెవి అంచుని నరుక్కుపోయింది. నూయి అంతా రక్తంతో ఎర్రగా అయిపో యింది. కాని చల్లగావున్న ఆ నూతినీళ్ళు ఆమె గాయంనుండి ప్రవహి స్తున్న రక్తాన్ని ఆపివేశాయి. ఎంత ప్రయత్నించినా మేయీ బ్రతుకు తప్పించిగాదు.

చిట్టచివరకు జిన్లంగ్ యిద్దరు కీలుబొమ్మలని నూతిలోకి దింపాడు. ఆమె వాళ్ళతో హోరాహోరీగా పోట్లాడింది. కరిచింది. తన్నింది. కాని ఆమెని బయటకి లాగి నగరానికి తీసుకుపోయారు.



# 19 అధ్యాయం

మేయీ పట్టుకోబడి కొద్దిరోజులు గడచిన తర్వాత చైనాదేశానికి ఉత్తమ మిత్రుడైన సోవియట్ యూనియన్ జపానువాళ్ళపై యుద్ధాన్ని ప్రకటించి, చైనా సైన్యంతో చేతులు కలిపింది. చాలా స్వల్పకాలంలోనే, చైనాదేశంలోని ఈశాన్యరాష్ట్రాలలోని జపానువాళ్ళని వోడించింది సోవియట్ యూనియన్. వోడిపోయినప్పటికీ, జపానువాళ్ళు నగరాలని విడిచి వెళ్ళ నిరాకరించారు. ఆయుధాలని వప్పగించ నిరాకరించారు.

మేయీ ఖైదీగా వుంచబడిన నగరం, బ్లాకీత్వే పార్టీ సెక్రటరీగా వ్యవహరిస్తున్న కౌంటీలోనే వుంది. బ్లాకీ తన కౌంటీలోని ముఖ్య కార్యకర్తలందరినీ సమావేశపరచాడు. శత్రువులు ఆయుధాలను వప్పగించ నిరాకరిస్తే వాళ్ళను నాశనం చేసివేయండని వారిని ఆదేశించాడు బ్లాకీ. ప్రజాసైనిక యూనిట్లన్నింటిని క్రమబద్ధమైన సైన్యంలో జేర్చినామన్న విషయాన్ని కమాండరు ఛూటే యిప్పుడే ప్రకటించాడని బ్లాకీ ఆ కార్యకర్తలకు చెప్పాడు. ప్రతినగరాన్నీ స్వాధీనంచేసుకోవాల్సివుంది. ప్రతి కౌంటీలోనూ— ఆ కౌంటీ ప్రజాసైన్యం శత్రువుల స్వాధీనంలోవున్న నగరాలను ముట్టడించుటకు వెంటనే ఆయత్తం కావాలి!

పరిస్థితులలో వచ్చిన మార్పుల కనుగుణ్యంగా వ్యవహరించుటకుగాను దాస్వే తన జిల్లాకు వచ్చాడు. తాము నగరాన్ని త్వరలోనే స్వాధీనంచేసుకోగల మనుకున్నాడు. మేయీని ఖయిదీగా పట్టుకున్నారన్న విషయాన్ని విన్నదగ్గరనుంచీ దాస్వే మనసు మనసులోలేదు. అంతేగాక,

ఈ నగరాన్ని స్వాధీనం చేసుకోవడమంటే, చైనాదేశంలో కడగొట్టు శత్రుదుర్గాన్ని స్వాధీనం చేసుకోవటమన్నమాట. ఈ కోటను స్వాధీనం చేసుకోగానే మళ్ల శాంతి వర్ధిల్లగలదనీ, జీవితం మామూలుగా నడచిపోగలదనీ భావించారు.

కౌంటీ సమావేశంలో ఆమోదించబడిన తీర్మానాన్ని దాస్వే తన జిల్లాకార్యకర్తల యెదుట వుంచాడు. వారు సంతోషంతో గంతులేశారు. "భలే! భలే! పూర్తయిపోయినట్లే నన్నమాట. జపానువాళ్ళని తుడిచేద్దాం. ఏయ్! జపాన్‌వాళ్ళు మంచుబిందులోయ్! సూర్యుని వెలుగుకాగలేని మంచు బిందువులోయ్! చాలా అద్భుతంగా వుంది. మనమిప్పుడు క్రమబద్ధసైన్యమన్నమాట."

బెదురుగొడ్డు మా కూడా యుద్ధానికి బయలుదేరేముందు మా ఆవిడని చూసొస్తానంటూవుండేవాడు. ఆఖరికి అలాంటివాడుకూడా ఒక్క పలుకైనా పలుకకుండా యితర ప్రజాసైనికులతోపాటు మూటాముల్లె సరుకొని యుద్ధానికి బయలుదేరాడు. "ఏయ్! రియూ! నేనిప్పుడు క్రమబద్ధ బాలూని అన్నమాట." అన్నాడు బెదురుగొడ్డు మా. నన్ను "బెదురుగొడ్డు" అని పిలిచినవాడి చెమడా లెక్కతీస్తా! జాగ్రత్త."

శత్రువులనుండి యిదివరలో పట్టుకొన్న తుపాకులలోనుంచి ప్రతి ప్రజాసైనికుడూ మూడు తుపాకులను వీపుమీద వ్రేలాడవేసుకొని, సంచీ సామాగ్రులు తీసుకొని, కౌంటీ హెడ్‌క్వార్టర్స్‌కు బయలుదేరారు. ఎక్కువమంది సైనికులను ప్రోగుచేయుటకుగాను దాస్వే, తేవారులు వెనుక దిగబడ్డారు. ఈ పని సులభంగానే సాగింది. ఎందువలనంటే, కౌలుధనం, వడ్డీరెట్ల తగ్గింపుశాసనం మూలంగా రైతులజీవితం బాగుపడ సాగింది. అందువలన, జపాన్‌వాళ్ళ పీడ పూర్తిగా వదలించుకొంటే చాలా బాగుంటుందన్న కోరికకూడా రైతాంగప్రజలలో గాఢంగా నాటుకొంది. యిరవై నాలుగుగంటలలోపుగానే నూటయాభై మంది వాలంటీర్లు, నూతన జిల్లాప్రజాసైన్యంలో వచ్చి జేరారు. వారు దాస్వే, తేవారులవెంట పూర్వ నిర్దిష్టస్థలానికి తరలిపోయారు.



మధ్యాహ్నమయేసరికి ఆ కొత్త ప్రజా సైనికులు నగరంచుట్టూ ప్రదక్షిణంచేసి వచ్చారు. ఆ నగరానికి పడమటగా మూడుమైళ్ళదూరంలో వున్న గ్రామానికి జేరుకొన్నారు. వాళ్ళకు ఒంపూటల్లా తిరిగారేమో బాగా ఆకలిగావున్నది. ఇది శత్రువుల చేతులలోవున్న ప్రాంతం. అందు వలన తేవార్, దాస్వేలు తాము అనుపానులు కనుకొచ్చేటంతవరకూ దాక్కొనివుండవలసిందిగా తమ ప్రజాసైనికులని ఆదేశించారు.

తేవార్, దాస్వేలిద్దరూ పొలాలలోపడి గ్రామంవైపుగా నడువ సాగారు. వారికి ఒక పొలంలో పనిజేస్తున్న ఒక వృద్ధరైతు అతని కుమారుడు కనబడ్డారు. కుర్రవాడు గుంటకను బాగుచేసుకుంటూ కూర్చు న్నాడు. ఆయుధాలుధరించివున్న యీ క్రొత్తవాళ్ళను చూడగానే ఆ తండ్రీకొడుకూ తమ పనిముట్లను పోగుజేసుకొని తొందరగా గ్రామం వైపుకు నడువసాగారు.

"పోబోకు తాతా, మేం మీతో కొద్దిగా మాట్లాడాలి." అని కేకే శాడు తేవార్.

ఆ కేక వినపడనట్లుగా నటిస్తూ వృద్ధుడు మరింత వేగంగా కాలు జాడించసాగాడు. తేవార్ పరుగెత్తి అతణ్ణి కలుసుకున్నాడు.

"భయపడబోకు తాతా! మేం బాలూవాళ్ళం. మీ గ్రామ పరిపాలక సంఘం ఆఫీసు ఎక్కడున్నదో తెలుసుకోదలచాం. అంతేగాని వేరేమీ లేదు" అన్నాడు తేవార్.

"బాలూ" అన్నమాటను వినగానే ఆ వృద్ధరైతు అతని కొడుకు నిలబడ్డారు. ఆ వృద్ధుడు అనుమానిస్తూ "మావూళ్ళో అలాంటి ఆఫీసు లేదే" అన్నాడు.

మీ గ్రామవ్యవహారాలను చూచే వారెవరయినా వున్నారా?" ఓపికగా అడిగాడు తేవార్.

"అవును. వున్నాడు. ఆయన యిప్పుడు ఇంట్లోలేడు. పొలాలలో పనిజేసుకుంటున్నాడు" అని జవాబుచెప్పాడు. ఆ వృద్ధుడు, కుర్రవాడు మరల నడకప్రారంభించారు.

"మీరిద్దరూ ఎందుకంత తొందరగా వెళ్లుతున్నారు?" అని ప్రశ్నించాడు తేవారు. వాళ్ళ హడావిడేమిటో, ఎందుకో అతనికి అర్థంకాలేదు.

ఏదో మధ్యాహ్నంపూట కాస్త ఒక కునుకుతీద్దామని పోతున్నామని ఆ వృద్ధుడు గొణిగాడు. ఈ గ్రామంలో రహస్య కార్యకలాపాలు నడిపించుటకుగాను తనతో చర్చించుటకు లిన్ అనే అభ్యుదయవాది వచ్చాడన్న విషయం దాస్వేకి జ్ఞప్తికివచ్చింది. ఆ లిన్ ఎక్కడుంటున్నాడని వాళ్ళను దాస్వే అడిగాడు. తానెందుకు లిన్‌ను చూడదలచినదీ, వాళ్ళ మధ్య జరిగిన సంభాషణలను పూర్తిగా వివరించి చాలాసేపు దాస్వే నచ్చజెప్పిన తర్వాత, వారు కొంచెం హృదయమిచ్చి మాట్లాడసాగారు. ఆ తర్వాత దాస్వే, తేవారులను వారు లిన్ యింటికి తీసుకొనిపోయారు.

వీరు ఆ యింటికి వెళ్ళేసరికి లిన్ భోజనం చేస్తున్నాడు. లిన్ వీరిని చూడగానే భోజనంవదలిపెట్టి వచ్చాడు. కుశలప్రశ్నలు వేశాడు. "భోజనం చేస్తారా?" అని అతిఆప్యాయంగా అడిగాడు. "ఏం జేస్తున్నారిక్కడ?" అన్నాడు.

"గ్రామంలోని పరిస్థితులెలా వున్నాయో తెలుసుకోవటానికి వచ్చాం" అని జవాబుచెప్పాడు దాస్వే.

"పరిస్థితులు చాలా సులువుగానేవున్నాయ్. ఈ రోజులలో శత్రువులు చాలా అరుదుగా వస్తున్నారు" అని లిన్ జవాబుచెప్పాడు.

ఆ వృద్ధరైతు కొడుకు సంతోషంతో నవ్వసాగాడు. "మీరు నిజంగానే బాలూసైనికులా! మాతో అబద్ధం చెప్పారనుకున్నాం" అని ఆ కుర్రాడు వేగంగా ఆవరణ దాటిపోయాడు.

"ఈ గ్రామం నూటయాభై మందికి భోజనం పెట్టగల్గుతుందా?" అని దాస్వే ప్రశ్నించాడు.

"నూటయాభై మందికేగాదు, యింకా అంతమంది వచ్చినా పెట్టగలం!" అని నవ్వాడు లిన్. "లేకపోవటం అనే సమస్యే లేదిప్పుడు!" అన్నాడు.

తేవార్, దాస్వేలు తమ ప్రజాసైన్యాన్ని గ్రామంలోనికి తీసుకుని

వచ్చారు. ఆ వృద్ధరైతు కొడుకు అప్పటికి, దాలూ వచ్చిందని గ్రామము లోనివా రందరికీ చెప్పేశాడు.

ఇంతకుపూర్వం దాస్వే, తేవారులను అనుమానించిన వృద్ధరైతు, తన యింట్లోనే భోజనం చేయవలసినదిగా దాస్వేని వత్తిడిజేశాడు.

"మామా! మేమంటే భయంగాలేదా?" అని తేవార్ వేళాకోళ మాడాడు.

"ఏయ్! దాలూ అంటే మాకేం భయంలేదు. జపానువాళ్ళనూ, కీలు బొమ్మలనుజూస్తేనే మేం భయపడుతూవుంటాం. దాలూసైనికులమనిజెప్పి వాళ్ళు మమ్మల్ని చాలాసార్లు మోసంచేశారు. అందువల్లనే మే మెవళ్ళనీ నమ్మటానికి జడుస్తున్నాం. వాళ్ళొస్తే నీచపుముండాకొడుకులయ్యా" అని ఆ వృద్ధుడు జవాబిచ్చాడు.

గ్రామంచుట్టూ కాపలావాళ్ళను పెట్టారు. లిన్ ప్రజాసైనికులకు వివిధరైతుల యిళ్ళల్లో భోజనం ఏర్పాటుచేశాడు. ప్రతి రైతుకుటుంబం తాము దాచిపెట్టిన గోధుమపిండితోసహా తగ్గట్టుగా మంచి ఆహారాన్ని పైకి పెల్లగించారు.యోధులకు తగినట్లుగా సత్కారం చేయలేకపోయామే యని ప్రజలు విచారపడ్డారు.

"మేం మికోసమని ఎంతోకాలంనుండి యెదురుచూస్తుం" అన్నారా రైతులు.

"మి రందరూ చాలా మంచివాళ్లు. మీ రిచ్చిన గౌరవాన్ని నిల బెట్టుకోటానికి ప్రయత్నం చేస్తాం!" అని జవాబిచ్చా రా ప్రజాసైనికులు.

వాట భోజనం చేస్తూవుండగా, కౌంటీ హెడ్ క్వార్టర్సునుండి ఒక మనిషి జాబును తీసుకొనివచ్చాడు. ఇప్పు డీ గ్రామంలో దాస్వే, తేవారుల నాయకత్వంక్రిందవున్న ప్రజాసైన్యాన్ని ఫస్టుకంపెనీగా పేరిడి నామనీ, తేవారును దానికి కెప్టెన్‌గా జేసినామనీ, దాస్వేను ఫస్టులెఫ్టినెంట్‌గానూ, పొలిటికల్ కమిస్సారుగానూ చేసినామని ఆ జాబులో వుదహరించబడింది రాత్రి అయ్యేలోపల కంపెనీలన్నీ శత్రువుల స్వాధీనంలోవున్న నగరం చుట్టూవున్న శత్రువుల స్థావరాలను చుట్టుముట్టాలి. వాటిపై దాడి చేయాలి. శ్వేతాశ్వగ్రామంలోవున్న కోటనిండా కీలుబొమ్మలున్నారు.ఈ గ్రామాన్ని

ముట్టడించడమే కంపెనీ లక్ష్యం. ఈ కోటను స్వాధీనంచేసుకొనుటయేగాక, శ్వేతాశ్వగ్రామంగుండా నగరంలోవున్న శత్రువులు తిరోగమించాలని యత్నిస్తే వాళ్ళను కంపెనీ తిప్పికొట్టాలి."ఒక్కశత్రువునైనా వదలరాదు" అన్నదే ఆనాటి నినాదం.

నగరానికి పడమటిదిక్కుగా శ్వేతాశ్వగ్రామముంది. సంధ్యాసమయమయేసరికల్లా కంపెనీ శ్వేతాశ్వగ్రామాన్ని చేరుకొంది. ఈ గ్రామానికి ప్రహరీగోడలు లేవు కాని, జాయాంగ్ సరస్సులోని నీరును గొనివచ్చే ఏటిపాయే దీనికి గోడ. అంటే, ఈ గ్రామం జాయాంగ్ సరస్సులో ఒక లంకపై వుంది.

ఈ గ్రామంప్రక్కగా ఏటిపాయ పోతూవుంది. ఈ గ్రామానికి పోవాలంటే యేటికట్ట మీదనుండి గ్రామంలోనికి పోవుటకు వేయబడిన రాతితో కట్టబడిన వంతెన వుంది. అదొక్కటే భూమార్గం. ఈ బ్రిడ్జికి చివరగా, లంకమీద కోట వుంది. ఏటికట్ట, నదీ రెండుకూడా పావోతింగ్ పశ్చిమంగా పోతున్నాయి. కేంద్రహోపై రాష్ట్రంలోని మహానగరాలలో పావోతింగ్ ఒకటి; శ్వేతాశ్వగ్రామం ఎవరి చేతుల్లోవుంటే, పావోతింగ్‌కి ముట్టడిలోవున్న నగరానికి మధ్యగల భూమార్గం, నీటిమార్గాలు వాళ్ళ స్వాధీనంలో వుంటాయి.

కంపెనీని మూడు ప్లాటూన్లకింద విభజించారు. ప్రతి ప్లాటూన్లోనూ యాభై మంది సైనికులు. మొదటి ప్లాటూను, శ్వేతాశ్వగ్రామానికి ఎదురుగావున్న ఏటికట్టవద్దనున్న ఇళ్ళల్లో వుంచారు. ఈ ప్లాటూను వంతెననూ, కోటగేటునూ కంట్రోలుచేయాలి. మరియొక ప్లాటూను ఏటికట్టవెంట తూర్పుగా వెళ్ళింది. నగరానికి, శ్వేతాశ్వగ్రామానికి మధ్యదారిలో స్థావరం మేర్పరచుకుంది. నగరంనుండి శత్రువు లెవరయినా తప్పించుకుని పారిపోవుటకు యత్నిస్తే వాళ్ళను అడ్డగిస్తుంది. యీ ప్లాటూను అంటే ప్రజాసైన్యానికి అగ్రగామి దళంగా యీ ప్లాటూను పనిచేస్తుందన్నమాట మూడవ ప్లాటూన్, కంపెనీకమాండు,పైదానికి కొంచెం పడమటిదిక్కుగా నది లంకలోనున్న ఒక కుగ్రామంలో బసచేశారు. శత్రువులను యెదుర్కొటానికై పదిహేను పడవలను సిద్ధంచేసుకున్నారు.

కంపెనీలో ప్రతిసైనికుడూ గుర్తుగా తనచేతికి ఒక తెల్లని రుమాలు చుట్టుకున్నాడు. "ముట్టడించు" అన్నదాన్ని సాంకేతిక శబ్దంగా పెట్టుకొన్నారు. ప్లాటూనులన్నీ తమతమ స్థావరాలలోనికి జేరుకొని అన్ని పనులూ పూర్తిజేసుకొనేసరికి సన్నగా వర్షం ప్రారంభమయింది.

అన్నిగంటలు శ్రమపడిన తర్వాత కాస్త విశ్రాంతితీసుకోటానికి దాస్వే, తేవాదులకు సమయం చిక్కింది. అలసటవలన వాళ్ళు ఒక చిన్న గుడిసెలో నిద్రపోక తప్పిందిగాదు. తేవార్ ఒక మోచేతిని కొంగ్ మీద వుంచి కునకుతీస్తున్నాడు. అతనిమెళ్ళో పిస్తోలు వ్రేలాడుతూంది. అతనికి యిట్టే నిద్రపట్టింది. తెరచుకొనివున్న అతనినోటినుంచి గురక లయ తప్పకుండా వస్తూవుంది. దాస్వే ఆ కొంగ్ చివరనే కూర్చున్నాడు. వీపును గోడకు ఆన్చాడు. బాగా అలసిపోయి వున్నాడేమో, కళ్ళు విపరీతంగా నొచ్చసాగాయి.

చిలికిచిలికి వర్షం తాడిపోతకింద తయారయింది. పేపరు కిటికీలోని కంతలగుండా గాలితెరలు వస్తున్నాయ్. వాటివూపుకి మయిల్‌లాంపు వూగిసలాడుతూ నాట్యం చేయసాగింది. దాస్వేకి నిద్రమత్తుగావుంది. ఆ మత్తులోనే మేయీ, పిల్లవాణ్ణిగూర్చి వ్యాకులపడసాగాడు. మళ్ళీ ఒకసారి తానూ, మేయీ, పిల్లవాడు కలిసే భాగ్యమబ్బితే ఎంతబాగుంటుందీ అనుకున్నాడు.

నగరాన్ని స్వాధీనం చేసుకునేలోపుగానె హోలాంటి క్రూరులు తమ ఖయిదీలను చంపేస్తారేమో! దాస్వే హృదయంలోకి యీ ఆలోచన రాగానే నిద్రమత్తు వదలిపోయింది. మనసు పరిపరివిధాల పరుగెత్త సాగింది. గోడకానుకున్నవాడల్లా మేకులాగా నిటారుగా కూర్చున్నాడు. వాళ్ళు మళ్ళీ తనకంటికే అగుపించకపోతేనో! వాళ్ళను మరల చూసే భాగ్యమే లేకపోతేనో! ఈవిధంగా అతని మనసు అవ్యవస్థలో పడింది. నిద్రసమస్యే ఎగిరిపోయింది. విధివిరామం లేకుండా కురుస్తున్న వర్షం చేస్తున్న శబ్దాన్ని వినసాగాడు. కాగితపు కిటికీలు పూర్తిగా తడిసిపోయి

నాయి. లాంపువత్తిని పెద్దదిగా చేశాడు. ఆ చిన్న గదిలో అటూయిటూ పచార్లు చేయసాగాడు. వెతగుందుతున్న ప్రజాసైనికులపైకి వెళ్ళింది. నిద్రపోతున్న తేవారును దాస్వే గట్టిగా కుదిపాడు.

బాగా వర్షం కురుస్తోందోయ్. వాళ్ళందరూ కొత్తవాళ్ళాయె. ఏమయ్యారో చూసివద్దాం పద!" అన్నాడు.

యింకా నిద్రమత్తులోనె వున్న తేవారు "యెలా పోవటం" అని అన్నాడు.

దాస్వే నవ్వాడు. "కారుకోసం కబురుచేయమంటావా ఏమిటి? మనం నడిచిపోవాలి. వాళ్ళ వుత్సాహం ఎలావుందో పోయి చూడవలసిన సమయమిదే!"

కాంగ్‌మీదనుంచి దుముకుతూ తేవారు "రైట్! పోదాం పద!" అన్నాడు.

వారిద్దరకూ చెరియొక మనిషి దారి చూపించుటకు వచ్చారు. రాతి వంతెనవద్ద వున్న సైనికులను చూడటానికి తేవారు వెళ్ళాడు. దాస్వే ఏటికట్టవెంట వెళ్ళాడు.

కన్ను పొడుచుకున్నా కానరాని కటికచీకటిరాత్రి అది. అంతేగాక వర్షం భయంకరంగా ఎడాపెడా దంచుతూవుంది. కను తెరవటానికే అవకాశంలేకుండా వుంది. అలాగే యాతనపడుతూ దాస్వే అతని మార్గదర్శకుడు యేటికట్టమీద నడుస్తున్నారు. విసుగు విరామంలేకుండా జర్రూ బుర్రూ జారుతూ, పడుతూలేస్తూ, నడవసాగారు. కాళ్ళకువున్న బూట్లు వాళ్ళకు భారంగా, బాధగా, ఆటంకంగా తోచినాయి. వెంటనే వాటిని విప్పిపారవేశారు. వట్టికాళ్ళతో నడవసాగారు. కాని మరొక చిక్కు ఏర్పడింది. గచ్చపొదలు, ముళ్ళతీగలూ కాళ్ళకు అడ్డం పడసాగాయి. అడుగేసి అడుగు తీయటమంటే మహా బాధగా పరిణమించింది.

దాస్వేకి మార్గదర్శకుడుగా వచ్చినవాడికి పధ్నాలుగేళ్ళుంటాయి. వట్టి పసివాడన్నమాట. "కమిస్సార్! మనం ఈ వర్షంనుండి బయట పడితే బాగుండదూ?" అని ప్రశ్నించాడు. దాస్వే వప్పుకుంటాడేమోనని ఆశతో అన్నాడతడు.

"దగ్గిరకు వచ్చేశాంగా. మనవాళ్లు హుషారుగా వున్నారో లేదో చూద్దామని వుంది" అన్నాడు దాస్వే.

వా రావిధంగా నడుతూలేస్తూ కొంచెం దూరంపోయిన తర్వాత, ఆ అంధకారంలోనుండి అకస్మాత్తుగా ఒకకంఠం గర్జించింది.

"సాంకేతికపదం!"

"మేమే!" అని అరచాడు మార్గదర్శకుడు.

సెంట్రీ తుపాకిబోల్టు క్లిక్‌మని ధ్వనించింది. "అక్కడే నిల బడండి! కదిలారా కాలుస్తా!"

దాస్వే తొందరగా సాంకేతిక శబ్దాన్ని చెప్పాడు. ముందుకు సాగి పొండని సెంట్రీ అన్నాడు. వర్షంలో తడిసిముద్దవుతూ, ఒక ఖర్జూరచెట్టు క్రింద ఆ సెంట్రీ కూర్చునివుండటాన్ని వారు చూశారు. కొసతేలిన పెద్ద టోపీని ధరించివున్నా డా సెంట్రీ. వర్షంలో తనతుపాకి తడిసిపోకుండా జాగ్రత్తగా దాన్ని తనవంటికి ఆనించి కాపాడుకొంటూ వున్నాడతడు.

అతడు దాస్వేని గుర్తించగానే లేచి నిలబడ్డాడు. "కమిస్సార్! యిలా వచ్చారేమిటి?" అన్నాడు.

"మీరంతా ఎలావున్నారో చూసిపోదామని వచ్చా వర్షం బాధిస్తూ వుందా?" అని నవ్వుతూ దాస్వే అతణ్ని అడిగాడు.

"హా! మీకే లేంది మాకేంబాధ?" అన్నాడతడు.

వీరివిధంగా మాట్లాడుకుంటూవుంటే ఈ మాటలు ఆ ప్లాటూన్ నాయకుడయిన దియూకి వినిపడినాయి. అతడు బురదను చిందించు కొంటూ అక్కడికి వచ్చాడు. దాస్వేని చూడగానె ఆశ్చర్యపోయాడు. "కమిస్సార్! ఈ తుఫానులోనా మీరు బయటికి రావటం?" అన్నాడు దియూ!

"మనవాళ్ళేమయ్యారో అని నాకు బాధకలిగింది. వర్షం అంతూ పొంతూ లేకుండా కురుస్తూ వుందామెను. అందులో మనవాళ్ళు సైన్యంలో జేరింది కొత్తాయెను" అన్నాడు దాస్వే.

"వాళ్ళకేం, హాయిగావున్నారు. చాలా వుత్సాహంగా వున్నారు" అని దియూ నవ్వాడు.

"వాళ్ళందరినీ చూడాలి" అన్నాడు దాస్వే.

గాలివీస్తున్నవైపుగా వీపులుపెట్టి ప్రజాసైనికులు యేటకట్ట సోలుపులో కూర్చున్నారు. జపానువాళ్ళ స్వాధీనంలోవున్న నగరానికి అభిముఖంగా కొన్నిగజాలదూరంలో ఇద్దరు సెంట్రీలు వున్నారు. అక్కడకు దాస్వేని, మార్గదర్శకుడయిన ఆ కుర్రవానిని దియూ తీసుకొని పోయాడు.

దాస్వే ప్రజాసైనికులను సమీపించగానే వారందరూ లేచి నిలబడ్డారు. ఇలాంటి చెడుగాలిలో మీరెందుకు బయటికి వచ్చారని వారందరూ దాస్వేని ఎదుర్కొన్నారు. ఆ ప్రజాసైనికులలో చాలామంది పార్టీ సభ్యులు. వాళ్ళందరూ అంత పట్టుదలగా ఆ తుఫానుగాలిలో అక్కడే వున్నారంటే, దాస్వే హృదయం సగర్వంతో పొంగిపోయింది.

"నిజంగా మీరంతా సుఖంగా వున్నారా? వర్షం బాధపెట్టటంలేదూ" అని అడిగాడు.

"మేం రైతులం! వర్షం అంటే మాకిష్టం!" అందరూ ఒక్కుమ్మడిగా చెప్పారు.

"అది మా శరీరాలకు మంచిది. శరీరాలను పెంచుతుంది!" అని దియూ హాస్యమాడాడు. అందరూ నవ్వారు.

"దాహంగా వున్నప్పుడు వర్షం రుచి బాగా తెలుస్తుంది. ఇట్టే నోరు తెరిస్తే, త్రాగటానికి కావలసినంత నీరు!" అని ఒక సైనికుడు హాస్యమాడాడు.

"ఈ నీటితో టీ కాచుకొంటే,స్వర్గానికబెత్తెడు ఎడంగావుంటుంది" అని దియూ మేలమాడాడు.

దియూ మాటలు వినగానే దాస్వేహృదయంలో చెయ్యిపెట్టి కలచినట్టయ్యింది దాస్వేకి ష్వాంగు గుర్తుకొచ్చాడు. దియూ అచ్చంగా ష్వాంగులాగున్నా డనిపించింది.

దాస్వే యిక అసలు వ్యవహారంలో దిగాడు. "రోగం తెచ్చుకునేరు! జాగ్రత్తసుమా! ఆరోగ్యాన్ని పదిలపరచుకోండి. జబ్బుపడితే

యీ పని చేయలేరు" అని దాస్వే పదే పదే వారి ఆరోగ్యం విషయమై జాగ్రత్త తీసుకోవలసిందిగా ఆ రైతు సైనికులకు నొక్కిచెప్పాడు.

"మాకు యిలాంటి వర్షంలో తడవటం అలవాటే. యీ మాత్రపు వర్షానికే జడుస్తామా? మావి సుతిమెత్తని శరీరాలు గావు" అని వారు నచ్చజెప్పారు.

"ఇది చాలా ప్రధానమైనస్థావరం. శత్రువులు నగరం నుండి తప్పించుకొని పాపోతిగ్కు పోవాలంటే యీ దారిగుండానే పోవాలి. తెలవారేముందు నిద్రపోతారేమో! జాగ్రతగా వుండండి. ఆ సమయం లోనే మీరు జాగ్రతగా వుండాలి! మొదటి విషయ మేమంటే అప్పుడే మీకు బాగా చలి వేస్తుంది. జలుబుపట్టుతుంది. జబ్బుచేస్తుంది. రెండవ విషయ మేమంటే శత్రువులు ఆ సమయంలోనే దారిచేసుకొని పారిపో జూస్తారు. ఇప్పుడు వర్షం ఆగుతూవుంది. లేచి అటూ యిటూ నడవండి- కాస్త అటూ యిటూ చక్కర్లుకొట్టిరండి" అని వారిని హెచ్చరించాడు దాస్వే.

"మమ్మల్నిగురించి మీరేమీ బెంగపడకండి. ఏం చేయాలో మాకు. తెలుసు. మేం బాగానే వుంటాం!" అని ఒక ప్రజాసైనికుడు జవాబు చెప్పాడు.

దాస్వే, అతని మార్గదర్శకుడు వెనుదిరిగారు. వాళ్ళకు అంగరక్ష కులుగా కొంతమందిని పంపిస్తామని ప్రజాసైనికులు అన్నారు.

"అదేం అవసరంలేదు. ఏం గొడవలేకుండానే దారి కనుక్కొం టాంలే" అని దాస్వే నవ్వాడు.

• • • •

తన స్థావరాన్ని చేరుకోగానే దాస్వే తనకొరకు విసుగ్గా యెదురు జూస్తున్న తేవారును జూచాడు.

"నీవు తిరిగిరావే అనుకున్నా" అని పొగలుగ్రక్కాడు తేవార్.

"అంతా పాడై పోయింది! వంతెనను కాపలాకాయవలసిన మెంగ్ తన ప్లాటూనును తీసికొని శ్వేతాశ్వగ్రామంలో దూరాడు!"

దాస్వేకి కోపంతో వళ్ళు మండిపోయింది. "శత్రువులు లంక చివర వున్న బ్రిడ్జిని మూసేస్తే మనవాళ్ళు చస్తే బయటపడలేరు!" అన్నాడు.

"మొదట తన ప్లాటూనును వెంటబెట్టుకొని గ్రామంలో దూరాడు. యిప్పు డొక్కడే వచ్చాడు" అని అరిచాడు తేవార్.

"ఆ మాట ముందుగా చెప్పవేం! ఏడీ? అతణ్ని పిలు" అన్నాడు దాస్వే.

ఒక ప్రజాసైనికుణ్ని పంపారు. అతడు కొన్ని నిమిషాలలో మెంగ్‌ను వెంటబెటుకొని వచ్చాడు. ప్లాటూన్ నాయకుడి బట్టలు తడిసి ముద్దయినాయి. వంటికి అంటుకొనిపోయి వున్నాయి.

"నిన్ను చేయమన్న డ్యూటీ ఏమిటి?" అని దాస్వే గద్దించాడు.

"బ్రిడ్జిని కాపలాకాయటం" అని మెంగ్ కోపంగా జవాబు చెప్పాడు.

"అయితే మరి నీ సైనికులను గ్రామంలోకి ఎందుకు తీసుకొని పోయావ్? పోయావే అనుకో, వాళ్ళను వెంటబెట్టుకొనిరాకుండా ఒక్కడవే ఎందుకొచ్చావ్?"

మెంగ్ తత్తరపాటుతో నత్తిగా మాట్లాడసాగాడు. "నేను.... రిపోర్టుచేస్తున్నా....యేమంటే....మీరు మమ్మల్ని శత్రువుల దారిని అడ్డగించమన్నారుకదూ? సైనికులన్నారు గదా....మనం గ్రామంలోకే పోయి ఆ వెధవల్ని యింకా గట్టిగా ఎందుకు బిగించకూడదూ అన్నారు....వారికి నీళ్లు ఆహారం రాకుండాచేస్తే యిరకాటంలోపడి చస్తారుగదా అన్నారు.... ఖూమార్గంగురించి నాకు గుర్తేలేదు" అన్నాడు.

తేవార్ తొడమీద గుద్దుకొంటూ "అద్భుతంగా వుంది. శత్రువులు బ్రిడ్జిచివరను మూసేస్తే ఎవరవుతారు వెధవలు" అన్నాడు.

"అరి! దానెమ్మ- అది నిజమే!" అని మెంగ్ నిస్పృహపడ్డాడు.

"అయితే ఏం చేద్దామనుకున్నావ్?" అడిగాడు తేవార్.

మెంగ్ బుర్ర గోక్కున్నాడు. కొంచెంసేపటికి అతని ముఖం వికసించింది. "యీది వెనక్కు రమ్మంటే?" అన్నాడు.

"అంతదూరం ఎలా యీది వస్తారు?" అడిగాడు తేవార్. "వాళ్ళ తుపాకులు పాడవుతాయి। యీదలేనివాళ్ళ సంగతేమిటి? మహాచక్కగా చెప్పావోయ్!" అన్నాడు.

మెంగ్‌కు నోటివెంట మాటేరాలేదు. ఏమీ తోచక తుపాకిమడమని నేలమీద తాడించసాగాడు. తలవంచుకొని, విచారంగా అలాగే కూర్చున్నాడు. వారిమధ్య అనేక నిమిషాలపాటు నిశ్శబ్దం ఆవరించింది. చిట్ట చివరకు దాస్వే ఆ నిశ్శబ్దాన్ని భంగపరచాడు.

"మెంగ్! నువ్వు వెళ్ళు! తెల్లవారేలోపల సైనికులు ఎక్కడున్నారో చూచుకో! ఏదయినా నష్టం కలిగించంటే, దానికి నీవే బాధ్యుడివి" అన్నాడు దాస్వే.

తేవార్ తన చేతిని వూపాడు "లోపలికి వెంటనే వెళ్ళిపో! వాళ్ళను బయటకు తీసుకొనిరా! నీ వావిధంగా చెయ్యలేకపోతే యిక్కడకు మళ్ళీ రానవసరంలేదు!"

"నీవు వాళ్ళను చేరుకొనేసరికి బాగాతెల్లారిపోయిందనుకో;అప్పుడు వాళ్ళను బయటికి తీసుకొనిరావటానికి ప్రయత్నించబోకు!" అని దాస్వే తొందరగా చెప్పాడు

తలూపుతూ మెంగ్ లేచి నిలబడ్డాడు. కిక్కురుమనకుండా వెళ్ళిపోయాడు.

ప్లాటూన్ నాయకుడు వెళ్ళిపోయినతర్వాత దాస్వే తేవార్‌తో, "మనం ఆ విధంగా పరస్పర విరుద్ధాజ్ఞలు యివ్వరాదు. తన సైనికులతో వుండిపోవలసిందిగా అతనితోనే చెప్పానుగా! నువ్వు వాళ్ళందరినీ వెంట బెట్టుకొని రమ్మన్నావు. శత్రువులు వాళ్ళజాడ కనిపెట్టేస్తే ఏమవుతుంది", అన్నాడు.

"నిజమే! నువ్వు చెప్పింది సరైందే. అప్పుడే తెల్లవారిపోయింది కూడాను. ఏం చేద్దామిప్పుడు?" అని తేవార్ విచారపడ్డాడు.

"కానీ ఏమిజరుగుతుందో చూద్దాం. అతను లోపలికి పోలేక పోవచ్చు" అని జవాబుచెప్పాడు దాస్వే.

వాళ్ళావిధంగా మాట్లాడుకొంటూవుంటే కిటికీ రాగితంపై తూర్పు తెలిరేఖల కాంతి పడసాగింది. ప్రాతఃకాల వాయువుయొక్క ప్రశాంత తను తుపాకిగుండు ప్రేలుడు శబ్దం భగ్నగావించింది. తేవార్ బయటికి పరిగెత్తిపోయాడు. ఏమి జరిగిందో విచారించవలసిందిగా ఒక మనిషిని పంపాడు. చివరికెలో ఆ మనిషి మెంగ్‌ను వెంటబెట్టుకొని వచ్చాడు.

"చచ్చిపోవలసిందిగా అనుమతిస్తే నేను వెళ్తా!" అని నిస్పృహతో మెంగ్ రోదించాడు. అతనికొాసలో బులెట్ కంత ఏర్పడ్డది. అతడు కోపంగా తన నెత్తిటోపీని తీసి కాంగ్‌పై విసరివేశాడు.

"ఏం జరిగిందో చెప్పు!" ఆజ్ఞాపించాడు దాస్వే.

"నేను బ్రిడ్జి పైగా పోతున్నా. కోటలో ఎవరో నాపై ప్లాష్ లైటు వేశాడు. నా తుపాకీగొట్టం మెరుస్తూవుండికాబోలు. దాన్ని చూసి వాడు గుళ్ళవర్షాన్ని కురిపించాడంటే నమ్మండి. మీరు పంపిన మనిషి వచ్చేవరకూ నేను యేటికట్టవెనుక దాక్కొన్నా....! నా ప్లాటూనుకు పోలేకపోయినా. నేను పోలేను. వాళ్ళు బయటపడిలేప నే నేంజేయాలి" అని మెంగ్ మూల్గాడు.

"నీ ప్రయత్నం నువ్వు చేశావుగదా! బెంగపడదోకు. ఏదో వుపాయం ఆలోచిసాంలే!" అని అతణ్ని దాస్వే వోదార్చాడు. పచార్లు చేస్తూవున్న తేవార్‌వైపుకు తిరిగి దాస్వే, "మనకు పదిహేను పడవలు న్నాయి. మనవాళ్ళను వాటిలో యెక్కడకు జేటవేయటానికి యెందుకు ప్రయత్నించకూడదు?" అన్నాడు.

తేవార్ నవ్వాడు. నుదుటిమీద కొట్టుకొన్నాడు. "నిజమే! సరిగా అదే చెయ్యాలి!"

"నన్ను పడవలను తీసుకుపోనీయండి!" అని బ్రతిమాలాడు మెంగ్.

"మనమంతా కలిసే వెళ్ళుదాం!" అని నవ్వాడు తేవార్.

బ్రిడ్జికి పోయే మార్గాన్ని జాగ్రత్తగా కనిపెడుతూ వుండుటకై ప్రజాసైనికదళాన్నొకదానిని వుంచారు. కాల్పుల ధ్వని వినపడగానే కోటపై కాల్పులు ప్రారంభించవలసిందిగా ఆ దళానికి చెప్పారు. తేవార్, డాస్వే, మెంగ్ మరి అయిదుగురు మనుషులు తిలావొకపడవను నడుపుకుంటూ బయలుదేరారు అవలివడ్డుకు జేరారు.

* * * *

అది కుగ్రామం. అందువలన వారు ప్రజాసైనికులను కనుక్కోటానికి ఎదురుగావున్న రైతులయిళ్ళలో ఆ ప్లాటూను సైనికులంతా బస చేశారు. ఇళ్ళగోడలకు అప్పటికే తుపాకులు పేల్చటానికివీలుగా కంతలు జేసి వుంచారు.

ప్రజాసైనికులు తమ నాయకులను చూడగానే సంతోషము, ఆశ్చర్యము ముంచెత్తివేసినాయ్. తమ నాయకులను అభినందించారు. "మేము అంతా సిద్ధంగావున్నాం. ఎప్పుడు ప్రారంభిద్దాం?" అని ఆ రైతుసైనికులు ప్రశ్నించారు.

"ఆగండి! త్వరపడితే ఎలా? లొంగిపోండని వాళ్ళని కేకేసి చెపుదాం!" అని నవ్వాడు తేవారు.

కోటకు ప్రక్కగా ఒక కందకముంది. దాని ప్రక్కగా ఒక రైతు యిల్లు వుంది. ఆ యింటికి దగ్గరగా డాస్వే. మెంగులతో తేవారు వచ్చారు.

"నేను యత్నించి చూస్తా!" అన్నాడు మెంగ్. అని ఒక పెట్టె మీదకెక్కి కిటికీగుండా కేకేయసాగాడు. "యేయ్! కీలుబొమ్మ దేశీయులారా!....

మెంగ్ యింకా తనమాటను పూర్తిచేయకముందే, ధన్‌మని ఒక తుపాకి మ్రోగింది. మెంగ్ కుప్పగా కూలిపోయాడు. "మెంగ్! మెంగ్"

అని అరిచాడు తేవార్. అతడూ, దాస్వే, ప్లాటూన్ నాయకుని ప్రక్కకు పరుగెత్తికెళ్ళారు.

కోటనుండి, కిటికీలోనికి తుపాకిగుళ్ళవర్షం ప్రారంభమయింది. శాపనార్థాలు పెడుతూ ప్రజాసైనికులు, బురుజుమీదకి తుపాకిగుళ్ళ వరదను వదిలారు. తమకు యివ్వబడిన సూచనల ప్రకారం బ్రిడ్జివద్ద కాపలావున్న ప్రజాసైనికులదళం, తుపాకిగుళ్ళు ప్రేలినధ్వని వినగానే కోటపై తుపాకులు కాల్చసాగింది.

బులెటు తెసిపట్టా బజ్ మంటూ ధ్వనిచేస్తూ పోతూవుంటే, మెంగ్ కళ్ళు తెరచి చూశాడు. లేచి కూర్చున్నాడు. "ఏం జరిగింది అని ప్రశ్నించాడు.

ఉదయభానుడు ప్రసాదిస్తూవున్న వెలుగులో దాస్వే, మెంగ్ శరీరాన్ని పరీక్షించాడు. పెదభారం దిగిపోయినట్లుగా నిట్టూర్చి. దాస్వే "గోడపెల్ల పూడి నీమీద పడిందల్లేవుంది. నీ నుదుటిమీద పెద్ద గాయమయింది చూసుకో" అన్నాడు.

"ఆ కీనెప్పుడయింతేనా!" అని యికిలించాడు మెంగ్.

శత్రువుల తుపాకులు కాస్త విశ్రాంతి తీసుకొంటున్నాయల్లేవుంది. తేవార్ పెట్టెమీద కాలుపెట్టి ఎక్కాడు. తుపాకిగుళ్ళకు బలిగాకుండా వుండేలాగా తనతలను తెరచుకొనివున్న కిటికీపైపుగా పెట్టాడు.

"ఊఁ! కానీయండిరా! కాల్చండి! దాలా మీతో యుద్ధం చేయటానికి సిద్ధంగా వుంది!" అని శత్రుసైనికులను హెచ్చరించాడు తేవారు.

బురుజుమీదవున్న మనిషి ఒకడు కేకేసిచెప్పసాగాడు. "కామ్రేడ్స్! నే నిప్పుడే నిద్రలేచాను. తుపాకులు పేల్చవలసిందిగా నా దళనాయకులలో ఒకడు నాకు తెలియకుండానే సైనికులను ఆజ్ఞాపించాడు. మమ్మల్ని క్షమించండి"

దాస్వేకు యీ కంఠం చిరపరిచితంగానే కనపడింది. మొట్టమొదట ఎవరయినదీ గుర్తించలేకపోయాడు. కాని ఆటుతర్వాత అది జీవో కంఠమని గుర్తించాడు. హోగాడినుండి ప్రత్యేకాజ్ఞలను తీసుకొని జీవో

ఆరోజు క్రితమే కోటకు వచ్చాడు. హో యిప్పుడు నగరంలోవున్న కీలుబొమ్మ సైనికపటాలకు కమాండరు. తాను అనుకున్నదానికన్న ఎక్కువ సమయాన్ని మింగింది జీవో వ్యవహారం. చీకటిపడింది. అందువలన రాత్రి ప్రయాణంచేయుటకు వెరచి, ఆ జీవో ఆ రాత్రి ఆ కోటలోనే వుండిపోయాడు. తీరా తెల్లారిన తర్వాత చూస్తే తాను బాలా సైనికుల చక్రబంధంలో యిరుక్కుపోయానని తెలుసుకొన్నాడు జీవో.

ఇటీవల కొన్నిసంవత్సరాల కాలంలో జీవో. బాలూ సైనికుల హస్తాలలో పరాజయం తర్వాత పరాజయాన్ని భుజించాల్సివచ్చింది. అందువలన అతనికి బాలూ సైనికులు తినిపించే మజాఅంటే యేమిటో బాగా తెలుసు. తన్మూలంగా అతడు తన పూర్వపద్ధతులను మార్చుకొన్నాడు. ప్రజాసైనికులపట్ల భక్తి ప్రపత్తులతో మెలగటం అతడు నేర్చుకొన్నాడు. కాని, అతడు జిత్తులమారి-దుష్టుడు. అతడు అతి వినయంగా "మీ యూనిట్ పేరేమిటి కామ్రేడ్స్?" అని విచారించినప్పుడు అతని కంఠంలో ఎలాంటిభావమూ యితరులకు గోచరించలేదు.

"మేం యిరవైనాలుగో రెజిమెంటులో ఒక కంపెనీ" అని జవాబిచ్చాడు తేవారు.

"దయచేసి మిరేం చెప్పదలచుకున్నారో చెప్పండి!" అని జీవో అన్నాడు.

"జపానువాళ్ళు లొంగిపోయారన్న విషయం మీకు తెలియదా?" అని గట్టిగా అడిగాడు తేవార్. "కీలుబొమ్మ సైనికులయిన మీరు మీ శరీరాల్ని యిచ్ఛాపూర్వకంగా శత్రువులకు అమ్ముకోలేదన్న విషయం మాకు తెలుసు. మీరు బలాత్కారంగా ఆ బురదలోకి యీడ్వబడ్డారు. మీలో కొంతమందికి జీవించటానికి వేరేమార్గం లేకపోయింది. ఈ విషయాలు మాకు బాగాతెలుసు. జపానువాళ్ళు యిప్పుడు లొంగిపోయారు. మిమ్మల్ని యిప్పుడెవరు పోషిస్తారు? మనమంతా చైనావాళ్ళం-మీ ఆయుధాలను వప్పగించివెయ్యండి!"

పిట్టగోడల వెనుక నిలబడి జీవో జవాబు చెప్పసాగాడు. "జపాను వాళ్ళు లొంగిపోయారన్న విషయం మాకు తెలుసు. ఆయుధాలను వప్ప

గించటానికి సిద్ధంగానే వున్నాం. కాని ఆయుధాలను చియాంగ్-కై-షేకుకు మాత్రమే వప్పగించవలసిందిగా కమాండరు హోగారు ఆజ్ఞాపించారు! చెప్పినట్లు చేయటమే సైనికుని ప్రథమకర్తవ్యం; నాకు వేరే మార్గంలేదు" అన్నాడు జీవో.

"ఏమిటి వాగుతున్నాడు—చియాంగ్-కై-షేక్‌కు తుపాకు లప్పగిస్తాడా!" అని ఆ ప్లాటూనులోని సైనికులు కోపంతో మండిపోయారు. "తొత్తుకొడుకుని షూట్‌చేద్దాం పదండి" అన్నారు.

"ఆగండి!" అని అరిచాడు తేవార్. మిగల బురుజువైపుగా తిరిగి అరవసాగాడు. "చియాంగ్-కై-షేక్‌కు మీ ఆయుధాల నెప్పగించటం దేనికి? ఈ ఎనిమిది సంవత్సరాలలో జపానువాళ్ళతో హోరాహోరీగా పోరాడిం దెవరో నీకు తెలియదా? స్వాతంత్ర్యంకోసం ఏ చైనావాళ్ళు తమ రక్తాన్ని తర్పించారు. ప్రాణాల నర్పించారు? 'మీ షాంకర్ జాక్' గాడు సేచువాన్‌లో ఒక మఠంలో దాక్కున్నాడు. వాడు జపానువాళ్ళతో యుద్ధంచేశాడా? జపానువాళ్ళతో లాలూచీపడటం; కమ్యూనిస్టులను చంపండి. బాలూమీద యుద్ధంచెయ్యండి! అని ఆజ్ఞలు జారీచేయటం తప్ప వాడు చేసిం దేమిటండీ? అలాంటి కుక్కలకొడుకుకు మీ ఆయుధాలను వప్పగిస్తారా!"

బురుజునుండి దానికేమీ జవాబు రాలేదు.

"ఏమంటారు? మీ జవా బేమిటి?" అని గర్జించాడు తేవార్.

"బయటికివచ్చి మాట్లాడండి కామ్రేడ్స్" అని జీవో ప్రాధేయపడ్డాడు.

ఆ ప్రజాసైన్య నాయకులు తమలో తాము ఆలోచించుకోసాగారు. తాము భయపడుతున్నామని కీలుబొమ్మలు భావించరాదనే భావమూ, తీరా బయిటకిపోతే వాళ్ళు అదనుచూసుకొని కాల్పులు సాగిస్తారేమో అన్న సంకోచమూ వారిని బాధించసాగాయి.

"మీమీద కాల్చం అని హామీ యిస్తున్నా" అని కేకేసి చెప్పాడు జీవో.

"నీ వాగ్దానాన్ని భంగపరుస్తేనో?" అడిగాడు దాస్వే.

జీవో వొట్టుపెట్టుకున్నాడు. "కాలుస్తే నేను తొత్తుకొడుకు మన మణ్ణే!"

కాంఫౌండు గేటును బారాగాతెరుస్తూ దాస్వే, మెంగ్, తేవారులు గోడచూ కందకానికీ మధ్యనున్న యిరుకుస్థలంలో వచ్చి నిలబడ్డారు.

* * * *

బురుజువంక చూశారు. అక్కడ స్పష్టంగా జీవోయొక్క కక్కులు గొట్టిన ముఖం అగుపించింది. బురుజుపైనున్న పిట్టగోడపై జీవో చేతులు ఆనించి నిలబడ్డాడు. వాని చేతుల్లో ఏ ఆయుధమూలేదు. అదిజూచి ఆ ప్రజా నిక కార్యకర్తలు తమ పిస్తోళ్ళను సంచీలలో పెట్టుకున్నారు. జీవో తేవార్, దాస్వేలనుజూచి ఎనిమిది సంవత్సరాలయింది. ఆచూసింది కూడా తన బందిపోటుదొంగలముఠాను వెంటబెట్టుకొని రొట్టెనుడిమాంపు చేయటానికని షెన్‌జ్యా గ్రామానికి వచ్చిన సందర్భంలో జీవో వాళ్ళను చూశాడు. ఆనాడు యీ బాలూ సైనికులిదరూ కుర్రకుంకలు, జీవో గుర్తు పట్టలేనంతగా వాళ్ళిద్దరూ మారిపోయారు.

వాళ్ళ సైనికదుస్తులవంక చూస్తూ జీవో "కామ్రేడ్స్! మీ హోదా ఏమిటి?" అని అడిగాడు

"ఇతడు మా పొలిటికల్ కమిస్సారు" అని దాస్వేను చూపిస్తూ, "నేను కెప్టెన్‌ని" అని తేవార్ జవాబుచెప్పాడు.

"మీ పేరేమండి?"

"నన్ను తేవార్ అంటారు!"

"మీ రొస్తారని నాకు తెలియదు కెప్టెన్ తేవార్. నేను మీకు యివ్వగలిగిందల్లా యిదిమాత్రమే" అని చెప్పి జీవో విలువగల సిగరెట్ల ప్యాకేజి వాళ్ళ పాదాలమీద పడేశాడు.

మెంగ్ ఆ ప్యాకేజి తీసుకున్నాడు. చాకచక్యంగా ఒక్క వూపు వూపి ఆ ప్యాకేజిని బురుజుపైకప్పుమీద పడేటట్లు విసరాడు. "ధన్యవా

దాలు, మేం బాలూ సైనికులం. యీ రకం సిగిరెట్లు తాగం" అన్నాడు మెంగ్.

కీలుబొమ్మలస్థితినిగురించి దాస్వే వివరించాడు. ఎఱ్ఱసైన్యం, సైదీలపట్ల అవలంబించుతూవున్న ఉదారవిధానాన్ని వివరించాడు. దాస్వే ఆ విధంగా విషయాలను చెప్పుతూవుంటే కీలుబొమ్మ సైనికులందరూ పిట్టగోడవద్ద మూగి విన్నారు.

"సరే! మంచిది. మీరు క్రిందుగా వస్తారా? రారా? ఏ సంగతీ తేల్చి చెప్పండి" అని ప్రసంగం ముగించగానే విసుగ్గా తేవార్ అడిగాడు.

జీవో తన అధికారిక హుందాతనాన్ని అవలంబించాడు.

"ఆలోచించనీయండి. ఏ సంగతీ సాయంత్రం తెలియజేస్తాను" అన్నాడు.

"రావలచుకొంటే యిప్పుడే దిగివచ్చేయండి. మేమిక ఆగం" అన్నాడు దాస్వే.

ఇంతకుపూర్వమే ఆ గ్రామంలోవున్న మహిళలందరినీ సమీకరించటానికి ప్లాకీత్సే నియూరీని పంపాడు. ష్వేతాశ్వగ్రామానికి సంబంధించిన ప్రతి కీలుబొమ్మసైనికుని భార్యనూ, తల్లినీ, ప్రోగుజేసి నియూరీ ఒకదండుగా బురుజువద్దకు తీసుకొచ్చాడు. కోటక్రింద మెట్లమీదనుండి ఆ స్త్రీలందరూ కోటలోనున్న తమ బంధువులను కేకేసి చెప్పసాగారు.

"క్రిందికి దిగిరావేమిరా అబ్బాయి!" అని ఒక దళనాయకునితల్లి అరచింది. "బాలూసైనికులు మీచుట్టూ కప్పేశారురా! వాళ్లు చాలా మెత్తగా వ్యవహరించుతున్నారు. అక్కడేవుండి చావు తెచ్చుకోబోకురా నాయనా! ఇంటికి రారా నాయనా!"

"ఇంత మొద్దులాగున వ్యవహరిస్తావేం!" అని ఒక భార్య తన భర్తనుద్దేశించి అరచింది. "నీ పని బండలుగాను. నీ ఉద్యోగంమూలంగా కొన్ని సంవత్సరాలనుండి దేశద్రోహుల మనిపించుకోవాల్సి వచ్చింది! ఇప్పుడా పీడ వదిలించుకోటానికి అదను దొరికింది. ఇంకా తాత్సారం జేస్తున్నావా? ఇక్కడేదయినా తుపాకిగుండు పేలితే మా గుండెలు కొట్టు

కుంటున్నాయి. నువ్వు చచ్చావేమోనని భయంతో ఏడుస్తున్నాం. జీవి తాంతం వరకూ కీలుబొమ్మగానే వుండిపోదామనుకుంటున్నావా? నీవు క్రిందకు దిగిరాకపోతే ఇక్కడే నీ కళ్ళ ఎదుట నా ప్రాణాలు తీసుకుంటా!"

లబోదిబోమంటూ ఏడుస్తూ, ఆ స్త్రీలందరూ కోటలోవున్న తమ వాళ్ళను పిలచి ఆ విధంగా చెప్పసాగారు. పిట్టగోడవద్ద మూగిన కీలు సైనికుల హృదయాలు కరిగినాయి. నియారీ ముందుకువచ్చి విజ్ఞప్తి చేయసాగింది.

ఆమె తన కంచుకంఠంతో ఎలుగెత్తి చెప్పసాగింది. "మనమంతా చైనావాళ్ళం! మీరు, అనవసరంగా ప్రాణాలు పోగొట్టుకోవటం బాబూకి యిష్టంలేదు. రెండు మార్గాలుమాత్రమే వున్నాయ్— ఆయుధాలను పప్ప గించి, మీ వాళ్ళ వద్ద కెళ్ళిపోవటం, యిది ఒకటి—లేదా, చావు కొనితెచ్చు కొని మీ పిల్లలకూ, మనుమలకూ దేశద్రోహుల బిడ్డలనే పేరును సంక్ర మింపజేయటం. యిది రెండు. ఏ మార్గాన్ని అనుసరించదలచారో చెప్పండి?"

కీలుబొమ్మ సైనికులు తలలు వంచుకొన్నారు. నిట్టూర్చారు. వారిలో కొంతమంది పెద్దగా బయటకే ఏడ్చారు. మొట్టమొదటగా ఒక దళనాయకునికి తల్లి అరిచి చెప్పిందే. ఆ దళనాయకుడే జీహో వంక ఏం చేద్దామన్నట్టుగా చూశాడు.

"ఏం జేద్దాం కమాండరుగారూ?" అన్నాడతను.

జీహో తటపటాయిస్తున్నాడు. అతని సైనికులు గుసగుసలాడ సాగారు. కోటక్రిందనుండి స్త్రీలకేకలు బాబూ సైనికుల హెచ్చరికలు ఒక్క క్షణమయినా విరామంలేకుండా పైకి వినపడుతున్నాయి. అందరూ లొంగిపోతూవుంటే, తానొక్కడే లొంగకుండా ఎదిరిస్తే ఎలాంటి దుష్ఫలితాలు ఏర్పడగలవో అన్న భయంతో జీహో ఒక నిశ్చయానికి వచ్చాడు.

"మా వస్తువుల నన్నింటినీ సర్దుకొంటాం!" అని అరచాడు జీహో.

అకస్మాత్‌గా శ్వేతాశ్వగ్రామానికీ, నగరానికి మధ్యనున్న యేటి కట్టమీద తుపాకులు పేలిన ధ్వని వినవచ్చింది. జీవోను వెనక్కు పిలుచుకొనిపోవటానికని నగరంనుండి వచ్చిన కీలుబొమ్మ అంగరక్షకులు, డియూ నాయకత్వానవున్న ప్రజాసైనికులున్న తాపునకు పొరపాటున వచ్చిపడ్డారు. యిరుపక్షాల మధ్య తుపాకులు పేలినాయి. జీవో తన సైనిక పటాలాలు వస్తున్నాయని భ్రమపడి వెంటనే తన అభిప్రాయాన్ని మార్చుకున్నాడు.

"లాభంలేదు కామ్రేడ్స్! మా సైన్యాలు వచ్చేశాయ్! మేం యీ దశలో కోటను విడిచిపెట్టజాలం!" అని జీవో బురుజుమీదనుండి అరచాడు.

"ఏం? ఎందుచేత?" అని స్త్రీలూ, బాలూ సైనికులు అరచారు. "క్రిందకు వెంటనే రండి!"

జీవో తన తలను వెంటనే పిట్టగోడవెనుకకు తప్పించాడు." లేదు! లేదు! నే నాబాధ్యతను తీసుకోలేను...."

ఆ మాటలు పూర్తిచేయటానికి జీవోకు అవకాశం యివ్వకుండానే సైనికులనేకమంది అతణ్ని బంధించుకొన్నారు. అతని తుపాకీని లాగేశారు. తమ ఆయుధాలను తీసుకొని, కోటలోనుండి బయటికి పరుగెత్తుకొచ్చారు.

అక్కడ యేటికట్టమీద రియూయొక్క ప్లాటూన్ శత్రుసైనికులను విజయవంతంగా వెనక్కి తిప్పికొట్టింది. జీవో, అతని కీలుబొమ్మలు కిక్కురుమనకుండా లొంగిపోయారు.

ఆరోజున, వేయిమంది ప్రజాసైనికులు నగరంచుట్టూవున్న శత్రువుల దృఢస్థావరాలన్నింటినీ స్వాధీనంచేసుకొన్నారు. ఆనాటి సంధ్యా సమయంలో పెద రాతబండ గ్రామానికి ఫస్టుకంపెనీని తరలిపోవలసిందిగా కౌంటీ కమాండ్ ఆదేశించింది. పెదరాతిబండగ్రామం అప్పుడే విముక్తిజేయబడింది. ఈ గ్రామంకూడా యేటికట్టమీదనే వుంది. అంతేగాక, నగరానికి దాపులో వుంది. యీనాటిరాత్రే నగరంమీద ముట్టడి

ముట్టడి ప్రారంభమవుతుంది. ఈ గ్రామంనుండే ఫస్టుకంపెనీ నగరంపై ముట్టడి ప్రారంభించాలి.

* * * *

పెద్దరాతిబండ గ్రామంలోని రైతులు, ప్రజాసైనికులకు భోజన వసతి కల్పించారు. అటుతర్వాత నగరంలో పరిస్థితులు ఎలావున్నాయని రైతులను ప్రజాసైనికులు విచారించారు. అప్పుడే నగరంనుండి వచ్చిన ఒక వృద్ధరైతు వారికి అగుపించాడు. దాస్వే, తేవాదులు అతణ్ణి ప్రశ్నించారు.

కీలుబొమ్మసైనికులు తమ తుక్కు తుపాకులను పారేసి, జపాను వాళ్ళచే తయారుచేయబడిన 38 తుపాకులను జపాను సైనికులనుండి లాక్కున్నారని ఆ వృద్ధుడు చెప్పాడు. నీచాతినీచమైన పనులకు కీలుబొమ్మసైనికులు జపాను వాళ్ళను వినియోగిస్తున్నారు. కీలుబొమ్మలు యీనాడు జపానువాళ్ళమీద దొరతనం చలాయిస్తున్నారు. ఇప్పుడు కీలుబొమ్మలు పావోతింగ్‌కు తప్పించుకోవాలని యత్నిస్తున్నారని ఆ వృద్ధుడు చెప్పాడు.

"మీ కెలా తెలుసు?" అని దాస్వే ప్రశ్నించా డా వృద్ధుణ్ణి.

ఆ వృద్ధుడు యీవిధంగా చెప్పసాగాడు. "ఇక్కడ పూనది ఉంది. నగరానికి ఉత్తరదిశలోనున్న గోడవద్దనుండి పూనదికి దగ్గరమార్గ ముంది. ఆ పూనదిమీదుగా పావోతింగ్‌కు పారిపోవచ్చు. అందుకని ఆ నెదిలో ఒకచోట మూడు పెద్దపడవలను దాచివుంచారు కీలుబొమ్మలు. అంతేగాక కీలుబొమ్మసైనికులు తమ బట్టలనూ, బిఛానాలనూ, ధాన్యాన్ని బొచ్చుకోళ్లనూ—యిది అదేమిటీ, తమ వస్తువులన్నింటనీ అమ్మేస్తున్నారు. దానికర్థం వారు పోవటానికి సిద్ధమవుతున్నారన్నది కాకపోతే మరేమిటయ్యా?" అని ఎదురుప్రశ్న వేశాడు ఆ తాత.

ఇంకా విచారంగా ఉత్తరగేటువద్ద ఒక చిన్న ప్లాటూను సైనికులు మాత్రం కాపలా వున్నారనీ వారికి మెషిన్‌గన్ ఒక్కటైనా లేదనీ; రాత్రిపూట ఒక్కడుమాత్రమే పహరాయిస్తూవుంటాడనీ తేలింది.

"కొద్దికాలంక్రిందట ఒక స్త్రీబాలూను పట్టుకున్నారు. ఆమె సంగతేమైనా విన్నావా?"

"ఉంద్రంముక్కలాంటి పిల్లాడుగల ఆమె కాదూ?"

"అవును! ఆమెసంగతేమిటి?" దాన్యే హృదయం అతివేగంగా కొట్టుకోసాగింది.

"నిన్న ఆమెను ప్రశ్నించారని విన్నా. అటుతర్వాత ఆమె ఏమయిందో నాకు తెలియదు."

యధార్ధానికి దాన్యేకి హృదయంలో అమితబాధగా వుంది. కాని మేయీ, పిల్లాడినిగురించి ఆలోచనరాకుండా అణచిపెట్టుకో ప్రయత్నించాడు. రానున్న ముట్టడికై ప్రజాసైనికులను ప్రయత్నమొనరించుటలో తేవారుకు సహాయపడుతూ దాన్యే పనిలో మునిగిపోయాడు.



# 20 అధ్యాయం

ఆ రాత్రి బాగా చీకటిగావుంది. చంద్రోదయం యింకా కాలేదు. అంతిమ సూచనలకై బహిరంగప్రదేశంలో ఘస్తుకంపెనీ సైనికులు సమావేశమయ్యారు. ఆ సైనికులందరూ అప్పుడే సైన్యంలోజేరి కొత్తవారు. రైతు యువకులు. వాళ్ళందరూ తూటాలబెల్టులను, తుపాకులను ధరించటంమూలంగా ఒకేరకంగా కనపడుతున్నారు. అంతకన్న విశేష

మేమంటే అక్కడజేరిన ప్రతి రైతుయువకునిలోనూ ఆత్మవిశ్వాసం సుస్పష్టంగా దృగ్గోచరమవుతూవుంది. యుద్ధంలో తమ సామర్థ్యాన్ని రుజువుజేసుకొన్నారు. ప్రజాసైనికుల వర్చస్సు వారి ముఖాలలో తాండవిస్తూవుంది.

పసిగొయ్యలాగా తేవార్ వాళ్ళముందు నిలబడ్డాడు. చేతిని వూపుతూ తేవార్ "కామ్రేడ్స్! మీరు మీ విధులను నిర్వహించుతూ రెండు రాత్రుల పాటు నిద్రపోలేదు. కాస్త విశ్రాంతి తీసుకొనుటకైనా మీకు అవకాశం లేకపోయింది. ఇప్పుడు మనం దేశద్రోహులనూ, జపానువాళ్ళనూ పూర్తిగా తుడిచిపెట్టేయబోతున్నాం. అందుకని, మీరు మరల యుద్ధం చేయాల్సివుంటుంది. మీరు అలసిపోయారా?"

"లేదు!" అని నూటయాభై కంఠాలు గర్జించాయి.

"మంచిది! మనం కొద్దినిమిషాలలో నగరాన్ని చుట్టుముట్ట బోతున్నాం! నగరం ఉత్తరపు గేటును ముట్టడించబోతున్నాం!" అన్నాడు తేవార్.

అటుతర్వాత దాస్వే ఉపన్యసించసాగాడు. "కామ్రేడ్స్! ఈరాత్రి ఎవ్వరూ సిగరెట్లు తాగకూడదు. దగ్గకూడదు. అత్యవసరమైతేతప్ప మీరు ఒకరితో ఒకరు మాట్లాడరాదు. స్కౌట్లు ప్రతివిషయాన్నీ జాగ్రత్తగా కనిపెడుతూవుండాలి. ప్రతిదానినీ పరిశోధించాలి. కడగొట్టుసాధనంగా మాత్రమే తుపాకిని పేల్చాలి. మనం మనచంపెనీ ఎటుపోతున్నదీ ఏంజేస్తున్నదీ ఎవరికీ తెలియనీయరాదు. కామ్రేడ్స్! అంతిమవిజయం కనుచూపుమేరలో వుంది. మన సేనాధిపతి కామ్రేడ్ ఛూటే నినాదాన్ని "ధైర్యం! ధైర్యం! మరింత ధైర్యం!" అన్నదానిని గుర్తుంచుకోండి. మనం ఆయన నినాదాన్ని అమలుజరపాలి. చావంటే జడియకుండా మన బాధ్యతను పూర్తిజేసుకోవాలి."

"మేం మా కర్తవ్యాన్ని నిర్వహిస్తాం." అని ప్రజాసైనికులు అరచారు. బయలుదేరుటకు అనుమతి తీసుకొని, బయలుదేరారు.

ఆ కటికి చీకటిలో దారిచూచుకొంటూ ఫస్టుకంపెనీ సైనికులు యేటికట్టయెక్కారు. దానిమీద తూర్పుదిశగా నగరంవైపుకు పురోగమిం

చారు. అంతటా నిశ్శబ్దంగా వుంది. నదీప్రవాహంయొక్క అలలు చొద్దుకు కొట్టుకొంటూవున్న శబ్దంమాత్రం వినపడుతూ వుంది. నీళ్ళలో నుండి బయటకు దుముకుతున్న చేపల ధ్వనిమాత్రం వినపడుతూవున్నది.

ఉత్తరదిశ గేటు గోడపైనున్న శత్రువుల గూడువద్దకు రాగానే ప్రజాసైనికులు ఒక చెట్లగుబురులో దాక్కొన్నారు. వారికి మెల్లగాకొన్ని సూచనలు యివ్వబడినాయి. అటుతర్వాత వారిలో ఎనిమిదిమంది ఒక దళంగా బయలుదేరారు. ఉత్తరదిశగోడ బయటవున్న నదివొడ్డుకు జేరుకొన్నారు. అక్కడ ఒక రేవులో ఆ వృద్ధుడు చెప్పినట్లుగా నాలుగు పెద పడవల త్రాళ్ళు మేకులకు బంధింపబడి వున్నాయి. వేగంగానూ, నిశ్శబ్దంగానూ పనిజేస్తూ, నిద్రపోతున్న పడవల మనుషులకు తెలియనీయకుండా ప్రజాసైనికులు ఆ పడవల త్రాళ్ళను విప్పేశారు. ఆ పడవలు ఆ చీకటి రాత్రిలో ప్రవాహంచే మెల్లగా ముందుకు లాక్కొనిపోబడినాయి.

అటుతర్వాత మొదటికంపెనీ సైనికులు స్క్వాడ్లను కలుసుకోటానికి బయలుదేరారు. గేటు వెలుపల కొద్దిగామాత్రమే రైతుల యిళ్ళున్నాయి. ఆ యిళ్ళల్లో ప్రజాసైనికులు సర్దుకున్నారు. చక్రబంధాన్నిఅమలు జరుపుటకుగాను అక్కడే వుండిపోయారు.

ఆ రాత్రి పదిహేను కంపెనీల ప్రజాసైనికులు నగరంచుట్టూ జేరారు, పరిసర గ్రామాలలోనున్న రైతులు, బాలూసైన్యానికి సహాయపడుటకై వచ్చారు. అందులో కొంతమంది గాయపడినవారిని మోసుకొనిపోవుటకు వుపయోగించే స్ట్రెచెర్లను తెచ్చారు. మరికొంతమంది నిచ్చెనలు తెచ్చారు. మరికొంతమంది పలుగులను తెచ్చారు. కొంతమందిపారలను తెచ్చారు. మరికొంతమంది పికాసులను, షవెల్సును తెచ్చారు. అందులో ఒక్కడూ వొట్టిచేతులతో రాలేదు. ఇది విశేషం. జపానువాళ్ళనూ, దేశద్రోహులను నాశనంచేయునట్టి ముట్టడిని ప్రారంభించుటకై వేలాదిప్రజలు అక్కడికి వచ్చి నిలబడ్డారు. ఈ శుభదినానికై ఆ ప్రజలు ఎన్నో సంవత్సరాలనుండి ఎదురుజూస్తున్నారు. అందువలన, ఆ ప్రజలలో ఉత్తేజం ఉవ్వెత్తుగా పొంగుతూవుంది.



జపానువాళ్లు లొంగిపోయిననాటినుండి, హోగారు చియాంగ్-కై-షేక్ ఆజ్ఞలను తూ. చ. తప్పకుండా అమలుజరుపుతున్నారు. ఆయన బాలూసైనికుల చేతులలో ఆయుధాలు పడకుండా చూస్తున్నారు. చూస్తున్నారేమిటి! చేశారు. అంతేగాక, జపానువాళ్ళను కంటికిరెప్పలాగున కాపాడసాగారు. పైకిమాత్రం ప్రజలను మోసగించాలనే తలంపుతో జపాను ఖైదీలను కాపలాకాయిస్తున్నట్లు పెద్ద ప్రదర్శనం చేసినప్పటికీ, యదార్థానికి యీ జపానువాళ్ళను, బాలూసైన్యానికి వ్యతిరేకంగా తాను జేస్తున్న యుద్ధాలలో వినియోగిస్తున్నాడు.

కాని పరిస్థితులు హో భావించినదానికన్న తీవ్రంగా మార్పు జెందాయి. హో తన నగరంలోనే బంధించబడినట్లయింది. ఎందువల్లనంటే, యిటూ అటూ మెసలటానికి అవకాశంలేకుండా హోగారు వుంటున్న నగరాన్ని బాలూసైన్యం చక్రబంధంలో బిగించివేసింది. తన్మూలంగా అతని పరిస్థితి పెడచంరిగని కిణితిలాగున తయారయింది. తాను చక్రబంధంలో బిగించబడ్డమని హో తెలుసుకోగానే, జపాను జనరల్ కామెసాకాను చూడటానికి వెళ్ళాడు.

ఇక అక్కడ కామెసాకా పరిస్థితి ఎలా వున్నదంటే, అతడు ఒక బల్లపైనున్న కంచు బుద్ధ విగ్రహానికి నైవేద్యంగా అన్నం, కూరలు, పళ్ళు, పాలు, రొట్టెలను వుంచి సాష్టాంగపడి బుద్ధభగవానుని జపాను భాషలో ప్రార్థిస్తున్నాడు. "హే! బుద్ధభగవాన్! నా ప్రాణాలను కాపాడు! నేను జపానుదేశానికి తిరిగిపోయే భాగ్యాన్ని కల్పించు తండ్రీ!" అని కామెసాకా బుద్ధభగవానుడు, తదితర ముక్కోటిదేవతలపై ప్రార్థనా వర్షాలు కురిపిస్తున్నాడు. ప్రార్థనలో నిమగ్నుడయిన కామెసాకాను పలుకరించటానికి ధైర్యంచాలక హో ప్రార్థన ముగిసేవరకూ అక్కడే నిలబడ్డాడు. చిట్టచివరకు అతిగౌరవంగా, అతినమ్రతగా, జపాను జనరల్ కామెసాకా బుద్ధభగవానునికి మూడుసార్లు సాష్టాంగనమస్కారంజేసి నిలబడ్డాడు. అంతటితో అతని ప్రార్థనలు ముగిసినాయి. కూర్చోండని హోకు అతడు ఆసనాన్ని చూపించాడు. కామెసాకా చాలా చిక్కిపోయాడు. అతని దవుడ ఎముకలు పల్చబడిపోయిన ముఖంలోవెక్కిరిస్తూ

ఉన్నాయి. ఇటీవల అతడు తన మీసాన్ని కత్తిరించుకోవటమే మానే శాడు. పిచ్చివానిలాగున తయారయ్యాడు. పాపం అతడు బీర్ పానీయాన్ని అమితంగా తాగుతూవుండుటచే అతని కళ్లు ప్రకజ్యోతులులాగున్నాయి.

కమ్యూనిస్టులు నగరాన్ని చక్రబంధంలో ముంచేశారని హో అత నికి చెప్పగానే కామెసాకాకు నెత్తిమీద పిడుగుపడ్డంతపనయింది. అతని "జపానుఆత్మ" యొక్క గాలిబూరకు బొక్కపడింది. దానినుండి అతని "బుషిదో దయ్యం" తుస్సుమని బయటికి పారిపోయింది. మిటకరిస్తూ, నోరు తెరచుకొని కొయ్యబారిపోయి కామెసాకా కూలబడ్డాడు. అతనికి మాట పడిపోయింది.

కొంత తెప్పరిల్లినతర్వాత ఆ జపానువాడు కీలుబొమ్మ సైన్యం ఎంత వున్నదని హోను అడిగాడు. రక్షణకట్టడాలు బలంగా వున్నాయనీ, నగరం రెండు మూడు రోజులవరకూ నిలబడగలదనీ హో అతనికి నివేదించాడు. బాలూ సైన్యానికి భారీ ఆయుధాలులేవు; అందువలనసూడిగా ఒక్కసారిగా ముట్టడించడానికి ప్రయత్నించకపోవచ్చునన్నాడు హో. పావోతింగ్‌నుండి అదనపుబలాలు వస్తే చక్రబంధాన్ని భేదించుకొని బయటపడటానికి అవకాశముందని చెప్పాడు హో.

ఆ జపానువాడు చివాలున లేచి నిలబడ్డాడు. "భగవానుడు మనలను రక్షిందుగాక!" అన్నాడు. కామెసాకా వెంటనే పావోతింగ్‌కు ఒక టెలిగ్రాం కొట్టాడు.

హో తన కోటకు దిరిగివచ్చాడు. పావోతింగ్‌నుండి సహాయంగా సైనికులు రానున్నారనీ, అందువలన గట్టిగా నిలబడవలసిందిగా తన కీలు బొమ్మసైనికులను ఆజ్ఞాపించాడు. అక్కడనుండి హో తనయింటికి తిరిగి వచ్చాడు. బంగారం, నగలను మూటకట్టవలసిందిగా హో తన వుంపుడు కత్తెకు చెప్పాడు. పావోతింగ్‌నుండి వచ్చే జపానువాళ్ళు చక్రబంధాన్ని భేదించగానే యీ నగరంనుండి మనం వెళ్ళిపోవాల్సి వుంటుందని చెప్పాడు.

అటుతర్వాత జిన్లంగ్ ఎక్కడున్నాడో వెతకటానికిపోయాడు. సిగరెట్

తర్వాత సిగరెట్ ఎడతెరిపిలేకుండా తగలేస్తూ హో జిన్లంగ్‌తో మేయీ విషయమై చర్చించసాగాడు.

* * *

మేయీని ఇప్పటికి రెండుసార్లు ప్రశ్నించారు. మొదటిసారి ఆమె అరెస్టుచేయబడిన మరునాడు ఆమెను ప్రశ్నించటంజరిగింది. ఆమె గాయాలకు కట్లుకట్ట వలసినదిగా హో ఆజ్ఞాపించాడు. అటుతర్వాత అతను కూర్చున్న వరండాలోనికి ఆమెను పిలుచుకొనిపోయారు. కూర్చోవలసిందిగా ఆమెకు ఒక ఆసనాన్ని చూపించాడు హో అతిమర్యాదగా.

"చాలా రోజులక్రితం నీవు చాలా తెలివిగల యువతివనీ, మంచి సమర్థురాలవనీ విన్నాను మేయీ." హో చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. "నీలాంటి యువతి ఆ బందిపోట్లలో కలిసిపోవటం ఏమిటా అని విచారపడుతున్నా. వాళ్ళెంతోకాలం నిలబడలేరు. యీ సంగతి నీకు తెల్సునో తెలియదో!"

తన పిల్లవానిని చేతులలో వుంచుకొని మేయీ, హోకు ఎదురుగా వున్న కుర్చీలో కూర్చొనివుంది ఆమె పెడమొగంగా కూర్చొనివుంది. అతడా విధంగా మాట్లాడగానే క్రుద్ధురాలై అతనివంక తిరిగి ప్రజ్వలిత నేత్రాలతో తీక్షణంగా అతనివంక జూచింది.

"నీవు మాట్లాడేవి మాటలుకావు. నీనోటివెంట వచ్చేది చెత్త" అని అరచింది. "బాలూసైన్యం జపానువాళ్ళను ఎదిరించి పోరాడుతున్నది. దేశాన్ని రక్షించుతూవుంది. ప్రజలు బాలూసైన్యాన్ని ప్రేమిస్తున్నారు. అదెక్కువకాలం నిలబడదని ఎవరంటారు? నీలాంటి మురికి దేశద్రోహి అంటాడు. నువు రైతులను దోస్తున్నావ్! హత్యలు జేస్తున్నావు! జ్ఞానం వచ్చిన ప్రతి చిన్నపిల్ల, పిల్లవాడూ నిన్ను తిట్టిపోస్తున్నారు. నీపేరే ఒక తిట్టు! నువ్వెంతకాలం బ్రతికుంటావు? ప్రజలు నిన్ను పట్టుకోగానే బ్రతికుండగానే నిన్ను వళ్ళు వలిచేస్తారు. నిన్ను ముక్కలు ముక్కలుగా తరుగుతారు."

ఇన్ని తిట్లుతిన్నా హోకు కోపంరాలేదు. నవ్వసాగాడు. "మేయీ! కొంత దూరదృష్టి కలిగియుండటం మంచిది, కమ్యూనిస్టులు నిన్ను తమ

వలలో చిక్కించుకోనీయబోకు! ఇలాంటి ప్రమాదకరమైన పనిని నీలాంటి కోమలాంగిపై రుద్దారంటే వాళ్ళు వట్టి క్రూరులు. ఇది చాలా దుఃఖాంతమవుతుంది. నా పక్షంలో పనిచేశావంటే చాలా బాగుపడతావ్. నీకు మంచి భవిష్యత్తు వుంటుందని హామీయిస్తా!"

మేయీ అతనివంక క్రుద్ధంగా చూచింది. "చెత్తగా వాగబోకు!" అన్నది. "యీ పనిజేయటానికి యిచ్ఛాపూర్వకంగా నేనే వచ్చాను. వాళ్లు నన్నేమీ బలవంతంచెయ్యలేదు. నాకు సంతోషమైన విషయమల్లా ఒక్కటే వుంది. అది మీలాంటి దేశద్రోహులందరూ యీ భూమిమీదనుండితుడిచి పెట్టుకొనిపోవటం! ఇప్పుడు నేనే మీ చేతుల్లోపడ్డను. నాకున్న భవిష్యత్తల్లా గౌరవంగా చావటం! నన్నెప్పుడు చంపుతారు?—నేను సిద్ధంగా వున్నా!"

"కాని పాపం నీ పసిబిడ్డ సంగతో! నీవు చచ్చిపోతే వాడికి దిక్కో!" అన్నాడతను.

మేయీ పళ్ళు నూరుతూ పిల్లవాణ్ని ఒక్కవూపుతో మేజాబల్లపై వుంచింది. "లేదు! వాడంటే జాలిలేదు! చంపండి! నన్ను యిప్పుడే చంపండి! నా జీవితం ముగుస్తుంది" అన్నదామె.

పిల్లవాడు ఏడ్వసాగాడు. హో ఆ పిల్లవాణ్ని ఎత్తుకున్నాడు. మృదువుగా బుజ్జగించసాగాడు. "కఠినహృదయురాలివి కాబోకు మేయీ. నేను నిన్ను చంపదలచుకొంటే ఒక వ్రేలు పైకెత్తితేచాలు. నువ్వు అనవసరంగా నీ ప్రాణాలను త్యాగంచేయటం నా కిష్టంలేదు. నిలువెత్తు ధనంపోసినా ప్రాణాన్ని నిలబెటగలమా? అదిగాదు సమస్య. నిన్ను చంపాలనే కోర్కె నాకులేదు. నీవు వెంటనే మారాలంటే నీకు కష్టమని నాకు తెలుసు. ఈ విషయాన్ని బాగా ఆలోచించుకోటానికి యింకా టైం తీసుకో! ఏం ఫరవాలేదు. ఇంత వోపిగ్గా ఎవరిపట్లా వ్యవహరించనన్న విషయం నీకు తెలుసు ననుకుంటాను."

మేయీని పిల్లవాడిని మరల తీసుకొనివెళ్ళి ఖైదీల కొట్టులో వుంచవలసిందిగా హో ఆజ్ఞాపించాడు.

బయటవుండి మేయీ చెప్పినమాటలను వింటున్న కీలుబొమ్మ

సైనికులు సానుభూతిగా తలలువూపారు. "ఆమె చెప్పినదంతా నిజం!" అని తమలో తాము అనుకొన్నారు. అటుతర్వాత ఆ కీలుబొమ్మ సైనికులు రహస్యంగా తమచేతనైనవిధంగా ఆమెకు సౌకర్యాలు కలుగజేశారు.

కొన్ని దినాలైనతర్వాత మేయీని మరల ప్రశ్నించుటకు హో పిలిపించాడు. ఆమె చనిపోతే పిల్లవాడి గతేమి కావాలంటూ దుఃఖాన్ని నటించాడు మరల హో. మేయీ కళ్ళలో నీరుజూచి తన పాచిక పారిం దనుకున్నాడు హో. మేయీ దారిలోపడుతున్నందుకు సంతోషిస్తున్నా నన్నాడు. ఆ మాట వినగానే మేయీ కోపంగా తన కళ్ళనీరు తుడుచుకొంది.

"నా డ్యూటీ పూర్తిచేయకుండా మీ మురికిచేతుల్లో పడిపోయానే అని ఏడుస్తున్నా!" అని అరచిందామె. "నేను చనిపోయినతర్వాతపిల్లాడు ఎక్కువకాలం బ్రతుకడు. మమ్మల్నిద్దర్నీ ఒక్కసారే చంపేస్తే బాగుం టుంది!" అని అరచిందామె.

హో ముఖం నల్లబడింది. క్రూరంగా నవ్వుతూ గదివిడిచివెళ్లాడు. అతడు వెళ్ళినవెంటనే, అతని రహస్య ఏజంట్లు ఆ గదిలోప్రవేశించారు. వారు మేయీనుండి పిల్లవాణ్ని వేరుజేశారు. ఆమెను నేలమీద పడేశారు. వాళ్ళు విధంగా మొరటుగా ఆమెను క్రిందకు తోసేసరికి, ఆమె భుజం మీదవున్న పుండు రేగింది. బాధతో మేయీ మూర్ఛపోయింది.

కొద్ది నిమిషాల తర్వాత ఆమెకు తెలివివచ్చింది. ఏడుస్తూ ఆమె, దేశద్రోహులను తీవ్రంగా తిట్టిపోసింది. వాళ్ళు మొద్దుచెక్క నొకదానిని తీసుకొనివచ్చారు. ఆమె తొడవలపై వుంచారు. చెక్కపై కెక్కి తొక్క సాగారు బాధతో మేయీ గోలపెట్టింది. వాళ్ళెంత హింసించినా ఆమె హో పెట్టిన షరతులకు వప్పుకోలేదు. చిట్టచివరకు వారామెను ఖైదీల కొట్టుకు మోసుకొనిపోయారు. దానిలో ఆమెను విసరిపారేశారు. తలుపు తాళంవేశారు.

* * * *

ఇప్పుడు నగరాన్ని బాబూసైనికులు చక్రబంధంలో బిగించారు కాబట్టి మేయీని చంపేద్దామనుకున్నారు హో, జిన్లంగ్‌లు. కాని వాళ్ళకు మళ్ళీ ఒక ఆలోచన తట్టింది. తమతో సహకరించవలసిందిగా ఆమెను మళ్ళీ బలవంతంజేసిచూస్తే బాగుంటుందనుకున్నారు. ఆమె లొంగినట్లయితే, తమతోపాటు ఆమెను పావోతంగుకు తీసుకొనిపోయి, బాబూ సైన్యంతో వ్యవహరించటానికి వినియోగించుకొందా మనుకున్నారు.

"మంచిది! ఆలోచించుకున్నావా?" అని అడిగాడు హో. హో ఒక దళం కీలుబొమ్మసైనికులతో ఆమెవున్న కొట్టుకు వచ్చాడు. "ఇది నీ ఆఖరి ఛాన్సు. బ్రతుకుంటావో, చావటమో నువ్వే తేల్చుకో."

మేయీ ముఖం పాలిపోయింది. కాని ఆమె చాలా ప్రశాంతంగా జవాబుచెప్పింది. "చచ్చిపోవుటద్వారానే విప్లవానికి విశ్వాసవంతంగా వున్నానని రుజువుచేసుకోగలుగుతాను."

మేయీనుండి బిడ్డను వేరుచేయవలసినదిగా తన కీలుబొమ్మలను ఆజ్ఞాపించాడు హో. కాని ఆమె తన పిల్లవాణ్ని గట్టిగా కరచుకొని పట్టుకొంది. "మే మిద్దరం చస్తాం" అని గట్టిగా అరచింది మేయీ.

నగరం దక్షిణపు గేటువద్దనున్న సైరెన్ కూసింది. దేశద్రోహ సైన్యాలు తమ తమ స్థావరాలకు పరుగెత్తసాగాయి. రొప్పుతూ పరిగెత్తు కొచ్చాడు జిన్లంగ్. హోగారికి యీ క్రింది సమాచారాన్ని అందజేశాడు.

"వాళ్ళు మూడుమ్మడి ముట్టడి సాగించారు! పరిస్థితి చాలా అధ్వాన్నంగా వుంది. దక్షిణపుగేటును నిలుపుకోలేమేమోనని భయంగావుంది! తూర్పుగేటుకూడా అలాగే వుంది. మమ్మల్ని ఏం జెయ్యమంటారు?" అని ప్రశ్నించాడు జిన్లంగ్.

గద్దకటినట్టున్న హో ముఖంలో ఏ రకమైన అలజడీ కానరాలేదు. నిర్వీర్యంగా "సరే బాగుంది" అన్నాడు. కీలుబొమ్మలదళంవైపుకు తిరిగి చేతినివూపుతూ, మేయీని కాల్చుటకుగాను బయటకు తీసుకొనిపోవలసిందిగా సైగచేశాడు.

ఆమెను గదినుండి బయటకు తీసుకొనిపోతూవుంటే మేయీ

నవ్వింది. "బాగుంది! బాగుంది! దేశద్రోహి కుక్కల్లారా! మీ జీవితం ముగిసింది. ఇంక నిశ్చింతగా చచ్చిపోతాను!" అని అరచింది మేయీ.

కీలుబొమ్మసైనికులామెను నిర్జనంగావున్న వీధులగుండా తీసుకొనిపోతూవుంటే నగరంచుట్టూ తన కామ్రేడ్స్ పేల్చుతూవున్న తుపాకుల ధ్వని వినపడసాగింది మేయీకి. ఆమె శరీరం ఉత్సాహంతో వూగిపోయినది. మహానిర్ఘోషలాగున ఆమె తన కంఠాన్ని ఎత్తి నినదించసాగింది. "జపానుసామ్రాజ్యం నశించాలి! దేశాన్ని అమ్మే దేశద్రోహులు నశించాలి! కమ్యూనిస్టుపార్టీ జిందాబాద్!...."

దక్షిణపుగేటుకు వెలుపల యుద్ధవాకాలు మ్రోగినయ్. ప్రజాసైనికులు యావచ్ఛక్తినీ వినియోగించి అగ్నివర్షాన్ని కురిపించారు. గోడలను రక్షిస్తూ నిలబడినసైనికులను ప్రజాసైనికులను ప్రజాసైనికుల చేతింబాంబులవర్షం ఎగరగొట్టేసింది. కీలుబొమ్మలు వూగిసలాడజొచ్చారు. కొద్ది నిమిషాలపాటు హోరాహోరీగా యుద్ధంజేశారు. అటుతర్వాత దక్షిణపుగేటు లొంగిపోయింది. అటుతర్వాత వేగంగా ఆ మార్గాన్నే తూర్పుగేటు ప్రజాసేనావాహిని నగరంలో ప్రవహించింది.

జపానువాళ్ళందరూ చాలావరకు ఒక స్కూల్లో వున్నారు. వాళ్ళందరినీ చుట్టుముట్టేశారు ప్రజాసైనికులు. అనేకమంది జపానుదేశీయులైన కామ్రేడ్స్ ప్రజాసైన్యంతో పనిచేయుటకు వప్పుకొని జపాను వ్యతిరేక సమితిలో జేరిన యోనెడాతోసహా అక్కడకు వచ్చారు. తమ దేశీయులకి తమ దేశభాషలో అరచి చెపుతూ, లొంగిపొండని హెచ్చరించారు. పదిహేను నిమిషాల లోపలనే స్కూలులోవున్న జపానువాళ్ల తెల్లజెండా ఎత్తారు.

రక్షణకట్టడాలకు గండ్లుపడగానే హో, జిల్లింగ్, కామెసాకాలు ముగ్గురూ కట్టగా బయలుదేరారు. వాళ్ళవెంట ఒక కీలుబొమ్మసైనికదళం టామీగన్లు పుచ్చుకొని బయలుదేరింది. వీళ్ళందరూ పడమటిగోడవైపుగా బయలుదేరారు. కాని పడమటిగేటునుండి వస్తూన్న మహాగ్నిజ్వాలలు, ఆకాశంలో సగభాగాన్ని వెలుగుతో ముంచెత్తివేస్తున్నాయి. అక్కడనుండి యీ దేశద్రోహులముఠా దారి మార్చుకుంది. ఉత్తరదిశగా పరుగెత్త

జొచ్చింది. ఉత్తరగేటువద్దకూడా వీరికి ప్రజాసైనికులు ఎదురయ్యారు. ఏమైనాసరే కొంత ప్రమాదాన్ని ఎదుర్కొంటేగానీ బయటపడటం అసంభవమని హో నిశ్చయించుకున్నాడు. కీలుబొమ్మలదళం టామీగన్లతో గుళ్ళవర్షాన్ని కురిపిస్తూవుంటే, వారి వెనుకగా హో ముఠా తెరచివున్న గేటు తలుపులద్వారా బయటికి పరుగెత్తింది. ప్రజాసైనికులు టామీగన్ల గుళ్ళవర్షానికి కొంచెం వెనక్కుతగ్గారు. ఆ దేశద్రోహులపై ప్రజాసైనికులు చేతిబాంబుల వర్షాన్ని కురిపించారు. చేతిబాంబులు బ్రద్దలవటంతో ఆ దెబ్బకు కీలుబొమ్మసైనికుల శరీరాలు తునాతునకలై గాలిలోకెగిరాయి. ఒక టామీగన్నరు తల సగం తెగిపోయింది. వాడు నేలకొరిగాడు. ఈ దెబ్బకు తట్టుకోలేక కీలుబొమ్మసైనికులు చెల్లాచెదరుగా పరుగెత్తారు.

ఒక్క టామీగన్నరుమాత్రం మిగిలాడు. హో వాడిని తన పిస్తోలుతో ముందుకు నెట్టాడు. "కాల్చరా! లేకపోతే చంపుతా!" అని అరచాడుహో. జిన్లంగ్, కామెసాకాలు బయటకు పరుగెత్తిపోయారు. అక్కడనుండి పడమటిదిక్కుగా పరుగెత్తిపోయి యేటికట్ట ఎక్కారు. వీళ్ళను పసిగట్టారు తేవార్, దాస్వేలు.

తేవార్, దాస్వేలు తమ సైనికులను తీసుకొని హో ముఠాను తరుమసాగారు. హో, వానిముఠా ఎంతోదూరం పోకముందే వారి కెదురుభాగంనుండి, యేటికట్టపై ఎవరో నిలబడి వీరిని "సవాల్"జేశారు. హోముఠా జవాబివ్వకపోయేసరికి ముఠాకు ముందుగా నడుస్తున్న టామీగన్నరును తుపాకిగుళ్ళు తెగనరికాయి. కామెసాకా కుడిభుజం ఒక్క తుపాకిగుండుతో ఎగిరిపోయింది. అతడు తన తుపాకిని క్రిందపారేశాడు. హో, కామెసాకాలు యేటికట్టపైనుండి క్రిందకు జారారు. పొలాలపైవుకి పరుగెత్తసాగారు. జిన్లంగ్ కాలికి గుండుదెబ్బ తగిలింది. కాని వాడు పళ్ళు నూరుతూ వారివెనుక కుంటికాలిని ఎగరేసుకొంటూ నడువసాగాడు.

పూర్ణచంద్రోదయమైంది. హోముఠాను వెంబడిస్తున్న ప్రజాసైనికులకు పూర్ణచంద్రుడు తన వెన్నెలద్వారా సహాయభూతమయ్యాడు. కుంటుతూ నడుస్తున్న జిన్లంగ్‌ను ప్రజాసైనికులు క్రమేణా చుట్టేసారు.

జిన్లంగ్ శరీరాన్ని తూటాలతో నింపేశారు ప్రజాసైనికులు. ఆ దేశ ద్రోహి నేలకొరిగాడు.

హోగారి నెత్తిమీద టోపీ ఎగిరిపోయింది. ఒక కాలిచెప్పుకూడా ఎక్కడో పడిపోయింది. కామెసాకా తన ఖడ్గాన్ని బయటికి లాగాలని యత్నించసాగాడు. కాని వాడు పరుగెత్తుతూ ఆ పని చేయలేకపోయాడు. ఆగుదామంటే ప్రాణభీతి. ఈ ద్రోహులముటా ఎత్తుగా పెరిగిన కోయిలాంగ్ పంటపొలాలలోనికిపోయి దాక్కోవాలని యత్నిస్తూవుంది. కాని అక్కడకు జేరలేకపోయింది. ఎందువలనంటే పరుగెత్తి బాగా అలసిపోయారు. అందుకని అక్కడేవున్న చిక్కుపొదలలో దూలబడ్డారు. అటునుంచి ద్రాక్షపొదలలో దూరబడ్డారు. ఒక నిమిషమైన తర్వాత అక్కడకే వచ్చిపడ్డారు ప్రజాసైనికులు. నలుమూలలకు కమ్మి, సోదాచేయవలసిందిగా దాస్వే ప్రజాసైనికులను ఆదేశించాడు.

దాస్వే తనవద్దకురావటం చూసి హో తొందరగా పిస్తోలుతో కాల్చాడు. ఆ గుండు గురితప్పి దాస్వేప్రక్కగా బజ్‌మంటూపోయి తేవార్ పొట్టలో దూరింది. తేవార్ తూలిపోయాడు. తూలిపోతున్న తేవార్ పడిపోకుండా పట్టుకోటానికి దాస్వే అతనివద్దకు పరుగెత్తికెళ్లాడు. తేవార్ పొట్టప్రేవులలో గాయమయింది. ఆ గాయంనుండి రక్తంజోరుగా ప్రవహించసాగింది. రక్తచందనంలాగున్న తేవార్ తన కామ్రేడ్‌వంక జూశాడు.

"నాకోసం బెంగపడతావెందుకోయ్! శత్రువులను హతమార్చు!" అని అరచాడు తేవార్.

మరొక తుపాకిగుండు దాస్వే తలప్రక్కగా బజ్‌మని ధ్వనిజేసుకొంటూపోయింది. ఆ ధ్వనివచ్చిన దిక్కుగా దాస్వే తన పిస్టల్‌తో కాల్చాడు. ఆ దెబ్బతో హోగారి పిస్తోలు తునాతునకలైంది. ఆ దేశద్రోహి యిప్పుడు నిరాయుధుడన్న విషయాన్ని గమనించిన దాస్వే వాణ్ణి సజీవంగా పట్టుకోవటానికి పరుగెత్తాడు. కామెసాకా కనపడకుండా దాస్వే కాళ్ళకింద దూరి అతణ్ణి కాలుపట్టుకొని లాగాడు తన ఖడ్గాన్ని ఎడమచేతితో బయటకులాగి దాస్వే కాలిలో జోరుగా గుచ్చాడు. దాస్వే పడిపో

గానే కామెసాకా మెరుపులాగా తనకత్తిని పైకెత్తి దాస్వేతలమీద కొట్టాడు. చివాలున లేచి దాస్వే ఆ జపానువాడిమీద దుమికాడు. వాని చేతులనుండి ఖడ్గాన్ని గుంజుకొన్నాడు దాస్వే. ఉన్మత్తునిలాగా కామెసాకాను ఆ ఖడంతో పనసకాయను కొట్టినట్లు నరికాడు.

ఇతర ప్రజాసైనికులు హోను కనిపెట్టేశారు. తమ తుపాకిగుళ్ళ స్నానంతో ఆ దేశద్రోహి జీవితాన్ని తుదముట్టించారు. బలహీనంగా తూలిపోతున్న దాస్వేను పడకుండా పట్టుకోటానికి ప్రజాసైనికులు పరుగెత్తారు. అతని ముఖమంతా నెత్తురుమయమైంది.

అన్నిదిక్కులనుండి మహాజీమూతాలులాగున రైతాంగ ప్రజావాహిని ఆ రంగాన్ని కమ్మేసింది. ఆ రైతాంగప్రజలు హో, కామెసాకాల శరీరాలను గుర్తించారు. తుపాకీమడమలతోనూ, చాకులతోనూ, బాకులతోనూ, పికాసులతోనూ వచ్చిన ఆ రైతాంగప్రజలు అరుస్తూ, తిడుతూ ఆ రెండు శరీరాలను పచ్చడిపచ్చడి కింద కొట్టేశారు.

దాస్వేకి తెలివివచ్చేసరికి, అతడు నగరంలోని ఒక యింటిగదిలో వున్నాడు. అతని నుదుటిమీద మూడంగుళాల వెడల్పు గాయమైంది. డాక్టర్ ఆ గాయానికి కట్టుకడుతూవుంటే, నిశ్శబ్దంగా, ఆదుర్దాతో ప్రజాసైనికులు, రైతులూ అతణ్ని చూస్తున్నారు. డాక్టర్ గాయానికిని కట్టు కట్టటం పూర్తిజేసేసరికి, మేయీని, పిల్లవాణ్ని వెంటబెట్టుకొచ్చింది నియూరీ.

ఆమెను కాల్చి చంపివేయవలసిందిగా కొంతమంది కీలుబొమ్మ సైనికులకు హో ఆజ్ఞాపించాడు గదా! ఆ కీలుబొమ్మలు ఆమెను తమ వెంట తీసికొనిపోయి, ఒకపెద్ద దేవాలయం ఆవరణలోనికి జేర్చారు. పైకి మూడుసార్లు తుపాకి కాల్చారు. అటుతర్వాత వారు ఆమెను బాలూ సైనికులు వచ్చేవరకూ దాచి కాపాడారు. బాలూసైనికులను వారు కలుసుకోగానే ఆమెను సురక్షితంగా వప్పగించారు.

మేయీముఖం తెల్లగా పాలిపోయింది. కుడిచేతిలో కర్రను వూతంగాచేసుకొని, ఎడమచేతిని నియూరీ మెడచుట్టూ వేసి, మెల్లగా

అమితకష్టంతో నడుస్తూ వచ్చింది. దాస్వేవద్ద పోవుటకు అక్కడున్న కామ్రేడ్స్ ఆమెకు త్వరగా దారియిచ్చారు.

ఆమె దాస్వేను చూడగానే సంతోషంతో వుప్పొంగింది. ఆమె కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. "దాస్వే!" అని మేయీ వెక్కివెక్కి ఏడ్వసాగింది. "మనం యీ జీవితంలో....మళ్ళీ కలుసుకుంటామని అనుకోలేదు!" అని ఏడ్వసాగింది.

కూర్చుందామని దాస్వే పెనగులాడాడు. అతని ముఖంలో సగం కట్టుతోనే నిండిపోయింది. ఒక్క కన్నుతో ఆమెపంక రెప్పార్పకుండా చూడసాగాడు. అతనికంఠం బిగుసుకొనిపోయి యుంది. ఒక్క మాట్లాడలేకపోయాడు. కాని. అతని హృదయం సంతోషంతో తాండవించింది. విజయమందహాసం అతని పెదవులమీద నాట్యమాడింది.

ఆమెచేతిని తన చేతిలోనికి తీసుకొంటూ దాస్వే. "మేయీ!" అని నవ్వాడు. "మనం ఆ సొంతం చూశాం. విజయాన్ని సాధించాం!" అన్నాడు.

మేయీ కళ్ళుతుడుచుకొంది. "మనం యీ విజయాన్ని మన రక్తాన్ని తర్పించి. సాధించాం. అని హ్లాకీత్స్ చెప్పిందే యధార్థం! నేనిప్పుడే తేవార్‌ను చూశాను....అయ్యో! ఎంతమందిని బలిపెట్టామోయి"

"తేవార్ గౌరవప్రదమైన చావు చచ్చాడు!" ఉద్వేగపూరిత కంఠంతో దాస్వే జవాబిచ్చాడు. "అతడు చనిపోయేముందు శత్రువులను హతమార్చండి!" అని చెప్పాడు. అతని మాటలను మనం బాగా జ్ఞాపకముంచుకోవాలి! మనం "ప్రతిఘటన యుద్ధాన్ని" జయించాం! కాని ఇంకా అభివృద్ధినిరోధకులు మిగిలివున్నారు. వాళ్ళను పూర్తిగా కూలద్రోచేవరకూ మనపని పూర్తి అయినట్టుకాదు!"

వాళ్ళనుకూడా త్వరలో తుడిచిపెట్టేస్తాం!" అన్నది మేయీ. "ఇన్నేళ్ళుగా కఠినమయిన పోరాటజీవితాన్ని అనుభవించాంకదా! యిక మనం భయపడాల్సిన విషయమే లేదు!"

"చైర్మన్ మావ్ నాయకత్వాన మనం జపానువాళ్ళను ఓడించాం! అండదండనే నడిచి ప్రతివిజయాన్ని సాధిస్తాం!" అని అరిచింది నిమూరీ.

వణుకుతున్న చేతులను ముందుకుచాచి దాస్వే తన బిడ్డను చేతుల లోనికి తీసుకున్నాడు. అతి ఆప్యాయంగా ఆ పిల్లవాణ్ణి ముద్దుపెట్టు కొన్నాడు. "కాస్త బాధపడితే మాత్రమేం!" అని చిరునవ్వు నవ్వాడు. "విప్లవం విజయవంతమవగానే మనపిల్లలు సుఖమయ జీవితాన్ని గడుపగలుతారు!" అన్నాడు.

నవ్వుతూ ప్లాకీత్సే ప్రవేశించాడు. అతడు తనచేతిని హుషారుగా ఊపుతూ "మంచి వార్తలోయ్! మంచివార్తలు!" అని అరచాడు. "మనం ప్రతిరంగంలోనూ విజయాన్ని సాధించాం! రాష్ట్రంలోవున్న పదమూడు నగరాలూ మన హస్తగతమయినాయి!" అన్నాడు.

అతడు తెచ్చిన వార్తలను విన్నవారంతా కేరింతాలుకొట్టారు. కర తాళధ్వనులు చేశారు. వీధిలో టపాకాయలు. మతాబులు-దీపావళిలాగు న్నది. నినాదాలు అంతకంతకు దగ్గరగా వినవస్తున్నాయి.

"రైతులు విజయోత్సవాన్ని జరుపుతున్నారు!" అని అరచింది వియూరీ "పోదాపదం! ఊరేగింపులో కలుద్దాం!" అన్నది.

ఆమె ఒకగదిలోనుండి మరియొక గదిలోనికి పరుగెత్తింది. నవ్వుతూ, గంతులువేస్తూ, ఆమెవెంట కుర్రవాళ్ళందరూ వూరేగింపుగా బయదేరారు....

నగరంలోని యుద్ధకట్టడాలపై తెల్లవారేసరికి వేగంగా ఎర్రజెండా ఎగురుతోంది.



456

KODUKULU - KUTULLU Rs. 10/-

ఈ పుస్తకం ;

చియాంగ్-కై-షేక్ ప్రభుత్వం అసమర్థతకూ లంచ గొండితనానికీ ఆలవాలమైపోగా 1937లో ఉత్తర చైనాపై జపాను సామ్రాజ్యవాదులు ముట్టడించారు. ప్రజలను వారి భవితవ్యానికి వదలివేసి చియాంగ్-కై-షేక్ సైన్యాలు పలాయనం చిత్తగించాయి.

కొమింటాంగ్ సేనలు తమను నిర్దాక్షిణ్యంగా వదలి పారిపోయినందుకుగాని, జపాను దండయాత్రకుగాని చైనా ప్రజలు భీతిచెంది ధైర్యం విడునలేదు. వారి ఆత్మశక్తి సడలలేదు. ఆత్మస్థైర్యంతో చైనా దేశపు కొడుకులూ-కూతుళ్ళూ నడుంకట్టి తమ మాతృదేశరక్షణకు అకుంఠిత దీక్షతో సాగించిన సమర చరిత్ర చిత్రీకరణయే ఈ నవలలో ప్రతిబింబిస్తుంది. సతీ సమేతంగా ఈ సాహస విప్లవ పోరాటంలో పాత్ర వహించిన ఒక యోధుడే దీని రచయిత.

ఇంకా మీకు తప్పక చదవ వలసిన పుస్తకాలు ;

| | | | | |
|---|---|---|---|---|
| విప్లవయుగం | — | గద్దె లింగయ్య | — | 7-50 |
| విప్లవ వీరులు | — | ,, | — | 5-00 |
| అమ్మ | — | మాక్సింగోర్కీ | — | 5-00 |
| నేనూ-నాదేశం | — | దరిశి చెంచయ్య | — | 12-00 |

ఆదర్శ గ్రంథ మండలి - విజయవాడ-2

Check List

| | | | |
|---|---|---|---|
| **Book Number** | PS01 C882 | **Date** | 27/9/22 |
| **Front Cover** | yes | **Back Cover** | yes |
| **Blank Pages** | | | |
| | ii, D, 457 | | |
| | | | |
| | | | |
| **Missing Pages** | | | |
| | ~~130~~ 401 to 408 | | |
| | | | |
| | | | |
| **Prepared By** | Sruthi | **Cutting By** | Sruthi |
| **Scanned By** | Prathyu | **Pages** | 457 |